# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

★

శ్లో॥ దృష్ట్వా సీతాం పరామృష్టాం ।
దీనాం దివ్యేన చక్షుషా ।
"కృతం కార్యమ్" ఇతి శ్రీమాన్ ।
వ్యాజహార పితామహః ॥

తా. దీన, సీత, పరామృష్ట దివ్యదృష్టిఁ గని పితామహుఁడు తన "కృతం కార్య" మనుచు॥

—అరణ్యకాండ : 52 స. 12 వ శ్లోకం.

★

గ్రంథకర్త :
మానికొండ సత్యనారాయణశాస్త్రి, B. A., B. L.

—ఫోస్టేజిగాక : వెల
రు 4/-

1960
గుంటూరు

# శ్రీ గ్రంథకర్తృ నివేదన

ఎట్టకేలకు పన్నెండుసంవత్సరములు ఈ అరణ్యకాండవ్రాతప్రతి అముద్రితముగ పడియుండి శ్రీరామకృపచే, నేటి కిది అచ్చునబడి ప్రజలముఖము జూడ గలిగినందుకు ఆనందించుచున్నాను. దీని రచన 9-10-1946 న మా స్వగ్రామమగు ఉరుటూరున ప్రారంభమై, తొమ్మిదిమాసముల పైకాలము ఏకదీక్షగ నడచి 19-7-1947 తేదీన ముగిసినది.

ధనాభావముచే దీని ముద్రణ ఇంతకాలమున్న సాగలేదు. అప్పుడప్పుడు ఎట్లో బాల, అయోధ్య, సుందరకాండల ముద్రింపగలిగినను, మిగతా కాండల ముద్రణ నా జీవితకాలములో జరుగునది కాదని జంకితిని. దానికితోడు గతసంవత్సరం నేను వ్యాధిగ్రస్తుడనై దాదాపు మంచముపట్టినప్పుడు ఇక, దీనిని ముద్రించు ఆశయే నిరాశయయ్యెను. కాని, భగవల్లీలలు విచిత్రమనుటకు తార్కాణముగ నేను ఆరోగ్యమును కోల్కొనుటయు, గ్రంథముద్రణకు ధనసేకరణ సేయగలుగుటయు జరిగినది. ఇందుకు మా (కౌండిన్య) సగోత్రీకుడు మా సన్నిహితబంధువు చిరంజీవుడు నైన కొమ్మరాజు-వేంకట లక్ష్మీనరసింహం సాహసించి నాకు—(నిర్ధనుడనగునాకు) ద్రవ్యమును, ఋణముగానే కానిండు, ఇచ్చి ఈ గ్రంథముద్రణను కిష్కింధకాండసహా నేటికి సాధ్యముచేసినందుకు వానికి నేను ఎంతో కృతజ్ఞుడనై ఋణపడియున్నాను.

మా వంశములో ఈకీర్తి వానికి దక్కినందుకు వాని జన్మము ధన్యమైనది. వానికి, వాని కుటుంబమునకు, శ్రీరామచంద్రమూర్తి సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యము లిచ్చి సదా కాపాడుచుండుగాక యని నేను పరమేశ్వరునకు కేలు మోడ్చుట దక్క ఏమిసేయగలను? ద్రవ్యరూప మగు ఋణము నేను జీవించి యున్నను, గతించినను, తీర్మానమగుటకు తగు ఏర్పాటుచేసియే యుంటినికాక; అదేమిలెక్క? ఆతడొనర్చిన అమూర్తమగు ఉపకారఋణము నేను ఆశీర్వదించుట ద్వారాదక్క, మరియు, శ్రీరామకటాక్షమునదక్క అన్యత్రతీరునది కాదు-

ఇక నా రచనాక్రమమునుగూర్చి, లోగడకాండల ప్రచురణసందర్భము లలో నేను వ్రాసియుండిన ఉపోద్ఘాతములోని యంశములకు మించి, నే నిప్పు డిచ్చట వ్రాయవలసిన దేమియు కన్పట్టదు- ఈ రచనయందు కన్పించు ఛందో వ్యాకరణలక్షణాది నియమోల్లంఘనములు నేను బుద్ధిపూర్వకముగ స్వతంత్రించి చేసినవేతప్ప, ఇతరములుకావని మాత్రం మనవి చేయుచు, ఇక, సుధీపండిత మండలినుండి సెలవుతీసికొనుచున్నాను.

# అరణ్యకాండ విశిష్ఠత- ఆరణ్యకాండ మోక్షప్రదము

శ్రీ మద్వాల్మీకిరామాయణము షట్కాండలలో మూడవదియగు అరణ్యకాండ మోక్షప్రదమని ప్రతీతి. ఈభూమిమీదికి భగవంతుడు నరరూపమున శ్రీరాముడై యవతరించుననియు, ఆమహానుభావునివల్ల తమకు శాపవిముక్తియు, మోక్షప్రాప్తియు కలుగవలసియున్నదనియు అనేకమంది లోగడయుగములలో శాపగ్రస్తులై రాక్షసులై పడియున్న యక్షకిన్నరగంధర్వాది దేవవర్గీయులేకాక, భగవంతుని సంపూర్ణావతారమగు శ్రీరామావతారమును కన్నులపండువుగాచూచి, తాము తరించి మరీ స్వర్గమునకు పోదామనిఅనేకమంది సత్పురుషులు, ఋషీశ్వరులు సహా ఈరామావతారమునకై దండకారణ్యములో అనేక వేలసంవత్సరములుగ కనిపెట్టుకొనియున్నారు. కైక రామునిపట్టాభిషేకమును పడగొట్టి అరణ్యానికి అన్యాయముగ పంపించిందన్న అపకీర్తిఆమెపై లోకములో సాధారణముగవ్యాపించియున్నదే కాని, నిజానికి ఆమెచేసినపని తుదిపరిణామములో కీర్తింపదగినదిగానే యున్నది. అట్లుకాక, శ్రీరామునే కైక ప్రథమములోనే పట్టాభిషేకం కట్టుకోనిచ్చియుండి యుంటే, రామావతారంకోసం దండకారణ్యములో కనిపెట్టుకొనియున్న ఇంత మంది శాపగ్రస్తులకు, మహర్షులకు, సత్పురుషులకు మోక్ష మెట్లు లభించెడిది? వీరందరిగతి ఏమికావాలి? వీరందరిమాట అటుండగ, అసలు రావణ కుంభకర్ణాదులకు (అనగ, శాపగ్రస్తులై భూమిమీదికిపడిన విష్ణుద్వారపాలకులగు జయ విజయులకు) మోక్ష మెలా కలిగేది? వారు తిరిగి విష్ణుసాన్నిధ్యమున నెట్లు నిలువగలిగే వారు? రాముని అరణ్యవాసమే లేకపోతే, పాప మా జయవిజయులగతి శాశ్వతంగా అధోగతిగానే ఉండేదికద! కైక ఈరీతిగా తనమీదికి అపకీర్తిని తెచ్చుకొని, ఇంత మందికి మోక్షప్రాప్తికలిగించింది. నిజంగా త్యాగమంటే ఆమెదే? విరాధుడు మొదలగు ఒక్కొక్క రాక్షసుడే వచ్చి, సీతను ఎత్తుకొనిపోయినప్పుడో, రామలక్ష్మణుల మోసగించి, కష్టములపాల్జేసినప్పుడో, శ్రీరాముడు "హా! కైక ఇప్పుడు కదా సకామయైనది" అని నిట్టూర్పుపుచ్చుచుండినదాని అంతరార్థము ఇదే. అనగా, ఈరాక్షసులను తనచే (రామునిచే) చంపించి, వారి కీ రాక్షసత్వమునుండి విమోచనగలిగించి, వారికి సద్గతులు కలిగించుటయే పరమసంకల్పముగనుండిన కైక కోర్కె ఇప్పుడు కదా నెరవేరినది" నే అంతరార్థము ఈ మాటలలో గర్భితమై యున్నది.

శ్రీరాముని అరణ్యవాసానికి సీతాపహరణానికి దేవతలు "ప్రహృష్టులు, వ్యథితులు" కూడ నైనారట. అనగ, వారికి సంతోషము, దుఃఖముకూడ కలిగినదట. సీతహరింపబడుటనుచూచి, బ్రహ్మ ఏమన్నాడు- "కృతం కార్యం" అన్నాడు!

అనగ (రావణసంహారమునకు కావలసినపని అయింది) అన్నమాట. రాముని అరణ్యవాసమే లేకుంటే, రావణసంహారమే లేదు; జయ విజయులకు మోక్షప్రాప్తియే లేదు. ఇందుకు కాకపోతే, రామావతారప్రయోజనమే లేదు.

ఈ సందర్భంలో రావణుని దుష్టచేష్టలుకూడ రావణుని నిజహృదయమును వ్యక్తపరుచునవిగ కనబడుచున్నవి. తనకు ఎలాగైనాసరే త్వరలో విష్ణుసాయుజ్యం సంపాదించుకోవాలనే తహతహయే ఇందు వ్యక్తమగుచున్నది. ఇందుకు రావణ కుంభకర్ణుల పూర్వజన్మవృత్తాంతం కొంత తెలుసుకుంటేకాని ఈ విచిత్రసమస్య బోధపడదు. వీరుభయులు పూర్వజన్మయందు వైకుంఠములో విష్ణుదేవుని ద్వారపాలకులుగ ఉండిన జయవిజయులను మహావిష్ణుభక్తులు. ఒకనాడు, ఏ మహర్షియో విష్ణుదర్శనమునకు రాగా, "ఇప్పుడు వీలులేదు? స్వామివారు కేళీవిలాసంలో ఉన్నారు" అని వీరు ఏదో అడ్డగించినారట. అంతట ఆ ఋషికి కోపంవచ్చి 'మీరు భూలోకంలో రాక్షసులై పడిపోవుదురు గాక, మీకు విష్ణుసాన్నిధ్యం లేకపోవుగాక' అని శాపం పెట్టెనట. వారు ఈ శాపమునకు భయపడి శాపావసానం చెప్పుమని వేడుకొనిరట. "విష్ణుసాయుజ్యం తిరిగి పొందడానికి మీకు రెండు మార్గాలున్నవి: ఒకటి వైరం ద్వారా, రెండవది భక్తిద్వారా. భక్తిద్వారా అయితే చాలాకాలం పట్టుతుంది; వైరంద్వారానైతే త్వరలో మూడు జన్మలలోనే మీకు మోక్షం లభిస్తుంది. మీరు ఏది కోరుకుంటారు? అని ఆ ఋషి అడుగగ, త్వరలో మమ్ముల నిచ్చటికి రప్పించే వైరమార్గమే మాకు కావాలన్నారట. ఆ ప్రకారమే ఆ ఋషి అనుగ్రహించగ, జయ విజయులు భూలోకంలో కృతయుగంలో హిరణ్యాక్షహిరణ్యకశ్యపులుగాను, త్రేతాయుగంలో రావణకుంభకర్ణులుగాను, ద్వాపరయుగంలో శిశుపాల దంతవక్త్రులుగాను, జన్మించి, విష్ణువునందు వైరముపూని, మోక్షప్రాప్తి నొందిరని వీరి చరిత్రల పూర్వరంగం చెప్పుచున్నది.

ఈ శాపమువల్ల ప్రాప్తించిన ఈ రాక్షసరూపం, ఈ రాక్షసప్రకృతి ఎప్పుడు వదిలిపోయి, తాను తిరిగి విష్ణుపార్శ్వమున వైకుంఠములో ఎప్పుడు నిలువగలనా యనే తహతహమే రావణాసురుని ప్రతి దుష్టచర్యయందు కనిపించు చున్నది. ఇదియే ఆతని విష్ణుమూర్తితోడి వైర క్రియలలోను, విష్ణుభక్తులగు ఋష్యాదులను హింసించి, వారి యజ్ఞయాగాదులను ధ్వంసము చేయుటలోను, స్త్రీలను ఎత్తుకువచ్చుటలోను వ్యక్తమగుచున్నది. రావణాసురుని బాహ్య దుష్ట క్రియల కన్నింటికి గల ఆతని అంతర్హృదయమును శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు తాము వ్రాసిన "పౌలస్త్యహృదయము" అనే అపూర్వ రసవత్తర గ్రంథములో అత్యద్భుతముగ ప్రతిబింబింపజేసిరి. ఈ అరణ్యకాండపఠన సందర్భంలో పాఠకులు 'పౌలస్త్యహృదయం' అనే గ్రంథంకూడ పఠింపవలెనని మనవిచేయుచున్నాను.

సీతాపహరణవార్తను జటాయువునుండి తెలిసికొను సందర్భంలో శ్రీరాముడు వేదనతో జటాయువుతో ఒకమాట అన్నాడు? (68వ సర్గ 5వ శ్లోకం): "రావణుడు నాభార్యను ఎందుకు ఎత్తుకు పోయినాడు? నా భార్యను అతను ఎత్తుకుపోయేటంత అపకారం నేను అతనికి ఏమిచేశాను" అని విలపిస్తూ అడిగినాడు.

దీనికి జవాబు కాటూరివారు తమ "పౌలస్త్యహృదయం"లో స్పష్టపరిచారు. దానికి కారణం వారు రావణుని చేతనే చెప్పించారు: "భోగార్థం కాదు; నేనంతపసువునా? భగవంతునికి నామీద కోపం తెప్పించుకొని, ఆయనచే సంహరింపబడి, ఈ దిక్కుమాలిన ఈ రాక్షసత్వం, శాపప్రాప్తమైన ఈ రాక్షసత్వం, సత్వరముగా పోగొట్టుకొని, తిరిగి ఆ భగవంతుని సాన్నిధ్యంలో త్వరగా చేరాలనే తహతహచేత నేనెన్నో భగవదపచారములను చేసిచేసి విసిగిపోయాను. ఎన్ని చేసినా, ఎంతమంది విష్ణుభక్తులను హింసించినా. ఎన్ని యజ్ఞాలు ధ్వంసంచేసినా, ఎంతమంది స్త్రీలను ఎత్తుకువచ్చినా. ఆయనకు నామీద కోపమే రాకపోయె! నన్నెట్లా చచ్చేది? ఇక ఇదిపనికాదు అని తెగించి, ఆఖరు ఎత్తుగా నా తల్లి అని యైనా జంకక ఆయన భార్యనే ఎత్తుకువచ్చాను. అప్పటికైనా ఆయనకు నామీద కోపం రేగకపోతుందా అని. పెళ్ళాన్ని ఎత్తుకువస్తే ఇక, ఆయనకు కోపము రాకేమి చేస్తుంది?" సరిగ్గా ఇది రావణుని హృదయం. తానింతకాలం ఇన్ని దుష్టచేష్టలు చేస్తున్నా భగవంతుడు తనమీద వైరంపూని రాకుండా కూర్చుని, తనకు ఈ రాక్షసత్వమునుండి విముక్తి కలిగించక ఉపేక్షించడమే భగవంతుడు తనకు (రావణునకు) చేసిన అపకారం! రాముడు జటాయువునకు వేసిన ప్రశ్నకిదే సమాధానం తుదకు సీతను ఎత్తుకువస్తేతప్ప భగవంతుడు తనకు ఇంతకాలంనుంచి చేస్తున్న ఉపేక్ష అనే అపకారం తీరదని రావణుడు తుదకీపని చేసెను.

రాముడు సముద్రందాటి లంకమీదికి వస్తున్నాడని సముద్రుడు పోయి కంగారుగా రావణాసురునితో చెప్పగా, రావణుడు అపరిమితానందమునుపొంది, "భలే ఇన్నాళ్ళకా? తండ్రి విష్ణుమూర్తికి నామీద దయగలిగింది!! భలే! రానీ! ఆయనకు యుద్ధాతిథ్యమిచ్చి, ఆయనచే చచ్చి, ఈపాడు శాపగ్రస్త రాక్షసత్వాన్ని పోగొట్టుకొని, తిరిగి ఆ నా తండ్రి సాన్నిధ్యంలో చేరుకుంటాను" అని ఆనందంతో రావణుడు గంతులేస్తాడు.

రావణుడు సీతను కామప్రవృత్తితో కాక, కేవలం తల్లిగ, జగజ్జనిగ భావించి, సేవించుటకే ఎత్తుకొని వచ్చినట్లు, రావణునకు సీతకు జరిగిన సంభాషణల తాలూకు వాక్యములకన్నింటికీ వ్యాఖ్యాతలు అంతరార్థములను సూచించిరి. ఒక్కొక్క శ్లోకమునకు, ఒక్కొక్క వాక్యమునకు వ్యాఖ్యాతలు తీసిన అంతరార్థములు బహు పాండిత్యద్యోతకముగాను, బహుగహనముగాను, బహుఆశ్చర్యముగాను కన్పట్టగలవు.

రావణుడు సీతను పట్టుకొనెనని చెప్పే 49 సర్గ, 17వ శ్లోకంలో, "రోహిణిని బుధుడు పట్టుకున్నట్లుగ" "బుధః ఖే రోహిణీ" మివ పట్టుకొనెనని వాల్మీకి ఉపమించినాడు. ఈ ఉపమానములోని అంతరార్థమేమి? రోహిణి చంద్రునిభార్య; బుధుడు చంద్రునికుమారుడు. కనుక, రోహిణి బుధునకు తల్లివరుస. అనగ, తల్లిని పట్టుకున్నాడని అర్థమేర్పడుచున్నది. అనగ, రావణుడు సీతను కామదృష్టితో కాక, తల్లిగా సేవింపదలచి పట్టుకొని తీసికొనిపోయినాడని అంతరార్థము.

కనుక, రావణుని విషయంలోకూడ అరణ్యకాండలోజరిగిన సీతాపహరణ ఘట్టము మోక్షప్రదమే.

అరణ్యకాండ మొదటినుండి సమీక్షచేసిచూస్తే ప్రప్రథమముగా రాముని వల్ల మోక్షంపొందినవాడు "విరాధుడ"నే రాక్షసరూపంలోఉన్న ఒకానొకతుంబురుడు. తదుపరి, ఖరదూషణాది పదునాల్గువేలరాక్షసులకు ఒక్కుమ్మడిగ విముక్తి (mass deliverence) లభించింది. తదుపరి, మారీచుడు రావణుని చేతిలో చావడంకంటె తాను రాముని చేతిలోనే చచ్చి "కృతార్థుడ"నవుతానని చెప్పి, కోరి వచ్చి, రామునిచే సంహారంపొంది, మోక్షమునకు పోయెను.

అరణ్యకాండ చివరి సర్గలలో అయోముఖి, కబంధుడు అను రాక్షసులుకూడ శాపలబ్ధమైన తమ రాక్షసత్వమునకు స్వస్తిచెప్పుకొని మోక్షమునకువెళ్ళిపోయినారు.

ఇట్లు రామునిచే హతులైన రాక్షసులందరు తమ పూర్వదివ్యజ్ఞానస్మృతి నొందగలిగి, శ్రీరామునియెడ కృతజ్ఞులై ఆతని కీర్తించుచు స్వర్గమున కేగినారేకాని, ఎవరూ తిట్టుతూ చావలేదు. మరికొందరు, తమ కృతజ్ఞతాసూచముగ, సీతను వెదకుటలో శ్రీరామునకు మంచిమంచి సలహాలిచ్చికూడా పోయినారు. సుగ్రీవునితో సఖ్యముచేసుకోవలసినదని మంచి సలహా చెప్పినవాడు కబంధుడను రాక్షసుడే.

ఇక, ఋషీశ్వరులయు సత్పురుషులయు జాబితాలోచేరి మోక్షము నొందినవారిలో శరభంగమహర్షి మనకు అరణ్యకాండలో మొదటగ తగులుతాడు. ఇతనికి స్వచ్ఛందమరణ శక్తిగలదు. "అయినా శ్రీరామావతారంవస్తుంది; అప్పుడు శ్రీరాముడు అరణ్యానికి వస్తాడు. ఆ అవతారరూపాన్ని "పుంసాం మోహానరూపాయ" అన్నట్లు పురుషులనుకూడ మోహింపజేసే ఆ శ్రీరామ

మూర్తిని కండ్లారాచూచి, ఆనందించి మరీ స్వర్గానికి పోదాము. తొందరేమి'' అన్నట్లు ఆ ఋషి ఎన్నియోవేల సంవత్సరాలనుండి కనిపెట్టుకొనియుండి, శ్రీరాముని దర్శనం చేసుకొని, ధన్యుడనైనానని సంతోషించి, పిమ్మటనే చితిపేర్చుకొని స్వయంగా దానిలో ప్రవేశించి, దగ్ధుడై మోక్షమునకు పోయెను. ఇతని నిర్యాణం అత్యద్భుతం, అపూర్వం.

ఇక, అరణ్యవాసావసానమందు శ్రీరాముని దర్శించి ధన్యమైనది శబరి. ఈమె కడువృద్ధురాలయ్యు, శరభంగునివలె శ్రీరామదర్శనంకోసం యెంతకాలం నుండియో కనిపెట్టుకొనియుండి, స్వర్గమునకు పోకుండా దండకారణ్యమందే తన చిన్న కుటీరములో నివసిస్తున్నది. శ్రీరాముడే సీతను వెదకుకుంటూ తన గుడిసె వద్దకు రాగా, ఆయనకు ఆతిథ్యమిచ్చి, మంచిమంచి ఏర్పరచియుంచిన ఫలాదుల నిచ్చి పూజించి ధన్యురాలై స్వర్గమునకు పోయెను.

వీరందరికంటె ధన్యుడై శ్రీరామునిచే సంస్కృతిపొంది మోక్షము నొందిన వాడు జటాయువు. రావణాసురుడు సీత నెత్తుకుపోతూ ఉంటె, ఆతని నెదిరించుటకు పంచభూతములుసహా గడగడవణకి భయపడిచూస్తూ ఊరుకున్న సమయంలో, జటాయువుకూడ "నాకేమని" తానును ఊరుకొనక, వృద్ధుడయ్యు తన కండ్లయెదుట జరుగుచున్న అన్యాయమును ప్రతిఘటించుటకై కేవలం ధర్మమతితో, నిస్స్వార్థ బుద్ధితో మహాబలవంతుడైన రావణాసురు నెదిర్చి నిలవరించి, ప్రాణముండువనుక పోరాడి, కదలనీయక, తుదకు రావణునిచే హతుడై నేలకూలెను. ఈతని త్యాగం అపూర్వం. నభూతో నభవిష్యతి. దీనికి శ్రీరాముడుకూడ చకితుడై, అద్భుతాశ్చర్యానందకృతజ్ఞతావశుడై తన తండ్రికికూడ చేయనోచుకొనని దహన సంస్కారమును ఈ జటాయువునకు తనచేతిమీదుగ చేసి, అతనికి తన తండ్రికివలెనే పిండోదకములిచ్చి, స్వయముగ మోక్షమునిచ్చెను. "యజ్ఞయాగాదికృతులు చేసిన మహాత్ములకు, రణరంగమున నీల్గిన యోధులకు కలుగు అత్యుత్తమ పుణ్యలోకములు నీకు యిస్తున్నాను; గృధ్రరాజ! మహాబలాఢ్య! పో," అని చెప్పి, శ్రీరాముడే తాను నరజన్మలోనున్నాననే మాటకూడా కించిత్తు పరవశత్వమున మరచిపోయి కేవలం ఆ పరమేశ్వరుడు మాట్లాడినట్లే మాట్లాడి జటాయువునకు మోక్షము నిచ్చెను. ఈ సందర్భంలో రామునినోట వాల్మీకి మహర్షి పలికించిన పలుకులు వజ్రపు తునకలు, వినండి..

ఉ॥ ఏగతి యజ్ఞశీలురకు నేగతి భూమినొసంగువారికిన్
ఏగతి ఆహితాగ్నులకు నేగతి తత్పునరాగమంబు లే
కేగెడువారికిఁ గలుగు గృధ్రవిభుండ! మహాబలాఢ్య! నీ
వేగుము తద్గతిన్ సుఖుఁడ ! ఇత్తు ననుజ్ఞ ననుత్తమంబులౌ
తే:గప లోకముల్ వడి మదీయకరంబున జెంది సంస్కృతిఁ.

శ్లో॥ యాగతి ర్యజ్ఞశీలానాం, । ఆహితాగ్నేశ్చ యా గతిః
అపరావర్తినాం యా చ । యా చ భూమిప్రదాయినాం
మయా త్వం సమనుజ్ఞాతో । గచ్ఛ లోకాన్ అనుత్తమాన్
గృధ్రరాజ ! మహాసత్త్వ । సంస్కృతశ్చ మయా వ్రజ.

68 వ, సర్గ : 30 వ శ్లోకం.

అరణ్యకాండ మోక్షప్రదమనుటకు ఈ ఒక్క శ్లోకం చాలదా ?॥

— మానికొండ సత్యనారాయణశాస్త్రి.

—)o(—

# విషయసూచిక

సర్గ సంఖ్య | విషయము | పుట సంఖ్య



అరణ్యకాండ సర్వం సంపూర్తి.

# పాఠాంతరములు

ఈ క్రిందివానిని ఈ క్రిందిపుటలలోని ఆయా పద్యపాదములకు

పాఠాంతరములుగ కూడా పఠించుకొనేది :—

| పుట: | పంక్తి: | |
|---|---|---|
| 137 : | ఆఖరుపంక్తి మొదటిపాదం. | చను నెదుర ఇప్డె నిను మరణంబు ధ్రువము.<br>(మూలం :- మృత్యు ర్ధ్రువో హ్యద్య మయా విసృష్ట్య॥ |
| 140 : | ఆరవ పంక్తి రెండవపాదం. | తోసు నొరికిటి, చత్తము కూడి, పదర.<br>(మూలం :- వర్తతే ప్రతిరూపోఽసౌ॥<br>వ్యాఖ్య :- త్వమివ అహమపి యమసంహతః॥ |
| 169 : | 18 వ పంక్తి రెండుపాదములు | కామ మోహితుడై సీత నామెఁ బట్టి<br>బుధుఁడు మింట రోహిణిఁబట్టు విధము గాగ॥ |

---

# తప్పు ఒప్పుల పట్టిక

| పుట : | పంక్తి : | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 10 | ఆఖరు పంక్తి | కాదప్రియూప | కాదప్రియూపు |
| 40 | ఆఖరునుండి రెండవ పంక్తి | నాలుగును | నాగులును |
| 66 | 24 | నఫేన | సఫేన |
| 136 | 11 | రాజుల మితౌజసుల్ | రాజు లమితౌజసుల్ |
| 177 | 14 | నిబులె | నబులె |
| 205 | 4 | సీవొర్చినది | సీ వొనర్చినది. |
| | 12 | తోసుకొనియె | తోసుకొనిపోయె. |

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### మొదటి సర్గ (2ప)

♦ దండకారణ్యవాసులైన మునులు సతీ సోదర సమేతుడగు రామునకు స్వాగతమిచ్చుట ♦

తే. ప్రభుఁ బ్రవేశించి యామహారణ్యములుల। దండకారణ్యమాత్మవంతుం డతండు
చూచె రాముండు దుర్ధర్షు డేచి ఎదుర। తాపసాశ్రమమండలం బాప్రభుండు॥ 1

ద్వి. కుశల చీరల నెల్లదిశల వ్యాప్తంబు। బ్రాహ్మ్యమాలక్ష్మి సర్వత్ర కాంతంబు
రవిమండలం బంబరంబునం దెల్లు। ధరప్రదీప్తంబు దుర్ధర్శంబు నల్లు
సకల భూతాళికి నిక శరణ్యంబు। లలి సుసమ్మృష్టాజిరంబు దివ్యంబు
బహుమృగాకీర్ణంబు మహి శీకరంబు। ఖగగణ సంకుల కలరవాగ్రంబు
నిత్య మప్సరగణ నిభృతనృత్తంబు। స్వావాసులకు నేని సంపూజితంబు।
జగతి విశాలాగ్ని శరణాలితోడ। సుగ్భాండములతోడ స్రువములతోడ
అజినకుశాళుల నల సమిత్తులను। జలకలశంబుల ఫలమూలములను
శోభితం బెల్లెడ చూడనగ్గడల। స్వాదుఫలంబుల జగతి పుణ్యముల
ఆరణ్యకంబుల నా మహాతరుల। పరివృతం బెల్లెడ పరికింప దిశల॥
పుణ్యంబు బహు బలిహోమార్చితంబు। బ్రహ్మఘోషనిరంతరారావితంబు
పుష్పంబులను వన్యముల నెందు జూడ।మహి పరిక్షిప్తంబు మహిమాంచితంబు
లలి పద్మంబు లారమ్యపద్మినుల। ప్రేక్షణీయం బెంత శ్రీకరం బెందు
ఫలమూలభుక్కుల పరమదాంతులను। కృష్ణాజినాంబరచీరవాసులను
సూర్యవైశ్వానరశుభ్రతేజులను। మునుల పురాణులభువి ప్రసిద్ధంబు
పటు నియతాహార పరమతాపసుల। పరమర్షులను పుణ్యపరుల శోభితము

తే. న్యస్తదండులమయ్యు మే మడవి నిచట। నృప జితక్రోధులము జితేంద్రియుల మయ్యు
విను తపోధనులను మమ్ము బిడ్డలట్లు। నిరతమును కాచు భారము నీదె తండ్రి॥

తే. ఇటులఁ బల్కి ఫలంబుల పటుతరంపు।మూలములు పుష్పముల వన్యములనునింక
అన్యముల పెక్కు రకము లాహారములను। రాము పూజించి రంద రా భ్రాతృ సహితు॥ 22

తే. అట్లె వైశ్వానరోపము లన్యఋషులు। సిద్ధులును తాపసులు న్యాయవృత్తులెల్ల
రాము నిశ్వాస యథాన్యాయముగను। వనిపి పూజించి రచ్చట తద్దభక్తి॥ 23

— 1 వ. సర్గ సమాప్తం — (23)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### రెండవ సర్గః (౨)

—: విరాధుడను రాక్షసుడు సీతను నెత్తుకొని పారిపోజూచుట :—

తే. అటు కృతాతిథ్యుడై రాముడా వనోర్వి। సూర్యుడుదయించు డచ్చటి యార్య వరుల
వీడుకొని యా మునీంద్రుల బృందమెల్ల। జొచ్చె దండకవనము నక్షోభ్యలీల॥ 1

కం. నానా మృగగణకీర్ణము। శ్యేన వ్యాఘ్రోరుసింహ వృకసేవితమున్
నానాధ్వస్త లతాతరు। కానన గుల్మంబు భిన్నకాసారంబున్॥ 2

కం. నిష్కూజ వివిధశకునము। నిష్కుట ఝిల్లీవితాన నినదార్భటమున్
దుష్కర వనమధ్యంబును। నిష్కర్షగ జొచ్చె రామనృపుడనుజునితోన్॥ 3

సీ. అట గిరిశృంగాభు పటుమహానిస్వను। వికటు గంభీరాక్షు విషమకుక్షు
ఘోరదర్శను, దీర్ఘు, క్రూరు, మహావక్త్రు। బీభత్సు, భీకరు, విషము, వికృతు
సర్వభూతత్రాసు, క్షతజాక్షు, పురుషాదు। భయమునంతకుబోలె, వ్యాదితాస్యు
రుధిరోక్షితంబు శార్దూలోగ్ర చర్మంబు। తతవసార్ద్రంబద్ది దాల్చు వాని
నాల్గు వ్యాఘ్రంబుల నటు మూడు సింహాల। పదిలేళ్ళతో డేళ్ళ మరియు రెండు

తే. పృథువసాదిగ్ధ సవిషాణ ద్విరదశిరము। నిన్నిటిని నినుపశూలాన నిరికి గ్రుచ్చి
బొబ్బలిడివచ్చువాని నా భూమిసుతయు। తానుపేక్షించె రాముడా దండకోర్వి॥

తే. రాము లక్ష్మణు సీత నాభూమిసుతను। మైథిలినిగాంచి వాడు సమాంతముగను
ఉరికె వారలపైకి సంక్రుద్ధుడగుచు। ప్రజలపై యంతకుడు ప్రళయానవటుల॥ 8

తే. పుడమికంపించునట్లు లపూర్వగతిని। వాడు నాదంబు భైరవంబుగ నొనర్చి
ఎత్తి సీతను చంకనునిఱికిపట్టి। వారి కిట్లనె జరిగి యావలికి యసుర॥ 9

తే. పలుజటాచీరధరులు సభార్యులేరు। క్షీణజీవితు లీ వనక్షోణి కిటుల
వచ్చి చొచ్చిరి శరచాపవరకృపాణ। ధారులై దండకారణ్యధాత్రి కార! 10

తే. ఎటుల తాపసు లీర లీయంతిగూడి॥ ప్రమద నీవెనుగూడి దిమ్మరులను కార
మీర లింత యధర్మసంచారులగుట। ధ్రువము మునివేషకులుపాపులవుట ద్రుంతు॥

తే. నేను వన మిది దుర్గమంబైన భూమి। ద్రిమ్మరుదు సాయుధుండనై వేలు బవలు
మించి ఋషిమాంసముల మెక్కికొంచుసతము। ప్రబలబలుడ విరాధుడన్
రాక్షసుండ॥ 12

తే. ఈ వరారోహ నారి నా కింతనుండి। భార్యయగుగాక మీరలుపాపులగుట
జంపి మిమ్ముగ్ర యీ వనస్థలమునందు। త్రావుదును మీదురుధిరంబు తనివిదీర॥

తే. ఇటు వచించెడి దుష్టు దుశ్శీలు దురితు। నా విరాధు సగర్వితు వాక్యములను
విని భయభ్రాంతయగుచు నుద్వేగమునను। వణకె వైదేహి పెనుగాలికనటి
యటుల॥ 15

తే. అటు విరాధాంకగత సీతనవనిజాత। శుభద నారసి రాము డస్రాకశోక
వశత పరిశుష్కముఖమున ప్రక్కనున్న। భ్రాతలక్ష్మణుతోడ దా బల్కెనిటుల

తే. కనుముసౌమ్య! నరేంద్రుడా జనకుమహిత। సతిశుభాచారనాభార్యయతిసుఖమున
పెరిగినాపె మనస్విని నృపతనూజ। ఎటు విరాధాంకమునజిక్కె యెలుగునిడునో॥ 17

తే. కైక మనయెడ నెంచె నేకరణి కీడు। వరము వ్యాజాన నేప్రియం బావె కోరె
అద్ది యిప్పుడు లక్ష్మణా! యాపెకిచట। చక్క ఫలియించె తీరె నాచానకోర్కె॥

తే. చనకతృప్తిని పుత్రు రాజ్యంబుతోనె। సర్వభూతైక హితు నన్ను నాగనంపె
వనికి నేదీర్ఘదర్శిని మధ్యమాంబ। కైక నిజమిప్పై యయ్యె సకామ సౌమ్య! 20

తే. జానకికినైన యీ పరస్పర్శ కతన। అకట నాకిప్పు డొదవెడు నంత వగపు
గల్గ దెన్నడు పితృవియోగాన గాని। అల స్వరాజ్యాపహరణానగాని వత్స॥ 21

తే. ఇటుల కాకుత్స్థుడా రాము డినకులుండు। బాష్పశోకపరిప్లుతిన్ బల్కుచుండ
క్రుద్ధుడై లక్ష్మణుండు సంరుద్ధనాగ। మనగరోజుచు నిటుబల్కె నన్నతోడ॥ 22

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్యకాండము

### మూడవ సర్గ (27)

:— రామలక్ష్మణులు విరాధునితో పోరుట— వాడు వారియిరువురిని భుజములమీద పెట్టుకొని మహారణ్యములలోనికి పరుగిడుట :—

తే. లక్ష్మణుం డెల్లుపల్కె శ్రీరాముతోడ। నంత శ్రీమంతుడాత డా యసురజూచి
నవ్వుచును 'ఓరి ఎవడవు? ఎవ్వరివి నీవు। వని యథేచ్ఛగ దిరిగెద' వనుచు నడిగె॥ 1

తే. అంత వాడును మరల నాయడవియెల్ల। మారుమ్రోగునట్లుగ మీరి 'యార
నేన మిమ్ములను నడుగెద నిలిచి చెప్పుడు। ఎవరుమీరలు పోవుదురెచటి' కనియె॥ 2

తే. అటుల జ్వలితాననంబున నడుగుచున్న। రాక్షసునికాతనికి సర్వ రామవిభుడు
చెప్పె తనదైన యిక్ష్వాకుగొప్పకులము। చరితమెల్ల మహాతేజ మెరుక మెరయ॥ 3

తే. క్షత్రియులము సదాచార శీలితులము। ఇప్పుడు వనగోచరులమంచు నెరుగు
మమ్ము
ఇంక నీవెవ్వడవో మరి యెరుగ చెప్పు। ఎరుగదలతుము దండకన్ దిరుగుదేల॥ 4

తే. రాము సత్యపరాక్రము నామహాత్ము। జూచి యసురవిరాధు డక్షోభ్యలీల
పలికె నిట్టుల 'హంత నా పలుకు వినుము। చెప్పెదను నాదు వృత్తాంతమెప్ప
నీకు॥ 5

తే. పుత్రుడను నేను 'జయు'నకు భూరిబలుడ। జనని నాకు 'శతహ్రద' వినుము నన్ను
పిలుతురు విరాధుడంచని పృథివి గలుగు। సర్వరాక్షసకులముల జనులెప్పుడు॥ 6

తే. జ్వలితతపమున బ్రహ్మప్రసాదమునను। ధరణి నచ్ఛేద్యతను నభేద్యతను గంటి
అఖిల శస్త్రాస్త్రముల నవధ్యతను గంటి। ఎరుగ కెదురిట్లు దండక తిరుగుచుంటి॥ 7

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### నాల్గవ సర్గ (౪)

**రామలక్ష్మణులు విరాధుని బాహువుల నరికి వాని కోరికపై వానిని గోతిలో పూడ్చిపెట్టుట:— విరాధుడిట్లు శాపవిముక్తుడై చనిపోవుచు రామలక్ష్మణులను శరభంగు నాశ్రమమునకు బోవలసినదని సలహాచెప్పుట:—**

తే. అటుల కొనిపోవబడెడి యా యక్కజపలుల: రామలక్ష్మణవరుల నారసి మహీజ
సుభుజ భుజముల నొత్తుకొంచును మహార్తి। నేడ్చె నత్యుచ్చస్వరంబున నెలుగు
సెలగ॥ 1

తే. ఆదె మహాత్ముడు సత్ శీలు డక్కజపలుడు। దాశరథి సత్యవంతుండు తగ్గజుచియు
రాము నదె కొంచుపోబడు క్రూరరూప। యసురచే నయ్యొ లక్ష్మణ సహిత
ముగను। 2

తే. పులులు తోడేళ్ళు చిరుతలు నెలుగులింక। నన్ను తినివైచు నయ్యయ్యొ నట్టి
డవిని
నన్ను గొని రాఘవుల వీడుమన్న కరుణ। రాక్షసోత్తమ యిదె నమస్తే
క్షమింపు॥ 3

తే. అట్టు లనునట్టి వైదేహి యబల పలుకు। విని దురాత్ముని యా విరాధుని వధింప
వేగమూనిరి వీర లా మిహిరకులులు। రామలక్ష్మణు లయ్యెడ భీమబలులు॥4

తే. ఉగ్రు నాతని సవ్య బాహువును నంత। నరికె సౌమిత్రి ఖండ ఖండములుగాగ
రాముడును నంత యసురు నా రౌద్రరూప। దక్షిణపు బాహువున్ గొట్టె
తక్షణంబు॥ 5

తే. భగ్నబాహుండు మరియు సంవిగ్నుడగుచు । రాక్షసుం డాశుగతిని ధరాతలాన
నిపతితుండయ్యె మేఘసన్నిభుడతండు । వజ్రభిన్నాచలంబను వడువుగాగ. 6

తే. వడిగ పిడికిళ్ళ మోకాళ్ళ మడమపోట్ల । గుమ్మి గుమ్మియు నేలపై దిమ్మదిరుగ
నెత్తిమెత్తియు బట్టైచి నీల్గగొట్టి । పిండిముద్దగ జేసి రా మొండియసురు॥ 7

తే. పరిహరితుండయ్యె బహుభంగి బాణములను । నరుకబడియును ఖడ్గాల నలినలిగను
పంచబడియును ముద్దముద్దగను ధరణి । చావడయ్యెను ఘోర రాక్షసు డదేమొ॥

తే. మొండిని విరాధు నచలోపముని సుఘోరు । నిక నవధ్యునిగాగ దా లెస్సనెరిగి
లక్ష్మణునితోడనిట్లనె రామవిభుడు। లక్ష్మణయితడు తల్ల భయముల నభయమండు॥

తే. తపమునను వీడు వినుము శస్త్రములచేత । కాడు శక్యంబు నిర్జింప కదనమందు
కాన పనిని యో నరవ్యాఘ్ర యింక । పూడ్చివైతము గోత నీ భూమినిచట॥10

తే. రాఘవుం డట్టు లన్న పల్కద్ది వించు । రాక్షసుండు విరాధుండు ప్రశ్రితంబు
వచన మిట్లు పల్కె కాకుత్స్థవరునితోడ । రహిని పురుషర్షభునితోడ రాము
తోడ॥ 11

తే. హా! హతోస్మి నరవ్యాఘ్రమఅర్కవంశ్య । శక్రతుల్యబలుండ ! నట జంపితింక;
మోహమున నిన్ను నింతకుమున్ను నేను । నెరుగనైతిని క్షమియింపు పురుష
వృషభ ! 12

తే॥ అంబ కౌసల్య సుప్రజయయ్యె రామ । తాత యెరిగితి నిన్నిప్పు దాశరథివొ
పద్మ వైదేహి సతి మహాభాగ యీపె। లక్ష్మణుండు మహాయశుండగు నితండు

తే. అనఘ యక్షశాపమున ఘోర మసురతనువు । జొరగవలసెను నయ్యె నే నర
వరేణ్య
నన్ను తుంబురు డంద్రు గంధర్వకులుడ । శప్తుడనునైతి ప్రభునివైశ్రవణువలన॥

తే. దాశరథి రాము డెపుడు యుద్ధాన నిన్ను । జంపు నప్పుడె పాసి యీ శాప
మీవు
స్వర్గమందెదవని మహాయశు డతండు । వేడుకొన నేను కరుణ కుజేసుడనిమొ॥15

తే. అనఘ మున్ను రంభాసక్తుడనుగ నుండి । తనను గొలుచంగబోకుంట తద్ద మండి
శాపమిడె రాజు నాకు వైశ్రవణు డట్లు। చెప్పె శాపాంతమును నట్లు గొప్ప
ప్రభుడు॥ 16

తే. ముక్తశాపుఁడనైతి దేవ! నీ భూరికరుణ। విను సుదారుణ మభిశాపమునను నుండి
స్వభవనం బికఁబోవుదు స్వామి, సెలవు! । స్వస్తి మీకగు శత్రుకర్శనులు ఘనులు॥
తే. ఇచటికి నధ్యర్ధయోజనం బేగ నచట । అనఘ వసియించు "శరభంగు"డను మహర్షి
తాత! ధర్మాత్ముఁ డతఁడు ప్రతాపశాలి। సూర్యసన్నిభుఁడాను పో సూర్యకులుఁడ॥
తే. అరసి యొద్దకు వేగంబ యరుగుమీవు। అతఁడు శ్రేయంబుగూర్చు నీకతులితంబు
అవటమున నన్నుఁ బూడ్చి యీయటవి నిచట। కుశలివై రామ చనుమ యాదిశకు నిపుడె॥ 19

తే. ఇలను గతసత్త్వులగు రాక్షసులకు నెల్ల। ఇదె సనాతనధర్మంబు సదమలాత్మ!
బొందులే రక్కసుల వీట్లు పూడ్వబడును। వర సనాతనలోకముల్ వారి కగును॥
తే. ఇటుల కాకుత్స్థతోనని పటుశరోగ్ర। పీడితుండు విరాధుండు విడిచి తనువు
స్వర్గసంప్రాప్తుఁడగుడు మహాబలుండు। చూచియిటువల్కె రాముండు సోదరునకు॥
తే. కుంజరంబన రౌద్రుండు ఘోరు డౌర। రౌద్రకర్ముండు పేర్చు రక్కసుండు
వీనికై వని నొక గొయ్యి పెద్దదిగను। త్రవ్వు లక్ష్మణ పూడ్త మద్దాన వీని॥ 23

తే. ప్రదరమటుద్రవ్వు మంచని లక్ష్మణునకు। వీర్యవంతుండు రాముండు వీక బలికి
మీఱి విరాధుని కంఠంబు మడమతోనె। నదిమిపట్టియెయుంచె దా చెదరకుండ।
తే. లక్ష్మణుండంత పలుగు పారయునుబూని। ఘనమహాకాయు నా విరాధుని శరీర
పార్శ్వమందున వాడందుపట్టునంత। గొయ్యిలోతుగ త్రవ్వె నా గురుభుజుండు॥
తే. కంఠమున త్రొక్కియిడినట్టి కాలునప్పుడు। రాముడుఁ దీయ వారు విరాధు బట్టి
గోతద్రోసిరి భైరవఘోరనినదు। శంకుకర్ణు మహాస్వను పెంకె యసురు॥ 26

ఉ. ఆహవనిర్జితుఁ విక్రుతు నాశుపరాక్రము లిద్ద రా మహో
త్సాహులు సంయతిస్థిరులు సంతసవంతులు రామలక్ష్మణుల్
బాహులబట్టి రాక్షసు భయావహు బొబ్బలవెట్టు నా మహా
బాహుని గోతద్రోసిరి సువధ్యు విరాధు కృతాపరాధునిన్॥ 27

కం. శితశస్త్రాల నవధ్యత। ఇతనికి గలదంచు దెలిసి యీ రాక్షసునిన్
క్షితి పూడ్తమంచు నరవరు। లతిధీయుతు లెంచి పూడ్చిరట్టులె యతనిన్॥ 28

ఉ. కాననచారి రాఘవుడు గాఢముగా దను జంపగోరుడున్
తానె స్వయంబుజెప్పె తనదైన వరంబు విరాధు డుబ్బి యో
మానవజన్మ! నన్నిటుల మారణసేయగరాదె నీకు నీ
బాణ కృపాణగాణముల బాధ్యుడవై! యంచని తత్ప్రహాస్యమున్। 29

తే. అట్టి పల్కులనేబట్టి గట్టునెరిగి । ప్రాడ్పునెంచెను రాముండు భువిని నసురు
బిలమునన్ గ్రుక్కబడెడి యా విప్లులవప్పుని । ఘోరనాదాల వనమెల్ల భోరు
కొనియె। 30

తే. ఉర్వి బిలమున రిపునట్టు లుపలద్రోసి । పరమసంతుష్టులై భ్రాతృవరులు వనిని
వీతభయులౌచు నానందపడిచి దేలి । శిలలబడవైచి గప్పిరా బిలమునప్పుడు। 31

తే. కూల్చి రక్కసునటుల, వైకొంచుసతిని । మొరయు కాంచన చిత్ర కార్ముకము లాలయు
తిరిగి రా వని ముదితులై దొరలువారు । దివిని చంద్రదివాకరు లవ్వురనగ। 32

4 వ సర్గ సమాప్తి (108)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అయిదవ సర్గ (44)

సీతారామలక్ష్మణులు శరభంగు నాశ్రమము జేరుట - ఆ మహర్షి వారలతో సంభాషించి, ముందు మరి సుతీక్ష్ణాశ్రమము జాడచెప్పుచు తాను అగ్ని ప్రవేశము చేయుట - శరభంగుని మహోద్భుత నిర్యాణము

తే. హతమొనర్చి విరాధు నా యసురు క్రూరు । క్షేమబలుసఖ్యవనిని నా రామవిభుడు
సీతనాలింగన మొనర్చి క్షితిజాక్షి । ధైర్యమున కిల్లు కీర్తితేజునకు ననియె॥ 1

తే. కష్టమౌ వనమ్ము సుమ్ము దుర్గమము నిదియు। వనము మన మెన్న డెరుగనివార మోయి
పోదమిక శీఘ్రముగ తపోధనుండౌ । ఘనుడా శరభంగు డున్నెడ కనఘ వడిగ॥ 2

తే. పరము శరభంగు తపమున భావితాత్ము । డగుచు దేవ ప్రభావు నాశ్రమము జాడ
నరిగి రాఘవుడా సమీపాన నరసె । నొక్క మహాద్భుతంబౌందు నరవరుండు॥

తే. అతుల విభ్రాజమాన దేహంబువాని । సూర్యవైశ్వానరోపము సుమము శుభదు
రథము డిగ్గి సుధాంశువర్గంబుతోడ । చెలగ దాకకిన చ్చు నాయిందు గాంచె॥ 4-5

తే. సుప్రభాభూషణుని దేవు నప్రమేయు । తరళవిరజాంబరాదికధారు ధీరు
తేజస్విఘనంబొప్పు బహు మహాత్మకుల తోడ । పూజ్యమానుని నింద్రునా పురుషు
నరసె॥ 6

తే. హరిహయోత్తమయుక్తంబు నంతరిక్ష । గతము రథమొండు గాంచె రాఘవుడు
నపుడె
చిరుడా మాశ్రమాని కదూరమునందు । తరుణరవిసన్నిభంబు తద్వనమునందు॥ 7

తే. పాండురాభ్రసమప్రఖ్య మొండుగాంచె। చంద్రమండల సన్నిభం బింద్రుడైన
ఛత్రమచ్చట విమలంబు చదలపైన। చిత్రమాల్యోపశోభనశ్రీలదనర॥ 8

తే. అగ్ర్యముల రుక్మదండాల నమలములను। మరి యమూల్యాల చామరవ్యజన
ములను
పరమనారుల కరముల వరలిహాయల। మూర్ధములపై వీచుచుండ నాభూపుడరసె॥ 9

తే. అంత సిద్ధులు గంధర్వు లమరవరులు। మరియు పరమర్షులెందరో బెరసిచదల
అగ్ర్యముల వాక్యముల దేవు నామహాత్ము। నంతరిక్షగు స్తుతియింప నాతడరసె॥ 10

తే. ఎదుర శరభంగుతోడ భాషించునతని। నింద్రు వీక్షించి యాతని స్యందనంబు
లక్ష్మణున కల్ల జూపుచు రామవిభుడు। పలికె నాతనితో నిట్లు లలితఫణితి 11-12

తే. అదిగొ కనుము యర్చిష్మంత మద్భుతంబు। శ్రీనిధానంబు లక్ష్మణా కానిపించు
అంతరిక్షగతాకార మహత్తరంబు। తప్తమాదిత్యుపోలె తత్స్యందనంబు॥ 13

తే. అల్ల పురుహూతు శక్రు హయాలగూర్చి। మున్ను వినియుంటిమే యవే మిన్ను
జాడ
ధ్రువము గాన్పించు హరు లవే రూఢిమెరయ। నంతరిక్షగములును దివ్యములు
వత్స॥ 14

చ. యువకులు ఖడ్గపాణులు మహోజ్జ్వల కుండలులున్ మహాబలుల్
పవినిభ బాహులున్ విపులవక్షులు శోణమరీచికాంశుకుల్
జవయుతు లెల్లరున్ కను మహాపదు లెందును వ్యాఘ్రముల్ బలెన్
దివిశతముల్ రథంబు దరినే నిలుచుండిరి పూరుషర్షభుల్। 15–16

తే. జ్వలన సన్నిభహారముల్ వక్షములను। మెరయ నెల్లర కివియె సౌమిత్రి కనుము
పంచవింశతి వార్షికంబయినయట్టి। రూపముదాల్తువారలు రూఢిమెరయ॥ 17

తే. ఇదియెగా దేవతలకొప్పు నెప్డువయసు। అహహ కన్పింతు రెంతటి యందగాండ్రొ
ఎంత ప్రియదర్శనులొ వీరలీవిధంబు। మెరయుచున్నారు చదలపై యరయు
మోయి॥ 18

తే. ఇటనె వైదేహితోడ యీ విటపిచెంత। నిలువుమొక్క ముహూర్తంబు నీవు
కుర్ర
ఇదియె నే నేగి రథమున నిట్లు మెరయు। కరము ద్యుతిమంతు డెవ్వడో ఎరిగి
వత్తు॥ 19

తే. తపసి శరభంగు డిటులఁబల్కె తద్భక్తి । సర్వలోకాస్త్రసిద్ధి కారకముం దుర్లభమగు
రాఘవుండు నరవ్యాఘ్రుఁ డోఘబలుఁడు । పలికెనిట్టుల బదులు తత్పరమఋషికి॥

తే. చేసి సాధింతు లోకాల సేని నన్ని । ఓ మహాముని నాకిక యుచితమైన
రమ్య వనావాస మొండు మాత్రంబు నిచట । చూపినన్ జాలు నీ కాన జూపు
మనఘ॥ 33-34

తే. రాఘవుండిట్లు శక్రతుల్యంబు బలము । నొప్పువాడిట్లుబల్క నా గొప్పఋషియు
పల్కె శరభంగు డా మహాప్రాజ్ఞుడిట్లు । మరల రాఘవుతోడ తన్మహిమతోడ॥

తే. ఇటనె రామ మహాతేజు డటవిచెంత । అల'సుతీక్ష్ణుండు'నానొక్క యలఘుగుణుడు
వాసమొనరించు ధర్మాత్ముడా సుబుద్ధి । అతడె శ్రేయంబుగూర్చునీకతులితంబు

తే. ఆ సుతీక్ష్ణుని తపసిని యనఘునివు । చేర నరుగుము రామ! యా ఋషియె నీకు
శుచియు రమణీయమునునైనచోటనొకట । వసతికల్పింపగల డతండసమయశుడు॥

తే. ఇదియె మందాకినీనది కెదురు దిశగ । బాటగలదొండు చనుమదే బాట పట్టి
అల్ల పుష్పోడుపవహంబు నందునందు। నదినినంటుచు రామ యా పథినె బొమ్ము॥

తే. ఇదియెపంథ నరవ్యాఘ్ర యిద్ధరిత్రి।చూడుముముహూర్తమికనన్నుచోద్యమోయి
జీర్ణగాత్రంబు దీని నీ క్షితినివిడుతు । పాము కుబుసంబు విడిచెడి వడువుగాగ॥ 39

తే. అంత జ్వలియింపజేసి యా యగ్నిహోత్రు । మంత్రవిదు డాజ్యమున నందు
మరియు వ్రేల్చి
ఋషియు శరభంగు డామహాతేజు డపుడె । చొచ్చెను హుతాశనంబు నక్షోభ్య
లీల॥ 40

తే. అతని రోమాలు కేశాలు నస్థిచయము । మాంసము సశోణితంబు, చర్మంబుశిథిల
మా మహాత్ముని నా యగ్నియందు నపుడె। దగ్ధమయ్యెనునిమిషమాత్రంబులోనె॥

తే. విస్మితుండయ్యె రాము డీ విధముజూచి । వింతపడిరట్లె సౌమిత్రి పృథ్విసుతయు
అంత పావకసంకాశుడగ్నినుండి। లేచివెలిగె కుమారుడై ఋషివరుండు॥ 42

తే. ఆహితాగ్నుల లోకాలనంతదాటి । ఋషులయు మహాత్ములయు లోకవితతిదాటి
దేవతలలోకములదాటి దివ్యలీల । చేరె తద్బ్రహ్మలోక మా సిద్ధతనుడు॥ 43

తే. పుణ్యకర్ముండు ద్విజుడు తత్ భువనమందు । నరసెను పితామహుని సానుచరుని
భవుని॥
మరి పితామహుడటులె దానరసి ద్విజుని । సంతసంబంది వచియించె స్వాగతంబు

5 వ సర్గ సమాప్తి (152)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఆరవ సర్గ (26)

దండకారణ్యవాసులగు మునిసంఘము లెల్ల రాముని దర్శింపవచ్చి, తమ్ము రాక్షసులు పెట్టు బాధలు చెప్పుకొని మొఱ పెట్టుకొనుట – రాక్షసుల సంహరించి, మునిసంఘముల కాపాడెదనని రాముడు వారికి అభయ మిచ్చుట.

తే. ఉసిమి శరభంగు డటులేగ దివ్యలీల । నచటి మునిసంఘ మెల్ల సమాగతులయి
జ్వలిత తేజుని రాముని సవితృకులుని । చేరవచ్చిరి తద్వన క్షితిని పతిని ॥ 1

సీ. వాలఖిల్యులు ఘనుల్ వైఖానసుల్ మరీచిపులు సంప్రక్షాళు లుపరిచరులు
అశ్మకుట్టులును పత్రాహారు లెందరో శ్రితులు దంతోలూఖలులును ఋషులు
ఉన్మజ్జకుల్ కొంద పర్ణశయ్యకుల్ గాత్రశయ్యులు ధార్మికాగ్రమతులు
వాయుభక్షులును నబ్భక్షులు నభ్రావకాశకు లింక నాకాశనిలయు

తే. లటులె స్థండిలశాయులు నటు వ్రతోప । వాసు లుగ్రతపోనిత్యు లసమయశులు
నార్ద్రపటవాసనులు దాంతు లమలమతులు । మునులు సజపులు పంచతపోన్వితులును ॥

తే. పృథ్వినెల్లరు బ్రాహ్మ్యంబు శ్రీ చెలంగ । సుదృఢయోగులు తద్వనక్షోణి నపుడు
రహి సమాహితులగుచు శ్రీరాముకడకు । నరుగుదెంచిరి శరభంగునాశ్రమమున ॥ 6

తే. రాము ధర్మభృతాంవరు ప్రభువరేణ్యు । పరమధర్మజ్ఞు లా ఋషివ్రాత మెల్ల
చేరి సుసమాహితములైన చేతములను । పలికి రిట్టుల నతనితో లలితఫణితి ॥ 7

తే. నీవు నిక్ష్వాకుకులమున కీ వసుంధ । రకును నాథుండవగుదు మహారథుండ
మరి ప్రధానుండవగుదువు మఘవుం డెల్ల । దేవతలకైనయట్టుల దేవదేవ ! 8

తే. విశ్రుతుండవు యశమున విక్రమమున। మహాకులోకాల నీవు ప్రభావ త్తముండ
ధరణి పితృభక్తి సత్యంబు ధర్మమివ్వి। పుష్కలంబులు నీయందు భూపవర్య॥ 9

తే. నిను మహాత్ముని ధర్మజ్ఞు వినుతధర్మ। వత్సలుని జేరి యర్థిత్వభావబుద్ధి
గడగి పల్కెద మొందు వాక్యంబు దాని। నాథ క్షమియింపవలె రమానాథ! ప్రభు।

తే. రక్షకై బలిషడ్భాగ మే క్షితిపతి। కైకొని ప్రజాళి పుత్రుల కరణి రక్ష
సల్పకుండును తన్మహీజాని కింక। తగులు తాత! యధర్మంబు తరతరంబు॥ 11

తే. యత్నమున నిత్యయుక్తుడై యధిపుడెవడు। విషయవాసుల స్వప్రాణ పతతికంటె
ప్రాణముల కెక్కుడయిన పుత్రికులకంటె। బ్రోచు నెక్కుడుగాగ తద్భావిభుండు

తే. పడయు కీర్తిని రామ శాశ్వతముగాగ। వసుధ బహువార్షికంబు సంపత్ప్రదంబు
బ్రహ్మణస్థానమును జెందు మరియు నచట। గాంచు మహిమంబు నాత సుసంచితంబు

తే. మునులు మూలఫలాశనుల్ పూనియొద్ది। పరము ధర్మమునల్పుదు రందులోన
విను చతుర్భాగ మమరు పృథ్వీశ్వరునకు। ప్రజల ధర్మాన రక్షించు ప్రభువరునకు॥

తే. ఇచట బ్రాహ్మణభూయిష్ట మిద్ధరిత్రి। వీర దేవ! వానప్రస్థ బృందమెల్ల
నీవు నాథుడవైయుండ నిహతిగందు। కర మనాథలబోలె రాక్షసులచేత॥ 15

తే. రమ్ము చూడుము ఇవె శరీరములు రామ। భావితాత్ముల వానప్రస్థుల వకట
బహువిధంబుల వనమున బహుకఠోర। రాక్షసులచేత కూలిన లక్షలాది। 16

తే. వినుము పంపానదీవాస జనులనేమి। ఘనుల మందాకినీ తీరమునులనేమి
చిత్రకూటాలయులునైన ఋషులనేమి। పొడివి చంపుచున్నారు కాననమందు॥

తే. విప్రకారము నీరీతి విక్రమించి। రక్కసుల తాపసులకిట్లు పెక్కొనర్ప
భీమకర్ముల వారల కృత్యములను। మరి సహింపంగలేమింక మనుజవృషభ॥ 18

తే. కాన నింక శరణ్యు నిన్ కావుకావు। మనుచు శరణంబు వేడంగ వచ్చినాము
మమ్ము పరిపాలనమొనర్చు మహిప రామ। చంపుచున్నారు రక్కసుల్ చాల
మమ్ము॥ 19

తే. పరము నీకంటె గతిమాకు వరద లేదు। పృథివినెందును రామ! పృథ్వీలలామ
మమ్మునెల్లర రాక్షసబాధనుండి। ఇంక రక్షించి కాపాడు నృపతనూజ। 20

తే. తాపసులు నా తపస్వులు తగిలియిటుల। పలుక కాకుత్స్థుడున్ విని వారితోడ
పలికె మరలను ధర్మాత్ముడలఘుమతిని। ఎల్లరకు నిట్టు లుల్లముల్ పల్లవింప॥ 21

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఏడవ సర్గ — (24)

తరువాత మజిలీ సుతీక్ష్ణాశ్రమము – సీతారామలక్ష్మణు లా రాత్రి సుతీక్ష్ణుని ఆతిథ్యమున గడుపుట.

తే. రాఘవుం డంత సీతతో భ్రాతతోడ । మరియు తద్విజవరులతో తరలి యప్పుడ
పడగతి సుతీక్ష్ణునాశ్రమ పదము జూడ । నరిగె వేగ పరంతపుం డుపయుతుండు॥ 1

తే. దూర మధ్వాన మేగి యా దోర్బలుండు । నదుల బహూళోదకంబులనటులె దాటి
చూచె విపులంబు శైలంబు క్షోణివిభుడు। తతమహామేఘమన సున్నతంబుదాని॥

తే. అంత నిక్ష్వాకువరులు భూకాంత వేగి। సంతతద్రుమకానన క్షేత్రంబు
జొచ్చి రా రాఘవులు సీత క్షోణిజాత।గొంచు తమవెంట వివిధ వృక్షౌఘములను॥

తే॥ చొచ్చి వనమటుఘోరంబు సూర్యకులులు।విపులబహుపుష్పఫలవృక్షవితతిదాని
గాంచి రాశ్రమ మేకాంత మంచితంబు।చీరమాలాపరిష్కృతం బౌర యెదుర॥

తే. అచట తాపసు నాసీను నల సుతీక్ష్ణు।ధరణి మలపంకఘనజటాధరుని ధీరు
తత్తపోవృద్ధు జూచి యా తరణికులుడు।విధియుతంబుగ భాషించె వినయమునను॥

తే. రాముడనువాడ నేను దేవా మహాత్మ । మిమ్ముదర్శింపవచ్చితి ఋషివరేణ్య
సత్యవిక్రమ భగవంత సచ్చరిత్ర।ఇదె నమస్కార మాశీర్వదింపు మమ్ము॥ 6

తే. చూచి యంతట వీరు నా శుభదు రాము।ధరణి ధర్మభృతాంవరు పరమఋషియు
మరి సమాశ్లేష మొనరించి బాహువులను॥పలికె నిట్టుల వచనంబు సులలితంబు॥ 7

తే. స్వాగతంబిదె నీకు వీరాగ్రగణ్య। రామ ధర్మభృతాంవర రఘుకులేంద్ర!
ఆశ్రమం బిది నీ విట నడుగు నిడుట । వరలె నిప్డు సనాథమై వసుధలోన॥ 8

**తే.** ఇటుల మృగముల మీదుసాన్నిధ్యమందె। కాల్చి మీకు విషాదంబుగూర్చుకంటె
కష్టతరమేది? కాన మీయాశ్రమాన। చిరమువసియింపనొల్ల ఋషీంద్రచంద్ర॥

**తే.** వరదు నాతనితో నిట్లుపల్కి విభుడు। భక్తి సంధ్యనుపాసించి పశ్చిమంబు
రమ్య మౌ పానివసని యాశ్రమమునందు। గడపె రాత్రిసతియు లక్ష్మణుడు దాను

**తే.** అంత తాపసభోజ్య మన్నంబుశుభము। స్వాయముప్రముపర్షభులకామహాత్ముడొసగె
తత్సుతీక్ష్ణుండు నచట సంధ్యయునుగడచి। రజనిరాజూచి వారి నర్చనలదనిపి।

7 వ సర్గ సమాప్తి (202)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

# అరణ్యకాండము

### ఎనిమిదవ సర్గ — (20)

మరునాఁడు సుతీక్ష్ణుని సెలవుపొంది, సీతారామలక్ష్మణులు ముని సంఘములతో కదలి ముందు మజిలీకి నడచుట.

తే. రామచంద్రుండు లక్ష్మణస్వామితోడ। నటు సుతీక్ష్ణుండు పూజింప నలరికరము
గడపి నిశియెల్ల నచటనె కాల్యమునను। మేలుకాంచెను హాయినామిహిరకులుఁడు॥

తే. మేలుకొని లేచి తా యథాకాల మటుల। రాఘవుఁడు సీతతోడ తత్ భ్రాతతోడ
జలమున సుశీతలంబున జలజగంధి। సలిలముల స్నానమొనరించె సులలితుండు॥

తే. అంత నగ్నిని సురల యథాక్రమంబు। నట తపస్విశరణ్యమా వనమునందు
కాల్యమున నర్చలొనరించి కదలి యపుడ। సీతయును రామలక్ష్మణుల్ ఖ్యాతినడచి॥

తే. అపుడె యుదయించు దినకరు నల్లగాంచి। విగతకల్మషు లా తపోవృద్ధు జేరి
పలికి రిట్లు సుతీక్ష్ణున కెలమి నెరగి। మధురఘనతేని వాక్యంబు ప్రముదితంబు॥ 4

తే. సుఖముగా రాత్రిగడచె నిచ్చో మహాత్మ। పూజ్య నీచేత గంటిమి పూజలిచట
సెలవుగొని యేగవచ్చితి మలఘుతేజ। మునులు త్వరవెట్టుచున్నా రనఘ మమ్ము॥

తే. పుణ్యశీలుర ఋషుల నగణ్యమతుల। దండకారణ్యవాసుల కండయైన
కృత్స్న మాశ్రమమండలంబి వనోర్వి। గాంచ త్వరపడుమా మదుల్ ఘనయశుండ॥

తే. ధర్మనిత్యులు మరి తపోదాంతులౌర। విశిఖపావకు లెల్లర వీరి గూడి
పోదు మీ మునిపుంగవుల్ పూని రాగ। సెలవొసంగుము మాకు నీ వలఘుతేజ॥

తే. క్షితి సమాగ్నాగతుండు లక్ష్మిని స త్కోల్గా! వశమి మునీంద్ర నన్నుయవస్థితుడన
మునిప! యవిపహ్య మాతకంబునవదవియు నతిగ నొందుచున్నతో నలతుమనఘ
తే. ఇటుల వచియించి భక్తి సుతీక్ష్ణుచరణ యుగముల కెఱఁగి మ్రొక్కె రాఘవుం డురు
భుజుండు
సీత సౌమిత్రియును సక్తి క్షితిని సాగి। మ్రొక్కిరచ్చట మనముల ముదము గురియ।
తే. భక్తి చరణాల పట్టు భ్రాతృవరుల లేవనెత్తి మునీంద్రుండు భావమలర
గాఢ మాలింగనమొనర్చి ఘనభుజుండు। పలికె వాక్యంబు సస్నేహ మలఘులీల॥
తే. శుభము పొమ్ము పథంబు నీకభయమగును। రామ! సౌమిత్రి గూడి పరమాశి గూడి
ఛాయయనయావె సీత నిన్ సంతతంబు। ననుసరింపగ నరుగుమీ వనపథాళి॥
తే. చూడు మాశ్రమపదములక్షోణి నిచట। రమ్యముల దండకాటవీ ప్రజల వివిధ
ఘనతపోభావితాత్ముల వనచరిత। మరి తపస్వుల వెల్ల నీ వరిగి రామ!। 12
ద్వి. ప్రాజ్యమూలఫలాల వరపుష్పితాల। అల ప్రశస్తమృగాల పలుయూథపాల
శాంతపక్షిగణాల సంపుల్లలీల। పంకజషండాల ప్రవిమలాంభాల
కారండవాకీర్ణ ఘనతటాకాల। వర సరస్తీరాల గిరినిర్ఝరాల
దృష్టిరమ్యాల నీ వేగియందందు। చూడు మరణ్యాల శుభద వనాల
రమ్యాల మరి మయూరాభిరుతాల। గాంచుము శ్రీరామ ఘనుడ భూపాల॥
వత్స పొమ్మింక యీ బహుళపథాల। సౌమిత్రి నీవును చనుము యీలీల
రాఘవా వనుల మీ రందందు దిరిగి। మరల రావలెనుండి మా యాశ్రమంబు॥
తే. ఇటుల మునిపల్కు నాలించి, 'యటులె'యనుచు। లక్ష్మణునిగూడి మునికప్డు రామ
విభుడు
మరి ప్రదక్షిణమొనరించి పరమభక్తి। తరలిపోవంగ సమకట్టె తరణికులుడు॥ 17
తే. ఆయతేక్షణసీత యయ్యవసరమున। ధనువులను తూణముల శుభతరములోలి
ఖడ్గముల నిచ్చె విమలముల్ కాంత తెచ్చి। భ్రాతృవరులకు నా రామలక్ష్మణులకు॥
తే. కట్టి యమ్ములపొదుల సుస్సంధములను। ఘనత చేపట్టి చాపముల్ కరములందు
సుస్వనంబులు సెలగ నాసోదరులును। బయలువెడలిరి యాశ్రమం బల్లవీడి॥
తే. శ్రీయుతులు రూపసంపన్ను లినకులులును। దీప్యమానులు ధరణి స్వతేజమునన
బయలువెడలిరి ధృతచాపపాణులగుచు। సీతతోగూడ రాఘవుల్ వీతభయులు॥ 23

8 వ సర్గ సమాప్తి (222)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### తొమ్మిదవ సర్గ — (౯)

**ఆకారణముగ రాక్షసులను జంప ప్రతిజ్ఞ బూనుట తన మనస్సునకు నచ్చుటలేదని**
**సీత రామునితో మెత్తగ మందలించి చెప్పుట.**

**తే.** అ॥ సుతీక్ష్ణననుజ్ఞ దా నలరివడసి । ప్రస్థితుండగు రఘుకులవర్యు జూచి
హృద్యమును స్నిగ్ధమును గాచు నెసగునట్టి । పల్కు వొక్కటి భర్తతో పలికె సీత॥

**తే.** గొప్ప దీ మునిధర్మంబు కుతులమందు । విను సుసూక్ష్మంపువిధి నెపాలింపనగును
శక్యమగు నిద్ది కామజవ్యసనములను । విడచుటానికె యిహమున వీరవర్య॥ 2

**తే.** వ్యసనములు కామజంబులు నెసగుమూడు । అం దసత్యంబు మొదటిది యంతకన్న
ప్రబలములు పరదారాభిమర్శనంబు । పర వినావైరగతి రౌద్రతయు ననంగ॥ 3

**తే.** లేదు నీకు మిథ్యావాక్య లేశమెప్పుడు । మునుపులె దెప్పు డిక ముందు నుండబోదు
ఇక పరస్త్రీలయభిలాష యెందుగలదె? । ధర్మనాశంబు రాఘవా దాని పొందు॥

**తే.** లేదు నీ కెందు తద్వాంఛ లేశమేని । మనసునందేని రామ రమాలలామ
కలలో దెప్పు డట్టి సంకల్ప మింక । ధ్రువము నీకు మనువ్యేంద్ర ధూతపాప॥

**తే.** నిరతము స్వదారనిరతుడ వరయ నీవు । స్వామి! ధర్మిష్ఠుడవు సత్యసంధుడవును
ప్రకటితపితురాదేశకారకుడవీవు । ప్రభుకుమారక! సత్యపరాక్రముడవు॥ 6

**తే.** సత్యసంధ! మహాభాగ! సార్వభౌమ । దేవ! లక్షణపూర్వజ శ్రీవిశాల
నిలుచు సత్యంబు ధర్మంబు నీయెడలనె । సర్వము ప్రతిష్ఠితంబు నీయందె రామ॥

తే. అట్టి సర్వంబు దాల్ప మహాభుజుండ! చెల్లును జితేంద్రియులకె కా దెల్లరకును
నీదు వశ్యేంద్రియత్వంబు నిఖిల మనఘ! ఎరుగుదును నేను శుభమూర్తి నృప
తనూజ! 8

తే. కాదగును తృతీయ మల్ల నిర్వైరగతిని! మహా పరదారాభిగమనం బాచరించు
వ్యసన మజ్ఞానులకె మోహవశత జెల్లు! అదియు నీ కిష్ట సంభవించంగ దగునె!!

తే. దండకారణ్యవాసుల తాపసులకు! రక్షణమొనరింప నీవింక రాక్షసులను
రణమున వధింతునంచును ప్రతిననఘ! సల్పియుంటివి రామా! యిక్ష్వాకువర!

తే. తరలి ఏతన్నిమిత్తమే దండకాఖ్య! వనము విఖ్యాత పురి విడచి వచ్చినావు
భ్రాతలక్ష్మణుగూడిచ్చి కృపాణ బాణ! చాపధరుడవైన రామ సార్వభౌమ! 11

తే. ప్రస్థితుని నిన్నుజూడ నీ ప్రతినజూడ! మరియు త్వద్వృత్తమరయ నా మనమదేమొ
మిగుల చింతాకులంబగు మీ కిది పని! అగునె నిశ్శ్రేయసంబు హితంబు నంచు!!

తే. హృదికి నా కేమొ నచ్చుటలేదు నాథ! దండకారణ్య మీ విట్లు తరలుతలపు;
కారణముచెప్పెదను దాని కనఘ యిపుడె! వినుము నేజెప్పుహేతువు వీరవర్య!!

తే. అనఘ బాణధనుష్పాణివగుచునీవు! భ్రాతతోకూడ వనుల దిమ్మరెడు వేళ!
వనచరుల రాక్షసులజూచి బాణములను! విడువకుందువె వారిపై వీర! నీవు!!

తే. ధరణి క్షత్త్రియునకుచెంతధను వదున్న! విను హుతాశనుచెంత యింధనములట్లు
తేజము బలంబు మిగుల నుత్తేజగతిని! రేగు నాతనియందు నరేంద్రచంద్ర!!

తే. మున్నొకప్డు మహాబాహు! మునివరుండు! సత్యవాక్శుచి తపసి ఈజగతినుండె
వినుము వనమున రతమృగ ద్విజమునందు! పుణ్య మాశ్రమమునయందు పుణ్య
మూర్తి!! 16

తే. అతని తపమున కనఘ విఘ్నంబొనర్ప! ఆ శచీపతి యింద్రు డయ్యవసరమున
కపటభటరూపధారియు ఖడ్గపాణి! యగుచు జొచ్చెను వేగ నయ్యాశ్రమంబు!!

తే. అచట తపము నొనర్చెడి యా మునీంద్రు! నెలవుజేరి యిదే దీని నీదుచెంత!
దాచియుంచుము నే వచ్చు దనుకయనుచు! నిశిత మాఖడ్గమటపెట్టి నిలువకరిగె

తే. శస్త్ర మటువెట్టి యింద్రుండు చనిన వెనుక! న్యాసరక్షణతత్పరుండై తపస్వి
తనదుమాటను కాపాడుకొనెడికొరకు! తిరుగుచునెయెందు కత్తి నేమరకయుండె!!

తే. పంక్తిసంపత్తికై పోవు పట్టినైన। కత్తి తనవెంట మిగుల జాగ్రత్తగాను
కొంచుపోవకపోవడా యంచితుండు। న్యాసరక్షణ తత్పరన్యాయబుద్ధి॥ 20

తే. నిత్యమును శస్త్ర వ్యవహార మునీంద్రుడటుల। వెంట ధరియించుచును క్రమేణ ఋషి మనంబు
రౌద్రతన్ దాల్చె కమునక్రమముగాగ। తపమునైనుండి బుద్ధియు తలగిపోయె॥21

తే. అంత రౌద్రాభిరతమతి యా తపస్వి। అతిప్రమత్తుండును ధర్మకర్శితుడు నౌచు
శస్త్రసంవాస మద్దాన చనియె నౌర। నరకమున కా మునీంద్రుండు నరవరేణ్య॥22

తే. ఇటుల నొప్పు పురావృత్త మిలను దేవ। శస్త్రసంయోగమునగల్గు చాలచెడుగు
శస్త్రసంయోగమనగ యీ జగతిలోన। అగ్నిసంయోగమేయందురిప్రాజ్ఞులెందు॥

తే. దేవ! బహుమానమున స్నేహభావమునను। జ్ఞాపకము సేతు నీకింతె భూపవర్య
నిన్ను శిక్షించుటనగాదు సన్నుతాత్మ। ధర్మమునుదిద్ద నేనెంతదాన నీకు॥ 24

తే. పూని నీ విల్లు కార్ముక పాణివగుచు। వైరమది లేనిబుద్ధి యీ వసువుగాగ
రాక్షసుల దండకాశ్రిత వ్రాతములను। హతమొనర్పగ నెప్పుడు కార్యంబుగాదు॥25

తే. ఇలను నపరాధమది లేక యెవరిగాని। జంప తలపది గిట్టదు స్వామినాదు
వీరులగు క్షత్రియులకు పృథ్వీతలాన। ఆర్తరక్షయెయగును కర్తవ్య మింతె॥ 26

తే. వీరులగు క్షత్రియులకు నీ విపినములను। దిరుగువారికి నార్తుల దీనజనుల
రక్షమొనరించుటొక్కటే రామచంద్ర। కార్యమగు వారి ధనురాదికముల కెందు॥

తే. శస్త్రమది యేడ? వనమేడ? క్షాత్రమేడ?। మరియుతపమేడ? యివి పరస్పరవిరుద్ధ
కృత్యములు దేవ! మనకిప్పు డిచటనుంట। ఈ తపోవనధర్మమే కృత్యమగును॥ 28

తే. శస్త్రసేవనమున దేవ! జనులకెందు। బుద్ధికలుషితమగుట ప్రసిద్ధిగాన
ఉడుగుమిచ్చట; మరల అయోధ్యకేగి। క్షత్రధర్మంబు నట దాల్పపాత్రమగును

తే. అక్షయంబగు ప్రీతి మహత్తరంబు। అత్తకైకకు మామ కా దశరథునకు
పృథ్వీరాజ్యము పూర్తి పరిత్యజించి నిరత మీ విట్లు మునివృత్తి దిరుగు దేని॥29

తే. ధర్మమున నర్థ మధికంబు ధర జనించు। ధర్మమున నుద్భవించు పో తద్దసుఖము
ధర్మమున సర్వ మనఘ పొందంగవచ్చు। ధర్మసారము జగ మిది ధర్మవీర॥ 30

తే. కడు ప్రయత్నాన నియమాల నొడల నెప్పుడు। ఋషులిని నమ్యోవిధాల కృశింపజేసి
నిపుణులగువారు ధర్మంబు నిజము గంద్రు సుఖమునను బొందగారాదు సుఖము
నెప్పుడు॥ 31

తే. నిత్యమును సౌమ్య శుచిమతి నెగడుచుండి। ఈతపోధాత్రి ధర్మంబు నీ వొనర్పు
సర్వమిది నీకు విదితంబ సార్వభౌమ। వరద! త్రైలోక్యములతత్త్వమెరుగుదీవు॥32

తే. ప్రభుడ! స్త్రీచాపలంబున పలికి తేమొ। ధర్మ మది నీకు జెప్ప సమర్థుడెవడు
తవిలి బుద్ధివిచారించి తమ్ముతోడ। ఏది రుచియించు నేయు మదే మహాత్మ॥ 33

9 వ సర్గ సమాప్తి (255)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్య కాండము

### పదియవ సర్గ – (23)

సీత యాక్షేపణకు రాముని సమాధానము

తే. భర్తృభక్తిని వైదేహి వాక్యములు। పలుకగా విని రాముండు ప్రభువరుండు
ధర్మమున సుస్థిరుండు తత్పత్నితోడ। పలికె ప్రత్యుత్తరం బిట్లు పటుతరంబు॥ 1

తే. హితము జెప్పితి వీవు మహీతనూజ। సదృశమ త్వదీయకులమున కిదియు దేవి
నిజము సదృశము నిదగు స్నిగ్ధతకును। పరమధర్మజ్ఞ! జానకీ! పలుకు నీది॥ 2

తే. ఏమి గల దింక నే జెప్ప నిచట దేవి!। నీవు జెప్పితి గాదె యా నిఖిల మిపుడె
ఆర్తశబ్దంబు లేకుండవలయు ననియె। క్షత్రియుడు దాల్చు చాపమం చనుప
మాంగి॥ 3

తే. ఆర్తు లీ దండకారణ్యమందునున్న। సంశితవ్రతు లీ మునుల్ స్వయమువచ్చి
మరి శరణ్యులు వారె నన్ శరణమబల!-వొచ్చియున్నారు సీత! యోక్షోణిజాత॥4

తే. వినుము మూలఫలాశనుల్ మునులువీరు। ధర్మనిరతులు నీ వనధాత్రిఋషులు
సుఖముగనలేకయున్నారు సుక్కి— శీతి! రాక్షసులక్రూరకర్మల రాపిడులను ॥5

తే. దేవి! యా నరమాంసోపజీవు లచట। రాక్షసులు భీమరూపులు లక్షలాది
భక్షణమొనర్త్రు మరి మాటిమాటి కబల!వనుల నానావిధవ్రతపరుల మునులు॥6

తే. ఇటుల భక్షింపబడునట్టి ఋషిగణమ్ము। దండకారణ్యవాసు లా దండిమునులు
'మమ్మురక్షింపు'మంచు దీనమ్ముగాను! వేడి రా ద్విజసత్తముల్ వెలది!నన్ను॥7

తే. వారినోటను వెడలిన పలుకు లిట్లు! విని మహదంబున భక్తిమై మునుల వారి
చరణకమలోపాసనగావించి సరగ నిట్లు! పలికితిని వారితో నిట్లు వెలది నేను॥ 8

తే. 'ననుతిమించుడు మునులార నాకు మీరు! సిగ్గుగొలుపుచుండె విప్రశ్రేష్ఠులు మీరు
జగతి నాసేవలందంగ దగిన ఋషులు! నన్ను ప్రార్థింప వచ్చియున్నారు'!

తే. ఏమి యొనరింతు సేవ మీ కిచట నంచు! ద్విజుల సన్నిధి నే జెప్ప వెలది వారు
జేరి యెల్లరు నీరీతి ఋషిగణమ్ము! చెప్పి రంతయు నాతోడ చిత్రమొదవ! 10

తే. రాక్షసులు మమ్ము దండకారణ్యమందు! కామరూపులు పెక్కండ్రు రామ, రామ
మిగుల బాధించుచున్నారు మేరమీరి! దిక్కు మాకీవె రక్షింప, దీనపోష॥ 11

తే. హోమకాలాన వచ్చియు రామరామ! పర్వకాలాన వచ్చియు ప్రభువరుండ
కరము ధర్షించుచుందురు రాక్షసులు మమ్ము! అకట దుర్ధర్షులా పిశితాశనులును॥

తే. అసురబాధల కిట్టుల యలమటించి! దిక్కుగన లేక అల్లాడు దీనజనుల
మమ్ము తపసుల రక్షింప మహిని నీవె! పరమగతివి మహాత్మ దాశరథిరామ॥13

తే. శక్తులము మేము మా తపశ్శక్తి వలన! ఈ నిశాచరులనెల్ల నెసగిచంప
అయిన దేవ! చిరార్జితంబైన తపము! ఒల్లము వ్యయింప పనికి ఈచిల్లరకును॥14

తే. తపము బహుదుశ్చరంబు నిత్యంబు రామ! విఘ్నములు పెక్కు కావున వృథగ దీని
వ్యయము సేయము వారిపై వదలి యకట! చెలగి వారెంత మమ్ము భక్షింపనైన॥

తే. దండకారణ్యవాసు లుద్దండు లట్లు! రాక్షసులు మమ్ము పీడింత్రు రామచంద్ర
ఇంక తమ్మునిగూడి మమ్మింక నీవె బ్రోవు! వనిని మా కీవె నాథుండ వినకులుండ॥

తే. వారి వచనంబులన్ విని వారిజాక్షి! ఎల్లవిధముల వారి రక్షింతునంచు
ఋషుల కా దండకారణ్య నిలయుల కొగి! ప్రతిన జేసితి జానకీ ప్రథితముగను॥ 17

తే. ప్రతిన నటు జేసి ఋషుల కా ప్రథితుకులను! నాదుబొందిని నింక ప్రాణంబులుండ
దాని కిక యన్యథా సేయ బూనజాల! సత్యమేగాదె యిష్టమ్ము సతము నాకు॥18

తే. జీవితంబైన విడుతు నిశ్చింతముగను! కాంత నిన్నైన విడుతు లక్ష్మణునినైన
విడువ జేసిన ప్రతిన యేయిడుమగాని! మరి విశేషించి బ్రాహ్మణవరుల గురించి॥

తే. కాన, యిక నా కవశ్యంబు కార్యమబల! మునులపరిపాలన మొనర్చు పని ధరిత్రి
అడుగకున్నను నాకు కార్యంబ యిద్ది! ఇక ప్రతిజ్ఞనొనర్చిన నేమి సెప్ప॥ 20

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### పదునొకండవ సర్గ — (94)

**అనేక కథలు చెప్పుచు, మహారణ్యముగుండ పోవుచు, అనేక ఆశ్రమాలలో అనేక కాలము లుండుచు, సీతారామలక్ష్మణులు పదేండ్లు గడపుట—పిమ్మట అగస్త్యాశ్రమునకు చేరుట.**

తే. ముందు నడచెను చెలగి రాముండు వడిగ। మధ్య సీత సుమధ్యమ మరియు నడచె
వెనుకవైపున కరమున విల్లుబూని। లక్ష్మణుడు నప్రమత్తత క్రమత నడచె॥ 1

తే. చూచుచుండంద్రు వివిధవృక్షౌఘములను। కాననంబుల పర్వతసానువులను
రహిని నానానదీరమ్యరంగములను। చనిరి వారలు రామలక్ష్మణులు ఘనులు॥ 2

ఉ. సారస, చక్రవాక, బక సంఘనదీపులి నోర్వరాళులన్
కైరవనీరజాతఖగ కాండ విశాల సరోవరంబులన్
ధారుణి యూథబద్ధపృషతంబుల, శాతవిషాణఘోరసం
చారవరాహమాహిషగణంబుల, నేన్గుల వృక్షవైరులన్॥ 34

ఉ॥ చూచుచు దూరమేగి దివిసూర్యుడు వ్రేలెడిపశ్చిమవారలున్
జూచిరి రమ్యమెుక్క-కొలనున్ భువి యోజనవిస్తృతంబునున్
పూచిన పద్మపుష్కరసమూహములన్ గజయూథపంబులన్
వీచుల హంససారసవినిద్రకదంబ రవాకులంబునున్॥ 56

తే. లలితము ప్రసన్నసలిల మా కొలను నుండి। గీతవాదిత్రనిర్ఘోష మాతతంబు
వినగవచ్చెను వీనుల విందుగాగ। కానబడ రెవ్వ రచ్చోట కన్నుగవకు॥ 7

తే. అంత కౌతూహలముబుట్ట స్వాంతమందు। రాముడు మహాబలుండెల్ల లక్ష్మణుడును
మునిని 'ధర్మభృతం'నాము పూజ్యతముని। జేరి యడుగంగ జొచ్చి రా చిత్ర
మెరుగ॥ 8

తే. పృథివి నత్యద్భుతంబిది వింత యేమొ। అహహ కౌతూహలంబు మహత్తరంబు
పుట్టె మాకెల్లరకు దీని మహిమ వినగ। ఏమిది? వచింపు మాకు మునీంద్రచంద్ర॥

తే. చెప్పదగునేని విప్ర! మా కొప్పిదముగ। మరియు కాదేని యతిగుహ్యమగుగు
ణాఢ్య
లెస్స జెప్పుము ప్రభుష యీరీతి నిచట। వినబడగవచ్చు గీతంబు వింతయేమొ॥

తే. రాఘవుండిట్లు లడుగ ధర్మాత్ముడతడు। మునివరుండప్డు చెప్పంగబూనె నెలమి
తత్సరఃప్రభవంబు కృత్స్నంబు మదికి। నింపుగూర్పంగ భానుకులేశ్వరులకు॥10

తే. ఇదియు పంచాప్సరోనామ మెసగుకొలను। పృథుతటాకము సార్వకాలికమువత్స
నిర్మితంబిది "మాండకర్ణి"యు ననంగ। ధరణి వెలసిన మునిచేత తపము చేత॥ 11

తే. 'మాండకర్ణి' మహాముని మహితు డతడు। తపము తీవ్రంబు జేసె నిద్ధరణి, రామ
వాయుభక్షుడు సలిలసంవాసి యగుచు। పూని దశవర్ష సాహస్రముల్ మహాత్మ॥

తే. అంత దేవతలెల్ల రత్యంతముగను। ప్రవ్యథితులైరి సాగ్నిహోత్రాదులౌర
ఉలికి వారు పరస్పరం బాకట గూడి। చెప్పుకొని రిట్లు తమలోన చింతలెడల॥13

తే. 'తలప మనలోని యెవరియో స్థాన మితడు। గైకొనగగోరి సలుపునీ ఘనతపంబు'
అనుచు సంవిగ్నమతులరై యఖిలసురలు। తలచి రొక్క యుపాయంబు తపముం
జెరుప॥ 14

తే. మునికి నట్టు తపోవిఘ్నమును బొనర్ప। ప్రథిత పంచప్రధానాప్సరసల నపుడు
వింత విద్యుచ్చలితదేహకాంతివారి। బంపి రటకు నియోగించి వడిగ సురలు॥ 15

తే. అనఘు దృష్టపరావరు మునివరేణ్యు। అప్సరస లెట్టులో యేమొ యాచరించి
మదనవశ్యత్వమొందించి రదెను నెరిగి। సురల కార్యంబు సిద్ధించుకొరకు రామ॥

తే. అప్సరస లైదుగురును వారంత మునికి। పత్నులైరి మునీంద్రుడున్ వారి కపుడు
ఈ తటాకంబులోన నిర్మించెగృహము। ప్రీతి నంతర్హితంబుగా క్రీడగూడ॥ 17

తే. అప్సరసలైదుగురును వా రట్టిరీతి। గృహములోపల హాయి వసింపుచుండి
అల తపోయోగమున యౌవనంబు దాల్చి। చెలగి మునీంద్రు రమియింప
జేయుచుంద్రు। 18

తే. అటుల క్రీడింపుచుండెడి యప్సరసల। గీతశబ్దంబు భూషణోన్మిశ్రితంబు
మరియు వాదిత్రనిస్స్వనం బడియె రాము।వినబడు మనోహరంబుగా వీను గవకు।

తే. ఔర యాశ్చర్య మిది యంచు నా మునీంద్రు। భావితాత్ముని వచనంబు భాను
కులుడు
రాఘవుండు మహాయశుండోఘబలుడు। వ్యాదని గ్రహించె; నటులె సౌమిత్రి
యెంచె। 20

తే. ఇటుల కథలను చెప్పుకొం చేగుచుండి। వితత మాశ్రమమండలం బతడు గాంచె
క్షితిని కుశచీరసంపరిక్షిప్తమద్ది। బ్రాహ్మ్యయా లక్ష్మి సందీప్తమౌర యద్ది। 21

తే. సాధ్వి వైదేహితోడ లక్ష్మణునితోడ।మహితగతిజొచ్చి యాశ్రమమండలంబు
మునుల నెల్లరచే పూజ లొనర గొనుచు।నుండె రాముండు కీర్తిగుణోత్తరుండు॥

తే. మహిని శ్రీమంత మాశ్రమ మండలమున। నటమహర్షుల పూజలనందుకొనుచు
సుఖముగ వసింపుచుండి యా సూర్యకులుడు। సీతయును లక్ష్మణుడు వెంట
చెలగి రాగ॥ 23

తే. ఏగె నయ్యాశ్రమాల కా ఋషిజనాల। బాధలను మాన్ప రాముడా ప్రభు
వరుండు
మరలమరలను నెన్నియో మార్లుగాగ। నభయమొసగుచు విభుడు మహాత్ము
విడుదు॥ 24

తే. ఒకట పరిదశమాసంబు లొకట యేడు। నొకట మూణ్ణెల్లు నాల్నెల్లునొకటనైదు
నారు నేడును నెన్మిదియైన నెలలు। నొకట మాసాధికంబు నింకొకట మరియు
నర్ధమాసాధికం బుండె హాయి విభుడు॥

ఆ.వె. మునుల యాశ్రమాల వని నట్లు వసియించి
యానుకూల్యముననను హాయి గాను
రామచంద్రు డుర్వి రమియింపుచుండగా
నిట్టె గడచిపోయె నేండ్లు పదియు॥ 27

తే. ఆశ్రమంబుల నన్నింటి నటుల జుట్టి। సీతతోగూడ రాముండు శ్రీచెలంగ
మరల వచ్చెను పరమధర్మజ్ఞు డతడు। మునివరు సుతీక్ష్ణు నాశ్రమంబునకువిభుడు॥

తే. ఆత డయ్యాశ్రమంబున కటుల జేరి। మునుల పూజల నెలమిమై గొనుచు విభుడు
రామచంద్రు డరిందముం డా మహాత్ము। డటనె వసియించె కొంతకాలంబు వనిని॥

తే. ఆశ్రమంబున నటు లుండి యా విభుండు। వినయమున నొక్కనాడు తన్మౌని వరేణ్యు
ఘను సుతీక్ష్ణుని జేరి యా యినకులుండు। రాఘవుం డిట్టులనియె నా ప్రవిమలాత్ము॥

తే. ఈ యరణ్యానభగవాను డా యగస్త్యు। డనఘ! వసియించు మునివరుం డనుచు నేను
వినుచునుంటిని వారువారును సతంబు। చెప్పుచున్నట్టిమాటలచొప్పుబట్టి॥ 31

తే. అటవి యియ్యది గొప్పదియైనకతన। తెలియకున్నది మరి యా ప్రదేశమెదియొ
ధీమహితు డా మహర్షిదై పృథ్వివెలయు। పుణ్య మాశ్రమపద మెంద మునిప! కలదు? 32

తే. నీ ప్రసాదాన సీతయు నేను నితడు। తమ్ముడును గూడి యా యగస్త్యాశ్రమంబు
జూడబోయి మునీంద్రుని శుభదచరణ। జలజములకును మ్రొక్కంగ దలతుమనఘ॥

తే. పరము మునివరు నాతని దరిని నేనె। స్వయము శుశ్రూష యొనరింపవలయునంచు
గొప్పది మనోరథంబు నా కెప్పు డెడద। వర్తిలుచునుండు నిద్ది యవశ్యమనఘ॥

తే. అనుచు రాముండు ధర్మాత్ము డనగ వినుచు। ముని సుతీక్ష్ణుండు ప్రీతుడై యినకులేశు
దశరథాత్మజుతోడ దా విశదభంగి। పలికె ప్రత్యుత్తరం బిట్లు లలితఫణితి॥ 35

తే. నేనె నీవింక లక్ష్మణు నీదుసతిని। సీత గొనుచు నగస్త్యుని చెంతకరుగు
మనుచు రాఘవ నీకు చెప్పంగవలయు। ననుచు దలపోయుచుంటిని మనమునందు॥

తే. భాగ్యవశమున నీవె యీ మాట నిపుడు। నన్ను స్వయముగ నడిగితి వన్న రామ
ఇంక జెప్పెద విను మా మునీశ్వరుండు। ఘనుడగస్త్యుండు వసియించువనపదంబు

తే. దక్షిణంబుగ నడవి నీదారి బట్టి। ఇటకు నాల్గామడలదూర మేగ పిదప
ప్రథితమా యగస్త్యభ్రాతురాశ్రమంబు। కాంతివంతము నీ కది కానవచ్చు॥ 38

తే. అట స్థలప్రాయమైన వనాంతరమున। రామ! బహుపుష్పఫలముల రమ్యమగుచు
ధరణి నానాశకునినాదితంబు నగుచు। పిప్పలీవనశోభల నొప్పు నద్ది॥ 39

తే. కొలనులు ప్రసన్నసలిలముల్ వెలయు నచట। శివజలంబులు వివిధముల్ శ్రీ చెలంగు
హంసకారండవాకీర్ణమై సతంబు। చక్రవాకోపశోభితంబై తనర్చు॥ 40

తే. అచట నొకరాత్రియుండి పే రోలి యుషసునందె వనషండపార్శ్వంబు బాటబట్టి
యామ్యదిశగను యోజనం బరిగి చనుచు। ఘనమగస్త్యాశ్రమపదంబుగానవచ్చు

తే. పృథివి రమణీయ మా వనోద్దేశమందు। బహువిధపాదపసంవృతోర్వరను నచట
హాయి నిన్గాంచి రమియింప గలదు సీత। లక్ష్మణుండును నానందలహరి దేలు!

తే. రమ్య మట్టి వనోద్దేశకంగమందు। బహువిధపాదపసంకులంబందు రామ
ఋషి యగస్త్యుని జూడగోరెదవయేని! ఇపుడె నీవు బయల్దేరు మిద్ధచరిత॥ 44

తే. ముని సుతీక్ష్ణుని వచనముల్ విని ప్రమోదము. తమ్ముతో గూడ మునికిడ్డి దండమిడుచు
సానుజుండయి సీతతో నపుడె తరలె। రామచంద్రు డగస్త్యుని భూమి కరుగ॥ 45

తే. చూచు చందంపు వనముల చూడ్కులలర! రమ్యపర్వతములు నభ్రరంజితముల
పుడమి మార్గవశానుగంబులగు నదుల! మరి సరస్సుల పుష్కరభరితములను॥ 46

తే. అల సుతీక్ష్ణుండు జెప్పిన యట్టిపథిని। సుఖముగా వారు చనిచని సూర్యకులులు
చేర నొక్కట పరమసంహృష్టులగుచు। రామవిభుడిట్లు పలికెదా లక్ష్మణునకు॥ 47

తే. ఇదియె యాశ్రమపద మామునీశ్వరునిది। నిశ్చయం బామహాత్మునినిలయమిదియె
కానవచ్చును నా యగస్త్యానుజుండు। పుణ్యకర్ముండు నివసించు పుణ్యభూమి॥

తే. గురుతు లెయ్యవి ముని సుతీక్ష్ణుండు దెలిపె। ఈవనంబున కవియె గాన్పించుపథిని
సన్నతంబులు తరులు సాహస్రములుగ। పుష్పభారాన ఫలభారమునను వంగి॥

తే. పండబారిన పిప్పలీఫలసుగంధ। మిదియె కటుకోపయంబు వీతెంచు చూడు
అల్లదే పవనోత్క్షిప్తమగుచు వచ్చెగ। ఈవనంబున మనకు హాయిని నొసంగ॥ 50

తే. అచ్చటచ్చట గాన్పించు నవిగొ కనుము। జగతి పేర్చిన కాష్ఠసంచయములనఘ
మరియు దర్భలువైడూర్యవర్ణసములు। కోసినవి దోచు పథి నవే కొత్తలుగను॥

తే. అదియెవనమధ్యమందుకృష్ణాభ్రశిఖర। మనగ గనవచ్చుచూడుధూమాగ్రమౌర
ఆశ్రమస్థంబు త త్పావకంబునుండి। ప్రాకు దివి కది లక్ష్మణా పారజూడు! 52

తే. భువి వివిక్తంబు లల తీర్థములను ద్విజులు। స్నానమొనరించి యటనటస్వయము తామె
కోసిదెచ్చిన పూలతో వాసిమీర। ప్రీతి పుష్పోపహారంబు లిడుదు రరుగొ॥ 53

తే. త త్సుతీక్ష్ణుని వచనంబు తలచిపోల్ప। ఆ యగస్త్యునితమ్మునిదై నయట్టి
యాశ్రమం బిద్దియే యౌచుననఘ నాకు। దోచుచున్నది లక్ష్మణాధ్రువమిదేను॥

తే. దనుజవరుడయించె మన్మథునితరమున యన్న! లోకహితకామ్యబుద్ధి నల్లోకయశుడు
పుణ్యకర్ముండు చేసె నీ భూమిలోన! వాసయోగ్యంబుగాగ ఈ యామ్యదిశను॥

తే. ఇచట నేకము 'వాతాపి' 'యిల్వలుండు'! నాగ క్రూరులు రాక్షసు లధికబలులు
బ్రాహ్మణఘ్నులు ఘోరులు వంచకులును! చెలగి వసియించుచుండిరి రీతి నివత్స॥

తే. ఘోరమొనర్చి బ్రాహ్మణుడైన రూపు ఇల్వలుండు దల్ల సంస్కృతం బెలమి బలికి
శ్రాద్ధమునకనిపిలిచి బ్రాహ్మణులను! పిల్చు నాతడు మిగుల నిష్ఠురుడు వత్స॥

తే. మేషరూపున తమ్ముని మిగుల ప్రీతి! పట్టుకొనివచ్చి చక్క పక్వంబొనర్చి
శ్రాద్ధసృష్టంపువిధిని దా బ్రాహ్మణులకు! చక్క భోజనమిడుచుండు రక్కసుండు॥

తే. విప్రు లట్టుల భుజియించి విశ్రమింప! ఇల్వలుం డౌర 'వాతాపి యింకరమ్మ'
వెలికి నటుచును పేరెలుంగ గల గెలంగ! పిలుచు త ద్విప్రగర్భస్థితులవ తమ్ము॥

తే. అన్నవచనంబులవివినంత నౌరా! యసుర వాతాపి మేకనా యరచుకొనుచు
చెలగి విప్రులదేహముల్ చీల్చుకొనుచు! వచ్చు బయటికి విప్రగర్భములనుండి॥

తే. బ్రాహ్మణులు నిత్యమిట్లు సహస్రసంఖ్య! మొత్త మిప్పటి కెందరో మిత్తినోట
జని వినాశంబు నొందిరి వనమునందు! కామరూపుల పలలభుక్తుల కతన॥ 61

తే. అప్పు డమరు లగస్త్య మహర్షి జేరి! ప్రార్థనముసేయ మునియు నిల్వలునిపిలుపు
నొప్పుకొనిపోయి, శ్రాద్ధమం దొనర మెక్కి! జీర్ణమొనరించుకొని చంపె చెనటి
యసురు॥ 62

తే. 'తృప్తివడసితె'యంచు పృచ్ఛించి పిదప! మునికి హస్తోదకంబిచ్చిమునుపటటుల
'తమ్ముడా! రమ్మువెలికి వాతాపి'యంచు! పిలిచె తమ్ముని నౌరయిల్వలుడువడిగ॥

తే. అటుల తమ్ముని బిలుచు నా యసురు క్రూరు! విప్రఘాతుని నిల్వలు వీక్షజేసి
నవ్వుచు మహర్షి ధీమతుం డివ్విధంబు! పలికె నప్పు డగస్త్యు డా తులువతోడ॥

తే. వెడలిరా శక్తియేది నా కడుపులోన! చక్కజీర్ణించినట్టి రాక్షసున కింక
వినుము నీ తమ్ము డా మేషవేషుడోయి! యరిగె యమసాదనంబున కతిథిగాగ॥66

తే. అటుల తమ్మునిచావు నక్కటవచించు! ఋషివరుని వాక్యముల్ విని ఇల్వలుండు
క్రోధమువ నా మునీంద్రుని క్రమ్మిచంప! నురికె మీదికి తన్ని శాచరుడువడిగ॥

తే. ఆ మునిశ్రేష్ఠుపైకి దా నటుల నురికి! దీప్తతేజుని మునివరు ఋషివరేంద్రు
ననలకల్పంబులైన యా యక్షియుగళి! నిలువునిర్దగ్ధుడై యహా నిధనమొందె॥

తే. వినుము విశ్రుతకంప యే మునివరుండు। కర్మ దుష్కృత మిద్ధి దా గడగిజేసె
అట్టి మునివరుభ్రాతదీ యాశ్రమంబు। శివజలతటాక వనశోభ సెలగునిద్ది॥ 68

తే. చెప్పుకొనుచిట్లు లెన్నియో గొప్పకథల। వనిని జనుచుండ రాముండుభ్రాతతోడ
సూర్యుడస్తంగతుండయ్యె క్షోణికైకి। సాంధ్యకాలంబు నప్పుడే సరగవచ్చె।69

తే. భక్తి సంధ్యనుపాసించి పశ్చిమంబు। మరి యథావిధి యింక లక్ష్మణునిగూడి
చొచ్చె నాశ్రమపదము నారాధ్యకులుడు। మ్రొక్కె-మరియును తమ్ముతో మ్రొగ్గి
మునికి॥ 70

తే. లెస్స పూజలనందె మునీంద్రు వలన। ఆత డొసగిన మూలఫలాదికము
నారగించి మహీజతో హాయిమీర। రాఘవుండుండె నా యొక్క రాత్రియచట॥

తే. పోయి నా రాత్రి యట్టులగడచిపోయి। విమలమై సూర్యమండలం బిలకు వోప
మునియగస్త్యుని తమ్ముని రాముండు జేరి। సెలవునడిగెను వడిగ దక్షిణము జనగ॥

తే. మునిప! యభివాద మిదియె నీ కనుపమాన!। సుఖముగానుంటి మీరాత్రి క్షోణి
నిచట
సెలవొసంగుము పోయివచ్చెదము దేవ। గురుని నీయగ్రజునిజూడ గుణగణాఢ్య॥

తే. పోయి రమ్మంచుప్రీతి నామునియు ననగ। వెడలెరఘునందనుండు నయ్యడవిదారి
మరి సుతీక్ష్ణుండు జెప్పిన మార్గమంటి। వనములను జూచుకొంచు నాయినకులుండు

సీ. నీవారములవేల నీపాల, తినిశాల। మంజులతాళాల వంజుళాల
తిందుక, చిరిబిల్వ బృందాల, బిల్వాల,। పనస, మధూకాల భావుకాల
పుష్పితాగ్రిలతైక పుంజాలవేవేల। పారి, వేష్టితాల, బల్ పుష్పితాల
కరికరమృదితాల, కపికులజుష్టాల। అల మత్తశతశాంపజారవాల॥

తే. చండ్రవృక్షాల, మామిళ్ల సాలతరుల। బహుళకాంతారపాదపావళులనెన్నొ
నూర్ల సంఖ్యల జూచె మనోహరాల। తోవ నెల్లెడ లీల నా ద్యుమణికులుడు॥77

తే. అంత తనచెంతనున్న యా యనుజుతోడ। ప్రోడ రాముండు రాజీవలోచనుండు
పలికె వెన్వెంటవచ్చు నా ప్రబలుతోడ। లక్ష్మణునితోడ లక్ష్మివర్ధనునితోడ॥

తే. స్నిగ్ధపత్రంబులై యవే చెట్లుదోచు। శాంతగతితోచు మృగపక్షిసంతతులును
నాతిదూరంబ యనితోచు నామహర్షి। భావితాత్ముని యాశ్రమంబనఘయిటకు॥

తే. అచట సిద్ధులు పరమర్షు లల మహాత్ము। లెందరో దేహముల్ వీడి సుందరముల
నవ్య దేహంబులన్ దాల్చి నాకమునకు। జనిరి రవిసన్నిభవిమానచయము లెక్కి॥

తే. వినుము యశుత్వ మమరత్వమును ధరిత్రి। రాజ్యమును నిత్యవివిధఫలంబు లల్ల సురలు
భక్తిమై యాశ్రమానసావనిని నచట। తమ్ము గొలిచెడి సకలభూతమ్ములకును।

తే. వచ్చితిమి యాశ్రమపదంబు సచ్చరిత్ర। పోమ్ము ముందుగ నీవోయి తమ్ముకరరి
చెప్పుము ఋషీంద్రుతోడ నే సీతతోడ। ఇటకు వచ్చిన సంగతి నుటజమునను॥ 94

11 వ సర్గ సమాప్తి — (372)



తే. అరిజమనులు శుశ్రూషార్థ మనఘు మిమ్ము। చూడవచ్చిరి వారలు సూర్యకులుల
ఇంక యవ్వారికార్యమే మిందు గలదొ। చిత్త మెంక వినారె దేవ! వచింపవలయు॥

తే. శిష్యు డటుచెప్పగా విని బుషివరుండు। రాము డనుడు సలక్ష్మణుండై మహీజ
సీతతోడ మహాభాగ మాశ్రమంబు వచ్చెనంచు నెరింగి తా బలికె నిటుల 9

తే. అహహా! భాగ్యమువచ్చెనా! బహుదినమున। కాలమునకిట్లు రాముండు మనకు గనబడె
ఔర, మనసార నేనును నతని రాక। కోరికనె గాదె కాంక్షించి కొనుచుంటి।

తే. పొమ్ము! సత్కృతులోయి రాముండు సీత। లక్ష్మణుండును వేగ వారలను నిటకె
తోడుకొనిరమ్ము నాచెంత కేడ కింక। ఔర! నిన్నేల మునుము పోలేకపైతి 11

తే. ముని మహాత్ముండటు పల్కంగ నిట్లు। శిష్యు డభివాదమొనరించి శిరమువంచి
అటులె దేవ!యనుచు నత్యంత భక్తి। పలికె వినయాంజలి మొనర్చు లలితగతిని

తే. అంత శిష్యుండు నిష్క్రాంతుడై చనుచు కుటీరము కరుగ సంభ్రాంతుడై చను లక్ష్మణుని జూచి
'ఏడి శ్రీరాము డతడె దర్శింపవచ్చు। వచ్చి స్వయముగ ముని'నని భక్తిబలికె।

తే. అంత శిష్యునితోగూడ నరిగి వడిగ। ఆశ్రమద్వారమును జేరి లక్ష్మణుండు
అల్ల కాకుత్స్థు రాము నా యవనిజాత। సీత జనకాత్మజను జూపె ప్రీతి మునికి।

తే. ప్రశ్రయము పెల్ల శిష్యుండు భక్తిమీర। బుషియగస్త్యుని వచనముల్ చెప్పి చెలిమి
శీఘ్రమె సుసత్కృతిన్ ప్రవేశింపజేసె। ననఘు రాము సత్కారార్హు న్యాయరీతి।

తే. సీతయును లక్ష్మణుడు వెంట చేరిరాగ। అల ప్రశాంతమృగాకీర్ణ మాశ్రమంబు
చూచు చందందు నెల్లెడ చోద్యములను। చొచ్చె శ్రీరాము డాయగస్త్యునిపదంబు॥

ది. అట బ్రహ్మస్థాన మగ్నిస్థానంబు। ఇంద్రుని స్థానంబు చంద్రుస్థానంబు
అదె విష్ణుస్థానంబు నర్కు స్థానంబు। తత భగస్థానంబు ధనదు స్థానంబు
ధాతవిధాతల స్థానముల్ మరియు। వాయువు స్థానంబు వసువుల స్థాన
మా మహాత్ము ననంతు నా నాగరాజు। స్థానంబు గాయత్రి జనని స్థానంబు
వరుణు మహాత్ము నా పాశహస్తునియు। స్థానంబు ధర్ముని స్థానంబు కార్తి
కేయుని స్థాన మీక్షించుకొం చరిగి। చొచ్చె రాఘవు డగస్త్యుని యాశ్రమంబు।

తే. శిష్యపరివృతుడై యంత బుషియువడిగ। వెడలివచ్చె కుటీరంబు వెలుపలికిని
దీప్తతేజుల మునులముం దిటులవచ్చు। నామునీశ్వరు వీక్షించె రాముడెదుర॥21

తే. ఇదిగొ లక్ష్మణ! చూడిటు లెదురవచ్చు। ఋషి యగస్త్యుండు భగవాను డెరిగికొంటి
నితని సౌదార్యమున తపోనిధిని నంచు। లక్ష్మివర్ధను కనె యన్న లక్ష్మణునకు॥

తే. సూర్యవర్చసు నా యగస్త్యుని గురించి। యామహాబాహు డిటుపల్కి రామవిభుడు
పటు పరంతపు డా ముని పాదయుగళి। పరమసంప్రీతిబట్టె నా తరణికులుడు॥ 24

తే. అటుల ధర్మాత్ము డా రాము డవనిజాత। సీత వైదేహితోడ సంప్రీతిబొదల
తమ్ము లక్ష్మణుతోడ నా తపసికెరగి। నిలిచియుండె కరాంజలి లలిఘటించి॥ 25

తే. మునియు కాకుత్స్థు నతిథివర్యునిగ నొనుచు। ఆసనోదకములను దా నర్చ్య లొసగి
కుశలసంప్రశ్నమున్ జేసి కూరుచుండు। మనుచువచియించె ప్రీతి నయ్యార్యకులుని॥

తే. అగ్నిహూత మొనరించి యర్ఘ్యంబొసంగి। అలరి ప్రతిపూజసలిపి యయ్యతిథులకును
తద్ద ప్రీతి వానప్రస్థ ధర్మరీతి। భోజనంబిడె వారి కా మునివరుండు॥ 27

తే. అంతరట్టుల నాసీనులైన పిదప। బుధుడు ధర్మజ్ఞు డా మునిపుంగవుండు
రాము నాసీను విదితధర్మజ్ఞు ననఘు। ప్రాంజలినిజూచి పలికె నిట్లాతపస్వి॥ 28.

ఆ. అగ్ని వేల్చి, యర్ఘ్య మతిథికినిడి పూజ। సల్పవలయు, నటుల సల్పకున్న
కూటసాక్షిరీతి కుడుచు స్వమాంసంబు। నిహపరంబులందు నెట్టి తపసి॥ 29

తే. రాజవు సమస్తలోకాలకో జనేశ। మరి మహారథుడవు ధర్మచరితుడవును
మాన్యుడవు పూజనీయుడ వన్నిగతుల। వచ్చి తీవు ప్రియాతిథివై మహాత్మ॥ 30

తే. ఇటులబల్కుచు ఫలములపటుతరముల। మూలములపుష్పముల నన్యములను రాము
తనివి దీరగ పూజించి మునివరుండు। మరల నిటుపల్కసాగెను గురువరుండు॥

తే. ఇదిగొ దివ్యంబు చాపంబు హేమరత్న। భూషితంబు నరవ్యాఘ్రమున్నదీని
విశ్వకర్మయె నిర్మించె విభవయుక్తి। వైష్ణవంబు మహాధనువర్య మిద్ది॥ 32

తే. ఘన మమోఘము సూర్యసంకాశ మహహా। చూడుము శరోత్తమంబిది సూర్యవంశ్య
బ్రహ్మదత్తంబు నాకు శ్రీరామచంద్ర। ఇత్తు నీ కిది కొను మిదే యుద్ధతేజ॥ 33

తే. తూణు లక్షయసాయకోత్తుంగములను। కరము జ్వలియించు పావకు కరణికరకు
బాణముల పూర్ణముల నాకు మఘవుడిచ్చె। హేమభూషిత మసి యిచ్చెహేమ మొరను॥ 34

తే. ఈ ధనువుచేతనే మున్ను నృపలలామ! ఆజిని మహాసురుల విష్ణుఁడోజ చంపి
శ్రియము దీప్తంబు దేవతాబృందములకు! గెలిచియిచ్చెను రాజ్యలక్ష్మినికుమార॥

తే. త ద్ధనువు నింక తూణముల్ త త్శరమును! మఱియు త త్ఖడ్గమును నిత్తుమాన దుండ
కొనుము వీని జయంబు చేకొనగ రామ! వజ్రమును వజ్రిధరుడట్లుప్రభులలామ॥

తే. ఇటుల జెప్పి మహాతేజు డెలమికలిమి! త ద్వరాయుధములనెల్ల దాశరథికి
రామునకు నిచ్చి భగవాను డా మునీంద్రు! డా యగస్త్యుడు మరి యిట్టులనియె బ్రీతి। 37

12 వ సర్గ సమాప్తి – (409)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మూసికొండ రామాయణము

## అరణ్య కాండము

### ష ష మూ ష వ సర్గ (27)

♦ పంచవటీకిపోయి వసింపవచ్చునని అగస్త్యుండు శ్రీరామునకుజెప్పి నోత్రివజాపుట ♦

తే. రామ! ప్రీతోఽస్మి; కలుగు భద్రంబునీకు । లక్ష్మణా! పరితుష్టోఽస్మి రాజపుత్ర
నన్ను నభివాద మొనరింప చెన్నుమీర । వచ్చినారలు సీత యీ మాతతోడ॥ 1

తే. ఖేద మధ్వశ్రమాన నిర్ఘృణతమిమ్ము । రామ ! బాధించు నిదె ప్రచురశ్రమమ్ము 2
వ్యక్త ముత్కంఠబడుచున్న దవనిజాత । అల్ల మైథిలి సతి జనకాత్మజయును॥

తే. ఈమె సుకుమారి దుఃఖాలనెరుగ దెపుడు । ప్రాజ్యదోషము వనమిటు వచ్చియుండె
భర్తృసుస్నేహచోదిత స్వాంతయగుచు । రామ ! నీవెంట బాల ఈ భూమిజాత

ఆ. ఎటుల యీమె యిచట యిచ్చ రమించునో । సేయుమటులె రామ సీత యలర
దుష్కరంబుపనిని ధృవ మీమె సేయును । వనికి నీదువెంట వచ్చియిటుల॥ 4

ఆ. నరు సమస్థు గొల్తురి కరమనురక్తలై । పురుషుని విషమస్థు మరి త్యజింతుర
ఇదియె ప్రకృతి స్త్రీల కినవంశశేఖరా । సృష్టి మొదటినుండి చెబుదునిజము॥ 5

కం. మెరుపులలోలత్వంబును । కరకరి శస్త్రముల తైక్ష్ణ్య కాఠిన్యంబుల్
గరుడానిల శైఘ్ర్యంబును । ధరియింతురు యోషలెపుడు తథ్యము రామా ! 6

తే. ఈమె నీభార్య సతి మాత్ర మిట్టిదోష । ములకు గురిగాక వెలయుబో యలఘుచరిత
శ్లాఘ్య, వ్యపదేశ్య,యీసీత సతివతంస । దేవి సతి యా యరుంధతితీరుదనరు॥ 7

తే. నిజ మలంకృతమయ్యె యీ నెలవు రామ । నీవు సౌమిత్రిగూడి యీ దేవిసీత
మాతె వైదేహిగూడి విఖ్యాతి నిటకు । వచ్చివసింపగోరుట సచ్చరిత్ర॥ 8

తే. ఇటుల మునిపల్క రాఘవుండు వినయముగను । సంయతాంజలియై ఋషిసత్తమునకు
దీప్తమగుచుండు హోమాగ్ని వోలె దివ్యుడగుచు । ప్రేరితం బెట్లుపల్కె వాక్యంబు విభుడు।

తే. ధన్యుడ, అనుగృహీతుడ తాత! మైంచి । నాదు గుణముల నా తమ్ము నాదు భార్య
గుణములను నీవు పరితుష్టి గనుట జేసి । వరద! మునిపుంగవా కంటి ధన్యపదము।

తే. ఇంక నా కెఱిగెల్పు మే యరణ్యమందు। ధృతిని దాశ్రమపదము నిర్మించుకొనగ
నిరతము సుఖంబుగా వసియింప గలనో । అట్టిబహుకాననంబు బహ్వంబుపదము॥

తే. రాము వచనంబు నటవిని దాను మునీంద్రు । దప్పి చొక్కుముహూర్తంబు ధ్యాన
గతిని
చూచి ధీరుండు ధర్మాత్ము డా చతురుడు । ధీరతరవాక్య మిటుపల్కె దివ్యదృష్టి॥

తే. ఇటకు రెండామడలదూరమేగ నచట । తాత! బహుమూలవనఫలోదక మొకండు
బహుమృగం బద్ది దేశంబు బరగుచుండు। పంచవట్యభివిశ్రుతి బహుళకాంతి।13

ఆ. అచటి కరిగి యందె యాశ్రమంబు నొనర్చి। సీతగూడి తమ్ము ఖ్యాతిగూడి
అట రమింపగలవు పటుతర పితృవాక్య । సరణి పాలనంబు సలుపుకొనుచు। 14

తే. సమయమెయ్యది దశరథత్మ్యావిభుండు । ధృతిని నొనరించె నీ కట్టి దీక్షలోన
గడచియేపోయెగా చాలకాలమనఘ । మిగతకాల మిదెంత నీ కగుచు గడుప।15

తే. జగతి తీర్ణప్రతిజ్ఞుండ వగుచు నింక । హాయి వసియింతు వీవు రాజ్యానవత్స!
ధన్యుడు నిజంబు నీతండ్రి ధర తరించె। జ్యేష్ఠు నీచే యయాతి యానృపతిరీతి॥

తే. విదితమే నాకు వృత్తాంతమిది త్వదీయ।మనఘ! రాఘవా!; నీతండ్రిపయిననాకు
గలుగుస్నేహాన, మరియు నా ఘనతపః ప్ర। భావమునజేసి ఎరిగి తావార్తలెల్ల॥

తే. ఇచటనే నీవు నాతో వసింప్రమంచు । నెడదగోరుదు నైన నీ హృదినిగల్గు
కోర్కెదెలిసితి మత్తపోగురుతచేత । అగుటనే పంచవటికి పొమ్మంటి నిన్ను। 18

తే. అదియు రమ్యవనోద్దేశ మచట సీత । హాయి రమియింపగలదు పో యవనిజాత
శ్లాఘనీయము తత్ప్రదేశంబు మరియు । నాతిదూరము రామ! యిచ్చటికి కుటికి॥

తే. అదియు గోదావరిసమీపమందుగలదు । అచట రమియించు మైథిలి హాయిగాను
ప్రాజ్యమూలఫలంబు బల్ పక్షియుతము । లలి వివిక్తంబు పుణ్యంబు రమ్యమద్ది॥

తే. తగును నీకు సభార్యున కా స్థలంబు; । శక్తుడవు నీవు పరులరక్షణమునందు
కాన, వసియించు చా కానలోన నీవు । తాత! పాలింపగలవు పో తాపసులను॥

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### పదునాలుగవ సర్గ — (౧౪)

**త్రోవలో జటాయుని సందర్శనము - సఖ్యము**

తే. పంచవటి కేగు చిట్లొక్క వటమునందు । వనము మధ్యను శ్రీరాము డనఘు డరసె
తత మహాకాయు గృధ్రంబు వితతపక్షు । నుగ్ర భీమపరాక్రము నొక్క పతగు॥

తే. పతగుని పటుస్థు నా మహాభాగు లరసి । దాని రాక్షసుగా నెంచి దాశరథులు
రామలక్ష్మణు 'లోయి, యో భీమరూప । ఎవ్వడవు నీ వటంచు' పృచ్ఛించి రెసగి॥ 2

తే. అతడును మహాత్ము లవ్వారి నలరజేయు । భంగి మధురంబు సౌమ్యంబువాక్యపనర
'వత్స! యెరుగుము నన్ను నీ భవ్యపితకు । ప్రియవయస్యుం డనం చని ప్రీతి బలికె॥

తే. ఖగము నద్దాని పితృసఖుగా నెఱింగి । కరము పూజించి విభుడు రాఘవుడు భక్తి
అతని కులమును నామ మవ్యగ్రరీతి । నడిగె దెలియంగ కౌతుక మత్యంతమొలయ॥

తే. రాము వచనంబు విని గృధ్రరాజు నపుడ । సర్వభూతసముద్భవం బుర్వి తనదు
కులము నామంబు సర్వమా క్షోణిపతికి । రామునకు జెప్పె త ద్ద్విజరాజవరుడు॥ 5

తే. పూర్వకాలాన యో మహాభుజ మహాత్మ! ఎవ్వరెవరు ప్రజాపతుల్ సృష్టికైరొ
వారి నెల్లర దెలిపెద వరుసబెట్టి । ఆదినుండియు వినుము జనాధినాథ! 6

తే. ప్రథము డవ్వారిలోన కర్దముడు రామ । రెండవయతండు వినుము విక్రీతుడంద్రు
క్రిమత శేషుండు సంశ్రయుం డమితబలుడు । మఱియు బహుపుత్రకుండును వరలి
రనఘ॥ 7

తే. స్థాణుడు, మరీచి, యత్రి, విశాలబలుడు। క్రతువును, పులస్త్యుడును, నంగిరసుడు ఘనుడు
నను ప్రచేతసుడు, పులహుడును క్రమంబ। దక్షుడు, వివస్వతుడును తత్పదవిఁ గైరి॥

తే. అనఘ! 'యరిష్టనేమి' నామాంతరుండు। కాశ్యపుండు, మహాత్ముండు ఘనయశుండు
సృష్టికి ప్రజాపతిగనయ్యె చివరివాడు। ఘన మహాతేజుడతడు బల వీర్యయుతుడు॥

తే. అంత దక్షప్రజాపతి కిందుముఖులు। కూతు లరువదిమంది విఖ్యాతయశలు
కల్గిరంచు మహాయశా వల్గు తనులు। ఎల్లరకు విశ్రుతంబెగా వల్లభుండ॥ 10

తే. వారిలోన సుమధ్యల వల్గుతనుల। అదితి దితి యన దనువునా సుదతి కాళి
తామ్ర యన క్రోధవశయన తన్వి మనువు। ననలయన నెన్మదుండ్రి కాశ్యపుడు గొనియె॥ 11

తే. కాశ్యపుం డంత ప్రీతుడై కన్యలార। వినుడు త్రైలోక్యభర్తల వినుతయశుల
మత్సముల పుత్రులన్ గాంచు డుత్సవమున। ననుచు జెప్పెను వారికా కన్యకలకు॥

తే. అదితి తన్మనయయ్యె విఖ్యాతి రామ। దితియు మనుజర్షభా యట్లె మతి గ్రహించె
దనుజ కాళియు గొనిరి తద్వచన మెల్ల। మగుడ లమనస్కలైరి పో మిగతవారు॥ 13

తే. అదితిగర్భాన దేవత లుదయమైరి। ముప్పదియు ముగ్గురోలి రిపుందముండ!
ద్వాదశాదిత్యు లెనమండ్రు వసువులునిక। అశ్వినులజంట రుద్రులేకాదశులును॥

తే. దితియుగనె దైత్యులన్ పుత్రవితతి తాత। ఘనయశస్వుల, పూర్వ మీ ధాత్రితలంబు
వరద! వసుమతి సవనార్ణవం బిదెల్ల। వారిదై యుండె శ్రీరామ! భద్రనామ॥ 15

తే. దనువు గనియె నశ్వగ్రీవుడనెడి పుత్రు। నరకు కాళకు కాళికాతరుణి గనియె
క్రౌంచి భాసియు శ్యేనియు గలిగి రోలి। సుతలు తామ్రకు ధృతరాష్ట్రి శుకియు ననగ॥ 16, 17

తే. క్రౌంచిగనియె నులూకాల రామచంద్ర। భాసములగాంచె భాసి యిక్ష్వాకువర్య
శ్యేని గనియెను శ్యేనాల గృధ్రములను। హంసకలహంసలన్ ధృతరాష్ట్రి కనియె॥

తే. అల్ల ధృతరాష్ట్రియేగాంచె వల్లభుండ। చక్రవాకములను రామ! సార్వభౌమ!
శుకికి నతబుట్టె నతకు తత్పుత్రికనఘ। వినత సుతయయ్యె; విఖ్యాతినినకులుండ॥

తే. మృగియు మృగమంద హరియు నరేంద్రచంద్ర। భద్రమదయును మాతంగి భద్రగమన!
తరుణి శార్దూలి శ్వేతయు సురభి సురస। కద్రువలు క్రోధవశకైరి ఘనతసుతలు॥

తే. మృగి యపత్యంబులన్నియు మృగములయ్యె। చమరసృమరములును ఋక్షచయము లెల్ల
తాత ! మృగమందకిలను సంతానమయ్యె। హరికి హరులును కపులునపత్యమయ్యె॥
తే. భద్రమదకును తతగుణోన్నిదరి కనఘ । మరి యిరావతి యనెడి కుమార్తెపుట్టె
ఆమె కైరావతుండు మహాగజేంద్రు। డుదయమయ్యెను లోకనాథుండు రామ॥
తే. తాత మాతంగి సంతాన మాతతంబు । వినుము మాతంగములునయ్యె వీరవర్య !
కొండముచ్చులు వ్యాఘ్రముల్ కొడుకులయ్యె । సతికి శార్దూలికిని రామ ! సార్వభౌమ॥ 25
తే. శ్వేతకు దిశాగజంబులు తాత పుట్టె । వినుము రోహిణీ గంధర్వి యనెడివారు
సుతలు సురభికి బుట్టిరి శుభ్రియశలు । గోవులన్ గనె రోహిణి గుణగణాఢ్య !
వాజులన్ గాంచె గంధర్వి రాజవదన॥ 26, 27
తే. సురస నాగంబులన్ గనె శూరవర్య । పన్నగంబుల కద్రువ బడసె తాత
మనువుగాంచె మనుష్యుల మనుజవృషభ । బ్రాహ్మణ క్షత్రి వైశ్య శూద్రాళు లనగ॥ 28, 29
తే. అనల గనియెను పిండఫలాళి తరుల । వినత శుకికిని పౌత్రియా వీరవర్య !
కలికి కద్రువ సురస చెల్లెలు గుణాఢ్య । వీరివంశంబు జెప్పెద వినుమురామ॥ 30
తే. కద్రు వల్ల సహస్రశ్యు ఘను ఫణీంద్రు। క్షితిని మోసెడి యా యాది శేషుగనియె
గరుడు డరుణుడు నాగ యిద్దరుకుమారు। లుదయమై రోలి వినతకాసుదతికనఘ॥
తే. అరుణువలనను జాతుండనైతినేను । నాకు సంపాతి యగ్రజుండో కుమార
నను జటాయు వటంచు నీ వనఘ యెరుగు। వడిగలాడ శ్యేనీపుత్రకుడమహాత్మ॥
తే. అట్టి నేను సహాయుండ నగుదు రామ । వననివాసంబునను నీకు వలయునేని
ఇదియు దుర్గమకాంతార మీ ధరిత్రి । తాత మృగరాక్షసని షేవితమ్ముసుమ్ము॥
తే. లక్ష్మణుడు నీవు తాత యరణ్యమునకు । పోయియుండిన సమయాలపుణ్యసాధ్వి
సీత నీమెను నేను రక్షించుచుందు । నుగ్రవనమున నిచట మీ యుటజమునను॥
తే. అంతట జటాయువునురాము డాత్మవిదుడు। కరముపూజించి ముదమునకౌగలించి
పితృసఖిత్వంబు శకుని చెప్పినది చెవుల। సారె సారెకు వినసాగె సన్నతుండు॥ 34
తే. సీత మైథిలి గొంచు పక్షినిబలాఢ్యు । గొంచు పంచవటిన్ సమీపించె విభుడు
అగ్ని శలభాల దహింప నరుగు నట్లు। శాత్రవులగాల్ప నరిగె లక్ష్మణునిగూడి॥ 35

14 వ సర్గ సమాప్తి — (471)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### పదునైదవ సర్గ — (31)

**పంచవటిని ఆశ్రమ నిర్మాణము - ఆశ్రమప్రవేశము.**

ఆ. అటుల పంచవటికి నరిగి నానామృగ । వ్యాళయుతము రమ్యవనపదమ్ము
దీప్తతేజు తమ్ము నాప్తు నా లక్ష్మణు । గాంచి రాము డనియె నంచితుండు॥

తే. వచ్చినారము మన పంచవటికి నిటకు । మాకు ముని మహర్షి చెప్పిన చోటునిదియె
సౌమ్య! పుష్పితకాననస్థలము దీని । రామునేయక మునను జూడు లక్ష్మణుండ॥ 2

తే. దృష్టి సర్వత్రబరపి వీక్షింపు మోయి । నిపుణుడవుగా వనోర్వరల్ వెలయ దిరుగ
ఏ ప్రదేశాన మన కిట హృద్యముగను । హాయి నిర్మించుకొననగు నాశ్రమంబు॥

తే. దేవి వైదేహి హాయిగ నీవు నేను । నచట రమియించనగు నను తాదృశమ్ము స్థలము
సన్నికృష్టజలాశయం బన్న నీవు! చక్కజూడుము వెదకి ఈ చక్కి నెల్ల॥ 4

తే. కాంతమౌ వనరామణ్యకం బ దెచట । కలుగ జో స్థలరామణ్యకంబు నటులె
మరి సమిత్పుష్పకుశలు నిర్మలజలంబు । లెచటనుండునో చేరువ నచోటు గనుము॥

ఆ. ఇటుల రాము డనగ హితుడు లక్ష్మణుడును । కేలుమోడ్పు భక్తి లీలబట్టి
ప్రీతి మదినివెలయ సీతాసమక్షమం । దన్న కిట్లు పల్కె సన్నతుండు॥ 6

ఆ. బంటు నేను నీకు స్వామి నూరేండ్లకు । స్వయము నీవె చూచి స్థలము నిచట
'రుచిర మిచట గట్టు రుచిత యాశ్రమ'మని । సెలవొసంగు మీవు సేతు నటులె॥

తే. లక్ష్మణుండు మహాత్ము డీలాగు నన్న । వాక్యముల వించు సుప్రీతి వడసి విభుడు
హృది విమర్శించి చూచి చూపించె నొకట । ఉర్విసర్వగుణాన్వితమొక్కచోటు॥

తే. వనిని ఆశ్రమనిర్మాణమునకు గాగ । ఆక్రమించుచు రుచిర మా స్థలము నపుడె
హస్తమున బట్టి లక్ష్మణుహస్తములను। రాము డిటుపల్కె శత్రునిర్మూలనాణ మెరయ॥

తే. ఈప్రదేశమ్ము సమము సుశ్రీప్రదమ్ము । వృక్షముల పుష్పములను సంవృతము ఘనము
ఇచట ఆశ్రమపదము నిర్మింపనగును । శాస్త్రవిధి నింక వత్స' లక్ష్మణకుమార॥

తే. సూర్యసంకాశములు నివే సురభిగంధి । పద్మముల పద్మశోభితపద్మిని యదె
కానిపించును రమ్య మిా కానలోన । పారజూడు కుమార! ఆమూరమందె। 11

తే. భావితాత్ముడు ముని యగస్త్యార్య డౌర । చెప్పినట్లుగ నున్న దీ చెంతవనము;
ఇదియు గోదావరి, సుపుష్పవృక్షవితతి । రమ్యమైయొప్పు హంసకారండవముల
చక్రవాకోపశోభల నారసముల॥ 12

తే. గిరులు మృగయూథవితతుల కేకిరుతుల । ఫుల్లతరువుల రమ్యమై యల్లవోచు
మనకు నతిదూరమతిసమీపమును గాక। ప్రాంశువులు శౌక బహుకందరములు వీర

తే. తామ్ర సౌవర్ణరాజత ధాతువులను । నచ్చటచ్చట వెలుగుల నచ్చముగను
పరమభిత్తులనల్ల గవాక్షితంబు । లైన గజములపోల్కి దీ యగములొప్పె। 15

సీ. సాల, తాల, తమాల, కేళి, ఖర్జూ, రామ్ర । పాటల, హింతాల, వాటికలను
తిలక, చంపక, చూత, తినిశ, పున్నాగాశ్వ । కర్ణ, శమీ, కింశుకాదికముల
లికుచ, నీవార, కేతక, నీప, పార్ణాస । వనస, ఖాదిర, ధవా, స్వస్థములను
చందన, స్పందన, నందనవనతరు । బృందతుల్యాశోక బృందకములను॥

తే. పుష్పగుల్మలతాదిపరివ్యాప్తములను । తరుల నన్యోన్యనీరాశీలపనసల చయముల
తుంగశిఖరాల నొప్పు నుత్తుంగగిరుల। చూడుమ వెలక్ష్మణా! చాలచోద్యమయ్యె॥

తే. ఇది సుపుణ్యంబు నిదియు సుమేధ్య మనఘ।ఇదియుబహుమృగపతగనిషేవితంబు
ఇచటనుందును వత్స సౌమిత్రి నేను। హాయి యీపక్షినాథు జటాయుగూడి॥

తే. రాము డటుజెప్ప నాలించి లక్ష్మణుండు । కృతి మహాబలు డా పరవీరహంత
అచిరమున నాశ్రమం బదియన్నకొరకు । చక్క నిర్మించె నా వనస్థలమునందు॥

సీ. సంఘాతమృత్తికన్ చక్కగోడలు బెట్టి । కంబముల్ నిల్పి దీర్ఘంబులైన
వెదుళులవాసముల్ వెన్నునపోయించి । జమ్మికొమ్మలపైన జక్కబరచి

ఱెల్లుదర్భలపర్ణ । వితతిని పైగప్పి బిగియఁగట్టి
చదరంబుగాలోన చదియ దిమ్మెసగొట్టి । చక్కఁగా నలికి వెంపెక్కు శోభ

తే. రంగవల్లులదీర్చి రంగుమీర । ప్రీతుఁడయి యనుత్తమం బౌ ధరిత్రి
పూజ్య సన్నిభ లఘువిక్రముఁ డొనర్చె । పర్ణశాలను విపులంబు భ్రాతృవరుఁడు॥

తే. వేగ గోదావరీనది కేగి యపుడె । లక్ష్మణుం డల్ల శ్రీనిధి తక్షణంబ
స్నానమొనరించి పద్మముల్ సరసఁగోసి । పంక్తిఁజేకొని మరలి తా వచ్చె కుటికి॥

ఆ. అంత పుష్పబలిని శాంతిని నట్టుపై । మరి యథావిధిగను సరగ జేసి
అటులొనర్చినట్టి యా యాశ్రమపదంబు । చూపె నన్న కతఁడు శుభ్రయశుఁడు॥

తే. సౌమ్య మాశ్రమ మద్దాని సత్కృతంబు । సార్వభౌముండు త త్పర్ణశాలఁ జూచి
రామచంద్రుండు తమ్ముని ప్రజ్ఞ నరసి । సీతతోఁగూడ మిగుల హర్షించె నెడద॥

తే. కరము సంహృష్టహృదయుఁడై గాఢముగను । బాహువుల తమ్ము లక్ష్మణస్వామిఁ [గ్రుచ్చి
హృది నతిస్నిగ్ధగతి కౌఁగలించి ప్రీతి । పలికె నిట్టుల శ్రీరాము డెలమికలిమి॥ 27

తే. ప్రీతుఁడనునైతి నీయెడ; భ్రాత! నిట్టి । కార్యము మహత్తరము జేసి తాత్య నీవు
కను సమర్థుండ విందులకై కుమార! । యేమి యొసగుదు నిదె కౌఁగిలింత దక్క॥

తే. ప్రభుఁడవు కృతజ్ఞుఁడవును భావజ్ఞుఁడవును । మరియు ధర్మజ్ఞుఁడవును లక్ష్మణకుమార!
నాకు ధర్మాత్మ నీవిట్లు నాథుఁడవయి । యుండ నాతండ్రి మృతి నిక నొందనట్లు॥

తే. ఇట్లు లక్ష్మణుతో నని హృద్యముగను । లక్ష్మివర్ధనుఁ డల్ల యా రామవిభుఁడు
బహుఫలంబైన త త్పంచవటిని కుటిని । సుసుఖియైయుండె వశి మహాశుభ్రయశుఁడు

ఆ. కొంత కాల మట్లు కాంత యా సీతయు । లక్ష్మణుండు తనను రహిని గొలువ
పంచవటిని యుండె పరమధర్మాత్ముండు । దివిని యమరవిభుని దీప్తి దనర 31

15 వ సర్గ సమాప్తి — (502)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

# అరణ్యా కాండము

### పదునారవ సర్గ – (౧౬)

పంచవటి కుటీ నివాసము – హేమంతఋతు వర్ణన – గోదావరీ స్నానము

తే. రాఘవుండు మహాత్ముఁ డరణ్యమందు। సుఖముగా నట్లు వసియించుచుండ నంత
యరుగుదెంచె శరద్వ్యపాయంబునందు। ఇష్ట మయ్యెడి హేమంతఋతువు భువికి॥

తే. శర్వరి ప్రభాతమగు నుషస్సమయమందు। రఘుకులానందుఁ డొకనాఁడు రమ్యమల్లి
విమలగోదావరీనదిన్ ప్రీతిమీర। తీర్థమాడంగ నరిగె నుత్తేజలీల॥ 2

తే. వీర్యవంతుండు భ్రాత సౌమిత్రియపుడు। నమ్రుడై కేల కలశంబు నల్లబట్టి
అన్న వెనుకనె సీతతో నరుగుచుండి। పలికె నిట్టుల లక్ష్మణుం డలఘులీల॥ 3

తే. కాల మెయ్యది లీల నీకౌను ప్రియము। దేన సంవత్సరం బలంకృతిని వెలుగు
శుభము సంప్రాప్తిమయ్యె నీ క్షోణి కనఘ। అట్టి హేమంతమిది యెప్రియంవదుండ॥

తే. కరము లోకంబు నీహారపరుషమయ్యె। పృథివి సర్వంబు సస్యశాలినియునయ్యె;
ఔర! జలములు ననుపభోగ్యంబులయ్యె। చోద్యమిక హవ్యవహుడునుసుభగుడయ్యె॥

తే. పితరుల 'నవాగ్రియణ' పూజఁదృప్తిబరచి। అర్హకాలంబున కృతాగ్రియణకులగుచు
సత్పురుషు లిట్టి హేమంత సమయమందు। విగతకల్మషులగుచుందురి వినుతరీతి॥

తే. ప్రాజ్యకామంబు లవె జనపదములెల్ల। సరస సంపన్నతర గోరసంబు లవియె
ఇల మహీపాలు రదె చరియింత్రు దేవ। రహిని విజిగీషులౌచు యాత్రాస్థులగుచు॥

తే. చెలిమి సూర్యుండు నంతక సేవితంబు। దిశను దృఢముగ సేవింపదినదినంబు
ఉత్తరదిశాంగనయును సొంపొప్పకుండె। లలితవదనంబున విహీనతిలక యటుల॥

తే. దప్పిగొని చాల వనగజం బొప్పమీర। శుభ్రమూదకంబు శీతంబు సుఖముద్రావ
తొండమును సీటనానించి త్రోడుతోనె। తద్గిమంబోర్వ కెగలాగు తత్కరంబు॥

తే. ఇవియె జలచరవిహగంబు లీ వనోర్వి। జలసమీపాననుండియు చలి భయాన
సీట దిగకున్న వరకె యెంతేని భీతి। రణముచొరలేని పిరికివారలవిధాన॥ 22

తే. తద్ద యెల్లెడ హిమతమోనద్ధ మగుట। ధాత్రి నీహారతమసావృతంబునగుట
చూడగ పుష్పహీనములఖాతి క్షోణిజములు। దోచును విషుప్తములుగాచు నోర్వ
లుండ॥ 23

తే. బాష్పసంఛన్నసలిలలు; పటుహిమార్ద్ర। వాలుకంబులుతీరముల్ వరలి యిప్పుడు
విరుత విజ్ఞేయసారసవితతి యొప్పి। వెలయుచుండె సరిత్తు లీ విపినధాత్రి॥ 24

తే. వితతము తుషారపతనంబుకతన మరియు।రవి మృదుత్వంబుకతన శైత్యాధికమున
ఇక యగాధస్థమయ్యు పానీయకము జూడ।మరి యపేయంబెయగు రసవజ్జలంబు॥

తే. అవె జరాజర్జరితములు భువిని నిచట। శీర్ణ కేసరకర్ణికల్ శ్రీవిహీన
నాళశేషంబులు హిమాంబునాశితములు। పద్మముల నెల్లకుండె పద్మాకరములు॥

తే. అన్న! ఈకాలమున నరవ్యాఘ్రు డతడు। మిగుల దుఃఖసమన్వితుం డగుచురామ
నీయెడన్ భక్తి ధర్మాత్ముడా యశస్వి। భరతు డొనరించు తపమహో మనదుపురిని॥

తే. విడిచి రాజ్యంబు మానంబు పుడమి గల్గు। భోగములనెన్నొ వివిధముల్ పూని
తపము
నియమితాహారుడగుచు నిద్రిదుర్గడగుచు।కటిక చలినేల గూర్కు నక్కటికవిడిచి॥

తే. అతడు నీవేళ ధ్రువము నిత్యంబు లేచి। ప్రకృతిజనములు తనవెంట నంటిరాగ
స్నానమొనరింప నరుగు నుషస్సునందు। మనదు సరయూనదీతీరమునకు రామ॥

తే. పృథివి నత్యంత సుఖసుసంవృద్ధు డతడు।నిండుసుకుమారియుసుఖోచితుండుదలప
అపరరాత్రులనెటుల దా నకట వెడలి। మునుగు సరయూనదీతీర్థములనురామ॥ 30

జే. పద్మపత్రేక్షణుండు వీరాగ్రియాయి। నిరుదరుండు మహాత్ముండు గురుభుజుండు
శ్యామవర్ణుండు; ధర్మజ్ఞు డా మనస్వి। హ్రీనిషేధుండుసుకృతి జితేంద్రియుండు॥

తే. సత్యవాదియు ప్రియభాషి శత్రుహంత। మధురప్రకృతియు భరతు డీపృథివిగల్గు
వివిధభోగాల వర్జించి విభునినిన్నె। కోరి సర్వాత్మగతి నెప్డు చేరియుండు॥ 32

తే. స్వర్గ మును జేసెనయ్యె నీ భ్రాత కినఘ। భరతునకు తన్మహాత్మున కరుగుచునకు
వినుము వనస్థుడవయ్యు నీ ననుసరించు। తాపసత్వంబున సతంబు భూపుడతడు॥ 33

ఆ. తండ్రి గుణము గాదు తల్లిదే వచ్చును। దూషి జనుల కిన్న లోకవాదు
భరతు విషయమందు పరికించి చూడగా। యన్యవిధమయయ్యె ధన్యుడతడు॥ 34

ఆ. నాథ దశరథుండు పతి కెవ్వతెకు భర్త। భరతు డెవ్వతెకును మరి సుతుండు
అట్టి యంబ కైక యెట్టు లీ క్రూరిణి। కూరశీల యయ్యెట యూరకలిగె॥ 35

ఆ. ఇటుల లక్ష్మణుండు హృదిని స్నేహంబున। ధార్మికుండు పలుక తల్లి గురించి
మాత యెడల నిట్టి పరివాదముల్ విన। నిష్టపడక రాము డిట్టు లనియె॥ 36

ఆ. మధ్యమాంబ నెపుడు మరి యెవ్విధంబున। గర్హితవ్యగాదు కనుము తాత
ఇంక జెప్పు భరతు ఇక్ష్వాకు నాథుని। ఆ కథలనె మిగుల నాలకింతు॥ 37

తే. వినుమ దృఢవ్రతమైన నా మనసు మదేమొ। తాత! వనవాసమున నిశ్చితంబునయ్యు
తమ్ము భరతునియెడ స్నేహాసక్త మగుచు। బాలిశంబగుచుండు ఓ వత్స! మరల॥

తే. సంస్మరింపుదు నతని వాక్యముల నెపుడు। మధురముల చాల ప్రియముల మనోజ్ఞ
ములను
అమృతకల్పంబు లౌర హృద్యముల, నింక। విమలముల మనఃప్రహ్లాదనముల తాత॥

ఆ. ఎప్పుడు కలిసికొందు నింక నా మహితాత్మ। తమ్ము భరతు వీరు ధర్మనిరతు
మిత్రు నతని నింక శత్రుఘ్ను, లక్ష్మణా। నిన్ను గూడి మదికి చెన్నుదనర॥ 40

తే. ఇటుల విలపించుచు విభుండు నిటులుండు। చెంత గోదావరీనదిన్ జేరి యచట
సానుజుండయి సీత యా సతిని గూడి। స్నానమొనరించె కాకుత్స్థ డా నృపుండు॥

తే. తర్పణమొనర్చి జలముల దైవములను। పితరుల సమాహితాత్ములై ప్రీతినప్పుడ
యుదయమగుచుండు సూర్యు నా వినతయశులు। స్తోత్రమొనరించి రచట
శాస్త్రోక్తి సురల॥

చ. అటుల కృతాభిషేకుడయి యా సతి సీతయు లక్ష్మణుండు నన్
పటుతరభక్తి గొల్వ రఘువంశ్యుడు రామనరేంద్రు డొప్పె త
త్తటిని కృతాభిషేకుడయి తద్గిరి కన్యయు నందికేశుడున్
పటుతరభక్తి గొల్వ భగవానుడు రుద్రుడు నీశుడో యనన్॥

16 వ సర్గ సమాప్తి – (545)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### పదునేడవసర్గ — (౧౭)

శూర్పణఖాగమనము - అది రాముని చూచి మోహించి తనను భార్యగా గైకొనుమని కోరుట.

ఆ. అటు కృతాభిషేకు లగుచు నా రాముండు । సీత లక్ష్మణుండు ప్రీతి నెలఁగ
కోమలమృగములున్నట్టి గోదావరీ తటిన్ । విడిచి యరిగి రపుడ వడిగ కుటికి। 1

తే. స్వాశ్రమంబుఁ జేరి తత్క్షణము విభుఁడు । రాఘవుండు సలక్ష్మణుండై ఘనుండు
కర్మపౌర్వాహ్ణికంబు పుష్కలమొనర్చి । పర్ణశాలఁ బ్రవేశించె ప్రభువరుండు॥ 2

ఆ. అచట సుఖితుండై వర్తింప నా మహా । ఋషులు మునులు తనున్న నిరత మెలమి
భ్రాత లక్ష్మణుండు బహువిధకథలను । కొసరి తాను చెప్పుకొనుచు విభుడు॥ 3

ఆ. పర్ణశాలనల్లు ప్రభుడు సీతను గూడి । కూరుచుండియుండ గురుభుజుండు
రామచంద్రుఁడొప్పె రమ్యమా కాంతిని । చదలచిత్రతోడ చంద్రుడట్లు॥ 4

ఆ. కథలఁజెప్పుకొనుచు కమ్మగా నిట్టుల । రమణఁగూరుచుండ రాఘవుండు
అచటి కపుడె వచ్చె యాదృచ్ఛికంబుగా । రాక్షసియునొకతె తాఁగ యెవతో॥

ఆ. అదియు రాక్షసుండు నా దశగ్రీవుని । భగిని; శూర్పణఖ యనంగబరఁగు;
రాము జేరి త్రిదశసోము నా మోహాను। చూచె నట్టె యదియు చూడ్కులలర॥

శా. సింహోరస్కు మహాభుజుః రుచిముఖున్ శ్రీపద్మపత్రేక్షణున్
రంహో ఖేంద్రసమానగాము సుబలుఁ ఆజానుబాహుఁ జటా
సంహాత్యాయతమండలుః గనగబల్ సౌందర్య కందర్పతు
ల్యుఁ హృద్ధామ సుదారు నుత్పలవినీలుఁ రాము నింద్రోపమున్

సంస్థాపింగా సంకటాదు ప్రాక్షిపముకాల్లకేయున్ జూచి ని
సంకాక్యకీయు కామమోహిత యహో యయ్యెన్ మనుష్యాదియున్॥

మ. సుముఖుఁ జూచి దుర్ముఖి; వృత్తమధ్యు ఘటకుక్ష్యగ్రాంగి; సత్కేశు తా
మ్రమూర్ధజ; శ్రీయుతవిశాలాక్షు విరూపాక్షి; శ్రీ
తిమదుదాంచద్రూపు నా విరూప; నయసద్వృత్తున్ సుదుర్వృత్త; స
త్క్రమభాషుఁ గనియైకభాషిణి; ప్రియున్ కాద్రా ప్రియాదర్శన్య; బల
రమణీయస్వరు భైరవస్వర; యువప్రాయాఢ్యు నా వృద్ధ; చూ
చి, మనోజాంధకలబలె దారుణ రఘుశ్రీనాథు దా ననుతోడన్॥

తే. జటిపై తాపసరూపంబు నిటుల దాల్చి బహుపి శరచాపధరుడవై భార్యతోడి
ఎటుల వచ్చితి వీ దేశ మిాపు చెపుమ। రాక్షసనిషేవితం బిది కాన్రమోయి॥

తే. అనమనస్కృత్యమేమి నీ కౌరయిచట। ఇక యథార్థంబుగా నెప్పు మిా వటంచు
శూర్పణఖపల్కె బుజుబుద్ధిశూరవసుండు।సర్వమియు జెప్పగడగె రామాభ్విభుడు॥

తే. అనృతమెప్పుడు రాముడ కనఘు మతికి। సమ్మతముగాదు; మరి విశేషంబుజూడ
నాశ్రమస్థున కతని కా యవసనందు। శ్రీజనసమక్షమున నెప్పు జెల్లు నదియు॥

తే. కలడు దశరథుడను పేర క్ష్మావిభుండు। త్రిదశవిక్రము డతనికి ప్రియసుతుండ
నగ్రజుడ రాముడంన్రను నన్నవనిజనులు లక్ష్మణుడు తమ్ము డతడనువ్రతుడునాకు॥

ఆ. ఈమె భార్య నాకు భూపుత్రి వైదేహి। సీతయంచు భువిని ఖ్యాతిగాంచె
తండ్రి యా నరేంద్రుతల్లియు నాజ్ఞచే। వని వసింప నిటకు వచ్చినాము॥

ఆ. ధర్మకాంక్షినౌచు ధర్మార్థ మిట్టుల। నింపు నియతి యంత్రితుండ నౌచు
వచ్చి నాడవనము, వనిత నీ వెవతెవో।యెవని సుతవొ చెపుమ యెవని సతివొ॥

తే. ఇంతి! లావణ్యమనోజ్ఞాంగి వింక నీవు। రాక్షసివనంగదోచదు రమణి। నాకు
నే నిమిత్తంబు వచ్చితి విటకు వనికి। నా కీక యథార్థముగ జెప్పు నాతి నీవు। 20

తే. అంత మదనార్దిత కరంగి స్వాంతమందు। 'రామ! శాత్యార్థమిదియె నాదమ్యకథను
చెప్పెదను శ్రద్ధ వినుమంచు' చెప్పదొడగె। అప్పుడ రక్కసితనవైన యట్టికథను

తే. ఏను శూర్పణఖానామ మెసగుదాన। రాక్షసిని కామరూపిణి నో క్షితీశ
అడవి నిదియెల్ల నొంటరినై చరింతు। సర్వభూతభయంకరసరణి నెపుడు॥ 22

**తే.** రావణుండనుపేర మద్భాతవరలు। రాక్షసేశ్వరుడౌను బలాఢ్యుడౌను
విశ్రవసుపుత్రు డాతండు వీరవరుడు। వినియుందువుసీవు నాతని గురించి॥ 23

**తే.** సతతము ప్రవృద్ధనిద్ర నీ జగతినుండు। కుంభకర్ణుండు పటుమహాఘోరబలుడు
మరి విభీషణు డుండుధర్మాత్ముడతడు। రాక్షసుడెకాని రాక్షసప్రకృతిగాడు॥ 24

**తే.** వినుము ప్రఖ్యాతవీరులు రణములందు। సోదరులు నాకు ఖరదూషణాదులౌర!
నిన్నుగన్నదిమొదలు నాకన్నవారి। వీరినెల్లర విడిచి నిన్ జేరికొంటి॥ 25

**తే.** మదిని పురుషోత్తముని నిన్నుమరగియుంటి। భర్తృభావావనినుగోరి వనరుచుంటి
కైకొనుమునన్ను భార్యగా ఘనభుజుండ। విడిచివచ్చితినావారి విడకునన్ను॥ 26

**తే.** నేను స్వచ్ఛందబలగామినిని ధరిత్రి; । పటుతరోగ్రప్రభావసంపన్ననోయి
చిరము భర్తవు నాకగు మురుబలుండ। సీతతోయేమిపనిసీకు; నాతోరమ్ము॥ 27

**తే.** వికృత తగదు విరూప యీ వెలది నీకు। నేనె తగుదును నీకు నన్నింక రామ
భార్యరూపానజూడుము భావమందు। కైకొనుమునన్ను సంప్రీతి ఘనభుజుండ॥

**తే.** ఈపెను విరూప నసతిని యెడ్డెదాని। ఖర కరాళిని నిర్ణతోదరిని నింక
మానిసిని నీదుతమ్మునితో నరేంద్ర। పొదివిమ్రింగెద నిప్పుడే పోవుపీడ॥ 28

**తే.** పిదప పర్వతశృంగాల వివిధవనుల। చూచుకొంచును దండకక్షోణినిచట॥ 29
కాంతుడా! నీవునాతో వనాంతరములహాయి!విహరింపగలవోయియహరహంబు

**తే.** ఇటుల జెప్పగ విని నవ్వి యినకులుండు। మదిరవీక్షణ యూపె కిమ్మాడ్కిగాగ
చెప్పదొడగెను బదులు సొంపొప్పమదికి। వీరవర్యుండు వాక్యవిశారదుండు॥ 30

17 వ సర్గ సమాప్తి — (575)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### పదునెనిమిదవ సర్గ — (26)

**రామలక్ష్మణులా శూర్పణఖను కొంత పరిహాసముజేసి, అది సీతమీదికి రాగా, లక్ష్మణుండా శూర్పణఖ ముక్కు చెవులుకోసి పంపుట.**

తే. కామపాశావపాశిత కాంత నాపె। శూర్పణఖఁజూచి రాముండు శూరవరుడు
మృదువు స్వచ్ఛంబు వాక్యంబు హృద్య మపుడు। క్రమత జెప్పెను స్మితపూర్వకంబు నిట్లు॥

తే. భార్యగలవాడనమ్మ; నా భార్యయీపె। దయితినాకగు; నీయట్టి తన్వి కకట
సవతితో పొత్తు విను ప్రశస్తంబుగాదు। కరము సంతాపకర మది యరయు మమ్మ॥

తే. ఇడుగో నాతమ్ము డితడు లక్ష్మణుడుగలడు। శీలవంతుండు రూపసి శ్రీయుతుండు
వెంట భార్యను తేడదు; వీర్యయుతుడు। చూడు మాతని నీ వింక శూర్పణఖరో॥

తే. అంత యెరుగడు భార్యసౌఖ్యంబు మున్ను। ఇపుడు భార్యార్థి; తరుణుండు; విపులబలుడు,
రూపుచక్కనివాడు; నీ రూపమునకు। తగిన భర్తయు కాగల సొగసుగాడు॥

తే. ఇతని నాతమ్ము భర్తగా నిక భజింపు। సవతి పోరుండ దిక నీకు జగతి నెందు
విను వరారోహ! మేరువు నినుని కాంతి। పొందుమాడ్కి విశాలాక్షి పొందుమితని॥

తే. రాము డిటుజెప్ప వినుచు నా రక్కసియును! కామమోహితయగుట తక్షణము నందు
విడిచి రాముని, లక్ష్మణువేగ జేరి। పలికె నిట్టుల నతనితో లలితఫణితి॥

తే. నిజము వరవర్ణిని నేను నీకు తగుదు । నీదు రూపంబు దీనికి లేదె వినుము
యుక్తభార్యను; ననుగూడి యుర్వి నింక । సర్వదండకపోయిగా సంచరింపు॥ 7

తే. రాక్షసి వచింప నిబ్భంగి లక్ష్మణుండు ! వాక్యకోవిదు డప్పుడా వనితజూచి
శూర్పనఖ దాని కనువగు చొప్పుదనర । పలికె నిట్టుల నవ్వి యాపత్రిభుసుతుండు

తే. పరులదాసుడనగునాకు భార్యవగుచు । దాసివీవుకాగోరదలతువెట్లు?
ఆర్య డీ యన్న కేను నిత్యంబు వినుము । పద్మవర్ణిని! బంటనై బ్రతుకువాడ।

తే. అమలవర్ణిని! ముదిత! సిద్ధార్థవీవు । విను సమృద్ధార్థుడగు నార్య విభున కింక
చిన్న భార్యవునై కడు చెన్నుదనర । మరి చరింపు విశాలాక్షి! మమతదీర॥ 10

తే. ఈపెను విరూప నసతిని యెడ్డెదాని । మరి కరాళిని నిర్ణతోదరిని నింక
వృద్ధ యా భార్య నిప్పుడే విడిచినైచి । నిన్నె భజియించు నతడెప్డు వన్నెలాడి॥

తే. జగతి వరవర్ణినీ! విచక్షుణుడెవండు । రూప మిట్టిది శ్రేష్ఠంబు రోసి విడిచి
యో వరారోహ! మానుషయోషలందు।భావముంచును చెపుమయోభామ!నీవె॥

తే. లక్ష్మణుం డిట్లు పల్కకరాళియద్ది । నిర్ణతోదరి దద్దమ్మ నిజమె యనుచు
సర్వ మా మాటలను నప్డు స్వాంతమందు । నమ్మెపరిహాసమెరుగక కొమ్మయసురి॥

తే. కామమోహితయగుట రాక్షసియు వేగ । నరిగి యట పర్ణశాల నాయవనిజాత
సీతతోడను కూర్చున్న శ్రీనివాసు । రాము దుర్ధష శత్రుమర్దనున కనియె॥ 14

తే. ఈపెను విరూప ససతిని యెడ్డెదాని। మరి కరాళిని నిర్ణతోదరిని నౌర
ముసలిపెండ్లామునేబట్టి మరియు చీవు। నన్ను గైకొనకున్నావు వన్నెకాడ॥ 15

ఆ. నీవు జూచు చుండ నిప్పుడే మానిసి। మెలత దీని బట్టి మ్రింగినైతు
నిన్నుగూడిపోయి చెన్నొప్ప విహరింతు। సవతిపోరులేక; సరసరార॥ 16

తే. అనుచునె యలాతసదృశవీక్షణ కరాళి। చెలగి యా మృగశాబాక్షి సీతవైపు
పరుగుదీసె సుసంక్రుద్ధ పాపి యసురి। అల మహోల్కలు రోహిణి నలమునటుల॥

తే. మృత్యుపాశప్రతిమ నట్లు వెంట నంటు। త త్కరాళిని వీక్షించి తక్షణంబ
కుపితుడై రామచంద్రుండు ఘోర బలుడు। దాని నదలించి యిటుబల్కె తమ్ము తోడ॥

తే. క్రూరులు ననార్యులునునైన వారితోడ। కూడ దెప్పుడు పరిహాస మేడగాని;
ఇంక చూడుము వైదేహి యీ సుగాత్రి।ఎట్టులైనను బ్రతికెడు నట్టి తెరువు॥ 19

తే. నీవని విరూప నాత్మని తెంచి పోటు! ఇదె మహోదరి నతిమత్త నసురి బట్టి
ఇక విరూపను జేయ నీ వింపుగా పిదప! ప్రాణవలయు నరవ్యాఘ్రు ప్రాణు మిప్పుడే॥

ఆ. అన్న యిటుల చెప్ప నన్నన సౌమిత్రి। సుపుషజంకు మిగుల క్రుద్ధుడగుచు
అన్నచెంతనున్న నసిపుత్రి గైకొని! అసురిముక్కుచెవుల నంటగోసె॥ $2_1$

ఆ. అటు నికృత్తకర్ణనాసయునై యపుడు। శూర్పణఖయు బొబ్బ లార్పు చెలగ
వచ్చి నట్లుగాని వనములోనికి జారె। దీసిపోయె భామి దద్దిరనగ॥ 22

తే. రక్కసి విరూప మిగుల ఘోరాకృతిగను। శోణితోక్షితయూచు సంక్షుభితయగుచు
వివిధనాదంబుల నడించె వృథివి యద్భుత। ప్రావృషిని తోయదంబట్లు ప్రబలగతిని॥

తే. రుధిరధారలు బహుగతి వృథివిగార। ఘోరరక్కసి రాహుల నారబట్టి
బొబ్బరిల్లుచు గట్టిగ్గ చబ్బుడపుగ। వడిబ్రవేశించె తన్మహావనము ఘనము॥24

తే. అట జనస్థానగతు రాక్షసౌఘ సహితు। ఉగ్రసర్వను ఖరుని సహోదరు నొగి
చేరి యూపె విరూపిత క్షితిని జనియె। గగనమునుండి పిడుగుభంగిగ నిశాటి।

తే. రాఘవుం డట్లు తమ్మునితో రమణితోడ। వనికివచ్చుట తనన్నట్లు పట్టివాడు
మరి విరూపితసేయుట ఖరున కప్పుడ। శోణితోక్షిత భయమోహశోకకలిత
చెప్పె సర్వంబు భగిని తా కొప్పిక్షితిని। 26

18 వ సర్గ సమాప్తి – (601)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### పందొమ్మిదవ సర్గ — (౧౯)

**శూర్పణఖ బొబ్బరిల్లుచు చెంత జనస్థానమునందున్న తన యన్న ఖరునియొద్దకు పరువెత్తి మొరపెట్టుకొనుట - వాడు రామునిపైకి పదునల్గురు రాక్షసులను బంపుట.**

ఆ. ధరణి నట్లు పడినదానిని శోణితో । క్షితను మరి విరూప నతికరాళి
భగిని జూచి క్రోధపరవశుడై ఖరుం । డడిగె నిట్లు రాక్షసుడు గలంగి॥ 1

తే. లెమ్ము తెలుపుము నాకు సర్వమ్ము చెల్లి।విడు ప్రమోహమ్ము సంభ్రమమ్ముడుగుమబల
వ్యక్తముగ దెల్పు మెవ్వ డిబ్భంగి నీదు।రూపము విరూపమొనరించె పాపమనక॥

తే. ఎవడు తనజోలికేరాక యెటనో యున్న। కృష్ణసర్పంబు ననపరాధిని గడంగి
లీల పరిహాసమునకుగా వ్రేలికొనను। గొట్టు నాశీవిషంబైన యట్టిదాని॥ 3

తే. ఆశ మెడజుట్టుకొని కాలపాశ మెవడు। అన్న! మోహాన తెలియలేకున్నవాడు?
ఎవడు నిన్నిట్లు తాకి యిట్లెగసి మిడిసి।విషముఘోరంబు ద్రావె,హా వెలది చెప్పుమ॥

తే. కామరూపిణివిని కామగమన వీవు। సుబలవిక్రమసంపన్నవిభవ వీవు
మఱియు నంతకసమవు నిన్ దరిసి యెవడు। మించి నీకీ యవస్థ బట్టించినాడు॥ 5

తే. దేవగంధర్వభూతాదిబృందములను। ఋషులను మహాత్ములను మహావీర్యవంతు
డెవడు నిన్నిట్లు మరి విరూపిణిగ జేసె। చెప్పుమా వా డెవండో నా చెల్లి తెలియ॥

తే. నాకు విప్రియమొనరింప లోకములను। నర్థి వెదకినగాని సమర్థుడెవడు
గానిపింపడు నమరచక్రములనైన । పాకశాసనుడేగాని వానియబ్బ
అల మహేంద్రుడెకాని సహస్రనయను। డల్ల వజ్రయెకాని నా చెల్లి వినుమ॥ 7

తే. మార్గణంబుల జీవితాంతకములైన। వాని నిష్ఠుడై దీతు నెవ్వాని యసురు
సలిలముల జాల సంసక్తమిశ్రితమైన। వాలనోగి బీల్చు సారసపక్షి యటుల॥ 8

తే. శరసుసంస్కృత్తమరుష్మతై సంగరమున। బలిర నాచేత నిహతుడౌ వాని యెవని
రక్తము సఫేన మూ రుధిరంబు నింక। ద్రావు మేదిని తెలియంగ బలుకు నబల॥ 9

తే. ఇంక నాచేత రణమున నీల్గు నెవని। కాయమునను౦డి మాంసంబు కమ్మగాను
పెకికి తినగలవమ్మ నెంపెసగ నూడి। కాకి గ్రద్దలు సంతోషకలిత లగుచు॥ 10

తే. ఇష్టు డాహవమునకు నే సజ్జిలాగ। కొట్టియున్నట్టి కృపణు నికృష్టు బ్రోవ
శక్తు డెవ్వడు లేడు పిశాచములును। యక్షులను రాక్షసులను నయ్యమరతతుల॥ 11

తే. మెల్లగా తేరి తెలిపిని నల్లబోంది। చెప్పుమ వనమున నిన్ను నిర్జించి యిట్లు
దుర్వినీతుడు దుష్టుడీ యుర్వినెవడు। విక్రమించి కటా చేసె యక్రమంబు॥ 12

తే. చెలగి ఖరుడిట్లు పల్క యందులను మరియు। క్రుద్ధుడై పల్క యన్న యాఘోరు
ఘటుల
శూర్పణఖయను పించు బల్ శోకవశత। వాక్యమిటు పల్కె భగిని సబాష్పయగుచు

చ. తరుణులు రూపసంపదలధన్యులు బల్ సుకుమారులున్ మహా
బలులును పుండరీకవికచాంబకవక్త్రులు వల్కలాజినాం
బరులును కందమూలఫలభక్షులు దాంతులు తాపసుల్ మహా
వ్రతవరధర్మచారులును దాశరథుల్ విను రామలక్ష్మణుల్॥ 14-15

తే. పార్థివవ్యంజనాన్వితుల్ భ్రాతృవరులు। భువిని గంధర్వరాజోపముల్ మహాత్మ!
వారు మనుజులో లేక దేవతలో యన్న। నిశ్చయింపగజాల నే నిజము జెప్పుదు॥

తే. తరుణి సర్వాభరణభూషితాంగి తన్వి। రూపసంపన్న నారి వారుభయులకును
మధ్యగాన్పించె నాకు సుమధ్యమ యది। అక్కజంబది దోచు నా చక్కజూడ॥

తే. ప్రమద యద్దానిదైన కారణము బట్టి। వార లిద్దరు జేరి నా బలిమి నిట్టి
హా! యవస్థకు పాల్జేసినారురన్న! । క్షితి యనాథయమైనట్టిసతి వినట్లు॥ 18

ఆ. అనృజువృత్తయైన యానారి రక్తంబు। నిహతులైన వారి నెత్తురింక
ఆజిమూర్ధ్ని ద్రావ నాశింతు రుధిరంబు। ప్రీతి నింక విను సఫేన మద్ది॥ 19

ఆ. త్రావవలయు నేను రణమున నా నారి। నెత్తురి మరియు వారి నెత్తురింక
మొదటికోర్కె యిదియె ముఖ్యంబు నాకు సూ।నీవలనన యిద్ది నెగడవలయు॥ 20

తే. చెలియ లీరీతి రోషత జెప్పుచుండ। ఖరుడు క్రుద్ధుండగుచు రాక్షసులనష్ట
అంతకోపమువా మహాబలుల బిలిచి। చెప్పె పదునల్గురకు వారి కిష్టు డిటుల 21

తే. ఏవరో యిద్దరు నరులట యింతి నొకతె! వెంటనిడుకొని శస్త్రాస్త్రవితతి దాల్చి.
చీరకృష్ణాజినాంబరధారులగుచు।జొచ్చిరట ఘోరదండకక్షోణి నౌర

తే. మరితె దుర్వృత్త దానిని నరుల నిరకు। వారి నిద్దరి వధియించి త్వరగ రండు
వారి రుధిరంబు సేవించె నా భగిని ద్రావ।నిశ్చయించును త్వరగ మీ రేగు డింక॥

తే. ఇష్టమిదియె మనోరథం బింత కిప్పుడు। వినుడు నాచెల్లెలికి మీరు వీరులార
దీని నింకను కూడా స్వతేజమునన।కార్పవలయును శీఘ్రంబ శూర్పణఖకు॥ 24

తే. వెలగి పదునల్గు రా రాక్షసులును నంత। ఖరుని యాజ్ఞను శిరమున ఘనత దాల్చి
శూర్పణఖముందు నడవ వేచోరవ జనిరి।రాముడున్నెడ కిని లేరితాభ్రము లన॥

ఉ. వాడను తీక్ష్ణశస్త్రముల బట్టియు వేగి నిశాచరుల్ వడిన్
ధీరుని రాము నత్తితుని నిర్మలు నా సముదగ్రతేజునిన్
వారక శీఘ్రమే ప్రహారణంబులగొట్టగలేక నిల్చిరా
కేసి వెలుంగు నగ్ని దరికిన్ జనలేని వనేభముల్ బలెన్॥

19 వ సర్గ సమాప్తి — (627)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఇరువదియవ సర్గ — (25)

**ఖరప్రేషితులగు నా పదునల్గుర రాక్షసులను రాముడు సంహరించివేయుట.**

ఆ. ఘోర శూర్పణఖయు గుబగుబ మునుచని । రాఘవాశ్రమంబు క్రమత జేరి
సీతతోడనున్న భ్రాత లా యిద్దరిఁ । జూపె రాక్షసులకు చుప్పనాతి. 1

ఆ. రాము పర్ణశాల రహినుపవిష్టుని । ఘను మహాబలాఢ్యు గనిరి వారు
వనిత సీతతోడ వైదేహితోడను । లక్ష్మణాఖ్యుతోడ రాణవెలయ। 2

ఆ. అటులవచ్చియున్న నారాక్షసుల జూచి । రక్కసిని విరూప నక్కడ దరసి
దీప్తతేజు తమ్ము నాప్తు నా లక్ష్మణు।తోడననియె రాము శోడ కిటుల॥ 3

ఆ. సీతయొద్దనుండుమీ తమ్ముడా। యొక్కక్షణము మాత్రమింక చాపమూని
శూర్పణఖకిగాను చురచురవచ్చిన । ఈ నిశాటతతి వధించినైతు। 4

తే. రాము విదితాత్మ త ద్వాక్య మాలకించి । 'అటులె' యంచును నప్పుడా యన్నమాట
శిరమునఁ దాల్చి సౌమిత్రి త్వరగ నపుడె। చేసె సద్భక్తి రాముండు చెప్పినట్లు॥

తే. రాఘవుండును సుమహచ్చరాసనంబు । తరళచామీకరవిభూషితంబు నపుడ
సజ్యమొనరించి యచటి రాక్షసుల నరసి।పలికె ధర్మాత్ము డిట్టుల పటుతరముగ॥

తే. పుత్రులమమేము దశరథభూమిపతికి । అన్నదమ్ముల మిదె రామలక్ష్మణులము
వొచ్చినారము సీతతో చొరవ జేసి । దుశ్చరము దండకాటవీదూరభూమి। 7

తే. దాంతులము తాపసులము సదాయులమును । ధర్మచరితుల మీ వనధాత్రి నిచట
హాయి ఫలమూలభక్షులమై వసింప । ఏలహింసింతురీ మమ్ములిట్లు చెపుడ॥ 8

తే. మిమ్ముపాపాత్మకుల నిదే హింసకులను । నిక మహాహవమందు వధింపబూని
ఋషులదైననియోగాన నెసకమెసగ । వచ్చితి శరాయుధుండనై చొచ్చి యిటకు॥

ఆ. నిలుడు దుష్టులార నిలుడు మీ రచ్చటే । వలదు చెంత కింక చెలగిరాగ
ఆశగలదయేని ప్రాణాలపై మీకు । పారిపొండు దూరి పందలార। 10

తే. రాము తద్వాక్యముల విని రాక్షసులును । పదియునల్గురు వారలు పరమకుపితు
లగుచు బ్రహ్మఘ్నులా శూలహస్తులపుడు।పలికి రిట్టుల వాక్యంబు లుత్తరంబు॥

తే. ఖరునకు మహాత్మునకు మాదు దొరకు నీవు।క్రోధ మాకారకల్గించితె లుకనానె?
ఇదె రణస్థలి మాచేత నీల్గి నీవె । విడువగలవింక ప్రాణముల్ వడిగ నిపుడె॥ 12

తే. పెక్కురము మేము యుద్ధమం దొక్కరుడవు।నీవుమాముందునిలువంగనిక్కముగను
శక్తినీకేది? మరియింక సంగరంబు । సలుపుటనుమాట తలపెట్టనైన నగునె॥ 13

తే. రమ్మ రారమ్మ మా కరప్రకరములను । సుప్రయుక్తమ్ములౌ గదాశూలపరిఘ
పట్టిసమ్ముల నిప్డు నీ ప్రాణములను । వీర్యమును చేతిధనువును వీడగలవు। 14

ఆ. ఇటుల బల్కి వారుపటుతరక్రుద్ధులై। పదియునల్గు రసురులదరి పడుచు
చేతిశూలములనుక్షేపంబ వైచిరి।ప్రబలదుర్జయుడగు రాముపైన॥ 15

ఆ. అట్టిశూలములను నన్నింటి పదియునా। ల్గయినవాని ద్రుంచె నర్కకులుడు
అన్నియే నిశాతశరములకాంచన। వరవిభూషితముల బరపివిభుడు॥ 16

తే. రహి మహాతేజు డంతనా రామవిభుడు। సూర్యసన్నిభముల దీసెసూర్యకులుడు
వితత నారాచముల శిలాశితము లపుడ।పరమ సంక్రుద్ధుడగుచును పదియునాల్గ॥

తే. ధనువుగ్రహియించి, వంచి, యాదానవులను। లక్ష్యముగనెంచి చూచి యారామ విభుడు
విడిచె బాణాల వడిగ నింద్రుడుగడంగి।పిడుగుమొత్తంబు లడరించువడువు గాగ॥

తే. విశిఖములు రుక్మపుంఖముల్ వితతహేమ। భూషితంబులు దీప్తముల్ భూరిగతిని
రాక్షసుల వక్షముల్ చీల్చి రక్తసంప।రిప్లుతంబులునై బయల్వెడలివచ్చి
భూమిలో జొచ్చె పిడుగుల మ్రోతలడర॥

ఆ. భిన్నహస్తపదయుతులై చు భిన్నమూలద్రుమ । పటలియట్లుపడిరి యటనె వారు
శోణితార్ద్రమైనమేనుల విగతాసు। లగుచు వికృతరూపులగుచు జగతి॥ 20

ఆ. పరుసనట్లు ప్రదమిపడినవారినిజూచి। క్రోధమూర్ఛితయును ఘోరయగుచు
హాహలిపోయి మెకడయసురి శూర్పణఖయు। మరలజేసె భైరవస్వనంబు॥ 21

తే. అట్టులరచుచునా రెకా యసురిమరల । ఖరుని చెంతకు నేగి మహోర్తిగూరి
జగతిబడియె సనిర్యాసల్లకి యన । కొంచె మెండిన నెత్తురుగురుతులొలయ॥ 23

తే. అన్న చెంతకునేగి శోకార్తిగూరి । మాటిమాటికి నరచుచు మహిని గూలి
సస్వరంబుగ విడిచె బాష్పముల నసురి । కడు విషణ్ణంబు వదనంబు కందువార॥

తే. రణనిపాతితులైన యా రక్కసులను । చూచి నంతనె పరువిడి శూర్పణఖయు
నిఖిలరక్షోవధంబు తన్నిఖిల మప్డై । చెప్పె ఖరునకు భగిని యా చుప్పనాతి॥ 25

20 వ సర్గ సమాప్తి — (652)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఇ రు వ ది ఒ క ట వ స ర్గ — (22)

**శూర్పణఖ పాఱి మరల ఖరుని చెంతకు పరువెత్తి ఘోషముగ మొఱవెట్టుకొనుట.**

ఆ. పుడమి నేలల మరల పడిన శూర్పణఖను । కరము కోపదృష్టి ఖరుడు జూచి
అనుజ వికృత నా యనర్థార్థమాగత । నసురి నరసి పలికె వ్యక్తమిటుల॥ 1

ఆ. ఇపుడెగాదె బంపి తిట నీప్రియార్థంబు। శోణితాశనులను శూరవరుల
రక్కసులను వారి కెక్కడ మరియేల । యేడ్పుబొబ్బలివ్వి యింకనీకు॥? 2

తే। హితులు భక్తులు ననురక్తులెపుడునాకు। వారలామలను జంపెడివారె కాని
యొరులచే జచ్చువారు గారోసివినుము। చేయకుండరు వారు నా చెప్పుచొప్ప॥

తే॥ ఏమికారణమో విననింతి వలతు। మరల "హానాథ" యంచు బొబ్బరిలు చిట్లు
ఏమొ మునిగినయట్టుల యేడ్చియేడ్చి। పుడమి సర్పంబుభాతిగా పొరలెదీవు॥ 4

తే. నేను నాథుండనై యుండ నీవు నిటుల। ఇక యనాథయబోలె యేడ్తేల చెప్పుమ;
లెమ్ములెమ్మిక, భయపడ కమ్మ చెల్లి। విడువు వైక్లబ్య మబల పో విడువుజడిమ॥5

తే. ఇటుల జెప్పుచు ఖరుడు నా యింతి నెలమి। నూరడింపంగ దుర్ధర్షక్రూ యసురి
నయనజాస్రుల తుడుచుకొం చన్నతోడ। పలికె నిట్టుల భగిని యా ఖలునితోడ॥

తే. ముక్కుచెవులను నేను గోల్పోయి యిట్లు। శోణితౌఘపరిక్లిన్నమైన మేన
నీదు చెంతకు రాగ నన్నివు నిజమె। యూరడించితి వన్న పెంపారు ప్రేమ॥ 7

తే. పంపితివి కూడ మిగుల కోపంబుగదుర। మత్ప్రియార్థంబు వీరుల మహితబలుల
రక్కసులను చతుర్దశ రంహసులను। రామలక్ష్మణులనుగూల్ప; భూమిగల్ప॥ 8

తే. వారు నెంతయు రామస్థ శౌర్యసారముల శూలపట్టినవారుగా నారెవ జనియు
సమరమున మర్త్యమాత్రుడౌ నాయకముల చచ్చి రంచు రాముచే: చత్తురెట్లు?॥ 9

తే. క్షణములోపలనే యట్లు చచ్చిపడిన: ఆ మహాబలులను నీవు భీమభటుల
గాంచినను రాముడా మహాత్మ్యాచర్య మద్ది! యరసియును రాక్షసగర్వ మహా
శ్చయంబు॥

తే. కాకు సమహద్వేగ్నవైతి నా మొదడనన్న!! చాలమదిలోన వినుము విషణ్ణనైతి
కాకు జెందితి మరల నిన్ను సబలాక్ష్య! చూడనెంచుచు భయమె చెల్లాచుచుంటి॥

తే. శోకవిషాదగ్రినతాప్యుషితము రన్న! మరి పరితాపిస తుందాలి మాలినియును
ఘోర మీా శోకసాగరం బిందు చిక్కి! మునిగియుంటిని పోవిదా ముప్పుగడిపి॥

తే. అకట నాకొంటవచ్చిన ప్రకటబలులు! రాక్షసుల్ పిశితాశనుల్ రూక్షవపులు
నిశితశరముల రాముచే నిహతులగుచు! నేలపాలైరి యింక నే లీలనేస్తు: 13

తే. అన్ననాయందు నీకు నా యసుసులందు! కరుణగలదేని రామునితో సరిసమాన
శక్తి తేజంబుగలదేని చంపు మిప్పుడె! దండకారణ్యనిలయుడై యుండు రాము!
నా నిశాచరకంటకు నంటినీవు! 14

తే. రాము నాతని నా శత్రు రాచిన్నైవ! కింక నీవూరకున్న నే నిచ్చ డిసిగా
నీ సమక్షంబునందె నందియ మి కేల! విడుతుప్రాణాల సిగ్గి విసుము రన్న॥15

తే. బుద్ధిపరికింప నీవు రామునకు నెదుట! నా మహాత్ముని యెదుట నాహవమునందు
సబలుడవునయ్యు నిలువంగ జాలవంచు! తోచుచున్నదినాకు; పో దోషచరుడ॥

తే. శూరమానివి నీ వహో శూరు డటుల! డాంబికంబు మిథ్యారోపితంబునైన
విక్రమంబున తిరిగెదు; విరువలేవు! మనుజులౌవారి రామలక్ష్మణులనాజి॥ 17

తే. వరునిరామునితో సమానంబునీకు! శక్తి తేజంబుగలదేని శుభచరుండ
దండకారణ్యనిలయుడై యుండు రాము! వధమొనర్పుమురా కులపాంసనుండ!॥

తే. వెడగ! నిస్సత్వుడవు నల్పవీర్యుడవును! ఇచట నీ కౌర యునికి యిం కెట్లుచెల్లు?
పొమ్ము పొమ్మిమ్ము జనస్థానభూమివిడిచి! త్వరితగతిసిన్ను బాంధవతతిని గూడి! 19

తే. రాము తేజోభిహతి వేగ రాలె దీవు! దాశరథియొప్ప తేజ ముదారమొలయ
వినుము తతోనదరుమహావీర్యయుతుడు!పట్టి నను జేసె యిటు విరూపగ నశండె॥

తే. ఇటుల విలపించి బహుగతి యింతి యసురి!బవరి తత్త్రపృథితోదరి యుదర మరరె!
శాముకొంచును కరముల శాపురంచు!రోదనము జేసె భృశ మహో! ఖేదమొంది॥

21 వ సర్గ సమాప్తి — (674)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### ఇరువదిరెండవ సర్గ – (26)

**ఖరదూషణులు పదునాల్గువేల రాక్షస సేనతో రామునిపైకి నడచుట.**

తే. ఇట్టు లాధర్షితుండయి భృశ మతండు। రాక్షసులమధ్య నపుడు శూర్పణఖచేత;
ఖరుడు ఖరుడయి ఖరతర సరణి బలికె। వచన మిట్టుల శూరుడా భగిని తోడ॥

తే. నీకు గలిగిన యవమాన మేక రీతి। క్రోధ మతులంబు గల్గించె రూఢి నాకు
దాని ధరియింప శక్య మింతేని కాదు। అదె మహోత్థితమా లవణాంభమట్లు॥ 2

తే. గణనసేయను రాము విక్రమమునందు। క్షీణజీవితు డతడు హో మానవుండు
ఆత్మదుశ్చరితాల ప్రాణాలనిపుడె।విడుచు నాతడు హతుడయి వెలది చూడు॥ 3

తే. బాష్పముల వీని నీ వింక బాపుకొమ్ము। సంభ్రమమ్మును నైతము చాన విడువు
రాము నింకను నాతనిభ్రాతతోడ। సరగబంపుదు నిదె యమసాదనంబు॥ 4

తే. యుధి పరశ్వధహతుని సకోష్ణరక్త। రుధిర మా మందజీవుని నధిక ప్రీతి
ద్రావెదవు నీవు రాముని దాడిలోన। రాక్షసీ కొంచ మెటులో యోర్వంగదమ్మ॥

తే. ఖరుని వదనాచ్చ్యుతంబు వాక్యంబు దాని। విని మనంబున మిగుల ప్రహృష్ట యగుచు
మౌర్ఖ్యమున నా నిశాటియు మరల బొగడె। రక్షసాంవరు భ్రాతనారూక్షుదక్షు॥

తే. పరుషితుండయి మున్నట్లు భగిని చేత। మరి ప్రశంసితుడై యుష్ణ మరల ఖరుడు
పిలిచి దూషణనాము నా పృథుబలాఢ్యు। సైన్యపతి యాతనికి నిట్లు సరగ బలికె॥

తే. అల చతుర్దశసాహస్రసంఖ్యబలులు। నాకు చిత్తానువర్తులు శీకరులును
ప్రకటతేజులు యుధి ననివర్తులెందు। భీమవేగులు రాక్షసుల్ వెలయుచుండ్రు॥ 8

తే. సింహముఖాశ్వవక్త్రులు నిరుపములును । లోకహింసావిహారులు నాకిగలరు
కామరూపస్థులు బలయుతు లుగ్రతేజు లసురవరులెల్ల ఘోరులు నసమయశులు॥

తే. దానవుల కెల్ల శార్దూల దర్పమణచు । నా మహాత్ముల కా మహౌజసుల కెల్ల
నాకు పలికెడు వ్యక్తిత్వలక్షణంబు । సామ్య చేయింపు నన్నా మహాత్ము మనికి॥ 10

తే. నాకు తెప్పింపు మిక్క శస్త్రంబు లనఘ । ధనువులను బాణములను చిత్రములనింక
ఖడ్గముల కేలు పట్టు ముద్గరముల నాని । శితతరంబుల శక్తుల తెప్పి మిప్పుడె॥ 11

తే. అల మహాత్ముల పౌలస్త్యులందరికిని । * ముందు పోగోరుదు రణంబునందు నేను
క్షణదచర వధంబుకొరకై రాము నిప్పుడె పట్టి (1) దుర్వినీతుని రణకోవిదుడను గొందు॥(2)

ఆ. అనుచు ఖరుడు చెప్పుచునె యుండె నంతలో । సూర్యవర్ణ మొప్పు శుభ్రరథము
దూషణుండు తెచ్చె తురగరత్నంబుల । చిత్రవర్ణములను చెలగుదాని। 13

ద్వి. మేరుశృంగాకార మా రథం బపుడు । తప్తకాంచనభూషితంబైనదాని
హేమచక్రంబుల నింపైనదాని । ప్రకటమై వైడూర్యకూబరములదాని॥
కాంచనద్రుమముల గంధమీనముల । శైలాల, పుష్పాల చంద్రసూర్యులను
మంగళాంచితపక్షి సంఘాలలీల । తరళతారాగణ స్థగితంబుదాని॥
నిస్త్రింశసంపన్న నిఖిలమౌదాని । కింకిణీక పతాక సంఘమౌదాని
అతివిశాలంబునై నమరినదాని । ఉత్తమోత్తమవాజియుక్తమౌదాని
సామర్షమున నెక్కె సరగ నా ఖరుడు॥ 14–16

తే. ఘనుని రథస్థుని నాతని గాంచి నంత । రాక్షసులు భీమవిక్రముల్ రూక్షవపులు
ఖరుని మరియును దూషణునురుబలాఢ్యు । చుట్టు నిలిచిరి శూరులు సుభటతతులు

తే. ఖరుడు నంత రథస్థుడౌ కటకమరసి । ఆ మహేష్వాసులను తేరి పారజూచి
ఘోరవర్మాయుధపతాకవారమరసి । 'వెడలుడిక' నంచు నాజ్ఞ దా నిడియె ననికి॥

తే. అంత నా రాక్షసుల సైన్య మెంతొ పొంగి । ఘోరవర్మాయుధధ్వజవార మద్ది
పొరలి వెడలె జనస్థానభూమి నుండి । పటు మహానాద మౌర మహాజవంబు॥ 19

* విశేషార్థము :—

రాముని పుడెపట్టి = రాముని పట్టుకొని (బంధించి) – (1)

రాముని అనుసరించి —— (2)

కొందు = (పట్టుకొని తీసుకువచ్చెదను; భక్తితో స్వీకరింతును–)

సీ. ముద్గరంబుల ఖడ్గముల తీక్ష్ణపరశుల । సురియల పరిఘుల శూలములను
పట్టిసంబుల చేతబట్టిన శక్తుల । తోమరంబులయు సందోహములను
ఘోరంబు లతిమాత్రకోదండకాండాల । ముసల గదాసి సముత్కరాల
కరగృహీతాశనిసరణివజ్రంబుల । భీమదర్శనముల బెంపుదనర।

తే. అల సుఘోరంబు త ద్రాక్షసుల బలంబు। వేలుపదునాల్గు వెడలె సలీలమప్పు డ
త జ్జనస్థానమునునుండి త్వరితగతిని । భక్తి ఖరునకు చిత్తానువర్తియగుచు।20-22

తే. త్వరితగతివేగు తత్ సైన్యవార మరసి । రాక్షసుల భీమవిక్రమవ్రాతమరసి
ఖరుని రథమది కించిత్తు పిదుదుగాగ । నరిగె సైన్యంబు వెంట దెంపారుప్రతిభ॥

ఆ. ఖరుని మతిని నెరిగి సరగ సారథియును। తోలె సుశ్రములను తొందరగను
తప్తకాంచనాంగదాదిభూషితముల। శబళములను, హయుల సబలములను॥ 24

తే. ఖరుని రిపుఘాతకుని రథం బురుజవంబు। త్వరితగతితోలబడి యట్టు లరుగుచుండి
ఘోరశబ్దాన పూరించె నౌర దిశలు।మరియు ప్రదిశలు భూనభోంతరము లెల్ల॥

వంశస్థ వృత్తము

ప్రవృద్ధమన్యుం డగు చా ఖరుండునున్। ఖరస్వనుండై రిపునాశనార్థమై
త్వరన్ జనన్ సారథి దా నడల్చుచున్। యమంబడో మేఘుంబు శిలాప్రవర్ష మో!
యనన్ ఘనం బార్చె, మహాబలుం డటన్॥ 26

22 వ సర్గ సమాప్తి — (700)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఇరువదిమూడవ సర్గ — (23)

**యుద్ధమునకు బయలుదేరిన ఖరునియెదుట అపశకునములు తోచుట.**

తే. అటు జనస్థానమునుండి చటులగతిని । బయలువెడలిన రాక్షస బలము మీద
శోణితోదక మశివము వానకురిసె । తుముల మేఘంబు గర్దభధూసరంబు॥ 1

తే. ఖరుని రథమునగట్టిన తురగములును । తన్మహాజవములు నష్టదైవగతిని
జారిపడియెను నేలపై సమతలమున । రమ్య సుమచిత రాజమార్గంబునందు॥ 2

తే. శ్యామవర్ణము రుధిరపర్యంత మొకటి । చూడగ నలాతచక్రంబు చొప్పు నొప్పి
కలిగె పరివేషణము దివాకరుని జుట్టి । ఆకసంబున నప్పుడు భీకరముగ॥ 3

తే. హేమదండము మరి సముచ్ఛ్రితమునైన । ధ్వజముపైన మహాకాయమమరనొక్క
గృధ్రము సుదారుణంబది యెచట నుండొ । చండగతివచ్చి వ్రాలి కూర్చుండె
నటనె॥ 4

తే. ఇక జనస్థానమునకు సమీపమునను । చేరి ఖరనిస్వనంబుల క్రూరగతుల
విస్వరంబుల వివిధముల్ వెలయజేసె । మాంసభక్షులు మృగపక్షివారములును॥ 5

తే. యాతుధానుల కెల్లర కశివముగను । భైరవస్వనములు జేసె పట్టపగలె
రవి వెలింగెడిదిక్కు నోరలనునెత్తి । నక్కలు మహాస్వనంబులు మొక్కలములు॥

తే. మూగి భీమవలాహకంబులును నపుడు । డవి ప్రభిన్నాద్రిసంకాశదీప్తి దనరి
తోయశోణితధారిణులై యొనర్చె । ఘనతరాకాశమును ననాకాశముగను॥ 7

కం. తిమిరము ఘోరము నద్భుత । మమరెను మరి, రోమహర్షణమ్మును గాగన్
సమముగ దిశలును విదిశలు । సుముఖములుగా వెల్గవయ్యె సువ్యక్తముగాన్। 8

సీ. క్షతజార్ద్రసమవర్ణకాంతిని సంధ్యయు । మరి, యకాలంబునం దవరె! వెలిగె
ఖరునకు నెదురౌచు ఖగములు ఘోరముల్। మృగపక్షులు వాపోయె మిక్కిలిగను
కంక గోమాయులు నింకను గృధ్రముల్। భయసూచకంబుగా "బాప్ర"రనియె
అనిశము రణముల నశుభముల్ ఘోరమ్ము । ప్రాంతముల్ నక్కలు పలికెగాక॥

తే. మంటలను గ్రక్కునోళ్ల సమాంతముగను। వచ్చి సేనాముఖంబున బలిసి నిలిచి
బెదరి వాపోవునట్లు లా యదవనంబు ! కూరు బాహుశిరము భూతలము గుండె
లదర 10

సీ. ఉరు పరిఘాభాస మొకే కబంధము సూర్యు । చెంతను కాన్పించె చిత్రముగను
పటు మహాగ్రహ మల్ల స్వర్భాను డప్పుడే। పట్టె నపర్వాన నిట్టె సూర్యు
వాయువు శీఘ్రమే ప్రతికూలముగ వీచె। మరి, దివాకరుడు నిష్ప్రభుడు నయ్యె
ఖద్యోతకాంతి నక్షత్రముల్ నింగిని । దిట్టంబుగానొచె పట్టపగలె

తే. ఔర! సంలీనమీన విహంగమములు । శుష్కపంకజములునయ్యె పుష్కరిణులు
పుష్పఫలశూన్యములునయ్యె భూరుహములు । చూడ నాక్షణమదె పో క్షోణి
నెందు॥ 13

తే. జలధరారుణ రేణు సంచయము నపుడు । గాలిలేకయె లేచె నెక్కడను జూడ;
శారికలును "చీచీకూచి" శబ్దములను । పల్కె నపశకునంబుగా బహుళభంగి।14

తే. పిడుగులును, నుల్కలును నడ్డె పడియె పుడమి । ఘోరగతి జూచువారల గుండె
లదర
మరి, చలించెను పర్వ మీ మహితధాత్రి। సగిరి కానన వన నదీ సంచయంబు॥

తే. ఉరు రథస్థుని ఖరుని, ధీయుతుని నల్లె । నర్ధమానుని భుజము సవ్యంబ దప్పుడె
మిగులకంపించె; మరియు నా పృథుబలాఢ్యు। స్వరము పైతము తడబడె, సన్నగిల్లె॥

తే. నల్గడల జూచుచుండ త న్నయనములను। గ్రమ్మె నశ్రులు ఖరున కకారణముగ
ఇక లలాటంబునందు జనించె రుజయు। కాని, మోహాన మాన డా కదనకాంక్ష॥

తే. అటుల బుట్టిన యా మహోత్పాతములను। రోమహర్షణములజూచి *యేమొనర్పి
సర్వరాక్షసవరుల కఖర్వరీతి । పలికె ఖరుడిట్లు నిర్లక్ష్యభావమునను॥ 18

* రోస.

తే. ఈ మహోత్పాతములను, ని ర్లగిసినట్టి। ఘోరపర్వనముల నెల్ల సౌర! చూచి
లెక్కసేయుచునే వీర్య మెక్కుడగను। నాకె యుంగుట దుర్బలునట్లు జడిసి॥ 19

తే. భగణములనైన నేల్గు నభంబునుండి। తీక్ష్ణశరములబరపి మదీయములను
మరణధర్మాన మృత్యువునైన గూల్తు। విజయము, సంశయగ్రస్తుడ నమైతినేని నేను॥ 20

తే. ఆ బలోత్సిక్తు రాముని, నతని తమ్ము। లక్ష్మణుని తీక్ష్ణబాణాల రాల్పకుండ
విడిచి నేలను, మరి, పాతివేయకుండ। యుద్ధమునుండి మరలి రా నుత్సహింప॥21

తే. ఈవె నా చెల్లెలును నింక తృప్తిదీర। రామసౌమిత్రులయు నెత్తుర్ద్రావుగాత
కనగ, ఈవెనిమిత్తమైకాదె యిపుడు। వారికిటు లీవిపర్యయం బౌర కలుగు॥22

తే. లేదు నా కెంతయు నెపుడు నే లీలగాని। ఓటమియటన్నమాట మున్ యుద్ధములను
మీకు నిదియెన్న, ప్రత్యక్షమే కదోయి;। అనృతము వచింప నెప్డు నే నరయుడింత॥

తే. పూని యల్ల మహైరావతాన నెక్కి। వజ్రమది చేత ధరియించి వచ్చునట్టి
దేవరాజునైన వధింతు నాజి। ఈ కపుల లేమిలెక్క కోపింతు నేని!॥ 24

తే. గర్వితుని తన్నిశాచరు గర్జితముల। నాలకించి మహాచమూవారమద్ది
పొందెను ప్రహర్ష మతులంబు డెంపమందు। మృత్యుపాశావపాశితమింతకగుట॥

తే. యుద్ధదర్శనకాంక్షులై యుల్లములను। దేవగంధర్వచారణ బృందములును
మునులు సిద్ధులు మరి మహాత్ములును ఋషులు। మూగివచ్చిరి తద్రణభూమిపైకి

తే. పుణ్యకర్ములు వారట్లు మూగిచదల। చెప్పుకొని రిట్టు లన్యోన్య మప్పు డెలమి
'స్వస్తి' గోబ్రాహ్మణులకు సమస్తలోక। ములకు నమరూలుగా మహాత్ములకునంచు॥

తే. 'జయముగానుగాక శ్రీరామచంద్రుడాజి। సరగ పౌలస్త్యు లీ నిశాచరులపైన
చక్రహస్తుండు మున్నన్నట్లు సంగరమున। అసురపుంగవులనునెల్ల నణచినట్లు॥28

తే. ఇట్టు లింకను చెప్పుకొం చేమియేమొ। జాతకౌతూహలులు ఋషివ్రాతములును
దేవతలును విమానములలో దీప్తి నెక్కి। అరసి రాయుద్ధమూడినయసురసేన॥29–30

తే. ఉగ్రసైన్యంపు తిరుగు మహోగ్రరథము। నెక్కి వెడలుచు వేగంబయొక్కమొగిని
చూచి తెక్కిన రాక్షసశూరులెల్ల। వేగ వెడలిరి తమపతివెంటనంట॥ 30

సీ. 'శ్యేనగామియు', 'పృథుగ్రీవుండు' 'యజ్ఞశత్రుండు' మరి, 'విహంగముండు,' ననగ
'కాలకార్ముకుడు'ను, 'కరవీరచక్షుండు। 'పరుషుండు', 'దుర్జయుం'డురుబలుండు॥

ఆ 'మేఘమాలి'యు, నా 'మహామాలి'యు। 'సర్పాస్యుఁడు'ను 'రుధిరాశనుండు'
ద్వాదశు లీ మహాదారుణ వీర్యులు। 'ఖరు' పరివేష్టించి యరిగి రనికి॥

తే. 'త్రిశిరుఁడు', 'ప్రమాథి', 'స్థూలాక్షు' డసమబలుఁడు। మఱియును 'మహాకపాలి' నాఁబరఁగువాఁడు
నలుగు రసురులు వీరు సైన్యాధిపతులు। దూషణుని వెంటనడచిరి దురమునకును।

తే. భీమవేగంబు సమరాభికామ మద్ది। పృథు బలాఢ్యంబు రాక్షసవీర సేన
రాజపుత్రుల నా రామలక్ష్మణులను। చుట్టె గ్రహమాల చంద్రసూర్యులనట్లు।

23 వ సర్గ సమాప్తి — (735)



తే. అరయ యుద్ధార్థ ముద్యతు లైన యెవరి।వదన మది నిష్ప్రభంబయి వత్స!దోచు
వారికి ధ్రువంబు గల్గు నెవ్వారుగాని।మహితమాయుః క్షయం బనఘచరిత॥9

తే. బొబ్బరించెడి రక్త-సిమూకలవియు। ఘోరశబ్దంబు లవె విన నౌర! వచ్చె
క్రూరకర్ములు రాక్షసుల్ మీరి చరచు। భేరులయి మ్రోత లవె ఘోరబారె
చెవుల॥ 10

తే. అరసెడి నిమిత్తములబట్టి యాపదలను। శంక జేసి శుభంబు నిశ్శంకగోరు
పురుషుడు విపశ్చితుం డది యూడుట కిక।యనుచు వే సల్పు ప్రతీకారమును కుమార॥

తే. కాన, వే గొంచు వైదేహి పాణిసమను। వడిగ శరపాణివి ధనుర్ధరుడవునగుచు
శైలగుహ దీని జొరుము నిశ్శంకముగను। సతము మార్గంబుపాదపసంకులంబు॥12

తే. మాట దీనికి యెదురు మాటాడవలదు। ఇదియె నాపాదములయాన యింకబొమ్ము
ఆలసింపకు వత్స! లక్ష్మణకుమార! । వదిన సీతను రక్షింప వడిగ బొమ్ము॥ 13

తే. నీవు శూరుండవు బలంబు నేర్పుగలవు। చంపగల వీ నిశాటుల; శంక లేదు;
కాని, స్వయముగ నేనె యీ దానవులను। ఈ నిశాటులజంప నిచ్ఛింతువత్స!॥

తే. రామవిభు డిట్లు జెప్పంగ లక్ష్మణుడును। శరములను చాపముల గొంచుసరగనద్దె
సీత గొంచును వేగ నా చెంతనున్న।గుహను దుర్గమమునుజొచ్చెసుసహితుండు

తే. తమ్ము డా లక్ష్మణుం డట్లు త్వరత గతిని। సీతతోగూడ గుహాప్రవేశించినంత
'భళిర! మంచియుపాయమే యయ్యె'నంచు। కవచమును దొడ్గె రాముండు ఘన
భుజుండు॥ 16

తే. ఖరతరాగ్నినికాశ మా కవచమునను। కరము భూషితుడై రామఘనశివిభుడు
అల్ల తిమిరంబున విధూమ మగ్ని యెగసి। వెలిగెడి తెరంగున వెలింగె నలఘుశీల॥

తే. చాపము మహత్తరంబు హస్తమునబట్టి। శరములను తీక్ష్ణములను నట్లె సరగబట్టి
నిలిచె వీరుండు రాముండు నిరుపముండు। జ్యాస్వనంబుల పూరించు చఖిలదశల॥

తే. యుద్ధదర్శనకాంక్షులై యుల్లములను। దేవగంధర్వచారణబృందములును
మునులు సిద్ధులు మరి మహాత్ములును ఋషులు। మూగివచ్చిరి తద్రణభూమిపైకి

తే. ఋషులు బ్రహ్మర్షిసత్తముల్ విశతయశులు।అఖిలలోకాల గల్గుమహాత్మకులును
పుణ్యకర్ములు వారెల్ల మూగిచదల। చెప్పుకొనిరిట్లు లన్యోన్య మప్పుడచట॥ 20

తే. స్వస్తి గోబ్రాహ్మణులకు సమస్తలోక । ములకు ననుకూలు రామహాత్ములకు నెపుడు
జయము గానగాక శ్రీరామచంద్రు డాజి । సరగ పౌలస్త్యులీ క్షపాచరులపైన
చక్రహస్తుండు మున్నట్లు సంగరమున । అసురపుంగవులను నెల్ల నడచినట్లు॥ 21

తే. ఇట్టు లనుకొంచు మరల నా ఋషిజనంబు। చెప్పుకొని రిట్టు లన్యోన్య మప్పు డరసి
"వేలుపదునాల్గు రాక్షసుల్ భీకరులును। ఒక్కరుడె ధర్మమతి రాము డక్కజంబు
ఎటుల యుద్ధంబు జరుగునో యిలను నహహా! 23

తే. ఇట్లు రాజర్షులును సిద్ధులిద్ధగుణులు । మరి, ద్విజర్షభులును గూడి మదులలోన
జాతకౌతూహలులునౌచు చదలపైన । నురు విమానస్థులై చూచుచుండి రొగిని॥

తే. తేజసావిష్టు రాము పృథ్వీలలాము । ధీరు సంగ్రామశిరసి సంస్థితుని జూచి
భూతములు సర్వములు భయమోహితములు। నయ్యె నప్పుడు మరియు నేమందు నోర

తే. రూపమప్రతిమంబు త ద్భాపునిదియు । రాము నక్లిష్టకర్ముని దా మెయి గన
నప్పు డప్పుడె మహాత్ము డా యగ్నికల్పు। రుద్రు సంక్రుద్ధరూపమట్లొప్పెఎదుర

తే. దేవగంధర్వచారణు లీ విధంబు । చెప్పుకొనుచుండ నంతలో గుప్పునెగసి
ఘోరవర్మాయుధధ్వజవారమద్ది । సతతగంభీరనిర్హ్రాదసైన్యమద్ది
యాతుధానుల దప్పు డా యఖిల దిశల। దోచె నెల్లెడ తామెయైదో ర్బలమున॥

ద్వి. సింహనాదంబులు జేసేటివారి । అన్యోన్యమభిగర్జనములొప్పువారి
చాపముల్ మోగించి సారించువారి । ఎడలేక కడలేక జృంభించువారి
గొల్లుగ నెల్లెడ ఘోషించువారి । వీరువారును వేయు వీరాంగములను
బడబడ బాదెడి బహు దుందుభులను । దొడ్డగా బుట్టెడి తుములశబ్దంబు
ఆ రక్కసులదైన ఘోరరావంబు । పూరించె వనమెల్ల భువనంబు లెల్ల॥

తే. శబ్దమద్దాన భయపడి శ్వాపదములు । వనచరంబులు మరి యింక వెనుక గనక
దౌడుదీసెను నిశ్శబ్దమేడనుండు । నచటి కప్పుడె త ద్రిణధాత్రి విడిచి॥ 30

తే. ఇక మహాఘోర మద్ది యనీక మపుడు।తరళనానాప్రహరణోద్ధృతంబు చెలగి
రూపుగంభీరమును సాగరోపమంబు । రామచంద్రు సమీపించె భీమగతిని॥ 31

తే. రాముడును చక్షువులను సర్వత్రబరపి । పరమ రణపండితుండు నాఖరుని సేన
అటుల యుద్ధాభిముఖముగా చటులగతిని । నుత్థితంబయి వచ్చుట సిద్ధమరసె॥

తే. ధనువు భీమంబు వితతంబు నొనర జేసి । తూణములనుండి బాణముల్ తోనె తీసి
క్రోధ మది దెచ్చు కొనియె తీవ్రాధికంబు।అఖిలరాక్షసపక్ష వధార్థ మతడు॥33

తే. అతడు దుష్ప్రేక్ష్యుడయ్యె క్రోధాధికమున ! మండు చెల్లెడ మరి యుగాంతాగ్ని యటుల
తేజనావిష్టు నతని నింతింతజూచి । వనిని వనదేవతలు దాగువారె దిశల; 34

తే. అతని క్రుద్ధుని రామునిద్దె నరూపు । గనగ నప్పుడు గన్పించె కణకణమని
దక్షుయజ్ఞంబుద్ధ్వంసము దగ నొనర్ప । కినిసి యుంకించు త త్రిపినాకినిడి నాగ ।35

తే. తేజనావిష్టు రాము పృథ్వీలలాము । ఘోర సంగ్రామశిరసి సంస్థితునిజూచి
భూతములు సర్వములు భయోత్పాతమొంది । పారుదీసెను దిశలకునోరుగరచి॥

గేయం. ఆ కార్ముకముల నా భూషణముల । వర్మంబుల నా ధ్వజముల గిజముల
అగ్నికి సమమగా నా వర్ణంబుల ! ఆ పిశితాశన సైన్యం బప్పుడు
సూర్యోదయమునమూడగ నింగిని ! నీలాభ్రంబుల లీలగ దోచెన్। 37-38

24 వ సర్గ సమాప్తి – (772)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఇరువదియైదవ సర్గ — (25)

—♦ జనస్థాన రణాంగణము ♦—

**(1) సమరారంభము - రాక్షససేన నుగ్గునూచముగుట.**

తే. ప్రభు నవష్టబ్ధచాపు నా రామభూపు । గ్రుద్ధు రిపుఘాతు జూచె ఖరుం డనపుడ
దరిసి రామాశ్రమంబును తనదు వెంట । నంటివచ్చిన సకలసైన్యాళితోడ। 1

ఆ. అతని జూచి సశరమౌ చాపమును ఖర । నిస్వనంబు దాని నిలిపిపట్టి
'రాముకెదురుపోలు రథ మిూ' వనుచును సూతు । హెచ్చరించె ఖ్యాతి ఖరుడు॥

ఆ. ఖరుని యాజ్ఞ సూతుఁ డనుగతి తురగాల । దోలె నచలవిభవు దోర్బలుండు
రాము డొక్కఁ డుండె భీమ మద్ధనుష్కు । ధను సెక్కించు చిప్పడు గొనుచు నిలిచె॥

ఆ. రాము పైకి నట్లు వేగమున బోవు నా । ఖరుని జూచి రజనిచరులు నెల్ల
బొబ్బలెలుగులెసగ దబ్బున బోయి రా । స్వామి ఖరుని వెంట సచివు లెల్ల॥ 4

తే. అప్పు డా యాతుధానసైన్యంబు మధ్య । నొప్పుచుండెను ఖరుడు కరంబు వెలిగ
తారలకు మధ్య త న్నభోంతరమునందు । నుదయమైన లోహితాంగుని యోజగాగ॥5

తే. శరసహస్రంబులను నంత ఖరుడు వడిగ । రాముపై ప్రేమమాజిను భీమవేషు
నొవ్వజేసి, మహానాద మబ్బి యమ్రివ! జేసె సమరాంగణంబున నైరృతుండు॥

తే. భీమధన్వుని దుర్జయు రాముపైన । క్రుద్ధులై యాతుధానులు ఘోరగతిని
పరగనానావిధంబులౌ శస్త్రములను । నప్పుడె గురిపించి రాహవాంగణమునందు॥

తే. ముద్గరంబుల శూలాల ఖడ్గములను । పట్టిసంబుల ప్రాసల పరశువులను
రాక్షసులు రామునప్పుడా రణమునందు। రోషతప్తులై వైచి రోఘబలులు॥ 8

తే. అల వలాహక సంకాశు లసుర లెల్ల। పటుమహౌజసులును మహాధ్వనులెసంగ
పర్వతాకారగజముల వాజితతుల। రథములం దోలికొక్కట రణమునందు
రాము కాకుత్స్థు వధియించి రాచిరైర॥ 9

తే. మరియు రక్షోగణంబు లత్తరినియోగసి। ప్రబలి శరవృష్టినడినాస్త్ర రామునపైన
కురిసి రద్రీంద్రుపై ధార లురల గురియు।నిండు జీమూతసంఘాల గంపుమిగిలి॥ 10

తే. యాతుధానశతంబు లారీతిగురియు। శస్త్రములనెల్ల రాముండు సంగ్రహించె
తనదు విశిఖాళిచే సముద్రాంభములును।పొంగివచ్చెడి నద్యోఘములను బడెను॥12

తే. ప్రహరణంబుల తద్ఘోరబహుళములను। భిన్నగాత్రుండునయ్యు నొంపేద ఘోర
రాఘవుండు ప్రదీప్తముల్ బహుళములును।నైన వజ్రాల మరి మహాచలమునట్లు॥

తే. విద్ధుడై సర్వగాత్రాల పృథ్వీవిభుడు। ప్రకట క్షతజౌఘసిక్తుడై రాఘవుండు
అల్ల సంధ్యాభ్రసంవృతుండైనయట్టి। ఖర దివాకరు రీతిగా గ్రాలె ప్రభుడు॥14

తే. ఒక్కరుం డట్లు పెక్కువేలొప్పునట్టి। అసురతతిచేత పరివృతుండగుటజూచి
కడు విషాదంబునొంది రాకాశవీధి। దేవ గంధర్వ సిద్ధులు దివ్యఋషులు॥ 15

తే. ఇక సుసంక్రుద్ధుడై రాముడేకరీతి। మండలీకృత చండకోదండుడగుచు
విడిచె బాణాల నెల్లడ విశిఖములను। నూర్లు వేలును లక్ష లనూనసంఖ్య॥ 16

తే. ధృతి దురావారములను దుర్విషహములను। కాలదండోపములను బల్ లీలగాగ
కంకపత్త్రంబుల నజిహ్మగముల విడిచె । రామచంద్రుండు రణములో రాణ
మెరయ॥ 17

తే. శత్రుసైన్యంబుపై విలాసంబుగాగ। విభుడు రాముండు విడిచిన విశిఖవితతి
రక్కసులప్రాణములనెల్ల రహిని గొనియె। కాలకృతపాశములమాడ్కి కరుణ
మాలి॥ 18

తే. భిన్నమొనరించి యసురుల విపులవపుల। తత్శరంబులు రుధిరదిగ్ధంబులగుచు
అంతరిక్షాని కెగసి దీప్తాగ్నిసదృశ। తేజముల నొప్పె నప్డు దుత్తేజలీల॥ 19

తే. రాముకోదండమండలాగ్రముననుండి। ఇక,అసంఖ్యేయములుగ సాయకములు ఘోర।
వెడలె బహుతర తీవ్రోగ్రవిశిఖవితతి। అసుర తతులకు ప్రాణాపహారులగుచు॥20

తే. ధనువుల ధ్వజాగ్రముల వర్మతతుల తలల। బాహువుల సర్వభూషల వరలువాని
కరికరోపము లూరుల నరికివైచె । శతసహస్రాల రాముండు సంగరమున॥ 21

తే. హయుల కాంచనవితత సన్నాహములను। రథ సుసంయుక్తములను సారథులనింక
గజములను మావటీండ్ర కంఖాణములను। కౌతులపదాతులనుగూల్చె రాముడాజి॥

తే. చెలగు నాళీకనారాచములను మరియు। శరముల వికర్ణికలను తీక్ష్ణాగ్రములను
భిద్యమానులుకాచు బల్ భీమగతిని। ఆర్తనాదంబులొనరించి అసురులాజి॥ 24

తే. మర్మభేదులు నిశితముల్ బాణతతులు। రాము డడరింప పీడితమ్మై మహాజి
సుఖముగన లేకయుండె రక్షోగణంబు। అగ్గితగిలిన యూ వొందుట వివరీతి॥ 25

తే. కొందరప్పుడు శూరులు ఘోరబలులు। రాము కభిముఖమేగి పరిశ్వధముల
శూలముల ఖడ్గములనైచి రోలిమెగసి। మరియు పరమాయుధంబుల వరుసనెన్నొ॥

తే. వారిశస్త్రాల నామహాబాహుడపుడు । ప్రబలబాణాలవారించి రాఘవుండు
రక్కసులప్రాణముల్ గొనె రణమునందు। మరియు ఖండించె తత్ శిరోధరములెల్ల॥

తే. భిన్నశిరముల మరియు సంభిన్నవర్మ। శరశరాసనముల నప్పు డసురవరులు
జగతికొరిగిరి పాదపచయములౌర। అల సుపర్ణాని లోత్క్షిప్తములొ యనంగ॥ 28

తే. అచట అవశిష్టులైయున్న యసురులంత। కరమిక విషణ్ణులౌచుతత్తరునిదరికె
పరుగువారిరి శరణార్థులరచుకొంచు। పటుశరార్దితులౌచు నప్పట్టునందు॥ 29

తే. వారినెల్లరనూరార్చి వారి మరల। గొంచు నిక దూషణుండు కాకుత్స్థుపైకి
ఉరవడించుచు కోపించి యురికివచ్చె। అంతకుడు రుద్రుపైకియో యనెడునట్లు॥ 30

తే. మరలనెల్లరు నారీతి నరుగుదెంచి। దూషణాశ్రయసంశ్రితుల్ సుమికిరపుడె
రామవిభుపైకి యసురవిరాముపైకి। సాలతాలశిలాయుధ జాలులగుచు॥ 31

తే. శూలముద్గరహస్త లాఖీలబలులు। చాపహస్తులు బాణవర్షంబు మరియు
శస్త్రవర్షంబు రాలవర్షంబు గురిసి। రసురనేతలు వృక్షవర్షంబు నొకట॥ 32

తే. అద్భుతంబయ్యె నప్పు డాహవము మరల । తుములమును రోమసంహర్షణమును
నయ్యె
మరి మహాఘోరమయ్యె తన్మహినిచట। రామునకు రాక్షసులకు నుగ్రంబునయ్యె॥

తే. ఉద్యతప్రాసులౌచు శరోగ్రవృష్టి। గురిసి దిశలును ప్రదిశలు ఘోరగతిని
క్రిక్కిరియగ్రమ్మ కుపితులై యొక్కుమొగిని। తననుచుట్టిన రాక్షసతతులజూచి॥

భైరవనినాద మొనరించి బాహుబలుడు। పరమభాస్వరమస్త్రమా · తరణికులుడు
ధనువుననుగూర్చి యప్డె గాంధర్వమార। విడిచెనారాక్షసులపై నవడిసెలంగ। 36

తే. శరసహస్రంబు లప్పు డాశ్చర్యముగను।చాపమండలముననుండి సరగవెడలి
దశలుపదియును సర్వంబు దిద్దిరనగ। ముంచివైచెను నెడలేక కొంచమైన। 37

తే. రామచంద్రుండు ఘోరశరంబులట్లు। దీయుటన్ జూడ వేయుట తెలియ రాక
అల్లెసీడ్చుట యెరుగ రా యసురులేమొ।అర్ధితులుమాత్రమగుచుండి రతని సెలల॥

తే. ఖరదివాకరుతోడ నాకాశమెల్ల। గ్రమ్మబడియె శరాంధకారమ్ముతోడ
శరము లవిగ్రుక్కుచున్నట్టిచందముగను। రాముడచ్చటనిలిచె తీవ్రాననమున॥39

కం. యుగపత్ పతమానులచే। యుగపత్ హతు లసురవీరయోధులచేతన్
యుగపత్ పతితులచేతన్ । జగతివికీర్ణంబునయ్యె క్షణికములోన్॥ 40

కం. నిహతులు, పతితులు, క్షీణులు,। బహుధాభిన్నులును భిన్నలాహవభూమిన్
బహుళవిదారితు లసురులు। మహి నటనట గానబడిరి మరియున్ వేలున్॥ 41

సీ. ఛిన్నంబులైన సోష్ణీషోత్తమాంగాల। సాంగదబాహుల శకలములను; .
నానావిధవిభూషణంబుల జానుల నుత్తరింపగబడ్డ యూరువులను;
బహుభిన్నద్విపముఖ్యవర రథహయముల। వ్యజనచామర కేత నాదికముల;
రామబాణాహతభీమపట్టిశశూల। చిత్రవిచిత్రాది ఛత్రములను;
ఖండీకృతప్రాస ఖడ్గపరశ్వధ బహుచిత్రశరచాపవారములను;

తే. చూర్ణితములైనశిలల సంక్షుణ్ణతలుల। సమరభూమిసమస్త మా సమయమందు
. కాలువిడవాకనింపి యెక్కడనుజూడ। బహుభయంకరమయ్యె చూపరులుబెగడ॥

25 వ. సర్గ సమాప్తి:—(817) .

తే. రాము డంత సుసంక్రుద్ధుడై మరింత। క్షురముఁగొని ద్రుంచె తద్రాక్షసుని మహోగ్ర
ధనువు నప్పుడు కూల్చె తత్ హరులనాల్గు। నాల్గు బాణాల వీరు డా నయవిదుండు॥7

తే. శరములను తీక్ష్ణములు నల్గు హయములఁజంపి। సారథిశిరంబు మరి యర్ధచంద్రమునను
ద్రుంగఁజేసియు మరియునా దూషణునియు। వక్షమున గ్రుచ్చె మూడమ్ము
లక్షయములు॥ 8

తే. ఛిన్నచాపుండు విరథుండు ఛిన్నుడచట। హతహయుండును హతసుసారథియునౌచు
గొనియె పర్వతశృంగాభ మనెడుదాని। రోమహర్షణ మతడొక్క భీమపరిఘ॥9

తే. పట్టములఁ గాంచనంబుల వేష్టితంబు। దేవసైన్యప్రమర్దన తేజితంబు
ఆయస సుతీక్ష్ణశంకుసంవ్యాపితంబు। పరవసోక్షిత మశనిసంస్పర్శ మద్ది
శత్రుగోపురదారణక్షమముబట్టి॥ 10. 11.

తే. అల మహోరగసంకాశమైనపరిఘ। గొని రణంబున దూషణుం డానర జనియె
రాఘవునిపైకి నప్పుడే రజనిచరుడు। క్రూరకర్ముండు రాఘవు గూల్ప నెంచ॥12

ఆ. అటుల పైకివచ్చు నా దూషణుని రెండు। బాహువులను రెండు బాణములను
నరికివైచె భూషణాంగదంబుల జక్క। భూషితంబులైన భుజములతడు॥ 13

తే. అటుల రణమూర్ధ్ని విచ్ఛిన్నహస్తుడైన। అసురు కరమునుండి మహాప్రమాణ
మాయసమయంబు పరిఘ య య్యవనిగూలె। అల్ల శక్రధ్వజంబట్టు లగ్రమునను

తే. అట విక్షీర్ణకరంబుల నవనిబడియె। దూషణుండు మహత్తర దోర్బలుండు
మరి విశీర్ణవిషాణమై మహినికూలు। పటు మనస్వి మహాగజం బటులఝడితి ॥15

ఆ' అతని జూచి పతితు క్షితిని నా దూషణు। నిహతు రణమునందు నిఖిల సురలు
సాధుసాధటంచు సర్వభూతంబులు' పొగడిపూజసల్పె భూపురాము॥ 16

ఆ. ఇంతలోన క్రుద్ధులెంతయున్నై కూడి। వచ్చి పడిరి రాముపైకి ముగురు
మృత్యుపాశవశత సేనాగ్రయాయులు। అల మహాకపాలు డాదిగాగ॥ 17

తే. అల్ల శూలంబుపట్టి మహాకపాలి। పట్టిసముబట్టి స్థూలాక్షు డట్టెయెగసి
రహి 'ప్రమాథియు'బట్టి పరశ్వథంబు। ముగురు రాక్షసు లిట్టుల మూగిరొగిని॥

తే. చూచినంతనె వారి నచ్చోవిభుండు। చేరవ మీదికి వచ్చుట మరియు నరసి
సాయకంబుల వేగ తీక్ష్ణాగ్రములను। స్వాగతంబిచ్చె నతిథుల కట్టులచట॥ 19

తే. భీమకర్ములు పలునాల్గు వేలమంది। రాక్షసులు నేర హతులైరి రాముచేత
ఒక్కరునిచేత నా మనుష్యునియు చేత। యానహీను పదాతిచే నా వనోర్వి। 35

తే. సర్వ మా సైన్యమున నష్ట సంఖ్యజూడ। మిగిలిరి మహారథుండు బల్మేటి ఖరుడు
త్రిశిరుడను రాక్షసుండును రిపుదమనుడు। రామునను మాత్రమే ముప్వ
రాజలోన। 36

తే. మిగత వారలు జచ్చిరి మేటిమగలు। దుర్విషహులెల్ల ఘోరసు లా మురమునందు
మరి మహాసత్త్వ లీల్గిరి ధరణికొరగి। లక్ష్మణాగ్రజుచేత నా రాముచేత। 37

ద్వి. ఆభీమబలమార ఆహవంబునను। బలియుడా రాముచే బలియౌటజూచి।
మరి మహత్తర రథంబందున నెక్కి। వజ్రంబుఝళిపించి వడివచ్చునట్టి।
ఇంద్రునిచందంబు నందడించుచును। ఖరుడప్డు తాకె పో కాకుత్స్థురాము। 38

26 వ సర్గ సమాప్తి :- ( 855 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

ఇరువది ఏడవ సర్గ :- ( 20 )

జనస్థాన సంగరాంగణము

( 3 ) త్రిశిరుని వధ

తే. ఖరుడు రామాభిముఖముగా నరుగుటరసి । వాహినీపతి త్రిశిరుండు బాహుబలుడు
పేరుప్రఖ్యాతిగల దానవేశ్వరుండు । ఖరుని కడ్డము జని యిట్లుగా వచించె । 1

తే. ఇదె నియోగింపు నన్ను; నీ వేల విభుడ;। మరలు; విక్రాంత సాహసం బధిప విడువు
చూడు రాము మహాబాహు క్షోణినిపుడె।ఉరలద్రోయుదు సెలవిమ్ము వరద నాకు॥2

తే. ప్రతిన నిదె చేసి చెబుదు సత్యమ్ము నమ్ము । ఆయుధంబంటి చెబుదు తథ్యమ్ము నాథ !
రాము వధియింతు నిదె, సర్వరాక్షసులకు । సతతము వధార్హు డాతండు; చచ్చు
నిప్పుడె ॥ 3

తే। నేనో మృత్యువు నాజి నా మానవునకు। అతడో మృత్యువు నాకు నాహవమునందు
మరలి దేవ ! రణోత్సాహ పరతనుండి । ఇక ముహూర్తము నీవు * ప్రాశ్నికుడ
వగుము ॥ 4

తే. రాము డీల్గిన మరి ప్రహర్షాన దేలి । జనెద వీవు జనస్థానమునకు మరలి
నేనె యీల్గిన రాఘవు నెరి వధింప । దాకెదవు నీవు సంగర ధాత్రినతని ॥ 5

తే. మృత్యులోభాన త్రిశిరు డారీతి ఖరుని । ప్రభుని ప్రార్థింప నతడును హర్షమంది
పొమ్ము యుద్ధమ్మొనరింపు, పోదు మటంచు । నాజ్ఞనిడ నేగె నతడు రామాభి
ముఖము ॥ 6

* ప్రాశ్నికుడు = జయాపజయనిర్ణాయకుడు.

తే. త్రిశిరుడును నంత భాస్వర తేజమొప్ప । ఘనరథంబున వాజియుక్తమున నెక్కి-
పొంగి రామునిపైకి త్రిశృంగములను । వెలుగుపరత్వమాయన పేక దాకె॥ 7

తే. బాణధారాసమూహంబు బహుళభంగి । ఇక మహామేఘమనగ వర్షించిమించి
నాదము జలార్ద్రిదుందుభినాదమట్లు । త్రిశిరు డొనరించె బధిరత దిశలుబెగడ: 8

ఆ. అటులవచ్చు త్రిశిరు నా రాక్షసుని జూచి । రాఘవుండు ధనువు రాణదాల్చి
శితశిలీముఖాల శీఘ్రమే బరపె నూ । యసురు బాణతతుల కసిమసంగ॥ 9

ఆ. సంప్రహార మపుడు చాల దొమ్మిగ నయ్యె । రామత్రిశిరులకు పరంతపులకు
పటుబలీయులకును వని సింహకుంజరం । బులకునట్లు జూడ భూమి యద్రువ॥ 10

ఆ. త్రిశిరుచేత మూడు దీవ్రబాణంబుల । నొసట గొట్టబడుట నొచ్చి విభుడు
మది యమర్షి యపుడు మరికోప మెగయుసం । రబ్ధుడగుచు పలికె రాము డిట్లు॥ 11

తే. భళిర ! విక్రమశూరు డుపాచరేంద్రు । బల మనగ నిట్టిదా యారతెలిసె నిప్పుడు
ఇషువు లివి నీవి యిపుడు నా నొసట దాకె । పుష్పశరములమాడ్కి-; పో మ్మోయి
యింక ॥ 12

తే. నా శరంబుల చవిగూడ నరయు మోయి। ఖలుడ! మచ్చాపగుణవిముక్తముల
గొనుమ
అనుచు నాశీవిషోపమఘనశరాళి । గ్రుచ్చె పదునాల్గు త్రిశిరుని ఱొమ్ములోన॥

తే. బాణముల నల్ల సన్నతపర్వములను । నాల్గిటన్ గూల్చె త్రిశిరుని నాల్గుహయుల
సూతు నెన్మిదిబాణాల క్షోణి గల్పె । ఉచ్ఛ్రితధ్వజమున్ రాల్చె నొక్క-కోల॥ 14

తే. అంత హతరథు డాత డమాంత మెగయ । త న్నిశాచరు జూచి యా దాశరథియు
గొట్టె నాతని గుండెయల్ గురిగ బెట్టి । పడియె వాడును మూర్ఛిల్లి పుడమిపైన॥

తే. అప్రమేయాత్ము డా రాము డసురుతలల । నిశితసాయకముల మూట నసమగతిని
వేగవంతంబు లా బాణ వితతి చేత । కూల్చె సామర్థ్యుడై యప్డె క్షోణిబడగ॥ 17

తే. అసురు డా రుధిరోద్గారి యా విధంబు । రామబాణాభి పీడితుండై మహార్తి
స్వశిరములుమూడు మునుపె భూస్థలినిబడగ । తాను బడియెను భూమిపై దబ్బు
నపుడె ॥ 18

తే. ఇంక హతశేషులైన బంట్లెల్ల రపుడ । విరిగి పారిరి రాక్షసుల్ ఖరుని దరికి
నిలువలేరైరి హా కట తృటిని నేని । పులిని జూచిన లేళ్ళ గుంపుల విధాన ॥ 19

తే. వారి యటువచ్చు వారల పారజూచి । ఖరుడు కోపించి మరలించి కసరి వారి
దైన్యమై హాకె స్వయము మహోగ్రగతిని । రామునై కల్లచంద్రుపై రాహు
వటుల॥ 20

37. వ సర్గ సమాప్తి :– ( ౩౯౫ )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

ఇరువది ఎనిమిదవ సర్గ :- ( ౨౮ )

### జ న స్థా న స ం గ్రా ం గ ణ ము

( 4 ) ఖరునితో యుద్ధము.

ఆ. తెగుట దూషణుండు త్రిశిరునితో నట్లు । పోరిలోన రాము పీఁచచేత
కడుభయంబుగలిగె ఖరునకు సైతము । రాము విక్రమంబు భీమ మరయ ॥ 1

తే. సేన యవిషహ్య మసురులదైనదట్లు । త్రిశిరదూషణసహితంబు తిరిగిరాక
హీననరుడొక్క-రాముచే మృతిని గనుట । గని మహాబలు డడలె నా ఖరుడు
నెడద ॥ 2

తే. ఆజి నా హతభూయిష్ట మాబలంబు । చూచి విమనస్కుడై యెట్లొ చొరవ బూని
ఖరుడు రామునిపైకి దా నురవడించె । నముచి వాసవుపైకి న ట్లమితగతిని ॥ 3

తే. లాగిచాపంబు మిగుల బలంబుగాగ । రక్తభోజనములను నారాచములను
రాముపై జిమ్మె ఖరుడు బల్ రౌద్రరుషిత । సర్పరాజంబు లాశీవిషంబు లట్లు ॥ 5

తే. నారి బహుళంబు రణశిక్షణంబు మెరయ । స్పందనమొనర్చి సంధించి శరములందు
వివిధగతుల విహారంబు వీరవరుడు । ఖరుడు రథగతు డొనరించె ఖరశరాళి ॥ 5

ఆ. ఖరుడు వడిగ నట్టు లరుగుదెంచుట జూచి । ఆ మహారథుండు రాము డపుడ
తన మహోగ్రచాపమునను బాణంబుల । నించి దిశలు ప్రదిశ లెంచి ముంచె ॥ 6

తే. సాయకంబుల దుర్విషహాయతముల । సస్ఫులింగంబులను నగ్నిసమమువాని
బరపి నభమెల్ల మరి యవివర మొనర్చె । వృష్టిచేతను పర్జన్యు రీతిగాగ ॥ 7

తే. ఖరుడు రాముడు నట్టి ప్రచండ కోపులపైన । విడిచినట్టి శితాంబక వితతిచేత
చుట్టు నాకాశమెల్ల నెచ్చోట నంగ । శర సుసంకుల మయ్యె పో సందులేక ॥ 8

తే. ప్రబలి యన్యోన్యవధ సుసంరంభులగుచు । ఉభయులును పోరుచుండ నా యోధ వరుల
చండశరజాలముల నావృతుండు నగుట। చెలగి సూర్యుండు మరి ప్రకాశింపకుండె॥

తే. భూరి నాళీక నారాచ వాకములను । అతి వికర్ణి కతతుల తీక్ష్ణాగ్రములను
రాముబ్రహరించె ఖరుడు తోత్రముల జెలగి।మరిమహాద్విపమునునట్లు ఖరబలుండు॥

తే. ఖరు రథస్థు ధనుష్పాణి కరకు లనుచు । సర్వవస్థితు జూచె నప్పట్టునందు
సర్వభూతంబులును పాశహస్తుడైన । అంతకు డితండో యనుచు నంత అడలుగదిరి॥

తే. పటుమహాసత్త్వుడును పర పౌరుషుండు । నయ్యు రాముండు సర్వసైన్యంబు నాజి
నంత మొనరించియుంట అలంతె మిగుల। జెందియుండు నటుంచెంచె హృదినిఖరుడు॥

తే. అతని విక్రాంతు సింహమోయనెడు వాని। సింహవిక్రాంతగాము నైరృతుని జూచి
రాఘవుండు చలింపండు లవముగాని। క్షుద్రమృగమును గను సింహమో యనంగ॥

తే. రథము సూర్యనికాశాన ప్రథితమునను। ఖరుడు రణమున రాము వేగంబదాక
దుమికి వచ్చెను సంరంభ మమితముగను । దావపావకుపైకి పతంగమటుల॥

తే. ఆ మహాత్ముని రాముని శ్రీమధనువు । సశరమును నష్ట ముష్టిదేశంబునందు
ఖరుడు ఖండించె తనదైన శరముబరపి । చూపుచును పాణిలాఘవం బేపుమీర॥

ఆ. ఖరుడు క్రుద్ధుడౌచు మరల శక్రాశని । సమసు తేజమొప్పు శరము లేడు-
బరపి రామచంద్రు వర్మంబుపై బడ । గొట్టె గట్టిగాను గురియు వెట్టి ॥ 16

ఆ. తత్సుపర్వబాణ తతుల నా ఖరముక్త । ములను ప్రహతమౌచు భూమిపైన
నౌర పడియె నద్ది యాదిత్యవర్చసం । బైన రాముకవచ మద్భుతముగ ॥ 17

తే. శరసహస్రాల నంతట ఖరుడు బరపి । రాము నప్రతిమౌజసు శ్రీముగలచి
యుధిమహానాద మొనరించె నుగ్రగతిని । రంహసంబున చెలగి యా రజనిచరుడు॥

తే. సర్వగాత్రాల నిండిన శరశతాల । క్రుద్ధుడై రాఘవుండు నా యుద్ధభూమి
మరి విధూమాగ్నియోయన కరముకాంతి । మెరయ జొచ్చెను నప్పడా మిహిర
కులుడు ॥ 19

తే. ప్రభుడు రాముండు శత్రునిబర్హణుండు । నంత గంభీర నిర్హ్రాదమైనదాని
అల మహద్ధను వొంపు సజ్యంబొనర్చె । రిపుల నంతబు నొందింప విపులబలుడు॥

తే. వైష్ణవంబును సుమహత్ ప్రభంబునద్ది । ఉత్తము మహర్షి చేత శ్రద్ధనువరంబు
కరమునను బట్టి యెత్తి యా ఖరుని వైపు । నురవడించెను రాఘవుం డురుబలుండు॥

తే. బాణతతులను సన్నతపర్వములను । కనకపుంఖాల రాముండు ఘనత బరపి
ఖరుని ధ్వజమును క్రుద్ధుడై నరికివైచె । సమరభూమిని నప్పుడా సవిత్రుకులుడు ॥

తే. దర్శనీయము కాంచనధ్వజ మయూరె । పరగబహుధా వికీర్ణమై ధరణిబడియె
దేవతలయాజ్ఞ నప్పుడా దినకరుండు । వచ్చెనో భూమి కనువట్టి వడువుగాగ॥

తే. క్రుద్ధుడౌచు ఖరుండు నా యుద్ధభూమి । రాము గాత్రాన నాల్గు మార్గణములేసి
కొట్టె మర్మజ్ఞు డతడు వేగ్గను జనంబు । తోమరంబులనట్టుల త్రోడుత్రోనె। 23

తే. నృపుడు తత్ఖరకార్ముకనిస్సృతములు । బాణముల జేసి రాముండు బహువిధముల
విద్ధుడై రక్తసిక్తాంగ వితతుడగుచు । కుపితుడయ్యె భృశంబు త క్రుద్ధుడట్లు॥

తే. ధన్వినాం శ్రేష్ఠు డాతండు ధనువు నొండు।బట్టు చా పర మేష్వాసు డట్టె యుధిని
పరమ మద్దానినుండి షట్ శరములప్పుడ । విడిచె నభిలక్షితంబుల వడిబడంగ।

తే. తలను నొక బాణమునను, బాహులను రెంట । వక్షమునయందు చంద్రార్ధవక్త్ర
ములను ॥ 27

తే. ఆ మహాతేజు డా రాము డంత చెలగి । ఉగ్రనారాచముల భాస్కరోపములను
దీసె కోపించి పదమూటి తీవ్రగతిని । రాక్షసులజంప నప్పుడా ప్రధనభూమి॥ 28

సీ. ఒకబాణమున కాడివికలంబునొనరించి । నాల్గింట హయముల నీల్గజేసి
ఆరవబాణాన సారథితలగొట్టి । నొగను మూడింటను నుగ్గొనర్చి
రెండిట బండికల్ విటతాటమొనరించి । వజ్రనికాశంబు ద్వాదశమున
నశరంబు ధనువును చయ్యన ఛేదించి । మరి త్రయోదశమున ఖరునినొంచి.

తే. నవ్వుచును రాము డా పురందరసముండు। చెలగి విహరింప ఖరుడు సంఛిన్న
రథుడు
భగ్నచాపుండు వినిహతాశ్వాదికుండు । హత సుసారథియై గదా పాణి యగుచు
ఉరికె ధరణికి కడువడి నురవడింప॥ 29

తే. ఆ మహారథు రాము నా కృతమకృతిని। సురవిమానాగ్రములనుండి చూచుచుండి
దేవతతులు మహర్షులు హృష్టులగుచు । చేతులు మొగిడ్చి భక్తి పూజించి రతని॥

28 వ సర్గ సమాప్తి :— ( 908 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### ఇరువది యెనిమిదవ సర్గ - (28)

### జనస్థాన సంగ్రామాంగణము

(శ్రీ రాముడు ఖరుడు - ఒండొరుల వధ తెలిపించుకొనుట.

ఆ. విరథు వితథు ఖరుని ధరణి గదాపాణి । నసము నిలిచియున్న యసురు జూచి
విభుడు రాఘవుండు మృదుపూర్వమౌ మహా। తేజు డనియె పరుష మోజ మెరయ

తే. బల మది మహత్తరంబు ద్విపాశ్వసుభట। ఘోరరథసంకులంబును గూర్చుకొంచు
భువి సుదారుణకర్మ సేతువుర నీవు । సకలలోకజుగుప్సితం బకట ఖరుడ!॥ 2

తే. నిఖిల భూతాళి కుద్వేజనీయు డెప్పుడు। కడు నృశంసుండు మరి పాపకర్ము డౌరి.
బ్రతుక డింక త్రిలోకాల కర్తకు నిజము। నాథుడేగాని మరి వాని యబ్బగాని॥ 3

తే. కర్మ లోకవిరుద్ధమే క్షణము సేయు। తీక్ష్ణు నిక సర్వజనులు వధింతు రిట్టి
సర్పమును దుష్టమును మైకి సరగవచ్చు। దానినట్టుల నోఖర దాచరుండ॥ 4

తే. కామమునగాని లోభంబు కతనగాని। మొదలు తెలియక పాపంబులొగి నొనర్చు
భ్రష్టు డద్దాని ఫలితంబు త్వరగ జూచు। *కరకలన్ దిన్న బ్రాహ్మణి కరణి ఖరణి॥

తే. దండకారణ్యవాసులై యుండు వారి। ధర్మచరితుల తపసుల కర్మపరుల
నా మహాభాగుల వధించినావె నీవు । ఏమిఫలమునుపొందంగ నెంచితివిర ! ॥

తే. పాపకర్ములు క్రూరులు భ్రష్టమతులు । ఖలులు లోకజుగుప్సితుల్ కడగి యెటులొ
ఇలను నైశ్వర్యమొందియు నిలువలేరు । చిరము; వేరులు తెగినట్టి చెట్టు లట్లు॥ 7

* కరకలు = వడగండ్లు, బ్రాహ్మణి = వలికండ్లపాము

తే. ఫల మవశ్యంబు బొందు పాపంపు పనికి । కాలమే తేర జంతు వాభీలగతిని
ద్రుమము లీ క్షితి ఋతువుల క్రమముబట్టి । పుష్పముల నార్తవంబుల బూయు పోల్కి॥ 8

తే. అచిరమున బొందు పాపకర్మాళిఫలము । లోకమున జంతువితతులు రూఢివినుము
సవిషమన్నంబుభుజియించు జనములకును। త్వరగఫలమగు గతి క్షణదాచరుండ॥

తే. పాపముల ఘోరముల జేయు పాపరతుల । ఎడదలోకాల కహితమిచ్చించు ఖలుల
బట్టి ప్రాణాల దీయంగ ప్రభుని యాజ్ఞ । సాగివచ్చితి కోరి నిశాచరుండ॥ 10

తే. ఇపుడె మచ్చాపనిర్ముక్త మిషుచయంబు । కాంచనవిభూషితంబు వేగంబ వెడలి
చీల్చి చొచ్చును నీమేను శీఘ్రగతిని । పన్నగంబులు వల్మీకవపువునట్లు॥ 11

తే. దండకాటవి మునుల నే ధర్మరతుల । ఋషుల తపసుల నీవు భక్షించినావొ
వారి వెంటనె నీవును నరిగెదోరి । చచ్చి నాచేత రణమున సబల మిపుడె। 12

తే. ఇపుడె మద్బాణపతితు నిన్ను ధరిత్రి । కరము నికయస్థు జూతురుగాక ఋషులు
దివి విమానస్థులై పూర్వ మెవరు వినుర । హింస నొందిరి నీచేత హీనపడిరి॥ 13

తే. రార కొట్టుర యోరి కులాధముండ । చేతనైనంతయత్నంబు చేసికొనుర
గిట్టి నీతల యిలబడగొట్టు దిపుడె । తాటిపండునుబోలె నీ తనువునుండి॥ 14

తే. ఇటుల రాముండు బల్కంగ పటుతరముగ । క్రోధసంరక్తలోచన గోళుడగుచు
ఖరుడు నవ్వుచు రాఘవు నరసిపలికె । క్రోధమూర్ఛితుడౌచు బల్ రుద్రుడగుచు॥

తే. ప్రాకృతుల రాక్షసుల కొందరను వధించి । దశరథాత్మజ ! నీవు యుద్ధంబునందు
అప్రశస్యుని నిన్ను నీవే ప్రశంస । చేసికొనుచుంటి విటుల నా చెంత నోర ! ॥ 16

కం. బలవంతులు విక్రాంతులు । ఇలను నరర్షభులునౌచు నెసగెడి వారల్
పలుకరు నీవలె గర్వము । తల కెక్కిటు కొంచమైన తమవౌ గొప్పల్॥ 17

కం. అకృతాత్ములు, ప్రాకృతులును । నిక, క్షత్రియపాంసనులును నీవలెనె నిర
ర్థకముల వికత్థనంబుల । వికటత ప్రేలెదరు చూవె వెకిలిగ రామా ! ॥ 18

తే. మృత్యుకాలము రణమున నేగుదేర । వీరు డెవ్వడు స్వయము ప్రీ దూరుడగుచు
తనకులముగొప్ప చెప్పుకోదలచు నోర । స్తవము నప్రస్తవంబున సలుపు నిట్లు ॥

తే. నీ వికత్థనములచేతనే నిజంబు । నీ లఘుత్వంబు దెలిసె పో నిఖిల మిపుడె
తప్తము సువర్ణ రూపంబు దాల్చునట్టి । లఘుకుశాగ్ని సమంబు పో ప్రజ్ఞ నీది॥ 20

తే. కానకుంటివో సస్నేహ కంటికెదుట । ఇదె ధరాధరకరసత్ గదైక ధరుని
ఘన మకంప్యంబు పర్వత మనెడు వాని । ధాతుభిశ్చిత మచలంబు రీతి వాని॥

తే. మూడులోకాల ప్రాణముల్ పొరి గొనంగ । పాశహస్తుడౌ కంసె చాలనెడియట్లు
రణమునను నీదు ప్రాణాల రహిగొనంగ । ఇదె గదాపాణి జాలుదు నేనెయొకడ॥

తే. నిక్క మనవచ్చు నిను గూర్చి పెక్కులింక ॥ అయిన నే నిప్డు కవి యెల్ల యన
దలంప
అస్తమించుచునుండెగా యదునిగొ రవియు। యుద్ధవిఘ్నంబుగాకూడదోయిరామ॥

తే. అదె చతుర్దశసాహస్రు లసురవరులు । క్షితిని హతులైరిగాదె నీ చేత, రామ
భువిని నిన్నిప్డె వధియించి దివిని వారి । కకట అశ్రుప్రమార్జనం బాచరింతు॥24

తే. ఖరుడు పరమాంగదుండు పొంగి గదను ద్రిప్పి । పరమకుపితుండునగుచు నప్పగిది
బలికి
అశనిసందీప్తమో నాగ విసరి వైచె। రామచంద్రునిపైకి త ద్రణధరిత్రి॥ 25

తే. అసుర బాహుప్రయుక్త మా యసమ గదయు । సంప్రదీప్తంబు జని మహాచటుల
గతిని
పథిని వృక్షాల గుల్మాల మసియొనర్చి । రామచంద్రుసమీపాన వ్రాలెధాటి. 26

తే. దాని నటువచ్చుదాని బల్ ధాటిదాని । జ్వలితమును మృత్యుపాశోపమంబుదాని
అంతరిక్షగతంబు నింతింతలుగను । గదను ఛేదించె రాముండు కాండములను॥

తే. గదయును విశీర్ణమై శరకాండములను। భగ్నమాచు మహీస్థలి బడియె నపుడు
వితతమంత్రౌషధబలంబు కతన జేసి।జగతి వినిపాతమా వ్యాళి చందముగను॥ 28

29 వ సర్గ సమాప్తి – (936)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

ముప్పదియవ సర్గ – (41)

జనస్థాన సంగ్రాంగణము

(6) ఖరవధ

తే. భిన్న మొనరించి గదను తద్వేగితమును। ప్రభుఁడు రాముండు ధర్మవత్సలుఁడు వంతఁ
పరిహాసింపుచు ఖరుని నిప్పగిది బలికె। సరగసంరబ్ధ మా రఘుక్ష్మావిభుండు॥ 1

తే. ఇదె ప్రదర్శితమయ్యెగా విదిత మిచట। బలము సర్వస్వమును నీది పందయసుర!
శక్తిహీనతరుండవు జగతి నీవు। నిజము నాకంటె; పేలెదిం కేల వృధగ॥ 2

తే. ఇదియె బాణవినిర్భిన్న మిద్ధరిత్రి। బడియె గదయును నీది క్షపాచరుండ
గట్టివాడవు వట్టి ప్రగల్భములను। నీవు నమ్మిన గద యిదె నేల గలిసె॥ 3

తే. రాక్షసులకు వినష్టుల కీ క్షణంబ। అవని నశ్రుప్రమార్జనం బాచరింతు
ననుచు నీవన్న పలుకును నరయు మోరి। కడకు మిథ్యోక్తియే యయ్యెగా ఖరుండ॥

తే. నీచుడవు క్షుద్రమతివి నిశాచరుండ। అరయ మిథ్యాప్రవృత్తుండ వసురుడవును
ప్రాణముల నీవి గైకొందు రణమునందు। గరుడు డమృతంబుగైకొన్న కరణి
నిపుడె॥ 5

తే॥ ఛిన్నకంఠుని మద్బాణభిన్ను ఖిన్ను। ఫేనబుద్బుదభూషిత శోణితంబు
రణవిదారితు నీరుధిరంబు నోరి। త్రావగలదిప్డె యీ మహి తనివిదీర॥ 6

తే॥ పాంసురూషితసర్వాంగపటలుడవయి। ప్రస్తవిన్యస్తభుజయుగహస్తుడవయి
నేల కౌగిలిబట్టి జెందెదవు నిద్ర। ప్రమదదుర్లభనట్టుల పాలసుండ॥ 7

తే. దీక్షముగ నిట్టు లీవు నిద్రింపనోరి! దండకారణ్య మిద్ది యఖండలీల
గహన శరణ్యంబైయుండె నశరణ్యులకిక । ప్రాణికోట్లకు రాక్షసపాంసనుండ॥ 8

తే. మచ్ఛరంబుల నిటుల క్రూరాచరుండ! త్వత్ జనస్థానమిది హతస్థానమగుడు
నిర్భయంబుగ జరియింత్రు నిఖిలమునులు। నిఖిలదిక్కుల నీ వని నిండుమదిని॥ 9

తే. ఇప్పుడె పరమ త్రిశోక స్త్రైడల చెదరి।యసుర వనితలు హతబంధు లగుచుచూడు
తెరలి శాపార్తిసంచలు దీనలగుచు। బహుభయంబున పరభయావహులు
నిపుడె॥ 10

తే. భగ్రిస్త నినువంటివానిని పతిగ బడసి। పత్ను లనురూపకులలు నీవసుధలోన
మరి నిరర్థకులౌచు నా మెసగగలరు। శోకరసమిట్టిడంచు బల్ శోకమొంది॥

తే. నీచుడ, నృశంస, క్షుద్రాత్మ నిత్యమింక! వసుధ బ్రాహ్మణకంటక యసుర ఖలుడ
నీకతంబుననేగాదె ఋషిజనంబు। భీతిజెందుచు వేల్తురు వీతిహోత్రు। 12

తే. బహుళసంరబ్ధునిటు నిట్లు బలుకుచున్న। రాఘవుని జూచి ఖరుడు తద్రణధరిత్రి
ఖరతరస్వనమౌచు బల్కంగ దొడగె। బిట్టు బెదరించుచును రోషమట్టిమెగయ॥

తే. దృష్టము గర్వము సీతలకెక్క నిజము। కానసే భీతిగానవే భయానగాని
వాచ్యము నవాచ్యమును మృత్యువశతనీవు। తెలియలేకనె యున్నావు; ఫలము
గనెదు॥ 14

తే. కాలపాశపరిక్షిప్తులై లవంబు। కార్యము నకార్యమును నెరుంగక జనంబు
తిరుగుచుందురు నిరస్తషడింద్రియులును। హీనులునునౌచు, ఇంక నిన్నేమనందు॥

ఆ. ఇటుల బలికి ఖరుడు నిల్చె భ్రూకుటి జుట్టి। ఆయుధంబుకొరకు నరసి దిశల
మరి యదూరమందె మహితసాలం బొండు। గాంచె రాక్షసుండు ఘనభుజుండు॥

తే. కొరికి దశనచ్ఛదంబు నా తరువుబెరికి। అల్ల గర్జించి ఖరుడు మహాబలుండు
"చావుమిక"యంచు రాముపై సరగవిసరె। రెండుబాహుల నా మహావృక్ష
మతడు॥ 17

తే. దాని నటువచ్చుదాని ప్రతాపఘనుడు। నరికి బాణౌఘములను నా నడుమలోనె
తీవ్రరోషంబునైకొనె తివిరి ఖరుని। నాజవధియింప శ్రీరాము డా నిశాటు॥ 19

తే. స్వేదముదయింప రాము డా పృథ్వివిభుడు। రోషగతి యూచు రక్తాంతలోచనుండు
శరసహస్రాల సంగరస్థలిని బరపి। ముంచివైచెను ఖరుని నా యుంచితుండు॥ 20

తే. ఖరుని బాణాంతరంబుల నురుతరగతి । ఫేనిలంబది క్షతజంబు విరివి గారె
ప్రస్రవణభూధరమునుండి బారుచుండు । తోయధారాపరిస్రవంబో యనంగ॥ 21

తే. విహ్వలత జెంది శ్రీరాము విశిఖవితతి । మత్తుడు ఖరుండు మరి పరువెత్తెనపుడె
రుధిరగంధానరాము నా యధిప్రపయికె। ద్రుతతరంబగుగతిని త ద్భాకురు జెగసి।

తే. ప్రబలి యటువచ్చువాని సంరబ్ధు జూచి । రక్తరుధిరాప్లుతుని జూచి రాఘవుండు
పటుకృతాస్త్రుండు వెనుకకు పద మొకింత। త్వరితవిక్రము డాతండు త్వరగ జరిపె॥

తే. అంత పావకసంకాశమైన శరము । దీసె రాముండు ఖరుని వధింపనాక
నప్పుడ రెండవ బ్రహ్మదండంబువోలె। వెలుగుచున్నట్టిదాని నా వీరవరుడు॥ 23

తే. స్వామి సురరాజు మఘవుడా ధీమతుండు। ఋషి యగస్త్యుని ముఖమునన నిచ్చినట్టి
శరము నద్దాని ధర్మాత్ము డురుబలుండు । వింట సంధించి ఖరునిపై విడిచె నపుడె॥

ఆ. దాశరథియు చెలగి ధనువునాకర్ణాంత । మటుల లాగి విడిచినట్టి శరము
పిడుగుమ్రోతలెగయ పడియె నప్పుడె పోయి । ఖరుని వక్షమందు త్వరితగతిని॥

ఆ. దహ్యమానుడగుచు త చ్ఛరాగ్నిని వాడు। పడియె భూమిపైన వడిగ ఖరుడు
అంధకుండు పూర్వమందు శ్వేతారణ్య । మందు రుద్రుచేత మ్రిందినట్లు॥ 27

తే. వృత్రుడసురుండు వజ్రంబుచేత నట్లు। నముచి ఫేనంబు కతమున నట్టు లింక
బలుడు నింద్రుని యశనిదా వడిని నట్లు । ఖరుడు హతుడై ర పడియె తక్షణమ
భువిని॥ 28

తే. అంత రాజర్షులును పరమర్షు లెల్ల । ముదితులై కూడి రాము నా భూరిబలుని
కరము పూజించి వచన మిక్కరణిగాగ । పలికి రప్పుడు భువి దివి బలిసి నిలిచి॥

తే. ఏతదర్థమె రామ! మహేంద్రు డపుడు । ధరణి కారీతి యా పురందరుడు వజ్రి
ఆ మహాతేజు డాపాకశాసనుండు । వచ్చె పుణ్యము శరభంగు నాశ్రమంబు॥ 30

తే. క్రొంచురాబడితీవు నీ క్షోణికిటుల । యెటో యుపాయాన నీ మహాఋషులచేత
రాక్షసులపాపకర్ముల రూక్షవపుల । క్రూరులను నిట్లు నీచేత గూల్ప జేయ॥ 31

తే. దశరథాత్మజ ! నీవు మాదైనయట్టి । కార్యమిద్దాని జేసితి వార్యవర్య !
ధర్మము సుఖమ్ము వెలయ నీ దండకోర్వి।ఇక చరింపంగలరు పో ఋషిజనమ్ము॥ 32

ఆ. అంతలోనె యమరు లాకసంబున గూడి । దుందుభులను బాది సందడిగను
పూలవానగురిసి రోలిగ రాముపై । వింతతుష్టి వెలయ స్వాంతములను॥ 33

తే. అట్టి లక్షాధికమ్ముహూర్తమందె యౌర ! క్షేమకర్ములు పదునాల్గు వేలమంది
నిశితశరముల రాముచేనిహతులైరి ! జగతి ఖరదూషణాదిరాక్షసులు నాజి॥ 34, 35

తే. కనుడు తపసులార రాము విదితాత్ము మనయశస్కు ! కార్యమియ్యది; మరి యహో !
వీర్యమిద్ది॥
దాక్ష్యమనుసిద్ధి, మరి యహహ నాక్ష్యమునను ! సోచునిచ్చట విష్ణునిదో యనంగ॥

ఆ. ఇట్లు లనుచు నమున లేగిరి వచ్చిన · దారిబట్టి; యంత త్వరితగతిని
యద్రిగుహను వెడలి యరుదెంచి సౌమిత్రి ! సీతతోడ సుఖిత జేరె కుటిని॥ 37

ఆ. విజయి రాము నంత ఋషుల పూజలనంది ! వొచ్చె నాశ్రమంబు శూరవరుడు
లక్ష్మణుడును తనను రహని ఘూరింపంగ ! హాయినుండె నచట నమరనిభుడు॥

ఆ. శత్రుహంత నతని సకలర్షులకు సుఖా ! వహుని జూచి హృష్టయయ్యె సీత;
భర్త రామచంద్రు పత్ని నూర్తి దేహ ! కౌగలించె ప్రీతి గాఢముగను॥ 39

తే. హతుల రక్షోగణంబుల నరసి యటులె ! రాము నవ్యథు జూచి యా భూమిజాత
పరమముదమునగూడి యప్పట్టునందు ! చాల సంతోషమొందె యా జనకదుహిత॥

తే. రాము రాక్షససంఘమర్దనుని జూచి ! ముదితతాపసనిచయసంపూజ్యుజూచి
సతి శశిప్రభవదన యా పతిని మరల ! కౌగిటను జేర్చి యుప్పొంగె క్ష్మాసుజాత॥

30 వ సర్గ సమాప్తి :— ( 977 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### ముప్పది ఒకటవ సర్గ :- ( 50 )

**జనస్థానవధ వృత్తాంతమును యావత్తు అకంపనుడు రావణుని కెరిగించుట.**

**రావణుడు తక్షణమే యుద్ధమునకు దూకుచుండగ, "వలదు. మాయోపాయముచే సీతను దెమ్ము"ని అకంపనుడు సలహా చెప్పుట. ఈ మాయాజాలమునకు సహాయపడవలసినదని రావణుడు మారీచు నడుగగ, అతడు వలదని చివాట్లు పెట్టి రావణుని ఇంటికి పంపుట :—**

తే. అంత త్వరమాణుడగుచు నకంపనుండు । జవి జనస్థానమునుండి సరగ నపుడె
లంకలోఁ బ్రవేశించి రావణునకు । వార్త నిటుజెప్పె రాక్షసభర్త కతడు‖ 1

తే. రాజచంద్ర! జనస్థానరంగమందు। వెలయు బాహుసంఖ్యరాక్షసుల్ మృతిని గనిరి
ఖరుడు సైతము హతుడయ్యె కదనమందు।ఎటులో తప్పించుకొనివచ్చి తేనునిటకు‖

ఆ. అత డిటుల జెప్ప నా దశగ్రీవుండు । క్రుద్ధుడగుచు రక్తలోచనముల
నిప్పుకనులనతని నిర్దహించెడు రీతి । ఆ యకంపనునకు ననియె నిట్లు‖ 3

ఆ. అరె*పరాసుడెవడురా ! నా జనస్థాన । రమ్యభూమిజొచ్చి రాపువెట్టె?
మూడులోకములను మూఢు డాతం డింక । ఎందుజొచ్చిబ్రతుకు ? నెందునిలుచు?

తే. నాకు విప్రియమొనరించి నాకవిభుడు। నైన సుఖమును బడయంగ నలవి యగునె?
అల కుబేరుడెగాని యా యముడె గాని । విష్ణుడేగాని నేర్చునే వెలయ సుఖిత‖ 5

తే. కాలునకుకాలుడనునేల కాల్చివైతు । పావకునినైన మత్ప్రతాపాగ్ని బరపి
మృత్యువునుసైత మంతంబు నే నొనర్తు । ఎవ్వ డెరుగక న న్నిట్టు లెగసినాడు‖

---

* పరాగతాః అసవః ప్రాణాః యస్య తేన 'పరాసునా' ఇతి పరుషభాషణ మాత్రం = పరాసుడు = చావగోరినవాడు.

తే. ఇంక కోపింతునేని సహించినైతు । పావకాదిత్యులను నా ప్రభావమునన
వాయువేగంబు మద్యోగబలముబరపి । ఇక, హరింపంగ నుత్సహించెదను సతము॥

తే. ఆ దశగ్రీవు క్రుద్ధు నా యసురు జూచి । హస్తములు మోడ్చి యాయకంపనుడు మరల
భీతి సందిగ్ధవచనాల వేడుకొనియె । నభయ మప్పుడు రావణు నా భటుండు 8

ఆ. రక్షసాంవరుండు ప్రభుడు దశాస్యుండు । అభయ మవ్వ డొసగ నాతనికిని
ఆ యకంపనుండు నపుడ విస్రబ్ధుడై । పలికె నిట్లు తొట్రుపాటు బడక॥ 9

తే. దశరథసుతుండు సింహసంహననుడొండు । తరుణు డల్ల వృషస్కంధు డురు బలుండు
చూడ వృత్తాయతమహాభుజుండు గలడు । రామనాముండు నరుడు తద్రిఘుకులుండు॥ 10

కం. వీరుడు పృథుయశుడు మహా । శ్రీరమ్యుడు నతులశౌర్యసత్తుడు బలుడ
య్యారె జనస్థానం బడి । యారెను ఖరదూషణాది సహిత మతనిచేన్॥ 11

తే. ఆ యకంపను వచనంబు నాలకించి । రాక్షసాధిపు డాతండు రావణుండు
రోజు చట్టులె నాగేంద్రభోగగాగ । వచన మిటువల్కె మరల క్షపాచరుండు॥

తే. చెప్పుమ సర్వామరులతోడ జేరియప్పుడు । వజ్రి యల్ల సురేంద్రుండు బలము గాగ
వచ్చె నాయేమి రాముని పజ్జకొర । తజ్జనస్థానసంగరధాత్రి కోరి॥ 13

తే. రావణేశ్వరు త త్పునర్వాక్యములను । విని యకంపను డా రాము విక్రమంబు
నా మహాత్ముని బలము చెప్పందొడంగె । నా సురారికి నపు డా సభాంతరమున॥

తే. రామనాముండు విను మహాభీమ తేజు । డఖిలధానుష్కులను శ్రేష్ఠు డతడు సూవె
పరమదివ్యాస్త్రసుగుణసంపన్నుడౌను । మరి, పురందరసముడు సంగ్రామములను॥

తే. అతని కనురూపుడు బలుండు ననుజుడౌను।వినుము రక్తాక్షుడును దుందుభిస్వనుండు
శశినిభానను డతడు లక్ష్మణుడు నాగ । నుండు నాతని చెంత కోదండ కరుడు॥

తే. రాజవరు డల్ల శ్రీయుతుం డా జితారి । పావకునితోడ అనిలుని భాతి నెపుడు
పాయకుండును రాము డా భ్రాతతోడ । మన జనస్థాన మాతడే మసియొనర్చె॥

తే. ఆ మహాత్ములు దేవత లచట దేవ । లెన లేరయ్య సందియం బిందు లేదు
రుక్మపుంఖాలు మరి పతత్రిలును నౌర । రాఘవోత్సృష్టశరములే రంయి నెగసి
పంచశీర్షోరగంబులై భక్షణంబు । సల్పె నక్కట సర్వరాక్షసుల నాజి॥ 18

తే. ఆయుధంబుల నేవేవి యసురవరులు । దాల్చి భయకర్శితులఁ జేచు దాక దలతు
రవ్వ యవ్వియె దాల్చి యా రాఘవుండును । వారి కెదురుగ దోచు నా ప్రధన
భూమి" 19

తే. "ఇట్టుల వినాశితంబయ్యె దిట్టమైన । నీ జనస్థాన మనఘ" యం చెల్ల దెలుప
విని "జనస్థానమిప్పుడే వేగ బోదు । రామలక్ష్మణులనుగూల్ప రాల్ప"నంచు॥ 21

తే. ప్రభుడు రావణుడన నకంపనుడు నంత । చెప్పదొడగెను రాముని గొప్పనిట్లు :
"వినుము రాజ యథావృత్త మింక చెప్పుదు । రాము బలపౌరుషంబుల క్రమ మ
దెల్ల॥ 22

తే. అత డసాధ్యుండు కుపితుండయ్యెనేని । రాముడు మహాయశుండు విక్రమ
ధనుండు
విను సుపూర్ణాంబు నాపగావేగ మతడు । పరిమారించును శరముల బరపి తృటిని॥

తే. తరళసగ్రహనక్షత్రతారకంబు । నభము నైతము నతడు సించంగలండు
అబ్ధి మునిగెడి నిమ్మహి నైన నతడు । శ్రీయుతుం డుద్ధరింపంగ చెలగ గలడు। 24

తే. కంధివేలను ద్రెంచి లోకముల నెల్ల । ముంచివేయంగగలడు రాముండు విభుడు
వనధి వేగంబునైన యా వాయుదేవు । వేగమునునైన శరముల వీగజేయు॥ 25

తే. లోకముల సంహరించి బల్ పీకతోడ । మరల నట్టులె సృజియింప మహిమగలడు
త న్మహాయశుడా రామధరణివిభుడు । పురుషసింహుండు దశరథ భూపసుతుడు।

తే. విను దశగ్రీవ ! రాము నా విభుని నింక । కదనమున గెల్వ నీకు శక్యంబుగాదు
చేరలేరు నిశాచరవారమేని । స్వర్గ మది పాపజనులకు వశ్యమగునె ? 27

తే. కడకు దేవాసురాదు లొక్కటిగ గూడి । నైన రాము వధింపలేరంచు దలతు
ఇకను రామువధోపాయ మొకటి జెప్పుదు । వినుము దానిని యేకమా మనసుతోడ॥

తే. భార్య యతనికి గలదు బల్ బాగసుండు । లోకములకెల్ల నుత్తమలోలనయన
సీత యందు సుమధ్యమ చెబుదు శ్యామ । సమవిభక్తాంగి చక్కని సారసాక్షి
రత్నభూషిత యాపె స్త్రీరత్నమాను॥ 30

తే. దానికి సమంబు లేదు గంధర్వులందు । అప్సరలయందు దేవతలందునైన
అట్టి సీమంతినిని గాన మసురులందు । మనుజులం దెట్టు లింక పో కనగనగును॥

తే. అపహరింపుము వాని భార్యను వనోర్వి । ఇకయుపాయాన నీ వెట్లొ సుకరముగను
సీత లేకున్న కామి యా చెనటి నరుడు। రాము డెడబాయు ప్రాణాల క్రమతచివికి॥

తే. "హా తె! యిదేభాగు! భాగం"చు మదికి దోప । రాక్షసాధిపు డప్పు డా రావణుండు
కొంచెమేనియొ యోచించి ఘనభుజుండు । మరల నిట్టు లకంపను నరసిపలికె॥

తే. మంచి దిదె కాల్యమునఁబోదు మించుగతిని । ఒక్కఁడనె సారథిని వెంటనొనరగొనుచు
తెత్తు నా రాము భార్య వైదేహి నిటకు । నీ మహాపురి కింక సంహృష్టమతిని॥

ఆ. ఇట్టు లనుచు వేగ నట్టి రావణుఁడును । తరలె నట్టె గాడిదల రథాన
దిశల సర్వములను దీపింపజేయు చా । యర్కవర్ణమైన స్యందనమున॥ 34

తే. రాక్షసేంద్రుని దైన తద్రథవరంబు । దీప్తి నక్షత్రపథమున దిరుగుచుండి
జలదములలోన దిరిగెడి చంద్రుమాడ్కి । గ్రాలె నప్పుడు బహుచిత్ర గతులతోడ॥ 35

తే. వేగ మారీచు నాశ్రయం బొగి డిగ్గి । తాటకేయుని జేర వాతడును నతని
భక్ష్యభోజ్యాలనర్పించె ప్రభువరేణ్యు । మరి మనుష్యసుదుర్లభంబైన భుక్తి॥ 36

ఆ. అతని స్వాయము పూజనాసనోదకముల । జేసి ప్రీతి రాక్షసేశుతోడ
ననియె తాటకేయు డర్థోపహితములౌ । వాక్యములను నిట్లు వాక్య విదుడు॥ 37

తే. రాజ! సుకుశలమే లోకరాజికిప్పుడు? రాక్షసేశ్వర నీ విట్లు రయము మీర
వచ్చియుంటకు శంకింతు; వ్యర్థమిటుల । నాథ! రావుగ; మరి కారణంబెరుంగ॥

తే. ఇటుల మారీచుడనగ నైరృతవిభుండు । చండతేజుండు తద్రావణుండు నపుడు
వాక్యకోవిదు డిట్టుల వాక్యములను । బలికె నాతనితోడ నవార్యగతిని॥ 39

తే. నాదు నారక్షకుం డంతంబు నందినాడు । రాము నక్లిష్టకర్ముచే రణములోన
అదె జనస్థాన మిల యవధ్యంబునాది । సర్వము నిపాతితంబయ్యె సంగరమున॥

తే. అట్టి నా కొనరింపు సాయంబు నీవు । రాము భార్యాపహరణ కార్యంబునందు
ననుచు బల్కంగ నా రాక్షసనాధి నాధు । తోడ నిట్లనె మారీచు డోడ కప్పుడు॥

తే. మిత్రరూపాన నెవ్వండు శత్రువయ్యె । సీత పేరును నీ కొర చెప్పినాడు!
ఇంక నీచేతబడిన వాడెవ్వడెంచు । నిన్ను రాక్షసశార్దూల నీరుజేయ 42

తే. సీతఁ దెమ్మంచు నెవఁడురా చెప్పె నీకు? అఖిలరాక్షసలోకశృంగంబు నెవడు
ముంపదలబెట్టు? నిన్నిట్లు ప్రోత్సహించు? । శత్రువేవాడు నీకు నిశ్చయము చెప్పు॥ 43

తే. అవుర, ఆశీవిషాస్యంబునందునుండి । దంష్ట్రనీచేత బెరికింప దలచు నెవడు !
ఎవ్వడీ కర్మచేత నీకిట్టు లకట । శాపథంబును బోధించె వాసి, చెప్పు
అయ్యొ సుఖసుప్తనీతలవ్రియ్యలుగను । ఎవడురా కొల్లె రెంచె నే భువనములను !

సీ. సదమలవంశాభిజననాగ్రహస్తంబు । భూరి తేజోమహాభూషితంబు
సంస్థితపృథుదోర్విషాణద్వయంబును । నైనరాఘవగంధహస్తినింక
రణరంగమున నీవు రావణా ! తలపెత్తి । మైనవీక్షింపంగ వలతిగావు;
సంగరాంతస్థితి సంధివాలంబును । ప్రవిదగ్ధ రక్షోమృగాపహంబు

తే. పటు శరాంగప్రపూర్ణంబు సటయుతంబు। చూడ నిశితాసిదంష్ట్రంబు సుప్తమద్ది
ఉగ్రసింహంబు మేల్కొల్ప యుక్తమింక । కాదు నీ కోయి రావణా కనుమ
బుద్ధి॥ 46

సీ. చాపావహారంబు శరతరంగోగ్రంబు । భుజవేగపంకసంపూరితంబు
సుమహాహవౌఘంబు చూడ బల్ ఘోరంబు । రామపాతాళంబు రౌద్రమద్ది
అద్దాని ముఖమున నయ్యారయో నీవింక । పడుటయుక్తముగాదు పారజూడు
శమియింపు లంకేశ చాలింక సాధువై । లంకకుపోవమ్మోయి రాక్షసేశ

తే. స్వీయదారలతోడ రమింపుమోయి । హాయి నిత్యము నీవింక యసురనాథ;
రాముడు సభార్యుడౌచు నరణ్యమందు । ఘనుడు రమియించుచుండును గాక,
హాయి॥ 48

తే. ఇట్లు మారీచు డన దశగ్రీవుడపుడు । రావణుడింక మరలె నా లంకపురికి
మరి, ప్రవేశించె తనదు వేశ్మంబునందు । త ద్గృహోత్తమమందు పదంబు
లిడుచు॥ 50

31 వ సర్గ సమాప్తి :— ( 1,027 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

ముప్పది రెండవ సర్గ - (32)

**దర్బారులోనున్న రావణుని వర్ణన - శూర్పణఖ అతనివద్దకు పరుగువారుట.**

ఆ. అంత శూర్పణఖయు నటు చతుర్దశసంఖ్య । వేలరాక్షసులును భీమబలులు
రాము నొకనిచేత రాలిపోవుట జూచి। కినుక మదినిగుంది కలతజెంది 1

ఆ. ఖరుడు దూషణుండు మరియును త్రిశిరుండు। నటులె చచ్చుటరసి యాజిలోన
మరల యసురి యద్ది మరి మహానాదంబు । సలిపి బొబ్బరించె జలద మటుల॥ 2

తే. రాము డొనరించినట్టి యుగ్రింపుపనిని । పరులకు సుదుర్లభంబునై బరగుదాని
వెలది వీక్షించి మిగుల యుద్విగ్నయగుచు । పరచె లంకకు రావణపాలితకును 3

తే. పరచి యట గాంచె నా విమానాగ్రమందు। రావణుని దీప్తతేజుని దేవనిభుని
దివి మరుత్తులతోడ వాసవునిపోల్కి। సచివుల నుపోపవిష్టుడై సాగువాని 4

సీ. పరమాసనంబు తత్ స్వర్ణాసనంబున। నాసీను సూర్యసంకాశు నుగ్రు
రుక్మవేదిగతంబు రుచిరజ్వాలంతంబు। ప్రాజ్యంబు పావకుభంగివాని
అమరగంధర్వభూతాళికి ఋషులకు । నవిజేయు నాజి మహాత్ములకును
శూరు వ్యాత్తాననుం జూడ నంతకుబోలు। భీకరు నాభీలు భీమతేజు

తే. ప్రకట దేవాసురవిమర్దరంగములను । నిశిత వజ్రాశనికృతవ్రణైకవపుని
అభ్రమాతంగతీక్ష్ణదంతాగ్రలిఖిత। సురుచిరోత్కృష్టకిణవక్షు జూచె నసురి 7

ద్వి. వింశద్భుజంబుల వీరు దశాస్యు । సువిశాలవక్షు నా శూరాగ్రగణ్యు
దర్శనీయ పరిచ్ఛదంబుల వాని । రాజలక్షణరాజి రమ్యమహావాని 8

స్నిగ్ధవైడూర్యప్రసిద్ధసంకాశు । తప్తకాంచనకుండలోత్తమ గంషు
సుభుజు, మహాస్యు నా శుక్లసందశను । పర్వతోపము భీము సర్వభీకరుని॥ 9

దేవసంయుగముల తీక్ష్ణమౌ విష్ణు । చక్రనిపాతాల శతములతోడ
అన్యశస్త్రంబుల నా ప్రహారముల । తత మహాయుద్ధాల తాడితు నతని॥ 10

దేవప్రహరణాల తివిరి యన్నింట। అహతాంగు కర్కశు నక్షోభ్యమైన
సకలసముద్రాల సంక్షోభబెట్టు । నక్షుభ్యు, నతివేగు, రూక్షవీక్షణుని॥ 11

పర్వతేంద్రంబుల పయిఁజిమ్మువాని । మరిమారి సురలను మర్దించువాని
చెలఁగి ధర్మంబుల ఛేదించువాని । మరి పరదారాభిమర్శను ఖలుసి
సర్వదివ్యాస్త్రాల సరివైచువాని। అనయంబు యజ్ఞవిఘ్నము సేయువాని॥ 12

పురి భోగవతి జేరి తరిమి వాసుకిని । తక్షకు భార్యను తన్వి నా ప్రియను
దిగిచి బలాత్కృతిఁ దెచ్చినవాని 13

కైలాసపర్వతాగ్రముమీఁది కరిగి । నరవాహను కుబేరు నన్నను దోలి
కామగంబు విమాన మా మహాత్మునిది। బలిమిమై దెచ్చిన బలవంతు నతని॥ 14

వనము చైత్రరథంబు వనము నందనము। దివ్య మా నళినిని తీవ్రకోపమున
సకలదేవోద్యానచయములనెల్ల । ధ్వంసంబు జేసిన వాని నా వీరు॥ 15

చంద్రసూర్యుల మహైశ్వర్యవంతులను। ఉదయించుచున్న యా యుగ్రతేజులను
ఉరుపరంతపుల బాహులదోసి నిలుప । గల శైలశిఖరవిఖ్యాతబలాఢ్యు॥ 16

మును మహావనమున ఘనత తపంబు । పదివేల యేండ్లార భక్తి గావించి
నిజశిరంబులదుంచి యజునకు బ్రీతి । ఉపహారముల నిడ్డ నుగ్రు నా ధీరు॥ 17

దేవదానవయక్షదివ్యగంధర్వ । పతగపిశాచ సర్పాదులవలన
మనుజులచే దక్క మరణంపు భీతి । రణములలేనట్టి రౌద్రు నాతనిని॥ 18

అధ్వరంబులను బ్రాహ్మణులచే సతము। విమలమంత్రాభిష్టుతమును పుణ్యంబు
రాజిత మా హవిర్ధానంబులోన । వెలయు సోమంబును వితథంబుగాఁగ
సేయు మహాబలు చెరుపు నా యసురు॥ 19

ద్వి. ప్రాప్తయజ్ఞాపహర్తను క్రూరు దుష్టు। రాక్షసుని మరి నిరక్రోశుని క్షుద్రు
బ్రహ్మఘ్ను కర్కశు, బ్రజలకుసతము । అహితంబెకోరు నా యవినీతి రతుని॥ 20

సర్వభూతాళికి సర్వలోకముల॥ కెపుడు భయావహు పృథుబలోద్దాము
అన్న నా రావణు చెన్నొప్పు వాని। శూర్పణఖయు జేరి జూచె పీఠమున॥ 21

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### ముప్పది మూడవ సర్గ :— ( 24 )

తన రాజ్యములో ఇంతటి జనస్థానవధ జరుగుచుండగ, తాను ప్రమత్తుడై ఏల ఎఱుగకుంటివని శూర్పణఖ రావణుని తీవ్రరోషముతో దర్బారులో నిందించి పలుకుట :—

తే. శూర్పణఖ దీన యప్పుడా శూరవర్యు । లోకరావణు రావణు వీక జూచి
మంత్రిమధ్యంబునం దిట్లు మాట బలికె। పరమసంక్రుద్ధయగుచును పరుషముగను॥

తే. భువి ప్రమత్తుండవై కామభోగములను । స్వైరవృత్తి నిరంకుశుండవును నౌచు
భయము ఘోరము మరి సముత్పన్న మౌర । ఎరకుంటివి బోద్ధవ్య మింక నీవు॥

తే. గ్రామ్యభోగాల సంసక్తు కామవృత్తు । లుబ్ధు ధరణీపు గనుగొని లోకు లెపుడు
గౌరవింపరు, జూతురు కాటిలోని । నిప్పుచందాన రావణా చెప్పి తింత॥ 3

తే. స్వయము కార్యాల నయ్యయి సమయములను। జేసికొనకుండునట్టి పృథ్వీశు డెపుడు
తనదు కార్యాల చెడగొట్టుకొనుటె కాక । రాజ్య మూడంగ తానును రాలి
పోవు॥ 4

ఆ. నృపు నయుక్తచారు నెప్డు నస్వాధీను । దర్శనంబునిడని దంభు హీను
దూరమందె విడిచి తొలగిపోదురు నరుల్ । ఏటియడుసువిడుచు నేన్గు లాగు॥ 5

తే. సతము సాధ్వీనతనుతప్పి సంచరించి । దేశమును రక్షసేయని నృపతు లౌర
వృద్ధిపొందరు మరి ప్రకాశింపరెప్డు । గిరులు సాగరకుక్షిమున్గినవిధాన॥ 6

తే. ఆత్మవంతులు దేవగంధర్వులాది । దోర్బలులతోడ నీవు శత్రుత్వమూని
చపలుడ వయుక్తచారుడ వవశుఁడుండ। వెటుల రక్షించు కొందు రాజ్యోందిరనిక॥

తే. నీవు బాలస్వభావుండ వేమనందు । బుద్ధిహీనుండవును నయ్యొ భువనములను
ఎఱుగ వలసినవాని చే యెఱుగ వీవు । ఎటుల రాజ్యేందిర నిక దక్కించుకొనెదు॥

తే. కోశము నయంబు చారులు కొల్లలుగను । నృపతు లెవరికి స్వాధీన మింత లేవొ
వారు ప్రాకృతజనులతో పాటివారె । తగ వెరుగుమన్న యో జయతాంవరుండ! ॥

తే. దూరమున నున్న సర్వార్థవారములను । చారతతిచేత జూచుచు జరుగుచుంట
"దీర్ఘచక్షు"లటన్న ప్రతీతిగలిగె । రాజులకు భూతలంబున రాజచంద్ర॥ 10

తే. నీ విన్నిక యయుక్తచారుడం చెంతునోయి! వెడగ! ప్రాకృతసచివసంవృతుడవందు
స్వజన మిట్లు జనస్థానసంగరమున । చచ్చుటెఱుగవు; నీ వెట్టి జగతిపతివొ॥ 11

తే. వేలు పదునాల్గు రాక్షసుల్ భీమబలులు । క్రూరకర్ములు రణములో కూలి రయ్యొ
రాముడను నొక్క నరునిచే రాక్షసేంద్ర । మనదు ఖరదూషణాదులున్ మడిసి రయ్యొ॥ 12

తే. ఋషులకిచ్చెను నభయమా హీననరుడు। క్షేమ మొనరించె దండకక్షితి నతండు
ధర్షితముజేసె మన జనస్థాన మెల్ల । రాము డక్లిష్టకర్ముండు రార! చూడు॥ 13

తే. నీవొ లుబ్ధుండవు ప్రమత్తభావుడవును । మరి పరాధీనుడవు నింత యెఱుగ వోరి
నీదు రాజ్యంబునందునే మీది కింత । భయము మూగియు వచ్చుట వాజ! నీవు॥

తే. తీక్ష్ణు, డల్పప్రదాత, నికృష్టు డనద । గర్వితుండు ప్రమత్తుండు కడు శఠుండు
నైన పార్థివునకుగల్గు వ్యసనములను । ప్రజలు తోడ్పడబోవరు పరిహసింత్రు॥ 15

తే. క్రోధి యగ్రాహ్యు డతిమాని క్రూరబుద్ధి । ఆత్మసంభావితుడు నగు నవనిపతికి
వ్యసనములు దాపురించినయప్పుడైన । తోడ్పడక జంపివైతురు తోడివారె॥ 16

తే. ఉచితకాలాల కార్యంబు లొనరుపకయు । భీతికారణములపట్ల భీతిలకయు
సంచరించెడి నృపతి రాజ్యంబునుండి । భ్రష్టుడై దీనుడై గడ్డిపరక యగును॥ 17

తే. మట్టిగడ్డల యెండిన కట్టియలను । దుమ్ముధూళినినుండు కార్యమ్ము కొంత
కాని పదవీచ్యుతినిగన్న క్ష్మాధినాథు । వలననుండదు కార్య మావంతయేని॥ 18

తే. వస్త్ర ముపభుక్త మెట్టులో వసుధలోన । మృదితము స్రజంబు నెట్టులో విదిత బలుడ
అటులె రాజ్యపరిభ్రష్టు డవనిపతియు । మరి నిరర్థకుడగును సమర్థుడయ్యు॥ 19

తే. అప్రమత్తుఁడు సర్వజ్ఞుఁ డనవరతము । ఘనుఁడు జితేంద్రియుఁడును ధర్మవర్తనుఁడును
మఱి కృతజ్ఞుఁడునై నట్టి ధరణివిభుఁడు । చిరము నిలుచును స్థిరతను సింహపీఠి॥ 20

తే. నయనగతిని ప్రసుప్తుఁడే యయినఁగాని । ఎవఁడు నయచక్షువులను జాగృతిని గనునొ
ఎవని కోపప్రసాదముల్ వ్యక్తయి గావొ । అట్టిరాజు ప్రజాళిచే నర్చబడయు॥

తే. నీవొ రావణ దుర్బుద్ధి వేమనందు । గుణములివి యేవియేనియందు గనఁగరావు
ని జనంబులకైన యీ నిరయ మింత । ఎఱుఁగవైతివి నీ చారబృందములను॥ 22

ఉ॥ నీవు పరాకుమంతవు మునింగెదు పో విషయాభిలాషల్
వావిరి దేశకాలప్రవిభాగపుతత్త్వమెఱుంగ వక్కటా
కేవలబుద్ధినిశ్చయమొకింత యెఱుంగవు మంచిచెడ్డలన్
కావున భగ్నరాజ్యుఁడవునై యచిరంబ నశింతు వీ వహో॥ 23

తే. ఇట్లు స్వదోషాల నింతి యెంతేని బల్కు । బుద్ధివీక్షించి రాక్షసపుంగవుండు
ధనము బలమును దర్పంబు దనరువాఁడు । చిరము యోచించె రావణుం డెడద
లోన॥ 24

33 వ సర్గ సమాప్తి :— ( 1,067 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్య కాండము

### ముప్పది నాల్గవ సర్గ :— ( 27 )

రాముడెట్టివాడని రావణుడడుగ, శూర్పణఖ రామలక్ష్మణుల బలపరాక్రమములగూర్చియు, ముఖ్యముగ సీత సౌందర్యమును గూర్చియు వర్ణించి, రామునకు శాస్తి చేయదలచుచో, సీతను ఎత్తుకు రమ్మని సలహా చెప్పుట :—

ఆ. పరుష మిటుల బలుకు భగిని శూర్పణఖను । కుపిత నరసి మిగుల కుపితు డగుచు
మంత్రిమధ్యమందు మరి యిట్లు ప్రశ్నించె । రావణుండు లోకరావణుండు. 1

తే. ఎవడు రాముడు, వీర్యము నెట్టి దోసి । ఎట్టిది పరాక్రమంబు, రూపెట్టులుండు
ఏమికారణమునకొచ్చె నిట్టు లతడు । దండకారణ్యము దురాసదంబు చెపుమ॥

తే. ఆయుధం బేది రాముని కాజిలోన । దేనిచే జంపె మన జనస్థానబలము
ఖరుడు త్రిశిరుండు దూషణుం డురుబలుండు । దేన హతులైరి వానిచే దెలుపు
మబల॥ 3

తే. రాక్షసేంద్రుండు తననిట్లు ప్రశ్న సేయ । క్రోధమూర్ఛిత రాక్షసి గొబ్బు నపుడు
రాముగూర్చి యథాతథ్య మామె యచట । చెప్పదొడగెను భగిని యా చుప్ప
నాతి॥ 4

తే. దీర్ఘబాహుండు సువిశాల దీప్తచక్షు । డల్ల కందర్పతుల్యరూపంబువాడు
చీరకృష్ణాజినాంబరధారు డతడు । దశరథాత్మజు డా రామధరణివిభుడు॥ 5

తే. శక్రచాపనిభంబు నా చాప మతడు । లాగి కనకాంగదంబు నారాచములను
విడుచు దీప్తంబులను మహావిషయుతముల । సర్పములనట్లు రిపులపై సంగరమున॥

తే. చూడను శరంబుల గ్రహించుచుండు టతడు । చూడను శిలీముఖాల విద్చుచును నుంటు
చూడ కార్ముకమునులాగుచునికి సుంత। చూతు శరవృష్టి మనవారుచూర్ణమగుటె
మఘువు రాల్ వాన మేల్ సస్యమటుల నాజి॥ 7

తే. రాక్షసులు భీమరూపులు రాలి పడిరి । ఆజి నర్ధాధికముహూర్తమందె వేలు
పదియునాల్గును నొక్క కాల్బంటుచేత । ఖరశరంబుల దూషణఖరయుతంబు।

తే. ఎటులొ న న్నొకతెను మాత్ర మిటుల విడిచె । నా మహాత్ముడు విదితాత్ముడా మనస్వి
స్త్రీవధముకూడదంచు శంకించి యెడద । ఇక పరాభ మొనరించి యీ విధంబు॥

తే. ఋషుల కెల్లర కభయంబు నిచ్చె నతడు । క్షేమమొనరించె దండకక్షితిని నెల్ల
నిర్భయంబుగ విహరింత్రు నిఖిల ఋషులు । నరులు చూడుమ మనదు దండకను నింక॥

తే. తమ్ము డతనికి తుల్యుండు ధైర్యవీర్య। విక్రమాదికగుణముల వినుతబలుడు
భక్తు డనురక్తుడును తన భ్రాత కెపుడు । లక్ష్మణుండనునట్టి పేర్గన్నవాడు॥ 12

తే. దుర్జయు, డమర్షి, జేత, బల్ దొడ్డగుణుడు । బలుడు విక్రాంతుడును బుద్ధిమంతు డతడు
దక్షిణభుజంబు రామున కే క్షణంబు। ప్రాణము బహిశ్చరంబు త ద్భ్రాత కతడు॥

తే. రామునకుగల్గుపో విశాలాక్షి రమణి । అమల పూర్ణేందుసదృశముఖారవింద
తద్ద యనురక్త ప్రియయును ధర్మపత్ని । సతము ప్రియహితరత భర్త కతివ యాపె॥ 14

తే. సుదతి యాపె సునాసోరు సుముఖి సుకుచ । మరి సుకేశి యశస్విని వర సురూప
వనము నద్దాని కమరు దేవతయొ నాగ। అపర లక్ష్మియొనాగ నా యార్యపత్ని॥

తే. తప్తకాంచన వర్ణాభ తన్వి శుభద । రక్తతుంగ నఖంబుల రమణి యాపె
సీతయంద్రు వరారోహ చెప్పుదు రన్న । వనిత వైదేహి తనుమధ్య ఘననితంబ।

తే. దేవతలలోన కిన్నరీ బృందములను । యక్షులందును నాగగంధర్వులందు
భూతలంబున నెందు నీ సీతబోలు । సుందరినిజూడ మున్నెవ్వ నందగాడ॥ 17

తే. భార్య యెవనికినగును నా భామ సీత । మించి యెవనిని మరి కౌగలించునుబ్బి
సర్వలోకాల నా భాగ్యశాలి యారు । తనరు నెక్కుడుగా పురందరునికంటె॥ 18

**తే.** అనుపమ సుశీల యీ వపుశ్శ్లాఘ్య సీత। రూప మప్రతిమము వరారోహ శోభనా!
వనిత నీ కనురూపయా భార్య యగును। నీవు ననురూపపతివౌదు నెలత కన్న॥

**తే.** వినుము విస్తీర్ణజఘన నా పీనకుచను। పీనసుశ్రోణి సీత వరానన నిక
నీకు భార్యగబట్టితేనెంచ నన్ను। మరి విరూపగ జేసె లక్ష్మణుడు బట్టి॥ 20

**తే.** పూర్ణచంద్రనిభానన పూవుబోడి। సుదతి వైదేహి నిక నీవు జూచితేని
మన్మథశరాళి కీవు నమూంతముగను। మరి విధేయుడవౌదు పో కరగి సురిగి॥ 21

**తే.** నీకుభార్యార్థ మామెపై హృదయమందు। కర మభిప్రాయమేగన్న గలిగితేని
శీఘ్రమే లెమ్ము రమ్ము దక్షిణపదమ్ము। ముందుపెట్టుము మరి జయమ్మును
గొనంగ॥ 22

**తే.** అటులొనర్చి ప్రియమ్ము నీ యసురతతికి। రాక్షసేశ్వర యొనరింపు రణములోన
రాము నాశ్రమవాసి నా ప్రబలు క్రూరు। పట్టి పల్లార్చి వధియించి భల్లములను॥

**తే.** రాము లక్ష్మణు నా మహారథునిగూడ। ఆజి శరములగూల్చి తీక్ష్ణాగ్రములను
సుదతి హతనాథ సీత నా సుకుచ నీవు। * హాయి భోగింపగలవు యథా
సుఖంబు॥ 24

**తే.** ఇద్ది నామాట నీకు రుచించునేని। రాక్షసేశ్వర! రావణ! ప్రబలి యిపుడె
నిర్విశంకగ సేయుము నేను నీకు। చెప్పియున్నసమస్త మీ చొప్పుగాగ। 25

**తే.** నీకుగల యాత్మశక్తిని నెరి నెరింగి। సీత సర్వానవద్యాంగి నృపతిసతిని
రాక్షసేశ్వర యింక భార్యార్థమీవు। బలిమి నబలను గొనితెమ్ము; చెలగిపొమ్ము॥

**తే.** శరముల నజిహ్మగముల రాక్షసబలంబు। రాముచేత జనస్థాన రంగమందు
జచ్చుటెరిగియు ఖరుడు దూషణుడు నటులె! తెగుట దెలిసియు ప్రతిక్రియ తెర
గెరుంగు 27

* ( పట్టి భోగింపగలవు పో బహుసుఖముగ )

34 వ సర్గ సమాప్తి :— ( 1,103 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ముప్పది అయిదవ సర్గ:- ( 42 )

రావణుఁ డాకాశ యానమున సముద్రతీర దృశ్యముల జూచుచు, మారీచాశ్రమము జేరుట :—
“ మరల ఎందుకువచ్చితి”వని మారీచుడడుగుట :—

తే. శూర్పణఖ వాక్యములను విన్నను నతండు । రోమహర్షణములను నా రుచిరములను
సచివులనువీడుకొంచు దా జనియె నప్పుడె । కార్యశక్తిఁదలంచి రక్కసుడు వడిగ॥

తే. బహువిధంబుల యోచించి పారజూచి । బలము నబలంబు మంచిచెడ్డలను తరచి
పంథనొకదాని నిశ్చయ పరచుకొంచు । నరిగె స్థిరబుద్ధి రమ్య మా యానశాల॥

తే. అటుల సంఛన్నతను యానశాల కరిగి । “ రథముపూన్పుము వేగ సారథి ” యటంచు
సూతు నాజ్ఞప్తి గావించె పాతకుండు । రాక్షసాధిపు డాతండు రావణుండు॥ 4

తే. ఘనుడు ప్రభు డిట్టులన్న తక్షణములోనె । సగగ లఘువిక్రముండు తత్ సారథియును
ప్రభునకభిమత ముత్తమంబైన దాని । రథము సమకూర్చె నప్పు డా రావణునకు॥

తే. కాంచనరథంబు కామగం బంచితంబు । కాంచనవిభూషితంబు తత్ ఖరయుతంబు
తద్దయు పిశాచవదనయుక్తంబు దాని । రత్నభూషితమును నెక్కె రావణుండు॥.

తే. అల్ల మేఘప్రతిమనాదమైనదాని । స్యందనంబును శ్రీయుతుండాత డెక్కి
ప్రబలి ధనదానుజుండు తద్రావణుండు । నదనదీపతి జేరె సంద్రంబు నపుడ॥

సీ. శ్వేతాతపత్రముల్ శ్వేతవాలవ్యజ । నంబులవెల్గొందు నందగాను
స్నిగ్ధవైడూర్యసందీప్తమందు తప్తకాంచనకుంభలుండు దశాననుండు
వింశద్భుజంబుల పీఠమందు త్రిదశారి । దర్శనీయపరిచ్ఛదములవాడు
దశశిరస్సు మదిరా ట్టిన దశగ్రీవుండు । క్రూరుండు మరి మునీంద్రఘ్ను డౌర

తే. కామగంబు రథంబు రాక్షస విభుండు । నెక్కి వెలిగెను సబలాక మక్కజంబు
నభసి విద్యుత్ప్రతానమండలముతోడ । వెలుగు మేఘంబు భాతిగా వీరు డతడు॥

తే. నాగరాజాప మద్రి సశైల మతడు । వీర్యవంతుండు జూచుచు నింట నరిగె
వసుధ నానాఫలాళీ ప్రసూనముల తరుల । వేనవేలుగ కీర్ణమై వెలయు దాని॥ 11

తే. శీతమంగళతోయ విఖ్యాతములను । పద్మములు నెల్లయెడల సొంపలరు దాని;
విస్తృతంబుల వేదుల వెలయునట్టి । యాశ్రమపదాల నిండిన యట్టిదాని॥ 12

తే. బహుకదళ్యాఢకీ సుసంబాధమౌచు । నారికేళపశోభితం బగుచు నెచట
సాల తాల తమాల పుష్పాఢ్యతరుల । సంవృతంబౌచు నల్లెడ జరుగుదాని॥ 13

తే. నాగ,కిన్నర,గరుడ,గంధర్వతతుల । అజుల, వైఖానసులను, మాషాది ఋషుల
వాలఖిల్య,మరీచిపాద్యఖిలమునులు । అవని నత్యంత నియమితాహారులైన
పరమ ఋషులను శోభితంబైన దాని॥ 14

తే. ధృతిని జితకాములగుచు వెలైసగునట్టి । సిద్ధతతులను చారణబృందములను
స్తుణ్యాపములను మరియు కింపురుషతతుల । పృథ్వి నుపశోభితంబునై వెలయుదాని॥

తే. దివ్యమాల్యాభరణజాల దీప్తిదనరి । ఘనత క్రీడారతివిధిజ్ఞతను నెసంగి
దివ్యరూపంబుల వెలంగు దివ్యసతుల । నప్సరసహస్రములతోడ నలరుదాని॥ 16

తే. శ్రీమతుల దేవపత్నుల సేవితంబు । శ్రీవిశాలంబు సంతత శ్రీయుతంబు
దేవదానవసంఘాల దివ్యతనుల । నమృతభుక్కుల చరితంబునైన దాని॥ 17

తే. క్రౌంచ, హంస, ప్లవాకీర్ణ మంచితంబు । సతతసారససంఘుష్టాదితతలంబు
రమ్యవైడూర్యమణిగణప్రస్తరంబు । తరళ నాగాంకాంతి స్నిగ్ధంబు దాని॥ 18

తే. పాండరంబుల, సువిశాల భాగములను । దివ్యమాల్యాయుతంబుల దివ్యతూర్య
మహిత గీతాభిజుష్టవిమానములను । తత తపోజితలోకుల తాపసులవి॥ 19

తే. కామగంబుల గాంచె నాకాశవీథి । జనుచు ధనదానుజుం డట గనియె మరియు
అప్సరసలను కింపురుషాంగనలను । వినుత గాంధర్వవనితల వివిధగతుల॥

తే. సరస నిర్యాస రసమూలచందనముల । సౌమ్యవనముల వే లోష్ఠ సంఖ్యలుగను
ఘ్రాణతృప్తికరంబుల రావణుండు । గాంచుచేగెను చెలగి యాకాశవీధి॥ 21

తే. అగరువనముల నుపవనవార్తిములను । జాతితక్కోలవనముల ఖ్యాతిమీరు
బహుసుగంధిఫలంబుల వన చయముల । గాంచుచేగెను నహుష డాకాశవీధి। 22

తే. భువి తమాలంపు పుష్పసమూహములను । మరియు మిరియపుతీగెలపందిళులను
తీరముల నెండుచుండు ముత్తియపుచిప్ప । కుప్పలను జూచుకొను చేగె నుప్పర
ముస॥ 23

తే. శంఖముల ప్రస్తరంబు లసంఖ్యములను । తరళరత్న ప్రవాళ విస్తారములను
రజతకాంచనపర్వతప్రాంతములను । ప్రభ మనోజ్ఞంబులైన ప్రస్రవణములను
భువి ప్రసన్నంబులౌ హ్రదంబులను గనుచు॥ 24

తే. బహుళ ధనధాన్యసంపన్న పట్టణముల । పొంగు స్త్రీరత్నసంశోభితాంగణముల
మహిత హస్త్యశ్వరథగాఢమార్గములను। నెసగు నగరంబులను జూచు చేగెనతడు॥

తే. సమము సర్వత్రస్నిగ్ధంబు శాంతిదంబు । మృదుళసంస్పర్శమారుతవీజితంబు
సింధుతీరంబు నా రాక్షసేశు డరసె । భువిని త్రిదశోపమంబు సంపూజితంబు॥

తే. అచటగాంచెను మేఘాభమైన దాని । ఋషులు జుట్టినదాని నెల్లెడల జూడ
కొమ్మలు శతంబు యోజనాల్ గ్రమ్ముదాని । మర్రివృక్షంబు నొకదాని నైర్ఋ
తుండు॥ 27

తే. గజము నౌర మహాకాయకచ్ఛపమును। గరుడుడు మహాబలుండు భక్షార్థమెత్తు
గొంచు నే చెట్టుకొమ్మపై మించ వ్రాలె।నద్దియే యిద్ది న్యగ్రోధ మంచితంబు॥

తే. అపుడు పతగోత్తముండు దా నటులవ్రాల । పర్ణబహుళంబుశాఖ సుపర్ణుడైన
భారమున వేగ విరిగె మహాబలుండు । కాలుమోపినమాత్రాన లీలగాగ॥ 29

తే. అచట వైఖానసులు మాషు లజులు ద్విజులు । ధూమ్రములు మరీచిపులు నింక
దొడ్డఋషులు
వాలఖిల్యులు కొమ్మలవ్రేలుచుండి । తపము సేయుచునుండి ర త్తని ధరణి॥ 30

తే. గరుడు డంతట వారిపై కరుణ కతన। శాఖశతయోజనంబు విస్తారమద్ది
తోన గజకచ్ఛపంబులతోడ నెత్తి। వడిగ నరిగెను ముక్కున వాని బట్టి॥ 31

తే. ఏకపాదాన వాని భక్షించి వైచి । కూల్చియు నిషాద విషయ మా కొమ్మ జిమ్మి
మునులవిడిపించి పరమమా మోదమందె । పతగపుంగవు డా గుమత్మంతు డపుడు॥

తే. ఆ ప్రహస్తంబుచేతనే యా మనస్వి। ప్రబలి ద్విగుణీకృతంబు విక్రమముబొందల.
అమృత మప్పుడు గొనితేర నాకసమున। కెగిరిపోవంగ నుంకించె మిగుల ధాటి॥

తే. విరిచివైచి యయోజాల పరిధినెల్ల। కూల్చి రత్నమయంబు నా గొప్పగృహము
అల మహేంద్రునిభవనంబునందుండి। గుప్త మమృతంబు గొనితెచ్చె గురు
భుజుండు॥ 35

తే. దానిని మహర్షి గణజుష్టమైనదాని। నాటిది సుపర్ణకృతలక్షణంబుదాని
గురుతర "సుభద్ర" నామ న్యగ్రోధమరసె। త్వరగ నేగుచు నా ధనదానుజుండు॥

తే. వితత మెల్లెడ త న్నదీ పతి సముద్రు। పరము పారము జేరి రమ్యంబు పుణ్య
మాశ్రమం బొండు నేకాంత మాత డరసె। త ద్వనాంతరమునయందు దాన
వుండు॥ 37

తే. అచట కృష్ణాజినాంబరు రుచిరతేజు। తత జటావల్కలాదిక ధారు ధీరు
నియమితాహారు రాక్షసు నిరుపమాను। పేరు మారీచుడన్ వాని వీరు డరసె॥

తే. ప్రభుడు రావణు డట్టుల వచ్చు టరసి। వేగ విధియుక్తి నర్చించి విభుని నతని
సర్వకామంబుల సమానుపముల మదికి। తృప్తి నెసగించె మారీచు డా ప్తమిత్రు॥

ఆ. అతని స్వయము పూజ నాసనోదకముల। జేసి ప్రీతి రాక్షసేశుతోడ
ననియె తాట కేయు డర్థోపహితములౌ। వాక్యములను నిట్లు వాక్యవిదుడు॥ 40

తే. కుశలమే రాజ లంకలో విశదయశుడ। రాక్షసేశ్వర మరల తూర్ణంబ నీవు
వచ్చితేమినిమిత్తమి ట్లింగిగాగ। చెప్పు సందియమయ్యె నా కొప్పిదముగ॥ 12

తే. ఇటుల మారీచు డనగ నా పటుబలుండు। ప్రభ మహాతేజుడప్పు డా రావణుండు
వాక్యకోవిదు డాతండు వాక్య మిట్లు। పలుక నొడిగెను మారీచు నులికి వినగ॥

35 వ సర్గ సమాప్తి :— ( 1,145 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ముప్పది ఆరవ సర్గ :— (24)

జనస్థానవధకు ప్రతీకారముగ సీత నెత్తుక రాదలచితినని యు, అందు నీ సాయము కావలెనని యు రావణుడు మారీచుతో ననుట :—

తే. తాత ! మారీచ ! వినుము నాదైన గోడు । ఆర్తుడనునైతి; నా కిట్టి యార్తున కిక
పరమగతి వీవెగావలె పరమకరుణ । వచ్చినాడను నీదరి కిచ్చబొదల॥ 1

సీ. ఎఱుగుదుగాదె నా యిష్టులు సోదరుల్ । ఖరుడు దూషణుడును ప్రబలబలులు
అనుజ శూర్పణఖయు నా మహాతేజుండు । త్రిశిరుండు మున్నుగా విశదయశులు
పిశితాశనుల్ తీవ్రవేగులు రాక్షసుల్ । అన్యులు శూరు లపారసంఖ్య
లబ్ధలక్షులు వేలు రజనీచరుల్ జన । స్థానాన మ న్నియోగాన నెసగి
మునుల నా ధర్మచరితుల భూమిసురల । నా మహారణ్యమునబట్టి యనవరతము
బాధపెట్టుచు కాపురం బచట నుంట । వసతి రతివాసత నెసంగ వనచరిత్రి॥

తే. అట చతుర్దశసాహస్రు లసురవరులు । భీమకర్ములు శూరులు భీకరులును
లబ్ధలక్షులు గలరుగా ప్రకటబలులు । ప్రభుడు ఖరునకు చిత్తానువర్తులెపుడు॥ 5

తే. ఇటు జనస్థానమున వసియించునట్టి । ఆ మహాబలు లా ఖరప్రముఖు లెసగి
ఆజి సన్నద్ధులై బహుప్రహరణముల । తీవ్రశస్త్రాల రాము నెదిర్చి రనఘ॥ 7

తే. ప్రకట సంజాతరోషుడై రాము డంత । పరుష మింతైన రణమూర్ధ్ని పలుకకుండ
ధనువు శరముల మరి మహాత్తరము గూర్చి । చూపె కార్ముకపాండితి చూపులోనె

తే. అల చతుర్దశసాహస్రు లసమబలులు । ఉగ్రతేజులు రాక్షసు లురలిబడిరి
ఖరశరంబుల యుధి నొక్కనరుని చేత । ఒక్కకాల్బంటు చేత హా యక్కజంబు॥

ఆ. ఖరుడు నిహతుడయ్యె; నారణ దూషణుడు వాజి । హతులైరి త్రిశిరు డాదిగాగ
నిర్భయంబుగాగ నిఖిల దండకయును। నొనరుపంగబడియె; నోస్త్రనెస్లు! 9

ఆ. పితృని కట్టడచేత సతితో నిరస్తుండు । క్షీణజీవితుండు మానవుండు
వ్యర్థసైన్యమునకు క్షత్రియపాంసనుం। డతడె హంత రాము డయ్యె ననఘ॥ 10

తే. లుబ్ధు డజితేంద్రియుండు మూర్ఖుండు శఠుడు । కర్కశుండును తీక్ష్ణుండు ఘాతుకుండు
త్యక్తధర్ము డధర్మాత్ము డఖిలభూత। సృష్టిహితంబెనంకు దుశ్శీలు డతడు॥ 11

తే. వైరమేలేక యూర కేవలము బలిమి । యూతగాగొని వని నా సహోదరి నిక
కర్ణనాసాపహరణాన కర్కశముగ । చేసెను విరూపితగను నే చెనటినరుడు॥

తే. అట్టి యా నరుభార్య నా యందగత్తె । పృథ్వి నమరకన్యసమను నే విక్రమించి
సీత దెత్తు జనస్థానసీమనుండి । అందు నీ వగు మింక సాయంబు నాకు॥ 13

తే. నీవు పార్శ్వస్థుడవుగాచు నెమ్మి నాకు ; తోడుగానుండ తమ్ములున్ తోడ నుండ
పటుసమగ్రుల సురల నే భండమున । సరకుసేయకయుందుగా సురవిరోధి !॥ 14

తే. కాన సాయంబు నీవు నా కగుము తాత । కడు సమర్థుడ వీవు రాక్షసవరుండ
వీర్యమున దర్పమున యుద్ధవిధములందు । నీకు సదృశుండు లేడుగా లోకములను॥

తే. సర్వమాయల నీవు విశారదుడవు । అని మహాశూరుడవు నుపాయజ్ఞుడవును
కాననే వచ్చితిని నీదుకడకు తాత! । వినుము నా కీవు తోడ్పడు విధము తెలుపు॥

తే. రజతబిందులతోడ చిత్రంబుగాగ । నీవు సౌవర్ణమృగమవై నేర్పుమీర
అల్ల రామునియాశ్రమప్రాంగణమున । చెంగుచెంగున చరియింపు సీత కెదుట॥

తే. నిన్ను మృగరూపు సీత గాంచినది తడవ । "తెచ్చినాకిమ్ము నాథ ! యీ మృగము"నంచు
పరగబంపును రాము నా లక్ష్మణార్యు । వినుము నిస్సంశయం బిది వేయు నేల!॥

తే. వార లటులేగ నేను నిర్బాధకముగ । శూన్య మాశ్రమమునుండి చోరవ జేసి
సీత హరియింతు సుఖముగా చిటికెలోన । చపల చంద్రప్రభను రాహుచందముగను॥ 22

తే. పిదప భార్యాపహరణసంపీడితాత్ము । కృశుని రాముని విస్రబ్ధరీతిగాగ
పట్టి ప్రహరింతు సుఖముగా భండనమున। ప్రభ కృతార్థంబునై నంతరాత్మతోడ॥

తే. రావణుం డట్లు జెప్పిన రామకథను । వినగ మారీచు నా మహాత్ముని ముఖంబు
నోరుతడియారె: భయమును నౌర కలిగె। తేళ్ళు జెర్రులు ప్రాకిన తెరగు దోచె॥

తే. నాల్క నెండిన పెదవుల నాకుకొంచు । అనిమిషంబుల నేత్రాల నధిక భీతి
అట్టె మృతభూతు డట్టుల నరయుచుండె । నధిపు రావణు మారీచు డార్తిగూరి॥

తే. త్రస్తుడు విషణ్ణఘటితచేతనుడు మునుపు । వీరు రామపరాక్రమం బెరిగియుంట
హస్తములు మోడ్చి రావణు కనియె నిట్లు । హితము నతనికి తనకును హితము
గాగ॥ 24

36 వ సర్గ సమాప్తి :- (1,169)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### ముప్పది ఏడవ సర్గ :— (25)

**నీ తరము కాని ఇట్టి పాపపుపనికి దిగవలదని మారీచుడు రావణునకు బుద్ధిజెప్పుట :—**

తే. దానవేశ్వరు వాక్య మద్దాని వించు। అల్ల మారీచు డా మహాప్రాజ్ఞు డులికి
రాక్షసేంద్రుని జూచి ప్రల్కంగదొడగె। వాక్య మిట్టుల నా మహావాక్యవిదుడు॥

తే. సులభు లెప్పుడు ప్రియవాదు లిలను రాజ। అప్రియము పథ్యమును జెప్పు నట్టి జనులు
మరియు వినునట్టి జనులును ధరణిలోన। దుర్లభులుసుమ్ము రావణా! దూరమరయు॥ 2

తే. నిజము రాము నెరుంగవు నీవు రాజ। పృథుగుణోన్నతు నా మహావీర్యయుతుని
ఘనుని వరుణమహేంద్రోపముని మహాత్ము;। చపలుడ వయుక్తచారుడ వెప్డు నీవు॥ 3

తే. స్వస్తియగునా సమస్తరాక్షసుల కింక। భువిని నాయన! పౌలస్త్యపుంగవుండ!
క్రుద్ధుడై రాఘవుండు నీ లోక మింక। సలుపకయ యుండునా యరాక్షసముగాగ॥

తే. ధరణి నీజీవితాంతంబుకొరకెగాగ। సీతపుట్టంగలేదుగా క్షేత్రసీమ
వ్యసన మయ్యెయ్యొ నాకును వనిత సీత। కారణంబుగ గల్గదుగా యెరుంగ॥ 5

తే. కామవృత్తు నిరంకుశు కఠిను నిన్ను। రాజుగాజెంది రమ్య మీ లంక యింక
రాక్షసులతోడ నీతోడ రూక్షగతిని। కూలకుండంగనుండునా ఘోరజలధి॥ 6

తే. మహిప! నీబోటి పాపదుర్మంత్రితుండు। దుష్టశీలుండు కామవృత్తుండు రాజు
తవను స్వజనంబు రాష్ట్రంబు తప్పకుండ। చెరుప్రకొనుసుమ్ము దుర్మతి సిగ్గుమాలి॥

తే. పితృనిరస్తు డతం డంట వెర్రిమాట। కా డమర్యాదు డెప్పుడు రాఘవుడు వినుము
కాడు లుబ్ధుండు దుశ్శీలుడేడగాడు । ఇంక క్షత్రియపాంసనుం డెప్డు గాడు॥ 8

తే. ధర్మగుణహీనుడునుగాడు; ధర్మవిదుడు । మాత కౌసల్యకానందవర్ధనుండు
అహితరతుడెప్డు కాడు భూతాళి కతడు । కాడు తీక్ష్ణుండు; మూర్ఖుండు కా డతండు॥

తే. సత్యవాదిని తండ్రిని సవతితల్లి। కైక వంచించు టరసి యా కైకకోర్కె
తీర్తునంచు వచించి ప్రతిజ్ఞ బూని । ప్రవ్రజితుడయ్యె వనికి ధర్మాత్ము డిట్లు

ఆ. కైక ప్రియముకొరకు, తన్మపతి దశరథు । జనకు సత్యవాది సలుప కొరకు
విడిచి భోగములను విడిచియు రాజ్యంబు । కోరి జొచ్చె దండకోర్వి నతడు॥ 11

తే. కాడు రాముండు తాత ! కర్కశుడు శఠుడు । నిజ మవిద్వాంసు డవిజితేంద్రియుడు గాడు
అనృతమును దుశ్శ్రుతంబునే యండగొనుచు । ఇటుల నీవాడతగదు పో కటువు గాగ॥ 12

తే. తనువుదాల్చిన ధర్మంబ దాశరథియు । సత్యవిక్రము డాతండు సాధుజనుడు
రాజు పో సర్వలోకాళి కా జితారి । మఘవు డా దేవతలకైన మాడ్కిగాగ॥13

తే. స్వీయతేజాన రక్షిత సీత మాత । రాము భార్యను వైదేహి నేమొయి నిక
బలిమి హరియింప నెంతువు పాలసుండ! । దివి వివస్వతు ప్రభ నట్లు తెలియకింత॥

తే. పృథుశరార్చిషమును, ననా ధృష్యమాజి । చాపఖడ్గేంధనంబు రామాగ్ని లోన
సాహసంబున దీప్త మీ చందముగను । నీవు దూకుట సరికాదు; నిలిచి చూడు॥

తే. తత ధనుర్వ్యాదితప్రదీప్తాస్యు కుపితు । పటు శరార్చిషు, కార్ముకపాశపాణు
శత్రుసైన్యప్రహారు, నమిత్రవీరు । అల్ల శ్రీరాము డనుపేరి యముని ఘనుని॥

తే. అతిసమీపంబునకు నీవు నసురనాథ! । చనగ జనదోయి వీడి రాజ్యంబు సుఖము
నాత్మజీవితమిష్టంబు నవని గల్గు । కీర్తిసర్వంబు నిక యుజ్జగించి వృథగ॥ 17

తే. అప్రమేయము తేజ మాయమ్మపతిది । రామచాపాశ్రయ సతమ్ము రాణి వనిని
పృథ్వీసుత నాపె నింక హరించి తేగ । తరముకాదోయి నీకు పో దానవుండ॥ 18

తే. పురుషసింహు, సింహోరస్కు, భూరితేజు । రాము భామిని యాపె యా రాఘవునకు
ప్రాణములకంటె ప్రియతర ప్రాణదయిత । నిత్య మాపె యనువ్రత నిజము పతికి॥

తే. మైథిలి ధరాతనూజ సుమధ్య సీత । రాము నోజస్వి ప్రియభార్య రాక్షసపతిని
వీక్ష మల్ల హుతాశను తీవ్రశిఖని । నట్లు ధర్షింప శక్య మయ్యారె కాదు॥ 20

తే. ఏమి యుద్యమమిది? వ్యర్థ మింత వినుము । ఏల జేసెదు పో, రాక్షసేశ్వరుండ ?
రాఘవునికంటబడి తేని రణధరిత్రి । అదియె వినుమిక నీ జీవితాంతమగును॥ 21

తే. సుఖము రాజ్యము జీవితం బఖిల మివ్వి । విను సుదుర్లభములు చిరంబనుభవింప
హృదిని కోరుదువేని నైరృతవిభుండ । రాముజోలికిపోబోకు రావణుండ॥ 22

సీ. చని విభీషణుడాది సచివుల నెల్లర ! ధర్మిష్ఠులనుగూడి తాత నీవు
ఆలోచనముసల్పి నీలోన నిశ్చయం । బొనరించు కౌమోగ్మాయి యోజ మెరయ
గుణముల దోషాల గురులాఘవంబుల । మరి బలాబలముల మదిని నరసి
పే బలంబునెరింగి నిజముగా రాఘవు । బలమును నెరిగి దర్పంబునెరిగి

తే. హితము నహితంబు నింక నీ యెడదలోన । క్షమ వినిశ్చయమొనరించి సాధు
పథము
గాని యెనప్పుము కార్యంబు గురుతరంబు। అర్థ మేయదిదోచు నయ్యాదియరాజ!॥

తే. నాకుమాత్రము దోచు రణంబులోన । ఘనుని కోసలరాజసూనుని మహాత్ము
మార్కొనుట నీకుతగదంచు; మరల జెబుదు। క్షమము యుక్తము విను మనుత్త
మము పలుకు॥ 25

37 వ సర్గ సమాప్తి :- ( 1,194 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ముప్పది ఎనిమిదవ సర్గ:- (౩౮)

—: మారీచుడు రావణుని మరియు చీవాట్లు పెట్టుట :—

సీ. విను మొకప్పుడు నేను వీర్యమదంబున । పృథివీతలంబెల్ల వేయికరుల
బలమును ధరియించి పర్వతోపముడనై । తిరుగుచు వెన్నెల్లరు విరుచుకొంచు
నీలజీమూతంబు లీలగా వెల్గుచు । లలితసౌవర్ణకుండలుడ నౌచు
భయము లోకాళికి బరగ బుట్టించుచు । వరకిరీటముదాల్చి పరిఘు బట్టి

తే. ఋషుల మాంసాల జెలగిభక్షించుకొంచు । దండకాటవిచరియింపుచుండునంత
మునివరుండు విశ్వామిత్రు డనుపముండు । మద్భయంబున వెరలి ధర్మాత్ము డతడు
స్వయము దశరథుకడ కేగి పలికెనిటుల॥ 1

తే. రక్ష నాకొనరించుత రాము డిపుడ । కరము జాగృతి నిదె పర్వకాలమందు
భయము ఘోరము బుట్టె నృపాలచంద్ర । అసురు మారీచుచే నాకు నడవిలోన॥

తే. ముని యిటులబల్క విని మహాత్ముండు రాజు । ధర్మహృదయుండు దశరథధరణి విభుడు
ఆ మహాముని నా మహాభాగుజూచి । తొట్రుపడుచు విశ్వామిత్రుతోడ ననియె॥

తే. బాలు డకృతాస్త్రు డితడు నా పట్టి యనఘ! । ఇంక పండ్రెండు రాముని కేండ్లు దేవ!
వలసిన మదీయసైన్యంబు బలము గొంచు । వత్తు నేనె ఋషీంద్ర నీ వనముజాడ॥

తే. బలము చతురంగముల గొంచు వచ్చి నేనె । నీవు వధియింపు మన్నట్టి నిఖిల రిపుల
నీదు శత్రుల బట్టి పెంపేద గొట్టి । చీల్చి వధియింతు నో ముని శ్రేష్ఠ! కరుణ

తే. నా జటుల బల్కు విని మునిరాజ। నప్పుడు పలికె రాముండుదక్క నీ వసుధలోన
చాల పెంతటిబలవంతుడైనగాని । రాక్షసుని వాని జంపంగ రాజచంద్ర॥ 8

తే. దేవతలగూడ నీవు సందేహమేమి । కాచినాడవు తోడ్పడి కదనములను
నీ వొసర్చిన పను లెల్ల నిఖిలలోక । విశ్రుతంబులైయుండె వేయునేల ? 9

తే. నిజమె నొప్పుడి సైన్యంబు నీబలంబు । ఉండనిమ్మల్లై; చాలు రాముండెనాకు;
బాలుడయ్యు మహాతేజ డాలమందు । మరియు నసురుల గూల్ప సమర్థుడతడె;
అనుగుమును రాముగొంచు; నీ కగుత స్వస్తి॥ 10

తే. పల్కుచునె యిట్లు రాము నృపాలపుత్రు। తోడుకొంచు విశ్వామిత్రు డోడ కింక
పరమసంప్రీతిబొందలు చా వనముజాడ । చనియె నప్ప నిజాశ్రమంబునకు వేగ॥

తే. దండకారణ్య మధ్యమం దుండు చోట । యజ్ఞ మొనరింప దీక్షితుండైన మునిని
చేరి రాముండు నసువు విచిత్రమప్పుడు । మించి మోగ్రించు చతని రక్షించు
చుండె॥ 13

తే. పురుషచిహ్నలుహొడమని చిరుతవాని । కమలపత్రనిభేక్షణు కాంతివంతు
ఏకవస్త్రధరాంచితు నృపతనూజు । ధన్వ్రి కాంచనమాలావృతైక జూటు॥ 14

తే. దీప్త మత్యంతమా స్వీయ తేజమునన । దండకారణ్య మెల్ల నుద్దండలీల
నిక నవోదితుడైన బాలేందు లీల । వెలుగజేసెడు రాము నా విభుని గంటి॥ 15

తే. అంత నేనును మేఘసంకాశ వపుడ । తప్తకాంచనకుండలధరుడ, బలుడ
దత్తవరమునదర్పంబు దట్టువాడ । అరిగితినివేగ నప్పైత దాశ్రమంబు॥ 16

తే. ఉద్యతాయుధధరుడనై యుబ్బి నేను । ఎగురుకొంచును నాశ్రమం బిట్టె చేర
తోనె ననుజూచి రాముండు తొట్రుపడక । ధనువు సజ్యంబు గావించె ధణధణ
మన॥ 17

తే. బాలు డితడంచు రాముని భావమందు । లెక్కసేయక మోహాన తిక్కయెక్క
పరుగువారితి కౌశికుం డురుగుణుండు । యజ్ఞ మొనరించు వేదికపైకి వడిగ॥ 18

తే. బాణము శితంబు శత్రునిబర్హణంబు । విడిచె రాఘవు డంతట వడిసెలంగ
ఆహతుడనౌచు నేను నద్దానిచేత । పడితి శతయోజనంబు నీ జడధిలోన॥ 19

తే. తాత! నన్నప్పు హతమార్ప దలపకుండ । బాలు డాతండు దయగొన బ్రతికి
తిటుల
రాము శరవేగగతిని సంధానకూలి । మూర్ఛ జెందితి, చిర మట్లె మునిగియుంటి॥

తే. పాతితుడనైతి నట్టు లా బాలుచేత । మహిత గంభీరసాగరాంభంబులందు
పిదప చిరకాలమునకు తెల్వింత పొంది । చేరుకొంటిని లంక నీ వేలు పురము॥

తే. బాలు నకృతాస్త్రుచేత నా లీలగాగ । రాముః నక్లిష్టకర్ముచే వ్రాలి పడియు
చచ్చిబ్రతికితి; నావెంట వచ్చినట్టి । తోడివారలుమాత్రము ద్రుంగి రటనె।

తే. కాన, నే నిట్లు వల్దని పూని యెంతొ । చెప్పుచున్నను వినక నీ విప్డు పగను
రాముతో బెట్టుకొంటేని రావణుండ । ఘోర మాపద పొందెద వోరి వడిగ॥ 23

తే. అల్ల క్రీడారతివిధిజ్ఞులైనవారి । రహి సమాజోత్సవంబుల గ్రాలువారి
రాక్షసులనెల్ల చెరిపి వారలకు కీడు । నింక సంతాపమును గూర్ప నెంతువేమి?॥

తే. మహిని ప్రాసాదహర్మ్యసంబాధమిద్ది । వివిధరత్నభూషిత విభవ ఋద్ధి
ఇంక నీలంక మైథిలీ కృతముగాగ । చెడి వినష్టంబునౌట చూచెదవు నీవె॥

తే. పాపములు సేయనట్టి యపాపులకును । శుచులకును నైన పాపంపు శాక్కుచేత
పరుల పాపాలకతన చేడ్పాటుగలుగు । పాములున్నట్టికొలని చేపలకు నట్లు॥ 26

తే. దివ్యచందనదిగ్ధులు దివ్యమాల్య । భూషణోత్తమ భూషితుల్ భూరివపులు
నీదు దోషాన రాక్షసుల్ నేలగూలి । చచ్చుటను జూతు వీవె నీ చక్షువులను॥

కం. హృతదారుల సహదారుల । హతశేషుల శరణులేని నసురుల వేలన్
గతిగానక దశదిశలకు । వితతాటము పరవులెత్త వే గనె దీవే॥ 28

కం. శరజాలపరిక్షిప్తము । పరమాగ్నిజ్వాల పటలి పరివృత మరరే
యరసెదు ప్రదగ్ధ భవనము । త్వరగనె నీలంక నింక; తప్పదు రాజా॥ 29

తే. రావణ! పరదారాభిమర్శంబుకంటె । పాపతరమొండులేదు గొప్పది ధరిత్రి
నీకు ప్రమదలు వేలు నెన్నెని గలరు । భార్యలున్నారు పెక్కురు వారిగనుము॥

తే. అగుమిక స్వదారనిరతుడ వధిప యింక । రక్ష స్వకులంబునకు నల్పు రాక్షసేశ
వృద్ధి మానము రాజ్యంబు జీవితంబు । హృదికి నిష్టమ్ము లివియు రక్షించుకొమ్ము॥

తే. సౌఖ్యాల కళత్రబాంధవసముదయముల। మిత్రవర్గాల చిరకాల మిద్ధరిత్రి
ఇంక భోగింపకోరుదువేని, రాజ । విప్రియము సల్పకుమ రామవిభున కీవు॥ 32

తే. సుహృదు నామాట విన కీవు మహితనూజ । సీత బలిమిని నింక తెచ్చితివ యేని
విరిగి రామశరాత్తజీవితుడవౌచు। పోదువు సబాంధవము కాలుప్రోలు కోరి॥ 33

38 వ సర్గ సమాప్తి:- ( 1,227 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ముప్పదితొమ్మిదవ సర్గ :- (౩౯)

రాముని పరాక్రమము గూర్చిన తన పూర్వానుభవమును జెప్పి రావణుని యత్నమును మారీచుడు వారింపజూచుట :—

ఆ. అప్పు డటుల యెటులో యా మహాత్మునిచేత । విడువబడితి నాజ విడచి యసుర
పిదప జరిగినట్టి వృత్తాంత మింకను । చెప్పెద వినుము మాయ చెప్పకుండ॥ 1

ఆ. అటుల రామునిచేత నాపద నొందియు । సిగ్గుగనక మరల యెగ్గొనర్ప
ఇద్ద రసురవరుల మృగరూపులన్ గొంచు । దండకోర్విజొచ్చి తధిక ధాటి॥ 2

తే. దీప్తజిహ్వాయు మరి మహాతీక్ష్ణదంష్ట్రి । విపులకాయంబు మరి మహావిపుల బలము
మాంసభక్షణగుణమును మరియు గలుగు । మృగము నే నౌచు దండకన్ దిరుగు
చుంటి॥ ౩

తే. అగ్నిహోత్రాల తీర్థాల నన్నియెడల । చైత్యవృక్షాల రావణా నిత్యమెసగి
తిరుగు చత్యంతఘోరాల నెరపుచుంటి । ఇంక తపసుల మిగుల ధర్షించుచుంటి॥

తే. చంపి తపసుల సద్ధర్మచరితుల నొగి । వారి రుధిరాల దాగ్రోవుచు మీరియెగసి
వారి మాంసాల మెక్కుచు ఘోరగతిని । తిరుగుచుంటిని దండకన్ దిరుగులేక॥

తే. రూక్షచక్షుండ ఋషిమాంసభక్షకుండ । రుధిరమత్తుండ క్రూరుండ లుబ్ధుండ
నగుచు వనగోచరుల నెల్ల నార్తిముంచి । జగతి దిరిగితి ధర్మదూషకుడనౌచు॥

తే. రాము తాపసు పరమధర్మైకచరితు । మాత వైదేహి నా మహాభాగ నింక
నా మహారథు లక్ష్మణు రాము తమ్ము । గంటి నొక్కట నప్పుడా కానలోన॥

సీ. వనగతు నియమితాహారు రాముని నట్లు । తాపసవేషు నాతనిని జూచి
తాపసుం డితడేమి యోపు సేయగనంచు । లెక్క-సేయక వాని నొక్క-మొగిని
పూర్వవైరం బది బుద్ధిని తలపోసి । సంక్రుద్ధుడను నౌచు సాహసించి
వెనుకటి దెబ్బల వేండ్రింబు వెన్నున । పొడమినట్టి బుద్ధి నడచివైవ

తే. తీక్ష్ణశృంగంబు లొప్పెడి మృగమ నౌచు।రామచంద్రు మహాబలు ప్రభువ రేఖ్య
సర్వభూతైకహితరతు జంపివైవ । దుమికి తాతనిపైకి బల్ మూర్ఖ గతిని। 10

తే. పటు శరంబుల శత్రునిబర్హణముల । నిశితముల సుపర్ణానిలనిస్వనముల
విడిచె రాముండు మూడింటి వీరవరుడు । బలిమి చాపంబులాగి యభంగురముగ॥

తే. ఆ శరంబులు వజ్రసంకాశములును । రక్తభోజనములును సుముక్తములును
వచ్చి పడె నొక్క-పెట్టు మాపైన నౌర । మూడు పన్నత పర్వముల్ భూరిగతిని॥

తే. రాముని పరాక్రమంబు శరంబుబలము । మునుపె యెరిగిన వాడనౌటను వనోర్వి
పరుగు వారుచు నుసురు కాపాడుకొంటి । మిగత రాక్షసులిద్దరు మృతినిగనిరి॥

తే. రాము బాణాహతిని నట్లు రాలిపోక। ఎటులో ప్రాణాల నప్పుడు దక్కించుకొంచు
సన్న్యసించి సమాహితస్వాంతుడ నయి । తాపసుడనైతి బుద్ధియుక్తతను నెగడి॥

తే. వృక్షవృక్షాన రాము వీక్షించుచుంటి । చీరకృష్ణాజినాంబరధారు క్షితిని
కరగృహీతమహద్ధనుఃకాండు చండు । యమసదృశు పాశహస్తు నీ వనధరిత్రి॥

తే. మరియు రామసహస్రాల నరయుచుంటి । భీతుడను నౌచు రావణా! వేయు నేల!
రామభూతమరణ్య మియ్యదిగ నాకు । దోచుచున్నది సర్వంబు; ధ్రువము రాజ॥

తే. రాముడే జూచుచుంటి నిర్మానుషంబు । నైనచోటను సైత మయ్యారె రాజ!
స్వప్నగతు రాము జూచియు భ్రాంతి జెంది। మూర్ఛ జెందుదు; కలవరం బోహో!
కందు॥ 17

తే. రామభీతుండనౌ నాకు భూమి నెందు । ఇక, ''ర''కారాది నామంబులేని వినుము
కలుగ జేయుచునున్నవి కరముభీతి । రథము, రత్నంబు, లాదిగా రావణుండ॥

తే. నేనొ రాముప్రభావంబు నెరిగి నాడ । అతనితో పోరు తగదు నీ కసురనాథ
బలిని నముచిని సైత మా పార్థివుండు । హతమొనర్పంగ గలడు పో; అడుగు
మింక॥ 19

తే. రణము సేయుము మానుము రాము తోడ। కాని, రాముప్రశంస నాకడను నింక
సేయబోకుము రావణా! క్షితిని నన్ను! నింక ప్రాణాలతో జూడ నెంతు వేని। 20

తే. సాధు లీలోకమున బహు జనులు రాజ! ధర్మచరితులు యోగ్యులు నిర్మలులును
పరుల యపరాధమున జేసి విరిసిపడిరి। సపరివారంబుగాన నష్టంబుగనిరి॥ 21

తే. కాన, నేనును నీకోపకారణమున। సత్యము నచింతు వినుము నిశాచరుండ!
చేయ నెయిచ్చనచ్చిన చేష్టలెల్ల। నేను నీతోడ రా నింక; మానుపలుకు॥ 22

తే. రాముడు మహాబలుండను, మహామహుండు। ధృతి మహాసత్వుడును మహా తేజ
పతేజు
అంతకుడుగాకయుండు నా యాతడింక। సర్వరాక్షసలోక విస్తారమునకు॥ 23

తే. శూర్పణఖకారణాన నచ్చోట నప్పుడు। ఖరుడు నతివృత్తు డక్లిష్టకర్ముడైన
రాముచేత హతుండైన రాము కోప। మేమిగల దిందు చెప్పుమా యింకనీవె॥

తే॥ బంధుహితార్థుడన్ హితము పథ్యము నే నిటు జెప్ప మాటలన్
బంధురసత్యమున్ వినక పాపపథంబున పోయితేని నీ
బంధుల బిడ్డలన్ జెరిపి పాసెదు నీవును జీవితంబు తత్
సింధురవిక్రముండయిన శ్రీరఘురాముని బాణసంహతిన్॥ 25

39 వ సర్గ సమాప్తి :— (1,252)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### నలుబదియవ సర్గ – (౪౦)

( మారీచుని మాటలు పెడచెవిని పెట్టి "నాపని చేసితీరవలసినదే; లేకపోతే ఇప్పుడే నిన్ను చంపివేస్తా" నని రావణుడు మారీచుని దబాయించుట)

తే. క్షేమము యుక్తము వాక్యంబు సరసముగను। తనకు మారీచు డెంతచెప్పినను హితము
చెవినిపెట్టడ యా రాక్షసేశ్వరుండు। చావదలచినవాడు నౌషధమునట్లు॥ 1

తే. పథ్యము హితంబు చెప్పు నా పరమమిత్రు। పరుసు మారీచు చూచి రాక్షస విభుండు
కాలచోదితుడౌచు బల్ కఠినభంగి। పలికె నిట్టు లయుక్తంబు పలుకు లపుడు॥ 2

తే. తాళు! మారీచ! యిటు లయుక్తార్థ మీవు। నాయెడవచించినది యెల్ల వ్యర్థమౌయి
ఊసరక్షేత్రసీమయం దుంచినట్టి। విత్తనమురీతి నిష్ఫలం బింత వినుము॥ 3

తే. ఇట్టి మాటలచేత నా పట్టుదలను। వీడి మానుదునే రాముతోడి పగను
పాపశీలుండు మూర్ఖుండు మానుషుండు। బెదరగొట్టంగ శక్యమే వీరు నన్ను॥ 4

తే. పనికిమాలిన ఆడది పలికినట్టి। మాటచెవిబెట్టి యెవడు మాటాడకుండ
తల్లి దండ్రిని రాజ్యంబు తనకు గూర్చు। నాప్తులనువీడి యిట్లు సన్యాసియగును॥

తే. ఖరుని రణమునగూల్చిన ఖలుని నతని। ప్రాణములకంటె ప్రియతర భార్య సీత
నింక నీసన్నిధినె హరియింప మదిని। నిశ్చయించి తవశ్యంబు; నిశ్చయంబు॥ 6

తే. ఇటుల నిశ్చితమౌబుద్ధి హృదిని నాకు। నాటుకొనియున్నదోయి నిశాటమిత్రి
దాని మరలింప నెవరికి తరముకాదు। మరి సురాసురులొక్కటైవచ్చిరేని॥ 7

తే. కార్య మిద్దాని నిర్ణయ కరణమందు।దోషము గుణంబు మరియు నిందులనునున్న
ఆ యపాయాల మరి యుపాయాల గురించి।అడిగితిన నిన్ను నేను నీవనుట కిటుల॥ 8

తే. అడిగినప్పుడె పండితుండయిన మంత్రి। తనకు మేల్గోరుచుచెప్పుడు వినతుడౌచు
ఉద్యతాంజలియై తన కుచితమైన మాట రాజుకు చెప్పంగవలయు నింతె॥ 9

తే. వాక్య మప్రతికూలంబు పరమ శుభము। హితము మృదుపూర్వమును గాగ నెప్పుడుపతికి
వినయయుక్తంబుగా సర్వజనములిలను। చెప్పవలయుట ధర్మమై యొప్పుగాదె॥

తే. సావమర్దంబుగా చెప్పినట్టిపలుకు। హితమెయ్యదైనను మారీచ క్షితితలాన
ప్రభుడు మానార్హుడా మానవర్జితంబు। పలుకు నంగీకరింప డే పార్థివుండు॥ 11

తే. రాజుల మితౌజసులు నైదురకములయిన।రూపములుదాల్త్రు మారీచ రూక్షవినుము
యముని వరుణుని సోముని నగ్నిశక్రు। నింద్రు రూపంబులన్ దాల్త్రు నిజ మెరుంగు॥ 12

తే. అగ్ని వేడిని, సోముసౌమ్యతను, నింద్రువిక్రమంబును, యముని శిక్షాక్రమంబు
వరుణునిప్రసన్నతయు మహాత్మకులు నృపులు। దాల్త్రు మారీచ విను క్షణదాచరుండ॥ 13

తే. కాన విను మెట్టి ఘట్టాలనైన గాని। పూజ్యులును మాన్యులును సుమ్ము భూమిపతులు
నీవు ధర్మమెరుంగక కేవలంబు। మోహమేగొంచు వర్తించుచువోవోయిటుల॥ 14

తే. కడగి నీయింటి కభ్యాగతుడను నేను। ఇటుల వచ్చిన నన్ను నీ విట్టిరీతి
పరమ దౌరాత్మ్యమున నోర! పలుకుదలివి।పరుషముల పల్కనెంతువా పాలసుండ॥

తే. దిగ్దమనలేదు నిన్ను నా తీర్పునందు। గల్గు గుణదోషములను యుక్తతనుగాని
చెప్పితిని యొక్కపనిని నీ కిప్పుడోయి। చేయుటేగాని బదులీవు చెప్ప తగవు॥ 16

తే. ఈ మహాకార్యమందు నీ వేమి యనక।చేయవలయును మారీచ సాయమోయి
దీని కే క్రమముగ నీవు పూని పనిని। సేయవలయునో విను మిదే చెప్పెదిపుడె॥

తే. రజతబిందులతోడ చిత్రంబుగాగ। మెరయు సౌవర్ణమృగమవై త్వరగనరిగి
అల్ల రాముని యాశ్రమ ప్రాంగణమున। చెంగుచెంగున చరియింపు సీతకెదుట॥

తే. ఎగసి వైదేహి మది ప్రలోభింపజేసి। పొమ్మిక యథేష్టముగ దూర భూమి కటులె
నిన్ను మాయామృగంబు నా నెలతచూచి। తెచ్చియిమ్మని పతి నంప మెచ్చి యాపె॥ 19
తే. దూరమట్టుల కాకుత్స్థు తోడుకొంచు। నరిగి " హా సీత ! హా లక్ష్మణా ! " యటంచు
రామవాక్యాను రూపకంబయిన రీతి। అరవు మీావు వక్షోర్వి హాహా యటంచు॥
తే. అంత సౌమిత్రి యా నాద మాలకించి। సీత ప్రేరణమునను సౌహృదము కతన
మదిని సంభ్రాంతుడై వీడి వదిన నటనె। పోవు రాముని వెదుకంగ పుంతలబడి॥
తే. అటు లపక్రాంతుడగుడు నిక్ష్వాకుకులుడు। లక్ష్మణుడునట్టులేగ నాశ్రమము విడిచి
ఇక యథాసుఖమేను వైదేహిదెత్తు। అల్ల శచిని సహస్రాక్షుడట్లు లపుడె॥ 22
ఆ. ఇటులొనర్చి వేగ యీా కార్య మెల్లను। ఇంక నీవు పో యథేచ్ఛముగను
మెచ్చి నీకు నిత్తు మిత్ర! సువ్రితనాడు। రాజ్యమందు సగము; రమ్ము, లెమ్ము॥
తే. పొమ్ము మార్గము శివమగు; లెమ్ము సౌమ్య।కార్య మియ్యది సఫలమాగాకమిత్రి
నేను నీవెంట వత్తు పో నిమిషమునను। రథమునందెక్కి దండకారణ్యమునకు॥
తే. రణమొనర్పక యే యిట్లు రాము నడవి। చక్కవంచించి సీత నా చాన దెచ్చి
లంక కరిగెద నింక నిశ్శంకముగ ముల। నిన్నుగూడి కృతార్థత నెగడి వడిగ॥ 25
తే. చేయనైతేని నాపని చీల్తునిన్ను। నిప్పుడే పట్టి మారీచ యెరుగుమింత
పనిని దీని బలాత్కారమునననైన। మూఢ! చేయింతు నీచేత చూడు మోయి॥
తే. అరయ రాజుకు ప్రతికూలుడైనవాడు। బ్రతికి బాగుపడంగనెప్పటికి తగడు
కాన నంతంబుబొందింతు పూని నిన్ను। నాదుపనిచేయనైతేని నైరృతుండ॥ 27
తే. రాము మార్గాన జనిన నీ ప్రాణములకు। హానికల్గును కల్గకపోనువచ్చు
నన్ను నెదిరింప విను మరణంబు ధ్రువము। చేయు మేయది హితమొ నీ చిత్తమునకు॥ 28

40 వ సర్గ సమాప్తి :— ( 1,279 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### సలుబది ఒకటవ సర్గ:- ( 20 )

( మారీచుడు రావణుని మరల మందలించి చెప్పుట )

తే. రాజవద్వాక్యముల నిట్లు రావణుండు । మిగుల ప్రతికూలములను దా మీరి పలికి
ఆజ్ఞవెట్టంగ, మారీచు డప్పు డనియె । పరుషభంగిని నిట్టు లా ప్రభునితోడ॥ 1

తే. ఆలుబిడ్డలు రాజ్య మమాత్యవరులు । సిరియు సంపద గల నిన్ను జెరుప నెవడు
పాపకర్ముండు నీకు నిబ్భంగిగాగ । బోధ జేసెను చెడుత్రోవ బుద్ధిమాలి॥ 2

తే. సుఖముగానీవు జీవింప జూచి యెవడు । ఓర్వలేకుండె పాపకర్ముండు చెనటి
ఔర, నీకుమృత్యుద్వారమనెడు దాని । చూపె దీని నుపాయాన చుప్పనాతి॥

తే. రాక్షసులు హీనవీర్యులు రాక్షసేశ! । నీకు శత్రువు లంట పో నిజము సుమ్ము
బలియు రాముని చే నిన్ను పడగ గొట్టి । చూడగోరుచునున్నారు చూడుమింత॥

తే. అహితవాదియు క్షుద్రుడీ మహిని నెవడు।ఇట్టి దుపదేశమును జేసె హృదికినెక్క
నీవు స్వకృతాపరాధాన నే నశించు । వానిగా జేయ నెవనికి వాంఛగలిగె?॥ 5

తే. ఉత్పథారూఢు నిన్ను నీ యొద్దనున్న । మంత్రులెవ్వరు దలపరు మరలుపంగ
వధ్యు లిక వారలెల్లరు తథ్యమింత । ఏల వధియింపకుంటివో యింక వారి॥ 6

తే. కాపథాశ్రితు రాజును కామవృత్తు । సత్పథంబున జనుచుండు సచివు లెపుడు
నిగ్రహింపంగ వలయును; నిన్ను వారు। ఏల నిగ్రహ్యు నిక నిగ్రహింప రోయి॥

తే. ధర్మ మర్థము కామము తత యశంబు । వినుము జయశాంవరా! కల్గు విపుల
మిలను
సచివతతికెప్డు స్వామిప్రసాదమునన । ప్రభుని నైర్మల్యమునన రావణ విభుండ॥

తే. దీనికి విపర్యయంబు ప్రాప్తించునేని । వ్యర్థమేయగు త త్సర్వ మసురనాథ
వ్యసనమొందుదు రితరులౌ ప్రజలు కూడ । స్వామివైగుణ్యమున జేసి సత్యమింత॥
తే. రాజమూలముగాదె ధర్మంబు, జయము । అగుట వినుము సర్వావస్థలందు ప్రజకు
రక్షితవ్యులు రాజులు రాక్షసేశ! । ధర్మ మియ్యది సూ జయతాంవరుండ॥ 10
తే. రాజ్యమును పాలనము సేయ రాజచంద్ర । కాదు శక్యంబు తీక్ష్ణున కసురనాథ
కాదు ప్రతికూలునకు మరి కాదుసుమ్ము । రాజ! యవినీతునకు విను రాక్షసేంద్ర॥
తే. మంజసారథి, కడు విషమంబుత్రోవ ! శీఘ్రహయములు పరచి నశించితాము
సారథిని జంపునట్లు తీక్ష్ణంపుమంత్రు । లధిపుతో గూడ చత్తు రమాత్యు లురలో॥
తే. లోకమున సాధుజనులెందరో ధ్రువమ్ము। యోగ్యులును ధర్మమొనరించుచున్నవారు
పరుల యపరాధమున జేసి పరిజనమ్ము। తాము నశియించుచుంట తథ్యమ్ము గనమె?॥
తే. అకట ప్రతికూలుడును తీక్ష్ణుడైన యట్టి । రాజు రక్షణనున్నట్టి ప్రజలెవరును
వృద్ధిపొందంగనేర రోకింతయైన । మేటి గోమాయు రక్షణ మేకలట్లు॥ 14
తే. నీవు దుర్బుద్ధి వవిజితేంద్రియుడ వౌర । కర్కశుండవు; నిను రాజుగాగ బడసి
విను మవశ్యంబు నశియింత్రు వివిధగతుల । సర్వరాక్షసులింక నిశాచరేంద్ర॥
తే. కాకతాళీయముగ ఘోరకర్మమిద్ది । ఎటులో ననుజుట్టె, మరి దీని కేమిగాని
శోచనీయుడ వీవె రక్షోవిభుండ । ఇక ససైన్యంబు నీవు నశింతు వోయి॥ 16
తే. నన్ను హతమార్చి రాముండు నిన్ను కూడ । అచిరమున చూడు హతమార్చి
వైచు రాజ
దీన కృతకృత్యుడనునౌదు నేను నిజము । రాముచేజచ్చి వేగ స్వర్గంబుగందు॥ 17
తే. రాముకంటనుపడిన మాత్రమున నన్ను।హతుడగా నిశ్చయించుకొమ్మసురనాథ
నిన్ను సైతము హతుడగానే తలంపు । తెగి బాంధవమిక సీతదెచ్చితేని। 18
తే. నీవు నేనును జేరి యానెలత సీత । సతిని దెచ్చితిమేని యాశ్రమమునుండి
నీవునుండవు జగతిపై, నేనునుండ । లంకయుండదు, నుండరు రాక్షసులును॥ 19
తే. నే నిట్లు హితైషుడను నీకు నెన్నొ గతుల । చెప్పుమాటల నక్కటా చెవిని
గొనవు;
అల్పులు, గతాయువులు, ప్రేతకల్పులైన । జనులు సుహృదుల హితము గైకొ
నుదు రెట్లు?॥ 20

41 వ సర్గ సమాప్తి :- ( 1,299 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### నలుబది రెండవ సర్గ :- ( ౪౨ )

**రావణునకు వెరచి, మారీచుడు రావణునితో రథమెక్కి దండకారణ్యమునకు పోవుట-మారీచుడచట మాయలేడియై రామాశ్రమము చెంతతిరుగాడుచుండుట — సీత మాయలేడినిచూచి విస్మయమందుట :—**

తే॥ రావణునితోడ మారీచు డీ విధంబు । పలికి "పద,పోద"మంచు దైన్యంబుతోడ
మరియు, రాత్రించరప్రభుభయముతోడ । ననియె ననివార్య మా కార్యమును దలంచి॥ 1

తే. మద్వధోద్యతశస్త్రి, రామావనీశు । బాణచాపాసిధారు నా మానవేంద్రు
కంట నే బడుచయె చాలు తంటతీరు। పోవు నాప్రాణ మప్పుడే, పొలియు పటని॥

తే. రామచంద్రునిపైన పరాక్రమించి : బ్రతికి యెవరికి మరలిరా గతులుగలవు ?
నీకు యమదండహాతునకు నే నొకడను । తోడుగానుంటి; చత్తముకూడి; పదర॥

తే. కడకు నీ కిట్లు దుర్బుద్ధి కలిగి యుంట । శక్యమేమగు నాచేత పలుపనిచట ?
ఇదిగో పోదును, పద నీవునింక రాజ! । స్వస్తి నీకగుగాత నిశాచరేంద్ర! 4

తే. పలుకు లవ్విని వలన రావణుడు మదిని । కరము సంతోషమున పొంగి పరమ మిత్రు
కౌగలించుచు మారీచు గాఢముగను । పలికె నిట్టుల నతనితో ప్రతిభ వెలుగ॥ 5

తే. బలె! సెబాసు! యిదే మేటి పలుకుసుమ్ము । మిగులమొగసిరిమాట; నా మెచ్చువచ్చె
ఇపుడెగద నైతి తాత మారీచు డీవు। ఇంతవర కెవ్వడవో పో, నిర్భృతుడవోయి॥

తే. ఎక్కు మిక శీఘ్రి మిదియె పెంపెక్కు రథము। ఖరముల పిశాచవదనాల గట్టి యుండి
రత్నభూషితమైయొప్పి రహిని నింపు। దీని నిప్పుడు నాత్తోడ దివ్యలీల॥ 7

తే. సీతను ప్రలోభపరచి వే చెలగి యెగసి। పొమ్ము నీదారి నిక యథేచ్ఛమ్ము, తాత
పురుషశూన్యంబు కుటిని నే పొంచివొచ్చి। బలిమి మైథిలి నై దేహి బట్టి తెత్తు॥

తే. అంత రావణ మారీచు లంతరిక్ష। మార్గమందు విమానంబు మాడ్కి గొప్ప
రథముపై నెక్కి వడి తదాశ్రమము వీడి। వెడలిపోయిరి రివ్వున వింటికెగసి. 9

తే. రథగతులు గాచు మారీచ రావణు లటు। పట్టణంబుల వనముల పర్వతముల
నదుల రాష్ట్రల నగరాల నదచయములు। నెల్ల జూచుచు నరిగి రా నింగిత్రోవ॥

తే. దండకారణ్యమును జేరి త్వరిత గతిని। నచట గాంచిరి రాముని యాశ్రమంబు
రాక్షసాధిపుడైన యా రావణుడును। మరియు మారీచు డా గొప్ప మాయలాడు॥

తే. కాంచన విభూషణంబు తత్ ఘనరథంబు। దిగుచు మారీచు చేతిచేతిని గ్రహించి
రాక్షసాధిపు డప్పు డా రావణుండు। పలికె నాతనితో నిట్లు లలితఫణితి॥ 12

తే. అదియె రామాశ్రమంబు గన్పట్టు నెదుట। అల్ల కదళీవృతంబురమ్యంబు చూడు
సఖుడ! చేయుము శీఘ్రము మిచ్చటికి మనము। వచ్చితేమినిమిత్త మా పనిని త్వరగ॥

తే. రావణుని మాట లపి విని రాక్షసుండు। త్వరగమారీచు డా మాయదారివాడు
మాయమృగమౌచు రామాశ్రమంబు చెంత। సంచరింపంగ దొడగె పసందు నడల॥ 14

తే. ఘర మహత్తర మద్భుతదర్శనంబు। అల సితాసిత మొప్పు ముఖాకృతియును
ముఖ్యమణివరశృంగాగ్రములునుదనర। మృగము రూపము దాల్చె మారీచు డప్పుడ॥ 15

తే. రక్తపద్మోత్పలముఖంబు రక్తిదనరె। ఇంద్రనీలోత్పలశ్రవం బింపుగొలిపె
కించి దభ్యున్నతంబు తత్ గ్రీవమమరె। ఇంద్రనీలదళాధరం బెంతొ యొప్పె॥ 16

తే. కనగ, కుందేందువజ్రసంకాశమౌచు। ఉదర మతనికి భాస్వరం బొప్పెలొలికె
వర మధూకనిభంబుపార్శ్వంబుదనరె। పద్మకింజల్కసన్నిభం బమరె మేను॥ 17

తే. అరరె, వైడూర్యసంకాశ ఖురచయంబు। మరియు తనుజంఘలును సుసంహతము వపువు
అల్ల ఇంద్రాయుధసవర్ణమై వెలుంగు। నూర్ధ్వపుచ్ఛంబుతో నది యొప్పెలొలికె॥

తే. స్నిగ్ధవర్ణము విచిత్రరత్నైకవృతము। కడు మనోహరకాంతితో క్షణములోన
పరమశోభనమ్మృగముగా మారి యతడు। రమ్య మా వని వెల్గించె రాము కుటిని॥
తే. దర్శనీయము మరి, మనోహరమురూపు। వివిధధాతువిచిత్రితం బెసగ దాల్చి
సీతను ప్రలోభపరుప నా చెంతనున్న। పచ్చికల మేయుచు చరించె మాయలేడి॥
తే. రౌప్యబిందుశతాల చిత్రంబు మరియు। కనగ ప్రియదర్శనంబు మృగంబునచట
చెట్ల చిగుళుల కొరికి భక్షించుకొంచు। చెంగుచెంగున నెగురుచు పొంగి తిరిగె॥
తే. కదళికాగృహకంబును కర్ణికార। మండలము జేరి యిటునటు మందగతిని
తనను సైదేహి చూడ పిలయినచోట।తిరుగుచుండెనుసార! కృత్రిమపుమృగము॥
తే. సరసరాజీవచిత్రపృష్టంబుతోడ। ఆ మహామృగ మప్పు డా యడవి వెలిగి
వనిని రామాశ్రమపదంబు పార్శ్వమంద। * తక్కటారుచు తిరిగి యథాసుఖంబు॥
తే. మరలపోవుచు వచ్చుచు తిరిగి యవల। పోవు చిరీతి కొంతసే పుండి మరల
చెంగు నేతెంచి తన యిచ్ఛ చెంగు నెగసి। మించి నానావిధాల చరించె
మృగము॥ 25
తే. అలలాడుచు నెగురుచు నట్టులిట్లు। కొంతసేపు వసుండి యా క్షోణినచట
ఝుడితి యాపర్ణశాల వాకిటికి వచ్చి। మరల మందను గూడంగ నరుగులేడి॥
తే. తిరిగి మృగయూథములతోడ మరలి వచ్చి। తిరిగి పోవుచునుండు నా మృగము
రూపు
దాల్చియున్నట్టి మారీచ దానవుండు। సీత దర్శించు కాంక్ష బల్ చిత్రగతుల॥
తే. వనచరమృగంబు లన్యంబు లన్నివచ్చి। చిత్రమృగమును కని వీక్షించిచేరి
వాసనన్ జూచి చటుకున పారిపోవు। దశదిశల కట్టె తెలిపి రాక్షసు డటంచు॥
తే. రాక్షసుడువాడు మృగవధరతుడెయయ్యు। నై జగుణమును నాచ్ఛాదనము
నొనర్చి॥
ఆమృగంబుల స్పృశియించి వదలు గాని।వాని భక్షింప డా మాయదానవుండు॥
తే. సరిగ నా సమయంబందె ధరణిజాత। సీత తత్ శుభలోచన చేర వచ్చె
చెట్లచెంతకు పూవుల చెలగికోయ। మదిని నుత్సాహపడుచు నా మగువమిన్న॥
తే. మదిరవీక్షణ యాపె సుమంబు లెల్ల। కోయు చట్టులె కొండగోగుల నశోక
వృక్షముల చూతతరువుల వేడ్క దిరిగె।సీత రుచిరానన, శుభాంగి, క్షితితనూజ॥

* పాఠాంతరము : తళుకు తళుకంచు తిరిగి...

తే. అడవివసియింపతగని యీ యవనిజాత । అచట ముక్తామణీవిచిత్రాంగ మొప్పు
మృగము రత్నమయంబు నా చెంత జూచె । సీత పరమాంగన విదేహ క్షితిప్రు
దుహిత। 32

తే. రుచిరదంతోష్ఠి, యీ వరారోహసీత । రూప్యధాతుతనూరుహారూక్షమైన
మృగము నద్దాని జూచె సస్నేహదృష్టి । విస్మయోత్ఫుల్లనయనాలవెలది మిన్న।

తే. జగతి మాయామయంబు తన్మృగము గూడ । రామదయితను జూచుచు లలిత గతిని
మరల చిత్రింపు లీలల తిరిగె నచట । ఆ వనంబెల్ల దీపించునదియు బోలె. 34

తే. వసుధ నెందు నదృష్టపూర్వంబు మృగము । వివిధరత్నమయంబు నా వెలది చూచి
పరమవిస్మయమందె నా పరమమాత।సీత, జనకాత్మజ, మహీజ, క్షితిపదుహిత।

**42 వ సర్గ సమాప్తి :— ( 1,334 )**



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### నలుబది మూడవ సర్గ:— ( 50 )

దానిని తెచ్చి ఇమ్మని సీత రాముని అడుగుట - "ఇది రాక్షసమాయ, దీనిజోలికి పోవద్దని లక్ష్మణుడు రామునికి హెచ్చరించుట - అయినను, సీత ముద్దు చెల్లించుటకై, రాముడు మృగమునుబట్ట బయలుదేరుట. సీతను అప్రమత్తతో కాపాడుచుండమని రాముడు లక్ష్మణుని హెచ్చరించి పోవుట.

తే. రుచిర సుశ్రోణి పూలుకోయుచునె సీత । హైమరాజతవర్ణపక్షముల మిగుల
శోభితంబగు చెంతయు చోద్యమొప్పు । మృగము నద్దాని వీక్షించి మెలతమిన్న॥

తే. మృష్టహాటకవర్ణిని హృష్ట యగుచు । పిలిచె తద్యనవద్యాంగి బిగ్గరప్పుడె
భూమిసుత సీత భర్త నా రామచంద్రు । మరది సాయుధు లక్ష్మణస్వామి నటులె॥

తే. పిలువనై దేహి యట్టుల ప్రీతిమీర ! ఆ నరవ్యాఘ్రు లా రామ లక్ష్మణులును
తత్ప్రదేశంబు వీక్షింప తలల నెత్తి । చూచి రెదుట మృగంబు బల్ చోద్యమద్ది

తే. చూచుచునె లక్ష్మణుండు సచోద్య మృగమ్ము । మదిని ననుమానపడి తన యన్నతోడ
"శౌర, వీనిని మారీచు డల్లవాడు । రాక్షసు డటంచు దలతు నే" తక్షణంబ॥

తే. ఎంతొ సంతోషమున వేట కేగుదెంచి । వనిని చరియించు రాజుల బహుళసంఖ్య
నిట్టి పాపిష్టిదౌ వేషమే ధరించి । కామరూపుడు వీడు హా! ఘాతజేసె।

తే. బహుళ మయావిదుని వీని మాయ యిప్పుడు । కోరి మృగరూప మిటుదాల్చె
కాంపదీయ
భానుమంతంబు జూడు మహానుభావ! । వసుధ గంధర్వపురసన్నిభంబు దేవ!॥

తే. మృగము రాఘవ! యిట్టి దీ పృథ్వినెందు । లేదు మణిరత్న బహుళచిత్రితము దేవ!
మాయయే యిది జగతీతలాధినాథ । సంశయంబేమి యిది నిశ్చయంబె సుమ్ము॥

తే. లక్ష్మణుడు చెప్పు నీ మాటలకు మహీజ । అడ్డమొచ్చి శుచిస్మిత యబల సీత
జింకచర్మంబు నద్దానిచేత మిగుల । మోహితయుచూచు నిట్లనె మురుసుకొనుచు॥

తే. ఆర్యపుత్ర! మృగం బిది యందమొప్పు । చూడ నభిరామము; హరించుచుండె
దేవ !
మన్మనంబిది; దీనిని బట్టి తెమ్ము । మనకు క్రీడార్థమగు మహాబాహు! నాథ॥

తే. చెలగి మన యాశ్రమపదంబు చెంత నిచట।పుణ్యదర్శనములును నపూర్వములును
తిరుగుచుండు మృగంబులు సృమర చమర । పృషతములు గుంపు గుంపులు
పెక్కు లెపుడు॥ 10

తే. పృషతసంఘాలు ఋక్షముల్ కిన్నరములు। వానరంబులు కడుమనోహరము లౌర
రూపమున శ్రేష్ఠములు నెన్నొ భూపవర్య! । తిరుగుచుండు మహాబాహు ! వరుస
నిచట॥ 11

తే. కాని, దీనికి సదృశంబు గాన నెపుడు । దీప్తిని క్షమంబునందున తేజమునను
ధరణి మృగసత్తమంబు నిద్దానితోడ । సమము మున్నెన్న డౌర గాంచముగ,
నాథ॥ 12

తే. నాథ ! నానావిచిత్రవర్ణాంగ మిద్ది । రత్నబిందుసమాచితరమ్య మహహ
శోభ లెసగించు నీ వనక్షోణినెల్ల । చెన్ను డళుకొత్తు నిది శశిసన్నిభంబు॥ 13

తే. అదె యహో! రూప, మదె యహో లక్ష్మి యదియె । స్వర మహో! శోభనంబు
సంపత్తి భళిర !
మృగ మహో! యద్భుతంబు, హరించుచుండె । కడు విచిత్రాంగ మిద్ది నా
యెడద నౌర॥ 14

తే. జీవములతోనె నీ కిది చిక్కెనేని। ఎంతొ యాశ్చర్యభూతమై యెసగుగాదె
పృథివి జనులకు నెల్లను విస్మయంబు। గలుగజేయుచు మనకడ మెలగుగాదె॥ 15

తే. మనము వనవాసము ముగించి మరల పురికి। జని మహారాజ్యమేలెడి సమయ
మందు
నాథ! అంతఃపుర విభూషణంబుగాగ। ఈ మృగంబు మెలంగుగా యెంతొ ప్రీతి।

తే. భరత శత్రుఘ్ను లచట నా మరదులకును। అత్తలకు నాకు నీకును నందరకును
ప్రభుడ మృగరూప మిది విస్మయంబు సతము। కలుగజేయుచునుండు వ్యక్తమ్ము
సుమ్ము॥ 17

తే. జీవములతోడ నీ కిది చిక్కదేని। రుచిర మజినంబు పురుషశార్దూల! మనకు
చాలు నెమ్మికఁ దీనిని చంపి నాథ! తీర్పు మీ ముద్దు రామ పృథ్వీలలామ। 1

తే. అతిమృదుత్వంబు నొప్పు దర్భాసనమున। సరసజాంబూనదమయంబుచర్మమిం
పరచి సీతోడుతఁ శయింప మదిని నెంతొ! ముచ్చటను చెందుచుంటి నా యిచ్చ
దీర్పు॥ 1

తే. కామవృత్తము కాదొ మీ కరణి కోర్కె। స్త్రీల కసదృశ మంచును చెప్ప
చుందు
అయిన యీ మృగరూపంబు నరసి,నాథ। గొప్పవిస్మయమందితి కోరితిటుల॥ 2

తే. దాని కాంచనరూపంబు దాని హాయలు। దాని మణిశృంగములు దాని తరుణ
తరణ
వర్ణమును, దాని నక్షత్రపథముకాంతి। నరయ రాముని మదియు విస్మయమ
జెందె॥ 21

ఆ॥ సీత పల్కు వించు చెచ్చెర తానును। నద్భుతంబు మృగము నరసి దాని
రూపమునను విభుడు లోభితుండై పల్కె। సీతప్రేరణనను భ్రాంతకిటుల॥ 2

తే. చూడు లక్ష్మణ సీత కిచ్చో మృగంబు। పైన నెంతటి మక్కువ పరగెనోయి
దీని రూపవిశిష్టత గానమెందు। దొరక దిట్టి మృగంబెందు ధ్రువము కుర్రా॥ 2

తే. ఈ మృగంబున కెనవచ్చు మృగము వత్స। లేదు నందనవనమున లేదు దివిని
అల్ల చైత్రరథంబున; నవనినేడ। గానవచ్చును నింక లక్ష్మణకుమార। 2

తే. రుచిర మనులోమమును ప్రతిలోమమునుగ।రోమరాజి మృగంబుపై రూఢిమె
రయు
కనకబిందులు చిత్రముల్ కనుల నౌర। చూడు మిరుమిట్లుగొలుపును చోద్యము
గను॥ 2

తే. ఆవులించెడి దీని యాస్యంబునుండి। చూడు వెడలెడు నాలుక చోద్యమయ్యె
దీప్త మగ్నిశిఖోపమంబిద్ది వత్స। మొగిలునుండి శతహ్రదంబోయనంగ। 2

తే. ముఖ మది * మసారగల్లర్కమునకు సాటి।ఉదరమో శంఖమౌక్తిక సదమలమగు
ఇంక, యనిరూప్య మీ మృగం బెవని మనసు। లోభపరుపదు లక్ష్మణా రూఢి
చూడు॥ 2

* మసార = ఇంద్రనీలమణి; గల్లర్కము = గిన్నె.

తే. ప్రభుడ! జాంబూనదమయంబు రమ్య మిద్ది । అహహ! నానావిచిత్రరత్నాంచిత మిది
దివ్య మీ రూపమును జూడ పృథ్వియందుఁ । ఎవ్వని మనంబు విస్మయం బింక గనదు॥ 28

తే. రాజ లీలను ధనుర్విహారంబుకొరకు । వెడలి మాంసంబుకొరకును వేటలందు
మృగముల మహావనంబుల మెలపుతోడ। చంపుచుందురుగాదె లక్ష్మణకుమార!॥

తే. ధనములు మహావనంబున ధాతువులును । వివిధమణిరత్న సౌవర్ణ విసరములును
యత్నమున రాజులకు వేటలాటలందు । దొరకుచుండుట మనము జూతుముగ వత్స॥ 31

తే. దేని మనసార నరులు చింతించి సతము। వాంఛ సేతురో తత్సార మఖిల ధనము
నిచయ వర్ధనమగుసుమ్ము నృపుల కిలను। శుక్రునకు బోలె లక్ష్మణా చూడుమింత॥

తే. అర్థకృత్యంబు దేనికై యర్థి సతము । సంచరించుచు జను నవిచారముగను
అర్థశాస్త్రజ్ఞు లర్థ్య లద్దానినేను । లక్ష్మణా! "యర్థ" మంచందు ప్రాజ్ఞు లిలను॥

తే. అహహ! ఈ మృగరత్నంబుదైనయట్టి । అదె పరార్థ్యంబు కాంచన చర్మమందు
సతి సుమధ్యమ వైదేహి క్షితితనూజ। ఘనత నాతోడ కూర్చుండగలదు తాత॥

తే. * కాదు "కాదళి", "ప్రియకి"యు గాదు చెప్పదు। కాదిక "ప్రవేణి", "యావికి" కాదు సుమ్ము
దీనికి సమమ్ము స్పర్శచే; దీనిదైన । మెత్తదన మేలవచ్చు నా మృగములకును॥

తే. దివ్యములు రెండె గలవు పో మృగము లోయి । భువిని శ్రీమంత మీ మృగంబును, కుమార!
అదె నభశ్చర మృగ మగ్రహాయణమును। విను, మహీమృగ తారకామృగము లోయి॥ 36

తే. నీవు చెప్పిన యట్టు లీ మృగము వత్స । జగతి రాక్షసమాయయే యగున యేని
దీని నిప్పుడ పట్టి వధించుటయును । కనగ కర్తవ్యమేయగుగాదె నాకు॥ 37

తే. ఈ నృశంసునిచేత, మారీచుచేత । కఠిను డకృతాత్ము డీతని కారణమున
వనుల దిరిమ్మరు నీ మాయయసురు వలన । మున్ను మునివరు లెందరో పొలిసి రకట॥ 38

* కాదళి = కల్లచారల ఇఱ్ఱి; ప్రియకి = బొట్ల ఇఱ్ఱి; ప్రవేణి = కంబళివిశేషము; ఆవికి = 'అవిక' యనే జంతు రోమముచే చేయబడినవాటి, (లేక) కంబళి.

తే. వేటకై వచ్చియున్న పృథ్వీకళత్రు । లెందరెందరో యీ మాయమృగముచేత
నిహతులైరి మహేష్వాసు లిద్ధకీర్తి । కాననే, దీనివధియింప గడగవలయు॥ 39

తే. పూర్వ మిచ్చటనే మునిపుంగవులను । మోసపుచ్చుచు వాతాపి మోసగాడు
ఉదరగతుడౌచు చంపుచునుండె ద్విజుల । నశ్వతరిని స్వగర్భంబె చంపుమాడ్కి॥

తే. అంత చిరకాలమునకు నా యసుర దౌర । మాంసలోభాన చెలగి యీ మాయగాడు
ఋషి యగస్త్యుని తేజనావిష్టు బిలిచి । భక్ష్యమయ్యె యథారీతి వనిని మునికి॥

తే. భోజనానంతరంబున పూర్వరీతి । మునిని భేదింప నిజరూపమును ధరింప
నసురుడుద్యుక్తుడగుట యాయన యెరింగి । నవ్వి భగవాను డనియె దానవున కిట్లు॥ 42

తే. జీవలోకాన నెన్నియో జీవములను । పాప మన కీవు శ్రేష్ఠుల భూపవరుల
ద్విజుల నెందరినో పొట్టబెట్టుకొంటి । వగుట నాపొట్టజీర్ణమైతౌర నీవు॥ 43

తే. ధర్మనిత్యు జితేంద్రియు, తాత ! నన్ను । బోలువానిని లక్ష్మణా ! మోసబుచ్చి
బ్రతుకు నెవ్వండు; వాతాపివలె నతండు । నిహతుడై పోడె నాబాణ నిహతి జగతి॥

తే. ఉండు సన్నద్ధుడవుగ నీవుంకు మిచట । యంత్రితుడవౌచు వదినె గాపాడుమోయి
ఈపె యందునె యాయత్త మింక సుమ్ము । మనకుగల కార్యములవెల్ల మరువకోయి॥ 45

తే. నేను వధియింతు మృగము దీనిని, కుమార । లేక పట్టియె తెచ్చెద వీక నిపుడె
ఇదిగో పోవుచునుంటి సౌమిత్రి! కనుమ । వేగ మృగమును నిక గొని తేగ వత్స॥

తే. చూడు, లక్ష్మణ! వైదేహి క్షోణిజాత । ఆశగొనె యీపె మృగచర్మ మందు వత్స
చర్మమే సుమ్ము మరి ప్రధానమ్ము మనకు । కాన, చంపియె తెత్తు మృగమ్ము దీని॥

తే. ఏకబాణాన మృగము వధించి నేను । వచ్చువరకప్రమత్తత వదినె నిచట
రక్షయొనరింపుచుండు మాశ్రమమునందు । పృషతచర్మంబు గొని యిదే వేగ వత్తు॥ 49

తే. అల * ప్రదక్షిణ మా పక్షియతిబలంబు । లక్ష్మణా! బుద్ధిశాలి జటాయుగూడి
ఏమరక శంకితుండవై యెల్లయెడల । రక్షయొనరింపు వదిన ననుక్షణంబు॥ 50

* ప్రదక్షిణము = అత్యంత సమర్థము.

43 వ సర్గ సమాప్తి :— ( 1,384 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### నలుబది నాల్గవ సర్గ:– (27)

మారీచవధ– చచ్చునప్పుడు, "హా సీతా, హా లక్ష్మణా" యని మారీచు డరచుట – ఇది ఏమి ప్రమాదము దెచ్చునో యని రాముడు భయపడుచు, ఇంటిదోవను బట్టుట.

తే. అటుల తమ్ముని కాతని కానవెట్టి। ఆ మహాతేజు డా రఘునందనుండు
కట్టె మొలను మహాసి వేగంబ నపుడ। తరళ కనకత్సరువుదాని ధరణివిభుడు॥

తే. దివ్య మాత్మవిభూషంబు త్ర్యవనతంబు।చాపమును కేల ధరియించి క్ష్మావిభుండు
ఇక కలాపద్వయంబు బంధించివడిగ। వెడలె విపినంబున కుదగ్రవిక్రముండు॥ 2

తే. అటుల నరుదెంచు రాజేంద్రు నసురు డరసి। అతని వంచింపదలచి, భయంబు గదుర
కొంత యంతర్హితుండౌచు కొంత వడికి। మరల పొడసూపె రాముని కరుదుగాగ॥

తే. అంత బద్ధాసి రాము డమాంతముగను। ధనువు జేకొని పదగతి దాడుదీసె
మృగము చనినట్టిదారిని వేగబట్టి। అపుడె దానిని బట్టంగ విపులబలుడు॥ 4

సీ. రూపంబుతోడ సమీపంబునందున। ద్యోతమానుండౌచు దోచువాని
ఆ మహావనమున నా ధనుష్పాణుని। పరికించి పరికించి భావమరసి
ఇషుపాతసమయాన నెగసి తప్పించుక,। ఏమరియుండ గన్పించి మరల
ఆశగల్పించుచు; నటులె శంకించుచు। మరి, సముద్భ్రాంతుండై పరచు వాని

తే. అంబరంబున నెగసెడునట్టివాని। దృశ్యమానుని, వనిని నదృశ్యమాను
చదలఛిన్నాభ్రసంవీతశారదేందు। మండలంబనువాని రాముండు గాంచె॥

తే. తళుక్కుమనిపోచు నొక ముహూర్తంబు చెంత। మరల దూరాన మెరమెర
మెరసి తోచు
దర్శనాదర్శనంబుల తారి యిటుల। రాముఁగొనిపోయె దూర మాశ్రమమునుండి
వచి మృగతాంగతుండు మారీచు డౌర। 8

తే. కుపితుఁడై దాని చేష్టకు కొంతసేపు। మోహితుండౌను, వివశుఁడౌ, మూర్తి నపసి
అట్టి సంభ్రాంతుడై ఒల్చె చెట్టునీడ। వనిని కాకుత్స్థు డొక్క శాద్వలమునందు॥

తే. అటుల మృగరూపు డా నిశాచరుఁడు వనిని। రాము నున్మాదుగా జేసి భ్రాంతి
బరచి
మృగతతుల వన్యముల పరివృతుడు నౌచు। మరల దోచె సమీపాన మాయగాడు॥

తే. తనను బట్టంగవచ్చు నాతనిని జూచి। మరల పరువెత్తె మృగము సత్వరముగాఁగ
తక్షణంబట్టె పారె సంత్రాసమునను। మరల నంతర్హితంబయ్యె తరుల నడుమ॥

తే. వృక్షషండంబు నందుండి వెడలి మరల। మాయమున గోచినట్టి యాదుష్టమృగము
నోజ జంపంగ నా మహాతేజుడపుడు। ప్రభుడు కృతనిశ్చయుండయ్యె రాఘవుండు॥

ఆ. కరము కుపితుడౌచు శరమెత్తి రాముండు। చండసూర్యరశ్మి మండుదాని
సుదృఢ చాపమునను చౌరవగా సంధించి। బలియు డతడు లాగి బలముగాఁగ॥

ఆ. పన్నగంబుభాతి శ్వసియించుచున్న యా। మృగమె గురిగ బెట్టి దీప్తమేసె
జ్వలిత మత్త్ర మద్ది బ్రహ్మవినిర్మితం। బరివిమర్దనుండు ప్రభువరుండు॥ 14

ఆ. ఆ శరోత్తమంబు నశనిసన్నిభమష్ట। మృగమురూప మౌర చీల్చి మొదట
మరల జొచ్చి లోన మారీచుగుండియల్। చీల్చివైచె ప్రీలి చెవరి పడగ। 15

ఆ. తాలమాత్ర మెగిరి లీల శరాతురుం। డవని బడియె నసుర డప్పు డపుడ
వని వడంక జేసి భైరవనాదాల। అల్పజీవితుం డనల్పబుద్ధి॥ 16

ఆ. మృతిని బొందునపుడు విడిచె మారీచుండు। కృత్రిమంపు తనువు చిత్రముగను;
మరియు దలచె తనకు మరిమరి రావణుం। డెన్నొగతుల చెప్పియున్న పలుకు॥

తే. ఏయుపాయాన సీత సౌమిత్రి నిటకు। పంపివేయును? పిదప శూన్యంబునైన
ఆశ్రమమునుండి సీత నా యసుర విభుడు। త్వరగ హరియించు మరి నిరపాయ
ముగను॥ 18

తే. సమయమిదె యంచు దెలిసి నిశాచరుండు। ప్రభుని రాముని కంఠస్వరంబుతోడ
అరచె "హా సీత! హా లక్ష్మణా!" యటంచు। బిగ్గ బహుదూరమున కది వినగబడఁగ॥

తే. శర మనుపంబుచేత దాశరథిచేత । మర్మముల విద్ధుడై తన మాయరూపు
విడిచి నిజరూపమును దాల్చి విడిచె నసువు ; కృతి మహాకాయు డౌర మారీచు డప్పుడు॥ 20

తే. భూరి సర్వాభరణజాలములనతండు । ఔర! చిత్రవిచిత్ర కేయూరములను
మరి, మహాదంష్ట్రుడును హేమమాలియైన। రాక్షసుం డయ్యె రామశరాహతుండు॥

తే. ఘోరదర్శను రాక్షసు క్షోణిపతితు । రుధిరసిక్తాంగు నేలపొర్లుచునున్న
వతని వీక్షించి లక్ష్మణుం డన్నమాట । దలచి సీతను దలచె నా దాశరథియు.

తే. అన్న! యియ్యది మారీచుడైనయట్టి । మాయ యం చప్పె యనెగ లక్ష్మణుడు నాతొ
అయ్యె నట్టులె యయ్యెగా యౌర యిపుడు । ఏచి నాచేత జచ్చె మారీచుడేని॥

తే. ఔర, "హాసీత! హాలక్ష్మణా" యటంచు । స్వరము బిగ్గ నొనర్చుచు జచ్చె వీడు
దీని విని సీత యేమైనానో! దీని దలచి । లక్ష్మణుడు నే యవస్థపాల్పడునో యకట!

తే. ఇటుల చింతించు ధర్మాత్ము డినకులునకు । గగురుపాటొప్పె యప్పుడే గాత్రమందు;
భయ మది విషాదజంబు తీవ్రంబు గలిగె । చచ్చిన మృగంబు గనగ తత్స్వరము వినగ॥ 26

తే. చంపి వేరొక్క మృగము, మాంసంబుగొంచు । రాఘవుం డంత కడు సత్వరంపు గతిని
నిక, జనస్థానమున కభిముఖము గాగ । నడువజొచ్చె నిజాశ్రమం బపుడ జేర॥

44 వ సర్గ సమాప్తి :— ( 1,411 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### నలుబది అయిదవ సర్గ:- (40)

భర్త ఆర్తకంఠధ్వానము విని, సీత భయపడి, రామరక్షణకై లక్ష్మణుని పొమ్మనుట - "భయము లేద"ని లక్ష్మణుడెంత చెప్పినను వినక, సీత లక్ష్మణుని నిందించుట - అఘాయిత్యము జేయబూనుట - లక్ష్మణుడు దుఃఖము భరించలేక, దుఃఖముతో సీతను వదలి, అన్న వైపునకు వెడలుట.

తే. ఆర్తరావంబు భర్తకంఠస్వరంబు । బోలుదానిని విని సీత బాల యప్డు
"హా! మ్మ, కనుగొనిరమ్ము, రాముని కేమొ" । యంచు లక్ష్మణుతో ననె
యబల, భీరు !॥ 1

తే. నిలువదయొ జీవితంబు; గుండియలు నాకు । నిలువకున్నవి స్వస్థానములను నకట
వనిని పరమార్తి క్రోశించు ప్రాణవిభుని । యార్తశబ్దంబువింటివి, యేమనో,
యార్య !॥ 2

తే. వనిని నాక్రందమాను నీ భ్రాత నింక । త్వరగ రక్షింపదగుదీవు నరుగు మయ్య
వేగ పరుగెత్తు, చూచెద వేల, యింక। అన్న కేమయ్యెనో చూడుమయ్య యరిగి॥

తే. శరణుగోరును నీయన్న త్వరగ జనుమ । రాక్షసులచేత జిక్కి శ్రీరాము డయ్యె
మిగుల యాపన్నుడై యుండె విపినమందు। సింహములచేత జిక్కిన వృషభమట్లు॥

తే. అనుచు నిటు లెంతో సీత చెప్పినను గాని । అన్నయాజ్ఞదలంచి యా లక్ష్మణుండు
కదలడయ్యెను నటనుండి; కన్నులంత। ఎర్రజేయుచు సీత తా నిట్టుల నియె॥

తే. మిత్రరూపాన నీవు సౌమిత్రి నిజము । శత్రువుండవె సుమ్మ నీ యన్న కోయి
ఘోర! యిట్టియవస్థలో సైత మీవు । అన్న రక్షింప బోవకున్నావు కదలి

తే. ఔర! నాపైని యాశచే అన్న చావు । కోరుచుంటివి లక్ష్మణా ఘోరముగను
నిజము నాపైనిమోహాన విజనవనిని । అన్న రక్షింపబోవకున్నావు నీవు॥ 7

తే. అన్నవ్యసనంబుప్రియమంచు దలచు నీకు । అన్నపై నీకు లేదు స్నేహంబుసుంత
కానకే యిట్లు మెదలక కదల కిచట । నుంటి వేగక, కనగ నా ద్యుమణితేజు॥

తే. నీవు రాముని నీయన్ననే గురించి । యరుగ దెంచితి విటకు, నన్ గురిచి కాదు
అన్నయాపన్నదైయుండ యరుగవేవు; । ఏమిపని నీకు నాతోడ నిచట నుండ॥ 9

తే. ఇటుల బల్కెడి వైదేహి నింతి నాపె । బాష్ప శోకపరిప్లుత బాల వరసి
మృగవధువుభాతి త్రస్తయై బెగడు సీత। సతికి నిట్లనె లక్ష్మణస్వామి యప్పుడు॥

తే. పన్నగాసురగంధర్వవనుల యందు । దేవమానుషరాక్షసబృందములను
శక్తు డెవ్వడు లేడమ్మ జనని నిజము । నీదు భర్తను తల్లి! జయించువాడు॥ 11

తే. దేవి! దేవమనుష్యపక్షిందులందు । రాక్షసపిశాచకిన్నరపక్షములను
ఘోరదానవగంధర్వవారములను । వాసవోపము రాముతో పాటు నిలిచి
రణమొనర్చెడివాడు లేడమ్మ నమ్ము॥ 12

తే. రణమున నవధ్యుడమ్మ నీ రామవిభుడు । తగదు నీవిట్లు పల్కుట తల్లి! నన్ను
జనని! రాముండు లేనట్టి సమయమునను । అడవి నొంటిగ నిను వీడి యరుగుటెట్లు॥

తే. అధికబలవంతులైన యా యమరతతులు। ఈశ్వరునిగూడి యల్ల మహేంద్రుగూడి
మూడులోకాలవారును మూగినైన । రాము బల మాజిలో నెదుర్పంగ లేరు॥

తే. హృదయ మది నీకు నిర్వృతి జెందుగాక । మాను సంతాప మియ్యది మాత యింక
వచ్చు శీఘ్రమె నీభర్త సచ్చరిత్ర। తెచ్చును మృగోత్తమునుజంపి దేవి! నమ్ము॥

తే. కాదు రాముని స్వరమది కాదు, తల్లి! । ఎవడో చేసెను మాయగా యీ స్వరమ్ము
మాత! రాక్షసుడైనట్టి మాయ యద్ది ! అమ్మ! గంధర్వనగరతుల్యమ్మ సుమ్మ॥

తే. అన్న నిన్ను మహాత్ముడా సన్నుతుండు । అప్పగించెను నాకు నిన్నడవిబోవ
న్యాసభూతవు తల్లిరో! నైతి నీవు । అడవి నిన్నొంటి విడిచి నే నరుగ జాల॥

తే. నాటి ఖరవధజరిగిననాటినుండి । ఆ జనస్థానవధసమయంబునుండి
మనము శత్రులమైతి మా దనుజతతికి। వంచవన్ గూల్ప నెంతొ్రమ్మ వారు మనల॥

తే. తల్లి! హింసావిహారు లా దనుజతతులు। మనల భయపెట్ట వివిధమౌ భంగులుగను
కూయుచుందురు మహావన క్షోణినిటులె। చింతగొనకీవు వాని నీ చెవులబెట్టి॥ 18

తే. లక్ష్మణుం డిట్లు జెప్ప సంరక్తనయన। క్రుద్ధయై సీత పరుషంబు రూక్షముగను
పలికె వాక్యంబు వైదేహి పటుతరముగ। సత్యవాదికి లక్ష్మణస్వామి కిట్లు॥ 21

తే. * ఛీ! హత! అకరుణారంభ! ఛీ! అనార్య। ఘోర, కులపాంసనా! నృశంసా! కిరాత!
రాము వ్యసనం బిది మహత్తరంబు నీకు। ప్రియమె హా! యయ్యెనంచు నా హృదికి దోచు
కాకయుండిన నీవు పల్కవుగ యిట్లు॥ 22

తే. పాపమెట్టిది యౌర సపత్నులందు। సతము నినువంటి ప్రచ్ఛన్న చారులందు
దుష్టులందు, నృశంసులందును ధరిత్రి। గానబడుచుంట చిత్రమే కాదు సుమ్ము॥ 23

తే. ఛీ! సుదుష్ట! వనంబు వచ్చితివి నీవు। నాకొరకె యొంటివై నీదునాతిం దేక
ఇటు ప్రతిచ్ఛన్నుడవుగ; కా కింత కొర!। భరతు ప్రేరణమునవె తథ్యమ్ము తెలిసె॥ 24

తే. వాంఛ సిద్ధింప దది నీకు భరతు కేని; । ప్రభుని నిందీవరశ్యాము పద్మనేత్రు
రాము బతిగాగ బడసి నే నన్యనరుని। నెటుల కామింతు ఛీ! నీవు నెరుగవింత॥

తే. కనుమ సౌమిత్రి! నీసమక్షంబునందె। విడుతు ప్రాణాల సంశయం బేమిలేదు
రాము వీడి క్షణంబేని భూమిపైన। నిలుపజాలను ప్రాణాల నిశ్చయంబు॥ 26

తే. ఇటుల పరుషమ్ము వాక్యమ్ము కటువు గాగ। రోమహర్షణముగను నా లేమ పలుక
లక్ష్మణుండు హస్తములు మోడ్చి ప్రాంజలిగను। ఇట్టులనె సీతతోడ జితేంద్రియుండు॥ 27

తే. ఉత్తరము నీకు జెప్ప నే నుద్యమింప। దైవతమవీవు నాకు సతమ్ము తల్లి!
వాక్య మప్రతిరూప మిబ్భంగి దొర। చిత్రమేమియు కాదమ్మ స్త్రీలయందు॥

తే. ఇది స్వభావమ్మె స్త్రీల కింకేమ నందు। ఇటులె లోకాల నెందు గన్పించు నమ్మ
చపలులు, విముక్తధర్ములు, జనని! స్త్రీలు। భేదకరులును, తీక్ష్ణులు వేయునేల?॥

* పాఠాంతరము:— ఛీ! అకార్యకరణమిట్లు సేయుటెంతె?

తే. లేను. సహింపలేను యీ కృతఘ్నుపలుకు । అమ్మ! వైదేహి! జనకాత్మజా! ఘ్రినమ్ము
ఇద్ది నాకింక చెవులలో సేచి కాచ్చు । తప్తనారాచమనెడి విధమ్ముగాగ॥

తే. తల్లి! వినుమురుగాక యీ వంకకోర్కి । సాక్షులుగ దేవతలు వనేచరులు మనకు
న్యాయవాదిని నన్ను నన్యాయ మిట్లు । పరుషభంగిని పలుకుట మాత ! నీవు।

తే. ధిక్! నశింతువుగా యిట్టె దేవి నీవు : అయ్యో! గురువాక్యమున నిల్చినట్టినన్ను
ఇటుల శంకించుచుంటివి కేమ నందు । స్త్రీత్వమే దుష్టము స్వభావ సిద్ధముగను॥

తే. కాదు కాకుత్స్థుడున్నట్టి చెంత కిప్పుడె । స్వస్తి నీకగుగాత, మజ్జనని! దేవి!
రక్షయొనరింతురిగాగ నీ పక్షముండి । సర్వ మీ వనదేవతాచయము లెల్ల। 33

తే. ఘోరదుర్నిమిత్తనాలు నా కౌర! తోచు। మరల యపుడెంచి నే నింక మాత! నిన్ను
కనుల జూతునో లేనో నాయన్నతోష । అమ్మ! వైదేహి ! జనకాత్మజా ! యెరుంగ॥ 34

తే. లక్ష్మణుం డిట్టులనగ నారాము దయిత । రోదనము సల్పు చా వరారోహ సీత
పలికె ప్రత్యుత్తరంబు తీవ్రంబు నిట్లు । శోకబాష్పపరిప్లుత క్షోణిజాత॥ 35

తే. పడుదు గోదావరీనది వరద నిప్పుడె। రాము విడనాడి లక్ష్మణా బ్రతికియుండ
చత్తు నురివేసి; గిరి ద్రొబ్బి చత్తు నిప్పుడె । అగ్నిబడుదును, గరళముద్రావి చత్తు। 36

తే. కాలితోనైన పురుషు దాకనుర నన్ను! ననుచు లక్ష్మణు దెగనాడి యార్తిగూరి
హోరుమనియేడ్చి చేతుల నుదర మొత్తి। బాదుకొనజొచ్చె సీత యమాంతము గను॥ 38

తే. ఆర్తరూపను విమన నట్లుచట నేడ్చు । నా విశాలాక్షి జూచి మహామహుండు
లక్ష్మణుం డూరడింప నా రాముదయిత । మారుపలుకద కించిత్తు మరదితోడ॥

తే. అంత సీతకు నభివాద మాచరించి । కేలుమోడ్పుఘటించిమ్రొక్కియు సభక్తి
వెనుక వెనుకకు జూచు చా జనని నతడు। చనియె కాళ్ళాడక మహాత్ము డన్న కడకు॥ 40

45 వ సర్గ సమాప్తి :- ( 1,451 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### నలుబది ఆరవ సర్గ:- (37)

**ఈ సందు జూచుకొని, రావణుడు యతిరూపములో సీతకడకు వచ్చుట - నిజమైన యతియే యని సీత ఆతనికి ఆతిథ్యమిచ్చుట.**

తే. సీత పరుషంబు లిట్లులాడ చిత్తమెరియ। కుపితుడై రాఘవానుజుం డపుడ వెడలి
కడు విశాంక్షను నెట్టులో నడుగు లిడుచు। నచిరమున రాము జేరంగ నాత డరిగె॥

తే. అంతరంబునకై వేచి యటనె యున్న। ఆ దశగ్రీవు డా యవకాశమరసి
వేగ వైదేహి జేరంగ నేగుదెంచె। అట పరివ్రాజకుని రూప మవధరించి॥ 2

తే. సన్నకాషాయవస్త్రంబు జక్కఁ గట్టి। శిఖయు, ఛత్రంబు, పావుకోళ్ళిక ధరించి
ఎడమ భుజమున జక్కనై యింపుగొలుపు। దండము కమండలంబును దాల్చి వచ్చె॥ 3

తే. అన్నదమ్ములేని యా యదనునందు। * వెలదిఁ జేరంగవచ్చె నా వేషధారి
చంద్రసూర్యులు లేనట్టి సమయమందు। సంధ్యను మహత్తమం బట్లు ఉపచరుండు॥

తే. బాలను, యశస్వినిని, రాముపత్ని నతడు। కనుల వీక్షించె, నంగారకగ్రహంబు
చేదల భృశదారుణం బది శశివిహీన। రోహిణిని జూచు భంగిగా క్రూరు డసుర॥

తే. ఉగ్రతేజుని నాతని నుగ్రకర్ము। గని జనస్థానరుహ మహాత్మ్యజవితతి
గడగడవడంకె, వాయువు నడలుగదిరి। అట్టె చలియింపకయె నిల్చె నా వనోర్మి॥

తే. ధరణి నల్ల శీఘ్రస్రోత మరరె యదియు। రక్తలోచను నల్గడ నరయువాని
రావణుని జూచి స్థిమితతఁబోవ దొడగె। విపుల గోదావరీనది భీతి గదిరి॥ 7

* పాఠాంతరము:— అతివఁజేరంగవచ్చె నా యతిబలుండు.

తే. రాము పత్నిన నెప్పుడు ఛిద్రంబు గల్గు । నంచు గోరుచునున్న యా వంచకుండు
అడ నిదియె యంచు జేరె దశాస్యు డప్పుడ। భిక్షురూపాన సీత నా రాక్షసుండు॥

తే. భవ్యరూపాన నసుదు డభవ్యు డతడు । భర్తగూరిచి చింతించు వనిత నాపె
జేరవచ్చెను వైదేహి నౌర వనిని । చదల చిత్రను నల శనైశ్చరుడు వోలె।

తే. భవ్యరూపంబుతోడ నా పాపు డసుర । కూపము తృణావృతము భంగి రూపు వాడు
సీత వైదేహి నా యశస్వినిని నట్టె । రహిని జూచుచు నిలుచుండె రాముసతిని॥

తే. సుచిరదంతోష్ఠి మంగళరూప శుభద । పూర్ణచంద్రనిభానన వాలతి నల్ల
పర్ణశాలను గూర్చున్న పద్మనేత్ర । బాష్పశోకాభిపీడితన్ బాలనోల। 11

తే. పీతకౌశేయవాసిని సీతజూచి । సుదతి పద్మపలాశాక్షి క్షోణిసుతకు
దాపునకువచ్చె దుష్టచేతను డతండు । సతి సమీపంబునకు నిశాచరు డతండు॥

తే. హృదిని మన్మథసాయకావిష్టుడగుచు । బ్రహ్మఘోషంబు నోటితో బల్కుకొంచు
పలికె ప్రశ్రితవాక్యంబు పణతి కిటుల । ఎవరు లేనట్టి సమయ మీక్షించి యసుర॥

తే. లోకముల నుత్తమస్త్రీలలోనమిన్న । పద్మహీనంబు శ్రీబోలు పద్మనయన
వపువు కాంతిని వనిని విభ్రాజమాన । రాముసతిని ప్రశంసించె రావణుండు॥ 14

తే. ఎవర వీ వింతి! పీతకౌశేయవసన! । సుదతి! కాంచవర్ణాభ! మదిరనయన !
కమలమాలికమంగళకరముదాల్చు । పద్మినిని బోలుదీవు వో పద్మగంధి। 15

తే. హ్రీవ? శ్రీవ? శుభాంగి! కీర్తివ? సుకేశి । లక్ష్మివా? భూతివా? యప్సరసవ? నీవు
స్వైరచారిణిరతివ? విశాలనేత్ర! రూఢిజెప్పుమ యో వరారోహ నీవు॥ 16

తే శిఖరిణంబులు సమములు స్నిగ్ధములును । పాండురంబులు దంతముల్ పణతి నీవి
తన్వి! రక్తాంతములు కృష్ణతారకములు । విమలములుగౌను నికనుల్ విపులము లును॥ 17

తే. జఘనము విశాలమును పీన మగును భామ । కరికరసమంబు లూరువుల్ కాంతనీవి
తతము లుపచితములును వృత్తములునవిగొ । సంహతంబులు గౌను నీ చనులు సఖరో॥ 18

తే. రమ్యపీనోన్నతముఖంబులగును, సంప్ర । వల్గితంబులు స్నిగ్ధములు బాల యగును
తాళఫలతుల్యములు సుకాంతంబు లవ్వి। సుహచిరంబులు మహితవరాభరణములును॥

తే. చారుదతి! చారుహాసస్మిత! చారునేత్ర! । ఓ విలాసిని! హరియించుచుంటి వీవు
నా మనంబును కాంతతో నాతిమిన్న । ఏటిగట్టును వరద హరించుమాడ్కి॥

తే. నడుము పిడికిలి నమునొ నో పడతి నీది । నీదు తలకట్టు నందమౌ నీటుగలుగు
చనులు కొండలంటి నారాయునో చాన! నీవి । చిక్కదనమొప్పునవి సందుచిక్క
నియవు॥ 21

తే. దేవతలగాని, గంధర్వస్త్రీలగాని । యక్షకిన్నరకాంతలయందుగాని
ఇట్టిరూపము స్త్రీలయం దెందుగాని । మున్ను నేజూచినది లేదు భువనములను॥

తే. లోకముల నగ్ర్యమైన నీ రూపు దలప । సౌకుమార్యంబు వయసు నీ సౌరుదలప
ఉగ్రకాంతారమం దిట యునికి దలప । చిత్తమున్మాదమొందు, హా, చెలిరో!
నాకు॥ 23

తే. అట్టి నీవిట నుండ దనర్హ వబల । పొమ్ము నీచోటి కదియ భద్రమ్ము నీకు
రాక్షసావాసమిద్ది ఘోరమ్ము వనము । కామరూపులు ఘోరరాక్షసులు వీరు॥

తే. తుంగసౌధాగ్రములును నుత్తుంగభవన । పంక్తులును రమ్యనగరోపవనము లింక
సమృద్ధసంపన్న సౌగంధికాచయములు । నీకు విహరింపదగునట్టి నెలవు లబల॥ 25

తే. మంచిమాలలు, మంచిభోజ్యములు, మరియు । మంచివస్త్రంబులును, మంచి
మగడు నీకు
తగునుగాని శుభానన! తగ వి వేవి। శోభనా! యసితేక్షణ! చూడు మింత॥ 26

తే. ఎవర వీవు వరానన! ఎవర వబల । రుద్రకాంతవ? యో వరారోహ నీవు
వసువిలాసినివా! వాయువనిత వేమి?! దేవతవులోలె దోతువు దేవి, నాకు॥ 27

తే. రా రిచటి కెవ్వరును దేవవారములును । కిన్నరులుగాని గంధర్వ పన్నగులును
రాక్షసావాసమిద్ది, బహు రౌద్రవనము । ఎట్లు వచ్చితి వీ వహో యిచటి కబల॥

తే. ఇచట కోతులు, పులులు, నె న్నేని లేళ్లు । చిరుత లెలుగులు జింకలు సింహా
ములును
కంకగృధ్రంబులు, తరక్షు లింక గలవు । ఎట్లు భయపడకుంటివి వీక్షించి వీని॥

తే. ఘోరములు, మదాన్వితములు కుంజరములు।మరి బలిష్టము లీ వని దిరుగుచుండు
ఎట్టు లొక్కతె వబల! భీతింత లేక । రమణి! యుంటివి యీ మహారణ్యమందు॥

తే. ఎవతె, వెవ్వారిదాన, వెందుండిరాక । ఏ నిమిత్తంబు దండక కిటుల వచ్చి
ఒంటి చరియింతు కల్యాణి! యుగ్రమిద్ది । ఘోరరాక్షససేవితక్షోణి యిద్ది॥ 31

తే. రావణుండను దురాత్ముడా రమణి నబల। నిటు పరీక్షింప బ్రాహ్మణ వేషు నతని
గాంచి నిక్కంపు యతిగా నెంచి సీత। అతిథి సత్కారముల నెల్ల నాచరించె॥

ఆ. పీటదెచ్చి వేసి పిదప పాద్యం బిచ్చి। అర్ఘ్యమిచ్చి పూజ నటులె సలిపి
చాన యిటుల బలికె సౌమ్యదర్శనుతోడ। నిజము సిద్ధమంచు నెలత తలచి॥ 33

ఉ. పాత్రికుసుంభధారుని సమాగతు బ్రాహ్మణవేషధారు, నే
మాత్రముసంశయింపననుమానముదోషగనీనివాని, భూ
పుత్రికి కీడె సేయదలపూనినవానిని, జూచి, సీతయుక్
పాత్రుడెగాదలంచి, మరి, బ్రాహ్మణు కట్లు నిమంత్రణంబిడెన్। 34

తే. ఇదియెబ్బృసి, విప్ర! కూర్చుండు మిచట సుఖత।ఇదియె పాద్యంబు ప్రీతి గ్రహింపు మనఘ!
ఇదియె సిద్ధంబు వనజాత మిది ప్రశస్త। మిదె త్వదర్థంబు; భుజియింపు కొదువ దీర॥ 35

తే. అటు నిమంత్రితుడై రాక్షసాధిపుండు। నిండు మది బల్కుచుండు నరేంద్రుపత్ని
నింక బలిమిని హరియింప ధృతి వహించె।ఆత్మవధమునకై రావణాధముండు॥ 36

తే. భర్త మృగయాగతుని దివ్యవపుని నటులె। లక్ష్మణుని రాకకై యెదురరయుచాపె
పలు దిశలజూడ వనమె కన్పట్టెగాని। కానరారైరి రామలక్ష్మణులు నంత॥

46 వ సర్గ సమాప్తి :– ( 1,488 )



తే. మెతుకుముట్టను, న్నిద్రింప, కతుక నీరు । ఏమిచేసినగాని నే తృప్తిపడను
ఇదియె నాజీవితాంతంబు నృపయెఱుంగు; రాము పట్టంబు గట్టిన బ్రతుకక్షణము॥
తే. ఇటుల మాటాడునట్టి యా యింతి జేరి। మానదుండు నృపుండు నా మామ సతిని
ఘర యమూల్యాలంబులైన యర్థముల నెన్నో । చూపి యాచించినన్ వినజూడ
దాపె। 9
తే. దేవ! నాభర్త యా మహాతేజు డప్డు । పంచవింశతి వత్సరాల్ వయసునాకు
నేనొ పదునెన్మిదేండ్లప్రాయానమంటి;।సత్యవాక్, శుచి, నా రామచంద్రుడెప్డు॥
తే. ప్రథితు డాతండు లోకాల రామవిభుడు।సత్యసంధుండు సుగుణుండు జనవిభుండు
మరి, విశాలాక్షుడును, మహాబాహు డతడు । నిఖిలభూతైకహితరతుం డినకు
లుండు॥ 11
తే. ప్రభ మహాతేజు డా పంక్తిరథుడునైత । మకట కామార్తుడై తన యనుగు
సుతుని
రాము పట్టంబు గట్టండ భూమిపతిగ । కైకకు ప్రియంబు గూర్పంగ క్ష్మావిభుండు॥
తే. క్షితికి నభిషేకమునకునై పితరు కడకు । జనిన రాముని జూచి యా జననికైక
ధృతిని నాభర్తతోడ వచించెనపుడ । వచన మిట్టుల మది తడబాటులేక॥ 13
తే. ఆజ్ఞనిడె నాకు నీ తండ్రి ప్రాజ్ఞ! వినుము । పదియునాల్గేండ్లు ని న్నిక వనికి బంప
మరి, యకంటకరాజ్యంబు భరతున కిడ। తరలు; విడిపింపు పిత నన్నృతంబునుండి॥
తే. "సరియె" నంచు దృఢవ్రతుం డురుగుణుండు।చెప్పి కైకకు నాభర్త చెచ్చెరపుడె
వెడలె నకుతోభయుండు దా విపినములకు । రామచంద్రుండు విడిచి భూరాజ్య
మెల్ల॥ 16
తే. ఇచ్చురాముండు గైకొన డితరునుండి । సత్యమువచించు; చెప్ప డసత్యమెప్డు
ఇదియె, బ్రాహ్మణ! రాముని కింపుగూర్చు । వ్రత మనుత్తమ మాను, ధ్రువమ్ము
సుమ్ము॥ 17
తే. అతని తమ్ముడు ద్వైమాత్రు డరిదమనుడు । లక్ష్మణుండను పేరి వీర్యాధికుండు
తోడుగానుండు రాముని కెడ నతడు । విను నరవ్యాఘ్రు డాజి నభేద్యబలుడు॥
తే. ధర్మచారి, దృఢవ్రతుం డర్మిలి నిక । తాను వెడలె ధనుష్పాణియై నిరూఢి
వనికి నాతోడ వెడలు తత్ భ్రాతవెంట। రామచంద్రునివెంట నా లక్ష్మణుండు॥
తే. జటియు తాపసరూపుడై యిటుల వెడలి । తమ్ముతోడను నాతోడ దండకోర్వి
జొచ్చె నా ధర్మనిత్యుండు సచ్చరితుడు। పటు జితేంద్రియు డా రామపార్థివుండు॥

తే. అట్టి ముప్పూర మే మిటు లత్త్కైక । కారణంబుగ రాజ్యాధికార ముడిగి
వనము గంభీర మోజను బ్రాప్తహ్యాణుండ । తిరుగుచున్నాము తీర్ప బ్రతిజ్ఞ దీక్ష॥

తే. విశ్రమించుడో కింత; మాయింట నిలుము।వచ్చు నాభర్త గొను చిదే వన్యములను
రురుల నుడుముల జంపి బల్ క్రోడములను । నామిషము పుష్కలము గొంచు; స్వామి నిలుడు॥ 23

తే. ఇంక నీమనామము కులంబు సిద్ధచరిత ! । గోత్రమును జెప్పుడార్య ! యోక్షోణి దేవ !
ఒక్కరుడ విట్లు లీ దండకోర్వ్రిలోన । ఏల చరియించుచుంటి, నాకింత చెప్పుడు।

తే. ఇటుల నడిగెడి సీత కానృపతి సతికి । రామపత్నికి నా మహాప్రథితబలుడు
రాక్షసాధిపుడైన యా రావణుండు । పలికె ప్రత్యుత్తరంబు తీవ్రంబు నిట్లు॥

తే. గడగడవడంకు నెవ్వని గాంచినంత । అఖిలలోకాలు దేవాసురాహితతులు
అట్టి రావణనాముండ నగుదు సీత । వినుము రక్షోగణేశ్వరుండను సుకేశి॥ 26

తే. నిన్ను కాంచనవర్ణాభ నీలవేణి! । కమ్ర కౌశేయవాసిని గనిన దాది
స్వీయదారలపై రతి చిత్తమందు । గనక యుంటి ననిందిత! కాంత! సీత॥ 27

తే. ఉత్తమస్త్రీల పల్వుర నుర్విలోన । నిందునందున గొని తెచ్చి తిందువదన!
వారికెల్లరలోన నీ వగ్రమహిషి । వగుమ నా కింక; భద్రమా మగువ నీకు॥

తే. లంకయనుపేర గలదు మహాపురంబు । ధరణినాకు సముద్రమధ్యంబు నందు
సాగరజలావృతం బది సౌరుమీరు । వితత నగమూర్ధ్ని నది నివిష్టితము తరుణి॥

తే. అచట, హేసీత! నాతోడ నలరి కూడి । హాయి విహరింపగలవు వనాంతరముల
ఈ యరణ్యంపువాసంబు నింక మీద । కోరుకొనకీవు కోమలీ సారసాక్షి॥ 30

తే. అయిదు వేల్ సంఖ్య దాసీలు నహరహంబు। నహహా! సర్వాభరణభూషితాంగు లెల్ల
ఊడిగము సేయగలరు పూబోడి నీకు । సీత! నాకీవు విను భార్యవైతి వేని॥ 31

తే. రావణుం డట్లుపల్క నా రాముపత్ని । సీత యా యనవద్యాంగి క్షితితనూజ
కుపితయై రాక్షసాధము ఘోరు నతని।సరకుగొన కిట్లు పల్కె యా జనకదుహిత॥

తే. ఘన మహాగిరియట్లు లకంప్యునకును । క్షితి మహేంద్రుని యట్లు లజేయునకును
ఉరు మహోదధియట్లు లక్షోభ్యునకును। పతికి రామునకే యనువ్రతను వినుర॥ 33

తే. సర్వలక్షణసంపన్ను నుర్వీపతికి । రూక్ష న్యగ్రోధపరిమండలునకు కృతికి
సత్యసంధు మహాభాగు నిత్యునకును । పతికి రామున కేయనువ్రతను వినుర 34

తే. పటు మహోరస్కు డౌ మహాబాహునకును । సింహవిక్రాంతగామి కా క్షితి విభునకు
సింహసంకాశునకును, నృసింహునకును।పతికి రామున కే యనువ్రతను,వినుర। 35

తే. పూర్ణ చంద్రాననుండు రాముండు క్షితికి।రాజవత్సుంబు,పృథుకీర్తి ప్రభువరుండు
పటు జితేంద్రియు డౌ మహాత్మునకు కేను।పతికి రామున కే యనువ్రతను వినుర! 36

తే. నెవునకిట్టివు, సింహాని నిజము నన్ను । కోరు దెట్లు సుదుర్లభన్ కుమతివీవు
ననుస్పృశింపంగ నేరగునా? నిశాట।అలవి యగునెట్టు లాదిత్యు ప్రభ స్పృశింప।

తే. పాపపంబుల నెన్నొ సౌవర్ణములను । మందభాగ్యుడ! చూతు వే మందునిన్ను
ప్రియను భార్యను రామపృథ్వీశు కేను । కోరుచుంటివి రావణా మీరి నన్ను॥ 38

తే. క్షుధితమౌ మహాబలంబు, మృగేంద్రశత్రు। వల్ల సింహంబు నోటినుం డల్లిబిలిగ
కోరపెరుకంగ దలతువు; క్రూరసర్ప। వదనమునుండి లాగ నోకుదువుదంష్ట్ర।39

తే. మందరము పర్వతశ్రేష్ఠ మౌర నీవు । పాణిహరియింప దలతువు; పరమవిషము
కాలకూటంబుద్రావి సుఖంబుగాను । నింటి కేగ దలంతు విం కే మనందు॥ 40

తే. సూదితో కన్నుతుడుచుకో జూచెదీవు । నాకెదవు కత్తివాదర నాల్కతోడ
రామచంద్రుని ప్రియభార్య భూమిసుతను।నన్నుబొందంగ నక్కటా యెన్నెదీవు.

తే. కంఠమున రాయిగట్టు కగాధజలధి । యీది దరియింప దలచెద వింతకీవు
హస్తముల సూర్యచంద్రుల నణపదలతు। వౌర రాముని ప్రియభార్య గోరు దీవు।

తే. అగ్ని ప్రజ్వలితంబును నరసి దరిసి । వస్త్రమున మూటగట్టంగ వాంఛసేతు
వౌర, కల్యాణవృత్తను కోరినన్ను । నీవు హరియింప దలచెదు నృపతిసతిని॥ 43

తే. అల అయోముఖములను శూలాగ్రములను । నీవుచరియింపదలతువు రావణుండ!
రామచంద్రునికే తగు రమణి నన్ను । నీచ! పొందంగదలచెదు; నీచమణగు॥44

ద్వి సింహసృగాలాల కే యంతరంబు । స్యందిని కాల్భుల కే యంతరంబు
శుక్తామృతంబుల కే యంతరంబు । నీకు రామునకును నా యంతరంబు॥ 45

కాంచనసీసాల కే యంతరంబు । చందనపంకాల కే యంతరంబు
హస్తిబిడాలాల కే యంతరంబు । దాశరథికి నీకు నా యంతరంబు॥ 46

గరుడ వాయసముల కే యంతరంబు । మద్గు మయూరాల కే యంతరంబు
గృధ్ర సారసముల కే యంతరంబు । దాశరథికి నీకు నా యంతరంబు॥ 47

తే. మహా సహస్రాక్షతుల్యప్రభావుడతడు । చండ కార్ముక బాణపాణుండు నుండ
నను హరించియు జీర్ణించు కొనగలేవు ; ఈగ మ్రింగిన వజ్రంబు లాగు నోరి॥ 48

తే. ఇటుల సీత యదుష్టభావైకమతిని । వానికి సుదుష్టునకు జెప్పి దానవునకు
వనిత గాత్రప్రకంప సంవ్యథితయయ్యె ; కదలి వాతోద్ధతయు నట్లు సుదతి తన్వి॥

తే. వేపమానను సీత నా భీరు జూచి । రావణుం డట్లు మృత్యుతుల్యంబువాడు
కులము బలమును నామంబు క్రియలు తనదు । కృత్యములు జెప్పి మరియింత భీతి
గొలుప॥ 50

47 వ సర్గ సమాప్తి — (1,538)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### నలుబది ఎనిమిదవ సర్గ — (24)

రావణుడు తనగొప్ప జెప్పుకొని తనను వరించుమని సీతను గోరుట – సీత మరల తిరస్కరించి పలుకుట.

తే. ఇటుల బల్కెడి సీత నా కుటిలు డరసి । పరమసంరబ్ధుడై మాట పరుష మిటుల
రావణుడుపల్కె భ్రుకుటిలలాటమందు।బిట్టు ఘటియించి తన్వి కా భీరు కపుడు॥

తే. సవతితమ్ముడ నేను వైశ్రవణునకును । రావణుండను పేరు ప్రఖ్యాతివాడ
దేవి! వరవర్ణినీ, దశగ్రీవు డందుర్। దోర్బలుండ, ప్రతాపవంతుండ, తరుణి॥ 2

తే. ఎవని పేర్విన్న భయపడి యిందుర్ డాది । అమర గంధర్వపతగోరగాదు లింక
వసుధ ప్రజలును నిలువక పారుచుంద్రు।మృత్యువును జూచి న ట్లట్టి మేటివాడ॥

తే. మున్ను నా కొక్క-కారణంబున రణంబు।సవతి మాయన్న యతనితో సంభవింప
ద్వంద్వయుద్ధాన రాజు నాతనిని నేన। కూల్చితిని విక్రమించి బల్ క్రోధవశత॥

తే. అతడు నాదైనయట్టి భయార్తివలన । లంక స్వస్థానము సమృద్ధ మింక వీడి
శివుని కైలాస మా గిరి శ్రేష్ఠ మెక్కి।బ్రతుకుచున్నాడు త న్నర వాహనుండు॥

తే. కామగంబు శుభంబు నా కాశయాన । మా విమానంబు పుష్పకం బద్ది సీత
దేన నింగిని నే నెప్డు తిరుగుచుండు। విను మతని దేను నే గొంటి వీర్యమునన॥ 6

తే. పొలతి! సంజాతరోషు నా ముఖము నన్ను।చూచి నంతనె మైథిలి! సురలు గిరలు
వినుము శక్రపురోగముల్ బెదరి చెదరి । పారిపోవుచుచుంద్రిగా పలుదిశలకు॥ 7

తే. ఎచట నిలుతును నింక నే నచట దేవి!।భయముతోడనె వీచు బో మారుతుడును
రవియు తీవ్రాంశుడును మధ్యయంబుకతన।నౌర శిశిరాంశుడేయగు నాతిమిన్న

తే. తరులు నిష్కంపపత్రముల్ తరుణి వినుము। నదులు స్తిమితోదకంబులు సుదతి కనుము
ఎచ్చటెచ్చట నేను చరించుచుందు । ఎచ్చటెచ్చట నిక విహరించుచుందు॥ 9

తే. అదె సముద్రంబు కావలిదరిని గలదు । లంక యనుపేర నాపురి పొంకమద్ది
సతము నిండెను ఘోరరాక్షసులచేత । ఇంద్రు నమరావతిన్ బోలె నింపు నింపు

తే. పాండురం బల్ల ప్రాకార మమరియుండు। హేమకక్ష్యలు రమ్యంబు లెన్నొకలవు
నవ్యవైడూర్యమయతోరణములు గలవు।నాతి సతము విరాజమానంబు పురము॥

తే. మగువ! హస్త్యశ్వరథసుసం బాధమద్ది ! తూర్యనాద వినాదితం బార్య! యద్ది
సర్వకాలఫలంబులు తద్రుమజవితతి । సంకులోద్యాన రమ్య మా లంక సుదతి॥ 12

తే. అచట నీవు మనస్విని! యహరహంబు । రాజపుత్రినో ననుగూడి రాజవదన
హాయి వసియింపుచును సీత అవనిగల్గు । మానుషస్త్రీలస్మరియింపమానుదబల

తే. దివ్యముల మానుషంబుల భవ్యములను। భోగముల నీవు భోగించి పొంగు చచట
ఇంక స్మరియింప వా రాము గీము నీవు । మానుషు, గతాయు, నమ్మ నా మాట, సుదతి॥ 14

తే. దశరథుడు రాజు ప్రియపుత్రు ధరణిభరము । దాల్ప నియమించి భరతు; నీ తనిని జ్యేష్ఠ
మందవీర్యునిగా యెంచి పంపివైవ । వచ్చెగా నీదు రాముండు వనికినిటుల। 15

తే. భ్రష్టరాజ్యునితోడ తపస్వితోడ । తాపసునితోడ, విగతచేతనుని తోడ
రాముతో నేమి సేతువు రాజపుత్రి। రమ్మ నాతోడ నో విశాలాక్షి నీవు॥ 17

తే. సర్వరాక్షసభర్త నీ సరసకిటుల। వచ్చినాడను స్వయము కామంబువలన
ఇష్టు మన్మథసాయకావిష్టు నన్ను। తగ దిక తిరస్కరింప యో మగువమిన్న॥

తే. ఇపుడు నన్ను తిరస్కరించితివ యేని। పిదప పరితాపమొందెదు భీరునీవు
చరణపతితు పురూరవు సరసుదన్ని। పిదప తపియించు నూర్వశివిధముగాగ॥ 18

తే॥ వేలితోనైన సముడె నీ విభుడు నాకు। మగువ! రణమున రాముండు మాన వుండు
వనిత! నీ భాగ్యవశమున వచ్చియున్న। నన్ను భజియింపు భామినీ నాతిమిన్న॥

తే. క్రూరు డిటుపల్కనై దేహి కుపితయగుచు। సీత సంరక్తలోచన భీతిదొరసి
విజన మా వని పరుషవకావిధముగాగ । పలికెనిట్లు దశాస్యుతో పండతోడ॥ 20

తే. సర్వభూతనమస్కృతు సత్య్య. దేవు। వైశ్రవణు జెప్పుకొందీవు భ్రాతగాగ
ఎట్టి లశుభంబులీవు నీయెడన నెంచి। చేయనిచ్ఛించుచుంటివి ఛీ! యిదేమి! 21

తే. ఛీ, యావశ్యంబు నిశియింత్రు సిద్ధమింత। సర్వరాక్షసులింక రాక్షస విభుండ
నిన్ను కర్కశు నవిజితేంద్రియుని క్షుద్రు। రాజుగాజెంది సకలు దుర్మతిని సీసీ।

తే. ఇంద్రు భార్యను శచిని హరించియింక। శక్యమానోరి బ్రతుక నేమొ చంపబుగనో
రామభార్యను నన్నింక రావణుండ। హరణ మొనరించువానికి బ్రతుకె లేదు।

తే. శచిని నప్రతిరూపను సంగ్రహించి। వజ్రధరుచేతినుండియు బ్రతుకవచ్చు
ఇంక నమనంటి దాని దూషించువాని। కమృతసంప్రాప్తికైన నాకంబులేదు।

48 వ సర్గ సమాప్తి : (1,562)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### నలుబది తొమ్మిదవ సర్గ:- (41)

(సీతను రావణుడు అమాంతముగ ఎత్తుకొనిపోవుట - సీత ఆక్రోశించుట - తోవలో జటాయు సందర్శనము - సీత అతనిని బిగ్గరగ పిలుచుట.)

తే. సీత వచనంబు లవి విని ఘాతుకుండు। తద్దశగ్రీవు డప్పుడు ప్రతాపశాలి
హస్తమును హస్తమున గొట్టి యసుర జెట్టి। చేసె సుమహద్వపువు, నింక జెప్పె
నిటుల।। 1

తే. మైథిలీ! నీవు మిగుల యున్మత్తమతివి। పాటిగానినట్లు లేవు నే నొట్టితోడ
చెప్పియుండిన నాదగు గొప్పదెంపు। వీర్యము పరాక్రమంబు నా వింతబలము।। 2

తే. అంబరంబున నిలిచి భూమండలంబు। రెండుచేతులనెత్తుదు పండిబలుడ
కంధిజలమెల్ల ద్రావుదొక్కటియె గ్రుక్క। మృత్యువును బట్టి చంపుదు మొనల
కుండ।। 3

తే. ఇదె నిరోధింతు నర్కు, భేదింతుభూమి। తీక్ష్ణశరముల జిమ్మి వేధింతు నెల్ల
భామ! యున్మత్త! చూడు నన్ కామరూపు। కామమున నీకుతగిన సత్కాము, పతిని।।

తే. ఇట్టు లనుచున్న క్రుద్ధు నా జెట్టికనులు। సూర్యకల్పంబులును శిఖిజ్యోతు లౌర
జ్వలితములు హరిపర్యంతములును నవియు। నెత్రకండలుగా నయ్యె నిలువునప్పుడె।।

తే. అపుడె సౌమ్యంబు భిక్షురూపంబు విడిచి। కాలరూపాభమౌర స్వకంబురూప
మపుడె దాల్చెను వైశ్రవణానుజుండు। రావణుండు దురాత్ముండు రాక్షసుండు।।

ద్వి. సంరక్తనయనుండు సాటోద్యముండు। తప్తకాంచనకుండలోత్తమధరుడు
నీలజీమూతసన్నిభుడు శ్రీయుతుడు। ఘనదశగ్రీవుండు క్షణదాచరుండు

## వైదేహీహరణం



శ్లో॥ వామేన సీతాం పద్మాక్షీం, మూర్ధజేషు కరేణ సః । ఊర్వోస్తు దక్షిణేనైవ, పరిజగ్రాహ పాణినా ॥

తే॥ వామకరమున మూర్ధజ [illegible] బట్టి । చెలగి దక్షిణపాణి నూరులను బట్టి
సీత పద్మాక్షి నసుర డా ఘాతకుండు । ఎత్తుకొని పోయె [illegible]

అరణ్యకాండః 49 వ. సర్గః 18 వ. శ్లోకం (169 పేజి)

బాణకార్ముకపాణుడై నైరృతుండు । అల పరివ్రాజకచ్ఛద్మంబు విడిచి
పలుమహాకాయంబు స్వస్వరూపంబు । రాక్షసాధిపుడప్పు డా రావణుండు
ధరియించి మిగుల క్రోధావేశు డగుచు । రక్తనేత్రంబుల రక్తాంబరముల
జీమూతసమకాంతి భీముడై నిలిచి । స్త్రీరత్నమును సీతఁ దేరిజూచుచును
అసిత కేశాంత నా యతివగాంచుచును । ఉత్తమవసనభూషోత్తమోపేత
భాస్కరప్రభతుల్య వైదేహి గనుచు । రావణుండిటు పల్కె క్రౌద్రంబుగాను॥

తే. మూడులోకాల విఖ్యాతి మోగినట్టి। భర్త నిచ్ఛింతువేని నీ వబల! పడయ
నన్నె యిక యో వరారోహ యాశ్రయింపు । నీకు తగినట్టి భర్తను నేనె తన్వి॥

తే. నన్ను భజియింపు చిర మిక నాతిమిన్న । నీకుప్రియుడను శ్లాఘ్యుడ నీలవేణి
విప్రియము సేయ నెన్నండు వెలది నీకు । సీత! మంగళరూపిణీ! చేరు నన్ను॥

తే. మదిని భావంబు వీడు మా మనుజుపైన । నిలుపు నాయందు మనసును లలన యింక
రాము నే గుణముల ననురక్తవైతి? । మూఢ! పండితమానిని! పొలతి! చెప్పుమ॥

తే. పరిమితాయు, నసిద్ధార్థు ధరణిరాజ్య । సంపరిభ్రష్టు నే గుణసంప దరసి
రాముపై నిల్పు దింక నీ ప్రేమ నబల । వట్టి బేలవు పండితమాని వీవు॥ 15

తే. పనికిమాలినస్త్రీదైన పలుకు బట్టి । రాజ్యము, సుహృజ్జనంబు, సర్వంబువిడిచి
ఘనము వ్యాళానుచరిత మీ వనముజొచ్చి। నీల్గుచున్నాడు దుర్మతి నీ మగండు॥

తే. పలుకుచు ప్రియార్హ కా ప్రియవాదిని కిటు। రాక్షసుండు సుదుష్టాత్ము డాక్షణంబ
కామమోహితుడై సీత నా మెలంత। బట్టుకొనె రోహిణిని బుధుం డట్టు లౌర!

తే. వామకరమున మూర్ధజ పటలి బట్టి । చెలగి దక్షిణపాణి నూరులను బట్టి
సీతఁ బద్మాక్షి నసురు డా ఘాతుకుండు। ఎత్తికొనిపోయె రావణుం డేమ నందు॥

తే. తీక్ష్ణదంష్ట్రి మహాభుజు మృత్యుసదృశు । నద్రిసంకాశు రావణు నప్పు డరసి
అచటి వనదేవతలును భయార్తి జెంది । పరుగువారిరి దిశలకు పరియలగుచు॥ 18

తే. అంతవరకును ప్రచ్ఛన్నమయ్యు నున్న । ప్రబల ఖరయుక్త మౌర! ఖరస్వనంబు
దివ్యతరమద్ది హేమాంగ దీప్తమపుడు । రావణు మహారథంబు ప్రత్యక్షమయ్యె॥

తే. పరుషవచనాల నా మహాస్వనుడు ఖలుడు । భీతిగొల్పుచు సీత కా భీరు కపుడు
అంకమున నాపె వైదేహి నట్టికొంచు। రథముపై బెట్టె సతిని నా రావణుండు॥

తే. సీత రావణుచేత నపహ్రియమాణయగుచు । రామ, రామాయటంచు దూరముననున్న
రాముఁ గూర్చి యాక్రోశ మామె చేసె ! వితత దుఃఖార్త, యా యశస్విని,
వనోర్వి। 21

తే. ఆమెను సకామ సబల కామార్తుఁడతఁడు । పన్నగేంద్రవధువునాగ బడలుదాని
కష్టకరము విచేష్టమానగ నా రమణి గొనుచు।నెగిరె నింగికి రావణుం డేకగతిని॥22

తే. రాక్షసేంద్రునిచేత నా రూక్షుచేత।అబల హ్రియమాణయగుచు విహాయసమున
భృశము క్రోశించె మత్తనా వెఱ్ఱి నాగ । భ్రాంతచిత్తయొ మరి యాతురయై
యనంగ॥ 23

తే. అకట హా లక్ష్మణా మహాబాహు!సౌమ్య!భ్రాతృచిత్తప్రసాదకా హా! గుణాఢ్య
రాక్షసుడు నీ ఢమన్నిఁ నన్ రూక్షగతిని।హా! హరించుట యెఱుగవుగా!మహాత్మ!॥

తే. సుఖము జీవిత మర్థంబు క్షోణిరాజ్య । మిన్ని త్యజియించి హా! ధర్మహేతువునను
ఇటు లధర్మంబుగా హరియింపబడెడి । నన్ను రాఘవ! చూడకున్నావదేల?

తే. ధరణి నవినీతులకు వినేతవుగ నీవు । ఇట్టి పాపాత్ము రావణు నింకబట్టి
పలశాసింపకుంటివో యినకులుండ । రామచంద్ర! పరంతపా! రా గదయ్య॥

తే. కసగి యవినీతు డొనరించు కర్మమునకు । అట్టి సద్యఃఫలంబు గన్పట్టదోయి
కాల మదిగూడ సాయంబు కాగవలయు ! సస్యమది పక్వమగునె తక్షణము
చెప్పుమ॥ 27

తే. నీవు కాలోపహతబుద్ధి నీ విధంబు । కార్యమున్ జేసినాడ వకారణంబ
జీవితాంతకరం బిక జెందగలవు । ఘోర మాపద రాముచే క్రూర! నీవు॥ 28

తే. హంత యిప్పుడేకదా కైక యత్త యాపె। తథ్యము సకామయగును బాంధవుల
గూడి;
ధర్మకాముని రాముని ధర్మపత్ని । హరణమగుచుండె తత్కృత్రిపరునిపత్ని॥

తే. హా! జనస్థాన కర్ణికారంబులార । ఓ! సుపుష్పితతరులార మ్రొక్కులిడుదు
రావణుడు సీత హరియించు దేవినంచు । శీఘ్రమే రామునకు మీరు చెప్పు
డోహో॥ 30

తే. మాల్యవంతంబ! గిరివరంబా! మహాత్మ! । వందనము ప్రస్రవణమహాపర్వతంబ!
శీఘ్రమే రామునకు నీవు చెప్పుమయ్య । సీతహరియించు రావణుం డీతడంచు॥

తే. హంసకారండవాకీర్ణ భాసురంబ! । తల్లి! గోదావరీనది! దండ మిదియె
శీఘ్రమే రామునకు నీవు చెప్పవమ్మ । సీత హరియించు రావణుం డీతడంచు॥

తే. దైవతములార, వివిధపాదపములార ! యీ వనంబున వెలయు మీ కెల్లరకును
భక్తిని నమస్కరింతు, నా భర్తతోడ ! చెప్పుడ నన్నిటు లసుర హరించుటెల్ల।

తే. ఎవ్వి యెవ్వి వనోర్వర నిచటనుండు । సత్త్వములు వాని నెల్ల నే శరణు జొత్తు
జగతి నిటగల్గు మృగపక్షి సంతతికిని। శరణ మిదె వొత్తు నాపైని కరుణ గొనగ॥

తే. ప్రాణముకంటె మిన్న నీ పత్నినౌర । ప్రియను సీతను వివశ హరించుకొంచు
పోయె రావణుడంచు నా భూమిపతికి । పతికి నిక విన్నవించుడు సతులార వత్తు।

తే. ఆ మహాబాహు డా మహాబలుడు, భర్త। ఇంక నేనున్నచోటును నెరుగునేని
యమునిలోకాననున్న స్వర్గాననున్న । తెచ్చును పరాక్రమించి పృథ్వీశ్వరుండు॥

తే. అటుల కరుణంబుగా బల్కు చార్తితోడ । ఎంతో దుఃఖించి విలపించు చింతి
యప్పుడు
చూచె ఆయతలోచన క్షోణిజాత । అట వనస్పతిగతము గృధ్రంబు నొకటి।

తే. రావణవశంగత శుభాంగి రాముదయిత। కాంచి సుశ్రోణి పక్షి నా యంచితాత్మ
భీగ్గ నాక్రోశమొనరించి పిలిచె నిటుల । అతివ భయపర, దుఃఖోపహత వచోక్తి॥

తే. ఓ జటాయో మహాత్మ! నన్ జూడు మోయి।ఎత్తుకొనిపోవుచున్నవా డీ శఠుండు
పాపకర్ముండు, రాక్షసపాంసనుండు । న న్నిదె యనాథవతుగ, దీనను కృపాళు॥

తే. వీని వారింప నీవశం బేమిగాదు । క్రూరుడు నిశాచరుండు దుర్బుద్ధి వీడు
సత్త్వవంతుండు రౌద్రుండు సాయుధుండు । మరియు జితకాశి శక్యమే మరలు
పంగ॥ 40

తే. రామునకు నా మరందికి లక్ష్మణునకు । నన్ను రావణు డిటుగొని చన్నవార్త
సకల మిద్ది యథాతత్త్వ మిక మహాత్మ। చాలు చెప్పిన మరి యశేషంబుగాగ॥

49 వ సర్గ సమాప్తి :- ( 1,603 )

*

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఏబదియవ సర్గ:- (50)

(సీత ఆక్రోశమును విని జటాయువు రావణుని అడ్డగించుట.)

తే. శబ్ద మప్డాని నప్డు డా తన్మ్రుమహమున । నిద్రపోవుచునున్న యా నీడజంబు
విని, శిరంబెత్తి కాంచె నా మింటితోవ । నా జటాయువు రావణు నవనిసుతను॥

తే. అంత పర్వతకూటాభమైనవాడు । తీక్ష్ణతుండుండు పక్షీంద్రు డా క్షణంబ
చెట్టుపైనుండియే యిట్లు చెప్ప దొడగె । కాంతివంతుండు తత శుభాక్షరము లిట్లు॥

తే. ఓ! దశగ్రీవ! నిలు నిలు! మొక్కమాట । నర సనాతన ధర్మానవరలువాడ
సత్య సంశ్రయుడను మహాసత్త్వయుతుడ । గృధ్రపతిని, "జటాయు"వం డ్రెరుగు
నన్ను॥ 3

తే. రాజు సర్వత్రిలోకాళి కా జితారి । పోల్పగ మహేంద్రవరుణోపముండు సుమ్ము
లోకములకు హితమ్ము కూర్చును సతమ్ము । రామచంద్రుండు విను దశరథ
సుతుండు॥ 5

తే. ఎవనికి నీ విప్డు దొంగిలి హరింప నెంచితో । ఆమె యా లోకనాథుని యా మహాత్ము
ధర్మపత్ని యశస్విని తథ్య మెరుగు । సీతయందురు వరారోహ మాతసుమ్ము॥

తే. ధర్మసంస్థితుడై ధరవనరు రాజు । ఎట్లు పరదారలను పరామృశ మొనర్చు
రక్షణీయలు రాజదారలు గదన్న । మరి విశేషించి; రావణా! యెరుగ వాక్కు

తే. మరలి చిక పరదారాభిమర్శనంబు । నుండి మరలించుకో; నీచ మోయి యద్ది
పరులు గర్హించునట్టి యే పనినిగాని । సేయరుగదోయి ధీరులు శీలయుతులు॥ 7

తే. ఆత్మసతులెట్లులో యట్లె యన్యసతులు । నిజము రక్ష్యలుగాదె పండితుల కెప్పుడు॥
శిష్టు లధిపులు శాస్త్రనిషిద్ధమైన । ధర్మ మర్థము కామంబు దలప రెప్పుడు। 8

తే. ధర్మకామంబులకు నింక ద్రవ్యములకు। రాజె యుత్తమనిధి సుమ్ము రావణుండ!
ధర్మము శుభంబొ పాపంబొ ధరజెలంగు । రాజమూలంబుగానె, పౌలస్త్యవంశ్య!

తే. పరమపాపస్వభావుండ వరసిచూడ । చపలుడవు, దుష్ప్రకృతివి నిశాచరుడ వీవు
అట్టి నీ కెట్టు లైశ్వర్య మబ్బె నోయి । వసుధ దేవవిమానంబుభాతిగాగ। 10

తే. వారివారిస్వభావంబు మానుపంగ ! శక్యమెవరికికాదోయి కపచరుండ
*వినుముదుష్టాత్ములౌ వారి గృహములందు।చిరము నిలువంగ జాలదు సిరినిజంబు॥

తే. నగరముననగాని, రాష్ట్రాననైనగాని। రాముడు మహాబలుండు ధర్మాత్ము డెప్పుడు
నీకు సేయడె యపరాధ మింతగాని। ఏల యపరాధ మతని కీవు వొనర్తు॥ 12

తే. శూర్పణఖ హేతువున మీదు జూడకెగసి । నీ ఖరుండు జనస్థాన నిలయు డట్లు
రాము నక్లిష్టకర్ముచే రాలె నన్న । నిజము రాముని తప్పేమొ నీవె చెప్పుమ। 13

తే. దానికై రాముసతి దేర తగవుకాదు । విడువు వైదేహి వేగంబ; విడువవేని
దహనభూతంబు లౌ ఘోరతరము లక్షు। లిపుడె నినుగాల్చు వజ్రి మా వృత్రు
నట్లు। 15

తే. సర్ప మాశీవిషంబు వస్త్రాంతమందు । కట్టుకొని సుంత దెలియక మిట్టిపడెను
కాలపాశంబు బిగ్గ నీ కంఠమందు । తగులుకొనియుంట చూడవు దనుజ! నీవు॥

తే. ఎత్తికొనదగునిక భారమేది నరుని । కుంగదీయదో దానినే; క్లిష్టముగను
తినగదగును ననామయస్థితిగ నేది । జీర్ణమగునో తదన్నంబె చెబుదు సౌమ్య॥

తే. దేని నొనరింప ధర్మంబుగానిసుంత । కీర్తియేకాని యశమేని క్షితిని లేనొ
ఇంక ఖేదమ్మెయగునో శరీరమునకు । అట్టికార్యము నెవడు సేయందలంచు॥ 18

తే. భూమిపై నేనుబుట్టి నా పూర్వపితలు । పూని యేలిన రాజ్యంబు నేను బూని
పాలనమొనర్చి గడపిన కాల మరయ।ఇప్పటికి నయ్యె యరువది వేలయేండ్లు॥ 19

తే. వృద్ధుడనునేను; తరుణుండ వీవు తాత! । రథివి, ధన్వివి, కవచివి, పృథుశరుడవు
అయిన, పోనీను నిన్ను క్షేమంబుగాను । అబల వైదేహిగొంచు నీ వరుగ దలప॥

* పాఠాంతరం:-వినుమా, దుష్టాత్ములౌ వారి హృదయములను।సదుపదేశంబు చిరము నిల్వదు. ధర్మనంబు

తే. ఇంక నే బ్రాహ్మణుండ నీ యింటి కేవు। బలిమి గొనిపోవ లేవురా బాలసుండ
న్యాయసంరక్షకోత్తమవాక్యములతోడ। ధ్రువము వేదశ్రుతిని నాన తొలగద్రోయ?॥
తే. యుద్ధమొనరించి నిజము కోరుచుండవేని . నిలు ముహూర్తంబు రావణా ! నిలు నిలుమట
చచ్చి నారాకు నేలకై కూలగ నిపుడె। మున్ను ఖరుడు జనస్థానభూమి నట్లు॥ 22
తే. అసహ్యతరుగ సంకులంబుల నసమబలుడు। దైత్యదానవతతి హతమార్చె నవడు
అవిరతముందున నా వీరనాయకుడు। నిన్ను వధియించు యుధి రామనృపవరుండు॥
తే. మూర్ఖతకుతలైన దాశరథుల్ నిశాట!। ఏమి సేతును; పిలువ వీ లేదినాకు ?
వారి భయమున కంపించ! వారె దీవు। కనులబడకుండ రామలక్ష్మణుల కోరి॥ 24
తే. నేను జీవించియుండ ఇందీవరాక్షి। రామమహిషిని ప్రియను నీ భూమిసుతను
సీత మంగళరూపిణీ ఘాతుకుండ। ఎత్తికొనిపోవ లేవురా యింక కనుర॥ 25
తే. నా కవశ్యంబు కర్తవ్యమౌ కదోయి। నాదుప్రాణాలనొడ్డియునైన గాని
ప్రియమొనర్పమహాత్ముడౌ మిత్రమణికి। రామునకు తండ్రి దశరథభూపతికి॥
తే. నిలు! నిలు! దశాస్య! రావణా నిమిష మచట। ఇత్తు నీకు యుద్ధాతిథ్య మిదియె, నాదు
ప్రాణముండెడునంతక, నీ తలగ ద్రోతు। వృంతమునుండి ఫల మట్లు తేరినుండి॥

50 వ సర్గ సమాప్తి :— ( 1,631 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఏబది ఒక్కటవ సర్గ :- (46)

**( రావణ జటాయువుల యుద్ధము - జటాయుని దెబ్బ తట్టుకోలేక రావణుడు సీతను క్రిందకి దించి యుద్ధము చేయుట - ఎట్టకేలకు జటాయువు నేల గూలుట. )**

తే. ఇటు జటాయువు న్యాయమౌ నటుల బలుక । క్రుద్ధు రావణు కన్నులు ఘోరవహ్ని
నిభము లిరువది యన్నియు నిప్పుకణము । లొక్కసారిగ గ్రక్కె నహో నిరూఢి॥

తే. కోపమున వాడు సంరక్త ఘోరనయన । గోళుడై తప్తకాంచనకుండలుండు
రాక్షసేంద్రుడమర్షణుండా క్షణంబు । తరిమె పతగేంద్రుపైకి బల్ ధాటి నడరి॥

తే. ఆ మహావని వారి కమాంతముగను । సంప్రహారంబు తుములమై సాగె నపుడు
మేటి వాతోద్ధతంబులౌ మేఘములకు । గగనమున పోరు గల్గిన గతిగ గనగ॥

తే. అద్భుతంబయ్యె తద్యుద్ధ మప్డు గనగ । గృధ్రరాక్షసరాజుల కేమ నందు
పంతమున పక్షవంతముల్ మాల్యవంత । భూరికుధరంబులకు బోలె బోల్ప నపుడు॥

తే. భూరి నాళీకనారాచముల వికర్ణి । కముల, తీక్ష్ణాగ్రముల, సుఘోరముల నపుడె
గృధ్రరాజేంద్రుపై గురిపించె నౌర । రావణుండు మహాబలుం డావహమున॥

తే. గృధ్ర మయ్యది పత్రిరథేశ్వరుండు । రావణాస్త్రంబులను తత్శరావళులను
సంయుగంబున గొనియె నౌ సరకుగొనక । పటు జటాయువు శ్రీరామబంధు
వప్పుడు॥ 6

ఆ. పతగసత్తముండు పటు మహాబలు డంత । చరణములను తీక్ష్ణతరనఖముల
గాత్రమందు జేసె గాయాల పెక్కుల । రావణునకు రిపువిరావణునకు॥ 7

తే. కెరలుక్రోధాన నా దశగ్రీవు డంత । శత్రుమర్దన కాంతుడు హస్తముల గొనియె
మృత్యుదండవిభంబుల విపుల ఘోర । మార్గణంబుల పదిని సమానుపములు॥

తే. నిశితములు, తీక్ష్ణములు, బాణనిచయము లవి । పూర్ణముక్తంబులును శిలీముఖము లవ్వి
ఘోరము లజిహ్మగములు తేజ ఘోరబలుడు । బట్టినైచె జటాయువుపై పటుతరముగ॥ 9

తే. అచట రావణు రథమున నబల సీత । బాష్పలోచనయుంట జటాయు వరసి
తత్శరంబుల గణియింప దలప కెగసి । పక్షి రావణుపైకి దా నడరె నపుడ॥

తే. వితతముక్తామణి విభూషితము ఘనము । సశర మసురుని చాపంబు చరణములను
భగ్న మొనరించె నా మహాప్రథితబలుడు । కృతి మహాతేజు డా పతగేశ్వరుండు॥

తే. అంత వేరొక్క ధనువును నంది కేలి క్రోధమూర్చితు డసురుండు ఘోరముగను
చేగ వర్షించె శరవర్ష మేక రీతి । శతములు సహస్రములుగ నా పతగుపైన॥ 12

తే. వితతముల నా శరాళి నా పతగవిభుడు । చుట్టబడియుండి సంగరక్షోణి దోచె
నిజకులాయంబులోపల నిలిచియున్న । పక్షియో యనుభంగి నప్పట్టునందు॥ 13

తే. వర్షముగ మీద గురియు నా బాణవితతి । పక్షములతోడ విదలించివైచి ఖగము
చరణహతిద్రుంచె నపుడె రాక్షసునిదైన ధనువు మహాద్యుతు నా మహాతేజు డెగసి॥

తే. అగ్నిసదృశము దీప్త మా యసురవరుని । పృథుకవచ మా మహావీర్యు డపుడ
చించివైచెను నింతింత చిదుపలగుచు । ఎగిరిపోవంగ పక్షవిక్షేపములను॥ 15

తే. కాంచనోరశ్ఛదముల దివ్యముల బలుడు । చంపె రావణుఖరముల జవయుతముల
రణమున పిశాచవదనంబులైనవాని । అండజేశ్వరుడప్పు డఖండకేళి॥ 16

తే. వరమది త్రివేణుసంపన్న మతులితంబు । కామగంబును పటు పావకార్చిషంబు
విమలమణిహేమమయవిచిత్రాంగ మద్ది । విరిచివైచె మహారథం బురుబలుండు॥

తే. పూర్ణచంద్రప్రతీకాశమును తతంబు । ఛత్రమును తాల్చి గొప్పవింజామరలను
వాని బట్టిన రాక్షసవారములను । కెరలి వేగాన నా పతగేశ్వరుండు॥ 18

తే. శ్రీయుతుండంతబోక జటాయు వీర । రక్కసునిసారథి మహాచ్ఛిరంబు నైత
నపుడె ద్రుంచెను ముక్కున విపులబలుడు । పక్షిరాజు మహావేగవంతు డెగసి॥

తే. భగ్నధన్వుండు విరథుండు హతహయుండు । నిహతసారథి రావణుం డే మనండు
అంకమునఁ గొంచు సీత నమాంతముగను । దుమికె భూమికి యపుడ యద్భుత
బలుండు 20॥

తే. భగ్నవాహనుడై నేలపైకి నిట్టు । లురలిపడినట్టి రావణు నరసి యపుడు
"సాధునాథంచు" భూతసంచయములెల్ల । గృధ్రరాజును కీర్తించి రెలమి కలిమి॥

తే. జరకతంబున యుధి పరిశ్రాంతు నతని । పక్షియాధవు జూచి రావణుడు మరల
హృష్టమతి మైథిలిని గొంచు నింగి కెగసి । పోవుచుండెను దివ్వదివ్వనను దాటి॥

తే. జనకసుత నంకమునఁ గొంచు సంతసమున । నరుగు రావణు వెంట జటాయు వపుడె
ఎగసి పరతెంచి మరి యడ్డగించి పలికె। నా మహాతేజుడిట్టు లా రామబంధు॥ 23

తే. వజ్రసంస్పర్శబాణు నా ప్రభువరేణ్యు । రాము భార్యను సీతను రావణుండ!
అల్పబుద్ధి! హరించెద వసుర! యోరి । తథ్య మిక సర్వరక్షోవధార్థ మేర॥ 24

తే. సబల సామాత్య సహపరిచ్ఛద సమిత్ర । బాంధవం బీవు త్రావెదు పరమవిషము
ధర పిపాసితు డుదక మాపాయ్యముగను । త్రివుభంగిని నో యసురాధముండ॥

తే. జగతి కర్మల కనుబంధముగను వచ్చు । ఫలము లవిచక్షణుల్ సుంత తెలియలేక
శీఘ్రమె నశింతు; రావణా చెనటి నీవు।నిటులె నశియింతు వోరి దయావిహీన॥

తే. బద్ధుడవు కాలపాశాన వధము కొరకు । నిజము నీవోరి దాని నిం కెందు బోయి
నీచ! విడిపించుకొందువా నిర్భృతుండ । సాఽమిషము గాలమున్ మ్రింగు జలజ
మట్లు॥ 27

తే. భువి దురాధర్షు లా రాఘవుల్ నిజంబు । త్వత్ కృతంబిద్ది యాశ్రమ ధర్షణంబు
వినుర క్షమియింప రెన్నటికిని నిశాట । ప్రభులు కాకుత్స్థు లోరి రావణ
యెరుంగు॥ 28

తే. పిరికిపందవు నీ విటుల్ నెరపి నట్టి । లోకగర్హితకార్యంబు లోకవజాడ
తస్కరాచరితంబు పథంబె గాని । ఇంక వీరనిషేవితం బేమి గాదు॥ 29

తే. రమ్ము! యుద్ధమ్మొనర్పరా రావణుండ । ధ్రువము శూరుండవేని నాతో క్షణమ్ము
నిలువు మచ్చటః; యిపుడె నీ నిద్రబుత్తు । ధరణికూల్తును ఖరుడు నీ తమ్మునట్లు॥

తే. పురుషుడు పరేతకాలంబుదరిసినవుడు । పలుపు నే కర్మ తన వినాశనముకొరకు
కర్మ యట్టి దధర్మ్యంబు కడకు నీవు। పల్పుచుంటివి యోరి నిశాచరుండ॥ 31

తే. ఖలుడ! వావాస్తుఁబంధ మేకర్మ మెరుఁగ। సేయు తత్కర్మ నెవ్వఁడురా? యపాత్ర
నాగు భోగాళికల్క భంగపాటుగాని। విను మిక స్వయంభువుండేని వెరపుమాలి।32

తే. ఇటు జటాయువు శుభాకారంబు పటుతరంబు। వాక్య మా రక్కసునితోడ పలికి యపుడ
ధృష్టమున జేరగా నా దశగ్రీవు వీపు। పృష్టమందున వ్రాలె నా వీరవరుడు॥ 33

తే. పట్టి నఖముల పటుతీక్ష్ణదంతములను। చీరె నల్లెడ నా దశగ్రీవువీపు
గుప్తవారణమును రెక్క తోత్రములను। పొడుచునట్టి గజారోహు పోల్కిగాగ॥

తే. ముండ్లమున వీపు చీరి ప్రచండముగను। నఖములను జీరి పృష్టంబు నఖిల మటుల
కెరలి యుత్పాటమొనరించె కేశములను। అసుర నా నఖపక్షముఖాయుధుండు॥

తే. మాటిమాటికి నిట్లు క్లిశ్యమానుడగుచు। త జ్జటాయువుచేత గృధ్రంబుచేత
కర చరమధ్యుండు స్ఫురితోష్ఠ దరుణు డగుచు। భృశము కంపించె రావణుం డసమబలుడు॥ 36

తే. అంత వామాంకమున సీత నదిమిబట్టి। క్రోధమూర్ఛితుడౌచు నా ఘోరు డసుర
డాడెను జటాయు నరచేత ప్రబలముగను। రావణుండు దురాత్ముండు రక్కసుండు॥ 37

తే. తుండమున నా జటాయువు దండితారి। రావణు నెదిర్చి యాతని ప్రబలమైన
వామబాహుల పదిని నభంగలీల। తుంచివైచె ఖగాధిపుం డంచితుండు॥ 38

తే. అటుల దంచ్ఛిన్నమైన బాహువులైనట్టి వాని। కప్పు డప్పుడె బాహువు లౌర! పుట్టె
గరళజ్వాలావళీయుక్త ఖరశరాహి। పటలి వల్మీకమునుండి వచ్చునట్లు॥ 39

తే. కెరలి క్రోధాన నా దశగ్రీవు డంత। వణకు సీతను నేలపై వదలిపెట్టి
ముష్టిఘాతాల చరణాల పిష్టముగను। గ్రుమ్మివైచె జటాయు నా క్రూరుడసుర॥

తే. అంత రణము ముహూర్తమాత్ర మత్యంత మయ్యె। నచట రాక్షసముఖ్యున కచలబలికి
పతగపుంగవు డాతని కతుల వీర్య। యుతుల కిద్దరి కీరీతి యుగ్రరీతి॥ 41

తే. రామకార్యార్థమై యిట్లు భీమముగను। పోరుచున్న జటాయు నా వీరు నరసి
పక్షముల పార్శ్వముల నల్లె పాదములను। ఖలుడు ఖండించె యసురుండు ఖడ్గమెత్తి॥ 42

తే. రౌద్రకర్ముండు రణమున రావణుండు।పక్షముల ఛిన్నమొనరింప ప్రబలి యిటుల
ధరణి పాతుడౌచు బడియె గృధ్రాధిపుండు। అల్పజీవితుడగుచు జటాయు వకట॥

తే. అవని నిటు బడ్డ పతగు జటాయు నరసి ; అకట క్షతజార్ద్రునరసి యా యవనిజాత
వడిగ పరుగెత్తె యాతని పార్శ్వమునకు దుఃఖిత స్వబంధుచెంతకు దూకు నట్లు॥

తే. నీలజీమూతకల్పు నా పృథ్వీతల్పు ! పాండురోరస్కు బలవీర్యవరయశస్కు
గనియె లంకేశు డా జటాయుని ఖగేశు ! అగ్ని దావను శాంతమన్ భంగివాని॥

ఉ. రావణవేగమర్దితు ఖగాగతు, పత్రిరథున్ నిపాతితున్
దేవి మహీతనూజ శశినిర్మలకాంతిముఖారవింద యా
యావహభూమిజూచి జనకాత్మజ, సీత, హరింబొరిన్ కటా
నావిరి కౌగలించి యనివారిత యేడ్చె భృశంబు దీనతన్। 46

51 వ సర్గ సమాప్తి :- ( 1,677 )



తే. క్లిష్టమాల్యాభరణసీత పృథ్విజాత। నిల యనాథయైనా విలపించుదాని
చెంత కట్టె నిశాటుండు చెంగునెగసి। పట్టె వైదేహి నట్టె రావణుడు, ఖలుడు॥

ఆ. లతలజుట్టుకొంచు వితతవృక్షంబులఁ। గౌగలించుకొంచు వేగ బరచి
రామ రామ యంచు రాముండు లేని యా। పదిని నరచుదాని పతిరహితను।

ఆ. విడువు విడువు మంచు వ్రేలుచు బహురీతి రాక్షసాధిపుండు రావణుండు
తనవినాశమునకె తరిమి కేశంబుల। బట్టె అంత కాథు పట్టె సతిని॥ 10

తే. ఇటు ప్రధర్షితమగుడు మహీజ సీత। జగము సర్వము మరి చరాచరసహితము
హా! యమర్యాదమయ్యె యంధంబునయ్యె। ఘోరతమసావృతంబయ్యె కుమిలె
దిశలు॥ 11

తే. వీవడయ్యెను మారుతదేవు డపుడు। నిష్ప్రభుండయ్యె దినకరుం డే మనందు
దీన, సీత, పరామృష్ట దివ్యదృష్టి । * గని పితామహు డనె "కృతంకార్య"
మనుచు॥ 12

తే. అబల సీత పరామృష్ట యట్టు లగుట।రావణు వినాశము యదృచ్ఛ ప్రాప్తమగుట
అరసి తెలిసి ప్రహృష్టులు వ్యథితులైరి। దండకారణ్యవాసు లా తపసులెల్ల॥

తే. రావణుడు నట్లు సీత నా రాము సతిని । "రామరామా"యటంచు "హా!
లక్ష్మణుండ"
యంచు నాక్రోశమొనరించు నబల గొంచు।తరలె నాకాశమార్గాన దానవుండు॥

తే. పీతకౌశేయవాసిని భీతసీత। తప్తభూషణసర్వాంగి తన్వి, నింగి
వెలిగె నా రాజపుత్రి య వ్వేళ నచట। తరళవిద్యుత్తటిల్లత తెరగుగాగ॥ 16

తే. ఆమె యుద్ధూతపీతవస్త్రంబు కతన! రావణుండప్డు వెలిగె నభ్రాన చాల
అధికకాంతిని; దీప్తాగ్ని నంబరమున।వెలుగు పర్వతరాజంబు విధముగాగ॥ 17

తే. పరమకల్యాణి వైదేహి పావనాత్మ। తాల్చియున్నట్టి సురభిళ తామ్రవర్ణ
పద్మపత్రంబు లపుడు రావణునిపైన। జలజలన్ రాలె పరతెంచు జలదవీథి॥ 18

తే. ఆమె కౌశేయ ముద్ధూత మంబరమున। వెలిగె కనకప్రభంబు పెంపెక్క-శోభ
ఆతపంబున నాదిత్యరాగమునను। తామ్ర మభ్రంబు పగిది తద్వనధరిత్రి॥ 19

తే. ఆమె సువసంబు వస్త్రంబు నంబరమున। రావణాంకగ మప్డు వెల్గకయయుండె
రామచంద్రుండు లేకున్కి- రమ్యకాంతి। పంకజంబు వినాళమన్ భంగిగాగ॥ 20

* పాఠాంతరము— నరవి యజా డనె "కృతమ" కార్యం బ టంచు.

సీ. వర లలాటంబును మరి సుకేశాంతంబు । పద్మగర్భాభ మవ్రణము శుభము
సుకపోల. శుక్ల. విస్ఫుటకాంతి దంతాలు నెంతయు మరి యలంకృతము సతము
చారుతామ్రోష్ఠంబు చంపకోన్నసమును । గగనమెల్లెడ హాటక ప్రభంబు
నిర్మలంబు చంద్రవత్ ప్రియదర్శనంబును । ఆకసంబున రావణాంకగంబు

తే. ముదితమును, వ్యపమృష్టాస్రమది, ముఖంబు । నీల జలదంబు భేదించి నింగిపై నః
జక్క నడయుంచు చంద్రునిచాయ నప్పుడు। దోచె చూపర కా నింగిత్రోవఁగనగ॥

తే. రక్కసునిచే సమాఘాత మక్కుమారి। శుభము వదనము సుంతయు శోభగనద
రామచంద్రుండు నాథుండు లేమి జేసి । పాలుపాడిచిన చంద్రుని భంగినప్పుడు॥

తే. హేమవర్ణాంగి సీత మహీజ యప్పుడు । రాక్షసాధిపు నీలాంగు ప్రక్క నుంట
నీలమణినాశ్రయించి చెన్నెసగునట్టి। కాంచనీకాంచి యన నొప్పె అంచితాత్మ॥

తే. ఆమె సీత, తనుప్రవాళైకరక్త । రాక్షసేశ్వరు నీలాంగు కక్షనుంట
గజము బట్టిన కాంచని కక్ష్యబోలె । వెలిగె వైదేహి యాకాశవీధి నప్పుడు॥

తే. బాల, హేమాక్ష, జనకజ, పద్మ, గౌరి । తప్తభూషణ సీత యుత్తరిని జూడ
రావణాంకంబునందు నభ్రాన దోచె । మేఘమధ్యంగతంబైన మెఱపుపోల్కి॥

తే. ఆమె భూషణఘోషల నంబరమున । నప్పుడు పసమిడు నా రాక్షసాధిపుండు
నీలదేహుండు దోచె నా నింగిత్రోవ । సచపల సఘోష నీలాభ్ర జలద మట్లు॥

తే. సీత హ్రియమాణ వైదేహి శిరమునుండి। పుష్పవృష్టి చ్యుతంబయ్యె పుడమినెల్ల
తోనె రావణ వేగనిర్ఘాతమగుచు । నదియు మరల దశగ్రీవు నంటివచ్చె॥ 29

తే. అతుల వైశ్రవణానుజు నంటివచ్చు । పుష్పధార నగంబున బోల్చ నయ్యె
మేరునగ మున్నతంబును మింటనంటు । విమలనక్షత్రమాలయగు విధముగాఁగ॥

తే. సీత హ్రియమాణ వైదేహి క్షితితనూజ । చరణమునుండి పడియె నూపురము
ఘనము
రత్నభూషిత మా సీత రమ్యభూష । మహి తటిన్మండలసమంబు మధురఘోష॥

తే. బాల, జనకాత్మజ, తరుప్రవాళరక్త । రాక్షసేశ్వరు నీలాంగ కక్షనుంటి
కాంచనీకక్ష్య వెలుగొందు గజము నట్లు। సీత వెలిగించె నా రాక్షసేంద్రు నప్పుడు॥

తే. మానిని, స్వతేజమున దీప్యమాన యగుచు । నింగిని మహోల్కభంగి వెలుంగు
దాని
సీత గొంచును నాకాశసీమ నరిగె । ఆపె హరియింప వైశ్రవణానుజుండు॥ 33

తే. రమణి భూషలు నగ్నివర్ణములు నవియు।పడె సఘోషంబు ప్రశమిపై బహుళభంగి
తారకంబులు క్షీణముల్ ధరణిపైకి। అంబరమునుండి పడు విధంబుప్రకు దోప॥
తే. లలన జనకాత్మజ స్తనాంతరంబునుండి। అమల తారాధిపద్యుతి హార మద్ది
భ్రష్టమైభూమి బడుచు గన్పట్టె నపుడు। గంగ గగనచ్యుతంబగు భంగిగాగ॥
తే. అరయ ఉత్పన్నవాతాభిహతము లపుడు।తరులు నానాద్విజగణాయుతంబు లెల్ల
"తల్లి! భయపడక"ని యూరడిల్ల బల్కు। పోల్కియయ్యె విధూతాగ్రములు
వనోర్వి॥ 35
తే. త్రస్తమీనజలేచరవారితములను। ధ్వస్తకమలాల కొలకు లుత్తరెవి జూడ
సఖి గతోచ్ఛ్వాస గురించి విషాదపడిన। భంగి, సీతకు శోకించు భంగి నోచె॥
తే. అన్నివైపులనుండి యా యడవిలోని। సింహశార్దూలద్విపముఖ్యమృగములెల్ల
రోషమునవచ్చి సీత నా కూర్మిసడసుర। వడి హరించెడి నీడవెంబడిని బడియె॥
తే. పారలెడి జలప్రపాతాస్రముఖచయములు।నింగి కుచ్ఛ్రితబాహులన్ శృంగములను
సీత హ్రియమాణగూర్చి క్రోశించులాగు। పోల్ప గన్పట్టె పర్వతముల్ ధరిత్రి॥
తే. భీత హ్రియమాణ వైదేహి సీతః జూచి। దీనుడయ్యె దివాకరుం డా నభాన
శ్రీయుతుండు ప్రతిధ్వస్తపృణియ యయ్యె। ఔర, పాండరమండలుండయ్యె
నప్పుడు॥ 40
తే. నాస్తిధర్మము; సత్య మేనాటనుండు? । ఆర్జవంబేది? దయయు శూన్యంబకాదె
రాముభార్యను హరియించు రావణుండు। అనుచు పలవించె భూతంబులన్ని
గుములు॥ 41
తే. అకట విత్రస్తకములు, దీనాననములు। అల్ల మృగపోతకములును జిల్లవోయి
అస్రపాతావిలేక్షులై మహీజ। నరసి మెడలెత్తియెత్తి యెంతయును నేడ్చె॥ 42
తే. మిగులక్రోశించి దుఃఖాన పొగులు చట్లు।లక్ష్మణా రామ యని మధురముగ నేడ్చి
తరచు ధరణిని నరయు నా తరుణి జూచి। తద్ద వణకిరి వనదేవతలు ధరిత్రి॥
తే. అకట, ఆకులకేశాంత నవనిజాత। విప్రమృష్టవిశేషక విముఃచకిత
సీత వైదేహి నా మనస్వినిని గొంచు। నరిగె రావణు డాత్మవినాశమునకు॥ 45
తే. కుందరదన, శుచిస్మిత, సుందరాంగి। బంధుజనవినాకృత సీత, పతిని మరది
జూడనోచక భయభారపీడితాత్మ। యగుచు నయ్యె విషణ్ణవక్త్రగను నపుడు॥46
52 వ సర్గ సమాప్తి:— ( 1,723 )

తే. నిజము శౌండీర్యమానివి నీచ! నీవు । చేసియుండిన యట్టి యీ చేష్ట నింక
కుత్సితంబు నధర్మంబు కాపురుష మంచు। చెప్పుకొందురు పురుషు లీక్షితిని నెపుడు॥

తే. ధిక్! త్వదీయంబు శౌర్యంబు, ధిక్ బలంబు। చెప్పుకొంటివి గొప్పగా అప్పు డోరి
హా! కులాక్రోశకరము రా లోకమందు । చరిత మిట్టిది నీది ధిక్! చదివిపోను।

తే. ఇటుల భయవేగమున బరువెత్తెదీవు । ఏమి సేయంగవచ్చు నిన్నిప్పు డోరి
నిలు ముహూర్తంబు; చూతువు బలె తమాస। జీవములతోడ పోలేవు నీవు మరలి॥

తే. ఓరి! పార్థివపుత్రు లవ్వారి కంబ। పడినయట్లైన నీవు నీ బలముతోడ
గూడియు క్షణంబు బ్రతుకంగరాదు నెట్లు! । నిలువు మోరి ముహూర్త మీ
నింగి నిల్లు॥ 11

తే. వారిదైనట్టి యా శరస్పర్శ నీవు । సుంత యోర్వంగలేవురా సుంత! నీచ!
వనిని ప్రజ్వలి తాగ్ని దా స్పర్శ నింత। మరి విహంగము మోర్చునే యరయుమోరి॥

తే. ఆత్మహితమును లెస్స నీ వరయుదేని ! వినుము నన్నిక సాధువై; వినువవేని
మత్ప్రధర్షణరుష్టుండు మద్విభుండు। వడిగ నినుగూల్చు లక్ష్మణస్వామిగూడి॥

తే. ఏ ప్రయత్నాన బలిమి నన్నిట్టు లోరి। నీవు హరియింప నిచ్ఛింతొ నీచ! వినుర
అదియు నౌను నిరర్థకం బరయు మింత। వినుము నన్నిక రావణా! వెర్రి యన్న॥

తే. భర్త విబుధోపముని నాదు ప్రాణపతిని। గాంచకుండంగ రిపువశంగతను నౌచు
చిరము ప్రాణాల ధరియింప చిత్తమందు । కోరనుర యోరి రావణా! కుటిలకర్మ॥

తే. ఆత్మకీవు నిజంబు శ్రేయంబుగాని । పథ్యమునుగాని తెలియవు పాతకుండ
మృత్యుకాలాన మర్త్యు లిం కేమనందు। మదుల విపరీతములనె గాంచెదరు గాదె॥

తే. మరణమాసన్నమైన యెల్లరకు ధ్రువము । పథ్యమైనట్టి దిక రుచింపదుగ మూఢ!
కాలపాశానపాశితకంఠు నోరి । స్పష్టముగ జూచుచుంటి రావణుడ నిన్ను॥ 17

తే. ఔర! యిట్టి భయస్థానమందుగూడ । నీవు భయపడకున్నావు రావణుండ !
ధ్రువ మిక హిరణ్మయంబులౌ ద్రుమచయముల । చూచుచున్నావు నీ వోరి
క్షోణి నెందు॥ 19

తే. నదిని వైతరణని ఘోరమది ధ్రువంబు । రక్తరుధిరౌఘవాహిని రావణుండ !
కాంచె దసిపత్రవనము భీకరము నోరి ! తప్ప దిక నీకు మరణంబు దానవుండ॥

తే. తప్తకాంచనపుష్పసంతతులతోడ । రమ్యవైడూర్యవర్ణపత్రములతోడ
తీక్ష్ణ మాయసకంటకా వృతమునైన । శాల్మలిని జూచెదవు నీవుకల్మషాత్మ॥ 20

తే. ఆ మహాత్మున కీ నృశంసమైనయట్టి । కీడు నొనరించి నీ వింక క్షితితలాన
చిరము బ్రతికుండ లేవురా ఛీ! నృశంస! విషము ద్రావిన నరు డట్లు విషగుణుండ!॥

తే. బద్ధమవ్వ కాలపాశాన కంఠ! నీవు । రావణా యద్ది దుర్నివారణము సుమ్ము
మరియు నింకెందు బోయి క్షేమంబు గనెదు? । నా విభుండు మహాత్ముండు
దేవుడుండ॥ 22

తే. తోడు తమ్ముండు లేకుండ తృటిని నవడు । వేలుపదునాల్గు రాక్షసవిభుల నొకడె
హతమొనర్చె మహావనంబందు చెలగి । తజ్జనస్థానఘోరయుద్ధాన నాడు। 23

తే. అట్టివీరుండు బలుడు సర్వాస్త్రకుశలి । రాఘవుం డిష్టభార్యాపహారు నిన్ను
చంపకుండెను తీక్ష్ణముల్ శరచయముల । బరపి రఘుకులనాథుండు భండనమున॥

తే. ఇట్టు లింకను పలుకుచు నెన్నెన్నొ సీత । పరుషముల రావణాంకగ పలికి మరియు
అబల భయశోకసంవృతయై కలంగి । కరుణముగ నెంతొ విలపించె కమలనేత్ర॥

చ. అటుల భృశార్త భామినిని హా, కరుణంబు విలాపపూర్వ మ
చ్చటబహుభంగి పల్కు-ల విషాదముతో వచియించుదాని న
ట్టిటు కరుణంబుగా కలగి యెంతయు వ్రాల్గెడుదాని సీత నా
కుటిలుడు గొంచుపోయె దివి గోలను కంపితగాత్రి జానకిన్॥ 26

53 వ సర్గ సమాప్తి :- ( 1,749 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ఏబది నాలుగవ సర్గ :— (౫౪)

(ఆకాశమార్గాన హరింపబడు సీతకు ఒకచో దిగువ నొక కొండమీద అయిదుగురు వానరులు కనిపించుట - సీత వెంటనే తన పమిటముక్క పర్రున చించి, తన నగల కొన్నింటిని దానిలో మూటగట్టి, ఆ కోతులమధ్య పడవేయుట - ఈ సంగతి ఆ తొందరలో రావణు డెరుగకుండుట - త్రిటిలో సముద్రముమీదగపోయి, రావణుడు లంకలో బ్రవేశించి, సీత నొకచో బంధించుట - ఎవరిని తన యాజ్ఞ లేనిది సీతను చూడనివ్వవద్దని కావలిస్త్రీల కాజ్ఞనిడుట - రాముని జాడగని పెట్టి, అతని చంప యత్నింపుడని ఎనమండుగురు రాక్షసులను రావణుడు జనస్థానమునకు బంపుట - సీత నెత్తికొని వచ్చుటతో ఇక తాను కృతార్థుడైనట్లే, మూర్ఖుడు రావణుడు సంబరపడుట.)

తే. అటుల వైదేహి హ్రియమాణయగుచు దివిని । నాథు నెంచుచు నకట కానంగలేక
నెదుర నొక్కట గిరివరశృంగమందు । పంచవానరవరుల నా పణతి కాంచె॥ ౧

తే. పట్టు బంగరు జల్తారు పమిట ముక్క । పర్రున న్జింపి నగలదివ్యముల నందు
ముడిచి కోతులమధ్య యా మూటవైచె । నాథునకు వారు చెప్పుదురం చాస సీత॥

తే. కొంగు నటుజింపి భూషల కొన్ని నందు । మూటగట్టి మహీజ తా పుడమిపైన
హరివరులమధ్య వైచుట యెరుగ డయ్యె । రావణుం డప్పు డడరు సంభ్రమము లోన॥ ౩

తే. అనిమిషంబుల నేత్రాల నటుల బరపి । గిరిని పింగాక్షు లా హరివరులు నిలిచి
దివి విశాలాక్షి, దీన, రోదించుదాని। సీతఁజూచిరి హ్రియమాణ భీత నపుడు॥

తే. మేటి పంపాసరస్సును దాటిపోయి । లంక కభిముఖుఁడౌచు నా రావణుండు
రోదనమొనర్చు నా వరారోహ గొంచు। రై(యి రయ్యున జనె స్వపురంబుజాడ॥

తే. అంత వరదానమోహితుం డసురు డతడు । ప్రబలవీర్యుండు జూచి యవ్వారి నెదుట
పలికె వారల కీర్తి వారిదైన । బలము వీర్యము పొగడి రావణుడు ఖలుడు॥ 19
తే. త్వరగ నానాప్రహరణాల దాల్చి మీరు।పొందు వేగమె మున్నట్లు దండకోర్వి
ఖరనివాసంబుగానుండి కనగ నిప్డు । ఖర హతస్థానమౌ జనస్థానమునకు॥ 20
తే. మీర లిక భీతిఁబోఁద్రోలి దూరముగను।మహిత బలమును పౌరుషం బాశ్రయించి
శూన్యనిలయంబు నిహతరక్షోగణంబు।మనజనస్థానమున నుండు డెనయుశక్తి॥
తే. బలుల ఖరదూషణాదుల హతులఁజేసి । మన జనస్థానమందు నే నునిచినట్టి
బల మది మహత్తరం బెల్ల భండనమున । కూలె రాముని శరహతి క్రూరముగను॥
తే. త న్నిమిత్తంబు నాకు క్రోధంబు రేగు।మరియు ధైర్యంబుమించి యమర్షమునను
వైరము సుదారుణంబు మహత్తరంబు । గల్గురామునిపై నాకు గాఢముగను॥
తే. రాముపై రేగు పగను దీర్పంగ నెంతొ । మదిని కోరుదు; శత్రువు నిదురకూడ
శత్రుఁ జంపక నా కింక సంగరమున । తీరనట్టిది వైర మే తెరగు దీర్తు?॥ 24
తే. ఖరుని దూషణు జంపిన ఖలుని నౌర । ఇప్పుడే చంపి రాము నా హీనవరుని
హాయి గందును నామది యహరహంబు।ధనము వడసినయట్టి నిర్ధనుని మాడ్కి॥
తే. అట జనస్థానమందు మీ రట్టులుండి । రాము గనిపెట్టి యెప్పు డే మేమిపనుల
అతడొనర్చునొ తెల్పు డా యవ్వి నాకు । జరిగినవి యెల్లజరిగిన తెరగుగాగ॥
తే. అప్రమాదాన మీ రెల్ల రరుగవలయు । కాన తిరుగుడు నుండి జాగ్రత్తగాను
రాము వధియింప మీ రింక రాత్రిబవలు । యత్నముల్ సేయవలెనుండి యసుర వరులు॥ 27
తే. ఎన్నొ యుద్ధాల మీ బలం బెరుగుదేను । కాననే మిమ్ము నిటు జనస్థానమునకు
బంపుచున్నాను నాదగు పగనుదీర్ప । రాము వంచింప జంప నరణ్యమందు॥ 28
తే. అటు మహార్థంబు ప్రియము వాక్యంబు గొంచు । ప్రభున కభివాదమొనరించి లంకవీడి॥ 29
చేరి యంతర్హితులునౌచు చిటికెలోన।జనిరి యెనమండ్రు త జ్జనస్థానమునకు॥
తే. సీత హరియించి తాను నా సీత నింక । బొందినట్టులె సంతోషమొందె నసుర!
అధికవైరము రాముతో నకట గొంచు । ముదితు డయ్యెను మోహాన మూర్ఖ డతడు॥ 30

54 వ సర్గ సమాప్తి:– ( 1,779 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

### ఏబది ఆయిదవ సర్గ:- (37)

( సీతకు రావణుడు లంకాప్రాసాదమున తన మిద్దె మేడల వైభవము జూపుట - తనను వరింపుమని వేడుకొనుట. )

తే. రాక్షసుల ఘోరులను మహాప్రథితబలుల । బంపి యెనమండ్రి నటుల రావణుడు వనికి
తాను కృతకృత్యుడనె యంచు దలచె నెడద। బుద్ధివైక్లబ్యమున జేసి మూర్ఖుడతడు

తే. కామబాణసమర్పితకాయుడగుచు । నెడద వైదేహి నతడు చింతించుకొంచు
సీత జూచెడి వేడుక శీఘ్రగతిని । రమ్య మంతఃపురము జొచ్చె రావణుండు॥ 2

తే. అతడు తద్వేశ్మమును జొచ్చి యసుర విభుడు । చూచె నా రక్కసులమధ్య క్షోణిజాత
సీత శోకపరాయణ ఘాతుకుండు । రావణుండు దురాత్ముడా రాచనగర॥ 3

ఆ. అశ్రుపూర్ణముఖిని నతిదీన నతిశోక । భారపీడితాత్మ బహుళతీవ్ర
వాయువేగఘాతమై యర్ణవంబున । మునుగుచున్న నావపోల్కి దాని॥ 4

ఆ. మందదప్పి యడవిమధ్యను కుక్కల । దండుజిక్కు మృగివిధంబు దాని
మరి, యధోముఖముఖి నరసి యా సీతను। చేరె చెంత కపుడు క్రూరు డసుర॥

ఆ. శోకపరను దీన నా కరిణిం బౌర । అవశగొంచు నిజగృహంబ దెల్ల
బలిమిజూపె దేవభవనతుల్యం బద్ది । సీత కా దురాత్ముడాతతంబు॥ 6

సీ. ప్రాసాదహర్మ్యసంబాధంబు, స్త్రీసహ । స్రంబుల నిబిడంబు సంతతంబు
కమ్రనానాపక్షి గణముల జుష్టంబు । రమ్యనానారత్న రంజితంబు
దాంతక స్ఫాటిక తాపనీయాంచిత । రాజతవైడూర్య రత్నచిత్ర
దృష్టిమనోహర దివ్యవజ్రస్తంభ । సంభరితంబుగృహంబు జూపి

తే. దివ్య దుందుభి నిర్హ్రాద మవ్యయంబు । తప్తకాంచనతోరణ ద్వారచయము
బహుళ చిత్రంబు స్వర్ణ సోపాసమొక్కి । సీతబలిమిని పెట్టు చా పాతకుండు॥

తే. దాంతకంబులు మరి రాజతంబు లచట।వరలు ప్రియదర్శనములు గవాక్షములును
హేమజాలావృతంబు లెల్లెడల రొప్ప । వితత ప్రాసాద పంక్తు లవ్వీటిలోన।

తే. తత సుధామయ మణివిచిత్రంబు లౌర । భూమిభాగంబులెల్లెడ పొల్పుమీర
మైథిలికి జూపె రక్షోధినాథు డపుడు । తనదు భవనంబునందున దశముఖుండు।

తే. దీర్ఘికల, పుష్కరిణుల సుతీర్థములను । వివిధవృక్షసమన్విత పృథ్విగతలుల
చూపె రావణు డోలి రక్షోవిభుండు । సీత శోకపరాయణ భీత కతన। 12

తే. కృత్స్న నూ భవనోత్తమం బీ విధంబు । చూపి వైదేహి కవశ నా క్షోణిసుతకు
సీత నక్లైన లోభింప జేయ దలచి । పలికె పాపాత్మ డిట్లు రావణుడు ఖలుడు।

తే. పురిని పదికోట్లరాక్షసుల్ తిరుగుచుంద్రు । లలన! యిరువదికోటు లీ లంకగలరు
వారికెల్లర కో సీత! ప్రభుడ నేను । భీమకర్ములు వారెల్ల భామ, వినుమ। 14

తే. ప్రాయమున వృద్ధులను, నట్లె బాలకులను।విడిచి లెక్కింప నొక్కొక్క పీరున కిట
గలరు పరిచారకులు రాక్షసులు సుకేశి।నగర నొక్కొక్క వేయి జనంబు లబల॥

తే. రాజతంత్రంబు సర్వంబు రాజవదన । నీ యధీనంబు సుమ్మిక నీలవేణి
జీవితమె నేను నర్పణ సీత నీకు । ప్రాణములకంటె నధికురాలవుగ నాకు॥ 17

తే. స్త్రీసహస్రంబు లెందరో భాసురాంగి । కలరు భార్యలు నాకు, వారలకు నెల్ల
ఈశ్వరివిగమ్ము సీత! నీ వింతనుండి। భార్యవగుమింక, హే ప్రియా! భామ! నాకు॥

తే. తలపు లన్యంబులను నేమి కలుగు నీకు? । మంచి దంగీకరింపు నా మాట సీత
లలన నన్నేలుకొనుము నీ చలువబరపి । దేవి యభితప్తు నను ప్రసాదింపు మింక॥

తే. లంక శతయోజనంబు సంద్రంబుచేత । చుట్టబడియున్న దిది చూడు సుదతి సీత
ఇంద్రుగూడి సురాసురు లెల్ల మూగి । ఎత్తివచ్చియు లంక ధర్షింపలేరు॥ 19

తే. నాగులనుగాని, దేవబృందములగాని । పక్షులనుగాని, గంధర్వవరులగాని
నాదు వీర్యంబుతో సమానంబువాని । గాన నెందును లోకాల తన్మాపబాల!॥

తే. రాజ్యవిభ్రంశు, దీను, ప్రవ్రాజుతోడ । మరి గతాయుష్కుతోడ తాపసునితోడ
నీదు రామునితో నేమి నెలత నేను । వల్పతేజునితోడ నా మనుజుతోడ॥ 21

తే. ఇంక నన్నె భజింపు మో యువిద సీత! । సదృశభర్తను నీకు నే మదిరనయన
యౌవనం బస్థిరంబు, తన్వంగి వినుము । ఇంక రమియింపు ననుగూడి;
యింతిమిన్న॥ 22

తే. రాము దర్శింతువను నాశ రాజవదన । మదిదరికి నింక రానీకు మదిరనయన
లంక కీటవత్తు వనెడి తలంపుకూడ । సేయ నతనికి గలదె కించిత్తుశక్తి॥ 23

తే. వాయువు మహాజవంబున పాశములను । కట్టశక్యమె సీత! యాకాశమునను?
దీప్యమానంబు నగ్ని నెం దేనిగాని । చేతగొనరాని విమలమౌ శిఖముదాని॥ 24

తే. మూడులోకాలు వెదకి నే భువనములను । శోభనాంగినో! యింక నే జూడనబల
నిన్ను మద్బాహుపాలిత నిచట నుండి । విక్రమంబున గొనిపోవు వీరు నొకని॥

తే. లంక యీ సుమహద్రాజ్య మింక సీత!ఏలుకొను మీవు: నేను నన్ బోలువారు
దేవదానవ గంధర్వ బృందములును । ఈ చరాచరసృష్టి నీ కింక బంట్లు। 26

తే. లంక కెల్లను రాణివై లలన నీవు । లీల నభిషేకవారి సంక్లిన్నవగుచు
పరమ సంతుష్టి బొందిన స్వాంతమందు । రమణి! రమియింపు మిక నన్ను
ప్రమదలీల॥ 27

తే. కర్మ దుష్కృత మెపుడో లోకాలనీవు । చేసినది మాసె వనవాస శిక్షతోడ
ఇంక సుకృతంబు ధర్మం బ దేది కలదో।దాని సత్ఫల మిట బొందుమీ నెలంత॥

తే. ఇవియె మాల్యంబు, లివియె పూర్ణేందువదన । దివ్యగంధంబు లివియె నై దేహి
లలన
భూషణంబులు ముఖ్యముల్ పొలతి చూడు । నాతి! సేవింపు మివియెల్ల నన్ను
గూడి॥ 28

తే. "పుష్పకం"నామ మద్ది పూబోడి! కనుము । ఘన విమానంబు సూర్య సంకాశ
మబల
మున్ను నాయన్న దేను; నాభుజబలమున। గెల్చుకొని తెచ్చుకొంటి పంకేరుహాక్షి॥

తే. ఆ విమానంబు మిగుల విశాల మగును।మరియు రమణీయము నను త్తమంబు నగును
అందు నను గూడి సీత! యథాసుఖంబు । నీవు విహరింపు మింక, విసిలవేణి॥

తే. వదన మది నీది విమలంబు పద్మసమము । చారుదర్శన మాను విశాలనయన
చెలిరో! శోకార్తినిటు(బ్రి)కాశింపకుండె। ఘనవరారోహ! యో వరాననరో!లలన॥

తే. ఇట్టు లసురుండు ప్రేలుచునెసగు చుండ । ఆ వరానన ముఖము వస్త్రాంతమందు
గప్పి యిందునిభంబు;హా! కనులనుండి।యశ్రువుల రాల్చె సీత యనాథయటుల॥

తే. దీన, చింతాహతప్రభ, మానవతిని । ధ్యానమగ్నను వసవ్యస్థమైనదానిఁ
జూచి పాపుండు వాఁడు రక్షోవిభుండు । వదరె సిగ్గుల మరల రావణుడు ఖలుడు॥

తే. ఉడుగు లజ్జను వైదేహి యువిదమిన్న । ధర్మలోపభయంబు లే దతివమిన్న
ఆర్ష మిది దైవనిష్యందమగును నిజము । వనిత నీకిట్టి కలుగు సంబంధమింత॥

తే. నీదు పాదాల పైని సుస్నిగ్ధములను । మ త్శిరంబులు కొరయ నమస్కరింతు
మరి, ప్రసాదింపుమీగ నన్ కరుణజూపు। వశ్యుడను, దాసుడను, నీకు వనరుహాక్షి॥

తే. మన్మథాగ్నిశోకాగ్ని చే మ్రగ్గుచుంట । బింక ముడిగి వచింతు నీ విధముపల్క-
ఇంత వర కెన్న డొక లంకేశ్వరుండు। వీడు తలవంచి మ్రొక్క-డే చేడియకును॥

తే. సీత మైథిలి జనకభూజేతసుహిత । కా దశగ్రీవు డిటుపల్కి- మిాదు గనక
హా! కృతాంతవశుండు వా నగుట జేసి! సీత తనదే యటం చెంచె చిత్తమందు॥

55 వ సర్గ సమాప్తి :- ( 1,816 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

ఏబది ఆరవ సర్గ - (56)

సీత మరల రావణుని నిరాకరించి పలుకుట - సీతకు రావణుడు పండ్రెండు నెలలు గడువు పెట్టి అశోకవనమునకు పంపించుటకై, అచ్చట రాక్షసస్త్రీల పహారాలో పెట్టుట - సీతయచ్చట మూర్ఛ నొందుట

తే. అసుర వీరుపలుకు విని శోకయయగుచు సీత। శోకకర్శిత యై దేహి లోకమాత।
తృణము నంతరమందుంచి దేవి యపుడు। పలికె ప్రత్యుత్తరంబు రావణున కిటుల
తే. రాజు దశరథనాముండు ప్రభువరుండు। అచలుడౌ ధర్మసేతువు నా నతండు॥
సత్యసంధుండు మరి ప్రతిజ్ఞాత యగును। అతని పుత్రుండు శ్రీరాముడౌను వినర
తే. రామనాముండు పరమధర్మాత్మ సతతు। విశ్రుతుడు మూడులోకాలవీరబలుడు
మరి విశాలాక్షుడును దీర్ఘబాహుడౌను। దైవతము నాకు మత్పతిదేవు డతడె॥
తే. జగతి నిక్ష్వాకుకులమున జనన మందె। వినుతగుణుడు సింహస్కంధుడును సుకీర్తి।
మరి మహాద్యుతి సౌమిత్రి లక్ష్మణునిగూడి। వచ్చి తప్పక తీయు నీ ప్రాణములను॥
తే. అతని యెదుటను బలిమి న న్నపహరింప। నీవు చూచియెయుండిన నీవు నోరి
చచ్చి యీపాటికిల పడి చవిసియుందు! వల జనస్థానమున ఖరు పట్టులటనె। 5
తే. రాక్షసులు ఘోరరూపులు రాక్షబలులు। గలరటం చేమొ ప్రేలితే ఘనము గాను।
వారి విషయింప రాముపై పారనోరి। పాములవిషంబు గరుడుపై పారగలదె॥? 6
తే. అతని జ్యానిష్పేషముక్త శరాళు లింక। కాంచన విభూషణంబు లకాండ లీల॥
నీ శరీరంబు కోయుచూ నీచ, వినుర। గంగగట్టును తత్తరంగములమాడ్కి॥ 7

తే. వరుస నసురులనుండియు సురలనుండి। నీ వవధ్యత్వ మోరి పొందితివిగాక;
వైరము మహత్తంబు కల్పన మొనర్చి। బ్రతికిపోగలవెట్లు నా స్వామునుండి 8

తే. నీకు జీవితశేష మెం దేనియున్న। దాని కంతకుడౌను హా దాశరథియ।
పసువు యూపగతంబున కట్టులోరి। రావణుడ! దుర్లభంబు నీ జీవితంబు। 9

తే. రోషదీప్తంబు లక్షుల రూక్షముగను। రాముడేగన్గ జూచిన కాలి నిప్పు।
నిలువు నిర్దగ్ధుడవుగాచు నీచ! యిపుడె। పొందెదవురా పరాభవం బోరి యసుర!।

తే. చంద్రుని నభంబునుండి రాల్పంగలండు। నాశమైననుసేయు నా నాథుడోరి।
సాగరంబైన నింకింప శక్తిగలడు। సీత విడిపింపలేడె? నీ చేతినుండి। 11

తే. నీవు గతసత్వుడవు, గతేంద్రియుడవోరి। చెనటివి గతాయుడవు. గతశ్రీకుడవును
లంక వైధవ్యసంయుక్త యింక యగును। నీకృతంబున రావణా! నిజము చెబుదు।

తే. పాప కర్మంబు నీ కిది పాతకుండ। ఎరుగుమోరి సుఖోదర్క మెప్పుడు గాదు।
నన్ను పతిపార్శ్వమునునుండి కన్నుబ్రామి। తెచ్చి యెడబాటు గలిగించి త్రిప్పినావిని

తే. వినుము దైవతసంయుక్తుడనుపముండు। మరి, మహాద్యుతి నా భర్త యరిదమనుడు
వీర్యమే యాశ్రయించి నిర్భీతినతడు। శూన్యదండక నివసించు శూరవరుడు। 14

తే. దర్పము బలంబు వీర్యమదంబు నింక। దింపు నీమేనినుండి యుత్సేక మోరి।
నావిభుండు మహాగ్రరణంబునందు। బరపి శరవర్షమును రామధరణివిభుడు। 15

తే॥ కాలచోదితమగుచు భూతాళి యెప్పుడు। నోచుచుండు వినాశంబు ధ్రువముగోరి
కాలవశులౌచు నరులును కార్యములను। కడు ప్రమాదించుచుందురు పుడమి
నెందు॥ 16

తే॥ ఇటుల నన్నిపు మరి ప్రధర్షించుకతన। కాల మయ్యది దరియయ్యె చాల విను
నిపు నీరాక్షసులు నింక నిజము నీదు। పురము నంతఃపురంబును పుడమిఘూల॥17

తే॥ యజ్ఞమధ్యస్థము ద్విజాతిమంత్రపూత। మల్ల స్రుగ్భాండ మండితం బైనయట్టి
వేది మర్దింప చండాలు కీ ధరిత్రి। శక్యమెట్లగు చెప్పుర నిశాచరుండ। 18

తే. అట్లె నన్నును రాముని కనఘు మతికి। ధర్మ నిత్యున కతనికి ధర్మపత్ని
నైనదానిని స్పృశియింప దానవుండ। నీకు పాపికి శక్యమే నిజము గనుర। 19

తే. రాజహంసనుగూడి నిరంతరంబు। పద్మషండాన క్రీడించు పరమహంసి
చూడనైనను నెట్టుల చూచునోరి। మహిని తృణషండమందుండు మద్గుకముగ।

తే. ఈ శరీరంబు నిస్సంజ్ఞ మింక నాది। దీనికోయుము తినుము బంధించుకొనుము
వాంఛ లేదింక దీని గాపాడుకొనగ। జీవితము నేనిగోర రక్షించుకొనగ। 21

తే. పరుషము బిట్లు క్రోధానక్షోణిజాత। వచనమున్ బల్కె వైదేహి ప్రభుకుమారి
యంత రావణుతోడ దా సుంతమైన। పలుకకయ యూరకుండె మా పరమ
మాత। 22

తే. సీతవచనంబు పరుషంబు చెవులబడగ। గాత్రమది మండి నిడువెండ్రకయ నుబెట్ట
ఛీత్కొల్పెడి పలుకుల సీత కప్డు। రావణుం డిట్లు ప్రత్యుత్తరంబు పలికె। 23

తే. విను మహీజ! మదాజ్ఞ పండ్రెండు నెలలు। గడువు; నీ వంతలోన నన్ గలియవేని
పిదప నిన్నింతలింతలు నుదతి చెండి। ప్రాతరాశంబునాకిత్తు వంటవాండ్రు॥ 25

తే. వాక్యమిటుబల్కి శత్రు రావణుడు ఖలుడు। రావణుండింక కుపితుడై రగిలిమండి
రాక్షసస్త్రీల వంక దా రూక్షగతిని। చూచి యిటుబల్కె వారి కా నీచుడప్డు॥

తే. మాంసశోణితభోజనల్ మరియు మీరు। వికృతలై ఘోరదర్శన లింక నేచు
శీఘ్రమే కూడి రక్కసీ చేడె లెల్ల। గర్వమడగింపు డీపె దీ కఠిన కుచది। 27

తే. మాట యిది వినినంత నిశాటలెల్ల। వడి సుఘోరలు నోచు తత్ప్రభునకప్డె
కేలుమోడ్పు ఘటించి సలీలముగను। మైథిలికి చుట్టు మూగిరి మండలముగ। 28

తే. రాజు రావణు డంత ఘోరాకృతియయి। భూమి నూగించి పగిలించు పోల్కెగాగ
చరణములదన్ని మేదిని సరగ నపుడు। మరల యిటుబల్కె వారి కా సురవిరోధి

తే. యదె యశోకవనంబు మధ్యంబున కిక। మైథిలిని నీపె గొనిపోయి మగువలార
అచట నీపెను గూఢమైనట్టిరీతి। గాచియుండుడు చుట్టి మీ కాపులోన 30

తే. అచట నీపెను తర్జన భర్జనముల। సాంత్వనంబుల ఘోరంపు [illegible]గాగ
వశమునకు తెండు మీరెల్ల వనిత లోల్లా। గజవధువు వన్యమున్ వంచు కరణిగాగ

తే. ప్రభుడు రావణు డాజ్ఞ దా నటుల నిడగ। ఇంక రాకాసిముండ లా లెంకలెల్ల
సీతగొంచును నరిగిరి శీఘ్రమప్డె। ఆ యశోకవనంబున్న యట్టిజాడ। 32

తే. సర్వకాలఫలంబుల తన్మరుహముల। సర్వకాలమదంబులౌ పక్షితతుల
మరియు నానాసుమోత్కరవ్రాతములను। ఒప్పుచుండువనం బది గొప్పదార॥33

తే. సీత శోకపరీతాంగి క్షితితనూజ। జనకభూజానికూతురు జానకమ్మ
రాక్షసీవశయయ్యో హా రాముసయిత। ఆడపులులకు జిక్కిన లేడియట్లు॥ 34

తే. శోకము మహత్తరంబు తనఁ జుట్టుముట్ట౹ భీత మైథిలి జనకపృథ్వీశుబాల
సీత సుఖమింత గనదు హా! చిత్తమందు౹ పాశబద్ధంబు మృగియును భంగిగాఁగ॥

తే. మైథిలి యెడంద గనదు శర్మంబు సుంత. తర్జిత విరూపనేత్రల తద్దయూఁపె
డయిత దైవంబు పతి రాము దలచి తలచి౹ ముగ్ధ భయశోకపీడిత మూర్ఛచెందె॥

—: 56 వ సర్గ సమాప్తి :— (1,852)



తే. ఇంతయును జూడ రాక్షసులెల్ల గూడి। సీత జంపంగ నొక కుట్ర చిత్తములను
బన్ని రచియించు దోచు భ్రమంబునాకు। కాక యుండిన ఈ మాయకథ ఇదేమి!

తే. స్వస్తియగునా మహాద్యుతి వారి కకట। విజనమునను న్న సీత సౌమిత్రులకిక
త జ్జనస్థాన వధ నిమిత్తంబుగాగ। కడగి పగదెచ్చుకొంటి రాక్షసులతోడ॥ 9

తే. ఇవి నిమిత్తంబులిట్లు దోచు నెల్లయెడల। ఘోరములు లటంచు చింతించుకొనుచు నకట
మదిని రోషము దోచక మనుకులుండు। నడుచుచుండెను శీఘ్రమే యడుగులిడుచు

తే. అట్టుల మృగరూప మాయచే యసురు వలన। తాను గొంపోవబడుటయు తన వెనుకనె
నక్క కూయుటయును విని యక్కటులుడు। శంకితుండౌచు జనె జనస్థానమునకు

తే. దీనమానసుడగుచు తాను దీనలగుచు। చేరి రాముని కప్రదక్షిణముగాగ
తిరుగు చరచుచు ఘోరపక్షి సరణిగాగ। నడవి మృగపక్షులెల్లెడ నఱ్ఱు దోచె।

తే. ఆ మహాఘోర శకునముల్ రాముడరసి। త్వరితజవమున కుటికి దావచ్చుచుండె
ఆ వరారోహ సీత నా లక్ష్మణాఖ్య। తలచుకొంచును మదిలోన తల్లడిలుచు॥ 14

తే. అంత లక్ష్మణు నెదురుగా వచ్చువాని। గాంచె విగతప్రభుని రాము డంచితుండు
అట్టుల సౌమిత్రియు నదూర మందెతోచి। మరి సమీపించె నన్న నా వరగుణుండు॥ 15

తే. హా! విషణ్ణుండు సువిషణ్ణు డన్నతోడ। దుఃఖితుం డప్డు దుఃఖితుతోడ గలియ
విజనవనమున యసురసేవితమునందు। సీత నొంటిగ విడిచివచ్చిన దెరింగి। 16
తమ్ము గర్హించె రాముండు తల్లడిల్లి।

తే. లక్ష్మణుని సవ్యకరము మెల్లగ గ్రహించి। అన్న రాముండు పరుషంబునైన రీతి
ఆర్తిగను మధురోదర్కమైన సరణి। పలికె నిట్టుల నతనితో బహుళభంగి॥ 17

తే. విను మహా! గర్హ్యమోయి లక్ష్మణకుమార। నీవొనర్చినపనియిది నీ వదినెను
విడిచి వచ్చితి విటకు త ద్విజనవనిని। స్వస్తి యగునా ధరిత్రి హా మనకునింక॥

తే. సంశయములేదు సర్వథా జనక సుతను। రాక్షసుల్ వనచారులు భక్షణంబు
సలిపియుందురు, యెత్తుకచనియొ యుందు(రి)। అకట అశుభాలె కన్పట్టు అన్నినాకు

తే. లక్ష్మణా! సీత నిజముగా బ్రతికియుండి। క్షేమముగనుండి మిథిలరాజేంద్రపుత్రి
మనకు కన్నులకింక గన్పట్టగలద?। అంతభాగ్యమ హా! నరవ్యాఘ్ర చెప్పుమ॥

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### —: ఏబదియెనిమిదవ సర్గ :— (20)

("ఏది సీత, ఏ సీత" యని వెంబడి రాముడు లక్ష్మణుని ప్రశ్నించుట)

తే. దీను, లక్ష్మణుఁ, జింత వైదేహి లేక। యొంటిమై వచ్చువాని నా యుగ్రవనిని
ప్రభుఁడు దశరథసుతుఁడు ధర్మాత్ముఁ డరసి। తమ్ముఁ బ్రశ్నించె రాముండు తత్క్షణంబ॥

తే. ఏది లక్ష్మణ! వైదేహి యేది సీత। దండకారణ్యమునకు హా తరలివచ్చె
అబల నాతోడ; యయ్యొ, నా యవనిసుతను। విడిచివచ్చుచునుంటివా యడవి
నొంటి॥ 2

తే. రాజ్యవిభ్రష్టు, దీను, నరణ్యమందు। దండకను నిట్లు తిరుగాడుచుండు నన్ను
గూడి సమదుఃఖభాగియౌ క్షోణిజాత! భీత వైదేహి తనుమధ్య సీత యేది॥ 3

తే. ఎవతె లేకున్న నేను జీవింపలేనొ। తమ్ముఁడా! ధాత్రి మఱి ముహూర్తంబయేని
సురసుతోపమ యేది యా ధరణిజాత। ఏది నా ప్రాణదయిత నా సీత యేది॥

తే. అమరతతికైన దివి పతిత్వంబుగాని। అఖిల పృథ్వీతలాధిపత్యంబుగాని
కోర నా తపసి యా క్షోణిజాత। జనకసుత చింత లేకుండ సౌమ్య చెబుదు॥ 5

తే. అబల హా! సీత బ్రతికుండునా వనోర్వి! ప్రాణములకంటె ప్రియతర రాణి నాకు
వసుధ నేగొన్న యీ వనవాస దీక్ష। మిథ్యకాకుండయుండునా మిత్ర! చెప్పుమ॥

తే. నేను సీతానిమిత్తమై మృతిని గనగ। లక్ష్మణా! నీవు మరలి పురంబు జనగ
కైక సుఖిత సకామయుగాకయున్నె?। ఇంత కిటువచ్చెనా కర్మమియ్యదయ్యొ॥

తే. అట్టుల సపుత్రరాజ్య సిద్ధార్థయగుచు। కైక వెలయంగ కౌసల్య కరములొగ్గి
హా తపస్విని మృతపుత్రమాతయాపె। సవతి కూడిమింకను సలుపునొకొ॥

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్య కాండము

### ఏబదితొమ్మిదవ సర్గ:— (27)

(లక్ష్మణుడు జరిగిన సంగతిఁజెప్పుట - ఈసంభాషణతో రాముడు తృప్తిపడక, వత్సా! సీతఁ జేరనది తపోవనియు, నీవు నాఆజ్ఞమీరితివని రాముడు వేదనతో ననుట:-

తే. ఆశ్రమముఁ వీడివచ్చిన యనుజు నతని। గనుచు దుఃఖార్దితుని లక్ష్మణుని వనోర్వి॥
ప్రభుడు రఘునందనుండు శ్రీరాముఁ డప్పుడు। బాట నడచుచు మరల దా బ్రశ్న
జేసె॥ 1

తే. ఏమికారణమున నీవు భూమిసుతను। మైథిలిని వీడి వచ్చితి వీ విధంబు
*నేను నీపైన నెంతయో నమ్మకమున। విడిచిపోయితిగాదె యావెను, కుమార। 2

తే. మైథిలిని వీడి యెదురుగా వచ్చునిన్ను। చూచినంతనె లక్ష్మణా శోకముబికె
ముప్పు శంకించు నామది కప్పుడౌర। వ్యథ మహత్తర మొదవె సత్యంబు వీర? 3

తే. అదరె నయనంబు సవ్యంబు, వదరె భుజము। హృదయమును నాది లక్ష్మణా
చెదరె నయ్యొ,
దూరమందున సీత సీతోడ లేక। నీ వొకండవె వచ్చుట నేను గనగ!॥ 4

ఆ. అన్న యిటుల బల్క అధిక దుఃఖార్తుండు। లక్ష్మణుండు భద్రలక్షణుండు।
రామచంద్రుతోడ ప్రబలదుఃఖితుతోడ। పలికెనిట్టు లతడు భవ్యగుణుడు॥ 5

తే. వదలిరాలేదు బుద్ధిపూర్వకము నేను। దేవి నా పెను వనమునం దీ విధంబు॥
ఉగ్రయై యాపె యే న న్నహో మహాత్మ!। పొమ్ము పొమ్మన్న వచ్చితి మిమ్ము
గనగ॥ 6

* పాఠాంతరము:— నేను నీపైని కున్న నమ్మకమున నట్టు

తే. ఆమె వైదేహి యిటుల నన్నంట నలుకఁ । బలుల పరుషమాగ్రహ్మ పటులుడనయి
పరగ సంరబ్ధరక్తలోచనుడనగుచు । వచ్చివేసితి యాశ్రమం బచ్చటె విడి। 20

తే. ఇటుల జెప్పెడి తమ్ముని వీక్షించియప్పుడు । అన్న సంతాపమోహితుడగుచు నకట
"చెడ్డతప్పోయి నీవొచ్చినది వత్స! । వదినగారిరాక నీ వొంటి వచ్చు"టనియె॥

తే. ఎరిగియుండియు నాప్రజ్ఞ యెల్ల నీవు । రాక్షసులజంప నా సమర్థతయు నెరిగి
ఆమె పలికిన క్రోధవాక్యాల కళలి । వచ్చివేసితి విటకు నీ వదినె వదలి॥ 22

తే. సీత నట్టుల వదలివచ్చిన విధంబు । దలప నీయెడ తృప్తి నా కొలయ దోయి
కుపిత యాడుది కటువుపలుకులను నేమొ । పలుక నీవట్లు చట్టున వచ్చివేతె?॥

తే. సర్వథా తప్పు పో నీవు సల్పిన దిది । ఆడుదాడినమాటల నట్టె పట్టి
క్రోధమున నీవు వశుడవై త్రోవఁదప్పి । మీరితివి నాదునాజ్ఞ సౌమిత్రి! వత్స!॥

తే. చూడు రాక్షసు డాతడు నీడె సుమ్మి । చచ్చి నాచేత నేలపై నరగ నొరగె
వీడె మృగరూపమాయచే వీరు నన్ను । తోడుకొని యె కుటినుండి దూరముగను॥

తే. వంచిచాపంబు, సంధించి పటుశరంబు । వేయగ సలీల మాబాణ మీ నిశాట
దాక మృగతనువును వీడి తద్ద యార్చి।సరగ కేయూరధరుడు రాక్షసుడు నయ్యె॥

తే. శరహతుం డప్పు డార్త నిస్స్వనము సెలగ । రవము మామక మూని దూరంబు వినగ
మరి సుదారుణ మా వాక్కు బలికె వాడు । అదియె విని నీవు వచ్చితి వబల విడిచి॥ 27

59 వ సర్గ సమాప్తి:- ( 1,923 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్య కాండము

### అఱువదియవ సర్గః — (౬0)

(ఆశ్రమమునందు సీత కన్పించకపోవుటచే, రాముడు పాకలి, శోకవేగాన ఉన్మత్తుడో భ్రాంతుడో యనగ, చెట్టు చెట్టున, పుట్ట పుట్టను అడిగి విలపించుట :—)

తే. అతుల వచ్చుచుండు రామావనీశు । వామనేత్ర మధోభాగ మదరె మిగుల
నడకలో తొట్రుపాటును పొడమె నపుడు।కంపమును గల్గె నక్కటా గాత్రమందు॥

తే. మాటిమాటికి నశుభాల మరియు గనుచు । "అయ్యొ ! సీతకు నిక క్షేమమా" యటంచు
నార్తి బల్కుచు నోట నా యవనివిభుడు।వచ్చుచుండెను నాశ్రమవాటమునకు॥

తే. క్షోణిజను జూడ నంత లాగ్చుచును నటుల।నరిగి సంత్వరమానుడై యచట గాంచె
శూన్య మావసథంబు వచ్చి విభుండు । అయ్యొ యుద్విగ్న మానసుండయ్యె మరియు॥ 3

తే. శోకవేగాన నెగిరెన పోవ్వపోవ । కాళ్ళుచేతుల విదిలించి తానువిభుండు
అచ్చటచ్చట నుటజంబు నన్ని యెడల । చూచె సీతమ్మ యుండెడు చోట్లనెల్ల॥

తే. చూచె సీతావిరహిత మా చోట్లనెల్ల; । పర్ణశాలనునెందు నా పణతిలేమి
శ్రీవిహీనంబుగా దోచె క్షితి యదెల్ల।బహుళ హిమహత నళినియన్ భంగిగాగ॥

తే. రోదనము సల్పుచటులున్న ద్రుమచయముల।మ్లానపుష్పమృగద్విజవ్రాతములను
శ్రీవిహీనంబు, విధ్వస్తమా విధంబు । తలప సంత్యక్త వనదేవతాచయంబు॥ 6

తే. విప్రకీర్ణాజినకుశంబు; విప్రవిద్ధ । బహుబృశీకట మకట! తత్ప్రభుడు గాంచి
అట నిజస్థానమయ్యె శూన్యంబు జూచి।మిగుల విలపించెరాముండు పొగిలిపొగిలి॥

తే. హృతయొ, మృతయొ, వినష్టయొ, లేకయకట । భక్షితయొ భీరు నా సీత, వనిని నెందొ
దాగియున్నదొ; వనముమధ్యంబు జూడఁబోయియున్నదొ తమ్ముఁడా! భూమిపుత్రి।

తే. పూలుకోయంగ నాసతి పోయెనేమొ । పండ్లగొనితేర పోయెనో వనముజాడ
ఇంక తామరకొలనుకే యేగెనేమొ । జలముగొనితేర నదికి దా జనియె నేమొ।

తే. యత్నమున నెంత వెదకిన నచట నెందు । కానబడకుంట ప్రియురాలు కనుఁగవకు
శోకరక్తేక్షణుండౌచు శోకవశత । భ్రాంతు డున్మత్తు డన దోచె రాముఁ డప్పుడు।

తే. చెట్టుచెట్టుకు పరుగులు పెట్టిపెట్టి । గుట్టగుట్టకు వడివడి మెట్టిమెట్టి
నదినదికినేగి ఏడ్చియు నకల యేడ్చి । భూరిశోకార్ణవంబున మునిగె విభుఁడు। 11

తే. ప్రియ కదంబప్రియ నొకర్తు విపినమందు। చూచినావె కదంబమా! క్షోణిజంబ!
క్షోణిజాతను సీత నా శుభవదనను । తెలిసియుండినచెప్పుమ యెం దేని నాకు।

తే. స్నిగ్ధపల్లవసంకాశ నీలవేణి । పీతకౌశేయవాసిని సీత యూపె
బిల్వ! బిల్వోపమస్తనిన్ పక్షిరాజ । చూచియుండినచెప్పుమ, యెచ్చోటగలదొ।

తే. అటుల కాదేని యర్జునా! యవనిజంబ! । అర్జునప్రియ నాప్రియ యవనిజాత
జనకసుత భీరు సీత యీ జగతినింక। ఉన్నదా లేద చెప్పుమ హా! యుసురు దాల్చి।

తే. కకుభ మియ్యది కకుభోరు కమలపాణి । సీత నెరుగును తప్పక పృథ్వీసుతను
ఈ వనస్పతి వెల్గు నెంతేని కాంతి । అరుణపల్లవ పుష్పాఢ్యమై వనోర్వి॥ 15

తే. ద్రుమవరం బిద్ది తుమ్మెద మోగ్రిత లొప్పు। కాన తప్పక నెరుగు నా కాంతనిదియు
దేవి తిలకప్రియ నెరుంగు తిలకతరువు। చెప్పుమో వృక్షరాజమా! సీతయేది।

తే. ఓ యశోకమ! శోకాపనుదమ! ద్రుమమ!। ఉగ్రశోకోపహతహృదయుండ నన్ను
కరుణ నీపేరుగలవానిగా నొనర్పు । వేగ నాప్రియురాలి జూపించి నాకు॥ 17

తే. పక్వతాలఫలస్తనిన్ వనిని నిచట । తాలమా! చూచితేని నా దయితనింక
చెప్పుమా యా వరారోహ సీతజాడ । కరుణగలదేని నాపైని తరువరంబ॥ 18

తే. చెప్పుమ జంబూద్రుమంబ! నాసీత నిచట।సుకుచ జంబూఫలోపమఁ జూచినావె
ప్రియను నాపెను నెరుగుదువేని నీవు । చెప్పు నిశ్శంకముగ నాకు క్షితిరుహంబ।

తే. నీ వహో! కర్ణికారంబ! నింపుశోభ । వెల్గుచున్నావు పువ్వులవిరయబూసి
కర్ణికారప్రియ సుసాధ్వి కనులనీకు । పడియెనే చెప్పు నాప్రియ పణతి సీత॥ 20

తే. [illegible], [illegible], మహాసాలశోభిజముల । పనస, కురవక, దాడి, మాశ్వద్ధతరుల
[illegible] [illegible]. నా మహాయకుడు ప్రభుడు । వేడుకొంచును రాముండు వివిధ
గతుల॥ 21

తే. [illegible] జముల । కేతకీచంపకోద్దాల క్షితిరుహముల
[illegible] [illegible] [illegible] దిరి [illegible] భ్రాంతు డున్మత్తుడనగ నా ప్రాంతమెల్ల॥

తే! [illegible] [illegible] నెరుగకున్న।మృగమ!మృగశాబకాక్షి ని యెరుగుదీవు
మృగవిలోలాక్షి కాంత దా చేరియుండు । వనిని ధ్రువము మృగీకదంబములలోన॥

తే. [illegible]జమ! తన్నిజనాథు కాంత నీవు । చూచితో యుందువంచును దోచునాకు
[illegible]! [illegible] కిది విదితమేయైన యెడల । వాస్తవము జెప్పు మిక వరవారణంబ!॥

తే. [illegible] [illegible] నాప్రియ యువిద నీకు । గానిపించెన చంద్రసమానవదన!
చెప్పు విస్రబ్ధయుగనాకు చెవికిచెంత । చేయ నిన్నేమి భయపడకోయి వ్యాఘ్రమ!॥

తే. [illegible] [illegible] దిటు దూర మింముపడన।కనబడితి వీవు హేప్రియా! కమలనయన!
చెట్లచాటును చేసికొం చేల నీవు । పలుకకున్నావు నాతోడ లలన సీత॥ 26

తే. నిలు! నిలు! మహా! వరారోహా! నిలవేణి!। లేదు కించిత్తు కరుణ నామీద నీకు
హాస్యశీలవు నీ వంత గాదుగాదె । ఏల యాడించె దిటు లుపేక్షించి నన్ను॥ 27

తే. సీత! వరవర్ణినీ! నీవు చెట్లచాటు । పరుగువెట్టుచునున్నను గురుతుగంటి
పీతకౌశేయవస్త్రంబుచేత నిన్ను । నిలుము, సౌహృద మది నీకు గలద యేని॥ 28

తే. చారుహాసిని సీత హా జగతిలేదు । చంపియుందురు రాక్షసుల్ సత్యమయ్యొ
అటులగాకున్న దుఃఖసంప్రాప్తునన్ను । హా! యుపేక్షించియుండునా యాపె
యిటుల॥ 29

తే. రాక్షసుల్ పిశితాశనుల్ బాలబట్టి । చంపి భక్షించియుందురు సత్యమింత
ప్రియను మద్విరహిత నయ్యొ భీరుబట్టి । చీల్చి వివిధాంగములను భక్షించి
యుందురు॥ 30

తే. కమ్రదంతోష్టము, సునాసికంబు మరియు । చారుకుండలమును పూర్ణచంద్ర
సమము
ముఖము నిష్ప్రభతన్ జెందు ముగ్ధమకట। గ్రస్తమౌ పూర్ణ చంద్రుని కరణిగాగ॥

తే. కంఠము చంపక వర్ణాభశోభితంబు। కోమలంబౌర గ్రైవేయగుణరణితము
కాంత విలపించు నా పతి కంఠమయ్యో।నులిమి భక్షించియుందురా పొలసుదిండ్రు॥

తే. లలిత పల్లవ కోమలంబుల ఘుృవంబు। చాన బాహుల విక్షిప్యమాణములను
వేపమానాగ్రముల కటా విరిచితెనిదె . యుంగరు రంగారు కంకణసుందరముల

తే. రాక్షసుల భక్షణంబుకే రమణి నట్లు। విడిచి నే చన్నయట్టిదా విధమయయ్యె
అతివిసార్థపరిత్యక్త యట్లు సీత! భక్షితంబయ్యె బహుబాంధవయు వనోర్వి। 34

తే. హా! మహాబాహు లక్ష్మణా! యబల ప్రియను . చూచు చుంటివె యెందేని క్షోణి నిచట
హా ప్రియా! పోతి వెందు భద్రాంగియంచు। వగచు హా సీతయని మాటిమాటి కతడు॥ 35

తే. అనుచు నీరీతి విలపించి మనుకులుండు వనము వనమున కరిగె తా పరువులెత్తి
ఒకట వేగాన నుద్భ్రాంతు [illegible] ఒకట బలమున విభ్రాంతు డూరకగును॥ 36

తే. తన్వి వెదకెడు తత్పరత్వంబుకతన। నదుల వనముల గిరులయేళ్ళ నగచయముల
కాలు నిలువక తిరుగు చా కానలెల్ల।రాముడున్మత్తుడనతోచె నే మనందు॥ 37

తే. విపులము మహావనంబు దా వెలది వెనుక। తిరిగి తిరిగియు నెందును దేవిగనక
ఆశదీరక ప్రియకోర కడవి మరల। మరల వెదుకంగ శ్రమమూనె పరమమతడు॥

—: 60 వ సర్గ సమాప్తి :— (1,961)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మాసికొండ రామాయణము

## అరణ్య కాండము

:— అఱువదియొకటవ సర్గ

(విలపించు రాముని లక్ష్మణుడు ఊరడిలఁబల్కుట:-

తే. చూచి యాశ్రమపదమును శూన్యమచట। రహిత మా పర్ణశాల నరణ్యమందుఁ
గందు విక్షిప్తనానాసనబృందమరసి। రామచంద్రుండు తద్దశరథసుతుండు। 1

తే. కమనిసైదేహిఁ గాన కాశ్రమమునందు। దిశల సర్వత్ర పరికించి దేవి గనక
అరచి భుజముల రుచిరంబు లమముకొనుచు। పలికెనిట్టుల రాముండు భ్రాంతితోడ

తే. ఏది లక్ష్మణ వైదేహి యెందుపోయె। ఆశ్రమము వీడి చనియె నే యడవిదారి
అపహరించెన యెవడేని యబలనహ్యో। ప్రియను భక్షించెనా యెవ్వఁడేని యసుర

తే. "చెట్లచాటున నీ వుసా చేసికొంచు। నన్ను పరిహాసమొనరింప నెన్నదేని
చాలు పరిహాస మింతతో బాలసీత। రమ్ము, యేడ్పింప కిక నన్ను రాజముఖిరో।

తే. లలన! నీ మృగపోతకంబులు వనోర్వి। క్రీడలాడును నీతోడ వెడిభీతి
అవ్వి నీవిప్డు లేకున్కి యార్తిగూరి। అశ్రువులు రాల్చుచున్నవి వచ్చిచూడు। 5

తే. సీత లేకుండ జీవింప క్షితిని క్షణము। అధికశోకాన సీతాపహరణజాన
మృతుని నను జూచు ధ్రువము నా పితరు డకట। అల్ల పరలోకమందు మహా
ప్రభుండు॥ 6

తే. నాదు నాజ్ఞను నటు ప్రతిజ్ఞనొనర్చి। సమయకాలంబు పరిపూర్తి సలుపకుండ
మత్సకాశంబునకు నేల వచ్చితంచు। నన్ను నిందించు నా తండ్రి నాకమందు॥

తే. కామవృత్తుండ నీ వింక కాలిపోను। మరి యనార్యుడవును మృషావాదివంచు
నన్ను పరలోకమున తండ్రియొనర్చు గతుల। కట్ట! చీవాట్లుపెట్టునుగా ప్రభుండు॥

తే. శోకసంతప్తు డవగు భర్తృకష్టదయను । కరుణ, నన్నుజూచి క్షిప్రయ శ్రేరణేగాక
నన్ను విడనాడి నీవు నెం దరిగితీవు । ఓ సుమధ్యమ! యోగాయోహా! సీత! 9

తే. నటను విడువకు మైథిలీ! ఉలుక వన్ను । నీవు లేకున్న ప్రాణాల నిజము విడుతు
ననుచు విలపించి రాము డెంతయును వెదకి । సీతగానంగ, నంగలార్చియును
[illegible] 10

తే. విపుల పంకంబునకు బడి చిక్కుపడ మహిబ । కూరుకొనిపోవు చందాన కూర్మిసతిని
గనక దుఃఖాకులబడిన రాఘవుని జూచి పలికె సౌమిత్రి హితకామ్యమతిని నిల్చి।

తే. వలదు శోక విషాదంబు ప్రభువరుండ । చేయుయత్నము ననుగూడి సీత వెదుక;
ఈ వనంబు మహాబాహూ! యింపునింపు । ఇందె పతియుండు [illegible]కందరములు।

తే. సతికి కాననసంచార మతిప్రియంబు । మరి వనోన్మత్త మైథిలి యరిగియుండు
వనములోనికి నెచటికో వదిన సీత । మరి సుపుష్పిత నళినికో ఫలసరోజాత। 15

తే. మీనవంజుళ సేవితమైన యట్టి । ఏ నదికో దేవి చనియుండు స్నానమాడ
నవ్వులాటకుగా కాననంబులోన । నెచటనో దాగియుండు మహీతనూజ॥ 16

తే, నిన్ను నన్నును భయపెట్ట నెన్ని మదిని । మనదు సామర్థ్యమును జూడ మరి
తలంచి
దాగియుండును వనిని నెందైన సీత । యత్నమొనరింత మాపె కోయంగనిపుడె।

తే. చిత్తమున దేవ! నీవు నిచ్ఛింతువేని । సీత జనకాత్మజకుగాన క్షితి యిదెల్ల
వనము సర్వము వెదకుద మనఘ యిప్పుడె । శోక మది నీవు దరికి రానీకు మన్న।

తే. అనుచు సౌహార్దమున తమ్ము డనగ వినుచు । మది సమాహితుడౌచు నా మను
కులుండు
సీత వెదకంగ వేగ నా భ్రాతగూడి।సలిపె నారంభ మా రామచంద్రుడపుడు।

తే. గిరులు వనములు కొలకులు ఝరులు నదులు । నిఖిల మా సీతకొరకయి నృపతి
సుతులు
దశరథాత్మజు లోలి యిద్దరును గూడి । వెదుక జొచ్చిరి మరిమరి విసువులేక॥ 20

తే. ప్రస్రవణ పర్వతము శిఖరంబులెల్ల । గుహల సానువులనునెల్ల కొండ నెల్ల
వెదకి వెదకియు జనకపృథ్వీశసుతను । గాన రైరెండు వారహో. భానుకులులు।

తే. వెదకి సర్వంబు శైలంబు విసువు జెంది । లక్ష్మణా! మంగళాంగి నారమణి సీత
అయ్యొ కనిపించలేదోయి యద్రి నిచట । ఏమి సేతంచు విలపించె రామవిభుడు॥

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అరువది రెండవ సర్గః— (21)

* (రతి దశావివశుడై రాముడు మరి విలపించుట :— )

తే. సీతఁగానక రామభూనేత యప్పుడు। చండకామోపహతచేతనుండు నగుచు
మరి, విలాపంబుఁజేసె ధర్మాత్ముఁడడలి। పద్మనేత్రుండు పటు మహాబాహుశాలి॥

తే. సీతఁజూడకయున్నఁ జూచినవిధంబె। తలచి మదనార్దితుండు తన్మనుకులుండు
మరి, విలాపంబునన్ నోట మాటరామి। పలుకఁజొచ్చెను నెట్టులో పణతిగురించి॥

తే. నీవుపుష్పప్రియతచేత నెలత సీత। హే! ప్రియా! యీ యశోకమహీజశాఖ
లివియె నీ మేనఁగప్పుకొందిటుల నాకు! మదినిశోకవివర్ధనంబగు విధంబు॥ 3

తే. కదళికాకాండసదృశముల్ కాంత నీవి।ఊరువుల్ రెండు; కదళుల నొదిగియున్న
గనబడుచునున్నవవె దేవి! కనులనాకు; । వాని దాచుకొనంగ నీ వశమె తరుణి॥

తే. కర్ణికారవనంబు భద్రాంగినీవు। దేవి! నవ్వుచు క్రీడగా దిరుగుచుంటి
వకట! చాలును పరిహాస మిక సుకేశి!। బాధకలిగించు నా కిది భామ! రమ్ము॥

తే. అయ్యో! పరిహాసమేమి యీ యదనునందు।కడుపరిశ్రాంతునకు నాకు కమలపాణి
హా! ప్రియా! సీత! యీ పరిహాసమిపుడు। లెస్స రుచియింపకున్నది లేమ! రమ్ము॥

తే. మరి, విశేషించి యాశ్రమంబందు మనకు।తరుణి! పరిహాస మిది ప్రశస్తంబుగాదు
ప్రియురా! నీపరిహాస సుప్రియత తెలిసె। రమ్ము! నీ కుటి పాడరె; లక్ష్మి! రమ్ము॥

---

* (1) దృక్, (4) మనస్సంగ, (2, సంకల్ప, (4, జాగరః, (5) కృశతా, (6) రతిః, (7) హ్రీత్యాగః
(8) ఉన్మాద, (9) మూర్ఛా, (10) అంతా.

అనంగదశా దశ

తే. హా లతాంగి! భక్షితయో, సీత జగతి లేదు; చేసి రింతయు నసురులు చెప్ప దుర్ధ్రవము
కాక యుండిన విలపించు శోకమున నన్ను। చేరకయ యుండునా సీత చెప్పుమ వత్స!!
తే. ఇక నిదాన మ్మా శ్యామార్ధంబు లిట్టుల జూడు। సాస్ర నేత్రాల వచియించుసరణిదోచు
దేవి వైదేహి నసురులు దినిచి చంపి। అకట భక్షించిరంచు; నేమందునింక!! 9
తే. హా! మహాత్మా! నకోర్వి మెందరిగితివు। సాధ్వి! హా వరవర్ణిని! జగతి లేవ?
హా! నరాను యశస్విగా దె యుంటి నైక। దేవి! ఇట్లు ననువీడి దివికేఁజనుట!! 10
తే. సీతతో గూడ నెచటి నే తిరిగినాకు। సీతలేకుండ యిప్పు డే గేహిమరల
శూన్యమంతఃపురంబు నే జొచ్చునాడ। తమ్ముడా లక్ష్మణా చెప్పు ధర్మవేది!!
తే. శక్తి నిర్వీర్యుడంచు నిర్దయుడనంచు। లోకులందరు నన్నంద్రు మూకగూడి
కాతరత్వంబునాది ప్రకాశమగును। సీత గోల్పోయి యింటికి చేరుకతన!! 12
తే. నేను వనవాసము ముగించి నెమ్మదిగను। పురికి జేరంగ మిథిలాధిపుండు మామ
కుశలమడుగంగ వచ్చిన కుమిలి నేను। ఏ మొగంబున నతని వీక్షింతు నయ్యొ!
తే. సీతలేకుండ యింటికి చేరినట్టి। నన్ను వీక్షించి జనకభూనాయకుండు
హా! సుతాస్నేహమునను సంతప్తుడౌచు। మోహావశతను నప్పుడే మూర్ఛజెందు!!
తే. భరతపాలితమునకు తత్పురమున కిక। అసలె పోకుందునా, చెప్పు మయ్య వత్స!
స్వర్గమేనియు సీత నా ప్రాణదయిత। లేకయుండిన శూన్యమే నాకు సుమ్ము!! 15
తే. అన్న! నన్నింక యీ వనంబందె విడిచి। పొమ్ము శుభద మయోధ్యాపురమ్ము నీవు
నేనొ నాసీతలేకుండ నిమిషమేని। యెట్లొ జీవింపలేనుగా యింత కిలను!! 16
తే. గాఢముగ కౌగలించి, నిరూఢి భరతు। పల్కు మిట్టుల నాదగు పల్కుగాగ
"ఈ వసుంధర పాలింపు మీ వటంచు। రాము డాజ్ఞాపనముజేసె భ్రాతయంచు!!
తే. తల్లులకు కైక కా సుమిత్రకును నింక। అంబ కౌసల్యకును యథాన్యాయముగను
భక్తి నాయాజ్ఞ నభివాదమాచరింపు; । అడిగితనిచెప్పు మెల్లర నచట నీవు!!
తే. ఇంక నాతల్లి కౌసల్య నెలమి నీవె। రక్షణమొనర్పవలయు ప్రియత్నమునను
చెప్పిన విధంబు భక్తిమై చేయు నీకె। పెట్టుచున్నాడ బాధ్యత పెద్ద దీని!!
తే. సీత వని నిట్టు లక్కటా మృతిని గనుట। నేను నట్టులె నాసతితోనె జనుట
విస్తరించి నివేదింపు వీరవర్య। తల్లులకునెల్ల తమ్ముడా తప్ప కీవు!! 20
తే. ఆ సుకేశిని గాన కా యడవి నట్లు। హా! సుదీనుడు రాఘవు డదలి యేడ్వ
భయవికలమైన ముఖమున వ్యథితమతిని। లక్ష్మణుండును కడు నాతురతఁగలంగె!!

* పాఠాంతరం:— కాంతు.

62 వ సర్గ సమాప్తి:— ( 2,014 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అఱువదిమూడవ సర్గః— (20)

(శోకవశుడైన రాముని ఆవేదన:-)

ద్వి. ఆ రాజపుత్రుండు నా ప్రియఁ బాసి। కామంబు శోకంబు కడుఁ బీడనొంప
ఆర్తరూపుండౌచు నా రామవిభుడు। తమ్ములక్ష్మణు విషాదమ్మున ముంచి
తీవ్రవిషాదాన దిగియె దా మరల॥ 1

శోకాన విపులాన జొచ్చి రాముండు। వేడినిట్టూర్పుల వేయుచు బుచ్చి
శోకవశాత్ముఁ డా సోదరుఁ జూచి। వ్యసనానురూప మిట్లనె సశోకంబు॥ 2

నావంటి దుష్కృతుం డీ వసుంధరను। లేఁడు పో రెండవవాఁ డంచు దలతు
శోకాలపై కటా శోకంబు లిట్లు। వెంతరల్ నామీఁద దొర్లె హా! వచ్చు
హృదయంబు మనసును భేదించి వైచు॥ 3

మున్నెన్నొ పాపాల మురిసి చేసితిని। అవియెల్ల ధ్రువ మిప్డు తవిలె నావెంట
దుఃఖాలపై కటా దుఃఖముల్ నాకు। గలుగుట తద్విపాకంబె పో! వత్స! 4

రాజ్యవినాశంబు ప్రజల వేర్పాటు। జననీవియోగంబు జనకు నాశంబు
సర్వంబు చింతింప సౌమిత్రి! నాకు। శోకవేగము తాకి పీక ముంచెడిని॥ 5

సర్వమా దుఃఖంబు శాంతించె మేన। శూన్య మీ వనము నే జొచ్చిన తోన;
సీతావియోగాన చిచ్చిది మరల। కాష్ఠాన నగ్నియన్ కరణి హా రేగె॥ 6

నిశ్చయం బింక నా హృదయంపురాణి। భీరు బలాత్కృతిన్ మింట రాక్షసుడు
కొనిపోవ భయమున క్రోశించియుండు। సస్వరంబుగ నపస్వరముగ నయ్యో॥ 7

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అ ష స ప్త నా ల్గ ప సర్గః— ( 75 )

( అరణ్యమున వెదకుచుబోవు రామలక్ష్మణులకు నేలపై పూలజాలు, అమ్ముగుల జాడలు, విరిగిన విల్లు, ఛత్రము, చామరములు, రథము, చచ్చిన గాడిదెలు, చచ్చిన సారథి మున్నగు చిహ్నములు కన్పింపగా- దేవతలు తనకు సీతను దెచ్చి సమర్పింపనిచో, తాను సర్వజగత్సంహారము జేయుదునని రాముడు విల్లు సజ్యంబు జేయుట :—)

తే. దీనుడై దీనవచనాల నా నృపుండు । తమ్ముడా! శీఘ్రము మరిగి గోదావరికిని
తెలిసికొనిరమ్ము పద్మాలందేగ సీత । అచటికేగినదేమొ యం చార్తి బలికె॥ 1

తే. రాము డిటుబల్క తమ్ముడా లక్ష్మణుండు । శత్రువీరాపహుండు తక్షణమ కదలి
నదికి గోదావరికి రమ్యపదము కరిగె । బుద్ధిమంతుండు లఘువిక్రముండు నగుచు॥

తే. తీర్థవతి నా నదీరమ్య తీరములను । నెల్ల వెదకి "యహో! సీత యెందు లేదు
కనుపడగ లేదు రేవు లెంచునను గాని। పలుక దెలుగెత్తి పిలిచిన వదినె" యనియె॥

తే. క్లేశనాశిని వైదేహి పృథ్వీపుత్రి । ఎచటి కేగెనొ జనకపృథ్వీశదుహిత
ఎరుకపడదయ్యె హా రామ యిందునందు । ఎంత వెదకినగాని వనాంతరముల॥ 6

తే. లక్ష్మణుని మాటలన్ విని రామవిభుడు। మిగుల సంతాపమోహితుం డగుచు నంత
తాన గోదావరికి జని దీనుడగుచు । సీత యే దంచు మెలుగెత్తి యాత డరచె॥

తే. రాక్షసేంద్రునిచేత, వధార్హుచేత । సీత యపహృతయంచు నే భూతములును
చెప్ప కూరకయుండె యా చొప్పుగాన । ఉలికి గోదావరియు చెప్ప కూరకుండె॥

తే. మాతగా నీవు ప్రియవార్తమహిపుత్రోడ । చెప్పుమంచును భూతముల్ చేరి వేడ
కరము శోకించి యడుగ రాఘవుడుగూడ। తల్లి గోదావరియు జెప్పదయ్యె జాడ॥

తే. రావణునికైన తే దుర్విప హార తలచి । మరి, దురాత్ముని క్రూరకర్మముల నెంచి
భయముచేతను నై దేహివార్త నుంత। అల్ల గోదావరియు చెప్పదయ్యె యయ్యొ"

తే. సీతవార్తను సె నది చెప్పకున్న । నాశపడియున్న పతికి నిరాశయయ్యె
సీతగానక నెంతయు చిక్కుచున్న । రాము డంతట నిటుబల్కె లక్ష్మణునకు।

తే. తల్లి గోదావరియు సీత తెరుగువార్త । చెప్పకున్నది కించిత్తు చిత్రమయ్యె
మామ జనకునకు నాదుమాత కింక । ఏమి చెప్పుదు సీత లేకింటి కేగి॥ 12

తే. రాజ్యహీనుడనై మహారణ్యములను । వన్యముల జీవనము సల్పు వ్యర్థు నన్ను
బాయ కనుదెంచి నా సర్వవ్యసనములను। బాప్రు నా సీత యేది లక్ష్మణకుమార॥

తే. జ్ఞాతిపక్షవిహీనుండ నాతి బాసి । రాజపుత్రిని సీత నా రాణి బాసి
జాగరణసల్పు నా కింక క్షపలివెల్ల । హా! సుదీర్ఘము లగునంచు నార్తినెంచు॥

తే. సీతయగుపడునేని నా చిత్తమలర । ఈ జనస్థాన మీ యద్రి యీ స్రవంతి
ప్రస్రవణ మల్ల గౌతమీ ప్రాంత మెల్ల । సర్వము చరింపనా హాయి చానగూడి॥

తే. లక్ష్మణా! చూడు! యీ మృగపంక్తులెల్ల।మాటి మాటికి నావంక బరపు దృష్టి
ఏమొ నాతోడ జెప్పంగ నెంచినట్లు । వాని యింగితములను దోపంగ జేయు॥

తే. వానిజూచినయంత నా బాహుశాలి । యా నరవ్యాఘ్రు డా రాము డార్తిగూరి
"ఏది నాసీత"యంచు ప్రశ్నించె నడలి । బాష్పసంరుద్ధదృక్కుల బరపి ప్రభుడు॥

తే. ఝమ్మనుచు డిట్లన మృగము లొక్కటన లేచి।నభము జూపుచు వడి దక్షిణంబునైప్ర
కాంత హ్రియమాణయైన మార్గంబునందు । బరచుచును రాము నరయుచుం
బారుచుండె॥ 18

తే. మరల మరలను నాదిక్కె యరుగ గోరు । వాని చేష్టల మాటలవలె నెరింగి
ధీయుతుం డంత సౌమిత్రి దీనరవళి । అన్నతో బల్కె నిటు వాని యర్థమెల్ల॥

తే. సీతయేదంచు నీవు పృచ్ఛించి యుంట । మృగములియ్యవి చటుకున లేచి దేవ!
దిశను దక్షిణమును జూపి, పృథ్విజూపి । పరుగులెత్తును రామ నీవంక జూచి॥ 21

తే. "కాన; పోవుద మీ దిక్కు కదలి యిపుడె। తెలియవచ్చును జాడ యే దేని దేవ
కాక యొకవేళ దేవియే కనుల మనకు।పడిన పడవచ్చు"ననగ నా ప్రభుడునంత॥

తే. మంచి దంచును నప్పుడే బయలుదేరి । లక్ష్మణానుగతుండునై రాఘవుండు
శ్రీయుతుం డేగె వడిగ దక్షిణముదిశకు।అడగు లిడుచు మహీస్థలి నరసికొనుచు॥

**తే.** అటుల మాటాడుకొంచు నన్యోన్యముగను । అన్నదమ్ములు వా రిద్ద రరుగుచుండ
నేలపై రాలియున్నట్టి పూలజాలుఁ । జూచి రా రాఘవుల్ వన క్షోణి నొకట॥

**తే.** పుష్పవృష్టిని నద్దాని భూమి నచట । చూచి రాముండు దీనుండు శోకముబుక
శోకవచనంబు లిట్టులా సోదరునకు । పలికె సౌమిత్రి కా శత్రుహంత కపుడు॥

**తే.** ఎరుగుదును లక్ష్మణా! పూల వీని నేను । నేన వైదేహి కిచ్చితి కానలోన
కోసి నే నీయ సతితన కొప్పులోన । తురుముకొనె వీని జక్కగా తరుణి సీత॥

**తే.** సూర్యుడును మారుతుండు యశోవిశాల । తల్లి ధాత్రియు నీ పుష్పవల్లరులను
నాకు ప్రియమొనరింప నా సతిని గూర్చి । శ్రద్ధ రక్షించుచుండె నంచనెద నోయి॥

**తే.** ఆ మహాబాహునకు, సుమిత్రాత్మజునకు । పురుషవృషభుండు రాము డీ సరణిఁ జెప్పి
గిరిని ప్రస్రవణాకులం బరసి యపుడ । పలికె ధర్మాత్ము డా శైలవరున కిటుల॥

**తే.** క్షితిభృతాంనాథ, నీకు నిం దెచటనైన । రామ సర్వాంగసుందరి రాణి సీత
కానిపించెన చెపుమ నన్ కాంతు బాసి! రమ్యతర మీ వనోద్దేశరంగమందు॥

**తే.** గిరియు మార్పల్కకునికి కన్ కెంపుగదుర । క్షుద్రమృగమును సింహంబు జూచుపోల్కి
చూచి రాఘవు డప్పు డా క్షోణిధరము । బెదరు భంగిగ నిటుబల్కె వీరబలుడు॥

**తే.** హేమవర్ణాభ సీత నా హేమగాత్రి । నిపుడె చూపింపుమోయి నే నెసగి నీదు
సానువులనెల్ల నా పటుసాయకముల । బరపి విధ్వంస మింక సల్పకయమున్న॥

**తే.** అంత గిరియును ప్రతినిస్వనంబుతోడ । ఏమొ చెప్పెడు భంగి గాన్పించియు నిక
రమణి జూపింప లేకున్కి రాముడల్గి । సరగ నిటుబల్కె తత్శిలోచ్చయముతోడ॥

**తే.** నాదు బాణాగ్ని నిర్దగ్ధమౌదు నీవు । భస్మమౌదువు క్షణములో పర్వతంబ
ఇక నసేవ్యుడ వౌదు వీ వెప్పుడోయి । నిస్తృణద్రుమపల్లవనికరుడ వయి॥ 33

**తే.** ఈ సరిత్తును గూడ నే నిప్పు డేను । లక్ష్మణా చూడు మింకింత తక్షణంబ
సీత చంద్రనిభానన సోత మిద్ది । నాకుఁ జూపింపదేని నా యార్య నిపుడె॥

**తే.** రుషితుడై చక్షువులను నీ లోకమెల్ల । దగ్ధమొనరించు భంగి తత్ప్రభుడు వెలయ
భూమిపై యక్కడై కాన్పించె పోల్చి చూడ । గొప్పరక్కసుపాదాలగురుతు లొకట॥

**తే.** వెరచి రక్కసుబారి తప్పించుకొనగ । ఇట్టు లట్టుల పరుగులు పెట్టుచుండ
వెంట రక్కసుడును నంటపృథ్వి నచట । పడిన సీతమ్మ చరణాంకపటలి తోచె॥

తే. అసురవరుగుల, సీతమ్మ యడుగు లరసి । భగ్నధనువును, తూణీర మట్లె కాంచి
బహువికీర్ణము రథము నా ప్రక్క జూచి। అన్నసంభ్రాంతుడై తమ్మునకనియెనిట్లు॥

తే. చూడు, లక్ష్మణ, శీర్ణమై క్షోణి రాలె । కనకబిందులు వైదేహి గాత్రమందు
వాల్చియుంచిన భూషణాతతులనుండి । వివిధమాల్యంబులును నట్లె భువిని రాలె॥

తే. తప్తబిందులపోల్కి చిత్రంబుగాగ । క్షతజబిందులతోడ లక్ష్మణ కుమార
ఇదిగో యీ ధరణీతలం బెల్ల చూడు। కప్పబడియుండె వత్స, యీ చోప్పి దేమి॥

తే. తలతు లక్ష్మణ వైదేహి తన్వి బట్టి । కామరూపులు రాక్షసుల్ కఠిన భంగి
కోసి కోసియు హా! పంచుకొని రటంచు । భక్షణమొనర్చి రంచు నీ వనినివత్స॥

తే. సీత వైదేహికొరకయి క్షితిని నిచట । దానవులు క్రూరు లిద్దరు తగవులాడి
ఘోరయుద్ధంబుగావించుకొని రటంచు । దోచు లక్ష్మణ ! చూడు గుర్తులను
నిచట॥ 43

తే. చూడు ముక్తామణిమయంబు చోద్య మోయి । ఇదిగో తపనీయ భూషితం
బిచట వత్స
విరిగి ధరణి మహార్ధను వెవరి దోను। పడియె లక్ష్మణ! యీ మహావనము మధ్య॥

తే. ఇదిగో తరుణార్కసంకాశ మిద్ధరిత్రి । తరళవైడూర్యగుళికాచితంబు, తాత!
భూమిని విశీర్ణమై పడె పోల్చి చూడు। కవచ మిది కాంచనం బింక యెవరి దోను॥

తే. శతశలాకంబు రమ్యంబు ఛత్ర మిద్ది । దివ్య మాల్యోపశోభల దీప్తి దనరు
భగ్నదండంబు లెస్స యీ వసుధ బడియె । ఎవరిదో చూడు సౌమిత్రి యేమి
వింతొ॥ 45

తే. కాంచనోరశ్ఛదంబులు ఖరము లివ్వి । చూడుము పిశాచవదనముల్ చోద్య
మిచట
పడె మహాకాయసులు రణహతములౌచు। భీమ రూపము లెవరివో వీర! చెప్పుమ॥

తే. దీప్తపావకసంకాశదీప్తి దనరి । యొరగె సమరధ్వజం బిది ద్యుతియుతంబు
తాత! సాంగ్రామికంబు రథంబు చూడు । భగ్నమైయుండె యెవరిదో వసుధ
నిచట॥ 47

తే. తరళతపనీయభూషణశరచయంబు। చూడగ రథాశ్వమాత్రముల్ చోద్యమోయి
విశిఖములు విప్రకీర్ణమై విరిగి ధరణి। గ్రాలుచున్నవి యేఘోరకర్మునివి యొ॥ 48

తే. శరసుసంపూర్ణముల్ శరావరము లివ్వి। చూడు విధ్వస్తముల్ రెండు శోభిబడినె
కేల ఖడ్గంబులును మని కోలతోడ। చచ్చిపడియుండె యెవ్వని సారథి తను?॥

తే. రుచిర సోష్ణీషమణికుండలులు, కుమార। యుధినిహతులౌచు భువిఁబడియున్నవారు
ఎంచిచూడు నరవ్యాఘ్ర! యెవరివారొ । చామరగ్రాహిణుల్ వీరు సౌమ్య,
చెప్పుము॥ 50

తే. కరకు రక్కసు లెవ్వరో యరిగి నట్టి। బాట యియ్యది యనుమాట స్పష్టమోయి
వైర మిక నాకు శతగుణంబయ్యె చూడు । జీవితాంతక మిది చూతు చివరివరకు॥

తే. అసురులు సుఘోరహృదయులయ్యా! కుమార। కామరూపులు వారిచే కాంత సీత
హా! తపస్విని లక్ష్మణా భీత యౌనె । హృతయొ, భక్షితయో, యింక మృతయొ
ధ్రువము॥ 52

తే. ధర్మమేనియు రక్షింపదాయె సతిని । హృతయొ భక్షితయో సీత యింతకైన
ఎట్టివారును నింక నా కిద్ధరిత్రి । ప్రియము సేయంగగలవారె వీర! చెప్పుము॥

తే. సకలలోకాల సృజియింప శక్తుఁడేని । ఈశ్వరవరుఁడేని దయమెత్తబోకునేని
సర్వభూతంబు లతని నజ్ఞాన వశత । సలుపు నవమాన మోయి లక్ష్మణకుమార॥

తే. ఏను లోకహితార్థమై మృదుతఁదాల్చి । కరుణ వేదని దాంతుడ మరియు నగుట
నన్ను నిర్వీర్యుడం చౌర మెన్ని రోయి । ధ్రువము త్రిదశేశ్వరులును శత్రుం
తప్పుండ॥ 55

తే. గుణముసైతము నను జెందె గుణగణాఢ్య!। కోపమయ్యెను చూడుము దోర్బలుండ
ఎల్లగుణముల నిక సంహరించివైచి । చెలగి నా తేజ మిదె ప్రకాశింపఁజేతు॥ 56

తే. దివి శశిజ్యోత్స్న హరియించి రవియుఁజెలగి । కడు మహత్తరలీల వెల్గెడు విధాన
రాక్షసుల సర్వభూతాల లయ మొనర్చి । సంహరించెద నిక నాదు సత్వగుణము॥

తే. ఇంక మనుజులు గంధర్వు లెవరు గాని । రాక్షసులును పిశాచులు యక్షులేని
కిన్నరులుగాని సుఖమును నొక్కింతగాని । బడయలేరోయి లక్ష్మణా! పాడమె
యలుక॥ 58

తే. చూడు మాకాశ మింక నా సునిశితాస్త్ర। బాణసంపూర్ణ మొనరించి వత్స! యిపుడె
మూడులోకాల సంచు నే మూలగాని। లేకయుండెడి రీతి నే వికఁజేతు॥ 59

తే. ఇక నిరోధింతు నీ గ్రహనికరమెల్ల । దివి నిశాకరు జేతును తిరుగకుండ
అనల, జల, వాయు, సూర్యుల నణచివైతు । పొడియొనర్చెద శైలాగ్రములను
చూడు॥ 61

తే. ఇంక నింకింతు కొలకుల నెల్ల జూడు । ద్రుమలతాగుల్మములను పోద్రోతు నలుక
జలధిశోషింపజేతు నా బలము బరపి । మూడులోకాల లయకాలమునకు జేర్తు॥

తే. సీత గొనిదెచ్చి నా కింక క్షేమముగను । ఔర! యర్పింపకున్నచో నమరతతులు
మిత్రి యీక్షణమండె సౌమిత్రిచూడు । వీరు కనగల రింక నావిక్రమంబు॥ 63
తే. ఆకసంబున నింక భూతాళులెవ్వి, తిరుగజాల వ దే మన్న దివియునింక
భూరి మచ్చాపగుణవినిర్ముక్తవితత । బాణజాలనిరంతరం బౌను గాదె!॥ 64
తే. అర్దితంబయి నాదు బాణాళివలన । పక్షిమృగసంఘములును విధ్వస్తమౌచు
జగ మిక సమాకులంబగు సౌమ్య! చూడు । మరి, యమర్యాదమును నౌను
నరయు మోయి॥ 65
తే. ఇషువు లాకర్ణ పూర్ణంబు లింక బరపి । మరి, దురావరముల జాల బరపి వత్స!
జీవలోక మరాక్షసం బౌ విధంబు । సేతు నపిశాచముగను నా సీతకొరకు॥ 66
తే. ప్రబలరోషప్రయుక్త మద్బాణతతుల । కార్ముకవిముక్తముల బలక్రిమ మ దెల్ల
కాంతుర్ ఫో అతిదూరాతిగాముల పస । భువిని దివినెల్ల సుర లిప్డె భూరి తేజ!॥
తే. ఉంచరమనులు, దైతేయు లుండ రింక । ఉండ రిక రాక్షసుల్ పిశాచోరగులును
వినుము మత్క్రోధమున లోకవితతు లెల్ల । నాశనంబగుచుంట ననామకముగ॥
తే. యక్షరాక్షస లోకముల్ పక్షితతుల । లోకములు దేవదానవలోకములును
నింక ఉండవు నశియించు నిన్ని కూడ । తాత! నాచేత శకలీకృతంబులౌను॥
తే. ఇపుడె చూడు నిర్మర్యాద మే నొనర్తు । సాయకంబుల నీ లోకచయము లెల్ల
హృతనో, మృతనో, మదీయపత్నిని శుభాంగి । నమరు లిక దెచ్చి నా కీయ
రైర యేని॥ 70
తే. ప్రియను వైదేహి నట్టి రూ పెసగుదాని । తెచ్చి నా కీయరేని యా దివిజతతులు
జగము సర్వము నాశంబు సలుపువాడ।ప్రబలి త్రైలోక్యము చరాచరంబు నింక॥
తే. రాము డిటుబల్కి రోషతామ్రాక్షు డగుచు । కేల కోదండదండంబు లీల బట్టి
ఘోర మాశీవిషోపమ క్రూర మద్ది । శరము సందీప్తమున్ దాల్చి సరగ నప్డు॥
తే. చాపమునగూర్చి పరపురంజయుడు ఘనుడు । రామచంద్రుండు రోషతామ్రాక్షు
డగుచు
మరి,యుగాంతాగ్ని రీతిగా కరము మండి। కుపితుడై యిట్లుబల్కె నా గురుభుజుండు॥
తే. మృత్యువును, కాలమును, మరి విధిని నల్లె।రాజునే గాని భూతముల్ సర్వములును
ఎదుర జాలని యట్టులే యెదురలేవు । క్రోధసంయుక్తు నన్నును రూక్ష మింత॥
తే. దేవి యా చారుదతి ననిందితను సీత । నువిద మున్నున్న రీతి నా కొసగరేని
సాసుమరోరగ గంధర్వ జనచయమ్ము । జగము తలక్రిందుజేతు నశైల మిప్డె॥

64 వ సర్గ సమాప్తి:— ( 2,109 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### అరువది అయిదవ సర్గ:— (16)

( ఒకని యపరాధమునకై లోకమునంతను సంహరించుట పాడిగాదని లక్ష్మణుడు రాముని ఊరడించుట— "సర్వవిధముల మనము వెదకి చూతము. అప్పటికిని దేవతలు సామమున సీతను దెచ్చి యీయమిచో అప్పటికి ఉపాయ మాలోచించుదమని" లక్ష్మణుడు రాముని సమాధాన పరచుట. )

తే. తప్యమానుని విభు తద్విధంబువాని । ననఘు సీతాహరణకర్శితాత్ము రాము
ఉగ్రు లోకవినాశనోద్యుక్తు రుషితు । మహిత సాంవర్తకానలం బనెడువాని॥ 1

తే. ధనువు సజ్యంబు నెంతయు కనులగనుచు । మాటిమాటికి నూర్పుల బరఫువాని
జగము సర్వము హరుడు యుగాంతమందు। బోలె దగ్ధంబుసేయంగ బూనువాని॥

తే. భ్రాంతను నదృష్టపూర్వరూపంబువాని । రాము సంక్రుద్ధు జూచి యా లక్ష్మణుండు
ప్రాంజలియు నౌచు వాక్యంబు పలికె నిట్లు । తద్ద పరిశుష్యముఖమున తమ్ముకు్ర॥

తే. మృదుత దాంతత దాల్చి నీ వింతవరకు । సర్వభూతైక హితరతస్వాంతుడ వయి
ఇపుడు క్రోధవశంబున నిటుల జిక్కి । తగదు ప్రకృతిని విడువ మహాత్మ నీవు॥

తే. చంద్రునందునలక్ష్మియు, క్షమయు భువిని।సూర్యునందున ప్రభయు, వాయువున గతియు
నియతి నొక్కొక్క టిటు లుండు; నీ యెడ నన । సర్వ ముండు ననుత్తమ యశముగూడ॥ 5

తే. ఒకని యపరాధమున లోకనికర మెల్ల । హతమొనర్పంగ నీవు పూనంగఁదగదు
భగ్న మెవరిదొ యీ రథం బనఘ యెరుగ।ఏల విరిగెనొ యెరుగ యీలీల దేవ॥

తే. అవని ఖురనేమిసంక్షుణ్ణమయ్యె నిచట । రుధిరబిందుల సిక్త మీ పృథివి జూడు
ఘోరసంగ్రామ మిటనైన తీరుదోచు ! పార్థివాత్మజ! చూడుమీ వనధరిత్రి॥ 7

తే. ఒక్కఁడిదిగాదె గన్పట్టుచున్నదనఘ । ఈ విమర్దంబు; కాదు పో యిద్దరి దిక
బాహుమనా త్రరబలములపదములిచట । వీర! వదతాంవరా! కానిపింప వున్రి॥

తే. ఒకని కృత్యమున ఈలోకనికరమెల్ల । నాశమొనరింపఁదగదు భూనాయకుండ
యుక్తదండులు మృదువులు నుర్విపతులు । మరి, ప్రశాంతులుగారె, ఏ వరయు
మింత॥ 9

తే. సర్వభూతంబులకు నీవు సంతతంబు । పరమగతివి శరణ్యుండ వగుదు వనఘ!
లోకపు దారపరినాశ మీ విధినిన గుట । మంచి దం చెవ్వ రందురు సముంచితుండ॥

తే. నదులు కొండలు భూతంబు లుదధు లింక । దేవగంధర్వదానవుల్ దేవ! మీకు
విప్రియముసేయజాలవు పేస మేని ! ఋత్విజులు దీక్షితున కట్లు ఋజుగుణుండ!॥

తే. సీత నెవ్వఁడు హరియించె ఘాతుకుండు । వెదకి పట్టుకొనందగు వీర ! వాని
మద్వితీయుండనై ధనుష్పాణి వగుచు ! పరమ ఋషుల సహాయాన ప్రభుఁడ వీవు॥

తే. వెదకుదము పర్వతంబుల నుదధు లింక । గుహాల వనముల పెక్కుల ఘోర
ములను
నదుల పద్మవనంబుల నదము లెల్ల । వెదకెదము దేవ! మరి, మరి, వదినె కొరకు॥

తే. దేవగంధర్వలోకాలఁ దిరిగి తిరిగి । ఇంక రోయుద మిదె సమాహితుల మగుచు
ధరణినాథ! నీభార్యాపహరుని నింక । గనుగొనెడిదాక విడువక కలచి కలచి॥

తే. సామమున నీదు పత్ని నా సాధ్విఁదెచ్చి । నెకు త్రిదశేశ్వరుల్ సమర్పింప లేని
కోసలేంద్ర ! యనంతరం బే సరణిని । సేయువలయునో నా రీతి సేత మనఘ!॥

తే. శీలమున సామమున నీదు సీతఁదెచ్చి । వినయమునను నయాన నర్పింప లేని
పిదప చెలగుము పవినిభవిశిఖములను । హేమపుంఖంబులను నేసి రామభద్ర॥

65 సర్గ సమాప్తి :— (2, 125)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### అరవై ఆరవ సర్గ:— (20)

( లక్ష్మణుడు మరియు రామునకు చెప్పవలసిన సారవంతములగు మాటలు చెప్పి ధైర్యమును పురిగొల్పి కర్తవ్యమును ప్రబోధించుట )

తే. భ్రాతను, ననాథనా నేడ్చు వాని నకట । శోకసంతప్తు, మోహాన నేకరీతి
తూలువానిని, కడు పరిద్యూను, దీను । మరి యచేతను జూచి లక్ష్మణుడు నపుడు॥

తే. శిరము చరణంబులనుసోక ధరణిమ్రొగ్గి। మరి, ముహూర్తాన సౌమిత్రి పరమభక్తి
రాము నాశ్వాసమొనరించి సామమునను।నిటుల సంబోధమొనరించె నెలమికలిమి॥

తే. రామచంద్ర! తపంబు మహత్తరాన । మరి, మహత్తర యాగకర్మాదికముల
రాజు దశరథునకు నీవు లబ్ధమైతి । వమృత మమరుల కట్టు లీ యవనిపైన॥

తే. నీ గుణంబుల బద్ధుడై నృపవరుండు । త్వద్వియోగాననే తండ్రి దశరథుండు
ప్రభుడు దేవత్వమొందెనన్ వార్తమనము।వరద! వింటిమిగాదె యా భరతుచేత॥

తే. దుఃఖమిది ప్రాప్తమిటులీవె దుర్దముండ!।హృది సహింపంగ లేనిచో సదరులాత్మ
ప్రాకృతుం డల్పసత్త్వుండు వసుధ నెవడు । ఇంక సహియింపగలడు పో యితరు
డనఘ॥ 5

తే. దుఃఖితుడవౌట లోకసందోహ మీవె । తేజమున దగ్ధమొనరింప దివురుదేని
ఆర్తు లీ ప్రజ లింక నెందరిగి దేవ । నిర్వృతిని జెందగల రహో నీవె చెపుమ॥

తే. అన్న! లోకస్వభావ మిట్లగుట యరుదె ? । చూడుము, యయాతి నహుషాత్మజుండు నాడు
ఇంద్రుతోడను సాలోక్యమొంది కూడ।అకట గురిగాడె యనయంబునకును నచట॥

తే. మరి, మహర్షి వశిష్ఠుండు పరమగురుడు । హితుడు మన కెల్ల కులపురోహితు డతండు
పుత్రశతమొక్కనాడె హా! పుట్టి మరల।చావరే యొక్కనాడె యా సంయమికిని॥
తే. జగములకుతల్లి సత్ క్షమ జనని దేవి । సకలలోకనమస్కృత సకలపూత
భూమి కిద్దానికిని స్థైతము(?)ండు దేవ । చలన మే మందు సత్యసంశ్రవ! మహాత్మ!॥
తే. తత జగచ్చక్షువుల్ ధర్మగతులు హితులు । సర్వము ప్రతిష్ఠితంబు తత్ స్వాము లందె
అట్టి యాదిత్యచంద్రుల కా మహా బ । లాఢ్యులకునేని తప్పునా గ్రహణబాధ?॥
తే. ఇక, మహాభూతములును, దేవేశ్వరులును । సర్వభూతాది దేహు నా సర్వ మయుని
దైవమును పూరుషర్షభా! యే విధాన । నైనతప్పించుకొనితిరుగంగ గలరె?॥
తే. అన్న! శక్రాది దేవతలందు కూడ । గలుగును నయానయంబులన్ పలుకు వినమె?
పురుషశార్దూల! యిట్టిచో వరద! నీవు । శోకమొందంగదగదు పో క్షోణిపాల!॥
తే. నష్టమైనను, హృతమైన యిష్టసీత । నీవుశోకింపదగదు ప్రాకృతుని యట్లు
సతము నిర్విణ్ణదర్శనుల్ సత్యపరులు । నిన్నుబోలినవారలు సన్నుతాత్మ
ఎట్టికష్టాలనైన శోకింప రనఘ!॥ 14
తే. తత్వతః నీదుబుద్ధినే తథ్యమింత । చింతనమొనర్చిచూడు భూకాంత నీవె
బుద్ధియుక్తులు తమతమబుద్ధి బలిమి । తెలిసికొందురి శుభాశుభంబులను ముందె॥
తే. మునుపుకర్మల జేయక యున్న యిపుడు । ఫలము లయ్యవి దేవరా! కలుగవయ్య
వాని గుణదోషములను నిప్పట్టు జూడ।వలను గాదయ్య; యూహింప వలెనెగాని॥
తే. రామ! మున్ను బహుప్రకారముల నీవె! బోధయొనరించితివి నాకు బుద్ధు లివ్వి
స్వామి! సాక్షాత్తు త ద్బృహస్పతియె యేని।ఇంక ఎవ్వడు నీకు బోధింపగలడు?॥
తే. బుద్ధి నీయది విబుధుల బుద్ధికేని । మరి, దురన్వయమగుగాదె పరమపురుష!
శోకమునజేసి యదియిప్డు సుప్తమగుట । నేను బోధింతు నింతె, నే నెంతవాడ!॥
తే. దివ్యులను మానుషులను వధింపరాని । వీరి దలచియు, మరియు నీ వీర్య మెంచి
శత్రుల వధార్హులనె నీవు జంప నోంప । బూను మిక్ష్వాకువృషభ మహానుభావ॥
తే. సర్వనాశంబు నీ విట్లు సార్వభౌమ! । యొనరుపఁగ బూను టేమి ప్రయోజనంబు?
రిపుని పాపుని నతనినే నృపుడ! వెదకి । పట్టి పల్లార్పదగును, జంపంగదగును॥ 20

66 వ సర్గ సమాప్తి :— (2,145)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అరవై ఏడవ సర్గ:— (29)

( రాముడు ధైర్యమొంది, లక్ష్మణునితో కలసి, అడవి వెదకుచు, ఒకచో నేలఁబడియున్న జటాయుని జూచుట - "సీతను జంపి తిన్న రాక్షసుడే ఈ మాయ పక్షివేషములో నున్నా"డని రాముడు జటాయుని జంపబూనుట - జటాయువు నిజవృత్తాంతము జెప్పగ, రాముడు దుఃఖించి, ఆతనిని కౌఁగిలించుకొని "హా సీతయేది" అని రాముడు మరల నేలపై కూలుట. )

తే. తమ్ము డిటు జెప్పినట్టి మాత్రమ్ములోనె। తత్సుభాషితమును రామధరణివిభుడు
విని, మహాసార మద్దాని మనమునందు। గొనియె నతడు సారగ్రాహి కనుక
యగుటె॥ 1

తే. కోపము ప్రవృత్తమును నడ్డె గురుభుజుండు। నిగ్రహించుకు తనలోనె నుగ్రబలుడు
ధనువు చిత్రంబుపై యానుకొనుచు విభుడు। రాము డిటుబల్కె లక్ష్మణస్వామి
తోడ॥ 2

తే ఏమి సేతమువత్స! యిం కెందు బోద। మే యుపాయాన సీత నా ప్రేయసి నిక
కనుగొనంగనుగలవార మనఘ నీవె! యోచనమొనర్చి చెప్పుము, ధీయుత
కుమార॥ 3

తే. అంత నన్నను బహుళ తాపార్తు జూచి। లక్ష్మణుం డిట్లు లనియె నా రాఘవునకు॥
ఇదె, జనస్థానభూమిని వెదుకవలయు। బహుళరాక్షససేవితం బనఘ యిద్ది
వితతనానాద్రుమలతాప్రవృద్ధమగును। మనము తప్పక వెదకుద మన్న దీని॥ 4

తే. కలవు గిరిదుర్గములు పెక్కు లిలను నిచట। నిర్ఝరంబులు కందర నికరములును
గుహలు వివిధంబు లెంతేని ఘోరములును। ప్రబల నానామృగగణాకులంబు
లనఘ॥ 5

తే. కిన్నరావాసములు, సుసంపన్నములును । వివిధ గంధర్వ భవనముల్ వెలయు నిచట
వాని నన్నింటి నాతోడ ప్రభుడ! కూడి । హెచ్చరికతోడ వెదుకంగ నింక తగును॥ 6

తే. అన్న! నీవంటిబుద్ధిసంపన్నులైన । వారలు మహాత్ము లెప్డును నాపదలలోన
నంత చలియింపరు గదన్న స్వాంతములను । వాయువేగాన నచలంబులో యనంగ॥ 7

తే. లక్ష్మణస్వామి యిటుబల్క రాఘవుడును।నంత క్రోధంబు దాలిచి స్వాంతమందు
శరముఘోరము సంధించి క్షురము వింట । వనము సర్వము దిరిగె లక్ష్మణునిగూడి॥

తే. అంత పర్వతకూటాభు నవనిపతితు । పక్షిరాజన్య మహి మహాభాగుఁగనియె
రామచంద్రుండు త ద్వనభూమిలోన । నొకట క్షతజార్ద్ర నట జటాయుని సజీవు॥

తే. వనిని నా గిరిశృంగాభు గనిన యంత । రాము డనె లక్ష్మణునితోడ "రమణిసీత
తప్ప కీ పక్షిచేతనే తమ్ముడ! భక్షణమొనర్పబడె సంశయంబులేదు"॥ 10

తే. గృధ్రరూపుండు రక్కసుండేను వీడు । సీతను విశాలనయన భక్షించివైచి
సుఖముగా కూరుచుండె నిచ్చోట వీడు । వీని వధియింతు మద్ఘోరబాణనిహతి॥

తే. ఇట్టు లనుచును విల్లెక్కువెట్టి విభుడు । ధనుపి క్షురమును సంధించి ధరణి యెల్ల
అల సముద్రాంతము వడంక నరిగె వడిగ । పక్షి యద్దానిపైకి కోపంబు నిగుడ॥

తే. దీను, రాముని, దశరథసూను జూచి । దీనవాక్యాల నెత్తురు సఫేన మకట
గ్రక్కుచు జటాయు వా పక్షి గ్రక్క నపుడు । పలుక నొడగెను నిట్టు లా ప్రభునితోడ॥ 14

తే. నీవునెవతె నాయుష్మంతుడా వనోర్వి।యోషధిని బోలె వెదకుచునుంటి వోయి
అట్టి దేవియు నాదైనయట్టి యుసురు।రావణునిచేత హృతమయ్యె రామ! రెండు॥

తే. రేడ! నీవును తమ్ముండు లేనివేళ । పటుబలీయుడు రావణుం డటుల వచ్చి
అకట సీతను హరియించి యాకసమున । గొంచుపోవుచునుండ నే గాంచినాడ॥

తే. సీత చెంతకు నే నంత చెంగు నెగసి । రావణురథంబు పడదన్ని రణములోన
నతని ధరణీతలంబున పతితుగాగ । జేసినాడను దేవ! నా చేవబరపి॥ 17

తే. ఇది యతనిదేను విరిగిన దీ ధనుస్సు; । ఇది శరావర మతనిదే; యిదె రథంబు
విరిగె సాంగ్రామికంబు నా వితతశక్తి;।ఇత డతని సారథియె చచ్చి క్షితిని పడియె
చూడు మత్పక్షనిహతి నీచుండు వీడు॥ 18

తే. అలసి నేనుంట నా పక్షముల ఖరాసి। నరికి సీతను గొం చే న్నభసి నసుర;
నిహతుడనుము న్నె యసురచే నీవునింక । నన్ను మరలను హతమార్చ నెన్న కోయి॥ 20

తే. సీత గూర్చి జటాయు ఏ రీతి వార్త । దెలుప ప్రియమంచియు మనంబు తేరు కొనక
అకట ద్విగుణీకృతంబు తాపార్తి జెంది। బాష్పపూర్ణ ముఖుండయ్యె ప్రభువరుండు॥

తే. గృధ్రరాజన్యు వే కౌగిలించుకొంచు । వడి మహద్ధను వచట నే విడిచి నైచి
అవశుడై భూమిపై బడి హా! యటంచు । రోదనమొనర్చె తాను సహోదరుడును॥

తే. కాన * నేకాయనాన, నేకాకి యగుచు । దుర్గమంబైనచోట హా! తూలి యెటులొ
ఊర్పులర్బుచ్చు నా జటాయువును గాంచి । శోకతరుడై విభుండను సోదరునకు॥

తే. రాజ్యవిభ్రంశమును, వనోర్వ్వరనివాస । మకట నై దేహీ హరణంబు నా ప్తమిత్రు
నీ జటాయునిమరణ మీ యోజ నాదు । పరమదౌర్భాగ్యము దహించు వహ్ని నేని॥ 24

తే. తద్ద సంపూర్ణ మా మహోదధిని నేని । ఇపుడు నే జొచ్చితేని -! చెపుదు ధ్రువము
నాదు దౌర్భాగ్యమున జేసి సోదరుండ । ఆ సరిత్పతి యెండియే యయ్యో! పోవు॥

తే. ఉండడోయి యభాగ్యతరుండు వత్స । సకలలోకాల నీ చరాచరములందు
ఎవడు నాకంటె; భీకరంబిట్టు లేను । వ్యసనవాగురులన్ జిక్కి యడలుచుంటి॥

తే. చూడు నాకగు పితృవయస్యుం డితండు । గృధ్రరాజు జరాన్వితుం డిట్టు లకట
వినిహతుండౌచు భూమిపై విరిగిపడియె । వత్స! నాదగు భాగ్యవిపర్యయమున॥

తే. రామచంద్రుండు లక్ష్మణస్వామిగూడి । ఇటుల బహురీతి విలపించి పటుబలుండు
త జ్జటాయుని తనువెల్ల తడివెబ్రీతి । అల పితృస్నేహగౌరవంబులు దొలంక॥

గీ. నికృత్తపక్షున్, రుధిరావసిక్తున్ । శకుంతరాజున్, పతి చేర్చి కౌగిట
“క్వ మైథిలీ! ప్రాణసమా! మమా!”యటం । చహో! విలాపించుచు ధాత్రి గూలెన్॥ 29

* ఏకాయనాన = ఏక + అయనము = ఒంటరి మార్గములో (తోడులేని అడవిలో)

67 వ సర్గ సమాప్తి :— ( 2,174 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### అ రు వ ది ఎ ని మి ది వ స ర్గ :— (౬౮)

( జటాయువునకు మోక్ష ప్రదానము. )

తే. రాముఁ జేసట్లుపడిన గృధ్రంబుఁ జూచి । భువి విచేష్టుని నా జటాయువును గాంచి
మిత్రసంపన్నతోడ సౌమిత్రితోడ । రాముఁ డిటు బల్కె లక్షణస్వామితోడ॥ 1

తే. ఈతడు మదర్థమై యెంతో కృషి యొనర్చి । రాక్షసుని చేత హతుడౌచు రణధరిత్రి
దుస్త్యజంబుల ప్రాణాల ధ్రువము వత్స!। హా! త్యజించుచునుండె విహంగవిభుఁడు॥

తే. ఈతని శరీరమందున నింక వత్స! । ప్రాణములు నిల్చియున్నట్టి భంగిఁ దోచు
కనగ, సర్వహీనుఁడుగను విక్లబుఁడుగాను । గానిపించుచునున్నాఁడు ఖగవిభుండు॥

తే. "మరలమాటను చెప్పుట కరయ నీకు । ఓ జటాయువ యోపిక యున్నయెడల
శ్రేయమగు నీకు చెప్పుమ నా సీతవార్త । మరియు నీవధసంగతి సరిగ చెప్పుమ॥ 4

తే. ఏ నిమిత్తంబు రావణుం డిటుల సీత । నెత్తుకొనిపోయె? నతనికే నేమి కీడు
చేసియుంటిని యతడు నా సీత నకట । ప్రియను హరియించునంతటి విధముగాఁగ॥

తే. ఎటుల త చ్చంద్రసంకాశమింతి ముఖము। త న్మనోహర ముండె న త్తరుణమందు
అప్పు డేమని పల్కె ద్విజాధినాథ । సీత వైదేహి నా దేవి భీత చెప్పుమ॥ 6

తే. వీర్య మెట్టిది, రూప మే విధము నుండు? । అసురు డాతని వెట్లు కార్యంబులుండు
ఎచట ఆతని యునికి, నీ వింత చెప్పుమ । తాత! యడుగుచునుంటి పతంగవిభుడ॥

తే. తద్ద దీనత నటు నిరంతరముగాఁగ । కడు విలాపంబు సేయు రాఘవుని జూచి
మిగుల హీనస్వరంబున ఖగవిభుండు । త జ్జటాయువు బలికె న త్తరిని నిటుల॥ 8

తే. వాతదుర్దిన సంకులం బాతతంబు । రావణుడు మాయచేత కల్పన మొనర్చి
వడి విహాయసమార్గానఁబడతి నతడు। రాక్షసేంద్రుండు కొనిపోయె రూక్షగతిని॥

తే. అలసి నేనుంట నాదు రెక్కల ఖరాసి । తాత! ఖండించి రాక్షసుండాత డప్పుడ
సీత వైదేహిఁగొంచు దక్షిణముదిశకు । తరలిపోయెను తారకాధ్వంబునంటి॥ 10

తే. తాత! నాప్రాణములు నిరోధంబు జెందు । దృష్టియు భ్రమించుచుండె పృథ్వీకళత్ర ?
ఇవిగో కనుచుంటి సౌవర్ణ వృక్షములను । చక్షుల నుశీరకృతమూర్ధజముల రామ॥

తే. ఏ ముహూర్తాన నసుర హరించె సతిని। "విందు" మందురు దానిని విబుధవరులు
అందు హృతమైన ధనము వే జెందు విభుని । ఈ రహస్యంబు నెరుగ డా నైరృతుండు॥ 12

తే. త్వత్ప్రియన్ జానకిని కటా దానవుండు । రావణుండు హరించి, శీఘ్రంబుగాని
నాశమొందును తప్పదు నాదుమాట।బడిశమున్ మ్రింగు ఝషము భావంబుగాగ॥

తే. వ్యథను నీవింక జెందుడు పనియెలేదు । దేవ! జనకగూర్చి నీ దేవిగూర్చి
ఇంక వైదేహిగూడి రమింతువీవు । త్వరగ రావణు రణమున వధమొనర్చి॥ 14

తే. అంతవరకును తెలివి యావంతఁ జెడక । రామునితోడను ప్రత్యుత్తరంబు బలుకు
త జ్జటాయుని నోట రక్తంబుగ్రక్కె । మాంససహితంబు, వేగ నా మరణవేళ॥

తే. "విశ్రవసునకు సాక్షాత్తు వీడుకొడుకు।సవతి తమ్ముండు నౌను వైశ్రవణుకనఘ"
అనుచు పల్కుచు పైన నే మనగలేక । వదలె ప్రాణాలనిక దుర్లభముల నతడు॥

తే. "చెప్పు, చెప్పం"చు రాముండు చేతు లొగ్గి । పల్కుచుండగనే వాని ప్రాణచయము
త జ్జటాయుశరీరంబు నుజ్జగించి । చనె విహాయస మార్గాన స్వర్గమునకు॥ 17

తే. శిరము నేలను వాల్చి త చ్చరణములను । చాచి నీల్గి శరీరంబు జగతిపైన
పడగ మరణంబునొందె నా పక్షిరాజు । రాముకార్యార్థ మిటు శరీరంబు నిచ్చి॥

తే. ఉర్వి తామ్రాక్షు, మరి గతాయుష్కు ఖగేశు।పర్వతోపము గృధ్రంబుఁబరగజూచి
అధిక దుఃఖితుడును దీను డగుచు నకట । రాము డిట్టుల బల్కె నా లక్ష్మణునకు॥

తే. "రాక్షసావాస మీ మహారణ్యమందు । దండకోర్విని పెక్కువత్సరము లితడు
సుఖతవసియించి మనకొఱ కకట యిపుడు । దేహమర్పించె పక్షిరాజోహో ! ఘనుడు॥ 20

తే. క్షితి నితండు ననేక వార్షికమువయసు| బొడలి, చిరకాల మిట్టు లభ్యుదయమొంది
నేడు హతుడౌచు నేలపై నిద్రజెందు | కనగ దురతిక్రమముగాదె కాల మనఘ॥

తే. మాకు లక్ష్మణ! గృధ్రమీ శూరవరుడు| నాకు నుపకారి నిజము నా నాతి సీత
రక్షణముసల్పబోయి బలాఢ్యుడైన | రావణునిచేత హతుడయ్యె రణధరిత్రి॥

తే. గృధ్రరాజ్యంబు నితడు పరిత్యజించి | మహిత మా పితృపైతామహంబు విడిచి
ఔర నా హేతువునకుగా పోరు సల్పి | ప్రాణములనిచ్చె నితడు నిస్స్వార్థముగను॥

తే. సాధువులు, ధర్మచరితులు, సత్యపరులు | శూరులు శరణ్యు లెందు నీ క్షోణిలోన
గానిపింతురు సర్వత్ర ఘనసుజుండ | అవని మానవ తిర్యగ్యోనులందు గూడ॥ 24

తే. అకట! సీతాపహరణజంబైన యట్టి | దుఃఖ మది నాకు గొప్పగాఁ దోచ దోయి
చూడుమీ గృధ్రరాజిట్లు క్షోణి కొరగి | మత్కృతంబున హతుడౌట మదిఁ
దలంప॥ 25

తే. రాజు దశరథు డా మహాప్రకట యశుడు | శ్రీయుతుం డెట్లు పూజ్యుండొ;
హృదిని నాకు
పూజనీయుండొ, అట్టులే పుణ్యు డితడు | పూజ్యుడును మాన్యుడును నాకు
పులుగురేడు॥ 26

తే. కట్టెలన్ దెమ్ము లక్ష్మణా! కడగి యిపుడె | నిర్మథనమున వేగ వహ్నిని నొనర్చి
దహనసంస్కారమిత్తు గృధ్రాధిపునకు | నిధనమున్ జెందె యుధిని మత్కృత
మితండు॥ 27

తే. రాక్షసునిచేత నాజి నా రౌద్రుచేత | మత్కృతంబున హతుడైన మహితు నితని
పతగలోకాధినాథుని చితిని జేర్చి | దహనసంస్కారమిత్తు నీ ధన్యుకిపుడె॥ 28

ఉ. ఏగతి యజ్ఞశీలురకు, నేగతి భూమినొసంగువారికిన్
ఏగతి ఆహితాగ్నులకు, నేగతి తత్పునరాగమంబులే
కేగెడువారికిన్ గలుగు గృధ్రవిభుండ! మహాబలాఢ్య! నీ
వేగుము తద్గతిన్ సఖుడ! యిత్తు ననుజ్ఞ ననుత్తమంబు లెం
తేఁగన లోకముల్ వడి మదీయకరంబున జెందిసంస్కృతిన్॥ 30

తే. ఇట్టులనుచును తత్పతగేశు నపుడ | దీప్త మారోపమొనరించి యాప్తుఁజితిని
దహనమొనరించె రాముండు ధర్మపరుడు| కరము దుఃఖించి నిజబంధుకొరకునట్లు॥

తే. లక్ష్మనిగూడి యంత నా రాఘవుండు | అడవికేగి మహారోహి వడి వధించి
పిండదానమునిడగ నా ద్విజవరునకు | పరచె దర్భల నేలపై పటుబలుండు॥ 32

# జటాయు మరణమ్



శ్లో॥ యాగతి ర్యజ్ఞశీలానాం, ఆహితాగ్నేశ్చ యాగతిః। అపరావర్తినాం యాచ యాచ, భూమిప్రదాయినాం ॥
మయా త్వం సమనుజ్ఞాతో, గచ్ఛ లోకాన్ అనుత్తమాన్। గృధ్రరాజ! మహాసత్త్వా! సంస్కృతశ్చ మయా వ్రజ ॥

ఉ॥ ఏగతి యజ్ఞశీలురకు, నేగతి భూమినొసంగువారికిన్, ఏగతి ఆహితాగ్నులకు, నే[illegible] తే!
కేగెడువారికిన్ గలుగు గృధ్రవిభుండ! మహాబలాఢ్య! నీ నేగుము త్వద్గతిన్ సఖుడ! ఇ[illegible] లెం
తేఁగన లోకముల్ వడి, మదీయకరంబున జెంది సంస్కృతిన్ ॥

అరణ్యకాండ: 68వ సర్గ 30వ శ్లోకం: పేజీ 232

తే. రోహిమాంసబుదీసి నిరూఢభక్తి। పిండములొనర్చి కీర్తివంతుం డతండు
శకునమునకిచ్చె రాము డా జనవిభుండు।వనిని నా రమ్య హరిత శాద్వలమునందు॥

తే. మర్త్యునకు ప్రేతరూపపి కే మంత్రివరము । మహి ద్విజాతులు పఠియింతు రి మహిమ వెలగ
స్వర్గగమనంబు పిత్ర్యంబు జపమొనర్చె।రాము డా మంత్రమే పక్షిరాజు కొరకు॥

తే. అంత, గోదావరికినేగి యరక్కులులు। స్నాతులై గృధ్రరాజుకు శాస్త్రవిధిని
ఉదకదానంబు జేసి రా యుభయు లప్పుడు। నరవరాత్మజు లా రఘునందనులును॥

తే. రణము నం దీల్గి యా పక్షిరాజు నౌర!।కర్మ దుష్కరమును యశస్కరమొనర్చె
ఋషిసముని రామచేత సంస్కృతిని జెంది । పోయె పుణ్యంబు శుభమైన భూరిగతికి॥ 37

తే. ఖగపతికి నట్లు పిండోదకంబు లొసగి । అతని మాటల స్థిరబుద్ధి ననఘు లునిచి
సీతఁగనుగొనుటందునే చిత్తముంచి । వనము జొచ్చిరి వడి విష్ణు మఘువులట్లు॥

68 వ సర్గ సమాప్తి:— ( 2, 212 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### అరవైతొమ్మిదవ సర్గ:— (71)

( "ఆయోముఖీ" విరూపకరణము — "కబంధ" దర్శనము )

**తే.** సలిలమొసఁగి జటాయున కలఘు లట్లు । సీతవెదకుచు వనిని పశ్చిమము తరలి
దక్షిణంజేగి శరచాప ధారులగు।అప్రిహతమైన బాట వారరిగి యరిగి॥ 1

**తే.** గుల్మముల వృక్షముల లతాకుంజములను।నావృతంబయి ఘోరదర్శనము నొచు
గహన మెందును జూడ దుర్గమమునైన।విపినమును జొచ్చి నడచి రా వీరవరులు॥

**తే.** వ్యాళసింహానిషేవితం బరయ నెందు । త న్మహారణ్యమును దాటి దాశరథులు
నుగ్రము సుభీమ మా దండకోర్వి గడచి । వడి జనుచునుండి రా మహా బాహు
బలులు॥ 4

**ద్వి.** వితత నానావ్యాళమృగగణోగ్రంబు । వినుత నానాపక్షిగణసుసంయుతము
సర్వత్రఁగన పరివ్యాప్తంబుగా దోచు । వనము నానామేఘ ఘనసమంబద్ది
తిరుగుచు నంజంజ మరల నిల్చుచును । సీతాపహరణకర్శితులు రాఘవులు
వై దేహిఁగనుగొను వాంఛతో నడచి । వనమెల్ల వెదుకంగ వడిసాగి రపుడు॥

**తే.** అంత త్రిక్రోశమరిగి పూర్వాశ నడచి । అడవిదారి క్రౌంచారణ్య మెల్ల దాటి
రామలక్ష్మణు లిద్ద రా రాజసుతులు । గనిరి వనమధ్యమున మతంగాశ్రమంబు॥

**తే.** జగతి బహుభీమమృగపక్షి సంకులంబు । ఘోరతరము నానాసత్వపూరితంబు
గహనపాదపసర్వంబు కాననంబు । చూచి వారలు మరియు నచ్చోట నొకట॥

**తే.** ఘోరపాతాళతుల్యగంభీరమరయ । నిత్య తమసావృతంబద్ది పృథుముఖంబు
గుహను దొకదాని జూచి రా మహితయశులు।దశరథాత్మజులిద్ద రా దరిని వనిని॥

తే. ఆ నరవ్యాఘ్రు లా గుహాదరికి నరిగి । దానికి సమీపమందునే దాశరథులు
గాంచి రొకరక్కసిని వెర్రికనులదాని । వికృతముఖమొప్పు దానీ పెన్ మేనిదాని॥

తే. అల్పసత్వంబులకు భయప్రదముదాని । సర్వభీభత్సరౌద్రదర్శనముదాని;
కర్కచచర్మంబు లంబోదరంబు దాని । తీక్ష్ణదంష్ట్రాకరాళ మా తెరవదాని॥ 12

తే. భీమమృగముల భక్షించి పేర్చుదాని । విరియబోసినవెంట్రుకల్ బరగుదాని
వికట నా స్త్రీని జూచి రా వీరవరులు । రామలక్ష్మణు లా దరీ సీమనపుడు॥ 13

తే. అదియు నా వీరులకు చెంత కరుగుదెంచి । అన్నముందరనడచు లక్ష్మణునిజూచి
"రమ్ము, రమియింత"మంచు హస్తమ్ము బట్టి । లాగె నివలికి నాతని రమ్యవపుని॥

తే. ప్రీతి వాటేసుకొని కౌగలించి యతని । పలికె నదియు, "నయోముఖి యందు
నన్ను
నీకుదొరికితి; ప్రియుడవు నీవు నాకు । దొరికితివి; రమ్ముక్రీడింత మిరుపురముసు॥

తే. "నాథ! పర్వతకూటాల నదులయందు । పులినములయందు, జీవితంబుండు దనుక
వీర! నాతోడ నీవు విహారములను।సలిపి రమియింతువు యథేచ్ఛ సరస! రమ్ము"॥

తే. అసురి యిటులన కుపితుడై లక్ష్మణుండును । ఖరతరాసిని నెత్తి వేగంబ దాని
కర్ణనాసల స్తనముల కరకుధారఁ । గోసివైచెను శత్రుపక్షోగ్రు డతడు॥ 17

తే. కర్ణనాసాదులు నికృత్త మగుట నిట్లు । విస్వరంబున నాదంబు వీక సలిపి
సరగ వచ్చినదారి రాక్షసియు బరచె । భీమదర్శన యా మహా విపినభూమి॥ 18

తే. అసురి యటుబోవగానె యా యడవి చాయ । వనము గహనంబు నోజమై వారు
జొచ్చి
భ్రాతృవరులు నమితఘ్ను లర్కకులులు । రామలక్ష్మణు లరుగు చా ప్రాంత
మందు॥ 19

తే. అరయుచుండ మహాతేజు డురుగుణుండు।సత్త్వవంతుండు శుచియు లక్ష్మణుడు వేగ
దీప్తతేజుని నన్న నా యాప్తుఁజూచి । పలికె ప్రాంజలియై యిట్లు వాక్య మపుడు॥

తే. అదరుచున్నది నా బాహు వధికముగను।ఊర కుద్విగ్న మగునట్లు లుండెమనసు
భువి యనిష్టంబులు నిమిత్తములును దేవ! ।తోచుచున్నవి పెక్కు లీ త్రోవలోన॥

తే. కాన, నాయత్తుడవు గమ్ము ఘనభుజుండ । హితము నామాట సల్పు మహీన తేజ
ఈ నిమిత్తంబులన్ జూడ యిపుడె మనకు । గొప్ప కీడగునను భంగి చెప్పు ననఘ॥

తే. ఇదిగో వంజుళ నామకం బీ పులుంగు । పరమదారుణమిది కూయు భంగిఁజూడ
గెలుపు యుద్ధాన మన కికఁ గలుగ ననుచు । చెప్పుచున్నట్లు రామ! తోఁచెడిని వినుము॥ 23

తే. ఇటుల తద్వనమెల్ల నెం తేనివీక్షి । యోజయును బూని వెదకుచునుండునంత
పుట్టె శబ్దంబు ఘోరంబు పట్టుగాగ । చెలగి తద్వనమెల్ల భంజించు లీల॥ 24

తే. వనిని నటు పుట్టినట్టి శబ్దంబు వినఁగ । గగన మెల్లను గాలిచే మిగులనింపి
క్రోధసీకరహుంకరంబు ప్రమాదముగను । చుట్టుముట్టిన భంగి గన్పట్టె నపుడు॥ 25

తే. శబ్దమద్దాని మూలంబు సరగనెరుఁగ । నరయు నుండంగ రాము డా యనుజుగూడి
గాంచి యొక పొదలోన రక్కసుని నొకని । విపులవక్షు మహాకాయు భీమరూపు॥

సీ. శిరమును గ్రీవంబు చిత్రంబు! లేకయే । ఉదరంబున ముఖంబు నున్నవాని
దేహంబు దట్టమౌ తీక్ష్ణరోమంబుల । నిండి మహాద్రినా నిగుడువాని
నీలమేఘముభాతి నిలువున రౌద్రికై । మేఘగర్జలనార్చి మెలగువాని
ముందునగ్నిజ్వాలభంగి లలాటాన । విపుల మాయతమును పింగవర్ణ

తే. మొప్పి పెన్ రెప్పలఁగూడియురమునందు । ఆకుదర్శనమును ఘోరమైన యట్టి
ఏకనేత్రాన వెలయుచు నెసగువాని।మరి, మహాదంష్ట్రములతోడ బరగువాని॥ 29

తే. నాలుకలుజాచి యెల్లెడ నాకువాని । ఋక్ష,సింహ, మృగ, ద్వీప, పక్షితతుల
వని, మహాఘోరసత్వాల భక్షణంబు । సల్పువాని, మహాముఖు చటులవేగు॥

తే. యోజనాయతములను బాహువుల రెంటి । ఘోరముల జాచి దూరమం దార మెలగు
ఋక్ష, పక్షి, మృగాదుల నీడ్చిపట్టి । ఇట్టి నట్టుల విదలించి యెసగువాని। 31

తే. కడగి మృగయూథముల ననేకముల నిట్లు । పట్టిలాగుచు నిటునటు బారవైచి
మార్గమును నడ్డగించుచు మలయువాని । గాంచిరి "కబంధు"డనెడి రాక్షసుని వారు॥ 32

తే. దారుణు, మహాంతు, భీము నా ఘోరనేత్రు । భుజసుసంవృతు మొండెంబు బోలు వాని
క్రోశమాత్రంబులోన నా ఘోరవనిని।చూచిరి "కబంధు" వీరు లా సోదరులును॥

తే. వడి మహాబాహు డా కబంధుడును గడగి।విపుల భుజముల నత్యర్థ మపుడుచాచి
రాఘవులనిద్దరిన్ జేర్చి యోఘుబలుల । పట్టి లాగెను తనవైపు బలముపేర్మి॥ 35

తే. దృఢధనుస్సుల ఖడ్గాలవెలయువారు। తిగ్మ తేజో వపువులొప్పి తిరుగు వారు
భ్రాంతి లిద్దరు మరి మహాబలులు ఘనులు।కృష్యమాణులునై యహో వివశులైరి

తే. శూరుడగుటచు ధైర్యాన వీరవరుడు। రామచంద్రుండు వ్యథఁజెంద డేమి గాని
బాల్యముననను, ననాశ్రయత్వంబు కతన।అతివ్యథన్ జెంది లక్ష్మణుం డన్నకనియె॥

తే. చూడు నన్నిట్లు; హా! వివశుండనైతి। రాక్షస వశంగతుడనైతి రామచంద్ర!
న న్నొకని వీనికిచ్చి నీ వన్న! యింక। వడిగ విడిపించుకొనుమి యిక్ష్వాకుతిలక॥

తే. భూతబలియిచ్చి నన్ను నీ ఘాతుకునకు। ఇక పలాయన మగుము నీ విచటనుండి
సీత యచిరంబుననె నీకు చేరునంచు। నాదు మదినోచుచున్నది న్యాయశీల!॥

తే. మహిని త త్పితృపైతామహంబు నొంది। దేవ! రాజ్యస్థుడవు నొచు దివ్యలీల
తమ్ము న న్నీవు సర్వదా తలపులోన। కూర్మి యుంచుకొనందగు కువలయేశ॥

తే. లక్ష్మణుం డిట్లు బల్క నా రాము డంత।"మిత్ర! భయపడకోయి సౌమిత్రి! వీర!
జగతి నీవంటి వారు విషాద మిటుల। పొందరోయి" యటంచు తమ్మునకు ననియె॥

తే. ఇంతలోన "కబంధుండు" నెసకమెసగ। అన్నదమ్ముల నా రామలక్ష్మణులను
మేఘ నిర్ఘోషమైన గంభీరరవళి। నడిగె నిట్టుల క్రూరు డా యసురవరుడు॥ 42

తే. ఎవరుమీరు; మహాసి చాపైక ధరులు। పృథువృషస్కంధు లీ ఘోర విపిన
మునకు
వచ్చినారలు, మరియు నా కిచ్చెమెరయ। భక్షణంబులు నైతిరి వనిని నిపుడు!

తే. చెపుడ మీ కేమి కార్య మీ విపినమందు।గలిగి యిటువచ్చి నార లీ కానలోకి
ఇట క్షుధార్తుడ నేనుండ పటుబలుండ। వచ్చితిరె నాకు భక్షణం బగుటకొరకు!॥

తే. బాణచాపాసిధారులై భయములేక। తీక్ష్ణశృంగవృషంబుల తెరగుమీరు
వచ్చినారలు నా నోటి పజ్జకిటుల। బ్రతుకు మీ కింక చెబుదు దుర్లభము సుండి॥

తే. అతని తద్వచనంబును నాలకించి। ఆ కబంధుని నసురు దురాత్మ జూచి
రాము డిట్లనె లక్ష్మణస్వామితోడ। కరము పరిశుష్యమైన ముఖంబుతోడ॥ 46

తే. కృచ్ఛ్రములమీద కృచ్ఛ్రంబు లిటుల బడసి।సత్యవిక్రమ! దారుణశ్రమలనొంది
నాదు సీతను ప్రియను బొందకయె యయ్యొ। వ్యసనమొందుదు మిటుల
ప్రాణాంత మిపుడు॥ 47

తే. సర్వభూతంబులందు గాంచంగ వత్స! । కాలము బలంబు నెదిరింప వీలుగాదు
అన్న! నన్నును నిన్ను నీ తెన్నుగాగ । వ్యసనముల ముంచివైచె నే మందు
ననఘ?॥ 48

కం. శూరులు, బలవంతులు రణ ! ధీరుల్ శస్త్రాస్త్రవిదులు దైవోపహతిన్
సీదైపోదురు వాలుక ! వారధినా కాలహతిని వారక వత్సా !॥ 50

తే. ఇట్టులనుచును దృఢసత్యవిక్రముండు । దాశరథి కీర్తియుతుడు పరితాపశాలి
లక్ష్మణుని నుదగ్రపౌరుషు రాము గాంచి । స్థిరత జేకొనె తనబుద్ధి ధీరుడప్పుడు॥ 51

69 వ సర్గ సమాప్తి :— ( 2,263 )

★

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### డెబ్బదియవ సర్గ:— (18)

( కబంధ బాహుబంధ ఖండనము. )

తే. రామలక్ష్మణు లిద్దరి భ్రాతృవరుల । బాహుపాశపరిక్షిప్తులైనవారి
యచట వివశులునై యున్నయట్టివారిఁ । జూచుచు కబంధు డిటుబల్కెఁ జోద్య
ముగను॥ 1

తే. భ్రాత లిద్దరు క్షత్రియర్షభులు మీరు । నన్ను జూచుచు నిటుల నిల్చుందు రేల?
వని క్షుధార్తుడ నాకు దైవంబు బంప । వచ్చి రాహారముగ గత ప్రాణులీరు॥ 2

తే. మాట లవి విని యపుడు లక్ష్మణుడు నార్తి । కలగియు పరాక్రమంబు వేగంబు తాల్చి
ప్రాప్తకాలంబు హితమునౌ పలుకు నిట్లు । పలికె నన్నకు రఘుకులతిలకునకును॥

తే. నిన్ను నన్నును నిప్పు డీ నిమిషమందె । మ్రింగు నీ రాక్షసాధము *1డంగవించి
కాన నసిధారఁ గురుతరం బైన వీని । బాహుయుగళంబుఖండించివైత మనఘ॥

తే. భీషణుడు వీడు మరి మహా విపులవపుడు। ప్రబల భుజవిక్రముండౌను రాక్షసుండు
లోక మతిజిత మొనరించి వీక వీడు । మనల హతమార్ప నిచ్ఛించు మనసులోన॥

తే. యాగమధ్యోపనీతంబులైన పశులొ । యనగ నిశ్చేష్టులైయున్న జనుల వధము
జగతిపతులకు కుత్సితంబగునుగాని । ఇట్టి దురితాత్ములన్ జంపు టెపుడుఁగాదు॥

తే. వారి సంభాషితం బిది క్రూరుడసుర । విని మహాకోప మెసగంగ తనదునోరు
తెరచి రౌద్రంబుగా వారి నిరువుర నిక।మ్రింగబోయెను నంగద*2 చెంగలింప॥

* 1 ఱంగవించి = సాహసించి, * 2 చెంగలింప = అతిశయింప.

తే. రాఘవులు దేశకాలజ్ఞ లోఘబలులు । ఖడ్గములచేతనే వాని కరయుగంబు
నరికివైచిరి మూపులవరకుఁ జెలఁగి । లీలమాత్రాన వడి సుసంహృష్టులౌచు॥ 8

తే. దక్షిణకరంబు రాము డా దక్షుఁడుండు । నిజనిశితఖడ్గమును నెత్తి నిమిషమునన
నరికివైచెను స్పష్ట శ్రేసట్టి ఘాటి । సవ్యబాహువు నటులె లక్ష్మణుఁడు నరికె॥ 9

తే. కటకట మహాబాహు డటుల ఛిన్నబాహుఁ డగుచు । పడె మహానిస్స్వనంబునన్ పుడమి నచట
భూమి నాకాశమును దిశల్ మ్రోఁతలెసఁగ । ప్రళయకాలంబు నందలి జలద మేఘుల॥ 10

తే. అటు నికృత్తంబులైనట్టి యా భుజములఁ । జూచుకొంచును దోఁగుచు శోణితమున
దీనుఁడై వాఁడు వారి నా దివ్యతనుల । నడిగె వీరుల "మీరెవ్వరయ్య" యంచు॥

తే. ఇట్లు పడిగెడు రాక్షసు నట్టిఁజూచి । లక్ష్మణుఁడు నంత తత్ శుభలక్షణుండు
ఆ కబంధునితోడ మహాత్ముతోడ । చెప్పఁ దొడఁగెను రాముని గొప్పకథను॥ 12

తే. ఈత డిక్ష్వాకు వంశపూర్ణేందు డగును । రామనామంబున జగాన ప్రథితుఁ డగుచు
నతని తమ్ముండ లక్ష్మణుం డనెడివాఁడ । నన్ను నెరుగుము సత్వసంపన్న నీవు॥

తే. రాము దేవప్రభావు నీ ప్రకటయశుని । విజనవనమున వసియించు వీరవరుని
పత్నిని హరించె యసురు డెవ్వండొ కూళ । ఆమె వెదకుచు యిటువచ్చినాము సుమ్ము॥ 14

తే. ఇంక నీవెవ్వఁడవో చెప్పు; మిట్టు లేల । వనమున కంబధసదృశరూపంబుతోడ
భగ్నజంఘుండవై భూమిపైననోయి । పొర్లెదవు దీప్తమాస్యంబు పొట్టనునిచి॥

తే. లక్ష్మణుం డిట్టు లడుగ నా రక్కసుండు । తత్క్షణంబ కబంధు డాతనికి నిట్లు
పరమ సంప్రీతి బదులు చెప్పంగదొడగె । ఇంద్రువాక్యాల నపుడు స్మరించుకొంచు॥

తే. స్వాగతము మీ కిదే నరవ్యాఘ్రులార! । అహహ! మిముఁజూచునట్టి భాగ్యంబు గంటి
భాగ్యమున నాదు పటు బాహుబంధములును । ఛేదనంబును గాంచె మీ చేతులార॥ 17

తే. మున్ను నాదైన యవినయంబున మహాత్మ! । వికృతరూపంబు నాకిదెట్లుకట వచ్చె
చెప్పెదను నీకు రాఘవ! తప్పకింక । వినుము దాని యథాతథ్య మనఘ నీవు॥

70 వ సర్గ సమాప్తి :— ( 2,281 )

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

డెబ్బది యొకటవ సర్గః— (౭౧)

( కబంధుని స్వవృత్తాంత కథనము. )

తే. మునుపు రామ! మహాబాహు! తనువునాకు । నుండెను మహాబలపరాక్రముండ! నిజము
మూడు లోకాల విశ్రుతంబుగను నదియు । వరలె రూప మచింత్యంబు పరమ పురుష!॥ 1

తే. శక్ర చంద్రార్క వపుడనై సాగుచుంటి । వికృత మీ రూపముం దాల్చి విపిన గతుల
ఋషుల భయపెట్టుచును లోకనికరమెల్ల । కరము బెదరించు చందందుఁ దిరుగు చుంటి॥ 2

తే. అంత, "స్థూలశిరుండు" నా జను మహర్షి । కందమూలంబులకు రాఁగ కానలోకి
వికృత మీ రూపమున నేను వెరపుగొల్పఁ । గోప మతనికి నాపైన గొప్పగలిగె॥

తే. "ఛీ! నృశంసంబు, గర్హితంబైన యట్టి । రూప మిదె నీకు నిల్చుబో రూఢమింక"
అనుచు నను జూచి యా ఋషిప్రవరు డపుడు । ఘోరశాపము నాకిచ్చె దారుణంబు॥

తే. అయ్యో! నా యపరాధాన నైన యట్టి । శాపమిద్దాని కంతంబు స్వామినాకు
చెప్పుమని నేను కుపితు నా ఋషిని వేడ । ఆత డిట్టుల బల్కె శాపాంత మపుడు॥

తే. "ఎపుడు రాముండు విజన మీ విపినమునకు । వచ్చి ఖండించి నీదగు బాహు యుగము
నిన్ను దహన మొనర్చునో సన్నుతుండు । విపులము శుభంబు నీరూప మపుడె వచ్చు"॥

**తే.** శ్రీవిరాజిత సుప్రపుత్రుగా విభుండ । యెరుగు లక్ష్మణ! నన్ను, నా కిట్టిరూపు
ప్రధనభూమిని యింద్రకోపంబు కతన । గలిగె దేవర! వివరింతు కథను దాని॥ 7

**తే.** మహితతపమున నే పితామహుని నేను । మదిని మెప్పింప నాతడు సదయమతిని
దీర్ఘమాయువు నాకిచ్చె పృథ్విలోన; । నక్క మాటలు వెలసె నా కపరిమితము॥

**తే.** దీర్ఘ మాయువు నా కిచ్చె దేవరాజు । శక్రు డింకేమి నను సేయ శక్తుడంచు
గర్వమున నేను చెలగి సంగరములోన । ఇంద్రు నెదిరించితిని జూడ కింక యేమి॥ 9

**తే.** అతని బాహాప్రముక్తంబునై నయట్టి । వజ్రి మద్దాన శతపర్వమున నను
తలయు తొడలును కడుపులోపలికి నిట్లు । త్రోయబడె నావి దేవరా! తూర్ణమపుడె॥

**తే.** నన్ను వధియించివేయుమం చెన్నొ గతుల । వేడినను జంపడయ్యె దేవేంద్రు
డపుడు
"నీకు దీర్ఘాయు వన్న వాణీశు మాట । సత్య మవవలె" నంచు నా శక్రుడనియె॥

**తే.** అస్యు వజ్రింపు వేట్లచే వ్రయ్యలైన । తలయు తొడలును నోరును గలిగి నేను
చిర మనాహారుడను నెట్లు జీవితంబు । గడపు దెట్లు సుదీర్ఘ మం చడిగి తపుడు॥ 12

**తే.** శక్రు డంతట నాకు యోజనము పొడవు । గలుగు బాహుద్వయంబును కరుణనొసగె
మరియు, కుక్షిని తీక్ష్ణదంష్ట్రముల నొప్పు । నోరు నొకదాని కల్పించె నూతనముగ॥

**తే.** దీర్ఘ బాహుల వీని నే దీర్ఘముగను । జాపి యీ వని దిరిగెడి సత్త్వములను
సింహశార్దూలనాగాదిమృగచయముల । బట్టి వడి నీడ్చి తినుచుందు నెట్టివాని॥ 14

**తే.** ప్రభుడు రాముండు లక్ష్మణస్వామి గూడి । వచ్చి యెప్పుడు నీదగు బాహుయుగము
ప్రధనభూమిని ఖండించివైచు నపుడు । స్వర్గమందెదు నీ వంచు వజ్రి యనియె॥ 15

**తే.** వికృత మీ రూపు వచ్చిన వేళనుండి । ఏది గన్పించు నదియె భక్షింపవలయు
నంచు దోచును; నాకింక మంచిచెడ్డ । లేమి తోచవు రామ యింకేమనందు! 16

**తే.** ఇక యవశ్యంబు రాఘవుం డీ వనోర్వి । వచ్చి నాచేత వడి పట్టుబడి, ఖరాసి
నాదు బాహుల ఖండించి నన్ను బ్రోచు । ననెడి యాశను నెట్టులో బ్రతుకుచుంటి॥

**తే.** అట్టి రాముడ వీవె మహాత్మ, వరద । వచ్చినాడవు, భద్రమా ప్రభుడ నీకు
శక్యమే యన్యులకు నన్ను జంప, రామ । సత్యము మహర్షి మాట సంశయము లేదు॥

**తే.** చేతు నేనును బుద్ధిసాచివ్యమోపి; । మిత్రు దెల్పెద నొకని మీకు దేవ!
కార్య సాఫల్యమొనరించు ఘను, గుణాఢ్యు । దేవ । మీచేత నగ్నిసంస్కృతుడ
నగుడు 19

తే. వడిగ దనువంశజుండు కబంధు డిట్లు। పలుక రాముండు ధర్మాత్ము డలఘుయశుఁడు
లక్ష్మణుండును వినగ నా రక్కసునకు। చెప్పె నిట్టుల తనకథ చిత్తమెరియః
తే. నేను తమ్మునితో జనస్థాన కుటిని। వదలి యేపని కోసమో వనికి నరుగ
చూచి యువలీల నా సతిన్ నీచు డొకడు। హా! హరించెను రావణుం డనెడివాడు
తే. పేరు మాత్రి మెరుంగు దా, క్రూరు డెవడొ। రూపమెట్టిదో, వా డెట కాపురంబొ
వానిదైన ప్రభావ మెబ్బంగిదోను। ఎరుగ మిక మేము; చెప్పు మీ వెరుగుదేని॥ 22
తే. మమ్మువంటి యనాథల పట్ల యకట! బహుళ శోకార్తి జెందెడి వారియెడల
దిక్కుగానక యల్లాడు దీనులందు। యుక్తమగాదె కారుణ్య మునుచు టనఘ॥ 23
తే. కాష్ఠముల నాగదంత భగ్నముల బహుళ। శుష్కములదెచ్చి నిన్నింక శూరవరుడ
దహన మొనరింతు నీ వనస్థలమునందె। గొప్ప గోతిని త్రవ్వి యం దిప్పుడేను॥ 24
తే. కాన, నీవింక చెపుమ నా కాంత సీత। నెవ్వడెత్తుకు పోయెనో! యెచట నకలు
సుదతి దాచెనో నిజ మెరుంగుదువ యేని। సలుపు మీయుపకారంబు సఖుడ
మాకు. 25
తే. వక్త రామునితోడ సంభాషణంబు। నొనరుప సమర్థుడైన యా దనుకులుండు
వాక్యము నను త్తమంబు నిబ్బంగిగాగ! పలుకజొచ్చె కబంధుండు లలితఫణితి॥
తే. లేదు నాకు దివ్యజ్ఞాన మేది దేవ!। ఎరుగ మైథిలి; నైన నా యింతి నెరుగు
వాని నొక్కని జెప్పెదు వహ్ని నేను। దగ్ధమై నా స్వరూపంబు దగ ధరించి॥ 27
తే. పావకంబున దహియింపబడక దేవ। సీత నెత్తుకపోయిన చెనటివాని
రాక్షసుని యా మహావీర్యు రాక్షు నెరుగ। నాకు లేదయ్య శక్తి మహానుభావ॥
తే. శాపదోషాన నాదు విజ్ఞాన మెల్ల। భ్రష్టమయ్యెను రాఘవా ప్రభుకుమార
స్వకృతముసనె వికారరూపంబు దేవ! లోకగర్హిత మిది వచ్చె నాకు నాడు। 29
తే. శ్రాంతవాహను డౌచు నా సవిత్రు డింక। అస్తమింపకమున్నె నీ వనఘ నన్ను
అవటమున నుంచి రామ! యీయటవిలోనె। వడి దహింపు యథావిధి వహ్నినిచ్చి॥
తే. అవటమున వీర రఘునందనా! మహాత్మ। దగ్ధుడను నౌచు నీచే యథావిధి నిటు
చెపుదు సీతాపహర్తయౌ చెనటి యసురు। నెరుగువాని, మహాగుణ, సురు
బలాఢ్యు॥ 31
తే. న్యాయవృత్తుని నతనితో యనఘ నీవు। సఖ్య మొనరింపదగును నిక్ష్వాకుతిలక
అతడు లఘువిక్రముండు సాయంబు నీకు। ప్రీతి సేయును, రాఘవా! భీతి విడుము॥
తే. శూరు డతనికి తెలియని చో టొకింత। మూడులోకాల లే దెందు రూఢి రామ
కారణాంతరమున లోక వారమెల్ల। చుట్టివచ్చె నితండు బల్ దిట్ట; మునుపు॥ 33

71 వ సర్గ సమాప్తి.- (2,314)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### డెబ్బదిరెండవ సర్గ - (27)

**సుగ్రీవునితో సఖ్యము చేసికొనుమని కబంధుడు రామునకు సలహా చెప్పుట.**

తే. ఇటు కబంధుండు వడి యా నరేశ్వరులకు।వీరులకు జెప్ప వారు నా విపినమందు
నొక గిరిప్రదరంబున నునిచి యతని । ఘనకళేబరమున కగ్గి ఘనత నిడిరి॥ 1

తే. లక్ష్మణుండు మహోల్కల రగులువాని।దెచ్చి నలుప్రక్కలన్ చితి దీప్తమవగ
పెట్టి వెలిగింప నదియును వేగ మపుడె।ప్రజ్వలించెను సర్వత్ర ప్రభలు నిగుడ॥ 2

తే. తచ్ఛరీరంబు తత్కబంధాసురునిది । ఉరుతరంబును నాజ్యపిండోపమంబు
మరియు మేదస్సుచే పచ్యమానమగుట। మందగతి పావకుండును మండజొచ్చె॥ 3

తే. అంత వేగంబ చితిని నమాంతముగను।త్రోసి వేసి విధూమాగ్నితుల్యముగను
నట్టె లేచె కబంధుండు నరజవస్త్ర।మాల్యముల దివ్యముల దాల్చి మహితబలుడు॥

తే. అంత చితినుండి వేగాన సంతసమున।బహుళ విమలాంబరుండు భాస్వరుడు నొచు
వెడలివచ్చెను సర్వమా యొడలియందు।సందు లేకుండ దాల్చి భూషల నతండు॥ 5

తే. హంసయుక్తంబు, మరియు యశస్కరంబు।భాస్వరంబు విమానంబుపైన నిలిచి
దిశల పదియును నా మహాతేజు డపుడు।రాజితమొనర్చుచుండె స్వప్రభల బరపి॥

తే. అతడటు లంతరిక్షాన ఖ్యాతి నిలిచి । "వినుము, రాఘవ! సీత నీ వే విధాన
పొందగలవో యథాతత్త్వముగ మహాత్మ! । చెపుదు" నంచు కబంధుండు చెప్ప
దొడగె॥ 7

తే. కలవు షడ్యుక్తు లనఘ! లోకంబు లోన । సర్వము విమృశ్యమగును తత్ షట్క
మునన
దుర్దశాప్రాప్తి గనిన మర్త్యుండు రామ!!।తనవలెనె దుర్దశనునున్న మనుజు జేరు।

తే. దుర్దశాపన్నుడవు నేట దోర్బలుండ!।హీనగతినుంటి పే విప్ర నాఁడనుజుడవు
తద్ద వ్యసనంబు దారపరిధర్షణంబు । రామ!ప్రాప్తించె నీ కిట్లు భూమిపైన॥ 9

తే. కాన సుహృదాంవరా! త్వత్ సమాన దుఃఖ।భాగు నొకని యవశ్యంబు బడయ
దగును
సుహృదుగా నీవు; కాకున్న మహీప నీకు।సిద్ధి లేదంచు నోచు మచ్చిత్తమునకు॥

తే. వినుము చెప్పెదు రామ;త ద్విధము వాని।కలఁడు "సుగ్రీవ" నాముండు కపివరుండు
భ్రాతచే శక్రసూనుడా వాలిచేత । క్రుద్ధుచేత నిరస్తుడై కుందుచుండు॥ 11

తే. రమ్య "పంపా"సరోవరప్రాంతమందు। గిరినరము ఋష్యమూకాన హరివరుండు
వీరుడా యాత్మవంతుండు వెగ్గడలైన।వానరుల నల్వురనుగూడి వాసముండు॥

తే. వానరేంద్రుడు తేజస్వి బాహుబలుడు।బుద్ధివంతుండ నమితప్రభుండు ఘనుడు
సత్యసంధుండు, మరి మహాసత్త్వయుతుడు।ధృతియుతుండు, వినీతుండు, ద్యుతియు
తుండు॥ 13

తే. దక్షుడు, ప్రగల్భుడును, మహాత్ముడతండు । పటు బలపరాక్రముండు. సన్మతి
యుతుండు
రాజ్యహేతువునన్ రామ! భ్రాత వాలి।యతని జేసె వివాసితు నతిబలాఢ్యు॥14

తే. అతడు నీకు సహాయుడౌ నాప్తుడగును । సీత వెదకుటయందు నీ కాత డెంతో
తోడుపడు రామ; తప్పక కూడుమతని;।మదిని శోకంబు పడకింక మనుజనాథ॥

తే. ఎద్ది భవితవ్యమో దాని నింక రామ!।యన్యథా నొనరింప శక్యంబె చెప్పుము
చూడు మిక్ష్వాకుశార్దూల! శోకమేల?మహీప! కాలము దురతిక్రమంబు సుమ్ము॥

తే. పొమ్ము శీఘ్రమె యిటనుండి భూప! రామ!।త్వరగ సుగ్రీవు నా మహాబలుని జేరి
అతని నొనరించుకొమ్ము వయస్యుగాగ।దహను సాక్షిగ ద్రోహచింతనము ద్రోయు॥

తే. కపి యితండంచు నతని చుల్కనగ గనకు। కామరూపి కృతజ్ఞుండు రామ!యతడు
వీర్యవంతుండు సుగ్రీవుడార్యవర్య!।మరి సహాయార్థి,తగును మీయిరువురకును॥

తే. అతడు కోరిన కార్యంబు నాచరింప।శక్తులే సుమ్ము మీరలు సవితృకులులు
అకృతకార్యుడు కృతకార్యుడైనగాని।నీపనిని చేసిపెట్టునో నిజ మతండు॥ 19

తే. "ఋక్షరజు"పుత్రుడతడు;త న్మిహిరునకును।ఔరసుండౌను;వాలి యాయన్న చేత
చటుల వైరంబు ప్రాప్తింప శంకజెంది। తిరుగుచున్నాడు పంపాప్రదేశమందు॥

తే. ఋశ్యమూకాలయుఁడును హరీశ్వరుఁడును । నైన వనచారుని వయస్యుగా నరేశ
చేసికొమ్మింక సత్యమ్ము స్థిరత మెరయ । పూని యాయుధనాన్ని ధ్యమునను దేవ॥

తే. లోకమందున రాక్షసుల్ క్రూరమతులు । మరియు నరమాంసభోజనుల్ తిరుగు
చోట్ల
సర్వమెరుగును వానరేశ్వరు డతండు । తిరుగు నైపుణ్యమున నెల్ల తెరువులితడు॥

తే. ఇతని కవిదితమైన దీ క్షితినినెందు । లేదుకించిత్తు రాఘవా ! నృవమ్ము చెప్పుదు
ఆ సహస్రాంశు డస్తమించుదాక వెలుగు । అంతవరకితఁ డెరుగని దనఘ! లేదు॥

తే. నదుల కొండల విపులకందరములెల్ల । మరియు గిరిదుర్గముల నెల్ల హరులఁగూడి
తిరిగి వీక్షించి పత్ని నీ దేవి సీత । వెతకి తేగల డితఁడు కపీశ్వరుండు॥ 24

తే. వానరులను మహాకాయులైన వారి। బంపు నీతండు సీత నీ పత్ని వెదుక
దిశదిశల కీత డింక సందియములేదు । ఊరడిల్లుము రాఘవా! వీరవర్య॥

తే. రావణాలయమందు నిర్మలను, సతిని । త్వద్వియోగాన శోకించు తతనితంబ
సీత నాతండు కనుగొని ఖ్యాతిమీర। తెచ్చి యర్పించు నీకు సందియమువలదు॥ 26

తే. మేరుశృంగాగ్రముననున్న మీదుదైత । ఘోరపాతాళ కుహరాన గూలియున్న
కపికులవరుండు జొచ్చి రక్కసుల జంపి। యా యనిందిత మరల మీ కాత డిచ్చు॥

72 వ సర్గ. సమాప్తి - (2,341)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### డెబ్బదిమూడవ సర్గ - (౭౩)

**సుగ్రీవుని చోటునకు దారి వివరములు చెప్పి, కబంధుడు దివ్యదేహముతో దివమున కేగుట.**

తే. సీతఁ గనుగొనుటందు నీ రీతి యుక్తి। నెలమి నెరిగించి రామున కలఘులీల
వడిగ యర్థజ్ఞు డా కబంధుడును మరల । వాక్య మన్వర్థ మిటుబల్కె వాక్య
విదుడు॥ 1

తే. ఇదియె రామ! శివంబు నీ కెసగు పంథ । పుష్పితద్రుమతతుల సొం పొలయు
చుండు
దిశ ప్రతీచినిఁ జూడు మెంతేని కాంతి। నెలయుచుండు మనోరమం బీ వనోర్వి॥2

సీ. అశ్వత్థ, జంబూ, ప్రియాళు, తిందుక, చూత। న్యగ్రోధ, కర్ణికా రాగ్నిముఖ్య
ప్లక్ష, ధన్వన, నాగ పనస నీ లాశోక । నక్తమాల, కదంబ, నాళికేర
పారిభద్ర, సురక్త బహుపుష్ప తాశోక। కరవీర, కురవక, సరళ, తిలక
భల్లాత, కేతకీ, బదరీ, కురంటక । క్రముక, ఖర్జూరాది ద్రుమజతతులు। 5

తే. నెసగు నీపంథ, వానిని నెక్కియైన । కూల్చియైనను బలిమిని కోర్కిదీర
ఫలము లవ్వాని నమృతకల్పముల మీరు। చక్క భుజియించుచును దాటిచనుడు
మీరు

తే. వనము పుష్పిత పాదపం బద్ది దాటి। నందనప్రతిమంబు వనం బొకండు
గనెద రుత్తరకురు దేశమునకు సాటి । సర్వకామఫలద్రుమసంతతులను॥ 6

తే. వనము చైత్రరథంబు నం దనగ నచట। ద్రుమజతతులవ్వి బహుమధుస్రవములగును
సర్వఋతువులు వెలయు నచ్చట సతంబు । సర్వకాలఫలంబు లొసంగుతరులు॥ 7

తే. అట మహావిటపంబుల పటిమఁ దాల్చి । తరులు ఫలభారమున వంగి క్రమముశోభ
గాంచుచుండును రామ! యెక్కాలమునను । మేఘపర్వతసమములై మిన్నునంటి ।

తే. పానసెక్కెదొ, కూల్చెదో జలము పేర్మి । ఫలము లవ్వాని నమృతకల్పములనింక
లక్ష్మణుఁడు తెచ్చి యిచ్చు నో రామ! నీకు । ప్రీతి నవ్వాని నీవు సేవింపఁగలవు ॥ 9

తే. వనము వనసీము వనమును వరుసదాటి । శైలమున నుండి శైలంబు లీల గడచి
దేశముల నుత్తమంబుల దిరిగి తిరిగి । పిదప పంపాసరస్సుఁ జేరెదరు మీరు । 10

ఆ. కరకురాళ్లు లేక కాలు జారుట లేక । సమము రేవులొప్పి సైకతముల
పులినతలములొప్పి పద్మాల కమలాల । నా సరస్సు బొల్చు నాచు లేక । 11

తే. అచట హంసలు ప్లవములు క్రౌంచములును । కురరములు రాఘవా! చక్ర
గూయుచుండు
వల్గురవముల, సతము పంపాసరస్సు । సలిలములలో విహారంబు సలుపుచుండు ॥ 12

తే. నరులఁగాంచి భయంబు చెందవు మహాత్మ! । వనము మున్నెన్న డెఱుఁగని పక్షులవ్వి
స్థూలములు, నేతిముద్దలు, సుందరములు । వహ్వా! భక్షింతురు మీరా తత్ పక్షి
తతుల ॥ 13

తే. రొయ్యమీనులు, బొంతమీలు, రోహిజాతి । మీలు, బలిసినమొంటిముల్
మీలు, రామ ॥
కలవు కొల్లలుగాఁగ పుష్కరిణి నచట । లక్ష్మణుఁడు వాని బాణాల రహిని బట్టి ॥ 14

తే. చర్మమును రెక్కల నతండు చక్కనొలిచి । వరుస ఇనుపశలాకలనైన గ్రుచ్చి
పక్వమొనరించి నీకిడు భక్తిమీర । శ్రేష్ఠమత్స్యంబు లవ్వి భక్షింతు వీవు ॥ 15

తే. పంపమత్స్యంబు లీవు భక్షింపుచుండ । తమ్ము డీతండు జని పుష్పతతుల మధ్య
పద్మగంధమ్ము నమ్ము శివమ్ము జలము । రామ! సుఖశీతలమ్ము ననామయమ్ము ॥

తే. తెచ్చి పుష్కర పర్ణాల దేవ! నీకు । త్రావనిచ్చును సతము నిర్మలము లనఘ!
మఱియు, స్ఫాటిక రౌప్య సమంబు లవ్వి । త్రావి హాయిని గనెదు నిరంతరంబు ॥

తే. అడవిపందులు స్థూలంబు లద్రిగుహల । నిద్రజెందెడునవి తృష్ణ నీటి కొఱకు
నరుగుదెంచుచు వృషభంబుల నడింప । తాత! చూతువు రూపవంతముల నచట ॥

తే. రామ! సాయాహ్నముల విహారంబు నీవు । సలుపుచ చొప్పెటి, పుష్పమాలల
ధరించు
ద్రుమతతినిఁ జూచి పంపాసరోవరాన । శీతలజలంబుఁ జూచి పాసెదవు వ్యథను ॥ 20

తే. పూలువిరియంగబూసిన భూరుహములు।నక్తమాలల తిలకాల నాథ! కనెదు
ఫుల్ల పంకజములను, నుత్ఫుల్ల కమల।షండముల నీవు గనెదు పుష్కరిణి నచట॥

తే. పంపఁ గొల్లగనున్న యా వర సుమాలి। నాథ! ధరియించు నరు డెవం
డచట లేడు
వాడ వా పువ్వు లెప్పుడిసుమంత గాని।రాలి పోవెప్డు తత్పుష్కరంబుమహిమ॥

తే. ఉండిరి మతంగ శిష్యు లా దండ మునుపు। గురునికై వన్యముల వారు గొంచు
జనగ
స్వేద బిందులు నేలపై చెదరి యవియె।పూవు లగుట నశింప వా మునులమహిమ॥

తే. వార లందరుఁ జనినను స్వర్గమునకు। వారి పరిచారిణి యొకర్తు వనములోన
శ్రమణి "శబరి" యనంగ నచ్చటనె కలదు।నేటికిఁ జిరజీవినై నృపవరేణ్య॥

తే. సతము ధర్మంబుననె నిల్చు స్థవిర శబరి। సర్వభూతనమస్కృతు శక్రతుల్య
రామ కాకుత్స్థ, నీదు దర్శనమొనర్చి।స్వర్గలోకము జనునుండె వసుధనిటుల॥ 26

తే. అంత పంపాసరస్తీర మాశ్రయించి। పశ్చిమం బీవు జనిన తత్పార్శ్వమందు
ఆశ్రమస్థాన మతుల గుహ్యం బొకండు।కానిపించును కాకుత్స్థ కాన! లోన॥ 27

తే. కలవు వివిధంబు లచట యేన్గులు మహాత్మ।తిరుగుచుండును వనములోగిరులదరిని
కాని, పోజాల వాశ్రమస్థానమునకు।ఋషి మతంగు ప్రభావమట్టిది,నరేంద్ర॥ 28

తే. అవని నందనసంకాశ మా వనోర్వి। దేవతారణ్యసమము సందియములేదు
విభుడ! రమియింతు వచట నిర్వృతిని జెంది।నిజము నానావిహంగ సంకీర్ణ మద్ది॥

తే. పంప ముందరె కలదు పో పర్వతంబు। ఋష్యమూకంబు పుష్పిత భూరుహంబు
సతము శిశునాగతతుల రక్షితమునౌట। అలవి గా దేరికిని నెక్క నద్రియద్ది॥ 31

తే. బ్రహ్మనిర్మించె మున్నుదారంబు దాని। శైలమద్దాన నిద్రించి స్వప్నమందు
ధనము నెద్దాని నరుడు పొందునో మహాత్మ। అదియె మేల్కొన్నపిదపయునాత
డొందు॥ 32

తే. కల్మషాచారులును పాప కర్ము లెప్పుడు।రామ! యెక్కంగలేరు త ద్భూమిధరము
ఎక్కినన్ వాని సుప్తుని రక్కసులును। పట్టి చంపుదు రపుడె ధ్రువమ్ము సుమ్ము॥

తే. పంప క్రీడించు శిశునాగ పటలి రవళి। మరి, మతంగాటవీ చర ద్విరద రవము
రామ! వినుపించుచుండు నిరంతరంబు। కొండ నద్దాన గొప్పగా గురుభుజుండ!॥

తే. మేఘవర్ణంబులైనట్టి మేటికరులు । కను బలిష్టంబు లొక్కొక్కప్పుడు చెలంగి
రక్తధారలుగాక పరిప్లుతంబు । పొడుచుకొని, పీడి, వేర్వేర బోవు చుండు ॥ 36

తే. శీత ముదకంబు విమలంబు తృప్తిదీర । పలుక కనుపులునిండ యా వనగజములు
త్రావి నిర్వృతిజెంది యరణ్యమునకు । తిరిగి పోవుచునుండు ఘీంకృతులు సెలగ॥

తే. క్రొవ్విశితులను గొప్పవౌ ఋక్షములను । నీలకోమలక ప్రభల నిండియుండి
వెరపు నెరుగని మృగముల వరసి, రామ । మరచి పోదువు దుఃఖంబు మదిని నీవు॥

తే. శైల మద్దాని యందొక్క స్థలమునందు। గొప్ప గుహయొండు కలదు; తద్గుహా
ముఖాన
బంధ రాయొండు మూతగా నుండుచుండు।రామ! దానిజొరంగ బలశ్రమము
సుమ్ము॥ 39

తే. గుహకు ప్రాగ్ద్వారమున గొప్ప కొలను కలదు।సతము శీతోదకంబుల వితతమద్ది
బహుళ మూలఫలాన్వితం బగును నెప్పుడు । రామ! నానామృగయుతంబు రమ్య
మరయ॥ 40

తే. ఆ మహాగుహయందె నివాసముండు । స్వామి సుగ్రీవు డెపుడు తత్ సచివవరుల
వానరుల నల్వురను గూడి; వచ్చుచుండు । మరి విహారార్థ మెపుడైన గిరిశిఖరికి॥

తే. ఇటు కబంధుండు సంప్రీతి యెంతొ వెలయ।సర్వముం జెప్పి రామలక్ష్మణులకపుడు
స్రగ్వి, భాస్కరవర్ణవిరాజితుండు । కృతి పరాక్రమశాలి నింగిని వెలింగె॥ 42

తే. ప్రభ నభంగతు నా మహాభాగు దరిసి।"అనఘ! నీవింక పోవచ్చు"ననుచు జెప్పి
రామలక్ష్మణు లప్పుడే రయము మీర।తరలిరి కబంధు వీడ్కొంచు దారిబట్టి॥ 43

తే. పొందహో కార్యసంసిద్ధియుండు మీకు । అనుచు వారికి చెప్పుచా యమిత తేజు
డా కబంధుండు వారల యాజ్ఞనొంది । తరలిపోయెను సుప్రీతి తనదుదారి॥ 44

తే. రూపము కబంధు డద్దాని రూఢినొంది । అల్ల భాస్కరతుల్య దేహంబు వెలుగ
ఖగతుడై త్రోవజూపి రాఘవుని జూచి।'సఖ్యమొనరింపు తప్పక'ం చనుచు జనియె

73 వ సర్గ సమాప్తి - 2,386



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్య కాండము

### డెబ్బదినాలుగవ సర్గ - (74)

శబరీ సందర్శనము - శబరి రాముని పూజించి, స్వర్గమున కేగుట.

తే. అటు కబంధుండు పంపకుబాట దెలుప । నృపవరాత్మజు లపుడె ప్రతీచి దిశకు
పయనమైపోవ దొడగిరి రయముమీర । వనము సర్వంబు జూచుచు వరుసతోడ॥1

తే. గహనశైలాలనిండిన క్షౌద్రికల్ప । తత ఫలద్రుమతతుల నెంతయును గనుచు
అల్ల సుగ్రీవువీక్షింప నరిగి రపుడు । రామలక్ష్మణు లా మహాప్రథిత యశులు॥ 2

తే. శైలపృష్ఠాననచట వాసంబుసలిపి । రాత్రి రఘునందనులును మర్నాడు కదలి
పంపపశ్చిమ తీరంబు పెంపుమీర । చేరి రా రామలక్ష్మణుల్ శీఘ్రగతిని॥ 3

తే. పంప కా పుష్కరిణి కటు పశ్చిమంబు । తీరమును జేరి వారు పెంపారుప్రీతి
చూచి రచ్చట రమ్యమై సొంపునింపు । శబరి యాశ్రమమును వనస్థలిని నెదుట।

తే. అచట బహువిధద్రుమంబుల నావృతమయి । చూడగ సురమ్యమగుచు నేజాడఁ గనిన
వెలయుచుండు న త దాశ్రమం బలఘుయశులు । గనుచు శ్రమతను శబరిని గాంచి రెదుట॥ 5

తే. వారి జూచిన యంత నా పరమసిద్ధ । అట్టె లేచి కృతాంజలి యగుచు నపుడ
రాముపాదాలబట్టెః- యా లక్ష్మణునియు ।ధీమతుని పాదముల బట్టె వృద్ధ శబరి॥6

తే. పాద్య మాచమనీయంబు పరమభక్తి । శబరి సర్వంబు నిచ్చె దాశరథుల కొగి
అంత రాముండు శ్రమణి నిట్లనుచు నడిగె । సంశితవ్రతనా పెను సాధుమతిని॥

తే. విఘ్నంబులె విఘ్నముల్ నీకు శబరి ? తపము వర్ధిల్లునే తపోధన ! సతంబు
నియతమే క్రోధమది నీకు నిరుపమాన ? అటులె యాహారమును నియతంబె నీకు॥

తే. నియమముల్ నియమంబులన్ బడసినావె? మనసు సుఖముండునే నీకు? మమత బాతె?
గురుల సేవ సఫలంబె గుణగణాఢ్య ? చారుభాషిణి! కుశలమే సర్వమిచట॥ 9

తే. రాము డా తాపసిని నిట్లు ప్రశ్న సేయ ? సిద్ధసమ్మత సిద్ధ యా వృద్ధ శబరి
రామునకు నిట్లు ప్రత్యుత్తరంబు ప్రీతి । చెప్పదొడగెను నెంతయు చిత్తమలర॥ 10

తే. నాకు నేడె ప్రాప్తించె నాకిట తపముసిద్ధి ? నీదుసందర్శనంబున నిక్కముగను
నాకు నేడె సఫలంబు తప్తంబు తపము రామ ! గురుల శుశ్రూషఫలమును నొందితి నిపుడె॥ 11

తే నాకు నేడె సఫలంబు నాజన్మ మిందునందు । స్వర్గ మరచేతి దయ్యె యిప్పట్టునందు
దేవవర ! రామ ! పురుషర్షభా ! విభుండ ! నిన్ను పూజించుటన్ జేసి నిజము నాకు॥ 12

తే! నరవర ! నిను సౌమ్యచక్షువుల దృష్టి । పూతనైతిని రఘునందనా ; తరిస్తి
పోదు నక్షయలోకాల కో దయాళు । త్వత్ప్రసాదాన నో యరిందముడ విభుడ॥

తే. చిత్రకూటంబు నీ వట్లు చేరి నపుడె । వర విమానంబు లతులప్రభంబు లెక్కి
ఇచట నుండి దివంబున కెగసి చనిరి । స్వామి! నేనిట శుశ్రూష సలుపు గురులు॥

తే. వారు ధర్మజ్ఞు లా మహాభాగులపుడె । చెప్పిరి మహర్షు లిటు నాకు చేరి చనుచు
"వచ్చు రాముండు నీ యాశ్రమంబునకును । ఈ సుపుణ్యాంబునకు నంచు" నింక ననిరి॥ 15

తే. అపుడు సౌమిత్రితోసహా యతిథులుగను । భక్తివారిని పూజింప వలయునీవు
చక్షులను రాము జూచి యక్షయ్యమైన । పుణ్యలోకాల నీవును పొందు దనిరి।

తే. వివిధముల వన్యముల నేను వితతభక్తి । కూర్చియుంచితి రామ ! నీ కొరకుగాగ
స్వామి! పంపాసరస్తీర సంభవములు । కడు ప్రశస్తంబు లివ్వి రాఘవ! మహాత్మ॥

తే. శబరి యిటు బల్క రఘుకులస్వామియపుడు । రామచంద్రుండు పరమధర్మాత్ము డలరి
నిత్య మబహిష్కృతైక నిర్నిద్రవిజ్ఞ।నాపె నీక్షించి యిటుబల్కె నానృపుండు॥

తే. దనుసుతుండు మహాత్ముండు ఘనత జెప్ప।వింటి నీదుప్రభావంబు; వింటి మరియు
నీదుగురువుల మహిమయు సాదరమున । ఇంక ప్రత్యక్ష మీక్షింప నిచ్చగింతు॥

తే. ఇష్టముండిన యింక చూపింపుమనిన । నలరి శబరియు రామునాజ్ఞంబు నుండి
మాటవెడలుటె తడవుగా మహిమ లొప్ప ! తద్వనంబెల్ల వారికి తపసి చూపె॥
తే. చూడు, మేఘఘనప్రఖ్య మేడ జూడ।బహుళ మృగపక్షి సంకులం బగుచునుండు
ఇదె "మతంగవనం"బంచు నెల్లయెడల । విశ్రుతంబయ్యె రఘుకుల వీరవర్య॥ 21
తే. భావితాత్ములు నా గురువర్యులిచట । ఈ మహావనమందు శ్రీరామచంద్ర
మంత్ర వేత్తలగూడి సన్మంత్రపూత । యుతము తీర్థంబు లొనరించి రతులలీల॥
తే.ఇదియె ప్రత్యక్ స్థలీవేది;యిటనె రామ।గురులు నాచే సుసత్కృతుల్ కరయుగములు
శ్రమను నుద్వేపనము జెంద సదమలమతి।బ్రీతిపుష్పోపహారంబు లిడుచునుండ్రి॥
తే. వారల తపఃప్రభావాన నౌరచూడు । వేదు లతులప్రభంబు లే వేళ గూడ
సర్వదిశలను తమకాంతి బర్వజేసి । వెలుగజేయుచునున్నవి వీర, రామ॥
తే. రామ! ఉపవాస సుశ్రమాలసులు గురులు।వణకుగ నశక్తులై యెడందనునొకింత
తలచినంతనె వచ్చి ప్రత్యక్షమిచట । గ్రాలినవి చూడు సప్తసాగరములౌర॥
తే. సప్తసాగరముల నట్లు స్నానమాడి । తాపసులు వార లీ వన స్థలమునందు
పాదపంబుల గట్టిన వల్కలములు । సుంత యెండవు నేటికి వింతచూడు॥ 26
తే. దేవపూజకుగాను నీ దివ్యమునులు । కువలయంబుల పుష్పాల గూర్చి శ్రద్ధ
గట్టియుండిన మాల లీ కాలమునను । వాడకున్నవి చూడు మహాత్మ మహిమ॥
తే. కృత్స్న మీ వన మనఘ వీక్షించి తీవు।వినగ వలసిన దెల్లను వింటి, వింక
నా కనుజ్ఞ నొసంగిన లోకనాథ ! విడుతు నిక నీ కళేబరం బిటనె రామ॥ 28
తే! మున్ను పరిచారిణిగ నేను భువిని నున్న।భావితాత్ముల చెంత కా పరమ మునుల
చెంత కేగంగ నిచ్ఛింతు స్వాంతమందు।నన్ను బంపుము రామ,యానతి నొసంగి॥
తే. పలుకు ధర్మిష్ఠ మీ రీతి పలుక శబరి । రామలక్ష్మణు లాలించి రాజసుతులు
ఔర! అతులప్రహర్షంబు నంది రెదల।మరియు నాశ్చర్యపడిరి సర్వంబు నెరిగి॥30
తే. సంశితవ్రత శ్రమణి నా శబరి నరసి । రాము డిటుబల్కె నాపెతో ప్రేమమీర
"అర్చితుడనైతి నీచేత నధికభక్తి ! పొమ్మిక యథాసుఖమ్ము శుభమ్ము లెరువు"॥
తే. రాము డిటులన నప్పుడే శ్రమణి శబరి । చీరకృష్ణాజినాంబర వృద్ధ, జటిల
జీర్ణ దేహంబు నట్టులే క్షితితలాన।విడిచివైవంగ నిచ్ఛించి తడయ కింక॥ 32
తే. రామచంద్రు ననుజ్ఞను రహిని బడసి। అల హుతాశనమందు దేహంబు నునిచి
హుతమునొనరించి స్వర్గంబునొందెనప్పుడె।చండ జాజ్వల్యమానాగ్ని చందముగను॥
తే. దివ్యమాల్యానులేపన దివ్యవసన । దివ్యభూషణసంయుక్త దివిని నెల్ల
వితత సౌదామిని యనంగ వెలుగఁజేసి।కరము ప్రియదర్శనయు నయ్యె కాంతశబరి॥
తే. ఆ మహర్షులు తత్సుకృతాత్ములె చట।హాయివిహారింత్రో యట్టి పుణ్యప్రదంబు
స్థానమును జెందె నప్పుడే శ్రమణి శబరి । మహిత తపమున నాత్మసమాధిబలిమి॥

74 వ సర్గ సమాప్తి - (2,421)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## అరణ్యకాండము

### ముప్పదియవ సర్గ – (30)

### రామలక్ష్మణులు పంపాసరస్సుఁ జేరుట

తే. దివము నట్టుఁ శబరి స్వతేజమునన । చేరిపోవం జూచి యాక్షితివిభుండు
రామచంద్రుఁడు లక్ష్మణ స్వామిగూడి । చేసె యోచన నిట్టులగ చిత్తమందు॥

తే. ఆ మహాత్ముల పుణ్యప్రభావ మప్పుడు । చింతనముజేసి ధర్మాత్ముఁడెంతొ మదిని
తమ్ము లక్ష్మణు నేకాగ్రు నెమ్మి నరసి । అన్న హితకరు డతనితో ననియెనిట్లు॥

తే. అరసితిమి యామహాత్ముల యాశ్రమంబు।ధరణి సౌమ్య! బహ్వైశ్వర్యకరముగాదె
బహుళ విశ్వస్త మృగసింహ వారమద్ది।వితత నానావిహంగ సేవితము,నిజము॥ 3

తే. సప్తసాగరతీర్థాల స్నానమాడి । విధియుతంబుగ లక్ష్మణా ! పితరుల కిట
తర్పణము భక్తి గావించి ధరణిలోన। ధన్యులమునైతి మోయి సద్ధర్మచరిత॥

తే. నాశనముజెందె యీ యమంగళములన్ని । ఇంక కల్యాణమే సమీపించు మనకు
కాన,సంతోషమొదవు నా మానసమున; ! మదికెదద తోచు మున్ముందు
భావిశుభము॥ 5

తే. కాన, పోదము రమ్ము శీఘ్రమ్ము! వత్స!। పంప ప్రియదర్శనన్ జూడ పెంపుమీర
ఋష్యమూకాద్రియును నట కెంతొ దూర । ముండ దటగాదె లక్ష్మణా !
దండితారి!॥ 6

తే. అంశుమంతసుతుండు ధర్మాత్ముడతడు । అటనె సుగ్రీవు డుండు నం చనిరి కాదె!
నిత్యమును వాలిభయమున నీతి యుతుల । కపుల నల్వురతో నట కాపురమట॥

తే. వానరర్షభు సుగ్రీవు నేను జూడ । త్వరపడుచునుంటి లక్ష్మణా ! స్వాంతమందు
ఇంక తదధీనమే కాదె యింతిసీత । నవని వెదికెడునట్టి కార్యంబు తాత!। 8

తే. ఇట్టుల వచించునట్టి యా యినకులేశు । ధీరు రాముని జూచి, "సందేహమేమి
అన్న ! పోదము; త్వరపెట్టుచున్న దనఘ । నాదు మదిసైత"మంచు నా
సోదరు డన॥ 9

తే. వీడి యాశ్రమ మద్దాని వేగ నప్పుడే । ఆ విశాంపతి శత్రువీరాపహుండు
లక్ష్మణుని గూడి పంపాసరస్సు నైపు । వెడలె త్వరితంపు నడకల నడవిదారి॥

తే. తలపగ నుదారజనసేవితమ్ము శుభము । పృథివి నానాద్రుమలతాప్రకీర్ణ మెప్పుడు
పంప పానీయవాహిని పరమపుణ్య । తీర్థ మయ్యది చూచి రా దేవనిభులు॥ 11

తే. పద్మసౌగంధికముల తామ్రమ్ము నగుచు।శుక్లమగుచును కుముదరాసులను,గనగ
కువలయోద్ఘాటముల నీల భువనమగుచు।వివిత బహువర్ణ కుథవలె నెలిగె కొలను॥

తే. అట్టి పంపకు నరిగి మహామహుండు । రాము డచటికి కొంత దూరాననున్న
అల " మతంగసరస్సు " నా వెలయునట్టి । ఉదకవాహినిలో స్నాన మొగి
నొనర్చె॥ 13

ద్వి. రమ్యారవిందోత్పలంబుల తోడ । పద్మసౌగంధిక పటలంబుతోడ
పుష్పితామ్రద్రుమపుంజకుంజముల । బర్హిణోద్ఘుష్ట సంభరితాచ్ఛతటుల
తిలకంబులను ధవంబుల బీజపూర । తరువుల శుక్లద్రుతతుల నెల్లెడల
పుష్పితకరవీరభూరుహంబులను । పున్నాగతరుల సుపుష్పితంబులను
మాలతీ కుంద గుల్మముల సర్వత్ర । భాండీర నిచుళ సంభరిత భూములను
సప్తపర్ణాశోక సకేతకముల । అతిముక్తకంబుల నన్యవృక్షముల
వివిధంబులను నేల వింతగా జూడ । ప్రమదభూషితనాగ "పంప"యు నెలుగ
నరయుచు పుష్పాఢ్య మన్నిచోటులను । విపులద్రుమంబుల వెలయగాంచుచును
కోయష్టికంబుల కూయుకేరముల । వితతార్జునంబుల శతపత్రములను
మరి యన్యవిహగాల మహిత మా వనము । నాదితంబగుచుండ సోదరుల్ వారు
సుసమాహితులనౌచు సూర్యవంశజులు । అవ్యగ్రమనమున నా సరస్తీర
వనమెల్ల గనుచును వడిజేరి రప్పుడు । శీతలవారినిధిక్ క్షితివరాత్మజులు
శుభము నా "పంప"ను శుభదపున్నాగ । వర వకుళోద్దాల వంజుళ తిలక
పుష్పితాశోక సంపూర్ణమా దాని । సతము శకుంత కూజితముల దాని। 20

తే. వివిధవృక్షాల, కొలకుల వివిధములను । గనుచు కామాభితప్తుఁడై మనుకులుండు
రామచంద్రుండు పరమ మహా హ్రదముగాంచి । రహి సమీపించె తానును
లక్ష్మణుడును॥ 21

తే. పుష్పితాశోకవనోపేత పుణ్యసరసి । సాల చంపక శోభిత శ్లక్ష్ణసికత
. షట్పదౌఘసమావిష్ట సంతతంబు। స్ఫటిక తోయాఢ్య, శ్రీయుత, పరమసుషమ॥

తే. పద్మసౌగంధికన్ "పంప"ఁ బ్రభువసుంధు।సత్యవిక్రము డా రామచంద్రమూర్తి
మరల యారసి యిట్టుల లక్ష్మణునకనియె॥ 22

తే. కిసలితాకంబునను పుణ్యపృథ్వీధరము । రమ్యపుష్పితపాదపప్రకరమగుచు
ధాతుమండితమగుచు విఖ్యాతి నుండు । ఋశ్యమూకం బటంచుగా చెప్పబడియె॥

తే. కేశపతి యా మహాత్ముని ఋక్షరజుని । క్షేత్రమందున పుత్రుఁడై క్షితి జనించి
మరి మహావీర్యుఁడను కీర్తిఁబరగినట్టి । చండ సుగ్రీవుఁ డా గిరి నుండు నంట॥ 26

తే. "పురుషపుంగవ లక్ష్మణా! పొమ్ము నీవు।అల్ల సుగ్రీవుచెంత కం" చనుచు విభుఁడు
సత్యవిక్రము లక్ష్మణ స్వామి సరసి । మరల శ్రీరాము డిటుబల్కె మదిని కలఁగి॥

తే. దైన్యగతుఁడ, రాజ్యభ్రష్టుఁడైన వాఁడ, । సాధ్వి నాసీతపైన యాసక్త మతుఁడ
తమ్ముఁడా! యాపె లేకింక ధాత్రి నెట్లు । క్షణము జీవింపగలను లక్ష్మణ కుమార॥

తే. తమ్ము డతని కనన్యచేతనున కిట్లు । చెప్పి మదనాభి పీడితుం డప్పు డెట్లొ
అల మనోరమ "పంప" నా నళినిఁ జేరె।వితత శోకవిషాదయంత్రితుఁడు నృపుడు॥

తే. అడవిని, సుదూరసంక్రమం బడ్డ్వ మల్ల।గనుచు క్రమముగ జని శుభకాననంబు
జగతి నానావిధాండజ జాలకంబు।"పంప"ఁ జేరిరి యా రఘూద్వాహులు ఘనులు॥

75 వ సర్గ సమాప్తి :— ( 2,451 )

అరణ్యకాండ సర్వం సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

సీతా కపీంద్ర క్షణదాచరాణాం
రాజీవ హేమ జ్వలనోపమాని
సుగ్రీవ రామ ప్రణయప్రసంగే
వామాని నేత్రాణి సమం స్ఫురంతి॥

సీత వాలి నిశాచరనేతలకును
వామనేత్రాలు రాజీవ హేమ వహ్ని
సమములు స్ఫురించె సమముగా చటుకు నపుడె
రామ సుగ్రీవ సఖ్య సల్లాప వేళ ॥

(కిష్కింధ కాండ 5 వ సర్గ - 32 వ శ్లోకం)


గ్రంథకర్త

మానికొండ సత్యనారాయణశాస్త్రి, బి. ఏ., బి. యల్.,



ఉరుటూరు
1960

వెల : పోస్టేజికాక ప్రతి 1 కి రు 4-0-0

ప్రకాశకులు : ప్రతులు దొరకుచోటు :

మానికొండ సత్యనారాయణశాస్త్రి, బి. ఏ., బి. యల్.,
ఉప్పటూరు. పామర్రుపోస్టు, కృష్ణాజిల్లా.



మొదటికూర్పు : 500 ప్రతులు
శార్వరి సంవత్సర చైత్ర శుద్ధ ప్రథమ– సంవత్సరాది
జయవారము 28—3—1960



ము ద్ర ణ :
గ్రామస్వరాజ్య ప్రెస్
విజయవాడ – 2.

# అంకితము

కిష్కింధ సమీపమున హంపీక్షేత్రమున 'వేంచేసియున్న

## శ్రీ విరూపాక్షునికి

శా॥ పంపాతీరమునన్ ధరాసుతకునై వాపోవుచున్ వెఱ్ఱియై
పెంపేదఁగ విముఖుండునైన రఘుపృథ్వీభర్తకున్ శోకమున్
డింపన్ తోడుగనున్న సోదరకృపన్ కిష్కింధకాండన్ కృతిన్
హంపీక్షేత్రప! స్వీకరింపుము విరూపాక్షా! విభో! రక్షకా!

# గ్రంథకర్త్రు నివేదన

కిష్కింధకాండ రచన 1947 జులై 19 వ తేదీన ప్రారంభమై, 15-3-1948 నాటికి ఎనిమిది నెలల కాలములో ముగిసినది. పన్నెండు సంవత్సరముల అజ్ఞాతవాసానంతర మిప్పుడు ఈ వ్రాతపతి అచ్చునబడు భాగ్యము కలుగుట శ్రీరామకృపావీక్షణము. శ్రీస్వామికివే కై మోడ్పులు.

దీని తరువాతకాండ సుందరకాండ, ఎన్నడో 12 ఏండ్ల క్రిందటనే, ప్రప్రథమముగ ముద్రితమయియుండెను. ఇక, మిగిలియున్న వ్రాతప్రతి యుద్ధకాండదే. అదెన్నడో బయట పడుట! "నందో రాజా భవిష్యతి" ఈ అరణ్య కిష్కింధకాండలను, లోగడ పన్నెండేండ్లనాడు సుందరకాండను చక్కగ శ్రద్ధగా ముద్రించి యిచ్చిన "గ్రామస్వరాజ్య" ముద్రణాలయ నిర్వాహకులు చిరంజీవులు ఉప్పులూరి వారి వంశాబ్ధిచంద్రులకు మార్కండేయాయుర్భాగ్యములు గలుగుగాక యని నా దీవన.

మానికొండ సత్యనారాయణశాస్త్రి.

28—3—1960.

# కిష్కింధకాండ - విషయసూచిక



విషయము | పుట సంఖ్య

–: కిష్కింధకాండము సర్వము సంపూర్ణము :–

# — తప్పు ఒప్పుల పట్టిక —

| పుట | : పం_క్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 51. | 11. | యిప్పుడే | యిప్పు డీ |
| 64. | 16. | దీకుసతతంబు | నీకు సతతంబు. |
| 76. | 23. | అమ లఘర్మంబె | అమల ఘర్మంబె |
| ,, | 25. | నీయెడ లసర్వాధా | నీయెడల సర్వాధా |
| 123. | 11. | చెలిమిగాంచి | బెలిమిగాంచి. |
| 182. | 7. | స్వీయతమున | స్వీయతపమున |
| 215. | 15. | గడుపు | గడువు. |



# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### మొదటిసర్గ — (130)

**పంపాతీరశోభగాంచి, రాముడు సీతనుదలంచి, వాపోవుట – లక్ష్మణుడూరడించుట – ఇరువురు ఋష్యమూకమును సమీపించుట.**

తే. సరస పద్మోత్పలాచ్ఛఝషాకులంబు । పుష్కరిణి దాని జేరి యా భూవిభుండు
ప్రభుడు రాముండు కడువిలాపంబు జేసె । ఆకులేంద్రియుడై కటా! యనుజుగూడి॥

తే. ఆ సరస్సునుగనినంత హర్షమునను । ఇంద్రియంబులు పతికి చలించెనపుడ
కామవశుడౌచు నతడు లక్ష్మణున కిట్లు। చెప్పదొడగెను రాముండు శ్రీయుతుండు॥

తే. చూడు! సౌమిత్రి! పంప బల్ శోభ లెసగు।కమ్రవైడూర్య విమలోదకంబు,వత్స!
ఫుల్ల పద్మోత్పలంబుల పొల్పు మీరు । కాంతి శోభించు వివిధద్రుసంతతులను॥

తే. తమ్ముడా! చూడుమీ! శుభదర్శనంబు । పంపతీరంబు కాననం బింపు గుల్కు-
పుడమి రాజిల్లు శైలాభముల్ ద్రుమంబు । లెందుజూచిన శిఖరసంవృతములనగ॥

తే. భరతు దుఃఖాన, వైదేహిహరణమునను । అకట శోకాభిసంతప్తుడైన నన్ను ।
కరము పీడించుచున్నట్లు గానిపించు । తమ్ముడా! చూడు! మాధవుం డమ్మ లేసి॥

తే. కనగ శోకార్తుడైన నాకును కుమార। పంప రమణీయముగ దోచు, నింపుగొల్పు
చిత్రకాననమిది చూడ ధాత్రి నెందు । శివజలంబుల పుష్పాల శ్రీ జెలంగు॥ 6

తే. నళినసంఛన్నమయ్యు గనంగ వత్స! । తనరు నత్యర్థమిది శుభదర్శనంబు
వ్యాళసర్పానుచరితంబు పంపఁజూడు । లలి మృగద్విజ సుసమాకులంబు, సతము॥

తే. అధికమిందు ప్రకాశించు నదిగొ కనుము । నీలపీతంబు శాద్వలం బీ ధరిత్రి;
ద్రుమజములురాల్చు వివిధపుష్పములచేత।మరియు,శోభించు రత్నకంబళ మనంగ॥8

తే. పుష్పభారసమృద్ధమై పొల్పుమీరు । శిఖరసంతతి నెల్లెడ క్షితిరుహములు
పుష్పితాగ్రింపులతలచే పుల్కలొలయ । కౌగలింపంగబడినట్టి కరణిదోచు॥ 9

తే. ఇదె సుఖానిల మీ కాల మిలకు వచ్చె । జాతపుష్పఫలద్రుమసన్మతలంబు
సురభిమాసంబు లక్ష్మణా! చూడు మోయి । మధురగంధంబు ప్రచురమన్మ
ధము వత్స॥ 10

తే. చూడు సౌమిత్రి! రూపముల్ సుందరములు । పుష్పశాలివనంబులు పుష్పవృష్టి
విడుచుచున్నవి కొల్లగా వివిధములను । తోయముల తోయమొచముల ట్లోయి,
వత్స॥ 11

తే. ప్రస్తరంబుల రమ్యంబులందు జూడు । వివిధకాననరమ్యద్రువితతిసతము
వాయువేగప్రచాలితంబై కుమార । పుష్పముల రాల్చుచున్న పీ పుడమి నెల్ల॥

తే. పడిన, పడుచున్న, మరి, పాదపస్థితంబు । లల్ల కుసుమోత్కరంబుల కొల్లలుగను
కూడి మారుతదేవుండు క్రీడలాడు । భంగిదోచెడు నెల్లెడ పారజూడు॥ 13

తే. బహుళకుసుమోత్కచంబులౌ పాదపముల । వివిధశాఖల వాయువు వీచియూప
షట్పదంబుల ప్రచలితస్థానములయి । రేగి ఝుమ్మని గీతముల్ లీల బాడు॥ 14

తే. మత్తకోకిలరవములు మధురముగను । పాటబాడుచు చెట్లచే నీటుగులుకె
నాట్యమాడించువాడునా యనిలు డిచట । శైలకందరములనుండి లీలవెడలు॥

తే. వడిగ నెల్లెడ వీచెడి పవనువలన । పాదపము లివ్వి చూడుమీ వనమునందు
బహుళసంసక్తశాఖాగ్రపటలి యగుచు । మాలగా గట్టియున్నట్టి లీలదోచు॥

తే. ఇదె సుఖస్పర్శముగవీచు నిచటగాలి । పొల్చు చందనశీతలంబుగను వత్స
పుణ్యగంధవహంబునై పుడమి ప్రజకు । మరి శ్రమాపనుదంబునౌ యరయు
మోయి॥ 17

తే. పవనవిక్షిప్తములు చూడు పాదపములు । షట్పదంబులొనర్చెడి ఝూంకృతులను
గీతములు లీల బాడెడి రీతిదోచు । వరుస నిచ్చట మధుగంధి వనములందు॥ 18

తే. మహీధరప్రస్థరముల రమ్యముల యందు । సుమపటలినిండి మరి మనో
రమముగాగ
పొడమిన మహాద్రుమంబుల భూధరములు । శ్రీ జెలంగెడు సంసక్తశిఖరతతుల॥

తే. పుష్పసంఛన్నశిఖరముల్ పుణ్యదములు।మారుతోత్క్షేప చంచలల్ మరియుజూడు
మధుకరోత్తంసములు నివే పాదపములు। గాయకులరీతి దోచు నీ కానలోన॥ 20

తే. కనక నెల్లెడ పుష్పితాగ్రింబులైన । కర్ణికారంబు లివెచూడు కాన నిచట
హాటకప్రతిసంఛన్నులైనయట్టి । నరుల పీతాంబరుల పోల్కి వరలు నివ్వి॥ 21

తే. ఇదె వసంతంబు సౌమిత్రి! ఇలకు వచ్చె। సతత నానావిహంగనాదితము వత్స!
సీత నెడబాసియున్న నా కీ తరి నిది । శోకసందీపనంబయి పీకదాకు॥ 22

తే. అకట శోకసమాక్రాంతు నదిగొనన్ను।మన్మధుడు చూడు సంతాపపరచునోయి
పొంగివదరుచు కోకిల పొగరుచూడు । పిలుచు న న్నిట మొగతాళి సలుపునట్లు॥

తే. ఇదిగొ! నత్యూహకంబు సంప్రాప్త యగుచు । రమ్యతరమిందు వననిర్ఘరంబు నందు
బిగ్గకూయుచు మన్మధావిష్టు నన్ను । మరియు శోకింపజేయుచు తిరుగునోయి॥ 24

తే. వినినయంతనె పూర్వ మీ వింతరవళి। యాశ్రమమునుండి నాప్రియ యనఘ సీత
నన్ను బిల్చుచు పొంగి యెన్నెన్నొ గతుల । దేలు క్రీడారసంబుల దివ్యలీల॥ 25

తే. ఇవె విచిత్రంబు లీ పక్షులిచట చూడు। వివిధరవముఃకూయు చీ విపినమందు
వృక్ష గుల్మ లతాదుల నిందు నందు । చేరుచున్నవి సౌమిత్రి! చిత్రగతుల॥ 26

తే. పెంటిపక్షులు మొగపక్షివితతినంటి । జాతిపక్షుల మెప్పుల జాల కులికి
గండుతుమ్మెద రవళుల మెండుచెలగి।మరియు,మధురస్వనంబులై మలయుచూడు

తే. వదరు పుంస్కోకిలంబుల ధ్వనులచేత । చెలగు నత్యూహరుతములచేత, మరియు
పాదపములివ్వి మ్రోతల బరగుచుండి। వత్స! నాకు ననంగదీపనములయ్యె॥ 28

తే. హా! యశోకంపు గుత్తులే యగ్నిగాగ । షట్పదస్వనమిదియె నిస్స్వనము గాగ
పల్లవంబులె తామ్రార్చిపటలిగాగ । ఈ వసంతాగ్ని ననుగాల్చు నేమి సేతు॥

తే. సూక్ష్మపక్ష్మాక్షి మృదుభాషి శుభసుకేసి । సీత నావెను చూడక క్షితితలాన
జీవితముతోడనాకు కించిత్తు గాని । ఓయి సౌమిత్రి! లేదు ప్రయోజనంబు॥ 30

తే. కాలమియ్యది సురుచిరకాననంబు । కోకిలాకులసీమాంత మేకరీతి
నాదు దైతకు సీతకు సోదరుండ । మిగులప్రియమయి యుండుగా జగతి మునుపు॥

తే. మన్మధాయాససంభూత మనఘ యిద్ది । తద్దయు వసంతగుణవర్ధితంబు వత్స
అయ్యొ! యియ్యదిశోకాగ్ని యన్న! నన్ను । కాల్చివేయును .హో! మహాకఠిన మిపుడె॥ 32

తే. దయిత నావెను చూడక ధరణినిచట । వేచు రుచిరద్రుమంబుల జూచుచుంట
అకట మన్మధతాప మియ్యది కుమార । ఇక పొరింబోరి వృద్ధిని నెసగఁజొచ్చె॥

తే. అకట వైదేహి కన్నులకరయరాక । ఇదె వసంతంబు స్వేదాపనుదము వత్స!
పుష్పసంతతితోడుత పొడమియుంట। శోక మిదె నాకు హెచ్చించుచున్నదయ్యొ॥
తే. సీత మృగశాబకాక్షి వీక్షింప రామి । చింతచేత బలాత్కృతిన్ చివుకు నన్ను
కూర్చి చైత్రవనానిలం బౌర యిద్ది । మిగుల సంతాపపరచు సౌమిత్రి! చూడు
తే. ఈ మయూరంబు లిచట శోభించు చూడు । నృత్యమాడుచునిందంపు నీలుగులికి
స్ఫాటిక గవాక్ష సదృశ స్వపక్షములను । మారుతోద్ధూతములు విప్పి మలయు
చూడు॥ 35
తే. శిఖులు మదమూర్ఛితంబు లీ చెంతచూడు। తమ మశిఖిసిప్రియలతోడ తమినిగూడి
మన్మథాభిపరీతు వన్ మరియు నొంప । ఎగసి మన్మథవర్ధనంబుగ నటించు॥ 37
తే. చూడు లక్ష్మణ! నృత్యమిచ్చోట నాడు । మొగనెమలివెంట యీ కొండ
మొగను జేరి
నృత్యమాడుచునున్న దీ పెంటినెమలి । మన్మథార్తమనంబున మరులుగొనుచు॥
తే. ఔర! యాపెంటివెంటనే యంటుకొనుచు। మొగనెమలి మన్మథావిష్ట మగుచుం
దిరుగు;
రుచిరపక్షంబులను విచ్చి రుతములొలయ । ఆడు నన్నిట పరిహాస మాడునట్లు॥
తే. ఈ మయూరంపు ప్రియభార్య నీ వనోర్వి। ♦ సత్యము హరింప లేదు రాక్షసుడెవండు
కాననే, నృత్య మిటులాడు కాంతంగూడి । రమ్యవనముల నీ మయూరంబు వత్స॥
తే. నాకొ యీవనినుంట నా నాతిం బాసి। హా! సుదుష్కరమీ పుష్పమాస మోయి
చూడు లక్ష్మణా! సంరాగ మీడగూడ । ప్రబలుచుండె తిర్యగ్యోనులందు గూడ॥
తే. ఇదె సమీపాన శిఖిని యియ్యది కుమార। కామవశయయి భర్తతో ననగి పెనగి
చక్క రమియించు చున్న దీ చక్కి చూడు॥ 41
తే. నన్నుకూడను నిట్టులే సన్నతాంగి । మదిరలోచన సీత సంభ్రమము బాదల
మదనవశయయి చేరి నా పైనిబడదె । అపహరింపంగబడకున్న హా! సుకేశి॥ 42
తే. చూడు లక్ష్మణా! యీవనక్షోణిలోన । యీ వసంతాన కొల్ల పుష్పించియున్న
పుష్పసంతతులివియన్ని పొగులునాకు । నిష్ఫలంబులై యగుచుండె నెలత లేమి॥
తే. రుచిరములునయ్యు పుష్పముల్ ద్రుమములందు। నిండు కాంతిని వెల్గియు నిష్ఫలముగ
నేలరాలుచునున్న వీ లీలం జూడు । మధుకరోత్కరములతోడ బహుళగతుల॥ 44

♦ పాఠాంతరము:— ధూర్తము హరియింప లేదు దైత్యుండెవండు

తే. గుంపుగుంపులుచూడు పక్షులు కుమార । కలరవంబుల సంతోషకలితము లయి
ఒండొరుల బిల్చుకొను భంగి నుబ్బికూయు । కరము నాకు కామోన్మాదకరము
గాగ॥ 45

తే. ఈ వసంతంబె సీత నా ప్రియ వసించు । తావునఁ గూడ నుండిన తథ్యమింక
ఆమె పరవశయగుచు నా యట్లెయకట। శోకమొందును లక్ష్మణా! శోషజెందు॥

తే. ఈ వసంతపుస్పర్శ నా యింతియున్న । తావునందుండ దంచు నే దలతు ధ్రువము
అయిన ననుబాసి యసితపద్మాక్షియామె । యెటుల వర్తించు జీవంబు లింక
దాల్చి॥ 47

తే. అటులగాక వసంత మా యబల సీత । మత్ప్రియాంగన యున్నెడ ప్రబలునేని
ఏమిసేయును సుశ్రోణి యింత కామె । కరము నిర్భర్త్సితయునౌట పరులచేత॥

తే. శ్యామ, పద్మపలాశాక్షి, యబల, యామె।తన్వి, మృదుపూర్వభాషిణి, తాళలేక
అట వసంతంబు దాపురించుటను జేసి । జీవితమె బాసియుండును సిద్ధమింత॥ 49

తే. ధీరుడనునౌట నా బుద్ధిదృఢముగాను । హృదినివర్తించునెటులో యీ యదను
నందు
సాధ్వి మద్విరహంబున జాల జిక్కి । ఉసురు నిలుప సమర్థ కాదోయి సీత॥

తే. విను యథార్థంబు వైదేహి తనదుభావ । ముంచియున్నది నాయందె యంచి
తాత్మ
సర్వథా నాదు భావంబుసైతమట్లె । సీతయం దుంచియుంటిని సిద్ధమింత॥ 51

తే. బహుళ పుష్పవహంబు, హిమావహంబు । అదె సుఖస్పర్శ మీ వాయు విప్పు
డిచట
సీత నాకాంత చింతించి చివుకు నన్ను । పావకప్రతిమంబయి బాధ పెట్టు॥ 52

తే. సతము సుఖమని సీత నా సతిని గూడి । మున్ను నెద్దానిగూర్చి నే నెన్నుచుంటి
అట్టిమారుతు డిపుడు నా యతివలేమి । శోకమిదెనాకు హెచ్చించుచుండె నౌర॥

తే. అప్పు డీపక్షి యంబరంబందునుండి । పరుషభంగిగఁగూసెనో మరలనదియె
సీతలేనట్టి యిత్తరి చెట్టునెక్కి । కడు ప్రహృష్టంబుగా గూయు కాక మదిగొ॥

తే. అప్పు డభ్రాన సీతాపహారకముగ । అరచియుండినపక్షి నే డవనిజంబు
నెక్కి మృదుభంగి కూయుచు నిక్కమింక । నన్ను నానాతి గూర్పంగ నెన్ను
నోయి। 55

తే. వినుము లక్ష్మణ! నాద మీా వనిని నదిగొ । మదవివర్ధనమియ్యది మరియునాకు
పుష్పితాగ్రంబు లీ వృక్షపుంజములను । ద్విజలతతులు గూయుచున్నవి వివిధ
గతుల 56

తే. పవనవిక్షిప్తమాచు కంపంబు నొందు । తిలకమంజరి దీనిని తీపులూర
చేయుచున్నది శీఘ్రి మీా భృంగ మిదిగొ । రహి మదోద్ధూతయా ప్రియురాలి
నట్లు॥ 57

తే. కామిజనులకు మిగులశోకంబుబెంచు । నీ యశోకంబు జూడు మియ్యెడ కుమార
అనిల విక్షిప్తముల స్తబకాళిచేత । నన్ను తర్జించు భంగి గానంగ వచ్చు॥

తే. ఇవియె లక్ష్మణ! కానవచ్చెడిని నిచట। చూతములు పుష్పశాలు లీ క్షోణిజములు
విభ్రమోత్సిక్తమానసుల్ విరహిజనులు । సాంగరాగులు పీ రను చందముగను॥

తే. లక్ష్మణా! చూడు పంపతీరాన బొదలు । చిత్రవనరాజి కిన్నరుల్ చిత్రముగను
సంచరించుచునున్నారు సందడిగను । ఇందునందున పురుష మృగేంద్ర యిచట॥

తే. ఇవియె శుభగంధి నళినమ్ము లిచటఁజూడు । నాల్గుదిశలను లక్ష్మణా! వెల్గుచుండె
జలములందున రమ్యపుష్కరములందు । తరుణసూర్యుని భంగిగా తమ్ముకురర॥

తే. ఇయ్యది ప్రసన్నసలిల మెంతేని వెలయు । పద్మనీలోత్పలాయుతంబై తనర్చు
హంసకారండవాకీర్ణ మగుచునొప్పు । పంప సౌగంధి కాన్వితం బింపునింపు॥ 62

తే. అమల జలముల తరుణసూర్యాభము లయి । షట్పదాహత బహుళ కేసరము
లగుచు
వెలయు పంకజతతుల శోభించు పంప। చూడు మెల్లెడు లక్ష్మణా చోద్యమోయి॥

తే. చక్రవాకయుతంబయి సంతతంబు । చిత్రతీరవనాంతరచిత్రిత మయి
అల్ల సలిలార్థి మాతంగతల్లజముల । వివిధమృగయూథములజాల వెలయు పంప॥

తే. మారుతాహత వేగోర్మిమాలికలను । పంప విమలాంభసిని తాడ్యమానములయి
పంకజంబులు చూడు లక్ష్మణ కుమార । ఇవె విరాజిల్లుచున్న వి య్యెడల మిగుల॥

తే. పద్మపత్రవిశాలాక్షి పద్మవదన । పంకజప్రియ సతతంబు ప్రాణదయిత
దేవి నై దేహి జూడక జీవితంబు । ఎట్లు రుచియించు నాకు హా! యిలనునింక॥

తే. ఇక నహో! కాము వామత్వ మేమనందు । అయ్యొ యెడమయి నాకు దుర్ల
భయునైన
రమణి కల్యాణి నింక దలంప జేయు । హృదిని కల్యాణతరభాషిణిన్ కుమార॥

తే. ఇపుడు గల్గిన యీ కామమింక నేను । ఓర్చుకోగలవాడ నెట్లో కుమార
ఈ వసంతంబు పుష్పిత పృథ్వీజంబు । మీరి నాపైకి రాకున్న మిత్రవంశ్య!॥

తే. ఏవి రమణీయములుగ గన్పించె నాకు । నాడు సీతను గూడియున్నట్టి వేళ
అవియె లక్ష్మణ అరమణీయములు గాగ । దోచు నా కిప్డు సీత నాతోడ లేమి॥ 69

తే. పద్మకోశపలాశముల్ వనిని నిచట । చూచి నంతనె లక్ష్మణా! సుదతి సీత
నేత్రకోశంబు లిక నాదు స్మృతికి వచ్చి। తాపమొనరించు నెంతయు తమ్ముకుర్ర॥

తే. పద్మకేసరసంస్పృష్టమై వనోర్వి । తరళవృక్షాంతరవినిస్సృతంబు నగుచు
సీత నిశ్శ్వాస మిట నాకు స్మృతికి దెచ్చి।వాయు విది వీచు కడు మనోహరముగాగ॥

తే. వత్స! సౌమిత్రి! చూడు పంపా సరస్సు । దక్షిణపుదిక్కు గిరిసాను ధాత్రియందు
రమ్యపుష్పితకర్ణికారంపు యష్టి । పరమశోభనమదె చాల ప్రభ వెలుంగు॥ 72

తే. భూమిధర మిద్ది ధాతువిభూషితంబు । వాయువేగ విఘట్టిత బహుళచిత్ర
రేణువుల నెల్లయెడల సలీలముగను । చిమ్ముచున్నది చూడుమీ తమ్ముకుర్ర॥

తే. విరిసి సర్వత్ర సంప్రపుష్పితము లౌచు । మఱియు సర్వత్ర నిష్పత్రపటలియగుచు
చాలరమ్యంబులౌ కింశుకాళి చేత। జ్వలితమగు చూడు మీ గిరిప్రస్తరములు॥

తే. అల్ల పంపాతటరుహంబు లవియె చూడు । సరసమధుగంధు లెట్లు సంసక్తలగుచు
మాలతీమల్లి కాషండమండలములు । పుష్పితంబులు కరవీరముల్ వెలుంగు॥ 75

సీ. వాసంతికా సిందువారముల్ కేతకుల్ । మాధవీ కుంద గుల్మములు గుములు
సర్వత్ర మధుగంధ సంపూర్ణముల్ సదా । పుష్పితంబులు నెందు పొల్పునీరాన-
వకుళవంజుళ నాగ వరపుష్పితమధూక । చంపకచిరిబిల్వ సరళ, తిలక
వరణ ఖర్జూర నీపామ్ల నీ లాశోక । పుష్పితపద్మకంబులను మఱియు
తే. సింహకేసర పింజర శ్రీలనొప్పు । లోధ్రములను కురంటక ద్రుమచయముల
పారిభద్రక పూర్ణక పాటలముల । కుసుమితాంకోల తక్కోల కోవిదార
చూత పనస మహావట క్షోణిజముల! చూడు గిరిపృష్ఠమెంతయు శోభదనరు॥

తే. కేతకోద్దాలక శిరీషచూతములును । శింశుపార్జున ముచుళిందవంశములును
చాల రమ్యంబు లీ గిరిసానువులను । వెలయు చున్నవి చూడు పెంపెక్కు శోభ॥

తే. పుష్పితాగ్రంబు లీ లతాపుంజ తతుల । నల్ల పరివేష్టితంబు లెంతయును జూడు
పుష్పితంబులు రుచిరముల్ భూరుహములు । పెక్కు లీ పంపతటభూమి వెలయు
నవిగొ॥ 8[illegible]

తే. శాల్మలీ కింశుకాది వృక్షముల జూడు । రక్తకుసుమక తరుమండలంబు లవిగో
తినిశముల నక్తమాలల గనుము వత్స । చందన స్పందనములు పొల్పొందు
చూడు॥ 83

తే. అనిలవిక్షిప్తవిటపంబులౌ సమీప । భూరుహంబుల వీనిని చేరి లతలు
తాము ననువర్తనమొనర్చు ధరణినిచట । మత్తలౌ నుత్తమస్త్రీల మాడ్కి గాగ॥

తే. భూరుహమునుండి భూరుహంబునకు జరిగి । శైలముననుండి శైలంబు లీలదాటి
వనమునుండి వనంబును వరుసగడచి । పుడమి నైకరసాస్వాదమోది యగుచు
వీచు వాయువు చూడుమీ విపినమందు॥ 86

తే. పాదపంబులుకొన్ని పుష్పములనిండి । లలి గుబాళించు మధుగంధములను వత్స
విరిసి మరికొన్ని ముకుళసంవీతములయి । శ్యామవర్ణంబులన్ బొల్చు చాల చూడు॥

తే. ఇది ప్రఫుల్లంబు, నిది మృష్ట, మిదియు స్వాదు। వనుచు మధుకర మిది రాగ
మత్తయగుచు
కుసుమములలోన దూరుచు కొసరి కొసరి । త్రావుచున్నది మధువు మోదమున
నెగసి॥ 87

తే. ఈ మధుకరంబు మధులుబ్ధ మేమ నందు । కొసరి పంపాతటద్రుమ కుసుమతతుల
లీల నొకమారు మునుగుచు లేచి మరల । వేగ యన్యద్రుమంబులకేగు చూడు॥

తే. ఇటు తమంతట రాలిన యీ సుమాళి । దళముగా నేల నింపుట ధాత్రి యిచట
పూలపానుపుపరచిన లీల మిగుల। సుఖముగానుండె శయనింప చూడు వత్స!॥ 89

తే. రమ్యనగసానువుల వికీర్ణంబులైన । వివిధపుష్పచయంబుల వింతగాగ
రక్తపీతాది వివిధవర్ణంబులొప్పు । ప్రస్తరములిందు నేర్పడె వనధరిత్రి॥ 90

తే. చూడుము హిమాంతమున వత్స! క్షోణిజముల । దోచు పుష్పసమృద్ధి యెం
తొప్పు నోయి
పుష్పమాసాన తరువులు పూచె మిగుల । పందెములువైచుకొన్నట్టి చందముగను॥

తే. నగము లియ్యవి షట్పదనాదములను। వితతనానాసుమోత్తంస విటపములను
నొండొరులబిల్చుకొనునట్టి యోజమెరయ । నాదుచున్నవి చూడు మయ్యారె
యిచట॥ 92

తే. వనిని కారండవం బిదే పక్షి చూడు । శుభము సలిలంబునందున జొచ్చిలీల
కాంతతోగూడి రమియించు సంతసమున । కామముద్దీపనము నాకు కడు నొనర్పు॥

తే. అల్ల మందాకినికి మనోహరము రూప । మిట్టిది నిజంబుగానున్న యెడల వత్స!
దానికి మనోరమంబులై తనరునట్టి। గుణము లున్నవటన్న యా గొప్పతగును॥ 94

తే. నిజము నాసాధ్వియిచట గన్పించునేని । ఎలమి మనమిటగూడి వసింతు మేని
తలప నాశింప నిందప్రదంబుగాని । అల యయోధ్యనుగాని సుంతైన వత్స!॥ 95

తే. ఇట్టి రమణీయ శాద్వల ఘట్టమందు । కాంత నాసీతగూడి రమింతునేని
చింతసుంతయు నాదరిఁ జేరదోయి । అన్యమెద్దియు కోర నయ్యా! ధరిత్రి॥ 96

తే. తరులు రుచిరచ్ఛదంబు లెంతయును వత్స। వివిధపుష్పచయంబుల వెలయుచుంట
కాన నిచ్చటగనుట నా కాంతలేమి । చిత్త మున్మాద మొనరించు చివుకు నాకు॥

తే. శీతలజలంబు చూడుమీ చిత్రధాత్రి । పుష్కరాయుత మీ పంప పొలుపుమీరు
చక్రవాకానుచరితంబు సంతతంబు । రమ్యకారండవాకీర్ణ రంగ మహహ॥ 98

తే. క్రౌంచపక్షుల ప్లవముల మించు నెప్డు । వన వరాహాదిమృగముల దనరు సతము
అధికముగపంప శోభించు నవని నిచట । కరము కూజించు విహగసంఘములతోడ॥

తే. ముదితములు చూడు బహువిధంబులు ఖగంబు । లిచట కామంబు నాకు
దీపింపజేయు
ప్రియను శ్యామను పద్మనిభేక్షణ నిట । జ్ఞాపకముజేసి నాకు నా చంద్రముఖిని॥

తే. చిత్రసానువులందు సౌమిత్రి! చూడు । మృగములు రమించు నిజమృగీవితతిగూడి
నేనో మృగశాబకాక్షి నా నెలత బాసి। సతిని వైదేహిబాసి హా వెతలబడుదు॥

తే. మత్తవిహగగణాయుతం బద్రి నిచట । రమ్యసానువు లీ భూధరంబు చెంత
నిందునందునచరియించు నీ మృగాళి । వ్యధను గల్గించు హా! నాదుమదికి వత్స!॥

తే. స్వస్తియగునాకు నాకాంత నరయుదేని।బ్రతుకుదు సుమధ్య వైదేహి నన్నుగూడి
పంపపవనంబు సుఖ మిది సొంపుమీర । వత్స! సేవించునేని హా! వనిని నిచట॥

తే. పద్మసౌగంధికవహంబు పరము శివము । శోకనాశంబు లక్ష్మణా లోకమందు
ధన్యు లే నోయి సేవింత్రు తమ్ముకుర్ర । తరళ పంపోపవనమారుతంబు దీని॥ 104

తే. శ్యామ పద్మపలాశాక్షి యబల యాప్రె । సీత నాప్రియ ననుబాసి జీవితంబు
నెటుల ధరియింపగలదు మహీతనూజ । వివశ జనకాత్మజ సుకేశి భువిని నింక॥

తే. ఏమిజెప్పుదు రాజు మహామహుండు । పరమధర్మజ్ఞుడా సత్యభాషణుండు
సీత జనకుండు నల్వూరి చెంతనున్న । సీత సేమంబుగూర్చి ప్రశ్నింప నకట॥ 106

తే. పితరుచే గెంటబడి యిట్లు విపినములకు । పరమనిర్భాగ్యుడనునైన పతిని నన్ను
ఎవతె సత్పథమూని హా వెంబడించె । అట్టి నాప్రియ సీత హా యబల యేది?॥

తే. మతివిహీనుని రాజ్యవిభ్రంశు నన్ను । నడవి కెవ్వతె యక్కటా యనుసరించె
అట్టి యామెను బాసి నే నయ్యొ యెట్లు । జగతి జీవింతు కృపణుండ నగుచు వత్స!॥

తే. అమల మంచితచారుపక్ష్మాక్ష మహహ । కమ్ర మవ్రణమల్ల సౌగంధికంబు
శుభము సీతముఖంబును జూడకుంట । నా మనంబేమొ శోషిల్లునట్టు లుండు॥

తే. స్మితము హాస్యాంతరయుతంబు హితము శుభము। గుణయుతంబును మధురంబు
ననుపమంబు
తరుణి వైదేహి వాక్యంబు మరల నెపుడు । లక్ష్మణా! విందునోయి యీ శ్రవ
ణములను॥ 110

తే. అడవి హా! శ్యామ యామె దుఃఖంబె గనియు। నన్ను మన్మథకర్శితు ననునయింప
నష్టదుఃఖయనంగను హృష్టయనగ । సాధ్వి భాషించు నాతోడ చంద్రవదన॥

తే. ఏమిచెప్పుదు కౌసల్యకామె కకట।అయ్యొయె యయోధ్య కే నింక యరుగగానె
"ఏది కోడ ల"టంచు ప్రశ్నింపగానె । అతి మనస్విని కింక నా యమ్మ కచట॥

తే. పొమ్ము లక్ష్మణ! చూడుమీ తమ్ముకుర్ర । భ్రాతృవత్సలు భరతుని పట్టణమున
నేనొ బ్రతుకను హా యింక నెలత సీత । నృపవరాత్మజ వైదేహి లేకయుంట॥

తే. ఇటు మహాత్ముండు రాఘవుం డెంతొసేపు । వని ననాథయు నా విలాపంబుసేయ
విని మహాత్ముండు లక్ష్మణుం డనుజు డపుడు । వాక్యమిటు యుక్తమవ్యయం
బతడు బలికె॥ 114

తే. రామ! దుఃఖమడంచు; భద్రంబునీకు । శోకమొందరు పురుషోత్తమా కృపాళు
అకలుషాత్ముల కింక మీ యట్టివారి । కిటుల మతి మందమగుట గన్పింప దెందు॥

తే. దుఃఖము వియోగజంబౌట ధ్రువ మెరింగి । ప్రియజనులపైన స్నేహంబు
వీడుమయ్య
భువి నతి స్నేహసంశ్లేషమున నె వత్తి।ఆర్ద్రమయ్యును దహియింపబడుట గనమె॥

తే. వినుము పాతాళమునకు దా జనునుగాక । అంత కెక్కుడు చోటు కే యరుగుగాక
సర్వథా రావణుం డింక జగతిలోన । బ్రతుకలేడు మహాత్మ నీ హస్తమందు॥

తే. పాపు డా రక్కసుని జాడమాత్ర మింక । మనకు దెలిసిన జాలును మనుజవృషభ
అంత వా డింతి నర్పింపనైన వలయు । కాక, నిధనంబునైనను గాంచవలయు॥

తే. అదితి గర్భంబులోని కా యసురు డింక । సీతతో రావణుండు జొచ్చినను గాని
జొచ్చి యుండైన గాని జీల్చుదు దురాత్ము । సీత నర్పింపడేని యా చెనటి పంద॥

తే. స్వాస్థ్య మింక భజింపుము; భద్రమార్య । కృపణమతిని త్యజింపుము నృపవరేణ్య
యత్నమొనరింపకుండ ధైర్యంబు విడిచి । యడలువానికి చొప్పడదర్థసిద్ధి॥ 120

కం. ఉత్సాహమె బలమగుగా । ఉత్సాహముకంటె బలము నోజయు గలదే
సోత్సాహున కీ జగతిని । మాత్సర్యవిదూర! లేవు మరి దుర్లభముల్॥ 121

తే. పురుషు డుత్సాహవంతు డెక్కరణి పనిని । నష్టమొందడు రామచంద్రా!
ధృవమ్మ
మనము నింకను నుత్సాహ మాత్రమూని ! నడచి నట్లైన సీతను బడయగలము॥

తే. శోక మింకను వెనుకకు వీక ద్రోసి । కామవృత్తత్వ మిది వీడుమో మహాత్మ!
భువి కృతాత్ముండవును మహాత్ముండ వీవు । ఎరుగకుంటివి నిన్ను నీవే యిదేమి?॥

తే. ఇటుల సంబోధితుండునై యినకులుండు । చండశోకోపహతచేతనుం డతండు
విడిచి శోకంబు మోహంబు వడిగ నపుడె । ధైర్యమును బూనె శ్రీరాముడార్యవరుడు॥

తే. రామచంద్రు డచింత్యపరాక్రముండు । రమ్య పారిప్లవద్రుమరాజిబొదలి
సురుచిరంబైన పంపను త్వరగ దాటి । తరలె నవ్యగ్రమనమున తరణికులుడు॥

తే. నిఖిలము వనంబు కందర నిర్ఝరంబు । చూచుకొంచును దుఃఖంబు నేచుచుండ
లక్ష్మణునిగూడి వెడలె నా రామవిభుడు।మిగుల నుద్విగ్నమనమున దిగులువడుచు॥

తే. మత్తమాంగ సువిలాసమైన నడల । నప్రమత్తత నవ్యగ్రమైన మతిని
లక్ష్మణుండు మహాత్ము డట్లరుగు చుండు । రాము రక్షించుచుండె ధర్మమున
ధృతిని॥ 127

తే. ఋష్యమూక సమీపమం దిందునందు । తిరుగుచుండెడి కపిరాజవరుడు బలుడు
నోజ నద్భుత దర్శనీయులను వీరి । చూచి భయమంది నిశ్చేష్టుడై చలించె॥

తే. సుందరగ్రీవు డా గజమందగామి । తరుచరుండు మహాత్ముండు చిరము దిరుగు
నరుల నరసి విషాదంబు పరమమొంది । చివికి భయభారమగ్నుడై చింతమునిగె॥

తే. హరులును మహౌజసుల రామలక్ష్మణులను । గాంచి భయమంది చొచ్చి రా
యంచితంబు
పుణ్యము శరణ్య మాశ్రమంబును సుఖంబు । ధరణి శాఖామృగనిషేవితంబు
సతము॥ 130

1వ సర్గ సమాప్తి - (130)

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### రెండవసర్గ - (29)

**రామలక్ష్మణుల ఆను దెలియుటకై సుగ్రీవుడు హనుమంతుని మాఱువేషమున బంపుట.**

**తే.** వారిని మహాత్ములను భ్రాతృవరుల ఘనుల । రామలక్ష్మణులను వీరలక్షణులను
మఱి వరాయుధధరుల నా ధరణివరసి । హృదిని శంకితుడయ్యె సుగ్రీవుడడలి॥ 1

**తే.** మిగుల నుద్విగ్నహృదయుడై నగముక్రింగి । దిక్కు దెలియక జూచు చా దిక్కు లెల్ల
ఒక్కచోటను కాల్నిల్పనోజలేక । చకితుడగుచుండె కపిరాజు శైలశిరసి॥ 2

**తే.** ప్రకటబలులను వారి నట్లరయు చుండ । మనసు మనసున నిలువదయ్యె నుగ్రకపికి
పరమ భీతున కా హరివరున కపుడు । చిత్తమెంతయు చింతచే చివుకజొచ్చె॥ 3

**తే.** చింతపడుచును నట్టులే స్వాంతమందు । తరచి గురులాఘవంబు లా ధర్మవిదుడు
అనుచరుల నెల్లరను గూడి యమితముగను । హృదిని నుద్విగ్నుడయ్యె సుగ్రీవుడపుడు॥ 4

**తే.** రామలక్ష్మణులను జూచు చా మహాద్రి । హడలి సుగ్రీవుడా ప్లవగాధిపుండు
మిగుల నుద్విగ్నమానసుం డగుచు నటులె । చెప్పె సచివుల కిట్టు లా గొప్పప్రభుడు॥ 5

**తే.** వాలిపంపున వీర లీ లీలగాగ । కపటమున చీరవసనులై కాన కిటకు
వచ్చి యీ ఋష్యమూక పర్వతముచెంత। దుర్గమస్థలి చరియింత్రు ధ్రువ మిదంత॥ 6

**తే.** అంత సుగ్రీవుసచివు లట్లచట దిరుగు । పరమధానుష్కులను జూచి వెరచి పరచి
గిరితటము నప్పు డద్దాని త్వరగ విడిచి । శిఖర ముత్తమ మన్యంబు జేరుకొనిరి॥

తే. హరులు యూథపు లప్పు డం దందు నుండి । శీఘ్ర మరుదెంచి వానర శ్రేష్ఠు భీతు
యూథపర్షభు సుగ్రీవు నొద్ద జేరి । కొలిచి యుండిరి చుట్టును కొండ నచట॥ 8

తే. శైల శిఖరాల సైతమ మాభీల గతిని । కంపమొందింప జేయు చా కపిబలంబు
ఎగిరి గిరినుండి గిరికి దా మేగుదెంచి । కూడి రొక సన్నకోన దా గున్న పతిని॥ 9

తే. అంత ప్లవమాను లెల్ల రత్యంతబలులు । హరులు శాఖామృగంబు లమాం
తమునగను
పుష్పితంబుల నగముల భూరిదుర్గ । సంశ్రితంబుల విరిచి రసంఖ్యలుగను॥ 10

తే. ఆ మహాగిరి హరివరు లంద రపుడు । ఎగురుకొంచును వచ్చి రహీనబలులు
మేటి మార్జార శార్దూల మృగవితతుల । త్రోవ వెరపించుకొంచు గంతులు సెలంగ

తే. అంత సుగ్రీవ సచివు లప్పర్వతేంద్రు । నాశ్రయంబుననున్న వా రంద రపుడు
చేరి కపిముఖ్యుచుట్టు నశేష సంఖ్య । కొలిచి యుండిరి కేలుదమ్ములను మోడ్చి॥

తే. భయసుసంవిగ్ను నంత నా ప్రభుని జూచి । వాలి కిల్బిషశంకితు జాలి నరసి
వాక్యకోవిదు డప్పు డా ప్లవమాని । హనుమ సుగ్రీవునకు బల్కె వాక్యమిటుల॥

తే. వాలికృతమైన యీ మహాభయము మీరు । విడువు డెల్లరు వానరవీరులార
ఋష్యమూకము గిరివరం బిద్ది వినుడు । వాలి భయ మిందు లేదుగా జాలిపల॥

తే. ఎవని భయమున నుద్విగ్న హృదయుడ వయి । నీవు పరువెత్తుచుంటివో నృప
కపీశ
క్రూరదర్శను డా వాలి క్రూరు డిచట । కానిపింపడుగా యేల కలత జెంద॥ 15

తే. పాపకర్ముడునైన యే వాలి వలన । అల్ల దుష్టాతుడైన యే యన్నకతన
భయము నీకయ్యె మున్నట్టి వాలి యిచట । లేడుగావున నీ కింక లేదు భయము॥

తే. కర మహో! వ్యక్తమయ్యె శాఖామృగత్వ । మిచట నీయది యో ప్లవం
గేశ్వరుండ
నీవు లఘుచిత్తతన్ జేసి నిజము మతిని । స్థిరతనొందక కలగెదు చింతగనెను॥ 17

తే. బుద్ధి విజ్ఞానసంపదన్ బూలిచి రాజ! ఇంగితంబుల సర్వమెరింగి నడుపు;
విను మబుద్ధిగతుండగు వెర్రిరాజు। పాలనమొనర్పలేడు భూతాళి నెపుడు॥ 18

తే. శుభము వాక్యము సర్వ మా శూరహనుమ । పల్కి నిట్టుల విని యప్డు ప్రభు
వరుండు
శుభతరంబిట్లు వాక్యంబు సూర్యసుతుడు । హనుమకనియెను సుగ్రీవుడంచితుండు॥

తే. దీర్ఘబాహుల శరచాపతీక్ష్ణఖడ్గ । ధారుల విశాలనేత్రుల ధీరవరుల
సురసుతోపములన్ వీరి జూడ నిజము । భీతి యెవరికి గలుగ దీ పృథ్విలోన॥ 20

తే. వాలి పంపంగ వచ్చిన వారలంచు । బుద్ధిశంకింతు పురుషోత్తములను వీరి
రాజు లయ్యారె! బహుమిత్రు లనుట ధ్రువము । కాన నమ్మంగ రా దెట్టి
ఘట్టములను॥ 21

తే. ఛన్నచారుల శత్రుల సన్నలెల్ల । మనుజు లెరుగంగవలయు నేమరక సతము
ఇటుల గాకున్న వారె నమ్మించి ప్రజల । తాము నమ్మక కూల్త్రు రంధ్రమ్ము
లెరిగి॥ 22

తే. కృత్యముల వాలి మేధావికృతిక్రమముల । నృపులు బహుదర్శనుల్ తమ రిపుల
దున్ముదుర్!
ఎరుగవలయును వారి ప్రాకృతుల నరుల । బంపి బహువేషములను నుపాయములను॥

తే. నేను ప్రాకృతవేషాన నేగి యటకు । ప్లవగపుంగవ! వారలభాషణముల
ఇంగితంబుల రూపుల నెన్నొగతుల । వారల నిజంబు నెరిగి రావలయు సుమ్ము॥

తే. వారి భావ మెరుంగుము వానరేంద్ర! మది యకలుషంబొ పసిపట్టు మరి
కలుషమొ
ఇంగితంబుల సర్వమెరింగి స్తుతుల । మాటి కిక నాదుపైన నమ్మకము గూర్చు॥

తే. పూని యిటు వారి నా కభిముఖుల జేసి । ఈ వనంబును వీర లీ రేవగాగ
జొచ్చిన ప్రయోజనంబు నీ విచ్చ మెరయ । అడుగవలయును త ద్ధనుర్ధరుల నరుల॥

తే. శుద్ధులే యైన వారలో బుద్ధిమంత । ఎరుగుదువు వారితోడ భాషించు తెఱగు
దుష్టతాదుష్టతలు వారితోడ నీవు । మాట లాడుటయందునే మరియు దెలియు॥

తే. కీశవిభుచేత నిట్లు సుగ్రీవుచేత । హనుమ యాజ్ఞప్తి బడసి తత్క్షణమ కదలి
రామలక్ష్మణులున్నట్టి భూమి కపుడె । పోవదలచెను బుద్ధి నా బుద్ధిశాలి॥ 28

తే. కపి సుభీము దురాసదు నృపుని మాట । విని తథాస్తని శ్లాఘించి హనుమ
యప్పుడు
రాము డతిబలు డా లక్ష్మణార్యుడున్న । తావు కొగి నేగెను మహానుభావు డెగసి॥

2వ సర్గ సమాప్తి – (159)

★

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### మూడవ సర్గ - (39)

రామలక్ష్మణులతో హనుమంతుని ప్రథమ సంభాషణము- పరస్పర విశ్వాసము ప్రథమ సదర్శనములోనే ఏర్పడుట.

తే. ప్రభు మహాత్ముని సుగ్రీవు భావ మెరిగి। త్వరగ నా ఋష్యమూక పర్వతమునుండి
ఎగిరె హనుమంతు డరిగె నహీనబలుడు । రామలక్ష్మణు లున్న స్థలంబుజాడ॥ 1

తే. ఇంక కపిరూపము పరిత్యజించి యపుడ । మారుతాత్మజు డా హనుమంతు డార
భిక్షురూపంబు దాల్చె కపీశ్వరుండు । వడిగ శఠబుద్ధితను నాత్మవంతుడతడు॥ 2

తే. అంత మధురంబు సుమనోజ్ఞమైన యట్టి । పల్కుల వినీతు డగుచు నా ప్లవగ వరుడు
రామలక్ష్మణులను జేరి ప్రణతు డగుచు । మరి ప్రశంసించె వారల కరము లొగ్గి॥

తే. మారుతసుతుండు హనుమ యా వీరవరుడు । విధియుతంబుగ పూజించి వీరవరుల
పలికె మృదువాక్యముల తేనె లొలుక ప్రీతి । రఘుకులుల కిట్లు సత్యపరాక్రములకు॥

తే. ఇలను రాజర్షి దేవతుల్యులరు మీరు । తాపసులు సంశితవ్రతుల్ ధన్యులీరు
చూడ వరవర్ణులును తాము చోద్య మిట్లు । వచ్చితి రిదేల దేశ మీ వనపథంబు॥

తే. మృగగణంబుల కన్యవనేచరముల । కెంతయును భీతి గొల్పు చీ ప్రాంతమందు
పంపతీరాన జొదలు నీ బహుళతరుల । జూచుచెల్లెడ మరి వచ్చుచున్నవారు॥ 6

తే. శుభజలంబు నదిన్ దీని శోభ లెసగ । జేయుచు తపస్వు లీరు విచ్చేతు రిటకు
ధైర్యవంతులు వరవర్ణు లార్యవరులు । చీరవాసులు మీర లెవ్వారు సుండి॥ 7

తే. నిశ్శ్వసింతురు; వరభుజుల్ నిఖిలసత్వ । జాతులను వీని భీతిల్లి జేతు రీరు
సింహవిక్రాంతుల్ మహాసింహగతులు । బలులు సింహాతిబలవిక్రములు గనంగ॥

తే. శక్రచాపనిభంబులౌ చాపములను । శత్రుసూదను లీరు హస్తముల దాల్చి
రూపసంపన్నులరు శ్రీనిరూఢు లౌర । హస్తిహస్తోపమభుజుల్ నరర్షభులును॥ 9
వృషభ రాడ్విక్రముల్ ద్యుతివితతతనులు। పర్వతేంద్ర మి దెల్లమీ ప్రభల జేసి
మూడు దేవభాసితంబగు శోణినిచట॥ 10

తే. అమరతుల్యులు రాజ్యార్హు లగుదు రీరు । ఏలవచ్చితి రిచటి కీ లీల గాగ
పద్మపత్రేక్షణులు వీరవరులు నిజము । తత జటామండలంబుల దాల్తు రేల?॥

తే. వీరు లన్యోన్యసదృశులు మీరు జూడ । దేవలోకంబునుండి యేతెంచి రేమి?
మరి యదృచ్ఛగ యీ వసుంధరను జూడ । ఎలమివచ్చిన చంద్రసూర్యులరొ
మీరు॥ 12

తే. వీరులు విశాలవక్షులు విపులవపులు । దేవరూపులు మనుజులు గోవృషంబు
లనగ సములు మరి మహోత్సాహు లరయ । సింహసుస్కంధులౌదురు
శ్రీయుతులును॥ 13

తే. ఆయతములు సువృత్తముల్ బాహు లరయ।పరిఘుసమములు కరికరోపమములౌర
సర్వభూషణనిచయభూషార్హములును । ఏలనో విభూషితముగాక యిట్లులుండె?॥

తే. ఉభయులును యోగ్యులంచు నే నూహ జేతు । రక్షయొనరింప పృథివి
సర్వంబు దీని
తత ససాగర వనము కృత్స్నంబు మరియు । వింధ్య మేరు విభూషిత వితత
మహిమ॥ 15

తే. ధనువు లియ్యవి చిత్రముల్ ధాత్రి నెందు । లెస్స యొప్పను చిత్రానులేపనముల
పోల్ప హేమవిభూషితముల్ మహేంద్రు । వజ్రములబోలి వెల్గొందు వనిని నిచట॥

తే. బుసలగొట్టెడి పన్నగంబులను మించి । జీవితాంతకరంబులై చెలగు ఘోర
నిశితబాణాల తూణముల్ నిండియుండి । చూడ శుభదర్శనంబులై చోద్యమొప్ప॥

తే. మంచిఖడ్గంబులు మహాప్రమాణములును । నివె సువిస్తీర్ణములు వెల్గునిలను నిచట
తప్తహాటక భూషితతరళకాంతి । పోల్ప నిర్ముక్త పన్నగంబులో యనంగ॥ 18

తే. ఇటుల నే బల్క తాము భాషింపరేల? । కలడు సుగ్రీవుడనునొక్క కపివరుండు
అన్న చేతను వినికృతుండై ధరిత్రి । తిరుగు దుఃఖితుడై ధర్మహృదయు డతడు॥

తే. రాజు వానరవరుల కెల్లర కతండు । ఆ మహాత్ముండు సుగ్రీవుడనుప నేను
వచ్చినాడను హనుమయన్ వానరుండ । సఖ్య మిచ్ఛించు మీతోడ సరసుడతడు॥

తే. అతని సచివుండ విను పవనాత్మజుండ । వానరుండను స్వామికార్యంబు పొంటె
భిక్షురూపంబుగై కొని వచ్చి తిటకు । కామరూపుండ నెరుగుము కామగుడను॥

తే. ఇటుల వచియించి వీరు లా యిద్దరికిని । రామలక్ష్మణులకు నంత ప్లవగవిభుడు
మరియు మాటాడకుండె వాక్యజ్ఞు డతడు । వాక్యకుశలుండు కపిరాజ భటవరుండు॥

తే. అతని వచనంబు లయ్యవి యాలకించి । మిగులగ ప్రహృష్టవదనుడై మిహిరకులుడు
రామచంద్రుండు శ్రీయుతుం డామెయి నట । చెంత నిల్చున్న తమ్ముతో
చెప్పె నిట్లు॥ 25

తే. సచివు డితడు కపీంద్రు డా సాధుమతికి । అల్ల సుగ్రీవు కా మహితాత్మకునకు
అతనినే కాంక్ష సేయు నాయంతికమున । కీతడే యేగుదెంచె నదృష్ట మౌర॥ 26

తే. స్నేహయుక్తుండు వాక్యజ్ఞు డీ హరీశు । డల్ల సుగ్రీవు సచివుండు సౌను గాన
ఇతనితోడను భాషింపు మింక నీవు । మధురవాక్యాల నో శత్రుమర్దనుండ॥ 27

తే. గట్టి ఋగ్వేదపాఠి గానట్టిఘనకు । అల యజుర్వేదధారి కానట్టి మతికి
సామవేద మెరుంగని జనున కిట్లు । శక్యమౌనె ప్రభాషింప జగతిలోన॥

తే. తలప వ్యాకరణంబు కృత్స్నం బి తండు । చదివె చక్కగ పెక్కు మార్లిది
ధ్రువంబు
ఇంత సే పీత డెన్నొ భాషించియున్న ! దొరల దపశబ్ద మెందును తరచిచూడ॥

తే. ముఖమునందున నేత్రాల భ్రుకుటిలోన । ఇక లలాటాన గాత్రాన నెందుగాని
దోషమిసుమంతయును గాని దోచదోయి । చూడు మీతని యందు విశుద్ధునందు॥

తే. కర మసందిగ్ధమును నవిస్తరము నౌచు । అద్రుతంబును నవిలంబితంబు నౌచు
అదె యురస్థంబు కంఠగంబౌచు వినగ । మధ్యమస్వర మందున మాటవెడలు॥

తే. క్రమము సంస్కారసంపన్న మమల మరయు । అద్రుతంబును నవిలంబితంబు నైన
హృదయహారిణి కల్యాణి దివ్యవాణి । ఉచ్చరించును నీతండు స్వచ్ఛముగను॥

తే. అల్ల త్రిస్థాన సువ్యంజనస్థములను । బహుళ చిత్రంబులైన యీ వాక్యములను
ఎవనిచిత్తము సంతసం బింక గనదు । ఉద్యతాసి రిపుండై గా కోయి యతడు॥

ఆ.వె. ఇట్టి విధము దూత యే పార్థివున కుర్వి । నుండ డట్టి పతి కయోగ్యునకును
కార్యసిద్ధియెట్లుఘటియిల్లు లక్ష్మణా। ధన్యు డితని రాజు తరణిసుతుడు॥ 34

తే. ఇట్టి గుణగణములతోడ నెసగునట్టి । కార్యసాధకు లుందు రే క్ష్మావిభునకు
అతని సర్వార్థములు సిద్ధినందుచుండు । దూతవాక్యాలమూలాననే తరించి॥ 35

తే. ఇటుల రాముండు పల్క నాలించి ప్రీతి । మాటలాడెను సౌమిత్రి మదితలిర్ప
అల్ల సుగ్రీవసచివుతో హనుమతోడ । అపుడ వాక్యజ్ఞుడతడు వాక్యజ్ఞుతోడ॥ 36

తే. విదితమే మాకు పండితవృషభ వినుము । ఘను మహామహు సుగ్రీవుగుణము లెల్ల
అతనినే మేము వెదకు చీ యడవిలోన । ఇటు చరింతుము త త్ప్రవేశకు గనగ॥

తే. ప్రభుని సుగ్రీవు వచనంబు బట్టి నీవు । ఏమి చెప్పితివో మాకు నిప్పు డిచట
దాని నట్టులె నీవన్నదారిగానె । చేతు మింకను సత్తమా! స్థిరము హనుమ!॥ 38

తే. నిపుణ మా వాక్యమును విని కపివరుండు । పవనసుతుడు ప్రకృష్టరూపంబు నొంది
పతికి జయమబ్బునంచు భావంబు బొదల । తలచె సఖ్యమొనర్ప వారలకు పతికి॥

3వ సర్గ సమాప్తి – (198)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

నాల్గవ సర్గ - (౪)

రామలక్ష్మణుల నిజస్థితి తెలిసికొని, హనుమ వార లిరువురను సుగ్రీవుకడకు తన వీపున గొంపోవుట.

తే. మధుర సంభాష మల్ల లక్ష్మణుని మాట। విని ప్రహృష్టుండు నౌచు నావీరహనుమ
రామునకు నేదొ పని కపిరాజుతోడ । కలద టంచెంచి సుగ్రీవు దలచె మదిని॥

తే. కలుగు రాజ్యాగమం బింక కపివరునకు । అల్ల సుగ్రీవు కా మహితాత్మకునకు
పనిగలిగి వచ్చి నార లీ మనుజవరులు। కలుసు కార్యంబు మనకును; కలుగు ఫలము॥

తే. పరమ సంహృష్టుడై యంత ప్లవగవరుడు । హనుమ వాక్యవిశారదుం డనిలసుతుడు
పలికె వాక్యంబు నిట్లు లలితభంగి । రామచంద్రునితోడ నా ప్రభునితోడ॥

తే. ఏమికార్యంబుగావచ్చి రీ వనంబు । మహిత పంపోపకాననమండితంబు
జగతి నానామృగవ్యాళ సంకులంబు । ఘోరదుర్గంబు సానుజు లీరు చెపుడ॥ 4

తే. అతని యా మాట లాలించి యనుజు డంత । రామచోదితుడౌచు నా లక్ష్మణుండు
దశరథాత్మజు రాము నా విశదయశుని । ఆ మహాత్మునిగూర్చి యిట్లనుచు జెప్పె॥

తే. రాజు దశరథనాముండు ప్రకటయశుడు । ప్రభుడు ద్యుతిమంతు డల ధర్మ వత్సలుండు
నిత్యము స్వధర్మనిరతిని నిఖిలప్రజల । నాల్గువర్ణాల పాలించు నా నృపుండు॥ 6

తే. లే డతని నెందు ద్వేషించు వా డెవండు । అతడు నెవ్వని ద్వేషింప డయ్యె ఎపుడు
సర్వభూతాళి నాతండు సాకుచుండు । రెండవపితామహుండును నా నృపవరుండు॥

తే. ఆప్తదక్షిణలన్ మహాయశు డతండు । యజ్ఞములను నగ్నిష్టోమమాదిగాగ
సలిపియుండెను పుణ్యుండు తేజోవిభుండు॥ 8

తే. అతని ప్రకృతింపు పూర్వజుం డయ్యె యితడు । రామనామంబున జగాన ప్రథితు డెపుడు
సర్వభూతాళికి శరణ్యు డుర్వివిభుడు । ప్రకటిత పితుర్ని దేశపారగుడు ఘనుడు। 9

తే. ఇతడు వీరుండు; దశరథసుతులలోన । నిజము గుణవత్తరుండు వినిదప్రమతియు
రాజలక్షణసంపన్ను డోజ గలడు । రాజసంపదనొప్పు విభ్రాజయసుడు।

తే. రాజ్యవిభ్రష్టతన్ జెంది పూజ్యు డితడు । వని వసింపంగవచ్చెన న్ననఘ! కూడి
వశి, మహాతేజు డితని భార్యసీత । అనుసరించెను నీతని నడవులకును
దివి దివాకరు నా మహాతేజు వెంట! రహి దినక్షయమున నేగు ప్రభయనంగ॥

తే. నేనొ యితనికితమ్ముండ; సిత్య మనఘ । ఇతనికి కృతజ్ఞునకు బహుశ్రుతున కేను
దాస్య మంగీకరింతు గుణాధికేను । పేరు లక్ష్మణు డందురు పృథివిజనులు॥

తే. విను సుఖార్హున కీ మహార్హునకు కృతికి । సర్వభూతహితాత్మునకుర్విపతికి
పృథివిరాజ్యంబు నైశ్వర్యములను బాసి । వనగతుండైన యితని కే బంటు నాదు॥

తే. రాక్షసు డెవండొ యితని భార్యను హరించె। కామరూపుండు నొంటిమైకాననుండ
అట్టు లాపెను హరియించి నట్టి యసుర । ఎవ్వడో మాకు తెలియ లే దింత కనఘ॥

తే. క్షితి దనుర్నాము డొక్కండు దితిసుతుండు । రాక్షసతనొందె శాపకారణముగాగ
అతడు జెప్పెను మాకు సమర్థు డొకడు । గలడు సుగ్రీవుడను కపికులు డటంచు॥

తే. ఆ మహావీర్యు డెరుగును రామచంద్ర! । నీదు భార్యాపహారుని విజ మటంచు
చెప్పుచు కబంధు డాతండు శీఘ్ర మేగె । భ్రాజమానుండు సుఖముగా స్వర్గమునకు॥

తే. ఇంతవట్టును మాదు వృత్తాంత మెల్ల । అడుగుటను జెప్పితిని యథాతథ్యముగను
నేను రాముండు సుగ్రీవు నీదుపతిని । శరణుబొందితి మయ్యె యా సవితృసుతుని॥

తే. విత్తముల దానమొనరించి వితతముగను । యశ మనుత్తమమొంది మున్ననఘ యితడు
లోకనాథుండు నయ్యె నస్తోకుడయ్యె । కోరు సుగ్రీవు నాథుగా క్షోణినిపుడు॥

తే. ఎవని తండ్రి మహామహుం డెసగె మున్ను । ధర శరణ్యుండు ధర్మవత్సలుడునాగ
అతని సుతుడు శరణ్యుండునైన తానె । శరణ మొందును సుగ్రీవుసవితృపుత్రు॥

తే. సర్వలోకాళికి శరణ్యు డుర్విభుడు । రక్షకుండును ధర్మాత్ము డక్షరుండు
గురువు నాకు, రఘూద్వహుం, డరిదమనుడు । కోరు సుగ్రీవు శరణంబు నార ! యిపుడు॥ 20

తే. ఎవ్వని ప్రసాదమున సతం బీ ప్రజాళి। తనివినొందుచు మది ప్రసాదంబుగంద్రు
అట్టి రాముండు కాంక్షించునయ్య నేడు। వానరేంద్రు ప్రసాదంబు వసుధ నిచట॥

తే. పృథివిగల సర్వపార్థివుల్ వితతబలులు। విపుల సర్వగుణోపేతు లెప్పుడు మునుప్రు
ఏ మహారాజుచేత ననేకగతుల। సతము మానితు లగుచుండు రతుల లీల॥ 23

తే. అట్టిదశరథు కితడు జ్యేష్ఠాత్మజుండు! విశ్రుతుడు మూడులోకాల వినుమ హనుమ!
నేడు శరణొందవచ్చె నిర్నిద్రగుణుడు। కీశపతి కిట మీదు సుగ్రీవునకును॥

తే. ఇటుల శోకాభిభూతుడై యేగుదెంచి। ఉగ్రశోకార్తి శరణంబు నొందునట్టి
రామచంద్రుని నింక మీ ప్లవగవిభుడు। తగు ప్రసాదింప సుగ్రీవు డగచరుండు॥

తే. సాశ్రులోచనముల నిట్లుజాలిగాగ। పలుకు సౌమిత్రిజూచి తా లలితఫణితి
హనుమ వాక్యవిశారదుం డనునయమున। వాక్యమిటుబల్కె బహు లబ్ధ పావమాని॥

తే, ఈదృశుల బుద్ధిసంపన్నులైనవారి। ధృతి జితక్రోధులను జితేంద్రియుల వెదకి
స్వయము సుగ్రీవుడే కాంచవలయువచ్చి। ఇక యదృష్టము దర్శనం బిడిరి తా మె॥

తే. అతడు రాజ్యపరిభ్రష్టుడై కలంగి। తిరుగు హృతదారుడై యన్న తరుమగొట్ట
భ్రాత యా వాలితో కృతవైరు డిట్లు। వినికృతుండౌచు త్యక్తుడై వనిఁజరించు॥

తే. చేయు తప్పక మీకు సహాయమతడు। అల్ల సుగ్రీవు డా భాస్కరాత్మజుండు
సీత పరిమార్గణమొనర్ప సిద్ధమింత। భటులమాతోడ గూడి యా పటుబలుండు

తే. ఇట్టు లనుచును హనుమంతు డెంతొ ప్రీతి। మధురఫణితిని బలుకుచు మహిపుతోడ
"ఇంకపోదముపదుడు సుగ్రీవుకడకు" । ననుచు వచియించె నుత్సాహమచ్చుపడగ

తే. ఇటుల వచియించు హనుమంతు పటుబలాఢ్యు। గాంచి సౌమిత్రి ధర్మాత్ము డంచితుండు
అతని కా దూత కిక యథాన్యాయముగను। పూజలొనరించి యన్నతో పూజ్యు డనియె॥ 30

తే. హనుమ సంహృష్టు డీ మారుతాత్మజుండు। కపి వచించు నిజమ్ము, రాఘవ, ధ్రువమ్ము
మనవలనగూడ పనిగల్గి వచ్చె నితడు। నీవు కృతకృత్యుడవు నమ్ము దేవ! యింక॥

తే. ఇతని ముఖవర్ణము ప్రసన్న మతులితంబు। హృష్టుడై వ్యక్తముగ సుభాషించుచూడు
అనృతము వచింప డీ మారుతాత్మజుండు। హనుమ పేరుండు సుకృతి మహా మహుండు॥ 32

తే. అంత నతఁడు మహాప్రాజ్ఞుఁ డనిలసుతుఁడు । హనుమ కపికుంజరుండు తత్ ప్లవగవరుడు
వీరు లా రాఘవుల తన వీపుపైన । నిడుకొనుచు నేగె హరిరాజుకడకు వడిగ॥ 34

తే. భిక్షురూపంబుత్యజించి వేగ నపుడె । వానరుని రూపమును బొంది ప్లవగవరుఁడు
పృష్ఠమున వీరు లవ్వారి హృష్టమతిని । వేగ నెక్కించుకొం చేగె విన్నుదారి॥

తే. విపులయశుఁడును ప్లవగప్రవీరు డతడు । పవనపుత్రుఁడు కృతకృత్యువతుగ పొంగి
వెడలె శుభమతి నురువిక్రముఁడు గిరీంద్ర । మపుడ జేరంగ రామలక్ష్మణుల గొంచు॥

4 వ సర్గ - సమాప్తి - (233)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### అయిదవ సర్గ - (32)

**రామసుగ్రీవులు అగ్నిసాక్షిగ సఖ్యమొనర్చుకొనుట.**

తే. ఋష్యమూకంబునుండి తా నెగిరిహనుమ।మలయగిరి జేరి, రామలక్ష్మణులుఘనులు
వీరు లయ్యద్రి కటకంబు జేరినట్టి । వార్త కపిరాజుతో జెప్పె ప్రభు డెరుంగ॥

తే. చండ దృఢవిక్రముండు రాముండితండు । మరి మహాప్రాజ్ఞు డిచ్చటి కరుగుదెంచె
తమ్ముడా లక్ష్మణుని గూడి తరణికులుడు । సత్యవిక్రము డా రామచంద్రు డధిప॥

తే. పుట్టె నిక్ష్వాకులమున పుణ్యమూర్తి । దశరథాత్మజు డీ రామధరణి విభుడు
నిగదితుండైన సద్ధర్మనియతి జగతి । జనక నిర్దేశపారగుండును జితారి॥ 3

తే. నియతుడు మహాత్ము డీతండు భయము దక్కి । వని వసింపుచునుండ రావణునిచేత
అకట అపహృతయయ్యె నీ యనఘు భార్య । కాన, నిటవచ్చె శరణొంద
కపిని నిన్ను॥ 4

తే. రాజసూయాశ్వమేధాల నోజ జేసి । వహ్ని నభితర్పితమొనర్చె ప్రభు డెవండు
దక్షిణలతోడ గోవుల లక్షలుగను । దాన మిచ్చెను భూరి వదాన్యు డెవడు॥ 5

తే. సత్యవాక్యంబునను తపఃశ్శక్తివలన । వసుధపాలించె నెవ్వాడా ప్రభుని సుతుడు
వచ్చె స్త్రీహేతువున నిట్లు సచ్చరిత్ర!।శరణమొందును రాముండు స్వామి!నిన్ను।

తే. సఖ్యకాములు రామలక్ష్మణులు వీరు । భ్రాతలిద్దరు నీతోడ భవ్యచరిత!
శీఘ్రమె ప్రతిగ్రహించి యర్చించు మయ్య । పూజనీయతముల్ వీరు భూప!మనకు॥

తే. విని కపీశుండు హనుమంతు డనిన మాట । హృష్టమానసు డౌచు సుగ్రీవు డపుడు
రామువలని భయంబు ఘోరంబు విడిచి।మదిని విగతజ్వరుండయ్యె మర్కటుండు॥ 8

తే. అంత మానుషరూపంబు నవధరించి । అల్ల సుగ్రీవు డా ప్లవగాధిపుండు
దర్శనీయతముండునై తద్ద వెల్గి । ప్రీతి వచియించె రఘుకులనేత కిటుల॥

తే. తాము ధర్మవినీతులు ధన్యు లంచు । సర్వవత్సలులంచు నఖర్వులంచు
వినుతవిక్రాంతులంచు మీ గుణములెల్ల । వాయుపుత్రుడు జెప్పె సర్వంబు నాకు॥

తే. కాన, యిప్పటుదైన సత్కారమెల్ల । లాభ ముత్తమ మెల్ల నాయదియ ప్రభువ!
వానరుడనైన నాతోడ భూనుతుండ! దేవ! సౌహార్ద మిచ్ఛింతు నీవె వచ్చి॥ 11

తే. అనఘ, ఇష్టంబయేని సఖ్యంబు నీకు । మరి ప్రసారిత మిదియె మద్బాహు వింక
పాణి పాణిని గ్రహియింపు మానవేంద్ర! । స్నేహమర్యాద ధృవము బంధింపు
మయ్య॥ 12

తే. అటుల సుగ్రీవు డన్న సుభాషితంబు । విని ప్రహృష్టమనంబున మనుజవిభుడు
పాణి పాణిని గ్రహియించి ప్లవగపతిని । కౌగలించెను గాఢంబుగాగ నపుడె
హృద్యమైనట్టి సౌహృదం బెడద, బూని॥ 13

తే. అంత హనుమంతు డా యరిందముడు ఘనుడు । భిక్షురూపంబు త్యజియించి తత్క్షణంబ
స్వస్వరూపంబు దాల్చి,కాష్ఠముల దెచ్చి।అరణి మథియించి పుట్టించె నగ్ని నందు॥

తే. దీప్యమానంబు వహ్ని సత్కృతము నంత । పుష్పములతోడ పూజించి ముదము నంది
హనుమ సుసమాహితుండౌచు నపుడు దాని । రామసుగ్రీవులకు మధ్య రహిని నునిచె॥ 15

తే. అటుల మండుచునున్న యా యగ్నిచుట్టు । పరమభక్తి బ్రదక్షిణం బాచరించి
రామసుగ్రీవు లప్పుడు ప్రేమమీర । సఖ్యమొనరించుకొని రగ్నిసాక్షి గాగ॥ 16

తే. అంత సుప్రీతులై యిద్ద రమితముగను । ఆ హరీశ నరేశు లా యనఘ మతులు
కూర్మి నన్యోన్య మీక్షించు కొనుచునుండి । తనివి జెందరు నెంతసేపునకు గాని॥

తే. ప్రాణమిత్రుండ విపుడు నా కయితి నీవు । ఇంక సుఖదుఃఖములు మన కేక మేను
అనుచు సుగ్రీవు డపుడు వాక్యంబు బలికె । కడు ప్రహృష్టుండు నౌచు రాఘవునితోడ॥ 18

తే. పర్ణబహుళంబు పుష్పసంకీర్ణమైన । సాలశాఖను నొకదాని సరగ విరిచి
పరచి నేలను సుగ్రీవు డురుగుణుండు । కూర్మి రామునితోడ దా గూరుచుండె॥

తే. హనుమయును నంత సంహృష్టుడై యెడంద । పరమపుష్పితచందనతరువరంపు
శాఖ నొకదాని విరిచి యచ్చటను బరచి । చెంత లక్ష్మణు గూర్చుండజేసె ప్రీతి॥
తే. అంతట ప్రహృష్టుడౌచు నా హరివరుండు।మృదుమధుర వాక్యములను సుగ్రీవుడిట్లు
పలుకజొచ్చెను రఘుకులవరునితోడ । హర్ష సంవ్యాకులంబులౌ నంబకముల॥ 21
తే. నేను వినికృతినొంది యీ కానలోన । తిరుగుదు భయార్దితుండనై దిక్కుగనక
రామ! హృతభార్యుడనునౌచు భ్రిమసి సొలసి । దూరి బ్రతుకుచునుంటి యీ
దుర్గమందు॥ 22
తే. అన్నయగు వాలిచేత నాపన్నుడ నయి । అతడు నాపైన పగబూని హడలగొట్ట
దిగ్భ్రమన్ జెంది భీతిల్లి దిగులు జెంది । కంపబడినట్టికాకినై కలగుచుంటి॥ 23
తే. వాలిచేత భయార్తుండ నైన నాకు । అభయమిమ్ము మహాభాగ యర్కవంశ్య!
ఉర్వి నే రీతి భయము లేకుండు నాకు । అటులొనర్పుము కాకుత్స్థ! అయమిత తేజ॥
తే. ఇటుల సుగ్రీవు డనగ నా యినకులుండు । పరమధర్మజ్ఞుడౌ ధర్మవత్సలుండు
పలికె తేజస్వి కాకుత్స్థ డలఘుయశుడు । చిరునగవుదోప బదులిట్లు శ్రీయుతుండు।
తే. అరయ మిత్రత్వ ముపకారఫల మటంచు । విదితమే నాకు వానరవీరవర్య
ఇంక వధియింతు వాలి నా యిందిరసుతుని । నీదు భార్యాపహారుని నిక్కమింతే॥
తే. సూర్య సంకాశము లమోఘవీర్యము లివె।నిశితములు నాదు శరములునిక్కమింకే
వేగితంబులు వ్రాలు దుర్వృత్తుపైన । అల్ల నీయన్న యా వాలిపైన చూడు॥
తే. కంకపత్రప్రతిచ్ఛన్నకాండతతులు । బహుళ తీక్ష్ణాగ్రములు ఋజుపర్వములును
మరి, మహేంద్రాశని సమంబు లరయుమింక! పడు సరోషాహు లట్టులా వాలిపైన॥
తే. అన్న వాలిని నిప్పుడే యరయ గలవు । ఉగ్రశరముల నాశీవిషోపమముల
కూరతరముల భూమిపై కూలి పడగ । పర్వతంబు వికీర్ణ మగు భంగిగాగ॥ 30
తే. ఆత్మహితముగ శ్రీరాము డన్న యట్టి । వచనమిది విని యప్పుడా ప్లవగవిభుడు
ప్రీతి పరమంబు నొంది సుగ్రీవు డెడద । లలితగతి సుమహద్వాక్య మెలమిబలికె॥
ద్వి నీ ప్రసాదాన నేను నృపతి! నృసింహా! । రాజ్యంబు నా ప్రియన్ రాఘవ! యింక
పొందంగవలె నిప్డె భూపాలచంద్ర! । రిపుని మదగ్రజున్ పృథువైరి నతని
త్వర నిప్డె వధియించు తెరువెద్ది కలదొ । అరసి యట్లొనరింపు నరదేవ! నీవె॥
తే. సీత, వాలి, నిశాచరనేతలకును । వామనేత్రాలు రాజీవహేమ వహ్ని
సమములు స్ఫురించె సమముగా చటుకు నప్డె । రామసుగ్రీవసఖ్య సల్లాపవేళ॥
5వ సర్గ సమాప్తి (265)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఆరవ సర్గ – (26)

సీత విడిచిపెట్టిన నగలను సుగ్రీవుడు తెచ్చి రామునకు చూపుట; వానిని గుర్తించి రాముడు దుఃఖించుట.

తే. అంత, మరియును నిట్లంచు హరివరుండు । ప్రీతి రఘునందనునితోడ హృదయమలర
రాఘవునితోడ సుగ్రీవు డోఘబలుడు । బలుకజొచ్చెను వాక్యంబుపటుతరంబు॥

తే. సచివు డీతండు నామంత్రిసత్తముండు । రామ! వచియించె హనుమ నీ వో మహాత్మ!॥
ఏ నిమిత్తంబు నిర్జనం బీ వనంబు । వచ్చియుంటివో సర్వంబుసచ్చరిత్ర!॥

తే. తనుస్మ డీ లక్ష్మణునితోడదండకోర్వి । నీవు వసియింపుచుండ నీ దేవిసీత
భార్యమైథిలి జనక భూపాలు దుహిత । అపహరింపంగబడె నంట యసురుచేత॥

తే. నీవు లక్ష్మణు డీత డీ ధీవిశాలు । డెవరు లేనట్టియదను కన్పెట్టి యసుర
దేవిని హరించెనంట రోదించు సతిని । అడ్డుపడిన జటాయు గృధ్రింబు జంపి॥

తే. అకట భార్యావియోగజం బైన యట్టి। దుఃఖ మచిరంబె యిక వీడుదువు మహాత్మ
సీత గొనిదెత్తు నేనె విఖ్యాతిమీర । నష్టవేదశ్రుతిని నట్లు నిష్టతోడ॥ 6

తే. విను రసాతలముననున్న మింటనున్న । నీదు భార్యను గొని తెచ్చి నీకునిత్తు
అనఘ! నామాట యిది తథ్య మనుచు నీవు । రాఘవ! యెరుంగు, శత్రుమర్దన, గుణాఢ్య॥

తే. ఇంద్రుతోడి సురాసుర లేని చెలగి । నీదుభార్యను గొనిపోయి నిక్కమింక
విను, మహాబాహు! జీర్ణించుకొనగ లేరు । విషకృతంబైన భక్ష్యంబు విధముగాగ॥

తే. విడువు శోకంబు నో మహావిపులబాహూ! దేవి నీకాంత నే గొని తెత్తు ధ్రువము
అవును, నిజ మామెయే సీత యనుచు నూహ। దెలిసికొంటిని నిప్పు డందియ
మి కేల?। 8

తే. క్రూరకర్ముండు రాక్షసుం డొకరు నాకు। అపహరించుచు కొనిపోవ నంబరమున
నగసితిని నేను రామరామా యటంచు। లక్ష్మణా యంచు సతి విస్వరాననరువ॥

తే. పన్నగేంద్రవధూ త్తమం బనగు లీల। రావణాంకంబునందు నల్లాడుచుండి
కాంచె నాతోడ నేవురు కపులనామె। గిరితటంబున మే మప్డు తిరుగుచుండ॥ 10

తే. పమిటకొంగున గట్టి యాభరణములను। వసుధపై యామె వైవ దివ్యములవాని
తీసిదాచితి, మవి కొని తెత్తుమిపుడె। గురుతుపట్టుము వానిని నరసి దేవ॥ 11

తే. ఇటుల ప్రియవార్త చెప్ప నా యినతనూజు।కపివి సుగ్రీవుగాంచి సఖా!మహాత్మ
వేగ తెప్పింపు వానిని జాగి కేల। యనుచు రాముండు పలికె తత్క్షణము బెగడి॥

తే. నృపతి యిట్లన కదలి సుగ్రీవుడపుడ। గహనమైనట్టి యొక శైలగుహాముఖంబు
జొచ్చి పోయెను నగలను దెచ్చుటకు। రాఘవప్రియకామ్యత ప్లవగనేత॥ 13

తే. ఉత్తరీయానగట్టిన నుత్తమములు। మండనంబుల దెచ్చి యా దండనునిచి
"ఇవియె చూడుము రాఘవా యింతినగలు।వీని"నని చూపె నతనికా వానరుండు॥

తే. త్వరగ నా యుత్తరీయంబు మరియు నందు। ముడిచియున్నట్టి నగలను వడి
గ్రహించి
బాష్పసంరుద్ధుడయ్యె నా పార్థివుండు। అట్టి నీహారమున చంద్రుడట్టు లపుడు॥

తే. సీతపై బొల్చు స్నేహప్రవృత్తి వలన। నుబుకు బాష్పాల మునిగి యా యుర్వీ
విభుడు
"హా! ప్రియా"యంచు రోదించి యడలి యార్చి। ధైర్యమునువీడి పడియె హా
ధరణిపైన॥ 16

తే. పమిటికొంగును నగలను పారజూచి। మాటిమాటికి రొమ్మునను దుముకొనుచు
భృశము నిశ్వాసమొనరించి నృపవరుండు। సర్పము బిలస్థ మల్ల రోషతను నట్లు॥

తే. కనులవెంట నవిచ్ఛిన్న గతిని వెడలు। నశ్రువుల దోగి పార్శ్వాన నప్పుడున్న
లక్ష్మణుని జూచి దీనత రామవిభుడు। అకట! పరిదేవనంబు సేయం గడంగె॥

తే. చూడు, లక్ష్మణ, వైదేహి క్షుద్రుడసుర। తనను నింగిని గొనిపోవు తరుణమందు
దూసివైచిన నగలును వాసిమీరు। కోకకొంగును దీనిని గురుతుగనుము॥ 19

తే. సీత హ్రియమాణ నగల నీ క్షితితలాన। వైచు నప్పుడు ♦ పచ్చికబయలుమీాద
వైచియుండును ధ్రువము కాబట్టి యేను। చితుక కట్టులె యున్నవి చిత్రమోాయి!॥

తే. రాము డిట్లన నప్పు డా లక్ష్మణుండు। పలికె నిట్టుల వాక్యంబు భక్తిమీాఱ॥

తే. ఎఱుగ కేయూరముల మతి యెఱుగ దేవ! కుండలంబులగాని యీా మండనముల
నూపురంబుల మాత్ర మే నోపు దెఱుగ। * నిత్యమును పాదవందననియతికతన॥

తే. నృపతి దీనత నప్డు సుగ్రీవు జూచి। పలికె నిట్టుల హృదయంబు కలతజెంద॥
చెప్పు సుగ్రీవ! నా ప్రియ సీత నకట। ప్రాణములకంటె ప్రియను నా రక్కసుండు
రౌద్రరూపుండు గొంచు నే పక్క కపుడు। ఏ దిశకు బాఱుచుండ వీక్షించినావొ॥

తే. ఉండు నెచ్చట తద్రాక్షసుండు ఖలుడు। నాకు గూర్చె మహద్వ్యసనంబు వీడు
ఇంక జంపుదు నిఖల నైరృతకులంబు। పూని యీా యొక్కని నిమిత్త మేను
ధ్రువము॥ 24

తే. అరరె! హరియించె మైథిలి నడవి నెవడు। నాకు రోషంబు గల్గించె వీక నెవడు
తనదు జీవిత మంతంబు గనెడుకొఱకు। ఎవడు తెఱచె మృత్యుద్వార మేడివాడు?॥

తే. దయితతర నాకు హృతయయ్యె దండకోర్వి। రజనిచరుచేత; యెవ్వ డా
రక్కసుండు?
చెప్పు వానిని నారిపు నిప్పు డేను। బంపివైతు యమాలయం బనఘ! ప్లవగ।

♦ పాఠాంతరం-మృగుల శాద్వలము మీాద। * నిత్యపాదాభివందన నియతికతన.

6 వ సర్గ సమాప్తి - (291)



తే. బాష్ప మాపతితంబు ధైర్యమున తాము । నిగ్రహింపంగ దగుదురు నిరుపమాన!
సత్త్వయుక్తుల కెపుడు మర్యాదయైన । ధృతిని విడువంగ నర్హ మింతేని గాదు॥

తే. వ్యసనములగాని, అర్థకృచ్ఛ్రముల గాని । జీవితాంతక భీకర స్థితినిగాని
స్వీయబుద్ధిని కడు విమర్శించి పనుల । చేయునేగాని కూలండు ధృతియుతుండు॥

తే. బాలిశుండైన నరుడె నిత్యంబు దేవ! మదిని వైక్లబ్యమునుబొంది మఱుగుచుండి
అవశుడై శోకమున మున్గి యడలుచుండు।అబ్ధినావ భారాక్రాంత మనెడుభంగి॥

తే. ఇదియె యంజలి బట్టి ప్రార్థింతు దేవ!। స్నేహమున నిన్ను నూరడించెద మహాత్మ!
పౌరుషంబూనుమయ్య భూపాలచంద్ర! । శోకమున కిట్టు లెడమీయ నీకు తగదు॥

తే. ఎవరు శోకంబె సత మాశ్రయింతురో దేవ! । లేదు వారికి సుఖ మింక లేశమేని
తేజమును క్షీణమౌను తద్విధముప్రజకు । కాన, శోకింపతగదు నీ కో నృపాల॥

తే. శోకమునను ప్రపన్నుడై స్రుక్కునట్టి । మనుజునకు జీవితంబె సంశయము నొందు
కాన, రాజేంద్ర!శోకంబు మానుమయ్య। కేవలం బింక ధైర్యంబె దేవ!కొనుమ॥

తే. హిత మిది వయస్యభావాననే మహాత్మ । ఇటుల జెప్పుదు నుపదేశమేమిగాదు
నా వయస్యత నీవు మాన్యతను గొంచు । శోక మిక వీడుమయ్య, రక్షోప్రహంత!॥

తే. మధురముగ నిట్లు సుగ్రీవు డధిక మెలమి । నూరడిల బల్కనాలించి భూరిభుజుడు
ముఖము నశ్రుపరిక్లిన్నమును విభుండు।తనదు వస్త్రాంతమున తుడ్చుకొనియెనపుడు॥

తే. ప్రభుడు సుగ్రీవు వచనాల నాలకించి । ధృతిని కాకుత్స్థు డిక ప్రకృతిస్థు డగుచు
ప్రీతి గాఢంబుగా కౌగలించి యతని । వచన మిటుబల్కె రాముండు వశి జితారి॥

తే. ఇక వయస్యుండు స్నిగ్ధుండుహితుడు క్షితిని।అనఘ కర్తవ్యమేది సేయంగవలయు
దాని ననురూపముగను యుక్తంబు గాను । చేసి తీవోయి సుగ్రీవ! స్థిరసఖుండ॥

తే. అనఘ! నీచేత ననునీతుడను సఖుండ । ఇటుల ప్రకృతిస్థుడను నైతి ధృతివహించి
దుర్లభులు బంధు లీదృశుల్ ధ్రువము ధాత్రి । మరి విశేషించి యిట్టి యాప
దలయందు॥ 18

తే. అనఘ నీకింక వినుము కార్యంబు సఖుడ। సీత వెదకెడు యత్నంబు భూతలాన;
రాక్షసుండు దురాత్ముండురావణుండు । రౌద్రు గనుగొను పనియు కర్తవ్య
మోయి!॥ 19

తే. ఇంక నాచే యనుష్ఠేయ మేమికలదో । నాకు విస్రబ్ధముగ జెప్పుమో కపీంద్ర!
జగతి సుక్షేత్రమందు వర్షమున నట్లు।సఫలమౌనుసుమ్మి నాయందు సర్వమోయి!॥

తే. ప్రకటముగ నద్ది నే నిప్డు పలికినానొ । అభిమతంబున జేసి తే ప్రతిన నిపుడు
అది యథార్థమటంచు నీ మదిని సఖుడ! । ధ్రువముగా నమ్ము ప్లవగశార్దూల నీవు॥

తే. అనృత మెన్నడు మునుపు నే నాడియెరుగ । ముందు వచియింపబోనెప్డు ముఖ్య
మిత్ర!
పలికి యుంటిని ప్రతిన నీ భ్రాంతగూల్ప । శపథమొనరింతు నీకుగా సత్యమునను॥

తే. రాము వచనాల విని, మరి ప్రతిన వినియు । వానరులతోడగూడి యా వాన
రుండు
సచివతతితోడగూడి యా సవితృసుతుడు । హర్షమొందెను సుగ్రీవు డంచితుండు॥

తే. అంత యేకాంతమున జేరి యా హరీశ । నర కులేశులు మాటలన్యోన్య సదృశ
మేవియో చెప్పుకొనిరి యెంతేని నేపు । సుఖములును దుఃఖములు నెల్ల నుద్ధ
మతుల॥ 24

తే. ఆ నరర్షభు, మరి యా మహానుభావు। వచనముల నెల్ల నాలించి వానరుండు
కృతమె తనకార్యమంచు దా నెడద నెంచె । చండ హరివీరముఖ్యుండు
పండితుండు॥ 25.

7వ సర్గ సమాప్తి – (316)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఎనిమిదవ సర్గ - (46)

**తనకును అన్నకును గలిగిన వైరకారణమును సుగ్రీవుడు రామునితో సంక్షేపముగ చెప్పుట**

తే. మాట లవ్వాని వలన నా మర్కటుండు। హృదిని పరితుష్టి నొంది సుగ్రీవుడపుడు
లక్ష్మణుని కగ్రముననున్న రాము జూచి । వచన మిటుబల్కె మధురమహా
భంగిగాగ॥ 1

తే. సర్వథా నేను దేవతా సమితికెల్ల । నిజ మనుగ్రాహ్యుడను నైతి నిశ్చయంబు
తాము సర్వగుణోపేతు లో మహాత్మ । నాకు సఖులైరి, యేమందు నాదు పెంపు॥

తే. నీ సహాయాన ప్రభువరా! నిక్కముగను। శక్యమహా నొంద సురరాజ్య చక్రిమేని
ఇక స్వరాజ్యంబు గొనుమాట యేల జెప్ప । అనఘ శ్రీరామచంద్ర, మహానుభావ॥

తే. సుహృదులకు బంధువులకు నేను బహుళగతుల । ఖ్యాతి నింక సభాజ్యుండ
నైతి రామ
అగ్నిసాక్షిగ మిత్రత్వ మవని నిట్లు । బడయగల్గితి రాఘవవంశజంబు॥ 4

తే. రూఢి నేనును నీ కనురూపుడైన । మిత్రుడ నటంచు నెరిగెదు మెల్లమెల్ల
స్వాయము నాదగు సద్గుణచయమునేనె । చెప్పుకొనగ సమర్థుండ నప్ప! కాను॥

తే. భువి మహాత్ములకును మిమ్ముబోలు నట్టి। కడు కృతాత్ములకును ప్రీతి గలుగునేని
అది కరం బిక నిశ్చలంబై యెసంగు । ఆత్మవంతుల కెసగు ధైర్యంబు బోలె॥

తే. సాధు లొండొరులవిమైన సాధనముల । రజతములను సువర్ణ వస్త్రాదికముల
మండనంబుల నెప్పు డఖండములుగ । మరియు నవిభక్తములుగానె మదుల నెంత్రు॥

తే. ఆఢ్యుడే కాని నిరుపేదయైన గాని । దుఃఖితుడె కాని మరి సుఖితుండె కాని
ధృవము నిర్దోషిగాని సదోషిగాని । క్షితి, వయస్యుండె పరమమగు గతి తలంప॥
తే. ధర ధనత్యాగమును సుఖత్యాగ మార । ఇంక నిజము దేహత్యాగమేని గాని
జరుగుచుండు వయస్యార్థ మరయ నెందు । స్నేహ మనగ నిజం బట్లె చెల్లు
చుండు॥ 9
తే. అది నిజం బట్టులే యంచు విదితముగను । పల్కె రాముండు తత్ప్రియవాదితోడ
లక్ష్మి వాసవసముతోడ లక్ష్మణునకు । సరస నపుడున్నయట్టి ధీశాలితోడ॥ 10
తే. రాము, లక్ష్మణు, నా మహాభీమబలుని । నచట నిలుచున్న వారల సరసి కపియు,
దృష్టి నప్పుడు నాలుగు దిక్కులకును । బరపె సుగ్రీవు డెలమి నా స్తరణమిడగ॥
తే. సాల మవిదూర మం దంత చక్షు గతికి । గానిపించె హరీశున కతని కెదుట
భ్రమరశోభితమును సుపుష్పంబు మరియు । వృక్ష మించుక పత్రాఢ్య మెత్తు
గాను॥ 12
తే. పర్ణబహుళంబు మరి సుపుష్పంబు నొకటి । శాఖ నా సాలముననుండి సరగ విరిచి
పరచి యచ్చట కూర్చుండె హరివరుండు । సఖుడు సుగ్రీవు డా రామచంద్రు
తోడ॥ 31
తే. అటుల వారలు నాసీను లగుట జూచి । హనుమయును సాలశాఖ యన్యంబు విరిచి
లక్ష్మణు వినీతు దానిపై లక్షణముగ । కూరుచుండంగ జేసె నెంపారు ప్రీతి 14
తే. అటుల ఫలపుష్ప సంకీర్ణమైన యట్టి । గిరివరోత్తమ మద్దాని చరియయందు
ప్రభుతను సుఖోపవిష్టుడై రాఘవుండు । ఉదధివోలె ప్రసన్నుడై యున్న తరిని॥
తే. అంతట ప్రహృష్టుడౌచు నా హరివరుండు । మృదుమధురవాక్యములను సుగ్రీవు
డిట్లు
పలుకజొచ్చెను రాముతో ప్రణయముననను । హర్ష సంవ్యాకులంబులౌ నక్షరముల॥
తే. నేను నాయన్నచే వినికృతిని బొంది । తిరుగుదు భయార్దితుండనై గిరివరాన
ఋష్యమూకాన నిటుల హా దిక్కులేక । హడలి హృతభార్యుడ సుదుఃఖితు
డను నౌచు॥ 17
తే. అన్నయా వాలిచేత ఆపన్నుడ నయి । అతడు నాపైన పగబూని హడలగొట్ట
దిగ్భ్రమన్ జెంది భీతిల్లి దిగులు జెంది । కంపబడినట్టికాకి నా కలగుచుంటి। 18
తే. వాలిచేత భయార్తుండనైన నాకు । సర్వలోకాఽభయంకరా! స్వామి! నీవు
తగుదు విడగ ప్రసాదంబు దాశరథిరొ । దీనున కనాథునకు నింక దేవదేవ!

తే. ఇటుల సుగ్రీవు డనగ నా యినకులుండు । పరమ ధర్మజ్ఞు డా ధర్మవత్సలుండు
పలికె తేజస్వి కాకుత్స్థ రఘు యశుడు। చిరునగవు దోప బదులిట్లు శ్రీయుతుండు॥

తే. మైత్రి యుపకార ఫలమగు ధాత్రిలోన; । అరయ నపకార మరిలక్షణంబె యగును
ఇంక వధియింతు వాలి యింద్రసుతుని । నీదు భార్యాపహారుని నిక్క మిపుడ॥

తే. ఇవియె నా బాణములు మహావేగగతులు । తిగ్మతేజసములు పతత్రిణము లివియె
కార్త్తికేయవనోద్భూత కాండతతులు। హేమభూషితములు చూడుమిా సఖుండ॥

తే. కంకపత్రప్రతిచ్ఛన్న కాండములును। బహుళ తీక్ష్ణాగ్రములు ఋజుపర్వములును
మరి, మహేంద్రాశనిసమంబు లరయు మింక । పడు సరోషాహు లట్టు లా
వాలిపైన॥ 24

తే. భాతృ సంజ్ఞ, సమిత్రి, నా వాలి నింక । అన్న నా కృతకిల్బిషు నరయ గలవు
ఘుజమి మద్బాణ నిహతుడై పడగ నిపుడె । పర్వతంబు వికీర్ణమన్ భంగిగాగ॥

తే. రాఘువుని మాట లివ్వి తా నాలకించి । వాహినీపతి సుగ్రీవు డా హితుండు
పొందెను ప్రహర్ష మతులంబు డెందమందు । "సాధు, సాధం"చు మరియును
సరగ బలికె॥ 25

తే. రామ! శోకాభిభూతుండ స్వామి! నేను । క్షితిని శోకార్తులకు నీవె గతివి దేవ!
అనఘ! నీవు వయస్యుండ వనుచు నేను। చెప్పుకొందును నా దుఃఖ మప్ప! నీకు॥

తే. స్వామి! పాణిప్రదానంబు సలుపుకతన । అగ్నిసాక్షిగ మిత్రుండ వైతి వీవు
ప్రాణములకంటె నధికుండ వైతి వటుల । సత్యమున నీకు శపథంబు సలుపు దనఘ॥

తే. నీ విక వయస్యుడ వటంచు హృదిని నెంచి। రామ! నే చెప్పుకొందు విస్రబ్ధముగను
దుఃఖ మంతర్గతం బేది దౌర్బలుండ! । నిత్యము హరించు నామది నిరుపమాన!॥

తే. ఇంతవరకును జెప్పి హరీశ్వరుండు । బాష్పదూషితలోచనద్వంద్వుడగుచు
వితత బాష్పోపహతి మాట బిగ్గరగను । పైకి చెప్పంగ శక్తుండు గాకయుండె॥

తే. పటు నదీవేగ మన వచ్చు బాష్పవేగ । మల్ల సుగ్రీవు డా హరితల్లజుండు
రాము సన్నిధిజేసి ధైర్యంబు కతన । అణచుకొనియెను సత్వరం బినసుతుండు॥

తే. అటుల వచ్చెడి యశ్రుల నణచుకొనుచు । వడిగ చక్షుల శుభముల తుడుచు
కొనుచు
నిశ్వసించుచు తేజస్వి నెనరుదోప । రాఘువున కిట్లుబల్కె నా ప్లవగవిభుడు॥

తే. మున్ను నన్ను బలీయుడౌ యన్న వాలి । అకట నాకగు యౌవరాజ్యంబునుండి
తొలగ జేసియు పరుష ములఁ దూలనాడి । తరుమ గొట్టెను రామ! నిష్కరుణముగను॥ 32

తే. ప్రాణములకంటె మిన్న నా భార్యసైత । మపహరింపంగబడియె నా యన్నచేత;
సుహృదు లింక మదీయులు బహుళసంఖ్య । బంధితులునైరి వాలిచే బంధనముల॥

తే. నన్ను జంపుటకును సుదుష్టాత్ము డతడు । యత్నమొనరించుచుండు నిరంతరంబు
తత్ప్రయుక్తులు వానరుల్ తరుచురాగ । పెక్కురఁ జంపి యుంటి నే పెక్కుమార్లు॥ 34

తే. ప్రబల మీ శంకచేతనే రామచంద్ర! । నిన్ను జూచియు భయమున నేను రాక
ఒదిగియుంటిని నీకోన మదను దక్కి । భయవిషయముండ బెదరవే ప్రాణులెల్ల?॥

తే. కేవలం బీ హనూమంతు డీ వనాట । ముఖ్యులే తోడు నాకిట భూపవర్య!
కాననే ప్రాణములనెట్లొ పూనియుంటి । కృచ్ఛ్రగతుడనునయ్యు నీ గిరితటాన॥

తే. వీరె కపులెల్ల స్నిగ్ధులు ప్రీతి నన్ను । రక్ష సేయుచునుందురు శ్రద్ధబూని
వత్తురీనాతోడ నేబోవు పట్టులకును । నిల్తురి నేనిల్చు చోటున నిత్య మనఘ॥ 37

తే. ఇదియె సంక్షేప మనఘ మదీయగాథ । విస్తరముజెప్పనేల పృథ్వీకళత్ర!
వాలి నాయన్న విశ్రుత పౌరుషుండె । గర్భశత్రువు నాకగు దుర్భరుండు॥ 38

తే. అతడు నాశంబు నొందిన యప్పుడె నాకు । దుఃఖము ప్రనష్టమగును బో దోర్బలుండ!
సుఖము జీవిత మింక యీ క్షోణి నాకు । తద్వినాశంబుతోడనే తగిలియుండు॥

తే. ఇదియె నాశోకగాథ నరేంద్రచంద్ర! చెప్పుకొంటిని శోకార్తి శ్రీశ! నీకు
క్షితిని సుఖితుడెకాని దుఃఖితుడెకాని । సఖునకు సఖుండె గతియగు సతము రామ!॥

తే. పలుకు లియ్యవి యాలించి ప్రభువరుండు । రాము డప్పుడు సుగ్రీవు ప్రేమజూచి
ఏ నిమిత్తంబు చెప్పు మీకిట్లు నిజము । వైరమొదవెను నే వినగోరుదనియె॥

తే. వైరకారణ మది విని వానరేంద్ర! మరి బలాబలములనెల్ల తరచిచూచి
పిదప నీకు సుఖంబగు వెరవదేమొ । ఏర్పరించెద సర్వంబు నేర్పు మీర॥ 43

తే. వాలి నిన్నిట్టు లవమాన పరచె ననుచు । వినగ నిక హృదయోత్కంపమును బొనర్చు
కోపము మహత్తరంబు నాకును నెసంగె । జలదకాలంబు వేగంబు చందముగను॥

తే. ఇక ఘన స్సేన నెక్క వెట్టకయ మున్న । చెప్ప విస్రబ్ధముగ నెల్ల హృష్ట
మతిని
విడుచుకే యింక తడవోయి వినుము శరను । నీ రిపుం డింక హతుడై యం
చెరుగు మోయి॥ 44

తే. అటుల కాకుత్స్థు డపుడు మహాత్ముకుండు । చెప్ప సుగ్రీవు డెంతయు తెప్పిరిల్లి
పొందెను ప్రహర్ష మతులంబు డెందమందు। తాను నల్వురు సచివు లావానరులును॥

తే. అంతట ప్రహృష్టవదనుడై హరివరుండు । లక్ష్మణాగ్రజుతోడ నా రాముతోడ
వైరకారణ మంతయు స్పష్టముగను । చెప్పనొడగెను సుగ్రీవు డాస్పదముగ॥

8 వ సర్గ సమాప్తి - (362)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### తొమ్మిదవ సర్గ - (26)

### వాలిసుగ్రీవుల వైరాను కథారంభము

1. మాయావి యనువాడు వాలిపైకి వచ్చుట - వాలిసుగ్రీవులు వానిని తరుముట-వాడు ఒకబిలము చొరబడగా, వాలి వానిని వెంబడించుట-ఎంతకు వాలి రామిచే బిలమునుండి వచ్చు రక్తప్రవాహముజూచి వాలి చచ్చెనని, సుగ్రీవు డింటికివచ్చి పట్టము కట్టుకొనుట - కొంతకాలానికి వాలి వచ్చి, పట్టభద్రుడైన తమ్మునిపై పగబూనుట - "తెలియక చేసితి"నని సుగ్రీవుడు యెంత వేడినను వాలి శాంతింపక పోవుట.

తే. శూరు డుగ్రుండు శత్రునిషూదనుండు । వాలి యనుపేర నాయన్నవసుధ నెసగి
తండ్రిచేతను మునుపు నిత్యంబురామ! । మరియు నాచేత గౌరవంబందుచుండె॥

తే. అకట మాతండ్రి పరలోక మరిగినంత। జ్యేష్ఠు డితడంచు మంత్రులు జేరియితని
కపుల కెల్లరకును రాజుగాగ నపుడె । క్షితిని నిలిపిరి పరమసమ్మతముగాగ॥ 2

తే. రాజ్య మా పితృపైతామహంబు నొంది। క్షితి మహత్తరమట్లు శాసింపుచున్న
భ్రాత వాలికి సర్వకాలంబు లందు।ప్రణతుడను నౌచు ప్రేష్యుడన్ భంగినుంటి॥

తే. "దుందుభి"సుతుండు జ్యేష్ఠుండు దోర్బలుండు । గలడు తేజస్వి మాయావి;
ఖలు డతనికి
మరియు మాయన్నకును నొక తరుణికతన। వైరము మహత్తర బుంట విశ్రుతంబ

తే. ప్రజలు నిద్రించు నొక యర్ధరాత్రివేళ। బలిసి కిష్కింధ గమిటికి వచ్చియతడు
గర్జగావించి రణమున కప్పుడపుడె । పిలిచె వాలిని కడు విజృంభించి పేర్చి॥

తే. నిద్రలోనున్న వాలి యా రౌద్రరవళి । విని సహింపక పరగర్వమును నెడంప,
తక్షణంబె జవంబున రూక్షగతిని । ఉరికె మాయావి నప్పుడ పోరిగొనంగ॥ 6

తే. అతని నసురోత్తముని నష్ట హతమొనర్ప । క్రోధమున బోయె వాలి బల్ రూక్షగతిని
స్త్రీలు తన్నెంత వల్దన, వ్రాలినేను । సైతమెంతయు వారింప సరకు గొనక॥

తే. మమ్ము నందర త్రోసిరాజనుచు వాలి।అపుడె పోయె మహాబలుం డాలమునకు
అంత నేనును నెడద సౌహార్దవశత । పోతి నాతని వెంట నమోఘులీల॥ 8

తే. అంత వాడును వాలి నా యన్న నరసి । మరియు దూరాన నేనును వచ్చుటరసి
జాతసంత్రాసుడౌచు దా సరగ నపుడె । పరచె దౌడెత్తి తన పిక్కబలము జూపి॥

తే. అతడు సంత్రస్తుడై యట్లు పరచు టరసి । వెంటబడితిమి మే మంతకంటె వడిగ
ఆకసముపైకి యప్పుడే ప్రాకివచ్చు। చంద్రుచే మార్గ మట ప్రకాశంబు నయ్యె॥

తే. అటుల మేమును వెంబడించుటను జూచి।మించ తననట్లు మరి సమీపించు టరసి
దుర్గము తృణావృతం బొక్క దొడ్డ బిలము । జొచ్చె నసురుండు మాయావి చొరవ జేసి॥ 11

తే. సరగ బిలమట్లు జొచ్చిన శత్రుజూచి । రోషవశుడౌచు వాలి బల్ రూక్షగతిని
వచన మిటుబల్కె నాతోడ పటుతరంబు । భృశము క్షుభితేంద్రియుండు త ద్వీరవరుడు॥ 12

తే. ఇచటనుండుమః నీవు సుగ్రీవ! మిగుల । పదిలముగ వేచి యీ బిలద్వార మందు
వేగ నేనును జొచ్చి యీ బిలములోన।రిపుని దున్మాడి చిటికెలో యిపుడె వత్తు॥

తే. నేను వత్తునటంచు నెన్నేని గతుల । వేడినను వాలి నా యన్న వినక మరియు
చరణసాక్షిగ నాపైన శపథమిడుచు। బిల మది మహత్తరంబు దా వేగ జొచ్చె॥

తే. అటు బిలంబును జొచ్చి మా యన్న వాలి । జనిన పిదప సమంబు వత్సరము జనియె;
నేను నా వత్సరం బెల్ల నియతితోడ । బిలము గమిటనె యుంటి కావలిగ నిలిచి॥

తే. అటుల వేచియు, నెంతకు నన్న వాలి । రాకయుండుట స్నేహకారణముగాగ
సంభ్రమముగంటిః మరియు నా స్వాంతమపుడు । పరిపరివిధాల శంకింప దొడగె చెడుగ॥ 16

తే. దీర్ఘకాలంబునకు నంత దేవ! వినుము । రక్తము సఫేన మది రుధిరంబు రామ!
వడి బిలంబుననుండి వెల్వడుట గాంచి । దుఃఖితుడనైతి నెంతయు, దోచకేమి॥

తే. తద్ద నర్దించు నసురుల ధ్వనియు నపుడు । వచ్చి నా చెవి పుటముల వడిగ దాకె;
మరియు, సంగ్రామమం దోడి యరచు నట్టి। అన్న యాక్రోశమును విననయ్యె నల్లె॥

తే. ఇట్టి చిహ్నంబులఁ జేసి యింక హతుడె । భ్రాంతయని యూహజేసి బిలంబు ముఖము
గిరిసమం బొక్క శిల మూసి; కరము వనట। అన్న కుదకంబు నిడి వచ్చి తపుడె పురికి॥ 19

తే. నిజము దాచంగ నెంతయు నేనుఁజూడ। తెలిసికొని రెల్ల కథను మంత్రులును నెట్లొ
అంత వారెల్ల నను బలవంతముగను । పట్టి సమ్మతి పట్టంబు గట్టి రపుడ॥ 21

తే. రాజ్యమును న్యాయరీతి పాలనము నేను। నటుల సల్పుచునుండ మాయన్న వాలి
రిపుని యసురోత్తముని వాని విపులశక్తి । జంపి కిష్కింధ కేతెంచె సత్వరంబ॥

తే. అచట నభిషిక్తు నన్నుఁ దా నరసి, కనుల । వహ్నికణములు రాల హా! వాలి యపుడ
మంత్రుల మదీయులన్ బట్టి మ్రందగొట్టి। పరుషవాక్యంబు లతడాడె నరయ కేమి!॥

తే. పాపు నాతని నప్పుడే పట్టి కట్టి । నిగ్రహింపంగ శక్తుండ నేను నయ్యు
అన్న యను గౌరవాన నా యదనునందు । బుద్ధి యారీతి పోలేదు భూప! నాకు

తే. శత్రుహతమార్చి పురిబ్రవేశంబు సల్పు । అన్న కేను యథావిధి యర్చలిచ్చి
దండమిడినను నాతడీ తమ్మునకును । ప్రీతి నిడడయ్యె యాశీస్సు; వీడ డలుక

తే. మరల మరలను నేను నా మకుట మణుల । అన్నపాదాల సోకునట్లవని బడియు
వేడినన్ గాని క్రోధంబు వీడడయ్యె । మరి ప్రసాదంబు నాపైన బరపడయ్యె॥

9 వ సర్గ సమాప్తి - (388)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

పదియవ సర్గ - (35)

వాలిసుగ్రీవుల వైరానుకథనము.

(2) సుగ్రీవుడు వాలిని మరి మరి వేడుట - వాలి వినకపోవుట - సుగ్రీవుని రాజ్యమునుండి వెడలగొట్టి, ఆతని భార్యనుకూడ వాలి హరించుట.

తే. అంత క్రోధసమావిష్టుడైనవాని । వాలి సంరబ్ధు నట్టుల వచ్చు వాని
భ్రాతృప్రియకామ్యత గడంగి రామ! నేను। వేడుకొంటి ప్రసాదంబు ప్రీతినిడగ॥

తే. "మా యదృష్టంబు కుశలివై వచ్చినావు; । రిపుడును హతుండ నీచే యరింద ముండ!
నా కనాథున కీ వొకండవె మహాత్మ । నాథుడ వనాథనందనా! నా విభుండ॥

తే. "ఘనము ఛత్రము బహుశలాకంబు గనుము। పూర్ణ చంద్రుని నుదితునిబోలు దీని
నీకు పట్టుదు; మరియు సంప్రీతి దేవ! వీతు వింజామరనుదీని స్వీకరింపు"॥ 3

తే. "వత్సరమువేచి యా బిలద్వారమందు । మీరు రాకుంటయేగాక బిలమునుండి
శోణితము ద్వారసీమ హెచ్చుగను పొంగి । పొరలి వచ్చుట వీక్షించి పొంది తార్తి"॥ 4

తే. "శోకసంవిగ్నహృదయుండనై కరంబు। నాథ! వ్యాకులితేంద్రియుండనుగ నుండి
ఏమితోచక యొకశైల శృంగమెత్తి । బిల ముఖముమూసి మరలితి వేగపురికి"॥

తే. "ఇట విషాదాన ననుజూచి యే మనందు! । పౌరులును మంత్రులును నన్ను పట్టుబట్టి
అన్న! అభిషేకమొనరించి రంతె కాని । నేనుకోరను; కావు తప్పైన దీని"॥

తే. "నీవెరాజవు; పూజ్యుండ వీవె యన్న । నేను మునపటియట్లనే నిన్ను గొల్చి
యుందు యువరాజుగా నీ నియోగమునన; । తాము నేకుంటచేత నే తాల్చి
తిలను॥" 7

తే. "పౌర, పట్టణ సచివ సంపదలతోడ । నిహతకంటకరాజ్య మింక బట్టె దేవ!
న్యాసభూతంబు మరల నీ కమలమతిని ।ఇచ్చివైచుచునుంటి గ్రహింపు కరుణ"॥

తే. "నాపయిని రోషపడకుము భూప! సౌమ్య । అర్థమడనుబోవ శత్రునిబర్హణుండ
శిరము నొగ్గియు యాచింతు కరుణ రాజ।అంజలినిబట్టితి యనుగ్రహంబు తమదె॥

తే. "అవనియెప్పుడు రాజశూన్యంబుగాగ । నుండకూడదటంచను నూహచేత
పౌరులును మంత్రులును బలవంతపరచి । చేరి నన్నిటు రాజుగాచేసి రంతె"॥ 10

తే. స్నిగ్ధముగ నిట్లు బల్కు నన్ "ఛీ"యటంచు । "ధిక్, షా, కాలు మటంచు"
నంతేని రోసి
భర్త్సనంబునొనర్చి యా వాలి మరియు।ఏమియేమియొ వచియించె; నేమిచెబుదు॥

తే. సమ్మతుల మంత్రులను పురజనుల నపుడ । అట సమావేశపరచి వా రంద రకట
వినుచునుండగ సుహృదుల జనులమధ్య । పరమ గర్హితముల నిట్లు పలికె నన్ను॥

తే. విదితమేగద మీకు నా డదరి పడుచు । రాత్రి మాయావి యా సుదుర్మతి
శతుండు
క్రూరుడు మహాసురుండు దా మీరివచ్చి । నన్నురణకాంక్ష పిలిచి రమ్మన్నదెల్ల॥

తే. అతని యావాక్య మాలించి యంతిపురిని ! అపుడ వీడుచు నేనును నరిగియుంటి
అనుజు డితడు సుదారుణుండును వినుండు।వచ్చె నావెంటవేగంబ బలము మెరసి॥

తే. వేగ మేమిద్దరము రాత్రివెంటబడుట । గాంచి భయపడి మాయావి కాలికొలది
దౌడుదీయుడు మేమును దౌడుదీసి।తరుమ వా డొక్క గుహజొచ్చె తతబలుండు॥

తే. రహిం సుఘోరంబు సుమహద్బిలంబునట్లు । వాడు జొచ్చుట నరసి యీ
భ్రాతతోడ
క్రూరదర్శను డీ తమ్ముకురత్రితోడ । చెప్పి తిట్టుల యొకమాట యొప్పిదముగ॥

తే. మొరటు వీని వధింపకపురికి మరల । తిరిగి రాజాల నేనింక స్థిరముగాన
పట్టి వీనివధించి నే వచ్చువరకు । ఈ బిలద్వారమున ప్రతీక్షింపుచుండు॥ 18

తే. నిలుచు నిచ్చట వీడని హృదిని నమ్మి।చొచ్చితి దురాసదంబు నే చొరవ బిలము
అచట వెదకుచునుండ నా యసురుకొరకు । పట్టె నాకొక్క వత్సరం బిట్టెచూడ॥

తే. కానిపించిన పిమ్మట వాని నేను । పట్టితి భయావహుని సులభంబుగాను
చంపి తచ్చటనే వాని సరగ నపుడె । చంపి తిక వానిబంధుల సైత మపుడె॥

తే. వాడు నా దెబ్బకోర్వక "బావు"రంచు।బొబ్బరిల వాని గొంతునుం డుబ్బివచ్చు
రక్తరుధిరౌఘమున తద్బిలంబునిండి । పట్టజాలక వెలి కట్టె పారె నపుడు॥ 21

తే. శత్రు, వికాంతు, దుందుభిపుత్రు నట్లు ।కూల్చి గుహనుండి వెలువడగోరి నేను
వెదుక మార్గంబు సుంత కన్పింప దయ్యె।బిలముఖంబట్లు రాతిచే పిహితమగుట॥

తే. అంత 'సుగ్రీవ' 'సుగ్రీవ' యనుచు నేను। బిగ్గ యెన్నిగాము సాల్లొలుగత్తి పిలువ
బదులు రాకుంట దుఃఖంబు బహుళముగను । క్రిందుకొనె నాకు నేమందు
డెందమందు॥ 23

తే. బహుళపాదప్రహారాల గుహాముఖంబు । చెలగి భేదించి మార్గంబుచేసికొనుచు
సరగ నామార్గమున వెలికురికి యెటులొ । వచ్చి చెప్పటి యట్ల యీ పట్టణంబు॥

తే. తనకు రాజ్యంబు దక్కించుకొనెడియాస। ఈ నృశంసుండు సుగ్రీవు డీ ఖలుండు
నను నిరోధించె బిలముఖాంతరమునందు । విస్మరించుచు భ్రాతృసౌహృదము
నెడద॥ 25

తే. ఇటుల వచియించి యెడద జంకేమిలేక । సుహృదు లెల్లరు నచ్చట చూచుచుండ
అకట పైబట్టతో నన్ను నప్పు డపుడె । వెడలగొట్టెను వాలి యవ్వేటినుండి॥

తే. అన్నచే నట్లు వెడలగొట్టంగ బడియు । మరియు హృతదారుడను నౌచు మనసు
చెదరి
తద్భయంబున కృత్స్న మీ ధరణి నేను । పరచి తిరిగితి సవనార్ణవంబు రామ!॥

తే. హృదిని భార్యాపహరణ దుఃఖితుడ నౌచు । ఋష్యమూకంబు గిరివరం బిందు జేరి
బ్రతుకుచుంటిని నొక కారణాంతరమున । వాలి కిద్ది దురాధర్ష మగుట కతన॥

తే, సర్వము మహత్తరముజెప్పి తిర్వురకును । కలిగియుండిన వైరానుకథనమెల్ల
పాపమెరుగని నాకు నిష్పాపునకును । వ్యసన మిదె చూడు రామ! సంప్రాప్త
మయ్యె

తే. వాలిచేత భయార్తుండనైన నాకు । సర్వలోకాఽభయంకరా! స్వామి నీవు
తగుదు విడగ ప్రసాదంబు ధరణివిభుడ । వాలి నిక నిగ్రహించి వీరాధివీర॥ 31

తే. ఇటుల సుగ్రీవు డనగ నా యినకులుండు । పరమధర్మజ్ఞు డిట్టుల వచన మపుడు
హితము తేజస్వి ధర్మసంహితముగాగ । చిరునగవుదోప పలుకజొచ్చెను విభుండు

తే. సూర్యసంకాశము లమోఘ వీర్యము లివె । నిశితములు నాదు శరములు నిక్కమింక
వేగితంబులు వాలి దుర్వృత్తుపైన । అల్ల నీయన్న యా వాలిపైన చూడు॥

తే. నీదు భార్యాపహారుడా నికృతిపరుడు । ఔర చారిత్రదూషకుండా ఖలుండు
వాలి నాకంట్లె యెదుటను పడెడువరకె । బ్రతుకగలడోయి నమ్ము, పాపాత్ము

డతడు॥ 33

తే. హృదిని ఆత్మోపమానంబు నెరపి సఖుడ! చూతు మగ్నుడు నీ వెట్ల శోకజలధి
నిన్ను తరియింపజేతును నిక్కమేను । కామితార్థంబు గనెదు పుష్కలము నీవు॥

తే. అతని పల్కది యాలించి యాత్మహితము । పరమసంప్రీతినొంది యా హరి వరుండు
సఖుడు సుగ్రీవుడెంతయు స్వాంతమందు। పలికె సుమహత్తరం బద్ది వాక్యమిటుల॥

10 వ సర్గ సమాప్తి - (423)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునొకండవ సర్గ - (౧౧)

### సుగ్రీవుడు రాము బలపరీక్ష సేయుట.

1. దుందుభికాయంబును రాముడు ఏకపాదాంగుష్ఠమున దశయోజనము చిమ్మివేయుట - ఇది మొదటిపరీక్ష.

తే. హర్షపౌరుషవర్ధనం బనుపమంబు । రామువచనంబు నాలించి ప్లవగవిభుడు
సఖుడు సుగ్రీవు డెలమి పూజన మొనర్చి । హృదయ మింపార మరి ప్రశంసించె నతని॥ 1

తే. రాఘవ! అసంశయంబు మర్మాతిగముల । శరములను తీక్ష్ణములను ప్రజ్వలితములను
నీవు దహియింతు లోకాల నీకు నిజము। అలుక పొడమిన మరి యుగాంతార్కుడట్లు॥

తే. వాలి కున్నట్టి ధైర్యంబు పౌరుషంబు । ధృతియు నెట్టిట్టిదో రామ! యేకమతిని
నావలన నీవు విని తదనంతరంబు । చేయదగు కార్యవిధి నీవు చేయుమయ్య॥ 3

తే. అటు సముద్రంబు పశ్చిమం బందు నుండి। రామ! ఇటు పూర్వజలధిపర్యంతమింక
దక్షిణోదధి మొదలు త్తరాబ్ధి వరకు। సూర్యు డుదయింపకయె మున్న చుట్టివచ్చు
వ్యపగతక్లము డౌచు నిత్యంబు వాలి॥ 4

తే. లీల శైలాగ్రముల నెక్కి వాలి, రామ! । వాని శిఖరాల నెంతటి వానినైన
త్రుంచి యెగురంగ నైచుచు దోర్బలమున । మరల బట్టుచు బంతులకరణి నాడు॥

తే. బహుళ సంఖ్యలు వివిధముల్ వనములందు । ద్రుమతతులు సారవంతముల్ ద్రుంపబడియె
పెక్కుమారులు తన బలంబుక్కజూప । వాలి చెలరేగి క్రీడల లీల సలుప॥ 6

తే. రామ! మహిషుండు దుందుభిర్నామధేయుఁడొకఁడు । దండి కైలాసశిఖర సంకాశ కాయుండు ఘనుడు
బలము నాగసహస్రాల బలను దాల్చి । తిరుగుచుండును వీర్యంబు తేజమొప్ప॥
తే. మూర్ఖుఁడై యట వీర్యోత్సేకమున జెలంగి । ఖలుఁడు దుష్టాత్ముఁడా మహాకాయుఁ డెదుర
ఉర్వి వరదాన మోహితుండొక్కనాడు । చనియె సరితాంపతి సముద్రు గనగ ననఘ॥ 8
తే. ఊర్మిమంతంబు జలధి రత్నౌఘ మట్లు। జొచ్చి దుందుభి మిగుల దా పెచ్చు పెరిగి
రణమొసంగుము నా కంచు ఘనత మెరయ । నడిగె వా డెదుర తన్మహార్ణవము బిలిచి॥
తే. అంతట మహాబలుండు ధర్మాత్ముఁడు । మరి సముద్రుండు లేచి సత్వరమ నిలిచి
కాలచోదితు డసురుతో క్రమత నిట్లు । చెప్పె రాఘువ! వచనంబు నొప్పిదముగ॥
తే. నేను నిజము సమర్థుండ గాను నీకు । ఉగ్ర! యుద్ధవిశారదా! యుద్ధమిడగ
వినుము చెప్పెద నీకింక తనివిదీర । యుద్ధ మిడజాలునట్టి సమర్థు నొకని॥ 11
తే. శైలరాజు మహారణ్య జగతినుండు । పరముఁడు తపస్వి శరణుండు ధరణిధరుఁడు
శంకరశ్వశురుండు ప్రశస్తబలుఁడు । ఖ్యాతిని హిమవంతు డనగ విఖ్యాతుఁ డతండు॥
తే. గుహల ప్రస్రవణంబుల మహితుఁ డతఁడు । బహుళకందర నిర్ఝర పహితుఁడగును
ఆహవంబున సంప్రీతి యతులముగను । నీకు నిడగ సమర్థుండు నిజ మతండు॥
తే. తనకు భయపడె నీ యబ్ధి యనుచు దలచి । ఇంక యసురోత్తముండు డేగె బింకముగను
వేగ హిమవద్వనంబున కాగ కేచట । చాపమునను౦డి విడిచిన శరముకరణి॥
తే. అచట తద్గిరిశిలల శ్వేతాభములను । శృంగములతోడ దిగ్గజ విపులములను
గుచ్చి విసరుచు నింగికి పెచ్చు పెరిగి । గర్జలొనరించె దుందుభి "ఖఃశిలు"మనుచు॥
తే. అంత శ్వేతాంబుదాకారుఁ డౌచు మరియు।మిగుల ప్రీతికరాకృతుం డగుచు గిరియు
సౌమ్యుఁడై స్వీయశిఖరాన సరగ నిలిచి । పలికె హిమవంతు డిట్టుల వాక్యమొకటి॥
తే. ధర్మవత్సల! దుందుభీ! దానవేశ! । క్లేశపరుపంగ తగ దిట్లు కెరలి నన్ను
అకుశలుఁడ నేను రణకర్మలందు సఖుఁడ । చూడుము తపస్విశరణుండ సుమ్ము నేను॥
తే. అటుల గిరిరాజు ధీయుతుం డన్నయట్టి । వచన మది యాలకించి కోపంబు గదుర
రక్తలోచనుఁడౌచు ఘోరంబుగాగ । పలికె దుందుభి తద్గిరివరున కిట్లు॥ 18
తే. యుద్ధమందు సమర్థుండవో, మరింక । మద్భయంబున యుద్ధంబు మానినావొ
సోదె నాకేల? విను యయుత్సుఁడను నేను । చెప్పు నా కీక రణమిచ్చు గొప్పవీరు॥

తే. పలుకు లక్ష్వి యనుక్తపూర్వంబు తార। దుందుభి వచింప నాలించి దొడ్డయలుక
పొడమ ధర్మాత్ముడా హిమభూధరుండు।పలికె వాక్యవిశారదుం డలఘు డిట్టుల

తే. వాలి యనుపేర నొక మహావానరుండు। ఇంద్రతుల్యపరాక్రముం డెసగు భువిని
అతి డతులప్రభంబైన యట్టిపురిని। అల్ల కిష్కింధ వసియించు కొల్లసిరుల॥ 21

తే. వినుము యుద్ధవిశారదుండును నతండు! మరి మహాప్రాజ్ఞుడౌను పో హరివరుండు
ద్వంద్వయుద్ధంబు నిడ మహత్తరమునీకు। పటు సమర్థుండు నముచి కా మఘవు డట్లు॥ 22

తే. పొమ్ము శీఘ్రమె యాతని పొంతకీవు। యుద్ధమిచ్చుంతు వేని నీ కోయి యిపుడె
అతడు దుర్ధర్షణుండు నిత్యంబు, వీర। సమరకర్మల శూరుండు సర్వమెరుగు॥

తే. విని హిమాహార్యమాటల వేగ నసుర। అమిత కోపసమావిష్టుడై చెలంగి
వడిగ కిష్కింధ కా వాలిపాలితకును। పోయె తీవ్రంపు గతుల నమోఘలీల॥ 24

తే. మహిషరూపంబు దాల్చి యమాంతముగను। తీక్ష్ణ శృంగంబు లొప్ప భీతిదుడు నొంచు
పావృషిని తోయపూర్ణమై యభ్రపథిని। గనగవచ్చు మహామేఘ మనగ వెలిగె

తే. తత్పురద్వారమును జేరి దానవుండు।దుందుభి మహాబలుండుదుందుభి యనంగ
బొబ్బరిల్లిచు గొప్పగా పుడమి యెల్ల। కంపమొందింపజేసె నా ఖరఖురుండు॥

తే. మరి సమీపస్థతరువుల విరచివైచి। ధరణి ఖురముల బగులంగ దన్ని దున్ని
ద్వారముల కొమ్ములను గీరి దర్పమునను। ద్విరదమట్టుల విహరించె వెరవ కసుర॥

తే. అంత అంతఃపురగతుండునైన వాలి। శబ్ద మది విని సహియింప జాల కెడద
వెలికివచ్చెను స్త్రీలును వెంటరాగ। చదల చుక్కలతో వచ్చు చంద్రుడనగ॥

తే. మితము వ్యక్తాక్షరపదంబు నతని గూర్చి। అల్ల దుందుభిగూర్చి యా హరివరుండు
వనచరులకెల్ల ఈశ్వరుం డనుపముండు। వాలి పల్కెను దా నిట్లు లీలగాగ॥

తే. ఎందు కీ నగరద్వార మీవు జేరి। మరి నిరోధించి నర్దించి మొరిగె దిట్లు?
ఓరి దుందుభి! యెరుగుదు నోరి నిన్ను। ప్రాణములగాచుకొమ్ము మహాబలుండ॥

తే. వానరేంద్రుని ధీమతు వాక్యమద్ది। వినుచు రోషాన సంరక్త వీక్షణు డయి
వాక్యమిటుబల్కె పటుతరం బసురు డప్పుడు। ఖలుడు దుందుభి పటుతర గర్వమునను॥ 31

తే. స్త్రీలసన్నిధి వీర! యీ లీలగాన । మరి, ప్రగల్భలంబులాడంగ ఫల మదేమి?
రణ మొసంగుము నా కిష్ట ప్లవగవరుడ । తెలిసికొందవప్డె బలము నీ తేజమోయి॥

తే. కాక, క్రోధంబు నీ రాత్రికాలమెల్ల।అణచుకొందును; ఉదయపర్యంత మిదియె
గడువొసంగతి; కామభోగముల నింక । అనుభవింపు యథేచ్ఛ నో వనచరుండ॥

తే. ఇచ్చుకొమ్మిక దానంబు లిచ్చదీర! । ప్రీతిబంధుల నిక కౌగలించుకొమ్ము;
సర్వశాఖామృగేంద్ర! నీ సఖుల గలిసి । అప్పగింతల మాటల జెప్పుకొమ్ము। 34

తే. చూడు కిష్కింధ కడసారి చూడ్కు లలర।చేయు నీ సము పతిగ కిష్కింధ కింక
లెస్స క్రీడింపు కడసారి స్త్రీల గూడి । దర్ప మణగింతు నీకు నే తప్ప దింత॥ 35

తే. మత్తుని, ప్రమత్తు, సుప్తుని క త్తిగి త్తి । లేనివానిని, త్వద్విధు వానరేంద్ర!
కామ మోహితు జంపిన కఠిన మతికి । భ్రూణహత్యాఘ మబ్బును లోకమందు

తే. తార మున్నగు స్త్రీల నందరిని నంత । అంతిపురికంపివైచి యమాంత మప్పుడ
వాలి నవ్వుచు మరియు కోపంబు గదుర! మందముగనిట్లుబల్కె త ద్దుందుభికిని॥

తే. చండ రణమున నిజ మభీతుండ వేని । మత్తుడితడంచు వలదు నన్ మదిని దలప
ఈ మదంబె రణంబున కింక మీద । వీరపానమటంచు నీ వెరుగుమోయి॥

తే, ఇటుల వచియించి క్రోధ మెంతేని యెగయ । పితరు డింద్రు డొసంగిన
విశతమాల
కాంచనమయంబు నప్పుడే కంఠమందు । దాల్చి రణమున కురికె పంతమున వాలి॥

తే. ఉరికి కొమ్ముల బట్టి యా యుగ్రు నసురు । గిరినిభుని దుందుభిని గిరిగిరను దిప్పి
వాలి కపికుంజరుండు సలీలముగను । గర్జ గావించె నపుడె దిక్కరులు నురల॥

తే. అటుల గిరగిరదిప్పి యా యసురునె త్తి । నేలగొట్టె మహాభీలలీల యూర్వ్వ
క్షితిని గూలిన దుందుభి చెవులనుండి । ర క్త మేరులునై పారె ప్రబలముగను॥

తే. క్రోధసంరంభమున నిద్దరును జెలంగి । ఒండొరులగెల్వగోరి యాయోధనంబు
సలుప నయ్యది ఘోరమై సాగె నపుడు । అల్ల దుందుభి వానర తల్లజులకు॥

తే. ఇంద్రతుల్యపరాక్రముం డెసగి వాలి।యుద్ధమొనరించె నపుడు మహోగ్రముగను
జానువుల, ముష్టిఘాతాల, తొమ్మజతతుల । శిలల నయైవిధాల బల్ చిత్రగతుల॥

తే. వాన రాసురు లిద్దరి బ్బంగిగాగ । మించి యిట్లు పరస్పరం బెసగి పోడువ
దుందుభిబలంబుక్షీణింప దొడగెక్రమత । శక్రసూను బలంబు హెచ్చం గసాగె॥

తే. ధైర్యము, పరాక్రమంబు బల వీర్య ముడిగి । మరియు కదల నశక్తుడై యొరుగుచున్న
దుందుభినిబట్టి వాలి యా దోర్బలుండు । ఎత్తి నేలనుగొట్టె బల సత్త్వగను॥

తే. ప్రాణహరమైనయట్టి యా రణమునందు । పిండిపిండిగ మేనెల్ల చెండబడుట
అసుర డాతండు ప్రాణంబు లపుడె వీడి। క్షితినిగూలె మహాకాయు డతిబలుండు॥

తే. ఘనుని గతసత్త్వు నిక యచేతనుని నతని । బాహువులబట్టిమెత్తి యా బాహుశాలి
వాలి యాడించి వేగాన లీలగాగ । విసరె నొకయోజనం బది వెస బడంగ॥ 47

తే. అతని వేగప్రవిద్ధ వక్త్రంబునుండి । క్షతజ బిందువు లనిలవేగంబుచేత
కొట్టుకొనివచ్చి పడియె యీ కోనయున్న । ముని మతంగుని యాశ్రమంబున, మహాత్మ॥ 48

తే, అక్కడటుబడ్డ యానెత్తురుచుక్కలరసి। ముని మతంగుండు క్రుద్ధుడై తనదు మదిని
"ఎవడురా వీడు రక్తంబు నిటుల జిమ్మె"? నని మహాభాగు డప్పుడు యోచన మొనర్చె॥ 49

తే. "చిమ్మనెత్తురు నాపైన చెనటియెవడు? । బాలిశుండు దురాత్ముండు పాతకుండు
దురితకర్ముండు దుర్బుద్ధి దుష్టుడెవడు? । ఔర, అకృతాత్ము డా యధమాధముండు"॥ 50

తే. ఇట్టు లనుచును వెలికి దా నట్టె వచ్చి । చూడ నొకచో గతాసునై క్షోణిగూలి
పర్వతాకారముగనున్న మహిష మొండు । చక్షుగతిదోచె త న్మునిసత్తమునకు॥

తే. ఈపని నొనర్చినట్టి వా డింత క్రూర! । వానరుడు వాలియే యంచు పరమ మునియు
తన తపోదృష్టి నెరిగి యెంతయును కనలి। వశి మహాశాప మతనిపై విడిచె నపుడ॥

తే. వనము మత్సంశ్రయంబు దీనిని నెవండు । దూషితమొనర్చె రుధిరబిందువుల జిమ్మ
చెనటి వాడిట యిక ప్రవేశింపరాదు మరి, । ప్రవేశించెనేని తా మరణమొందు॥

తే. పాదపములివ్వి భగ్నమా భంగినెవడు । విసరె నిచ్చటి కిట్టు లీ యసుర తనువు
వాడు నా యాశ్రమముజాడ వచ్చెనేని। బ్రతుక డిక యోజనంబు దూరంబులోన॥

తే. ఇంక యెవ రెవ్వరా వాలివంక వారు । మామక వనంబునం దిందు మసలుచుందురో
వారు నిచ్చట వసియింప వలనుపడదు । పోవలె యనాసుఖంబు శాపోక్తి నెరిగి॥

తే. వెడల కింకను మరియు నా బిడ్డలట్లు । నిత్య మే నోమునట్టి యీ వృక్షములను
మూలపత్రాంకురఫలాళిపాడిచి తుంచి । పాడొనర్చిన గాని శాపంబు నిజము॥

తే. గడువు దీనికి యొక దినం బిడుచునుంటి । రేపు వానరు డెవడు నా దృష్టిబడిన
వాడు పెక్కుగు వే లేండ్లు వసుధపయిన।బండశిలయయి పోవు పో వాస్తవంబు।

తే. అంత వానరు లంద రా యమితతేజు । డా మునీంద్రుడు వచియించి నట్టిపలుకు
విని వనంబుననుండి వే వెడలి చనగ । వారలను జూచి యిట్లని వాలిపలికె। 59

తే. ఇటుల వచ్చితి రేల మీ రెల్లకపులు । వడి మతంగవనంబును విడిచివైచి
క్షేమమేకద యచట వసించునట్టి । మన వనౌకస సంతతి కనఘులార!॥ 60

తే. అంత వారలు సర్వమా కారణంబు । వాలికి మునీంద్రు డిడిన శాపంబుగూడ
చెప్పివైచిరి వనచరబృంద మప్పుడు । హేమమాలికి వాలికి భీమబలికి॥ 61

తే. వానరులు జెప్పినట్టి యా వార్త నెల్ల । వాలి యాలించి మదిలోన చాల గుంది
త్వరగ మునివరు జేరి హస్తములు మోడ్చి । యాచనమొనర్చె మొక్కి
శాపాంత మిడగ॥ 62

తే. మరి, మహర్షియు నా వంక తిరిగియైన । చూడ కట్టులె తనకుటి జొచ్చిపోయె;
శాపధారణ భీతుడై స్వాంతమందు । విహ్వలత నొందె వాలి యవ్విపినమందు॥

తే. రామ! అప్పటినుండి నాభ్రాత వాలి । శాపభయభీతుడై మహాశైలమిద్ది
ఋష్యమూకంబు దరియ నిచ్ఛింప డనఘ!।సుంతకన్నెత్తియైనను చూడ వెరచు॥

తే. అప్రవేశత్వ మెరిగి నా యన్న కిచట । రామ! చరియింతు నీ మహారణ్యసీమ
ఈ వనంబున నిటుల; నా కెంతొ గూర్చు।సచివులనుగూడి-విడిచి విషాద మెడద॥

తే. ఇదియె యస్థిచయం బటు మదముపేర్మి । ఎగిరిపడినట్టి దుందుభి దిదిగో కనుము
మహి మహత్తరమైతోచు మాహిషంబు । శైలకూటోపమం బదే సఖుడు
చూడు॥ 67

తే. విపులములు సాలములు నివే వెలయు నిచట।చూడు శాఖావలంబులు నేడు రామ
వీనిలో నొక్కటిని వాలి వీర్యమునన । కొట్టు బాణాన వెలికది యట్టెపడగ॥

తే. అట్టి దాతని వీర్యంబు నసమ మనఘ । చెప్పినాడను రామ! యా చొప్పునెల్ల;
ఎటుల వాలిని నతని నీ వెసగి యుధిని । చంపగలవాడవో నీవు స్వామి యెరుగ॥

తే. అటుల బల్కెడు సుగ్రీవు నరసి నవ్వి । లక్ష్మణుం డనె, "సఖుడ! యో ప్లవగ
విభుడ!
"ఏ మొనర్చిన వాలి వధింపగలడు । నృపతి యితడని నమ్మెదో నీవు చెప్పుమ"॥

తే. అనగ, సుగ్రీవు డిట్లనె, "మునుపు వాలి। సప్తసాలాల వీనిని చాలసార్లు
కొట్టె నొక్కొక్కటిగ గాగ గొప్ప బలిమి । వృక్షమును దూరి బాణంబు
వెలికినిగుడ॥ 70

తే. రాముడును సైత మొక్క శరంబు నేసి । చెట్టు నొక్కటి యట్టులే కొట్టు నేని
అపుడు రాముని విక్రమం బరసి నేను।నమ్ము దితడు వధించు నా యన్న ననుచు॥

తే. అల్ల హతమైన యీ మహిషాస్థి నొక్క । పాదమున నెత్తి విసరి సత్వరముగాగ
నైచునేని ధనుశ్శతద్వయ మితంపు । నమ్ము దితడు వధించు నా యన్న ననుచు॥

తే. ఇటుల వచియించి సుగ్రీవు డింక మరియు।రాము రక్తాంతలోచను ప్రబలు నరసి
ఒక ముహూర్తంబు ధ్యానించి సఖునితోడ । అల్ల కాకుత్స్థుతోడ ని ట్లనియె
మరల॥ 73

తే. శూరఘాతుండు, శూరుండు, వీరబలుడు । వానరుడు వాలి ప్రఖ్యాత పౌరుషుండు
జగతి నపరాజితుండు సంయుగములందు । కాడు సామాన్యు డతడు సఖా! జయింప॥

తే. సురలకైనను సేయ దుష్కరమునైన । కర్మ లొనరించె నాత డఖర్వ లీల
వాని చింతించియే నేను భయము గదిరి।ఋష్యమూకంబు నాశ్రయించితిని రామ॥

తే. మరి యజయ్యు, నధృష్యు, నమర్షు నతని । వానరేంద్రుని చింతించి వణకి క్రొత్తి
ఋష్యమూకంబు దీనిని నేను రామ! । విడువజాలకయున్నాను వేయునేల?

తే. ఎడద నుద్విగ్నుడను శంకితుడను నౌచు।తిరుగుదు మహావనంబునం దిందు నందు
ఈ యమాత్యుల ననురక్తి నెసగువారి । గుణయుతుల హనుమత్ప్రముఖులను
గూడి॥ 77

తే. శ్లాఘ్యు సన్మిత్రు నిన్ను శ్రీరామచంద్ర! । మిత్రవత్సల! పొందితి మిత్రుగాగ
పురుషశార్దూల! నిన్ను నే పుడమి నిపుడు । ఆశ్రయించితి హిమవంతునట్లు దేవ॥

తే. అయిన నొకమాట, రామ! నా యన్న వాలి । బలుని దుర్భాత్ర్తు బల మది
తెలియు నాకు
నీ బలం బన్న గణమున నిజము నాకు । ఇంక, సఖుడ! యప్రత్యక్షమే కదన్న

తే. అతని భీకర కర్మంబు లాత్మ నెరిగి । కాతరత్వంబు దోప నీ కరణినంటి
అంతియేకాని కాదు నిన్ హడలగొట్ట । కాదు ని న్నవమానింప, కాదు కలహ॥

తే. ధైర్య, మాకృతి, రామ, నీదైన వాణి । ఇవ్వియే చెప్పు లెస్స పృథ్వీకళత్ర!
పరమమైనట్టి నీ తేజ మురుగుణాఢ్య । భస్మసంఛన్నమైనట్టి వహ్ని నట్లు॥ 81

తే. అటు మహాత్ముండగు సుగ్రీవు డనినయట్టి। వచనమది విని రాముండు ప్రభువరుం డు.
మరల స్మితపూర్వకంబుగా హరివరునకు । పలికె నిట్టుల సంప్రీతి నెలమికలిమి॥

తే. మా పరాక్రమమందు నమ్మకము నీకు । లేకయుండిన వానరా! లెస్స యిపుడె
సమరవిషయంబునం దింక శ్లాఘ్యముగను । గూర్తు ప్రత్యయ మిదె నీకు; కొంక
వలదు॥ 83

తే. సాంత్వముగ నిట్లు బల్కి యా సఖునితోడ। కాలియంగుష్టమునన రాఘవుడు లీల
ఎత్తి దుందుభికాయంబు నిట్టె విసరె । పడగ దశయోజనం బది "భళ్లు"మనుచు।

తే. ఎండి లఘువుగనున్న నైరృతిని కాయ। మెత్తి చరణాంగుళిని రాము డేయ టరసి
లక్ష్మణునిముందునున్న యా రాముతోడ । పలికె సుగ్రీవు డిటు లర్థవంతముగన॥

తే. ఆర్ద్రము, సమాంస, మింక ప్రత్యగ్రముగను। నున్నతరి మున్ను దీని మా యనజు
విసరె
లఘువు తృణభూత మింక నిర్మాంస మిపుడు; । కను పరిశ్రాంతు డపుడు మత్తు
డును వాలి॥ 87

తే. స్వామి, నీ వన్న హృది బ్రహర్ష మునమండి । చిమ్మితివి రామ! యిప్పుడే
యెమ్ముల గుది
దీనిచే శక్యమౌనెట్లు తెలిసికొనగ । అధిక మాతని బలమొ నీదైన బలమొ?॥

తే. అప్పు డార్ద్రంబు మరి శుష్క మిప్పు డనెడి। తారతమ్యంబె నామది తాత! కలదు
కాన సంశయ మట్టులే మానకుండె । వాలి బలమందు మరియు నీ బలమునందు

తే. సాల మేకంబు గొట్ట నా శంకదీరు । హస్తిహస్తంబుబోలె యాయతము నైన
విల్లు మోపెట్టి చెవిదాక నల్ల లాగి । విడువుము మహాశరంబును వీర! నీవు॥

తే. స్వామి! నీచే ప్రయుక్త మీ శరవరంబు। సాలమునుద్రుంచు, దీన సంశయము లేదు.
నిను పరీక్షింపగాదను; దొ ట్టనఘ, వెఱుదు। ప్రియము నా కొనరింప నే వేడు దింతె॥

తే. వినుము తేజస్విలం దెట్టు లినుడు ఘనుడో । ఇక మహాద్రుల హిమవంతు డెట్లు
వరుడో
మరి, చతుష్పాత్తులందు కేసరియు ప్రభుడో। అటులె నరులందు నీవు వీర్యమున పెద్ద॥

11 వ సర్గ సమాప్తి – (516)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పన్నెండవ సర్గ - (42)

### సుగ్రీవుకు రాము బలము పరీక్ష సేయుట

**(2) సప్తసాల భంజనము - ఇది రెండవ పరీక్ష - వాలిసుగ్రీవుల మొదటి యుద్ధము - సుగ్రీవుడు దెబ్బతిని పారివచ్చుట - వాలిపై బాణ మేయనందుకు సుగ్రీవుడు రాముని ఆధిక్షేపించుట- రాముని సమాధానము - రెండవసారి యుద్ధమునకు ఏర్పాటు.**

తే. ప్లవగు సుగ్రీవు మాట సుభాషితంబు । విని మహాతేజుఁడా రామపృథ్వీవిభుఁడు
ప్రత్యయార్థంబు గ్రహియించె బాహుబలుడు। చేత నిజకార్ముకంబు విఖ్యాతిమీఱ॥

తే. ధనువు ఘోరంబు గ్రహియించి వినుతయశుడు । శరము నేకంబు బట్టి దాశరథి యపుడు
సాలమును లక్ష్యముగ బెట్టి లీల నేసె । జ్యాస్వనం బది దిక్కుల నన్నినింపె।

తే. నృపుని బాణంబు స్వర్ణపరిష్కృతంబు । బలుఁడు రాఘవు డట్టుల వడిని విడువ
సప్తసాలాల భేదించి సాగియపుడె । పోరి గిరిప్రస్థమునుజించి భూమి జొచ్చె॥ 3

తే. చొచ్చియు ముహూర్తమున నట్లు క్షోణి నపుడె । పటు జవంబున మరల దా వసుధ జించి
పైకి యెగయుచువచ్చి యా బాణ మారఁ । తూర్ణమ స్వతూణిలో దూరె పూర్ణధాటి॥ 4

తే. సప్తసాలంబు లటు లొక్క క్షణములోన । రామశరవేగమున జేసి భీమగతిని
వ్రక్కలింపంగబడుట నాప్లవగు డరసి।పరమ విస్మయమందె సామాత్యుడగుచు॥

తే. అత డంతట నిజమూర్ధ మవని సోక । కంఠభూషణములు వ్రేలుకాడ వంగి
భక్తి సాష్టాంగముగ భూమిపైన వ్రాలి । అంజలిఘటించి సుగ్రీవు డటులె
యుండె॥ 6

తే. రాము డొనరించినట్టి కార్యంబుగాంచి । పరమహర్షితుడైన యా హరివరుండు
శూరు ధర్మజ్ఞు శ్రేష్ఠు నా వీరు జూచి। రాము సర్వాస్త్రవిదుజూచి లలి వచించె॥

తే. ఇంద్రుతోగూడి దేవత లెల్లరెత్తి । వచ్చినన్గాని వారి నీ బాణధాటి
హతమొనర్ప సమర్థుండ వాజి నీవు । ఇక ప్రభో! వాలి మాట నే నేల జెప్ప॥

తే. ఇటుల సప్తమహాసాల వృక్షములను । గిరిని భూమిని నొక్కటే శరము నేసి
భూప! భేదించియున్న నీముందు నిలువ । ఎవ్వ డోపు రణాగ్రమం దింక రామ!॥

తే. ఇప్పు డుడిగెను శోకమో యప్ప! నాకు । ప్రీతి గలిగెను పరమంబు రేడ! యిపుడ
సుహృదు నిన్నిటు బడసితి మహితబలుని। ఇంద్రవరుణోపముని నా యదృ
ష్టమునను॥ 10

తే. వాని నిప్పుడె నావైరియైనవాని । వాలి నింకను దేవ! నీ బాణధాటి
భ్రాతృరూపుని మత్ప్రియార్థంబుగాగ । చంపు కాకుత్స్థ! యిదియె యంజలి
ఘటింతు॥ 11

తే. అంత రాముండు సుగ్రీవు నాదరించి । ప్రీతి ప్రియదర్శనుని కౌగలించుకొనుచు
లక్ష్మణానుమతంబున లలి వచించె । వాక్య మీరీతి యా మహాప్రాజ్ఞుడెలమి॥

తే. పోద మింకను కిష్కింధపురము మనము । వేగ ముం దేగు మీవు నీ వీటి కనఘ!
ఏగి సుగ్రీవ! పిలువు గొంతెత్తి యిపుడ । భ్రాతృగంధిని వాలి నా ప్రబలశత్రు॥

తే. వార లందరు నేగి సత్వరము గాగ । వాలి పాలించు కిష్కింధపట్టణంబు
గహన వనమున నచటి వృక్షముల వెనుక । దాగి యుండిరి మరుగునం దంద
రపుడు॥ 14

తే. గాఢముగ దట్టిబిగియుంచి కపివరుండు । వాలి నాహ్వాన మొనరింప నాలమునకు
ఘోరనాదంబు సుగ్రీవు డౌర! చేసె । అంబరంబు పగిల్చెడి డంబుదోప॥ 15

తే. భ్రాతృనినదంబు నద్దాని నాలకించి । ఆ మహాబలి వాలి కోపాధికమున
వడి సుసంరబ్ధుడై యప్డె వెడలివచ్చె । అస్తతటమునుండి యా యర్కు డట్లు॥

తే. వాలిసుగ్రీవులకు నప్పు డాల మౌర । తుములమయ్యెను చూడంగ క్రమముగాను
ప్రభ బుధాంగారకగ్రహరాజములకు । గగనమున ఘోరయుద్ధమౌ కరణిగాగ॥

తే. అశనికల్పంబులౌ తలప్రహరణముల । వజ్రకల్పంబులౌ ముష్టిపాతములను
భ్రాంత లన్యోన్య మాహవరంగమందు । క్రోధమూర్ఛితులై బాదుకొనిరి వారు॥

తే. ప్రభుడు రాముండు నట ధనుష్పాణియగుచు। ఇద్దరను తేరి యారక వీక్షింపుచుండ
వీరు లుభయులు నన్యోన్య వేషములను। సదృశులైతోచి రశ్వినుల్ చందముగను॥

తే. ఇతడు సుగ్రీవు, డిక వాలి యిత డటంచు । ఏర్పరింపంగ రాకుంట యినకులుండు
రాము డేయంగ బుద్ధి చేరంగ దయ్యె । శరము నంతకరంబు నా సమయమందు॥

తే. ఇంతలోపలనే వాలియేట్ల చేత । విరిగి సుగ్రీవు డా రఘువరుని సఖుని
నాథు గానంగలేక రణంబు విడిచి । ఋష్యమూకంబునకు దౌడు దీసి పారె॥

తే. రక్తసిక్తాంగుడును బహుక్లాంతుడగుచు । తిన్న దెబ్బల జర్జరీ కృతుడు నౌచు
క్రోధమున వాలి తనను తరుమ్ముచును రాగ । పరచి చొచ్చెను తన్మహా వన
మతంగు॥ 22

తే. అటు మతంగవనంబును నతడు చొచ్చ । టరసి శాపభయార్దితుండైన వాలి
ఇంక "తప్పించుకొంటివిలే" యటంచు। పలికి వెనుకకు మరలె నా ప్రథితబలుడు।

తే. రాఘవుండును వెంట నా లక్ష్మణుడును । మరియు హనుమంతుడును రాగ
త్వరితగతిని
తరలి సుగ్రీవు డే వనాంతరము జొచ్చె। తాము జొచ్చిరి త ద్వనాంతరమె వడిగ

తే. లక్ష్మణునిగూడి యిట్టు లా రాము డటకు । వచ్చుచుండుట వీక్షించి వాల్చి
మోము
లజ్జ దీనత దోప నా ప్లవగవిభుడు । పలికె సుగ్రీవు డిట్టుల వాక్యమపుడు॥ 25

తే. అవుర! నన్నుసుగొల్పి నా యన్నపైకి। బాగు! బాగిట్లు చూపి నీ పటుబలంబు
వైరిచే నన్ను కొట్టించి వంచినావె! ఏమిచేసితి విటుల? నిన్నేమనందు? 26

తే. వాలి వధియింపలేనంచు వాస్తవంబు । నాడె నీవయ్యొ చెప్పియుండంగవలయు
అటుల జెప్పిన రామ! యీ యద్రివిడిచి । కదలియుండెడివాడనేకాదుగాదె॥

తే. కరుణముగ, దీనముగను, వాక్యములనిట్లు। పల్క– సుగ్రీవు నా మహాత్మకునిజూచి
రామచంద్రుండు మరల నిట్లనుచు బదులు। చెప్పసాగెను తా నప్పు డొప్పిదముగ॥

తే. తాత! సుగ్రీవ! వినుము, క్రోధంబు వలదు; । చెప్పెదను కారణంబు నా గొప్ప
శరము
దీని నిప్పుడు చేత నే బూనియు నిక । ఏయకునికికి – నెమ్మది నింక వినుము

తే. గతిని వేషాన నిక యలంకారమునను । మరి, ప్రమాణాన భ్రాతలిద్దరికి మీకు
పోల్కి సుగ్రీవ! యన్యోన్య మొక్కటిగనె । తోచినట్లుంట తొలిసారి చూచి
తోయి॥ 30

తే. స్వరమునను చూపునను వాక్యసరణి యందు । క్రమత వర్చస్సునందు విక్రమమునందు
భేదమింతయుకానమి మిత్ర! నిజము । దృష్టిభ్రమియించె రూపసాదృశ్యవశత॥ 31

తే. ఇట్టి సాదృశ్యమున శంక హృదిని నాకు । పొడముటన్ జేసియే నేను విడువనైతి
శరము శత్రునిబర్హణం బురుజవంబు । జీవితాంతకరంబు సుగ్రీవ నిజము॥ 32

తే. మూలఘాతము మనల కిర్వురకు సఖుడ । కలుగకుండంగవలెనంచు సలిపి తిటుల॥
వినుము, నీకు నా యజ్ఞానముననో లేక। లాఘువంబుననో యపాయంబు సుంత
గలుగ నాదగు మాహాత్మ్య మీ యిలనులెస్స । ప్రకటమాగాదె నాదు బాల్యమును
మిత్ర॥ 34

తే. అభయమిచ్చి వధించుట యధికపాపమందు; రదిగాక, నేను నా యనుజు డితడు
సీత వరవర్ణినియు వనసీమనిచట । నీ యధీనుల మిక, మాకు నీవె గతియు

తే. కాన, ననుగూర్చి శంకను మాని నీవు। మరల యుద్ధమొనర్పుము భయము లేమ
చూడు మీసారి యింక యీ క్షోణిపైన । వాలి నా యేకబాణాన కూలి పొరలు॥

తే. తాత! యీ తడ వీవుయుద్ధంబుసేయ।ద్వంద్వయుద్ధాన నిన్ను గుర్తరయు కొరకు
ఆనవా లేదియైన యో వానరేంద్ర । మేన ధరియింపు మిక నీవు మహేంద్రపుత్ర॥

తే. చూడు "గజపుష్పి"యనుపేర శుభదమైన। లలిత మీ ఫుల్ల మీ రమ్య లతను
చిదిమి
ఈ మహాత్ముని సుగ్రీవు గ్రీవమందు।మాలగా వేయు మిప్డె లక్ష్మణకుమార॥ 39

తే. అంత గిరితటమున మొల్చి యందమొప్పు।లతను కుసుమాకులంబునులక్ష్మణుండు
పెరికి గజపుష్పి నద్దాని త్వరితగతిని। ప్లవగు సుగ్రీవు కంఠాన వైచె నపుడె॥ 40

తే. ఘనత లతచేత కంఠస క్తంబు చేత । శ్రీయుతుండైన యట్టి సుగ్రీవుడపుడు
ఆకసంబున నక్షత్ర మాలచేత । చుట్టబడినట్టి సూర్యుని శోభ వెలిగె॥ 41

తే. మరి, ససంధ్యాభ్రము బలాకమాల నట్లు ।కపియు విభ్రాజమానంపు వపువుతోడ
రామవాక్య సమాహితుం డా మెయి జనె । వాలిపాలిత కిష్కింధ కోలినపుడ
మిత్రు రామునితోగూడి శత్రుగెలువ 42

12 వ సర్గ సమాప్తి – (558)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

# కిష్కింధ కాండము

### పదమూడవ సర్గ - (౧౩)

వాలి వధార్థమై కిష్కింధకుపోవు మార్గవర్ణన - త్రోవలో "సప్తజనాశ్రమ" సంవర్ణనము,

తే. ఋష్యమూకంబునుండి వేవెడలి యపుడ । అఖిల ధర్మాత్ముడా లక్ష్మణాగ్రజుండు
కీశు సుగ్రీవు గూడి కిష్కింధ కరిగె । వాలివిక్రమపాలితంబైనపురికి॥ 1

తే. కాంచనవిభూషితము మహాకార్ముకంబు । కరమునన్ దాల్చి వెడలె రాఘవుడు వడిగ
పోల్ప నాదిత్యసంకాశముల్ శరంబు । లటులె కొనుచేగె రణసాధకంబు లోలి॥

తే. ఆ మహాత్ముని రాఘవు నగ్రమందు । కెరలి సుగ్రీవుడా దృఢగ్రీవు డరిగె
లక్ష్మణుండును నా మహాప్రథితబలుడు । నట్టులే యేగె శ్రీరాము నగ్రమందు॥

తే. వెనుక హనుమయు, నళుడును, వీరుడైన। నీలుడును, భూరి తేజుండు పృథుబలుండు
యోధుడా హరియూథపయూథపుండు । తారుడును బోయి రనివార్య ధాటి మెరయ॥ 4

ద్వి. పుష్పభారావలంబుల వృక్షములను । స్వచ్ఛాంబువహసరిత్సముదయంబులను
సాగరంగముల వేగమా నదుల। కందంబుల శైలఘననిర్ఝరముల
ప్రియదర్శనంబుల పృథు దరీ తతుల । శిఖరాల ముఖ్యాల నిక గుహాఘముల
చూచుచు నేగి రా శూరు లెల్లెడల। వైడూర్యవిమల పర్ణాఘులన్ వెలసి
ఆకోశకుట్మలానీకంబులైన । పద్మాల జలముల పరిఢవించుచును
శోభించు కొలకుల జూచు చం దందు । కారండసారస కలహంస రుతుల

జలకుక్కుటంబుల చక్రవాకముల । వంజుళ షట్పద బక సంతతులయు
అన్యాండజంబుల నలరెడు ధ్వనుల । ఉపనాదితంబుల నురు తటాకముల
గాంచుచు నేగి రా కపులు రాఘవులు॥ 8

తే. మృదుల ఘాసాంకురంబుల మేయు చచట । ఆ వనస్థలి సర్వత్ర హరిణచయము
నిర్భయంబుగ వనగోచరార్భకములు । శోభ విహరింప గనిరి; నిల్చుటను గనిరి॥

తే. కరులను, తటాకవైరుల ద్విరదములను । శుక్లదంతవిభూషితసుందరముల
కూలఘాతంబు లొనరించు కుంజరముల । ఏకచరముల ఘోర వన్యేభములను॥

తే. గిరితటోత్కృష్టముల మత్తకరిచయముల । జంగమాద్రుల వారణసముదయముల
భూతల పరాగ రేణు సముక్షితముల । వారిదప్రఖ్యముల దంతివారములను॥

తే. వని వనేచరముల నన్యపక్షితతుల । ఖేచర విహంగమంబుల జూచుకొంచు
త్వరితగతి వార లరిగి రా వనము దారి । అల్ల సుగ్రీవ వశవర్తులగుచు నపుడు॥

తే. త్వరితముగ వార లీ రీతి నరుగుచుండ । వనము ద్రుమషండ మొకటి యా
పజ్జగాంచి
ప్రభుడు రఘునందనుండు శ్రీరాము డపుడు । పలికె సుగ్రీవుతో నది తెలియ
గోరి॥ 13

తే. అదిగో, మేఘంబుభాతి యాకాశమందు । వృక్షషండంబుసుగ్రీవ! వెలుగుచూడు
మేఘసంఘాతవిపులంబు మిత్ర! కనుము। ధరణి పర్యంతకదళీవృతంబు నౌచు॥ 14

తే. ఏమిదిసఖా ! యెరుంగ నిచ్ఛింతు దీని । ఎడదకౌతూహలమునాకు పొడమె నోయి
హృదిని కౌతూహలము దీని నీ వలనన । తీర్చుకొనగోరుదును నేను; తెలుపు
మింక॥ 15

తే. ఆమహాత్ముడు రాఘవుండనినయట్టి । వాక్యమద్దానినాలించి ప్లవగవిభుడు
త న్మహద్వనమునుగూర్చి దారిలోన । పోవుచునె చెప్పదొడగె సుగ్రీవుడిటుల॥

తే. అనఘ!శ్రమనాశనమిదొక్క యాశ్రమంబు।మిగుల విస్తీర్ణమై పొల్చుజగతిలోన
మరియు, ఉద్యానవనసుసంపన్న మగును । స్వాదుమూలఫలోదకంబగును రామ॥

తే. "సప్తజను"లనుపేర నచ్చట, మహాత్మ । సంశితవ్రతులుండిరి సంయములును
వార లేడ్గు రధశ్శీర్షులౌచు నియతి । సతము జలశాయులై యుండి రతుల లీల॥

తే. సప్తరాత్రుల కొక్కొక్కసారి రామ ! । వాయుభక్షణమొనరించి వని వసించి
సప్తశతవర్షములు భువి సలిపి తపము । చనిరి సశరీరులుగ వారు స్వర్గమునకు॥

తే. వారిదైన మహాప్రభావంబు కతన । ఆశ్రమంబిది తరులె ప్రాకారముగను
సంవృతంబయి సురలకు సైతమెపుడు । మరి, దురాధర్ష మగుసుమ్ము ధరణిలోన॥

తే. అనఘ, వర్జించు పక్షు లీ యాశ్రమంబు । అన్యవనచరములు నట్లె యరుగ వటకు
తెలియ కేదేని జంతు వా తెరువు జనిన । తిరిగి రా దది యిపలికి మరల, రామ॥

తే. కలరవంబుల నట నప్సరలు బొనర్చు । వివిధభూషణరవములు వినగవచ్చు
తూర్యగీతస్వరంబులు దోచు నచట । దివ్యగంధంబు వీచు పో నవ్వ మెపుడు॥

తే. మించు త్రేతాగ్ను లచట దీపించుచుండు । అల్ల దే కపోతాంగారుణము ఘనమ్ము
ధూమ మా వృక్షశిఖరాల దొడ్డగాను । చుట్టుకొనుచున్న దదె చూడు దట్టము
గను॥ 23

తే. ధూమసంసక్తమస్తకస్తోమము లవె । వెలయుచున్నవి చూడు మీ వృక్షతతులు
జలదజాలప్రతిచ్ఛన్నములుగ దోచు । వితతవైడూర్యగిరులనువిధముగాగ॥ 24

తే. సల్పుము ప్రణామ మీవు తత్ సంయములకు । రామ! ధర్మాత్మ! తమ్ము డీ
లక్ష్మణుడును
ప్రయతచిత్తులరై, మరి భక్తిమీర । సంయతాంజలు లగుచును స్వామి! మీరు॥

తే. ప్రణతిగావింతు రెవ్వ రా మునివరులకు । భావితాత్ముల కో రామ! వారి కింక
తోచ దశుభంబు మేనిపై ధ్రువము సుమ్ము । తలప కించిత్తుగాని కీ డొలయ
దెపుడు॥ 26

తే. అంత రాముండు తమ్ముడౌ లక్ష్మణుడును । ఆ మహాత్ముల ఋషుల భావమున
నెంచి
అంజలి ఘటించి యభివాద మధికభక్తి । చేసి రప్పుడు తద్వనక్షితిని, పథిని॥

తే. అట్టు లభివాద మొనరించి యమలభక్తి । రామలక్ష్మణు లింక ధర్మాత్ము లపుడు
కదలి సుగ్రీవుతోడను ముద మెలర్ప । కక్కగలవానరులతోడ తరలి చనిరి॥

తే. అటుల "సప్తజనాశ్రమం"బందునుండి । దూర మధ్వాన మరిగి యా వీరవరులు
అరసి రెదుట దురాధర్షమైన దాని । వాలిపాలితకిష్కింధ పట్టణంబు॥ 29

ది. అంత రామానుజ, రామ, వానరులు । ఉదితాగ్ర్య తేజసుల్ ఉగ్రాస్త్రములను
గొనుచు శత్రుని జంప కూడి యందరును । వే సురేశాత్మజవీర్యపాలితకు
మరల యేతెంచి రా పురికి, వాకిటికి॥ 30

13 వ సర్గ. సమాప్తి. (588)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునాల్గవ సర్గ. (22)

రామసుగ్రీవాదుల కిష్కింధా ప్రవేశము - సుగ్రీవుడు వాలిని యుద్ధమునకు పిలుచుట.

తే. వారలందరు నరిగి సత్వరముగాఁగ । వాలి పాలించుకిష్కింధపట్టణంబు
గహనవనమున నచట వృక్షముల వెనుక। దాగియుండిరి మరుగునందందు నిందు॥

తే. దృష్టిసర్వత్రబరపి వీక్షించి చెలఁగి । కాననప్రియు డాతఁ డా కాననలోన
హ్రదిని సుగ్రీవు డా ఘనగ్రీవు డపుడు । భృశము క్రోధంబు వహియించె విపులబలుడు॥ 2

తే. అటుల పరివారపరివృతుండై యతండు । వాయువేగపురస్సరాభ్రంబు పగిది
గర్జలొనరించి గగన మగల్చునట్లు । పిలిచె యుద్ధంబునకు వాలి నలుక మెయిని॥

తే. రమ్య బాలార్క సదృశు డర్కాత్మజుండు । దృప్తసింహాక్రముండు సుగ్రీవు డపుడు
రామచంద్రు క్రియాదక్షు ప్రబలవక్షు । గాంచి యిట్లని పల్కె వాక్యంబు నొకటి॥

తే. అల్ల హరివాగురవ్యాప్త మదిగో కనుము । తప్తకాంచనతోరణతతులదాని
ఆయతధ్వజయంత్రాఢ్యమైనదాని । చేరితిమి వాలి యేలు కిష్కింధపురము॥ 5

తే. ప్రతిన యెయ్యది రామ ! మున్ వాలి గూల్ప । నీ వొగి నొనర్చియుంటివో దేవ దాని
వేగ సఫలంబు నొనరింపు వీరవర్య ! । కాల మాగత మా లతాబాల నట్లు॥ 6

తే. ఇటుల సుగ్రీవుడనగ నా పటుబలుండు। పరమ ధర్మాత్ము డా రామ ధరణివిభుడు
శత్రుసూదను డప్పు డా మిత్రమణికి । అల్ల సుగ్రీవునకునిట్టు లనియె నెలమి॥

తే. పోర నిలుబోల్ప యీ గజపుష్పలతను । పెరికి నీమెడ సౌమిత్రి వేసెగాన
చిహ్న మిద్దానిచే నిన్ను చిక్కువడక । చక్కగుర్తింపగలను యీసారి, సఖుడ॥

తే. తాత! లతచేత కంఠసక్తంబుచేత । అధికముగ వెల్గె దీవు వీరాగ్రగణ్య !
ఆకసంబుననక్షత్రమాల చేత । చుట్టబడినట్టి సూర్యుని చొప్పగాగ॥ 9

తే. అనఘ ! వాలిసముత్థితంబైన నీదు । భయము వైరము నే నిప్డె భండనమున
ఒక్కటేబాణమోక్షణం బోలి సలిపి । పాపునాడను చూడు మీ వానరేంద్ర॥

తే. నాకు జూపుము సుగ్రీవ ! నయవిదూర । భ్రాతృరూపుని వైరిని వాలి నతని
చూచుటే యింక తడవోయి చూడు వాడు। దుమ్మునన్ గూలి వని నిందె దొరలు
నోయి॥ 11

తే. అతడు నాదృష్టిబడి యింక బ్రతికి మరల । పోవకుండినవైననే నీవు సఖుడ
నన్ను నిర్దోషిగా హృది నెన్నుమోయి । మరియు, నన్నింక గర్హింప మాను
మోయి॥ 12

తే. లీల ప్రత్యక్షముగ సప్తసాలములను । నేసిచూపితినో నీకు నే బలాన
ఆ బలాననె వాలి నీ యన్న యింక । హతుడ నాచేతనని సఖా ! మతి నెరుంగు॥

తే. అనృతమెన్నండు మిత్రమా ! ఆడి యెరుగ । ఎంతకష్టంబులోనున్న సుంతయేని
ధర్మలోభపరీతుండ తద్ద నేను । ఎన్న డాడను పో, సఖా! యింతమీద॥ 14

తే. సఫలమొనరింతు ప్రతిన సంశయము వలదు । వీడు సంభ్రమ మిక నీవు వీరవర్య !
ఇల ప్రసూతంబు కలమంబు నింద్రు డెలమి । వర్షమునజేసి సఫలతబరచునట్లు॥

తే. కనుక, వాలిని హేమమాలిని, సఖుండ । వెలికి నిప్పుడ త్వరగ రప్పించుటకును
శబ్ద మెయ్యది చక్కని సాధనంబొ । దాని సేయుము సుగ్రీవ ! తడయ కిపుడె॥

తే. సతముజితకాశి, మరి బలశ్లాఘి యతడు । ఉర్విమున్నెప్డు నీచేత నోటు బడమి
ఆలసింపక యెగసి తా ననికి వచ్చు । సంయుగప్రియు డా వాలి; సాగుమింక॥

తే. రిపుల ధర్షణ మాజిని నెపుడు గాని । శూరులు సహింపరింతయు వీరవర్య !
అందునను స్వీయవీర్యజ్ఞులైన వారు । స్త్రీ సమక్షాన నిక విశేషించి, సఖుడ॥

తే. రాము వచనంబు నది విని ప్లవగవిభుడు । పొంగి సుగ్రీవు డా హేమపింగళుండు
తద్ద నర్దించె క్రూరనాదంబు గాగ । అంబరంబుపగిల్చెడి డంబు మీర॥ 19

తే. తన్నినాదాన కరము విత్రస్తము లయి। పారె గోవులు వినిహత ప్రభములౌచు
రాజదోషపరామృష్టలై జగాన । అల కులస్త్రీలు నాకులలైన రీతి॥ 20

తే. పారె మృగములు వేగ నావహామునుండి । భగ్నమైపోరుహాయముల భంగిగాగ,
పడియె ఖగములు భూమిపై వడిగ నపుడె। క్షీణ పుణ్యంబులు గ్రహంబు లివి
యనంగ॥ 21

తే. చండజీమూతగణరవోగ్రుండతండు । అతుల శౌర్యవివృద్ధ తేజోధికుండు
దీప్తి సూర్యాత్మజుండు ప్రతీతు డార్చె। అనిలచంచలభంగ మహాబ్ధి యనగ॥

14 వ సర్గ. సమాప్తి. (310)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునేనవ సర్గ. (31)

**వాలి యుద్ధమునకు బయలుదేరగా, తార వల్దని వారించుట.**

తే. అంత సుగ్రీవు డతుల మహాత్ముకుండు । తమ్ము డొనరించినట్టి నాదంబు చెవుల
బడగ నంతఃపురగతుండు వాలి కనలి । మది నమర్షణుడయ్యె నా మర్కటుండు॥

తే. సర్వభూతప్రకంపనస్వనము నాని । వినిన యంతన తత్క్షణంబున మదంబు
వీడిపోయెను వాలికి; వేగినప్పుడె। క్రోధము మహత్తరము క్రమ్ముకొనియె నెడద॥

తే. అతుల రోషపరీతాంగు డగుట వాలి । కనగ సంధ్యాతపప్రభ గ్రాలుచుండి
ఔర, నిష్ప్రభతన్ జెందె యాక్షణంబ । దివిని యుపరక్తుడైన యాదిత్యు పగిది॥

తే. ఘోరదంష్ట్రాకరాళుండు క్రోధదీప్త । వహ్నిసన్నిభు డా వాలి వరలె నచట
ఉత్పతితపద్మమై మృణాళోత్కరముల।దోచు హ్రదమట్లు లప్పు డా దోర్బలుండు॥

తే. ధ్వనిని దుర్మర్షణంబు నద్దాని చెవుల । వినినయంతనె యురికి తా వెలికి వచ్చె
నిజచరణఘట్టనంబుల నిఖిల జగతి । వ్రక్కలించెడి వేగాన ప్రబలి వాలి॥ 5

తే. అతని నప్పుడు తార స్నేహంబుకతన । సౌహృదముదోప కౌగిట సరగబట్టి
త్రస్తసంభ్రాంతయగుచు నాతనికి నిట్లు । కడు హితోదర్కముగ చెప్ప దొడగె
నతివ॥ 6

తే. అదె నదీవేగమన వచ్చు నాగ్రహంబు । విడువు దీనిని లెస్స నీయెడద వీర!
అనఘ! శయనోత్థితుండు కాల్యంబు నంద । స్రజము భుక్తంబు త్యజియించు
సరణిగాగ॥ 7

తే. రేపు కాల్యంబున రణంబు నేపుజూపి । సలుపవచ్చును నాథ, పోవలదు నేడు
తొందరిపుడేల, వీర ! శత్రువు ఘనుండు । కాడుగా; నీవు తక్కువ గాడుగాదె॥

తే. సుంత యోచింప కిట రణక్షోణి కీవు । ఇపుడు రేవుట నామది కెక్క దింత
వినుము చెప్పెద యేమికారణముగాగ । విన్ను వారింతునో యిట్లు నిజము, నాథ॥

తే. నాథ ! నీచేత నిపుడె యాయోధనమున । దెబ్బతిని, నీవు తరుమంగ దిక్కులను సక్క
పారిపోయినయతడె యీ సారి మరల । ఇంతలో పిల్చుచున్న వాడేమి కారణమో॥

తే. అటుల నీచేత యోడిన దదియుకాక । విను విశేషించి దెబ్బలుతినియు గూడ
ఇచటి కేతెంచి మరల వాడిటుల నిన్ను । పిలుచుట గనంగ శంక నా హృది
జనించె॥ 11

తే. తద్దనర్దించు నాతని దర్పగతియు । అతని ప్రాక్కియు నాదపద్ధతియు జలప
ఘోరసంరంభమునుజూడ కారణంబు । దాని కల్పంబు గాదంచు తద్ద దోచు॥

తే. నాథ ! సుగ్రీవు డిటువచ్చినా డటన్న । ఏదో తోడ్పాటు లేకుండఁ గా పటంబు
దండిబలుడైన యెవనిదో యండ నితడు । చూచుకొనివచ్చి యేయార్చుసుమ్మి,
యిటుల॥ 13

తే. ప్రకృతిచేతనె నిపుణుండు వానరుండు । బుద్ధిమంతుండు నీదు తమ్ముండు సుమ్మి
వినుము వా డపరీక్షితవీర్యుతోడ । రాడు నీపైకి నెప్పుడు రణ మొనర్ప॥ 14

తే. పూర్వమే నేను వింటిసుమ్మీ మహాత్మ । అంగదుండుకుమారుండు సంగతెల్ల
చెప్పుచుండంగ, దానిని నిప్పుడేను । చెప్పెదను నాలకింపుమిహా గొప్పహితము॥

తే. విను కుమారకు డంగదుం డెనయు వేడ్క । అట వనాంతరమున క్రీడలాడుచుండ
చారు లాప్తులచే సమాచారమెల్ల । వినిన దట్టిదె నాతోడ విభుడ! చెప్పె॥ 16

తే. అల, యయోధ్యాధిపతిపుత్రు లక్కకులులు । శూరులు, దురాసదుల్, ప్రసిద్ధ
గుణులు
రామలక్ష్మణు లాజి దుర్జయులు వనికి । వచ్చిరట తోడుపడగ నీభ్రాత కనఘ॥

తే. నాథ ! నీ తమ్మునకు రణాంగణమునందు । తోడుపడవచ్చినట్టి యా వోర్చలుండు
కరము రణకర్కశుండు విఖ్యాతు డౌను । పరబలామర్ది మరి యుగాంతాగ్ని
సుమ్మి॥ 18

తే. సాధువులకు నివాసవృక్షం బతండు । క్షితిని నాపన్నులకు పరాగతియు సుమ్మి
ఆర్తుల కతండు సంశ్రియుం డార్తిహరుడు । యశమునకు నేకభాజనం డని
యెరుంగు॥ 19

తే. జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడౌను, నాథ । నిరతుఁడు పితుర్నిదేశమం దెరుగు మింత
ధాతువులకెల్ల శైలేంద్రు రీతిగాఁగ । అల, మహాగుణముల కత డాకరుండు॥ 20

తే. కాన, యుక్తంబుగాదు నీ కతనితోడ । పగనుబూనంగ ఆ మహాత్మకునితోడ
అప్రమేయునితోడ రణాంగణమున । దుర్జయునితోడ, రాము డస్త్రోకు తోడ॥

తే. చెప్పెదను శూర నీకొక్క చిన్నమాట । నిజము నీయందు దోషంబు నిడఁగగాదు
వినుము, చేయుము, నీ కేది ఘనమొ, హితమొ । చెప్పెదను దాని నిప్పుడే
చిత్తగింపు॥ 22

తే. యౌవరాజ్యాన సుగ్రీవు నీవు వేగ । పిలిచి యభిషేకమొనరింపు పెంపు మీర
విగ్రహము బూనకుము వీర ! యుగ్రుతోడ । బలియు డా తమ్మునితోడ నో
ప్రభువరుండ॥ 23

తే. ప్రకృతము దలంప రాముతో పరమమైత్రి । మరియు, సుగ్రీవుతోడ పెంపారుప్రీతి
వైర మిక దూరముగఁతోలివైచుటయును । హితము లివి నీ కటంచు నా మతికి
దోచు॥ 24

తే. లాలనీయుండెగా నీకు బాలు డతడు । అనఘ, తమ్ముండు సుగ్రీవు డాత్మసముడు
ఋష్యమూకాననున్న, నీ యింటనున్న । సర్వథా బంధువే కాదె స్వామి, నీకు॥

తే. ధ్రువము, సుగ్రీవువంటి బంధువుని నీకు । భువిని నెంచను గానను భూరితేజ!
దానమానాదిసత్కారతతుల నతని । నిల్పుకొనుమిట నీకిక నీడగాఁగ॥ 26

తే. వైర మిది వీడి నీదు పార్శ్వంబునందు । నిలుచుగావుత యతడెప్పు డెలమికలిమి
దేవ! సుగ్రీవు డా దృఢగ్రీవు డరయ । దీకు సతతంబు బంధువేకాక పరుడె ?॥

తే. భ్రాతృసౌహృదదృష్టిని పారజూడ । వేరె మార్గంబు లేదిక వీర ! నీకు ?॥ 29

తే. మత్ప్రియంబైన పని నీకు మతమయేని । నీ హితమె నేను కోరు దం చెంచెదేని
ఇంతదూరము నిన్ను యాచించితినిఁగ । లెస్స నామాట నిట యాచరింపు నాథ॥

తే దయనుబరగింపు, నాజల్పితంబు వినుము ।రోషమేపూని తగదు శూరుండ నడవ;
తగదు కోసలరాజపుత్రకునితోడ । విగ్రహం బింక శక్రతుల్యాగ్రు తోడ॥ 39

తే. ఇట్టు లా తార హితమె తా నెంతయేని । అతివ, వాలినిగూర్చి పథ్యంబె పలుక
ఔర! కాలాభిపన్నున కతని కవ్వి । ఆ వినాశపుకాలాన నచ్చవయ్యె॥ 31

15 వ సర్గ. సమాప్తి. (641)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునారవ సర్గ. (౧౬)

తారమాటను త్రోసివేసి వాలి యుద్ధమునకు పోయి సుగ్రీవునిమీద కలియబడుట – వాలివధ.

తే. తార, తారాధిపానన తనకు నిట్లు । హితము తా నెంతయేని వచింప నపుడు
వాలి నిర్భర్త్సనమొనర్చి వాక్య మిట్లు । పలికె నామెకు తనమది నలుకు లేక॥

తే. చెలిరో! తమ్ముడు మరి విశేషించి రిపుడు । గర్జ నొనరించి వీ డిట్లు ఘనతరాగ
వీని సంరంభ మింక నేవిధముగాగ । నను సహింపమనెదు వరాననరో! చెప్పుమ॥

తే. విను మధర్షితులగు శూరజనములకును । ఆజి ననువర్తులగునట్టి యాచలులకును
మరణమునకంటె ధర్షణమర్షణంబ । ఘోరబాధగ దోచు పో తార! భీరు!॥

తే. ఔర! వీడు హీనగ్రీవు డాజికాంక్ష । వచ్చి సుగ్రీవుడే యార్చి పెచ్చుపెరుగ
వీని సంరంభమోర్వంగ వెలది! నాకు । శక్యమికకాదు పో తార చంద్రవదన॥

తే. లలన! ననుగూర్చి నీకు నా రామునెడల । వలదుశంక, విషాదంబు వలదు పొమ్ము
అతడు ధర్మజ్ఞుడు, కృతజ్ఞు డౌను గాదె । పాప మతడెట్టు లొనరించు పద్మనయన॥

తే. పొమ్ము వెనుకకు స్త్రీలతో నెమ్మది నిక । ఏల నావెంట మరల యిట్లగుదెంతు!
సౌహృదము జూపితివి తార! సంతసంబ । భక్తి నాయెడ నెరపితి వబల! లెస్స॥

తే. వెడలి రణమొనరించి నే వేగవత్తు । వలదు సుగ్రీవుగూర్చి సంభ్రమము నీకు
అతని దర్పంబు మాత్రమే యణచి వత్తు । ప్రాణములదీయసుమ్ము! నా పలుకు
నమ్ము॥ 7

తే. సంగరంబున నిల్చియు శత్రు నసురు । గొనని రీతిని గలను నే రణమొనర్ప
వినుము, ముష్టి ప్రహారాల వృక్షములనె । నతని పీడించి పారు నట్లతివ! సేతు॥

తే. విను దురాత్ముడు వాడు నా పృథుబలంబు । పూనికయును లెక్కగొన, కిల్లు
పొగడు బట్టె
నరపతితివి పో సహాయత్వమెరిగి లెస్స । సతిరో ! నాయెడ జూపితి సౌహృదంబు॥

తే. ఒట్టు నాప్రాణములపైన బెట్టుచుంటి । పొమ్ము పురి కింక, కోరు జయమ్ము నాకు
తమ్ము నాతని రణమునఁ దరిమి కొట్టి । మరలివచ్చెద నింతలో మరుగవలదు॥ 10

తే. తార ప్రియవాదినియు నంత తనదు ప్రియుని । నతని వాలిని నాలింగనంబు జేసి
మందముగ నేడ్చు చప్పు డా మందయాన । దక్షిణ ప్రదక్షిణమొనర్చె తనదు
పతికి॥ 11

తే. స్వస్త్యయన మంత సమ్మంత్రవతుగ భక్తి । తార విజయైషిణి యొనర్చి తరలియప్డు
అంతిపురికేగె స్త్రీలతో నబలగూడి । శోకమోహితయగుచును క్షుభితయగుచు॥

తే. స్త్రీలతోగూడ తార స్వీయాలయంబు । జొచ్చినంతన వాలియు చెచ్చెరప్డ
నగరముననుండి వెలువడె నగచరుండు । రోజుచు మహాహివతుగ దా క్రుద్ధు
డగుచు॥ 13

తే॥ పరమరోషణు డా వాలి కరము నూర్పు । లెగయుచుండ మహాతేజు డగచరుండు
దృష్టిసర్వత్ర బరగించె నిష్టనప్డు । శత్రుదర్శన కాంక్ష యా చక్కనెల్ల॥ 14

తే. అంత, శ్రీమంతు, సుగ్రీవు నాత డరసె। హేమపింగళు, నట సుసంవీతు, ప్రథితు
మరి, యవష్టబ్ధు తమ్ము న త్తరిని నెదుట । అనలుడట్టుల దీప్యమానుని, సుఘోరు॥

తే. పర్యవస్థితు నా మహావీర్యు తమ్ము । రిపుని సుగ్రీవు జూచి వాలియును నప్డ
పరమ రోషణుడగుచు నపారబలుడు । బిగ్గ బిగియించె వస్త్రంబు వేగ కటిని॥

తే. గాఢసంవీతుడై వాలి కపివరుండు । పిడికిలిని నెత్తి, యుత్సాహ మినుమడింప
తమ్ము సుగ్రీవువైకి యుద్ధమ్మొనర్ప । వేగ పరుగెత్తె తానె యా వీర్యఘనుడు॥

తే. శ్లిష్టముష్టిని నెత్తి సలీలముగను । కెరలి సుగ్రీవుడును నంత కెక్కుడుగనె
పరచె సంరబ్ధతరుడౌచు భ్రాతపైకి । వాలి యా వీరు డా హేమమాలి పైకి॥ 18

తే. అంత వాలియు క్రోధతామ్రాక్షుడగుచు । మరి మహావేగగతి నట్టు లురికివచ్చు
ధూర్త సుగ్రీవు రణపండితుని సుఘోరు। గాంచి యిట్టుల బలికె నా కపివరుండు॥

తే. ఇదిగో, ముష్టి సుగాఢ మీక్షింపుమోరి । తద్దబట్టితి సన్నిహితాంగుళముగ
మూర్ఖ ! నాచేత వేగ విముక్తమగుచు । ఇదియు నీప్రాణముల గొను నిపుడె
చూడు॥ 20

తే. అన్న యిటుబల్క సుగ్రీవు డపుడు కనలి। వాలితోననె, "ఘోర, యీ పటు తరంబు
నాదు ముష్టియె పడుచిప్డు నీదుతలనె। ఖలుడ! నీప్రాణముల దీయు కాచుకొనుర॥

తే తాడితుండౌట వాలిచే తమ్ము డపుడు।వేగితుండౌచు నన్నపై కేగి పోర
శోణితోద్గారి గిరిభంగి చూడ నొప్పె। కీశపతిపీడితుండు సుగ్రీవు డచట। 23

తే. వైళ్ళతో గూడబలిమి సుగ్రీవు డపుడు। సాలమొకదాని పెకలించి వాలి నేసి
అమితముగ బాదె సర్వావయవములందు। వజ్రమునను మహాద్రిని బాదునట్లు॥

తే. సాలతాడనవిహ్వలుం డాలమందు। ప్రచలితుండయ్యె వాలి సువర్ణమాలి
అమితభారసమాక్రాంతమైన యట్టి। వర్తకులయోడ సాగరం బందు నటుల॥

తే. భీమబలసత్వవిక్రాంతు లే మనందు। పోరిరి సుపర్ణసమవేగు లౌర వారు
ఘోరవపులు ప్రవృద్ధు లా గురుతరాజి। చంద్రసూర్యులు విమలమా చదల నటుల॥ 25

తే. రంధ్రములనెట్లొ వెదుక పరస్పరంబు। వార లరయుచు పోర నవ్వాలిబలము
వీర్యమును హెచ్చె; మరి, మహావీర్యుడైన।సూర్యపుత్రుని సుగ్రీవు చొరవ తరిగె॥

తే. వాలిచే భగ్నదర్పుడై యాలమందు। మందవిక్రముడయ్యు నవ్వాలి మీది
కోపమున జేసి సుగ్రీవు డోపి మిగుల। లాఘవముజూపి పోరె నమోఘలీల॥ 28

తే. సశిఖ సవిటప తరుల వజ్రములబోలు। కఠినసఖముల పిడికిళ్ళ కాళ్ళ పళ్ళ
జానువులతోడ మరిమరి సంగరంబు। వృత్రవాసవులకునట్లు భీమమయ్యె॥ 29

తే. శోణితాక్తులు, వనచరుల్ వానరులును। ప్రబలి తర్జించుకొంచు పరస్పరంబు
జలదములబోలె పటుమహాశబ్దములను। పోరి రా యన్నదమ్ములు ఘోరముగను॥

తే. అంతకంతకు నెంతయు కాంతి తరిగి। దిక్కు లిక మాటిమాటికి తేరి చూచు
వానరేశ్వరు సుగ్రీవు హీనసత్త్వు। గాంచె రాఘవు డప్పు డా కదనభూమి॥ 31

తే. ఆర్తు నతని హరీశ్వరు నాజి గాంచి। ఆ మహాతేజు డప్పు డా రామవిభుడు
శరము వంకకు వీరుండు బరపెదృష్టి। వాలి వధియింప దలపూని యాలమందు॥

తే. అంత, ఆశీవిషోపమంబైన శరము। వింట సంధించి పూరించి మించి యపుడ
అంతకుడు కాలచక్రంబు నటుల విభుడు। నారి లాగెను చెలగి కర్ణాంతముగను॥

తే. అతని జ్యాతలఘోషంబు కతన నారఁ । భీతి పత్రిగధేశ్వరవితతి పారి
దొడువారెను మృగములు త్రస్తములయి । ఇక, యుగాంతాననట్లు మోహితము
లగుచు। 34

తే. వజ్రనిర్ఘోషమున, ప్రదీప్తాశని గతి । ఘన మహాబాణ మపుడు రాఘవుఁడు విడువ
వాలివక్షంబునం దది పటుతరముగ । చొచ్చుకొనిపోయె నా రణక్షోణిలోన॥

తే. అంత వాలి వీర్యోత్సిక్తుఁ డచలబలుఁడు । పటుమహాతేజుఁ డా కపీశ్వరుఁడు ఘనుఁడు
కాండ మర్దానిదైన వేగంబుకతన । పడె మహీస్థలి దబ్బున పిడుగు నాఁగ॥ 36

తే. ఆశ్వయుజపౌర్ణమిని యుత్సవాంతమందు । ధరణిగూల్పంగబడు నింద్రధ్వజము
భాతి
పడె విచేతనుఁడై వాలి పుడమిపైన । శ్రీశు బాణాన యుధి గతశ్రీకుఁడౌచు॥

తే. శరము కాలయుగాంతకసమము ఘనము । చిత్రకాంచనరూప్యభూషితము తతము
ప్రభుఁడు దీప్త మమిత్రమర్దనము విడిచె । హరుఁడు ముఖమున మరి సధూమాగ్ని
నట్లు॥ 38

తే. రక్తశోణితతోయధారలను దోఁగి । కుసుమితాశోక మది గాలిఁగూలు నట్లు
జగతి గూలెను నింద్రధ్వజంబు భాతి । ఇంద్రసుతుఁడు విచేతనుం డీల్గియుధిని॥

16 వ సర్గ సమాప్తి. (680)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునేడవ సర్గ. (52)

[illegible] వాలి రాముని ఆక్షేపించుట.

తే. వాలి రణకర్కశుం డట్టు లాలమందు । రామచంద్రునిశరహతిన్ భూమిపైన
పడె తటాలున వనమున పాదపంబు । వడి నికృత్తంబునై పడు వడువుగాఁ॥ 1

తే. తప్తకాంచనభూషణతతులతోడ । న్యస్తసర్వాంగుఁడై వాలి యాహవోర్వి
చట్టునఁ గూలె దేవరాజన్యు ధ్వజము । ముక్తరశ్మియై నాఁగ నపూర్వభంగి॥ 2

తే. వానరగణేశ్వరుండు దా వసుధనట్లు । పడినయంతన భూతలంబప్పుడుచూడ
కాంతిహీనంబయ్యె నత్యంతముగను । నష్టచంద్రంబు వ్యోమంబు నాఁగ
నొర॥ 3

తే. ధరణిబడియును నా మహాత్మకుని దైన । దేహ మరయంగ విడువదు తేజ మింత
విడువదు పరాక్రమంబును విపులకాంతి । విడువ దిక ప్రాణమును శ్రీని బింక
మింత॥ 4

తే. శక్రదత్తంబు మాల శ్రేష్ఠంబు శుభము । కాంచనీవజ్రభూషితం బంచితంబు
నిలిపియుంచెను హరిముఖ్యు నిజబలంబు । కాంతి తేజంబు ప్రాణంబు కందకుండ॥

తే. మాలయద్దానిచే హేమమయము చేత । వీరుఁ డా హరియూథపుం డొర వెలిఁగె
సాంధ్యరాగమ్ముతనచుట్టుచక్రగతిని । గ్రమ్మియున్నట్టి విపుల మేఘంబుభాతి॥ 6

తే. ధరణిబడియును నా మహాత్మకునిదైన । కాయమును, మాలయును, మర్మఘాతి
యైన
శరమును వెలింగె త్రివిధమౌసరణిగాఁగ । రచితమైనట్టి లక్ష్మినా రుచిరకాంతి।

తే. స్వర్గమార్గప్రభావనం బత్త్ర మద్ది । రామబాణాసనక్షిప్త మే మనందు
వాలి కా వీరవర్యున కాలమందు । పరమగతి నౌర గలిగించె భవ్యలీల॥ 8

ద్వి. వహ్ని గతార్చిషంబన యుద్ధభూమి । పడియుండి, "ఇటులౌర పటుసాయకంబు
నేసిన యతడేడి, నే జూతు"నంచు । బహుమానదృష్టితో పరికింప కనుల
తెరచి మెల్లన దిశల్ పరికించు వాని । పుణ్యాంతమున స్వర్గభూమికి దప్పి
పృథ్విగూలిన యయాతియొ యను వాని।లీల యుగాంతాన కాలుంషు ద్రోయ
భువి పతితుండైన రవి యను వాని । ఆ మహేంద్రునిబోలె నమితదుర్ధర్షు
ఆ మహేంద్రునిబోలె నిమితదుర్దాంతు । ఆ మహేంద్రునిపుత్రు నావహాపతితు
వాలిని నా హేమమాలిని ఘనుని । పంచాననోరస్క– పటుమహాబాహు
హరివిలోచనుని దీప్తాస్యు నప్వీగు । లక్ష్మణానుగతుండు రామచంద్రుండు
చూచి సమీపించె చేరవ నచ్చటికి॥ 12

తే. అంత నాతని రాము నత్యంతబలుని । లక్ష్మణుని గాంచి వాలి పల్కంగ దొడగె
ప్రశ్రితము, ధర్మయుక్తము, పరుషముగను । వాక్య మీరీతి రఘుకులవరున కతడు॥

తే. నీవు మనుజాధిపసుతుండ విద్ధమతివి । ప్రథితుడవు నౌర సత్యసంపన్నుడవును
భృశము ప్రియదర్శనుడవు కులీనుడవును । తద్ద తేజస్వివిని, చరితవ్రతుడవు॥ 14

తే. ఇటు పరాఙ్ముఖవధము నీ విటనొనర్చి । ఏమి యతిశయమును బొంద నెంచి
నావు ?
యుద్ధసంరబ్ధు న న్నిట్టు లురమునందు । కొట్టినాడవె శరమును ఘోరమేసి ?॥

తే. రాఘవుండు ప్రజాహితరతుడటంచు । కరుణావేది, దృఢవ్రతపరుడటంచు
మరి, జితోత్సాహుడును సమయజ్ఞుడంచు । నిఖిలభూతాలు కీర్తించు నీ యశంబు॥

ఆ. దమము, శమము,ధృతియు,ధర్మంబు, దయయును। క్షమ,పరాక్రమంబు,సత్యనిరతి
దండ్యులందు నుచితదండప్రయోగంబు । పరమగుణములందు పార్థివులకు॥

ఆ. ఆ గుణంబులుండు నధిప! నీయం దని । తలచి నీదు గొప్పకులము దలచి
తార వల్దటన్న తరలి సుగ్రీవుతో । రణమొనర్పవచ్చి రాలి తిటుల॥ 18

ఆ. అన్యతోడపోరు చావహంబున ప్రమ । త్తతను నున్న నన్ను తాక డీత
డన్న బుద్ధియొకటి నిన్ను జూడకపూర్వ। ముండె నాకు రామ! దండిగాను॥

తే. కుటిలు, ధర్మధ్వజు,నధార్మికుని, నృశంసు।వినిహతాత్ముని,హా!తృణావృతమునైన
కూపమనువాని రామ! సుఘోరు నిన్ను । ఎరుగలేనైతి నిజముగా నింత కౌర॥

తే. సజ్జనులపోల్కి బౌర ! వేషంబు దాల్చు । పాపు ప్రచ్ఛన్నపావకుభంగివాని
ధర్మకైతవసంవృతు ధర్మరహితు । ఎరుగ లేనైతి నిన్ను, హా ! యిటుల చెడితి.

తే. దేశ నగర వివాదముల్ లేశ మేని । లేవె లేవుగ మనకు; నే వానిలోన
అపకృతియొనర్చుటయు లేదుగాదె నీకు । మరియు నవమానమును సల్పి యెరుగ గాదె॥ 23

తే. అట్టివాని, నకిల్బిషు, నన్యుతోడ । రణమొనర్చుచు నీపై కిరాని వాని
కందమూలఫలాశను, కపిని, వనిని । సతమువసియించు వానిని చంపి తేల ?॥

తే. ధర్మవేషము, కపటయుక్తంబు రామ । తోచు నీయందు స్పష్టంబు దాచనేల ?
క్షత్రియకులానబుట్టి విద్యలను గరచి । పాపమొనరించు నెవడు ధర్మంబు పేర?॥

తే. క్షితిని రాజకులాన బుట్టితివి రామ ! పేరుగొంటివి పరమ ధర్మిష్టుడ వని
భవ్యరూపాన నేల యభవ్యుడ విటు । ధర జరించెద వీవు హో ధర్మహీన !॥ 26

తే. క్షమము, సామంబు, దానంబు, సత్యనిరతి । ధృతి, పరాక్రమములు, ధర్మ మతియు నాగ
పార్థివులకు గుణంబులౌ వసుధ మరియు । దండ మపరాధులందును తగును పతికి॥

తే. మేము వనచరులము రామ ! మృగములమును । సతము ఫలమూలములె తిని బ్రతుకుదాము
ఇదియె మాదగు ప్రకృతి, యింకేమనందు।నీవొ నరుడవు, మరియు నరేశ్వరుడవు॥

తే. భూమియు, హిరణ్యమును, రూప్యమును ననంగ ! కారణంబులు, రాఘవా ! కలహమునకు
నాదుఫలముల మరియును నాదువనుల । లాభమేమయ్యెనీకు? నన్ రాల్చితిటుల॥

తే. నయమును ననుగ్రహంబు ననంగ మరియు। వినయ నిగ్రహములు నాగ ద్విధవిములుగ
రాజవృత్తి యసంకీర్ణమా జగాన; । కామవృత్తులు కారుగా భూమిపతులు॥ 30

తే. నీవొ కామప్రధానుండవో విభుండ । కనగ ననవస్థితుడవు, కోపనుడ వీవు
వినుము సంకీర్ణుడవు రాజవృత్తియందు । చండబాణాసనపరాయణుండ వెపుడు॥

తే. లేదు ధర్మంబుపై శ్రద్ధ నృపుడ ! నీకు । అర్థమున బుద్ధియు నవస్థితంబుగాదు
ఇంద్రియవశుండవై మనుజేశ్వరుండ ! । కామవృత్తిజరించెదు రామ ! నీవు॥

తే. కూల్చి బాణాన నన్ను కాకుత్స్థ! నీవు । అనపరాధిని రామ! యి ట్లావహోర్వి
ఏమి వచియింతు పెద్దలయెదుట నింక । చేసి కార్యంబు కడు జుగుప్సితము నిట్లు॥
తే. రాజహుండు, గోఘ్నుడును, బ్రహ్మహనను డింక । చోరుడును, ప్రాణివధరతుం డౌర రామ!
నాస్తికుండును, పరివేత్త నరకమునకు । పోయె రెల్లరు తప్పక బొందిబాసి॥ 34
తే. సూచకుండు, కదర్యుండు జూదరుండు। రామ! గురుతల్పగుండు, మిత్రఘ్నుడనగ
చనుదు రెల్లరు వీర లసంశయంబు । రూఢి పాపాత్ము లరిగెడి లోకమునకు॥
తే. మరి, యధార్థ్యంబు నాదు చర్మంబు, రామ। ధాత్రి మిమువంటి ధర్మచారిత్రకులకు
అస్థులును రోమములు నట్లె వర్జితములు। మాంస మింక యభక్ష్యంబు మానవులకు॥
తే. పంచ పంచనఖంబులు మాత్రమేను। భక్ష్యములు రామ! క్షత్రియ బ్రాహ్మణులకు
ఉడుము, కుందేలు, తాబేలు, నడవిపంది । ఏదుపందియు నాగ, నీ వైదె, ధాత్రి॥
తే. చర్మ మస్థులు నాయవి సత్పురుషులు । రామ! స్పృశియింప రెవ్వరు భూమిపైన
తినరుపో మాంసమైన; యీ తీరునొప్పు । పంచనఖు నన్ను వృథగ వధించినావె॥
తే. తార సర్వజ్ఞ హితము సత్యముని నాకు । చెప్పియుండెను నక్కటా యప్పుడేను
దాని నతిక్రమించి మోహాన నేను । కాలునివశంబునన్ జిక్కి కూలి తిట్లు॥ 39
తే. నీవు నాధుడవైయుండ నిజము, రామ! ఇక సనాధయ కాజాల దీ ధరిత్రి
శీలసంపన్న ప్రమద దుశ్శీలుడైన । ధూర్తపతిచేత నట్టుల దోర్బలుండ!॥ 40
తే. శఠుడ! నైకృతికుండ, నీచాత్మకుండ। మానరహిత! మిథ్యాశాంత మానసుండ
పాపుడా! యెట్లుపుట్టితి వా మహాత్ము । దశరథేశుని గర్భాన యశము జెరుప॥
తే. ఛిన్నచారిత్రకక్ష్యంబు, భిన్నజనము । సాధుధర్మాతివర్తి, రోషానువర్తి
త్యక్తధర్మాంకుశంబు నన్ హాతమొనర్చె। ఏమరియు నేను నుండ హా రామహస్తి॥
తే. అశుభము, నయుక్తమును, సాధు లైనవార । లెపుడు గర్హించు పనిని యీదృశ మొనర్చి
ఏమిజెప్పెదు సజ్జను లెప్పుడైన । నిన్ను రాఘవ! చేరి ప్రశ్నింప నపుడు॥ 43
తే. ఇటు లుదాసీనులైన మాయెడల, రామ । వెలిగె గొప్పగ నీదగు విక్రమంబు
నిజము నీ కపకారియౌ కుజను నెడల । కానకుంటిని నీదు విక్రమము సుంత॥
తే. రాచబిడ్డడ! నాదు నేత్రముల యెదుట । నీవు నిలబడి యుద్ధమే నెరపియున్న
ఇప్పటికి నీవు నాచేత నీల్గి రామ । యముని యింటను నుండవే యతిథి గాగ॥

తే. రణమున దురాసదుని నన్ను రామ! నీవు । చాటునందుండికూల్పంగ జాలినావు
నరుడు పానవశంగతు డెరుక మాలి । ఇంట నిద్రింప పాము కాటేసి నట్లు॥ 46

తే. నన్నె నీసీతకై రామ! మున్నె నీవు । సాయమడిగిన యొక దివసంబులోనె
యాపెగనుగొని యుండనే యధిప, మరియు । నెలత ఈపాటి కుండదే నీదునింట॥

తే. ఎవనిసాధింప సుగ్రీవు కీవు రామ! । ఇంతటి ప్రియంబుసేయంగ నెంచినావొ
అట్టి రావణు రణమున హతమొనర్చి । మెడకుతాడ్వోసి యీడ్చి నీకడకు తేన॥

తే. వనధితోయంబులందు దాచిననునైన । వినుము, పాతాళమందు దోచిననుగాని
తెచ్చియుండనె సీతను, తెలియవైతి । వకట; శ్వేతాశ్వతరిని వ ట్లప్పు డేను॥

తే. యుక్తమేయగు నేనిల్లుయుధినిదివికి । చనగ నాతమ్ము డొంద రాజ్యంబు దీని
ఇక, యయుక్తంబుగాదె నే నీల్గుటిటుల । రామ! నీచేత యుధి నధర్మంబుగాగ॥

తే. ఈవిధంబుననే లోక మెల్లనడచు । మరణము ధ్రువంబుగావ నా కొరకువగవ
నీవొనర్చిన కార్యంబునీకురామ । యుచితమేని సమాధాన మచిర మిడుమ॥ 51

తే ఇటుల పరిశుష్కవక్త్రుడై యిషునిహతిని । వ్యధితుడై యిందిసుతుడు మహాత్ము డపుడు
రాము రవిసన్నిభాశు నేత్రములగనుచు । ఊరకుండెను వాలి తా నూర్పులెగయ॥

17 వ సర్గ సమాప్తి. (732)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పదునెనిమిదవ సర్గ. (౧౮)

వాలి ఆక్షేపములకు రాముని సమాధానములు – వాలి సంతృప్తి – వాలి క్షమాపణ

తే. ప్రశ్రితంబు బిల్లు వాక్యంబు పరుషభంగి। హితము ధర్మార్థసహితంబు నిందప్రసుతుడు
వినిహతుండు విచేతనుం డౌనట బలికె। రామచంద్రునితోడ నా రణధరిత్రి॥

తే. నిష్ప్రభుండైన సూర్యుడన్ విధము వాని।ముక్తతోయంబు జలదంబు బోలువాని
ఉక్తవాక్యు హరిశ్రేష్ఠు నుర్విభుడు। గాంచి యుపశాంత మనలంబు కరణివాని॥

తే. అటు లధిక్షిప్తుడై రాము డప్పుడచట। పలికె ధర్మార్థగుణసుసంపన్నమైన
వాక్యము ననుత్తమంబు న వ్వాలితోడ। ఆ హరీశ్వరుతోడ, మహాత్ముతోడ॥

తే. ధర్మ మర్థము కామంబు ధరణి గల్గు। లౌకికాచార మెరుగంగలేక నీవు
బాల్యమున నెట్లు నన్ను ని బ్భంగిగాగ। ఉరక గర్హింప జూచెద వోయి, వాలి॥

తే. వృద్ధులను, బుద్ధిసంపద నెసగువారి। అడిగి యాచార్యసమ్మతులైన వారి
తెలిసికొన కీవు నన్ను నిందింతువేల। ఓయి! వానరచాపల్య మూని యిచట॥

తే. వసుధ యియ్యది సర్వ మిక్ష్వాకువంశ। జాతులదియ సకాననశైలవనము,
మరియు, మృగపక్షిగణముల మనుజతతుల। నిగ్రహానుగ్రహాదు లా నృపతు లవియు॥ 6

తే. దాని పాలించుచున్నాడు ధర్మబుద్ధి।నాదు తమ్ముండు భరతుండు నయగుణుండు
ధర్మకామార్థనిఖిలతత్త్వజ్ఞు డతడు। నిగ్రహానుగ్రహరతుండు ఋజుపథుండు॥ 7

తే. వినయము నయంబు సత్యంబు ననెడునవియు । మరి యథాదృష్టవిక్రమం బను గుణంబు
గలుగు భరతుండు విను దేశకాలవిదుఁడు। ఉర్వరకు, రాజు సు మ్మెప్డు డోయి, వాలి॥

తే. అతని ధర్మకృతాదేశ మర్థి దాల్చి । భ్రాతలము మేము, నన్యులౌ పార్థివులును
వసుధకృత్స్నంబు చరియింతు మసమలీల, । ధర్మసంవృద్ధిపొంటె సంతతము, వినుము॥ 9

తే. నృపతిశార్దూలుఁ డాతండు విపులబలుఁడు। భరతుఁ డా ధర్మవత్సలుం డురుగుణుండు
పాలనమొనర్పుచుండ నీ వసుధనెల్ల । ధర్మమునుదప్పి యెవ్వఁ డీ ధరణి దిరుగు ?॥

తే. పరమము స్వధర్మమందున బరగు చల్లు । స్థిరతనిల్చిన మేమెల్ల భరతు నాజ్ఞ
ప్రథితముగ దాల్చి ధర్మవిభ్రష్టులైన । జనములను నిగ్రహింతుము శాస్త్రవిధిని॥

తే. నీవు సంక్లిష్ట ధర్ముండ వో వనాట ! । మరి, విగర్హితకర్ముండ వరసి చూడ
కామతంత్రప్రధానుండ వే మనందు । రాజవర్త్మంబు నం దుండ వీ జగాన॥

తే. అన్నయును, విద్యనిచ్చినయతఁడు, మరియు । కన్నతండ్రియు, ముగ్గు రీ క్ష్మాతలమున
తండ్రు లంచు దలంతురు ధర్మపథిని । సతమువర్తించు వారలు సాధుమతులు।

తే. తమ్ముఁడును, నాత్మపుత్రుండు, తత గుణుండు । శిష్యుఁడు ననంగ మువ్వు కీ క్షితితలాన
పుత్రులనుభంగి భావింప బోలుసుమ్ము । ధర్మమే ముఖ్యముగ మనదలతు మేమి॥

తే. పరమదుర్జ్ఞేయమును, సూక్ష్మ మరసి చూడ । సాధులకునేనిధర్మంబు క్ష్మాజచర్యుడ !
సర్వభూతహృదిస్థమై పర్వునట్టి । ఆత్మయొక్కటె యెఱుగు శుభాశు భాళి॥ 15

తే. చపలుడవునీవు, నీవలె చపలులైన । కపుల నకృతాత్ములను గూడి కాంతువేమి?
అవని జాత్యంధు డొర జాత్యంధు గూడి । యెంతయోచించినన్ గాని యేమి కాంచు? 16

తే. ఇంత కిట మున్నె నే వచియించి యున్న । పలుకులకు వ్యక్త మర్థంబు దెలుపు దిపుడె
వినుము; కేవలరోషాన ననఘు నన్ను । ఊరక గర్హింప తదగు పోవోయి నీవు॥

తే. ఎందులకుగాను నిన్ను నే నిట్టులిచట । చంపితినో దాని హేతువు చక్క వినుము
అనుజు సుగ్రీవుభార్యయందున జరింతు । విట సనాతనధర్మంబు విడిచి నీవు॥

తే. తమ్మునకు మహాత్మున కిల జీవితమ్ము దాల్చి। ఇతడు సుగ్రీవు డుండ నీ వితనిసతిని
స్నుషను "రుమ" నౌర కూడుచునుంటివోయి । కామమున జేసి యో పాప
కర్ముడుండ॥ 19

తే. ధర్మము నతిక్రమించి యి ధ్ధరణి నిట్లు । కామవృత్తంబున జరింపగాంచి నిన్ను
భ్రాతృభార్యావమర్శను బట్టి యిట్లు। దండనమొసర్చితిమి వానరుండ! యెరుగు॥

తే. లోకవృత్తంబు నిట్లు కల్లోలఁబరచి । కరము ధర్మవిరుద్ధంబుగా జరించు
వాని నిక నిగ్రహింపంగ వాస్తవముగ । దండమునకంటె వేరొండుదారి లేదు॥

తే. పుడమి సత్క్షత్రియకులోద్భవుండ నేను । ఎటుల నీపాప మింక సహింతు నోయి
కానవే, దండనం బిట్లు వానరుండ! । నీయెడ ప్రయోగమున్ జేసి నెగడి నాడ॥

తే. కన్నకూతును, భగినిని, కామవశత । తమ్మభార్యను బొందు పాతకుని కౌర!
వధయె దండనమంచును స్పష్టముగను । స్మృతులు చెప్పెడు సు మ్మోయి
కీశవిభుడు॥ 22

తే. భరతుడు వసుంధరకు నిప్డు పాలకుండు । మేము నాతని యాజ్ఞలో మెలగుజనము
నీవొ ధర్మంబుమీరిన నేరబోతు । వింక నెట్లగు మా కుపేక్షింప నిన్ను॥ 23

తే. గురుడు, భరతుండు, ప్రాజ్ఞుండు ధరణి నెల్ల । ధర్మగతి నేలుచుండి, సద్ధర్మ మిట్లు
మీరువారిని కామప్రవృత్తులైన । జనుల దండింప దీక్ష దా ఘనతబూనె॥ 24

తే. మేము నా భరతాదేశ విధిని జేసి । విను హరీశ్వర! నీవంటిజనుల నెల్ల
భిన్నమర్యాదులను నెల్ల విధిగఁబట్టి । శిక్ష జేయుటె పనిగ చరింతు మిలను॥ 25

తే. కనగ, సుగ్రీవుతోడి సఖ్యంబునాకు । లక్ష్మణునితోడి సఖ్యమట్లని యెరుంగు
దారరాజ్యనిమిత్త మిద్దరికిఁగలిసె। అతడు నిశ్శ్రేయసకరుండు నౌను నాకు॥ 26

తే. వానరులసన్నిధిని నప్డు డేను వినుము । బాస జేసితి జంపుదు వాలి ననుచు
అటుల మాటను నిచ్చి నా యట్టివాడు । తప్పనెట్లగు దానిని తలపుమింత॥

తే. కాన, యీ కారణంబులకపివరుండ । ధర్మసంహితముల మహత్తరముల నిక
నీవె సర్వంబు మది విమర్శించుకొనిన। నిను వధించుట యుక్తమం చీవె యనెదు॥

తే. అమలధర్మంబె చూచు వయస్యునకును। ఇదియె కర్తవ్యమగును స్నేహితునియెడల
కాన, నీవును యింక ముఖ్యంబు మనకు । ధర్మమేయంచు తెస్సగా దలచి తేని
నీ యెడ లసర్వథా యిట్టి నిగ్రహంబు । ధర్మమేయని నీవును తప్ప కనెదు॥ 30

తే. శ్లోకములరెండు మునుపు సుశ్లోకు డతకు।పలికె చారిత్ర్య వత్సలంబులను మనువు
ధర్మకుశలులు వానిని తల ధరింత్రు । ఆ విధమె యాచరించితి నయ్య నేను॥
తే. మానవులు పాపమొనరించి మహిపుచేత।దండనము నొందుదురయేని తప్పకుండ
వారు స్వర్గంబుగందు్రి నిర్మలులు నౌచు । చూడ సజ్జనులైనట్టి సుకృతు ల్లు॥
తే. శిక్ష జేసిన విడిచిన క్షితివిభుండు । స్తేయదోషంబు దొంగకు బాయుసుమ్మ
కాని, దొంగనువిడుచు తత్ క్ష్మాపతికిక । కిల్బిషం బద్ది యంటు బో కీశవిభుడ!॥
తే. ఇపుడునీవొనరించినయిట్టివిధమె। ఉగ్రపాపంబు శ్రమణకుం డొకడుసేయ
మున్ను మాంధాత మావంశ ముఖ్యు డతడు । ఘోరశిక్షవిధించె నా యార్య
వరుడు॥ 34
తే. అన్యులును పాప మొనరించి రవని నల్లె । హా! ప్రమత్తులునై వసుధాధిపులును;
బుద్ధి దెలిసి ప్రాయశ్చిత్తమును బొనర్ప । దాన శాంతించుచుండె త ద్రజము,
నిజము॥ 35
తే. కాన, పరితాపమొందుట మానుమయ్య। వధము వానరశార్దూల! విధియె నీకు
కనుము, ధర్మాన నది పరికల్పితంబు । స్వవశ సంస్థితులముగాము సఖుడ! మేము॥
తే. వినుము, మరియొక్క టింక కారణముగలదు । చెప్పెదను నీకు హరివరా!
యిప్పుడేను
హేతుయుక్తము నద్దాని నింకవినిన । కోపమువహింపవీవు నన్ గురిచి ధ్రువము॥
తే. నన్ను నిందించి తీ వని నాదు మదిని । లేదు సుమ్ము మనస్తాప మేదికాని
లేదు నీపైన కోపంబు లేశమేని । నిజము, హరియూధపా! వాలి! భుజబలుండ॥
తే. వలలనొడ్డియు, వైచియు పాశములను।కూటమార్గాల వివిధాల గూల్చు చుంద్రు
ఎదుట నిలిచియు చాటున నొదిగియు నిక । పెక్కు మృగములబట్టి యీ పృథివి
నరులు॥ 38
తే. పరచువానిని, బెదరెడువానిగాని । వనుల విస్రబ్ధముగనిల్చువాని గాని
మరి, ప్రమత్తంబులను, నప్రమత్తములను । విముఖములను వధింత్రు మాంసముసుగోరు । నరులు; లే దందు దోషంబు హరివరుండ! ॥ 39
తే. ధర్మకోవిదులైనట్టి ధరణిపతులు । వినుము రాజర్షులును మహావిపినములకు
వేటకై పోవుచుండును రోటలేక । దోష మద్దాన లేదోయి కీశవిభుడ॥ 40
తే. కాన, నిహతుండ వైతీవు కదనమందు। వానరా! నాదు బాణాన పటుతరమున
నీవు నాతోడ యుద్ధంబు నెరపుచున్న । నెరపకున్నను నేమి ని న్నేయవచ్చు॥

తే. దుర్లభంబైన ధర్మ మస్తోకమునకు । సతము శుభతరమైన జీవితమునకును
రాజులే దాతలోయి యో ప్లవగవరుడ।సందియం బిందు లేదోయి సాహసాంక॥

తే. కాన, రాజుల నప్రియం బాడరాదు । ఎసగి హింసింపరాదు, నిందింపరాదు
దేవతలె మానుషాకృతి దిరుగుచుండ్రు । రాజులై యీ మహీస్థలి ప్రజలబ్రోవ॥

తే. నీవొ ధర్మమెరుంగక కేవలంబు । రోషమే పూని యున్నావు కీశవరుడ
తక్క దూషించుచున్నావు ధర్మమందు । పితృపితామహసరణిని వెలయునన్ను॥

తే. రాము డిట్లన వాలి ధర్మస్వరూప । మెరిగి లెస్సగ రాఘవునెడల దోష
మేమి లేదని మది నిశ్చయించు కొనియె । మరియు వ్యథితుండు నయ్యె దా
కరము హృదిని॥ 45

తే. ప్రాంజలియునౌచు నంత నా ప్లవగవిభుడు । వాలి రాముని గాంచి తాఁబలికె
నిటుల॥ 46

తే. దేవ! నీవన్నదెల్ల యట్లే విభుండ!।నిశ్చయముసుమ్ము; లేదు సందియము, రామ
మరి, ప్రకృష్టులు మీ కేను మారుబల్క-।అధిప! అపకృష్టుడను శక్తు డౌదునెట్లు?

తే. మున్నయుక్తంబు, నప్రియంబును మహాత్మ । పలికితి ప్రమాదమున నేమి
దెలియకేను
అయిన, దానిని దోషమం చనఘ నీవు । ఎంచవల దింక నాయెడ నంచితాత్మ॥

తే. అనఘ! దృష్టార్థతత్త్వజ్ఞు డౌదు వీవు । రామ! నీవు ప్రజాహితరతుడవౌదు
కార్యకారణసిద్ధి నీ దైనబుద్ధి । అవ్యయంబు, ప్రసన్నంబు నగును సతము॥

తే. జగతి నపగతధర్ముండ నగుదు నేను।మరి వ్యతిక్రాంత పుణ్యుండ మానవేంద్ర!
ధర్మసంహితవాక్యాలతాత! నన్ను । ఇంక క్షమియించి తంచని యేలుకొమ్ము॥

తే. నన్ను గూరిచి శోకింప నవఘ! యెపుడు।తారకై కుంద; కుంద బాంధవులగురిచి
నాదు నంగదుని కనకాంగదుని గురిచి । పొగులువాడ గుణశ్రేష్ఠు పుత్రు గురిచి॥

తే. బాల్యముననుండి నాచేతలాలితుండు । నన్ను జూడమి దీనుడై నవసి రామ!
అల్ల పీతాంబువైన తటాకమట్లు । కరము శోషించు నయ్యె నా కన్నసుతుడు॥

తే. బాలకుం డేకపుత్రుండు వరద! నాకు। అకృత బుద్ధియు తారేయు డాత డనఘ!
ప్రియుడు నాకు, మహాబలుం డిద్ధగుణుడు । రక్షణీయుండు నీకింక రామచంద్ర॥

తే. అంగదునియందు సుగ్రీవునందువలెనె। సమత నుత్తమ మతి నింక జరుపుమయ్య
నీవె శాస్తవు గోప్తవు నిశ్చయంబు । కార్యము నకార్య మెరిగెడి ఘనుడ వీవు॥

తే. నరపతీ! నీకు తమ్ముఁడౌ భరతుపైన । లక్ష్మణునిపైన యెట్టి సద్వృత్తి కలదో
అదియె సుగ్రీవుపైన నంగదునిపైన । ఉంచవలెనయ్య రామ! నీవో మహాత్మ॥
తే. తార మద్దోషకృతదోష సౌర రామ । తత్తపస్విని నింక నా తమ్ముఁడకట
ఉరక యవమాన మొనరింపకుండు రీతి। చేయవలె నీవు మిత్రమా! చెప్పి హితము॥
తే. ధ్రువము నీచేత ననుగృహీతుండు రామ । శక్తుఁడౌ సుమ్ము ధరణి రాజ్యంబు చేల॥

* * * *

త్వద్వశంబున వర్తించు వాఁడు దేవ! । మఱియు, భవదీయచిత్తానువర్తి సతము
దివము నార్జింపగలఁడు సందియము వలదు । వసుధ శాసింపగలఁడు, ఓ యసమలీల॥
తే. నిజము నీచేత వధము కాంక్షించి రామ । తార వారించుచున్నను తలఁగ ద్రోసి
త్వరగ సుగ్రీవుతోడ నా తమ్ముతోడ । ద్వంద్వయుద్ధమొనర్ప నే వచ్చితయ్య॥
తే. ఇటుల నా రామచంద్రుతో నెలమి బలికి। ఆ హరీశ్వరుఁడా వాలియాహవోర్వి
సన్నతుండు మహాత్ముండు శ్వాసమొసగ । ఊరకుండెను కీశకులోద్భవుండు॥ 59
తే వ్యక్తవర్ణుఁడై యటవాలియున్న । వాలి నాశ్వాసమొనరించె ప్రభువరుండు
నామసంపన్నవచనాల రామవిభుఁడు । ధర్మతత్త్వార్థయుక్తవాక్తతులతోడ॥ 60
తే. మమ్ముఁగూర్చియు నినుఁగూర్చి మనసునందు। చింతబడబోకు హరివరా! సుంతయేని
మేము నీయెడ నెరపిన విధమదెల్ల । ధర్మమే యంట యిక నిశ్చితమ్ము సుమ్ము॥
తే. దండ్యుపై దండనం బిడు ధరణిపతియు। దండనన్ బొందు దండ్యుండు ధన్యులంద్రు
కార్యకారణసిద్ధార్థులయ్యు వారు । చెడరు ఓ యిర్వురును నెట్టి యిడుమలందు॥
తే. ధర్మదృష్టిని, ధర్మవర్త్మమున నీవు । నాదు దండప్రయోగంబు నందియుంట
విగతకల్మషుఁడవు సౌచుస్వీయమైన । ప్రకృతిబొందితి వయ్య ధర్మ్యంబు సఖుడ॥
తే. విడువు శోకంబు, మోహంబు, హృది భయంబు । అనఘ! హర్యగ్ర్య! విధి
విధానంబు సుంత
శక్యమే నీకు దాటంగ సఖుడ, చెపుమ? । ఏల పడియెద వీవిటులు ఎడద బాధ॥
తే. ఎటుల నీయెడ అంగదుండెప్పుడు మెలగు। అటులె వర్తించునోయి యింకిటనుచుండి
అతడు నాయందు సుగ్రీవునందు గూడ । సంశయబొందకీవు కీశాధినాథ॥ 65
తే. ఆ మహాత్ముని ధర్మపథానువర్తి । రామచంద్రు రణావమర్దనుని మాట
మధుర మది విని యూరట మదినినొంది। యుక్తమిటు బల్కె నా వానరోత్తముండు॥
తే. చండబాణాభితప్తుండనై ప్రభుండ । తెలియక విచేతనుండ నిన్ తిట్టితిటుల
దీనిని మహేంద్రసదృశసందీప్తతేజ। నీవు క్షమియించి నన్ బ్రోవు నృపతనూజ॥

18 వ సర్గ సమాప్తి. (799)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### పందొమ్మిదవ సర్గ. (28)

**రణభూమి బడియున్న వాలికడకు తార వచ్చుట.**

తే. క్షితి శయానుండు బాణవిక్షతు డతండు । ప్లవగకులపతి వాలి యా రాము డనిన
హేతుమద్వాక్యములకు నింకేమి యనక । నన్ను క్షమియింపుమని యని మిన్న
కుండె॥ 1

తే. అశ్మతతిఁ బ్రవిభిన్నాంగుడగుట జేసి । పాదపాహతులన్ జాల బడలి యుంట
రాఘవోన్ముక్తవరశరాక్రాంతుడగుట । జీవితాంతాన మూర్ఛ దా జెందె వాలి॥

తే. రణమునందున బాణమోక్షణము చేత । రామదత్తంబు చేత నా భీమబలుడు
ప్లవగశార్దూలు డా వాలి పడినవార్త । తార యాభార్య వినియె యంతఃపురాన॥

తే. అప్రియంబు సుదారుణంబైన యట్టి । పతివధంబును విని యాపె సుతుని తోడ
వెడలివచ్చెను కడు భీతి వివిధగతుల । వెలయు గిరిగహ్వరమునుండి వేగమప్పుడ॥

తే. అంగదానుచరుల్ వానరాళులెల్ల । భీమవిక్రమునెల్ల రా రామచంద్రు
ప్రభు ధనుర్ధరు జూచి సంత్రస్తులగుచు । దౌడుదీసిరి పిక్కసత్త్వంబు జూపి॥ 5

తే. యూథపతిచంపబడుట మహోగ్రవనిని । యూథముననుండి చెదరి మహోగ్రభీతి
పరచు మృగములభంగి నత్తరిని బారు । కపుల వీక్షించె తార యా కాననోర్వి॥

తే. బాణములు వెంటబడుచున్న వయ్యె నాగ । రామవిత్రాసితులు నౌచు ప్రవాలిపరచు
వానరుల దుఃఖితుల గాంచివారికెల్ల । సతి సుదుఃఖిత తార యీసరణిఁబలికె॥ 7

తే. రాజసింహుని కా వాలి కీ జగాన । అనుచరులుగారె మీరు; లీ యదనునందు
ఏల పర్వెత్తుదురు భీతి నాలమందు । విడిచియాతని; దుర్గతిబడుచు నిట్లు॥ 8

తే. రాజ్యహేతువుచే తనభ్రాత నిట్లు । రౌద్రు రామునిచేత దూరాభిపాత
రౌద్రమార్గణతతిచేత భ్రాత యతడు । చెలగి చంపింప మీకేల చెదరి పరవ ?॥

తే. ఇటుల కపిపత్ని మాట వచింప నపుడు।కపులు తత్కామరూపులు ఘనత వినుచు
ప్రాప్తకాల మవిక్లిష్టమైన యట్టి । వచన మయ్యంగనకు వారు పలికి రిటుల। 10

తే. పుణ్యమాయెను పొమ్ము నీ పుత్రు నింక । జీవపుత్రరో ! తల్లి ! రక్షించుకొమ్ము
అంతకుడు రామరూపాన నరుగు దెంచి।వాలి గొంపోవ వధియించి యాలమందు॥

తే. వాలివైచిన వృక్షాల వరుస నరికి । విపులశిలలను నట్టులే పృథివి గూల్చి
వజ్రసమమైన బాణాలవైచి యార । వాలి వధియించె రాఘవుం డాలమందు॥

తే. మా ప్రభుం డౌర శక్రసమ ప్రభుండు । ప్లవగశార్దూలుడా వాలి వసుధగూల
మున్ను వెడలిన బలమెల్ల చెన్ను దరిగి।మరలి కిష్కింధ దిక్కుగా పరచు నమ్మ॥

తే. వడిగ రక్షింపుమీ పురద్వార మిపుడె । అమ్మ! పట్టంబుగట్టుమీ యంగదునకు
వాలిపుత్రు పదస్థు మే మందరమును । కొలిచియుండంగగలవార మెలమి కలిమి॥

తే. పూని యిటు నీవు చేయవైతేని వినుము।అనుచితం బింక యిచట నీ యునికి తల్లి
దుర్గముల నన్యముల నిట తూర్ణమిపుడె । చొత్తురు రుచిరాననా! రిపుల్ చొరవ కపులు॥ 15

తే. విను మభార్యులును, సభార్యులును, సుకేశి ! । కలరు మర్కటు లెందరో క్రాగి యచట
విప్రయుక్తులు లుబ్ధులా వెడగు జనుల।పనుల మనకగు తుములంబు భయము తల్లి

తే. ఔర, అల్పాంతరగతులు వార లట్లు । పలుకగా విని యంగన వాలి పత్ని
చారుహాసిని, తార యాత్మానురూప।సరణి నిటుబల్కె వారి కా హసుల కపుడు॥

తే. పుత్రుతోనేమిపనినాకు ధాత్రిపైన । తనువుతోనేమిరాజ్యమిద్దాన నేమి
భర్త కపిసింహుడా మహాభాగుడేను । పోవుచుండంగ నయ్యో యీ పదమిబాసి॥

తే ఖరము రామప్రయుక్తంబు శరము చేత।అకట వినిపాతితుండైన యా మహాత్ము
పాదమూలంబె చేర నే త్వరగబోదు । ఏల నాకింక యితర మీ యిలను చెపుడ॥

ఆ॥ ఇట్టులనుచు తార యెంతో రోదించుచు । ఉరము శిరము హస్తయుగ్మమునను
మోదుకొంచు దుఃఖమున శోకకర్శిత । పరుగు వారె భర్త పడిన యెడకు॥ 20

ద్వి. అటుబోయి యాతార యట గాంచె పతిని । భువి వినిపాతితు పురుషపుంగవుని
సమరానివర్తుల సకల రాక్షసుల । హతమొనర్చినయట్టి నుత పరాక్రముని॥

వజ్రాయుధంబున వాసవుం డట్లు । పర్వతేంద్రంబుల వడివైచువాని
మహి మహావాతసమావిష్టునిష్టు । పృథుమహామేఘౌఘునిస్స్వాను సుతను॥
శక్రతుల్యపరాక్రమక్రము భీము । వృష్టించి శాంతించు మేఘమన్వాని
నర్దించువారల నతిభీమగతిని । నర్దించునాతని నమితోగ్రరవుని॥
శూరుచేబడినట్టి శూరు నాతనిని । దుర్గమస్థలిని శార్దూలంబు చేత
ఆమిషార్థంబుగా హతమైనయట్టి । మృగరాజునా నొప్పు నగచరాధీశు॥
సర్వలోకార్చితం బుర్వీరుహంబు । సపతాక చైత్యంబు సవితర్దికంబు
నాగహేతువుచేత నా గరుత్మంతు । చేత నున్మథితమౌ రీతిగా నచట
యుద్ధావనిన్బడి యున్నట్టివాని । వాలి నాతని గాంచె పత్ని యా తార॥

**తే.** ధను వనుత్తమమును బూని ఘనతనచట । నిలిచియున్నట్టివాని నా నృపలలాము
రాము రామానుజునిగాంచె రమణితార । చూచె మరియును మరది నా శుభ్ర
చరిత్రు॥ 25

**తే.** వారి సందర గడచి యా వారిజాక్షి । రణనిహతు భర్త చెంతకు జని సుకేసి
చూచి యక్కట వ్యథితయై క్షోణికొరగె। కరముసంభ్రాంతయై తార కనకహారి॥

**తే.** నాతి నిద్రించి మేల్కాంచినట్లు లేచి । 'ఆర్యపుత్రా' యటంచు మహార్తినేడ్చె
మృత్యుపాశాలచేత బంధితుడునైన । పతిని తిలకించి విలపించె సతివతంస॥ 27

**తే.** ఖిలిని 'కురరి' యనంగ క్రోశించుసతిని । అచటికరుదెంచియున్న యంగదుని
గాంచి
కష్టమయ్యె విషాదమక్కట యెడంద । పడియె సుగ్రీవు డెంతయు కడుపుపగిలి॥

19 వ సర్గ సమాప్తి. 827)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువదియవ సర్గ (26)

### తారావిలాపము

తే. రామచాప విసృష్ట శరంబుచేత । నకట యంతకరంబుచే నాహవోర్వి
వినిహతుండై యొరంగిన ప్రియునిజూచి । తార తారాధిపానన తల్లడిల్లి॥ 1

తే. వానరేంద్రు మహేంద్రాభు బాణనిహతు । పతిని వాలిని కుంజరోపముని జేరి
తార, భామిని శోకసంతప్తయగుచు । నతని నాలింగనమొనర్చి యక్కటకట॥

తే. వృక్షమున్మూలమట్టుల పృథివి నచట । కూలి యుండిన భర్త నా వాలినరసి
తార యాతుర మరిమరి తల్లడిల్లి । ఇటుల పరిదేవనమొనర్చె యెల్గెసంగ॥ 3

తే. దుఃఖిని దారుణవిక్రాంత! యో! ప్రవీర! దేవ! ప్లవతాంతరా! నాథ! దీననయ్యె
అనపరాధిని నాతోడ వినయవతిని । ఏల భాషింపకుంటి వీ లీలనేడు॥ 4

తే. లెమ్ము! హా! హరిశార్దూల! లెమ్ము నాథ! । మరి పరుండుము శయనోత్తమంబు
నందు
ఈ విధంబుగ నేల శయింప రనఘ । నిన్నుబోలు నృపోత్తముల్ సన్నుతాంగ॥

తే. అరయ వసుధాధిపా! వసుంధరయనీకు । అతి మనఃకాంతయనునట్లు లౌరతోచు
అయ్యో! నీవు గతాసుండవయ్యె నాథ । నన్నువీడి వసుంధరన్ గౌగలింతు॥ 6

తే. తెలిసె ధర్మప్రవర్తనన్ వెలయు నీవు । స్వర్గమార్గంబునందు నీ ప్రతిభ జేసి
పురము రమ్యంబు కిష్కింధబోలుదాని । వీర! నిర్మించుకొంటివి వేరె యొకటి॥

తే. కాలకాలంబులందున లీలలొలయ । నాథ! సను... ... ... ... ... ముల
హాయి మధుగంధి కాననాంతరములందు।పృథివి విహరించుటలు తీరె నేటితోడ॥

తే. హా! నిరానందనైతి నిరాశనైతి । హా! నిమగ్ననునైతి శోకాబ్ధిలోన
నృప! మహాయూథపైక యూథప! మహాత్మ ! ఇలను నివారి పంచత్వ మిటుల బొందు॥ 9

తే. హృదయమిది నాది సుస్థిరం బెంచి చూచె । పతిని ... నిహతుజూచి యీ క్షితిని నిట్లు
వదమ శోకాభితప్తయై పగులదేమి? । వేయి పరియలుగా నిప్డె వీరవర్య॥ 10

తే. తమ్మ సుగ్రీవుభార్యను తప్పనాక । అకట హరియించి తిరిమితి వతని నీవు
దాని ఫలితమె నాథ! యిత్తరిని నిట్లు । నీకు సంప్రాప్తమయ్యె యింకేమనందు॥

తే. నాథ! నిశ్శ్రేయసపరను నన్నుగూడ।మోహమున నీవు గర్హించితో హరీయపుడు
హితము వాక్యములబల్క నా మతిని గొనక।హా!హితైషిణి ననువొప్రియరిగితీవు॥

తే. రూపయౌవనదృప్తులై ఏపుజూపు । దక్షిణల నప్సరల మానదా! ధ్రువంబు
తనిపి వారల చిత్తంబులను గ్రహింతు । వల్ల స్వర్గంబునందున నార్యవర్య॥ 13

తే. కాల మది నీకు ప్రాణాంతకరమునయ్యె । ధ్రువము నిస్సంశయము సుమ్ము దోర్బలుండ
బలిమి నద్దాన నవశుండవగుచు నాథ । చెలగి సుగ్రీవువశమున చిక్కితెటుల॥ 14

తే. మున్ను దుఃఖంబు కృపణత్వ మెన్నడెరుగ । అయ్యె వైధవ్యమికనొంది యార్తిగుంది
నాథ! కృపణత శోక సంతాపమొంది । ఇకచరింతు ననాథనా యిలను సతిని॥

తే. లాలితుం డంగదుండు నా బాలకుండు । కొడుకు సుకుమారు డయ్యె సుఖోచితుండు
నీవు గతియింప వీరు డింకే యవస్థ । జెందునో క్రుద్ధు పినతండ్రి చేతులందు॥

తే. ధర్మవత్సలు నకట నీ తండ్రినిపుడె । చక్కగా జూచుకొనుమయ్యచక్కనయ్య
అతని దర్శన మికనీకు క్షితినివత్స । దుర్లభంబగు సుమ్ము హో ధ్రువముపుత్ర॥

తే. దూరదేశము నీవేగ బోడరినావు । పుత్రు నాశ్వాసమొనరించి పొమ్మునాథ!
కూర్మి సందేశమేదైన కొడుకుకిమ్ము । మూర్ధ మాఘ్రాణమొనరించి పొమ్ము పుత్రు॥ 18

తే. నిన్నువధియించి రాఘవుం డిషు నిహతిని । చేసియుండె మహాత్కర్మ సిద్ధమింత
అతడు సుగ్రీవు కొనరించి నట్టిప్రతిన । దీర్చి తనఋణ మతనికి తీర్చుకొనియె॥19

తే. ఇక సకాముండవగుమ సుగ్రీవ! నీవు । 'రుమ'ను పొందెద వింక పో ఘప్రవము మరల
పృథివి రాజ్యము భోగింపు దిగులులేక । నిహతుడయ్యెను నీయన్న నీ రిపుండు॥

తే. ఇటుల విలపించు నన్ను కన్నెత్తిచూచి। ఏల ప్రేమను భాషింప వేల నాథ!
వీరె నీ భార్యలు వరిష్ట లిందరిచట । చేరియున్నారు చూడుమీ వీరినైన॥ 21

తే. అటు విలాపంబుసలుపు నాయబలయేడ్పు । విని సుదుఃఖార్తలై కపివనితలెల్ల
కరుణ నంగదు దీనుని కౌగలించి। అకట యాక్రోశమొనరించి రా రవార్త్వి॥ 22

తే. ఔర, అంగదు సాంగదవీర బాహు । వీడుచు చిరప్రవాస మిచ్చేల జనెదు ?
ఇట్టి గుణసన్నికృష్టు నీ పట్టిబాసి । కట్టి! ప్రియపుత్ర! చనుట యుక్తంబుగాదు॥23

తే. వీర! ప్రియ! యప్రియంబేమి చారువేష । నీకొనర్చితి; అంగదుం డేమిజేసె?
ఇర్వురను మమ్మునాథ! నీవిట్లు విడిచి । దేవ! దీర్ఘప్రవాసంబు పోవుచుంటి? 24

తే. తెలియకేదైన కించిత్తు దీర్ఘబాహు । అప్రియం బేనుజేసిన ననఘ ! దాని
నాథ ! క్షమియింపు ! హరివంశనాథ ! వీర । మూర్ధమున నీదుచరణముల్ మ్రొక్కుదాన॥ 25

తే. వానరీతతిగూడి యిబ్బంగి తార । దీనముగ భర్తచెంత రోదించుచుండి
విభుసమీపాన ప్రాయోపవేశమొంద। తాను నికబూనె యా యనింద్యాచ్ఛవర్ణ॥

20 వ సర్గ సమాప్తి (853)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇ రు వ ది ఒ క ట వ స ర్గ (16)

హనుమంతుడు తారను సమాశ్వాస మొనరించుట.

తే. అంబరంబుననుండి చ్యుతంబునైన । తారయన నొప్పు నిపతిత తార నరసి
హనుమ హరియూథపుండు త ద్వనచరుండు । నెమ్మి నాశ్వాసమొనరించె
నెమ్మదిగను॥ 1

తే. అరయ గుణదోషకృతములై పరగి మరియు । త్రాన్మస్థలి స్వకర్మ ఫలహేతుకంబులైన
తత్శుభాశుభములనెల్ల తప్పకుండ । బడయుబో జంతుతతి ప్రేత్యభావమొంది॥ 2

తే. శోచ్య నెవ్వనికై నీవె శోచ్యవకట । శోకమొందెదు? దీన వీ లోకమందు
తల్లి! యే దీనుకై యింక తల్లడిలెదు? । ఎవని కనుశోచ్యు డెవ్వడీ భువనములను?
దేహ మియ్యది బుద్బుదం బోహో తలప॥ 3

తే. జీవపుత్రవు; నీకు నీ చిన్నికుర్రి । అంగదుం డింక ద్రష్టవ్యు డమ్మ తల్లి!
క్షితిని నుత్తరకాలమం దతనికైన । హితములను చింతసేయ నీ కింక విధియ॥ 4

తే. సతిరో! భూతాళికిట్టు లాగతియు గతియు । అనియతంబని యెరుగుదు వమ్మనీవు
కాన పండితవరులకు కార్యమగును । ఐహలౌకికముడిగి శుభమ్ముగూర్ప॥ 5

తే. హరి సహస్రంబు లర్బుద సంఖ్యలెసగి । ఎవని వశమున తమతమ భృతుల నొంది
చక్రవర్తింపుచుండు రా జగతివిభుడు । ఉగ్రతేజుండు దిష్టాంతమొందెనేడు॥ 6

తే. సామ దాన క్షమాపరుం డా మనస్వి । న్యాయదృష్టార్థతత్త్వుడై యవని నెసగి
ధర్మజితులదియైన తత్ స్థానమొందె । కాన నతనికి శోకింప గాదు నీకు॥ 7

తే. అమ్మ! యీ హరిశార్దూలు లందరకును । పుత్రు డీ యంగదునకు నీభూమికెల్ల
తల్లి! హర్యృక్షరాజ్య మిద్దానికింక । నీవ సూ నాథురాల వనిందితాత్మ। 8

తే. తల్లి! విడుమ శోక సంతాపములను । మెల్లమెల్లగ రెంటి నీ యుల్లమునను
నీ వశంబున నంగదుం డీ సుతుండు । ఈ వసుంధర నింక శాసించుగాక! ॥ 9

తే. సంతతిని గందు రే ప్రయోజనము కొరకు । ఎయ్యదితలంప కర్తవ్యమిప్పుడగును
సర్వమొనరింపజేయు నీ స్వామికిపుడ । ఇదియె యిప్పటి నిశ్చయం బింత కిచట॥

తే. అమ్మ! హరిరాజు సంస్కార్యుడగును నిపుడ । పట్టమున్గట్టుమమ్మ నీ పట్టికింక
ధాత్రి సింహాసనగతుండు పుత్రుజూచి । శాంతి బొందెదవమ్మ నీ స్వాంతమందు॥

తే. అంత భర్తృవ్యసన పీడితాత్మ యాపె। అతని వచనంబు లాలించి యతివ తార
ఆట నిరీక్షించుచున్న యా హనుమతోడ । పలికె ప్రత్యుత్తరం బిట్లు పటు
తరంబు॥ 12

తే. అంగద ప్రతిరూపులైనట్టి సుతులు । వంద లొకవంకనున్న నా కెందుకయ్య?
హతుడె యైనను వీరు డీ పతివతంసు । గాత్రసంశ్లేషణమె నాకు ఘనముసుమ్మ!

తే. వినుము హరిరాజు సంస్కార మొనరుపంగ । సుతుని నేలింప నే గాను సుమ్ము
కర్త
వాని పినతండ్రి సుగ్రీవుడేను తాత! । అన్ని పనులకు కర్త యనంతరుండు॥ 14

తే. అంగదునిగూర్చి హనుమ ! నీదైనతలపు। తలప యుక్తంబుగాదోయి తాత!
వినుము
పుత్రునకు బంధువెప్పుడీ ధాత్రిపితయె । కాదుతల్లి; హరీశ్వరా! కనుము నిజము॥

తే. వినుము హరిరాజసంశ్రయంబునకు మించి । ఇహపరంబుల హెచ్చునాకేమి లేదు
క్షితిని అభిముఖహతవీర సేవితంబు । శయనమిదె నాకు సేవింపక్షమముసుమ్ము॥16

21 వ సర్గ సమాప్తి (869)

★

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువది రెండవ సర్గ - (22)

-: సుగ్రీవుని జేరబిలిచి, అంగదుని అతని కప్పగించి వాలి మృతినొందుట :-

తే. వాలి మందాసు డప్పు డుచ్ఛ్వాసములను । మందగతిబుచ్చు చెల్లెడ మందదృష్టి
బరపు చాత్మజు ముందున్న భ్రాతగాంచె। మొదటసుగ్రీవు నా రణభూమిలోన॥1

ఆ. అతని పాప్తవిజయు హరివరు సుగ్రీవు । నరసి వాలి వ్యక్తమైన యట్టి
వచనములను నిట్లుపలికె సస్నేహంబు । లైనవాని నప్పు డతని గురిచి॥ 2

తే. ఏ నొనర్చిన కిల్బిష మెడద నునిచి । నన్ను సుగ్రీవ ! దోషుగా నెన్నవలదు
భావి యిటులుంట బుద్ధిమోహాన నేను । కడు బలాత్కృతి కృష్యమాణుడనునైతి

తే. మనకు భాతృత్వ సౌహార్దమును ధరిత్రి । రాజ్యసౌఖ్యంబు నేకకాలంబునందు
కలుగరాదంచు విధి యహో తలచెనందు । ధ్రువము వేరొండులేదోయి దోష
మెందు॥ 4

తే. ఇపుడె వహియింపుమీ తాత కపులకైన । రాజ్యమిద్దాని నీవు పరంతపుండ
నేనొ యిప్పుడె చనుచుంటి పృధివిబాసి। ఘనత వైవస్వతక్షయంబునకు వత్స॥

తే. జీవితంబును రాజ్యంబు శ్రియనువిపుల । మిద్దియు మహత్తరము నగర్హితము
యశము
నన్నియునునీడి యిప్పుడే యరుగుచుంటి। అమరపురికేను తమ్ముడా!యరయుమింత

తే. ఇట్టిదైన యవస్థలో నిప్పుడేమి । నేను వచియింతునో వీర దానినీవు
చేయదగునయ్య నీకది చిత్తమునకు । కష్టమైనను తప్పక కపులరేడ॥ 7

తే. బాలుని నబాలిశు సుఖార్హు బాష్పవదను ! వీని నంగదు సుఖసుసంవృద్ధుచూడు
భూమిపై యెల్లు కడియుండెనో మహా౽త్మ । వీని నెల్లెడకొంచుచో వీరవర్య॥ 8

తే. నాకు ప్రియపుత్రుడితడు ప్రాణములకంటె । పుత్రు సితని సౌఖ్యప్రపుత్రు రీతి
మద్విహీను విహీనాప్తు మూడిగాగ । వలయు పాలింపనింక సర్వత్రసివె॥ 9

తే. దాత వాలుడకిక పరిత్రాతపీవె । భయములం దెల్లయెడల నభయమడవును
ఇంక సర్వత్రవిను ప్లవగేశ్వరుండె! । నావలెనె నీవు నాతని పరయుపలయు॥ 10

తే. ఇతడు తారాత్మజుండు సుశ్రీయుతుండు । నీకు తుల్యపరాక్రముం డిద్ధగుణుడు
రాక్షసాళి వ ... కాలంబులందు । నిలుచు నీతండు నీముందు కలహామందు॥

తే. తనుణకీతడు తా రేయు దురుబలుండు । రణములతరస్వి గొప్ప విక్రమముజూపి
తత్తదనురూప కార్యజాతంబులెల్ల । ఆచరించునుసుమ్మోయి యంగదుండు॥

తే. దొడ్డ దీపె సుషేణుని దుహిత తార ! అర్థసూక్ష్మంబుల వినిశ్చయంబునందు
మరియు వివిధంబులయిన నౌత్పాతికముల । ఈపె పరినిష్ఠిత సమర్థ యెల్ల
యెడల॥ 13

తే. ఈపె యెయ్యది సాధువంచెంచిచెపునో । కార్యమది ముక్తసంశయంబయ్యావత్స
నిజము తారామతంబు కించిత్తుగాని । అన్యథాయెప్డుగాదయ్య ఆర్యవర్య॥ 14

తే. రామచంద్రునిదైన కార్యమునునీకు । ఇంక నవిశంక కర్తవ్య మెంచిచూడ
దాని సేయక యుంట యధర్మమగును । ఇక విమానితుడగుడు ని న్నెర్చికూల్చు

తే. ఇదియె మాల గ్రహింపు సుగ్రీవ! నీవు। కాంచనమయంబు దివ్యంబునంచితంబు
నేను మృతినొందె యింక యిద్దానిదైన । గొప్పకాంతి నశించు సూ కొనుమ
వేగ॥ 16

తే. వాలి యిటుబల్కి సుగ్రీవుడాలకించి । భ్రాతృసౌహార్దమున హర్షమకట వీడి
మరల దీనుండునైయుండె మది నతండు । హా! గ్రహగ్రస్త మా యుడురాట్టు
నంగ॥ 17

తే. అంత నవ్వాలి వచనాల శాంతినొంది ! ఆలసింపక నటులె సేయంగబూని
అన్నయనుమతినొంద నా యనుజుడపుడ । కొనియె త త్కాంచనీమాల వినయ
మునను॥ 18

తే. కాంచనీమాల నద్దాని వంచితంబు । తమ్మునకొసంగి వాలి యాత్మజునిజూచి
తనకు మృతియింక చేరువౌటను నెరింగి। అంగదున కిట్లు బలికె స్నేహార్ద్రమతిని॥

తే. దేశకాలంబులెరిగి వర్తింపుమయ్య । ఇకప్రియాప్రియముల క్షమంబెడదదాల్పు
కాలగతివచ్చు సుఖము దుఃఖమును సమత । మది సహించుచు సుగ్రీవవశుఁడ
వగుము॥ 20

తే. సతత మే నెట్లు నిన్ను వత్స కుమార। లాలనమొనర్చుచుంటినో బాలయటుఁగ్రె
ప్రీతిలాలించు నిన్ను నీ పిన్నతండ్రి । ఇంక వర్తింపు నాయెడ నెట్లొ యట్లె॥

తే. అతనిశత్రునిగాని, తత్ శత్రుమిత్రు । గాని చేరకుమీ శత్రుకర్శనుండ!
తాత! పతి కర్థపరుడవై దాంతుడవయి। వత్స!సుగ్రీవ వశగుడ వగుమఇంక॥

తే. అయ్యొ! కూడ దతిప్రణయంబు నీకు । అప్రణయమును కూడదయ్యా! కుమార
ఉభయమును గొప్పదోషంబులోయివత్స! కాన,నంతరదృక్కుఁడ వగుమనీవు॥23

తే. ఇటువచించి వివృత్తాక్షు డిట్లెయగుచు । భృశము శరపీడితుండౌట వివృతదశన
భీమరూపుండునై వాలి భూమినచట।చిటికెలోనయ్యె యుత్క్రాంత జీవితుండు॥

తే. అంత హరియూథపుల్ వానరౌఘములును।ప్లవగపుంగవు లెల్ల ఘోరంబుగాఁగ
ధ్వని సెలంగగ రోదనంబును నొనర్చి।రెంతయును జాలిగుంది హా స్వాంతములను॥

తే. వానరాధిపు డట్టుల స్వర్గమేగ । శోకహతినడ్డె కిష్కింధ శూన్యమయ్యె
వనము లుద్యానములు శూన్యమయ్యె గిరులు । మరియు నిష్ప్రభులైరి వాన
రులు నెల్ల॥ 26

తే. ఎవ్వని మహత్తరోరువేగైక ఘాటి । కాననంబులు వనములు గాలినెగసి
వేగ పుష్పౌఘములతోడ వెంబడించు । అట్టివాడేగ యిక యెవండిట్లు సేయు!

తే. ఆ మహాబాహు డా మహితాత్మకునకు।ఘనుడు గంధర్వు డా గోలభునకునౌర
పటుమహత్తర యుద్ధంబు నటులనిచ్చె । పదియు నైదేండ్లు నెవ్వడా వాలి యేడి?

తే. రాత్రినిలువదు రణము ఘోరంబునద్ది।పగలు శాంతింపదింత యా జగడమహహ
అంత,షోడశవర్షమం దాహవోర్వి । గూలె నొక్కట పెల్లుగా గోలభుండు॥ 29

తే.దురమునన్ గూల్చి యిట్టులా దుర్వినీతు।మాకు సర్వాఽభయకరుండు నౌకృపాళు
డల్ల దంష్ట్రికరాళు డా యమితబలుడు। వాలి యిటుగూలు టాశ్చర్య మౌరకాదె!

తే హతుడగుడు వీరు డా ప్లవగాధిపుడును। మదుల దిగులొందిరి ప్లవంగమాదులెల్ల
వనచరంబులు గవులు సింహాయుత వనిని।అల గవాంపతి నిహతుడై నప్పుడటుల॥

తే. తార వ్యసనార్ణవాప్లుత తనదుపతిని । మృతుని జేరి ముఖంబు వీక్షించి యకట
వాలి నాలింగన మొనర్చి నేలగూలె । లత నికృత్తమహాద్రుమాశ్రితమనంగ॥32

22 వ సర్గ సమాప్తి (901)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువదిమూడవ సర్గ - (23)

పతిశవముపైబడి తార విలపించుట :-

తే. మృతుని లోకాచ్చ్యుతుని నిజప్రియునివిభుని। సఖుని కపిరాజుదైన తన్ముఖముజేరి
తార యాఘ్రాణమొనరించి తద్దవగచి । వచన మిటుబల్కెనప్పుడా పతినిగురిచి॥

తే. ఇటు పరుంటివి కష్టమీ కటికనేల । అకట సేయంగవైతి నేనన్న యటుల
విషమ ముపలోపచితము పృధ్వీతలంబు । వీర! శయనింతువు సుదుఃఖ మీ
రణోర్వి॥ 2

తే. వానరేంద్రుడ ! నాకంటె వసుధయిదియె । నీకుప్రియతరమయ్యెగా నిజము నాథ
వసుధ నీవిట్లు కౌగిటబట్టి యకట । మరి పరుంటివి, నాతోడ మాటయనవు॥ 3

తే అకట ! సుగ్రీవువశగుడవైతివిటుల । విధి యహో యిట్టులగుట హా వింతసుమ్మ
కనగ సుగ్రీవుడేను వికాంతుడౌర । వీర ! సాహసిక ! ప్రియా ! చేరవైతి॥ 4

తే. ఋక్షవానరముఖ్యు లనేకవేలు । బల్లిదులు వచ్చియున్నారు ప్రభుడ చూడు
వీరి విలపిత మిదె కృచ్ఛ్రమేల వినవు?। అంగదుని యేడ్పు వినబడదా మహాత్మ!
వినవ నారోదనంబు, మేల్కానవదేల?

తే. ఇదియె తచ్ఛాఖశయనంబు ఇటనె నీవు । నకట పక్షిత్పు హాతుడవై యాహవ
మున-
ఇటనె పూర్వము రిపుల వధించి నాథ । క్షితిని వారి పరుండబెట్టితివి నీవె॥ 6

తే. [illegible]! [illegible]! [illegible]! మహాత్మ! హా! విశుద్ధసత్త్వాభిజనా! కులీన!
[illegible] లోకముల విడిచి। పోవుచుంటివ? మానదా! పుణ్యగతికి॥ 7

తే. [illegible] నిర్వ్యావ్రా [illegible] యప్పుడు। నిశ్చయంబుగ వినుడు విపశ్చితుండు;
[illegible] కన్నిష్ట [illegible]య్యె। పతి హతుండౌట విధవనై హతనునైతి॥

తే. [illegible]! [illegible] గ్నమయ్యె [illegible]। భగ్నమయ్యెను నాదు శాశ్వత [illegible] గతియు
[illegible] కనుడు। మునిగితి యగాధ మిద్దాన, [illegible]॥

తే. [illegible] హృదయము వ్రక్కంబు నాయది యేమనందు
[illegible]। పగులకున్నది హా వేయి పరియలుగను॥

తే. [illegible]। నాకు ప్రియుడవు [illegible] హా
[illegible]। ఏమనందును విధి నియంతృత్వ మకట॥

తే. [illegible] మెంతటి ప్రత్తి [illegible]। నిఖిల ధనధాన్యపూర్ణగా నిమ్మ నిజము
[illegible] యంచు [illegible] పృథివి జనులు। చెప్పుకొనుచుండ్రి; యీ రాతతప్ప
దెల్లు॥ 12

తే. [illegible]యగాత్రి [illegible]ణమందు [illegible]రవర్య। రుధిరమండలమందు పరుంటి విటుల
[illegible] పరిస్తోమమందు। ఆత్మశయనంబునందట్లు లాహావోర్వి॥

తే. [illegible] తమో [illegible]। నీదు గాత్రంబు సర్వత్ర నిరుపమాన!
[illegible] రంభించె వెరు నాథ। భుజయుగంబున నినుబట్టి పురుషవృషభ॥14

తే. [illegible]! కృతకృత్యుడయ్యె సుగ్రీవుడిప్పుడు। ఔర! యీ యతిదారుణవైరమందు
[illegible] దవిన భయమెల్ల హతమయ్యె। రాఘవోన్ముక్త మేకశరంబుకతన॥

తే. [illegible]ము హృదిలగ్న మిద్దాన స్వామినిన్ను। గాఢపరిరంభణ మొనర్పగాకయుంట
నిన్ను పంచత్వమిటులొంద నేను నాథ। ఉరక కనులప్పగించి చూచుటయొకలిగె॥

తే. [illegible]ము తద్గాత్రగతమును వెలికివైచె। కేల సుగ్రీవుదళపతి నీలుడపుడు
[illegible] గిరిగహ్వరాన సంలీనమైన। దీప్త మాశీవిషంబునా తేజమొసగ॥ 17

తే. [illegible]ల నిష్కృష్యమాణమౌ పటుశరంపు। కాంతి ప్రసరించె నల్లడ వింతరీతి
అస్తమస్తక సంరుద్ధుడైన యట్టి। సూర్యువలన వెలంగెడి సుషమనాగ॥ 18

తే. వాలిదేహాన వ్రణముల వలననుండి । క్షతజధారలు నెల్లెడగారె మిగుల
తామ్రగైరిక సంపృక్త ధారలౌర । అల ధరాధరమునుండి యప్పటలపుడు॥ 19

తే. శూరు నస్త్రసమాహతు పేరవయ్యు । క్షితిని రణరేణుతతి నవకీర్ణు పతిని
దుమ్ముపోవంగ మెల్లన దుడుచుచకట।నయనజాశ్రుల దడిపె నా ప్రియుని తార।

తే. రక్తసంపృక్త సర్వాంగు రణవినిహతు । పతిని వీక్షించి యప్పుడా పణతి తార
పుత్రు పింగాక్షు నంగదు ధాత్రిజూచి । పగచి యంగన యిటుబల్కె వాక్య
మబల। 21

తే. వత్స! నీతండ్రి పశ్చిమావస్థ జూడు । దారుణ సుదారుణంబిది తనయ! కనుము
పాపకర్మంబుచేత సంప్రాప్తమైన । వైర మీరీతిగా అంతమౌర పొందె। 22

తే. బాలసూర్యోదయతనుండు ప్రభువరుండు। హా! యమక్షయమునకు ప్రయాంతు
డిపుడె
తండ్రి నీతని మానదు తనయ! నీవు । సాగి యభివాద మొనరింపు చరణములకు॥

తే. తల్లి యిటుబల్క వేగమే తనయుడతడు । లేచి పితరుని చరణముల్ పీనవృత్త!
భుజయుగంబున బట్టుచు మ్రొగ్గిమ్రొక్కె । 'అంగదోఽహ' మ్మటంచు నా
యంగదుండు॥ 24

తే. నీకు నభివాద మొనరించు నీదుపుత్రు। అంగదుని మున్పటట్టుల నాదరించి
'పుత్ర! దీర్ఘాయువగు"మంచు మూర్ధమంటి। ఏల యాశీర్వదింప వీ విప్పుడకట॥

తే. నిన్ను గతచేతసుని కటా నేను సుతుడు । విడువలేక నుపాసింతు మడలు చిచట
అపుడె సింహంబుచే హతమైనయట్టి । గోవృషంబును దూడతో గోవుమాడ్కి।

తే. సలిపి సంగ్రామయజ్ఞమన్ సవనమీవు।ఘనము రామప్రహారణాంభసిని మునింగి
అవభృథస్నాన మొనరించితివ?మహాత్మ।పత్ని నేలేక యెటుచెల్లె వ్రతమిదెల్ల॥ 27

తే. సంయుగంబున తుష్టుడై స్వాంతమందు । మెచ్చి నీకప్డు దేవరా జిచ్చి నట్టి
శాతకుంభమయంబు ప్రశస్తమాల । ఏది కనబడ దే మిప్డు నీదు మెడను?। 28

ఆ. రాజలక్ష్మిచూడు ప్రభుడ! గతాసుండ । వయ్యు వీడకున్నదయ్య నిన్ను
అధిప! మానదుండ! ఆవర్తమానుని । తరణి కాంతి మేరు ధరణి నటుల॥ 29

తే. పథ్యమది సల్పనైతి నా పల్కునీవు । శక్తగానైతి నినునాప స్వామి నేను
హతనునైతి సపుత్రను; నాజి నిహతు।నాథ! నీతోడనేపాయె నాదులక్ష్మి॥ 30

23 వ వర్గ సమాప్తి - (931)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువదినాల్గవ సర్గ — (44)

సుగ్రీవుని దుఃఖము - రామసన్నిధి మాహాత్మ్యంబున తార సమున్మిషిత శుద్ధసత్త్వయై రాముని స్తుతించి ప్రతిపత్తి నొందుట - రాముడు తారను ఉచితరీతిని సమాశ్వాస మొనర్చుట.

క. వెల్లువలౌ బాష్పంబుల । వెల్లిగ శోకాబ్ధిమునిగి విలపించు సతిన్
బల్లిదు డా వాల్యనుజుం । డల్లన గని భ్రాతృవధకు హా! తపియించెన్॥ 1

క. కన్నీళ్ళనిండు మొగమున । వ న్నాతినిగాంచి తత్క్షణంబున నెద నిర్
విణ్ణత భటులును తానును । సన్నగ జనె రాముకడకు సత్ హృదు డార్తిన్॥ 2

క. చాపము సహాసమ బాణము । జేపట్టి సులక్షణాల జెలగెడి మేనన్
రూపొప్పు కీర్త్యుదాత్తుని । క్ష్మాపతి నా రాముజేరి సవితృజుడనియెన్॥ 3

క. చేసిన ప్రతినను రాఘవ! । వాసిగ చెల్లించినావు; ఫలమున్ గలిగెన్
మాసెను పగ; కానీ, హృది । బాసెను భోగాశ జీవితాశయు నాకున్॥ 4

క. ఈ మహిషి యిట్టు లేడ్వగ । ఈ మా పురిజనులు నేడ్వ; యిక, యన్నయునున్
హా! మృతిగన; నంగదుడును । ఏమానో యనగ రాజ్య మిది నా కేలా?॥ 5

క. క్రోధంబున, మరిమరి బా । ధాధికమున, జాల విప్రధర్షణమున మున్
యూధపు సోదరు వధ కటు । నాధ! యొడంబడితి; నిప్డు నవసి తపింతున్॥ 6

క. శ్రేయము నా కౌ చిర మిక । పాయక యా ఋష్యమూకవాసం బందే
స్వీయప్రవృత్తి నుం దట; । నా యన్నయ బోవ నాకు నాకము నేలా!॥ 7

క. "నిన్నున్ జంపను, పో" యని । యన్న; మహాత్మునకు బుద్ధిశాలికి నదియే
యన్నకుఁ జెల్లెను; నా కిపు । డన్న వధించుటయె చెల్లె నతిపాపునకున్॥ 8

క. అన్న మహాగుణు జంపఁగ । నెన్నని యేతమ్ముఁడైన నెంచక భేదం
బన్నవియోగార్తికి, రా । జ్యోన్నతికిని, కేవలం బహో, కామమునన్॥ 9

క. తననొప్పుగుణము మీఱఁగ । మనసొప్పక నన్ను వాలి మానె వధింపన్
మనమున నే దుర్బుద్ధిని । నొనరించితి పాప మన్న యుసురుల్ గొనుచున్. 10

క. తరుశాఖాహతిబడి నే । నరువఁగ నను జాలి జూచి యాపుచు, "పొమ్మా
"మరలన్ రాకుమ" టం చాపు; । కరుణాళుఁడు నన్నుఁ బంపు; గైకొన నుసురుల్॥

క. భ్రాతృత్వ మార్యభావము । నీతి నతం డూని ధర్మహృది నను బ్రోచెన్
పాతకుఁడను నే జూపితి । కోతిగుణం బెల్ల కామకోపంబులచేన్॥ 12

గేయం

అచింతనీయం బనపేక్షణీయమ్ । అనీప్సనీయం బది వర్జనీయమ్
అహో! నరేంద్రా! నను బొందెపాపం । బపార మన్నన్ వధియింపఁ జేయన్
సురేంద్రు కా త్వాష్ట్రవధానబోలెన్॥ 13

క. పాపం బింద్రుని దిలయును । నోపిక గొనెగాక తరులు నువిదలు జలముల్
నా పాప మిద్ది కోతిది । సాపేక్షఁ గొనునెవండు? క్షోణీపాలమణీ!॥ 14

క. కా నిక సన్మానార్హుఁడ । కా నే యువరాజుగాఁగ, క్షోణీపతి నర్హ
దే ని ట్లధర్మయుక్తము । హీనతఁ గులనాశయుక్త మిటు జేసి పనిన్॥ 15

క. లోకాపకృతము క్షుద్రము । లోకవిగర్హితము పాప మొనరించి తహో!
శోకము మహత్తరం బిది । నా కీగతి దొర్లె లోతునకు నీర మటుల్॥ 16

క. భ్రాతృవధాఽపరగాత్రము । హా! తాపశిరోవిషాణహస్తాంబకమున్
ఘాత ననుసల్పు నఘసం । ఘాతేభము యేటిగట్టునట్టుల ధాటిన్॥ 17

క. సంగడి యఘమోర్వక దు । స్సంగంబని వీడెనన్ను సాధుత్వ మహో
అంగారతప్తమై మరి । బంగారము మలము వీడు భంగిగ రామా॥ 18

క. ఈ హరియూథపులయు నీ । బాహుబలత్రాతములయు ప్రాణములెల్లన్
ఆహా! సగమయ్యెనుగా । నా హేతువునను; తపించు నంగదుఁగనుటన్॥ 19

క. సుతుడు సులభ్యుడు సుజనుడు । కృతియు సువశ్యుండు; కాని, యే డీ సముడీ
సుతునంగదునకు; మరి యీ । క్షితి సోదరసన్నికర్షు డెచ్చో గనుగొన్ ?॥ 20

క. అంగదు డీ క్షితి బ్రతికిన । అంగనజీవించు మాత యాతనినోమన్
అంగదుడే లేకుండిన । కుంగి కటా! పాయు తార ధ్రువమిక యుసురుల్॥ 21

క. కావున, జొత్తుమండెడు । పావకు మద్భ్రాతృపుత్రమైత్రికిగాగన్;
ఈ వీరులు నీ వశతను । నీ వెలదిని నింక నెమక సేర్తురు రాఘవ। 22

క. నే నిటు మృతుడను నైనను । మానక నీకార్యమెల్ల మహీపా! నడచున్
హీనుడ బ్రతుక ననర్హుడ । పోనీ కులనాశకుడను భూపా! నన్నున్॥ 23

క. ఆర్తుని వాల్యనుజుని పలు । కార్తిని విని శత్రుహంత తన్మ్నపతి సీతా
భర్తయు నశ్రులు దొరగగ । మూర్తయు దా విమనుడయ్యె హో! రాముండున్॥

క. అప్పుడె మరిమరి తను గను । నప్పణతిని శోకమగ్న నడలెడు తారన్
ఒప్పుగ నూరార్పగ రా । మప్పుడు గనె భువనగోప్త యవనీశుముకున్॥ 25

క. కపిసింహనాథు నాథుని । విపులార్తిని గౌగలించిపృథివిని నొరుగన్
కపిపత్నిచారునేత్రిను । నప్పుడెత్తిరి మంత్రిముఖ్యు లనుపమ సత్త్వన్॥ 26

క. పతికౌగిలుడుగనేరక । యతిగ చలింపంగ, వార లకటా యీడ్వన్
సతి కాంచె రాము నినసము । ద్యుతియుతు, శరచాపహస్తు, దోర్బలు నెదుటన్॥

క. రాజసుచిహ్నసుసంవృతు । రాజీవదళాక్షి యెరిగె రాజీవాక్షున్
పూజితు నదృష్టపూర్వుని । రాజితు పురుషప్రధానురాము డితడౌకాన్

క. వాసవకల్పు దురాసదు । భాసురవిక్రము మహానుభావు సమీపం
బా సతి జేరె వటించుచు । వేసరుచును విహ్వలించి వే యార్తయు నై॥ 29

క. శోకసుసంభ్రాంతశరీ । రాకృతి యా తార రాము నటుచేరియు శు
ద్ధైకమనంబున నిట్లనె। * ఏకరణోత్కర్ష లబ్ధపృథులక్ష్యనకున్॥ 30

క. నీ వప్రమేయుడవు, ప్రో । నీవు దురాసదుడవయ్య నీరజనేత్రా
నీవు జితేంద్రియుడవు సత్ । భావుడ వక్షయ్యకీర్తిపరుడవు, దేవా। 31

క. క్షతజోపమాక్షుడవు, భూ । పతివి, విచక్షణుడ వింక పరికింప క్షమన్
క్షితికిసముండవు, రాఘవ ! । కృతివి, పరమధార్మికుడవు కేవలుడవె? ప్రో॥ 31

---

పాఠాంతరం * ఏకకళోత్కర్ష.

క. బాణాసన బాణాయత । పాణుడవు సుసంహననుఁడ వతిబలుఁడవునున్
మానుష దేహుఁడవయ్యును । దానికి జిక్కక వెలింగెదవు దివ్యరుచిన్. 32

క. ఏ యేకబాణమున నా । ప్రేయసు గూల్చితివొ దానచే చంపు ననున్
వేయేగెద నాపతికడ । కాయన నే లేక హాయి గనఁడుగ రామా। 33

క. కమలామలనేత్రుఁడు స్వ । ర్గమునను నప్సరల చిత్రగాత్రుల గనియున్
ప్రముఖసుమతామ్రచూడల । రమణుల జేరియు రమింప డట నన్ గనమిన్।

క. అట స్వర్గంబుననైనను । పటు వైవర్ణ్యంబు శోక మతనికినో చెం
గట నే లేకుండుట, నీ । కిట రమ్యాద్రితటి సీత లేమిని నట్టుల్। 35

క. వనితారహితుఁడు తరుణుఁడు । విను, పూరుషుఁడెట్టిదుఃఖవివశుండగునో
అనఘా! యెరుగుదు వీవును । ననుబంపుము జంపి వాలి నవయకయుంచక్।

క. స్త్రీహత్యాదోషమని సం । దేహించెదవేని వినుము నిజ మీ సతియున్
దా హారివరు నాత్మయె యని । బాహాబల! చంపు నన్ను పడయ వఘంబున్।

క. పెక్కగు శ్రుతివాక్కులచే । పెక్కగు శాస్త్రప్రయోగవిధుల దలంపన్
నిక్కం బాత్మ యనన్యం । బెక్కరణిని పూరుషునకు విను దార నృపా। 38

క. దారప్రదానమున్ మరి । మీరెడిదానంబు లేదు వేరొం డగుటన్
వీరా! నన్నిక వాలికి । దూరము ధర్మంబు దలచి తూర్ణ మనుపుమీ।

క. ఈ దానంబున నీకును । నాదుపతిన్ వీరు జంపినట్టి యధర్మా
పాది యఘంబునుతొలగును । సాదరమున నన్ను జంపు సౌజన్యనిధీ। 39

క. ఆర్త ననాథను కష్టా! । భర్తకు వేరైనదాన; నందురు దానన్
మూర్తము బ్రతుక నశక్తను । భర్తను నన్నింక జేర్పు వడి జంపి కృపన్।

క. ఆ గజవిలాస గామిని । ఆ గుణశాలిని, ప్లవంగమాధిపు వాలిన్
నే గాన కెట్లు బ్రతుకుదు । హా! గురుతర హేమమాలి నా నాథు నికన్। 40

క. ఈ రీతి తార బలుకగ । వీరుండు మహాత్మకుండు పృథ్వీవరుడున్
శ్రీరాఘవుండు నాపెను । నూరార్పగ హితము నిట్లు లోలిన్ బలికెన్। 41

క. ఓ వీరపత్ని! నీవిటు । లీ విమతిన్ జేయ తగవె? యీ జగమెల్లన్
దేవి! యొనర్చె విధాతయె । ఆ విధియే కూర్చె దుఃఖ మమ్మా! సుఖమున్।

క. విధివిహితవిధానము నె । వ్వీధి దాటఁగలేరు లోకవితతుల నెవరున్
విధి కందకు వశులే సుమి । వ్యథమానము దేవి! నీవు; వందురనేలా ?॥ 43

క. నీపుత్త్రుఁడు యువరాజగు; । నీప్రాపున రాజ్యమేలు;నీ ప్రభ సెల్లున్
ఏపున మున్పటియట్టులె । సంప్రీతి పరంబు బొందఁజాలెద వమ్మా॥

క. ధాతృవిధానంబది యా । రీతిగనున్నది కదమ్మ; ధృతిగనుమమ్మా
మాతరో ! శూరులపత్నులు । నేతరి పరిదేవనంబు నిటు సేయరుగా॥ 44

తే. రాఘవుండు పరంతపుండోఘబలుఁడు । వనిత నూరార్ప ప్రభుప్రభావంబు దలఁచి
ఊరడిల్లి సువేషరూపోన్నతి గని । తార విరమించె యేడ్పు నా వీరపత్ని॥

24 వ సర్గ. సమాప్తి :— (975)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము.

### ఇరువది అయిదవ సర్గ:— (25)

సుగ్రీవాదులచే రాముడు వాలికి దహన సంస్కారము చేయించుట.

తే. అంత, సుగ్రీవతారాంగదాది హరుల। గాంచి రాముండు తమ్ము లక్ష్మణునితోడ
కుంది, మదిని సమానశోకుండు నగుచు। వారి నూరార్ప నిట్టులబలికె విభుడు॥

తే. శోకపరితాపముల జేసి సుంతగాని। మృతుల కొదవదు శ్రేయంబు మిత్రులార!
ఇక, యనంతరకార్యంబు నిపుడు జేయ। సలుపబూనుడు వేగ మీస్వామి కిచట॥

తే. లోకవృత్తంబు నెఱపుడు శోక ముడిగి। బాష్పమోక్షణ మిక జాలు భవ్యులార
కాలము నతిక్రమించి యే కార్యమేని। సలుపగారాదె కించిత్తు; తలపు డింత॥

తే. నియతియే కారణము లోకనికరములకు। నియతియే సాధనము కర్మనిచయములకు
నియతియే సర్వభూతౌఘనివహములను। రహి, నియోగించుటందు కారణముసుమ్ము॥

తే. ఎవ్వడే పనికిని కర్త యింతగాడు। ఎవ్వడే ప్రేరణకును కా డీశ్వరుండు
ఇక, స్వభావంబునను లోకమెల్ల నడచు। దానికి పరాయణము కాలమేనుసుండి॥

తే. కాలుడును కాలమును మీరజాల డింత। కాలము వికారమొందదు; క్షయము గనదు;
ఎవడును స్వభావము నతిక్రమింపలేడు। సతము దానికి లోగియే జరుగుచుండు॥

తే. నాస్తి పో కాలమునకు బాంధవ్య మింత। నాస్తియు పరాక్రమము; హేతు వదియు నాస్తి
జ్ఞాతి మిత్ర సంబంధంబు నాస్తి సుమ్మ। కారణం బాత్మవశమయి యెవార! చనదు॥ 7

తే. ఇంక కాలపరీణామ మిది యటంచు । సాధు దృష్టులు చూచుచు జరుగుచుండ్రు
ధర్మ మర్థము కామంబు ధరణి ప్రజకు । కలుగు కాలక్రమంబున; కలత యేల?॥

తే. స్వప్రకృతిగాంచె నిపుడు మీ ప్రభువు వాలి । మరియు, ధర్మార్థకామసంబంధ మైన
తత్క్రియా ఫల మిటు పవిత్రించు నిపుడె।పొందెపో, ప్లవగేశు డీ బొందిఁదాసి॥

తే. ఇతని నిజధర్మనిష్ఠచే వితతమద్ది । జితము పూర్వంబె స్వర్గ మీ శిష్టుచేత
ఇప్పుడు ప్రాణాల నింత లెక్కింప కితడు।పోరి చచ్చుట తత్ స్వర్గమును గ్రహించె॥

తే. ఏ నియతిఁబొందె మీ ప్లవగేశు డిప్పుడు:అది యెరుంగుఁడు శ్రేష్ఠమటంచు మీరు
కాన, పరితాపమును మీరు మాను డింక । ప్రాప్తకాలక్రియల కింక పడుడు త్వరగ॥ 11

తే. అంత శ్రీరాఘవుని వచనాంత మందు।క్రిమిత పరవీరహంత లక్ష్మణుడు ఘనుడు
పలికె వాక్యంబు ప్రశ్రితం బలఘు లీల । పృథివి గతచేతసునకు సుగ్రీవు కపుడు॥

తే. పలుకు సుగ్రీవ! యన్నకు సలుపవలయు । ప్రేతకార్య మనంతరం బీవు, మిత్ర
త్వరగ తారాంగదులఁగూడి వాలి కిచట । దహనసంస్కార మొనరింప దగును వీర॥ 13

తే. కాష్ఠముల శుష్కతతుల పైకైకొనవాని। చందనాదుల దివ్య సుగంధములను
వాలి సంస్కారమునకుగా త్వరగ నిపుడె । సఖుడ! తెప్పింప నిమ్ము నాజ్ఞాపనంబు॥ 14

తే. దీనచేతసు నంగదుఁ దేర్చు మీవు । దహనసంస్కృతి చేయింపు తండ్రి కింక;
వలదు బాలిశబుద్ధి నీ వగుట యిట్లు।ఇంక, త్వదధీన మీ పురం బింత చూడు॥

తే. తెచ్చుగా కంగదుం డింకదివ్యములను । మాల్యముల వస్త్రముల నింక బహువిధములను
ఘృతము తైలంబు గంధంబు నిప్పు డిచట । మరియు, సమనంతరంబు కావలయువాని॥ 16

తే. తారుడా! నీవు శిబికను తక్షణంబ । తీసికొనిరమ్ము పోయి యెంతేని వడిగ
త్వరపడుట యుక్త మెపు డిట్టి తరుణములను; । నేయ కాలస్యమిక; విశేషించి యిపుడు॥ 17

తే. శిబిక మోయంగ దగినట్టి శ్రేష్ఠబలుల । ప్లవగుల సమర్థులను నింక వడిగ నేరి
వాలిమోయ నియోగింపు మనుచు జెప్పి । రాముపార్శ్వాన నిలుచుండె
లక్ష్మణుండు॥ 19

తే. తారు డామాట లాలించి త్వరగ తరలి । శిబిక గొని దేర నగరికి శీఘ్ర మరిగి
వానరులచేత మోయించిదానిఁదెచ్చి । యునిచె శూరవరోద్వహానోచితంబు॥

ద్వి. భద్రాసనయుతంబు పరముదివ్యంబు । స్యందనోపమ మద్ది సుందరాంగంబు
ద్రుమకర్మభూషితం బమలకాంతంబు । చిత్రాండజా చిత్రచిత్రీకృతంబు
చిత్రలేఖాచిత్రశ్రీనిధానంబు । ఎందునెందునుజూడ నందెయందంబు
సిద్ధుల దనునట్టిశ్రీవిమానంబు । జాలవాతాయన జాలాన్వితంబు
సునియుక్త మెల్లెడ గన విశాలంబు । ధర విశ్వకర్మచే మరి, సుకృతంబు
దారుపర్వతకాది ధాత్రీతలంబు । చారుకర్మపరిష్కృతారోపితంబు
హార వరాభరణాలంకృతంబు

బహుచిత్రమాల్యదామాభిరామంబు । బహుగుహాగహనసంపన్నధామంబు
రక్తచందనరాగరమ్యదృశ్యంబు । పుష్పౌఘపూర్ణంబు పుష్పయానంబు
తరుణార్కవర్ణ సంతతరాజమాన । పద్మమాలావృతం బౌర ! యా శిబిక
పీకించి యీరీతి వెలసెడు దాని । "క్షిప్రంబ వాలి నీ శిబికయం దుంచి
ప్రేతకార్యముదీర్పు డీతని"కంచు । లక్ష్మణుఁ జూచి యా రాముండు బలికె॥

తే. అంత వాలిని నెత్తి మహార్తితోడ । అంగదునితోడ సుగ్రీవు డడలు కొంచు
శిబికయందుంచి, యా గతజీవితునకు । కృతి యలంకారముల నొనరింప జేసె॥

తే. ఔర్ధ్వదైహిక కర్మ లీ యార్యునకిక।చేయు డనురూపముగ నంచు చిత్తమెరియ
చేసె సుగ్రీవు డాజ్ఞ దా చెంతనున్న । వారికెల్ల ర కప్పు డా ప్లవగవిభుడు॥ 30

తే. వివిధరత్నంబులను వేనవేలుగాగ । ముందు వెదజల్లుకొంచు పోవుదురుగాక
ప్లవగులెల్లరు; పిదప పల్లకినిమోచి । వెనుకకొనిపోవుదురుగాక విభవ మెసగ॥

తే. ప్రభువులకు వారివారి సంపదల కిలను । తగినయట్టుల సల్పువిధంబుగాగ
చేసిరప్పుడు వాలికి వాసి మీర । ఔర్ధ్వదైహికములను వారంద రచట॥ 32

తే. అంగదునిఁగౌగలించి తారాదులైన । కపులు హతబాంధవులు యేడ్పులప్పుడు
సెలగ
పాడె వెంటను నడచుచు త్వరగ జనిరి । ప్రేతభూమికి నందరు వీరవరులు॥ 33

తే. అంత ప్రేషితలా కపికాంత లెల్ల । నడచి వాలివశానుగ లడలు కొంచు
"వీర, వీరా"యటంచు నా ప్రేత ఘువికి గరలి రెంతయు గుములు సత్వరముగాగ॥

తే. తార మున్నగు వానరీ వారమెల్ల । కరకు కరుణస్వనంబుల నరచుకొంచు
భర్తవెంబడి జనికి సంభ్రాంతలగుచు। వాలి యా హరియూథపు పత్ను లపుడు॥

తే. అట్టు లా వానరీతతి బిట్టు సల్పు । రుదిత శబ్దంబుచే మారుమ్రోత లెసగ
గిరులు వనములు మరి వనాంతరము లెల్ల । కరము నాక్రోశమొనరించు
కరణిగాగ॥ 36

తే. ఒక్క గిరినదిపులిన మం దొనర నప్పుడు । విమల జలసంవృతంబు వివిక్తమందు
చితి నొనర్చిరి శోకకర్శితులు కపులు । బహుళ సంఖ్యలు గూడి సత్వరముగాగ॥

తే. వాహకులు నంద రప్పు డా పాడె నచట । భుజములనుసుండి దింపి యా భూమి
నునిచి
ఎల్లరును దుఃఖమొందుచు నుల్లములను । అకట నిలుచుండి రొకట యేకాంత
మందు॥ 38

తే. అంత శిబికాతలంబునం దట్టు లకట । పడియు నున్నటి వాలి నా పతిని జూచి
అతని శిరమును తార నిజాంకతలము । జేర్చి విలపించె దుఃఖంబు చెలగి ముంప॥

తే. హా! మహారాజ! హా వానరా! మహార్హ । హా! మహాబాహు, హా! నాథ!
హా! మహాత్మ!
హా! మమప్రియ! మమవత్సలా! కృపాళు! । చూడు న న్నిట్లు కన్నెత్తి
చూడ వేమి॥ 40

తే. జనము వీరిని నైన యో స్వామి నీవు । శోకపీడితులను నేల చూడ వయ్యొ॥ 41

తే. చూడు, మానద! మరి గతాసుండ వయ్యు । ఇదె, ప్రహృష్టంబు నీవక్త్ర మే
మనందు
పోల్ప నస్తార్కసమవర్ణముగనె తోచు । అధిప! నీ విల జీవించి నప్పు డటులె॥

తే. కాలుడే రామరూపాన గడగి వచ్చి । ఈడ్చుకొనిపోవు నిట్లు హరీశ నిన్ను
బాణ మేకంబు నద్దాన వనిని నిచట । విధవలైతిమి నాథ! మే మెల్లరమును॥

తే. వీర రాజేంద్ర! నీ కగు వీరసతులు । వల్లభలు నీకు సర్వదా వానరేంద్ర!
పాదములను వికృష్ట మాధ్వానమునను। వచ్చియున్నారు మేలొక్కన వధిప! యేల॥

తే. నీకు వీ రిష్టసతులు గారే! కృపాళు । ప్రభుడ! చంద్రనిభాననల్ భాగ్య శోభనగా
ఇతడె సుగ్రీవు డీ ప్లవగేశ్వరుండు । నీల చూడవు తమ్ముని నితనినైన. 14

తే. వీరె సచివులు నీకు నీ తారుడాది । వచ్చియున్నారు రాజ! నీ పజ్జ కిప్పుడు
జనులు పురవాసులును వీరు స్వామి! నిన్ను । చుట్టియున్నారు కొలువగా చూచుచు
మయ్య॥ 45

తే. ఓ ! యరిందమ! యింక యథోచితముగ । బంపు సెలవిచ్చి నాథ!యీ ప్రజల
కెల్ల
పిదప మదనోత్కటులమెల్ల పేర్చి వనుల । హృదయ మలరంగ మనము క్రీడించ
మించట॥ 46

తే. సతిని, పతిశోకసంపరిప్లుతను, నకట । ఇటుల విలపించు తార నీక్షించి యపుడు
లేవనెత్తిరి వానరీబృందమెల్ల । తాము నక్కట శోకసంతప్తలగుచు॥ 47

తే. అంత, సుగ్రీవుగూడి యాయంగదుండు । పితరు నక్కట నేడ్చు చాచితికి పైన
నునిచె శోకాభిహతమైన మనసుతోడ।కరము కంపించు కరయుగ్మకంబు తోడ॥

తే. దీర్ఘ మధ్వానమునకు ప్రస్థితుడునైన । పితమునకు నగ్ని నిడి విధివిహితముగను
వ్యాకులేంద్రియు డౌచు నా యంగదుండు । తండ్రి కొనరించె మరి యప్ర
దక్షిణంబు॥ 49

తే. ప్లవగులెల్లరు నప్పు డా వాలినట్లు । సరగ విధిపూర్వకంబుగా సంస్కరించి
అతని కుదకక్రియలసల్ప నంతరప్పుడు । చనిరి శీతలశివజలంబునకు నదికి॥ 50

తే. వనట నంగదు మున్నిడుకొనుచు నంత । వారలెల్లరుగూడి యావాలి కపుడు
వరుస జలతర్పణంబుల భక్తి నిడిరి । సరగ సుగ్రీవతారాది సహితముగను॥ 51

తే. అపుడు శ్రీరాఘవుండు మహాబలుండు । తానును సమానశోకుండు దీను డగుచు
పొగులు సుగ్రీవు డా దీనుమూలమునను। ప్రేతకార్యంబు లెల్ల చేయించె విభుడు॥

ద్వి. అంత నా వాలి నా యగ్ర్యపౌరుషుని । ఆ ప్రసిద్ధుని రామబాణాభిహతుని
దీప్తాగ్నితుల్యసంప్రదీప్తతేజసుని । సంస్కారమొనరించి సవితృనందనుడు
రాము సలక్ష్మణు రహి జేరి నిల్చె॥

25 వ సర్గ సమాప్తి :— (1,023)

# తెలుగు వాల్మీకము

## వానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువది ఆరవ సర్గ:— (41)

సుగ్రీవ పట్టాభిషేకము, అంగదుని యౌవరాజ్యాభిషేకము.

తే. అంత శోకాభిసంతప్తు హరివరేణ్యు । క్లిన్నవాసను సుగ్రీవు సన్నజేరి
నిఖిల శాఖామృగామాత్యనికరములును।కొలిచి యుండిరి యాతని నిలిచి యచట॥

తే. రాము నక్లిష్టకర్ము మహామహాత్ము । నా మహాబాహు జేరి వారంద రచట
నిలిచి యుండిరి భక్తిఁబ్రాంజలులు నొసచు । అల పితామహు నా మహర్షులు
ననంగ॥ 2

తే. అంత, కాంచనశైలాభు డంచితుండు । తరుణ తరణి నిభాననుం డురు గుణుండు
పలికె ప్రాంజలి యొనచు దా వాక్యమపుడు । హనుమ వీరుండు నా మారు
తాత్మజుండు॥ 3

తే. నీ ప్రసాదాన సుగ్రీవు డీ ప్రియుండు । మహా మహాత్ పితృపైతామహంబు నిద్ది
పడసె రాజ్యంబు ప్రభువరా! వానరులకు।మిరి సుదుష్ప్రాపమైన దిప్పట్టు నందు॥

తే. భవదనుజ్ఞాతుడై యింకప్రభ సెలంగ । శుభము నగరంబు నీతండు జొచ్చి దేవ
సర్వకార్యంబులను సుహృజ్జనుల గూడి।చక్క నెరవేర్చుకొను రామ! సార్వభౌమ॥

తే. ఓషధుల గంధముల వివిధోదకముల । క్షితికి పట్టాభిషిక్తుడై కీశుడితడు
నిను విశేషించి యర్చించు ఘనత మెరయ । రత్నముల మాల్యముల నింక
రామచంద్ర॥

తే. గిరిగుహకు రమ్య మటకు కిష్కింధ కింక । నీవు దయచేసి యిప్పుడే దేవదేవ !
ఇతని సుగ్రీవు రాజుగా నిక నొనర్చి।వానరుల కెల్ల గూర్పుము పరము ముదము॥

తే. ఇటుల హనుమంతు డనగ నా యినకులుండు । రామచంద్రుండు పరవీరలయ కరుండు
పలికె ప్రత్యుత్తరం బిట్లు వాక్యవిదుడు । బుద్ధిమంతుం కు నా హరిపుంగవునకు॥
తే. విను, చతుర్దశవర్షముల్ హనుమ! నేను।గ్రామమేగాని, పురమేని గాని, సౌమ్య !
చొరగజాలను, చెప్పితి సుస్థిరంబు । పితృనిదేశంబు పాలింతు విధిగ దీని॥ 9
తే. పురము సుసమృద్ధమును, రమ్యతరము గుహను । చొచ్చి కిష్కింధ మీరెల్ల సొంపుమీర
వీరు సుగ్రీవు నచట మీ విభుడుగాగ । కూర్మి నభిషేకమొనరించుకొనుడు వేగ॥
తే. హనుమ కిటు బల్కి మరియు నా యినకులుండు । రామచంద్రుండు కృతజ్ఞుడా మనస్వి
వృత్తసంపన్నుతోడ సుగ్రీవుతోడ । పలికెను నుదారబలవిక్రమాఢ్యుతోడ॥
తే. వీర! ఈ యంగదునిగూడ విభవ మొసగ।యౌవరాజ్యాన పట్టంబు గట్టుమయ్య;
జ్యేష్ఠునకు పుత్రుడీతడు జ్యేష్ఠుడగును; । సదృశుడౌ విక్రమంబున సఖుడ! నీకు;
బుద్ధిమంతు డదీనాత్ము డిద్ధగుణుడు । అర్హుడీ యంగదుడు యౌవరాజ్యమునకు॥
తే. వచ్చె సలిలాగమం బిది వర్షఋతువు । శ్రావణం బిందు మొదటిది రానెవచ్చె
ఇదియె వార్షికసంజ్ఞికం బిటు ప్రవృత్త।మయ్యె మాసచతుష్టయం బనఘ భువిని॥
తే. అదను కా దిది మనకు ప్రయత్నమునకు । సౌమ్య నీవింక శుభము నీ పురము నకును
ఉండు నేనిట నీ గుహాయందె సఖుడ! । తమ్ము డీ లక్ష్మణునిగూడి నెమ్మదిగను॥
తే. అనఘ ! గిరిగుహ యిద్ది రమ్యంబు నగును । అతివిశాలంబు, యుక్తమారుతము నౌను
మరి, సమృద్ధిగ జలము తామరలు గలవు । అరయ నిదియు నివాసయోగ్యంబు నాకు॥ 15
తే. ఇంక, కార్తికమాస మేతెంచి నంత । జతన మొనరింపు రావణు సంహరింప
ఇదియె మన కింక సంకేత మింత కనఘ । సౌమ్య నీవు స్వమాలయంబునకు, మిత్ర! 16
తే. "ప్రభుతను స్వరాజ్యమున పట్టభద్రుడవయి । సంతసముగూర్చు నీ సుహృజ్జనుల కచట"
ననుచు రాముడు సెలవీయ నపుడెకదలి।పురిఁ బ్రవేశించె సుగ్రీవు డురుబలుండు॥

తే. పట్టణము రమ్య మది వాలిపాలితంబు । జొచ్చి కిష్కింధ కపిసేన పెచ్చు పెరిగి
వానరాధపు సుగ్రీవు భక్తిమీర। కొలిచియుండిరి మ్రొక్కి యా యలఘుతేజు॥

తే. వరుస ప్రకృతిజనంబు లెల్లరును నంత । హరిగణేశ్వరు సుగ్రీవు నచట నరసి
మది సమాహితులగుచు నమస్కరించి । జగతి సాగిలబడిరి సాష్టాంగముగను॥

తే. అటుల సాగిలబడినట్టి యఖిలజనుల । ప్రీతి సుగ్రీవు డెంతయు లేవనెత్తి
మంచిమాటల మరి యాదరించి యపుడ । భ్రాతురంతఃపురంబు విఖ్యాతిఁజొచ్చె

తే. అంతిపురిజొచ్చి యపుడ నిష్క్రాంతుడైన । ప్లవగనాధుని సుగ్రీవుభక్తి గొలిచి
అపుడ యభిషేకమొనరించి రాప్తజనులు । తత్సహస్రాక్షు నిక దేవతలొ
యనంగ॥ 22

ద్విప. పాండరచ్ఛత్రంబు స్వర్ణభూషంబు । స్వర్ణదండము యశస్కరము శుక్లంబు
వాలవ్యజనరమ్యభవ్యయుగ్మంబు । సర్వబీజౌషధుల్ సర్వరత్నములు
సక్షీర వృక్షపుష్పములు చివుళ్ళు । శ్వేతానులేపముల్ శ్వేతవస్త్రములు
స్థలజాంబుజంబులు సత్సుగంధములు । దివ్యచందనములు భవ్యరాగములు
వివిధముల్ బహుళముల్ వీరగంధములు । జాతరూపాక్షతల్ సర్పి, ప్రియంగు
దధి మధు ప్రముఖముల్ ద్రవ్యముల్ గొంచు । వైయాఘ్రచర్మంబు;
వారాహచర్మ
పాదుకద్వంద్వంబు భక్తిమై గొంచు । సమనశ్శిలంబు రోచనమును గొంచు
మైపూతలనుగొంచు మరియు నుప్పొంగి । షోడశకన్యకల్ సురుచిర లపుడు
వచ్చిరి యభిషేకమంటపంబునకు॥

సీ॥ రమ్యముల్ భక్ష్యముల్ వస్త్రముల్ ద్విజులకు
శిష్టుల కిచ్చి సంతుష్టి బరచి
కుశపరిస్తీర్ణంబు విశదాగ్నిహోత్రంబు
మరి, సమిద్ధమునందు మంత్రవిదులు
పటుమంత్రపూతంబు నటు హవిస్సును వేల్చ
కీశాధినాధు సుగ్రీవు నపుడు
స్వర్ణప్రతిష్ఠానమై, వరాస్తరణమై
ప్రాసాదశిఖరమై పలువిచిత్ర
మాల్యోపశోభితంబౌ వరాసనమందు
రమ్యాంచితంబందు ప్రాఙ్ముఖముగ

తే. వివిధమంత్రంబులను యథావిధిగ మరియు । శుభముహూర్తాన జక్కగూర్చుం బెట్టి
సదనదంబులనుండి సంగ్రహించి । సర్వతీర్థంబులం దుండిసలిలములను ।
కనకకుంభంబులన్ దెచ్చి యునిచి యచట॥

సీ. వృషభశృంగంబుల విపులశుభంబుల
కాంచనకలశాల నంచితముల
శాస్త్రప్రదృష్టంబైన సద్విధితోడను
ప్రీతితోడ మహర్షి విహితముగను
గజుడు గవాక్షుండు గవయుండు శరభుండు
ద్వివిదుండు మైందుండు వీరబలులు
హనుమంతుడును జాంబవంతుండు నళుడును
గంధమాదనుడు మున్ గాగ కపులు

తే. విమలము శుభంబు మరి, ప్రసన్నమునునైన । సురభిళజలంబులన్ జాల శోభ దనర !
ఘనత సుగ్రీవు నభిషేకమును బొనర్చి । రల సహస్రాక్షు వాసవు వసువు లట్లు॥

తే. అటుల సుగ్రీవు డభిషిక్తు డగుడు క్షితికి । హృష్టులై సర్వవానరబృందములును
మరి, మహాత్ములు కపికులవరులునెల్ల । అలరి కేరింత లిడిరి సహస్రములుగ॥

తే. రామచంద్రునిమాట పాలనము సలుప । హరిగణేశుండు సుగ్రీవు డురుగుణుండు
అంగదుని గాగలించి యుపాంగుమదిని । యౌవరాజ్యాన నభిషిక్తునపుడె చేసె॥

తే. అంగదుం డట్టు లభిషిక్తు డగుట గాంచి । అతనియెడల సానుక్రోశు లప్పు డంత
"సాధుసాధం"చు సుగ్రీవు సాధుభావు । నా మహాత్ముని బొగడి రత్యంతముగను॥

తే. రామచంద్రు మహాత్ము నా లక్ష్మణునియు । మరలమరలను సంప్రీతి కెరలు పొడుప
స్తోత్రమొనరించి రా కపి స్తోమమెల్ల । పురిని కిష్కింధ నుత్సవంబులు సెలంగ॥

తే. హృష్టపుష్టజనాకీర్ణ మెందు జూడ । ధ్వజపతాకాభిశోభితం బన్నిదిశల
నగరమొప్పెను కిష్కింధ మిగులశోభ । ప్రతిభ గిరిగహ్వరంబున రమ్యమగుచు॥

తే. ఘనత నిచటి మహాభిషేకముల వార్త । రాఘవునకు నివేదించి ప్లవగవిభుడు
"రుమ"ను భార్యను నపుడ వీర్యుండు పొందె । మరియు రాజ్యంబునొందె నా మఘవుడట్లు॥

**26 వ సర్గ సమాప్తి :— (1,069)**

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువది ఏడవ సర్గ:— (43)

రాముడు ప్రస్రవణాద్రి గుహలో వర్ష ఋతువు నాల్గునెలలు నివసింపబూనుట- సీతావిరహ శోకమును
రామునకు లక్ష్మణుడు శమింపజేయుచుండుట.

తే. అటుల సుగ్రీవు డభిషిక్తుడై పురంబు । శ్రీ జెలంగగ మరి, ప్రవేశించినంత
లక్ష్మణునితోడ కదలి యా రాఘవుడును । చేరె ప్రస్రవణాద్రిని శీఘ్రగతిని॥ 1

సీ. శార్దూలమృగసంఘసంఘుష్టవాటంబు
సింహాభికర రవావృతము సతము
నానాలతాగుల్మనవతృణ గూఢంబు
బహుపాదపవితానపటలితంబు
వానర గోపుచ్ఛ వర ఋక్ష మార్జాల
సేవితం బది మహాక్షితిధరంబు
మేఘరాశి నిభంబు మేల్ శుచిజలముల
నిండి నిత్యంబుండు మెండుగాను

తే. అట్టి శైలంపు శిఖరమం దాయతంబు । గుహ మహత్తర మా రఘుకులుడు గొనియె
తమ్ము డా లక్ష్మణునిగూడి నెమ్మదిగను । వాసమొనరింప నచట నా వర్ష ఋతువు॥

తే. అటుల సుగ్రీవుతో సమయంబు సలిపి । కాలయుక్తము గొప్ప వాక్యంబు నొకటి
పలికె రఘునందనుండు తత్ భ్రాతతోడ । లక్ష్మణునితోడ లక్ష్మివర్ధనునితోడ॥

తే. రమ్య మీ గిరిగుహ విశాలమ్ము చూడు । యుక్తమారుతమును జూడు మోయి
వత్స !
ఇచటనే యుండ మింక సౌమిత్రి మనము । అరివిమర్దన ! వర్షరాత్రంబులెల్ల ॥

ద్వి. గిరిశృంగ మిది రమ్య మరయ నుత్తమము।శిలల తామ్ర వినీల శ్వేతాం[illegible]ముల
మరియు, నానాధాతుమండలంబులను । నెనరౌను మరి దరీనిర్ఝరంబులను
చారుచిత్రలతావృతారామములను । వృక్షమండంబుల వింతగా దోచు
నానావిహగసంఘనాదంబు లెసగు । ఖర మయూరారవ కలకలంబొప్ప
మాలతీ కుంద గుల్మంబుల తరుల । సింధువార కురంట శింశు పాశోక
సర్జార్జున కదంబ భూర్జరంబులను । పుష్పగుచ్ఛంబుల పొల్పుగా దనరు
నళిని యియ్యదియునులలితమై తోచు । ఫుల్లపంకజశోభ లెల్లెడనొప్ప
రమ్యంబు నాఁతిదూరంబును నౌను । ఈగుహ కిదె చూడు నృపవరాత్మజుడ॥

తే. ప్రాగుదక్ప్రవణంబున పారజూడ । సాధువుగ దోచు గుహయిది సాధుహృదయ!
పోల్చిచూడ పశ్చాద్భాగ మున్నతంబు।మరి,నివాతంబునై యున్న దరయుమింత॥

తే. ఈ గుహాద్వారమందు సౌమిత్రి! చూడు ।శిల శుభంబును కడు సమతలము గలదు
సుందరంబును నాయతం బెందు జూడ । మహిని భిన్నాంజనచయోపమాన
మోయి॥ 13

తే. తాత ! గిరిశృంగ మిద్ది యుత్తరము శుభము । మరియు, భిన్నాంజనచయోప
మానమగును
రమ్య ముత్థిత మంభోధరంబు మాడ్కి। గానవచ్చెడు చూడు లక్ష్మణకుమార!"

తే. ఇంక, దక్షిణదిశ నైత మిదియు జూడు । గానవచ్చెడు శ్వేతమై ఘనభుజుండ
అహహ ! కైలాసశిఖరప్రఖ్యంబు నగుచు । వివిధధాతువిభూషితవిభవమగుచు॥

తే. నదిని ప్రాచీనవాహిని నరయు మిచట । గుహకు తూర్పుగ బారుచు కలుష
లోటు
భృశ మకర్దమ మిది చూడు విశదయశుడ । అట, త్రికూటాన జాహ్నవి వోలె
నిచట॥ 15

సీ॥ తిలక చంపక సాల తిమి శాఁతిముక్తక
తిరిట్ల, తమా, లామ్ర, సరళ, వకుళ
వానీర, హింతాల, పద్మ, శాశోకాచ్ఛ
కృతమాల, ధవ, వేత్ర కేతకాది .

తీరజ బహువిధ భూరుహాతతితోడ
ఎందు నెందునుజూడ నందమగుచు
వర వసనాంచితాభరణ సమేత యౌ
ప్రమద యలంకృతభాతి దాని
శతసంఖ్యలౌ పక్షిసంఘాతంబుల
అన్యోన్యమనురక్తులైన యట్టి
చక్రవాకంబుల సమలంకృతంబులై
హంససారససేవితంబులైన

తే. పుళినముల జూడ నతిరమ్యముగను నొప్పి । తరుణి సర్వవిభూషిత కరణి మరియు
హాసమొనరించు నారి నా యలరు దాని । చూడు మీ నది లక్ష్మణా చూడ్కు-
లలర॥ 21

తే. ఒకట నీలోత్పలంబుల నొప్పులొలుకు। ఒకట రక్తోత్పలంబుల హొయలుగులుకు
కుముద కుట్మలముల దివ్య కుసుమములను। వెలయునొక్కట తెల్లని కలువగములు॥

తే. బహుళ పారిప్లవశతంబు లహహ చూడు। బర్హిణక్రౌంచనాదముల్ బరగు వినుము
సౌమ్య! రమణీయ మీ నది సంతతంబు। దివ్యమునిసంఘ సేవితం బవ్యయంబు॥

తే. చూడు చందనవృక్షాల సోలుపులను । సురచితంబుగ నిచట దోచును కుమార!
కకుభ వృక్షాల పంక్తులున్ గానవచ్చు । కనుము, సమముగ కోరిపెట్టిన విధాన॥

తే. కను, మహో! యీ ప్రదేశంబు ఘనభుజుండ । సురమణీయంబు పో శత్రు
సూదనుండ
దృఢము క్రీడింపనౌ నిట హృదయమలర । వత్స! వసియింత మిచటనే వర్ష
ఋతువు॥ 25

తే. ఇటకు నాఽతిదూరంబుననే, కుమార । కలదు కిష్కింధయును చిత్రకాననంబు
కరము రమ్యంబు సుగ్రీవు పురవరంబు । సుందరవనాతతంబుల శోభితంబు॥ 26

తే. గీత వాదిత్ర నిర్ఘోష లేతరి నిట । వినబడుచునుండు నప్పురంబునను నుండి
అల్ల నర్దించు వానరతల్లజులయు। మరి, మృదంగాదులయు ఘోష ఝురుఝుఝుండ॥

తే. పడసి భార్యను కపివరుం డొడపకింక। పొంది రాజ్యంబు; సుహృదుల పొందునొంది
ధ్రువము, నందించు సుగ్రీవు డవని నకట । మరి, మహోత్తరశ్రీ[illegible] కరము
జెంది॥ 28

తే. ఇటుల వచియించి రాఘవుం డట వసించె। లక్ష్మణునిగూడి గిరిని ప్రస్రవణమందు
వివిధ దృశ్య దరీ కుంజ విసరములను। బహు లతాగృహ పుంజ సంపన్నములను॥

తే. సుసుఖమయ్యు, బహుప్రన్య జుష్టమయ్యు। ఆ గిరి వసించు రాముని కల్పమైన
సుఖము దోపదు హృతమైన క్షోణిసుతను। ప్రాణములకన్నమిన్న భార్యను
స్మరింప॥ 30

తే. మరి, విశేషించి యుదయాద్రిదరిని దోచు। తత్శశాంకుని జూచిన దాశరథికి
నిద్రసుంతయురాదు హా నిశలయందు। శయనగతునకు తద్గిరసానువులను॥ 31

తే. ఉబుకుశోకాన సతము బాష్పపహతుని। జూచి శోకపరాయణుశోచ్యమాను
తుల్య దుఃఖుండు సౌచు తద్దుఃఖ ముడుప। పల్కె నన్నకు లక్ష్మణస్వామి యిటుల॥

తే. ఉడుగు వ్యథనొందుటింక వీరోత్తముండ। కాదు యుక్తము నీకు శోకంబు వడుట
వ్యసనగతునకు చెడును సర్వార్థములును। తెలియు నిది నీకు, నే జెప్పవలెన యన్న॥

తే. అన్న ! నీవు క్రియాపరుండవు ధరిత్రి। నాథ! దైవపరాయణుండవును నీవు
పరమ ధర్మైకశీలుడ వాస్తికుడవు। మరియు, రాఘవ! వ్యవసాయమతివి నీవు॥

తే. ఇట్టు లవ్యవసితుడ వౌ దేని దేవ। శత్రువు జయింప నెట్టుల జాలుదీవు ?
మరి, విశేషించి విక్రముం డురుబలుండు। కుటిలుడైనట్టి రావణు గూల్తు వెట్లు?॥

తే. ధృతి సమున్మూలమొనరింపు దుఃఖమెడద। స్థిరము వ్యవసాయమొనరింపు
శీఘ్ర మింక
దాన నిర్మూలమొనరింపు మానుపాదు। రావణాఘము సపరివారంబుగాగ॥ 37

తే. రాఘవ ! ససాగరవనాచలంబు పృథివి। లీల పరివర్తమొనరింపజాలు దీవు,
ఇంక రావణుగూల్చు టదేమి లెక్క। దేవ ! కాకుత్స్థ! నీకు పృథ్వీకళత్ర !॥

తే. ఇలకు నిదియె ప్రావృట్కాల మేగుదెంచె। ధృతి శరత్కాలమునకుగా వేచియుండు
పిదప సగణంబును, సరాష్ట్ర ముదిత తేజ! । రావణు వధింతు వీవు సంగ్రామమందు॥

తే. ఇదె, ప్రసుప్తంబు నీ వీర్య మిచట దేవ। నేను మేల్కొల్పు దింతియే భానుతేజ!
క్రమత దీప్తాహుతులచేత కాలసరణి। భస్మసంఛన్నమైనట్టి వహ్ని కరణి॥ 40

తే. లక్ష్మణుని వాక్య మద్ది భద్రంబు హితము। కాలయుక్తంబు నెడద దా గౌరవించి
సుహృదు స్నిగ్ధుని తమ్ముని జూచి యపుడె। పలికె రాఘవు డిట్టుల పటుతరముగ॥

తే. స్నిగ్ధ డనురక్తుడు హితుండు స్నేహితుండు। సత్యవిక్రమయుక్తుండు సౌమ్య! వత్స!
ఏది చెప్పంగదగు దానినే, కుమార। చెప్పితివి నాకు లక్ష్మణా యొప్పిదముగ॥

తే. సర్వకార్యావసాగరం బుర్వి నెంచు ! విడిచివైచితి శోకంబు నెడద నిపుడె
అప్రతిహతంబు విను విక్రమాదికముల । తేజమును దాల్చి తిరిగి నాయోజ
మెరయ॥

తే. ధృతి శరత్కాలమునకుగా వేచియుండు । ఉంచు నీమాట చొప్పున నోపియింక
మదిని సుగ్రీవునియు శరన్నదులదైన । తత్ప్రసాదంబుకై యెదు నరయు చిటనె॥

తే. వీరు డెప్పుడు విను ముపకారి కిలను । మరల మేలును సేయకమానడోయి
క్షితిని నకృతజ్ఞు డప్రతికృతుడు జనుడు । ధ్రువము నొప్పించు సత్త్వవంతుల
మనంబు॥ 45

తే. అంత లక్ష్మణు డా మాట లాలకించి । అంజలి ఘటించి యా పల్కు నాదరించి
రాము స్వభిరామదర్శను బ్రేమజూచి । పలికె తెలియంగ నాత్మభావమ్ము శుభము॥

తే. అన్న ! సీతోడ నన్న యట్లచిరమున నె । సలుపు నీయాప్సితము నెల్ల సవితృసుతుడు
ధృతి శరత్తుప్రతీక్షింపు రిపుని నోంప । ఉర్వీప ! జలప్రపాతంబు నోర్వు మిద్ది॥

ద్వి. నియమించి కోపంబు నీవింక దేవ । వేచియుండుము శరద్వేళకై నాథ !
నెలలు నాల్గే యింక నెట్టులో యన్న । నెట్టుము నాతోడ నీఘట్టమందె
వసియింపు మీ సింహవన్య సేవితము । పర్వతం బిచటనే ఉర్వీశ ! మదిని
శత్రువధంబందు సర్వోద్యమంబు । వదలక ధృతిబూని వసుధేశ ! రామ !॥

27 వ సర్గ సమాప్తి :— (1,117)

★

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధా కాండము

### ఇరువది ఎనిమిదవ సర్గః— (౨౮)

రాముడు తన విరహావేదనచే వర్షఋతు వర్ణనాపదేశమున లక్ష్మణునకు జెప్పుకొనుట.

తే. అటుల వాలిని వధియించి యర్కసుతుని । సఖుని పట్టాభిషిక్తుగా నిక నొనర్చి
మాల్యవంతంబునందున్న మనుజవిభుడు। రాము డిటుబల్కె లక్ష్మణస్వామితోడ॥

తే. మనము సమయంబు నటు సల్పుకొనినయట్టి। కాలము జలాగమంబిదె కడగివచ్చె
చూడుము నభంబు నీ వదే చోద్యమాయె । మేఘములనిండె గిరిసన్నిభౌఘములను॥ 2

తే. తపనుని గభస్తితతి సముద్రముల రసము । ద్రావి నవమాసములను గర్భంబు దాల్చి
మించి యాకసమదె ప్రసవించు చూడు । తద్రసాయన మెల్లను ధాత్రిదనుప॥

తే. మేఘసోపానపంక్తుల మిన్ను నెక్కి । ప్రీతి కుటజార్జునాది మాలికల చేత
దివి దివాకరు నిక యలంకృతి నొనర్ప । శక్య మౌనట్లు దోచు నీ జగతిజూడు॥

తే. తామ్రముల సాంధ్యరాగోత్థితాభ్రములను । అంతముల జూడ నిక పాండురాధికముల
స్నిగ్ధజలదపటచ్ఛేదబద్ధమైన । వ్రణ మనగ దోచుచుబో అంబరంబుజూడు॥ 6

తే. మందమారుతనిశ్వాసమొందు గనగ । రమ్యసాంధ్యాచ్ఛచందన రంజితంబు
వెలుగు నాపాండు జలదంబు వింతజూడు। అల్ల కామాతురుండు నా యంబరంబు॥

తే. ఇదియె ఘర్మపరిక్లిష్ట మిచట జూడు । పుడమి నవవారిసంపరిప్లుతయు నగుచు
ధరణిజయు నాగ శోకసంతప్తయగుచు । విడుచుచున్నది బాష్పముల్ విడువ కకట॥ 7

తే. భూరి మేఘోదరవిముక్తములను నింక । విమలకల్హారసుఖశీతలములు నౌర
వాయువులు డోసిళులతోడ బట్టి త్రావ । శక్యమగు నిట కేతకీసౌరభములు॥ 8

తే. ఇదియె ఫుల్లార్జునంబు శైలేంద్ర మోయి । స్వచ్ఛకేతకితతి నధివాసితంబు
అల్ల శాంతారి సుగ్రీవు డట్టు లిచట । ధరణి నభిషిక్తమగు నహో ధారతతుల॥

తే. మేఘకృష్ణాజినంబుల మేనదాల్చి । వితతధారల యజ్ఞోపవీతలు నయి
మారుతాపూరిత గుహాళి మరియునొప్పి। వరలు ప్రాధీతములునాగ పర్వతములు॥

తే. అల్ల విద్యుల్లతలతోడ నంబరంబు । మరియు నంతస్తనితఘోష సరణి నరయ
హైమకశలన తాడితంబై భృశంబు । వేదనన్ బొందుచున్నట్టి విధముదోచు॥

తే. నీలమేఘాశ్రితం బగే నింగి జూడు । లత చలించెడు వైద్యుతం బతిగ వత్స!
వణకి రావణు నంకాన పెనగులాడు । వగ తపస్విని సీత నా మదికి దెచ్చు॥

తే. ఘనపటలి యిట్లు దిశలెల్ల గానకుండ । గ్రమ్మ నష్టగ్రహానిశాకరంబునగుట
మన్మథాధీనులైనట్టి మనుజుల కిక । కరము హితమౌను గాదె లక్ష్మణకుమార॥

తే. గిరితటంబున కుటజంబు లరయు మొకట । పూచి వర్షాగమంబున పొంగి మిగుల
బాష్పసంరుద్ధులై నాకు బాధితునకు । కామసందీపన మొనర్చు; నేమి సేతు?॥

తే. రజముశాంతించె; గాలిచల్లనగ నయ్యె । పాసెనునిదాఘదోషంబు వసుధ కెందు
నిలిచె పో దండయాత్రలు నృపతులకును। చేరుకొనుచుండిరి ప్రవాసు లిండ్ల కింక॥

తే. తరలె మానసవాస లుబ్ధాంశజాళి । కలిసె ప్రియలను చక్రవాకంబు లెలమి
ఎడతెగని వర్షధారల చెడినయట్టి । బాటలను బండ్లు పోవుట మానె నిపుడు॥

ద్వి. ఒక్కట వెలుగును నొకట చీకటియు । నభమొప్పె నిదె ప్రకీర్ణాంబుధరంబు
అచ్చటచ్చట శిలోచ్చయ సంనిరుద్ధ! శాంతమహార్ణవం బెంతయు బోలి॥
సర్జకదంబపుష్పౌఘసమ్మిశ్ర । జలము నవంబిది శైలధాతువుల
తామ్రమై కేకరుతాళుల నొప్పి । శైలాపగలబారు చాలశీఘ్రముగ
రసవంతముల భృంగరాజతుల్యముల । జంబూఫలంబుల సంప్రీతి దిందు
పవనావధూతముల్ బహుళవర్ణములు । వసుధ విపక్వముల్ పడెడు నామ్రములు
విద్యుత్పతాకముల్ వితతబలాక । సితమాలలన్ గిరిశిఖరోన్నతములు
సముదీర్ణ నాదముల్ జలదముల్ మ్రోగు। సంయుగస్థిభముల్ సమదముల్ నాగ
వర్షోదకంబుల నాప్యాయితముల । శాద్వలంబుల నిండి సంతుష్టమతుల
నృత్తోత్సవంబుల నెమళుల గముల । నిర్వ్యాప్తజీమూతబృందసంతతుల

చూడు వనంబులు శోభించు మిగుల । అపరాహ్ణముల జాల సంపదమ్మెల్లెడల॥ 21
సలిలాతిభారంబు సోకియు నోసి । అవె బలాకినము లా యభ్రముల్ మొరసి
మరి, మహత్తరము లా గిరిశృంగ తతుల। నిలిచి నిల్చియు బోవు నంసటుల్ దీర॥
మేఘాభికామముల్ మేల్ బలాకాళి । తరము సంతసమున దిరుగ నభ్రాళి
వాతావధూతంబు పౌండరీకంబు । లంబమాలగ దోచు నంబరంబునకు॥
బాలేంద్రగోపచితాగ్రల నెల్లెడల । భువి యిదె భాసించు నవశాద్వలముల
శుకహారిప్రభల లాక్షోక్షిత స్థలుల । కంబళిదాల్చిన కల్కియన్ లీల॥ 24
నిద్రమెల్లన జేర్చు నీశు కేశవుని । నదులు వేగము జేరు నదనదీపతిని
కొక్కెర లిక జేరు కోరి తోయదుని । కాంతలు మదవతుల్ కలియుదుర్
ప్రియుని॥ 25
నెమళు లాడగ వచ్చె నెల్లెడ వనుల। పూలు పూయగ జొచ్చె భువి కదంబముల
అదె యెద్దావులవెంట నాబోతు బడియె। వసుధయు పైరుతో పసగ గట్టబ్డియె॥
వర్షించు, గర్జించు, ప్రవహించు, మించు। ధ్యానించు, నటియించు, నదె నెమ్మదించు
జలదముల్ మదకరుల్ జలనదుల్ వనులు। విరహులు శిఖులును హరిపుంగవులును
మొగలిపూవులతావి మూజూచి మించి । వన నిర్ఝరంబుల మదకరీంద్రములు.
అంబుప్రపాతశబ్దాకులితంబు । లౌచు గర్జించు కేకాళులన్ గూడి॥
ధారానిపాతాభిహన్యమానంబు । రహి, నీపశాఖావిలంబమానంబు
సుమ◆కౌసుమావగాఢము తృణార్జితము। మదము వెల్లన నీడు నదె భృంగచయము
*అంగారఖండతుల్యంబులై మిగుల। పర్యాప్త రసములై ఫలము లెల్లెడల
జంబూద్రుమంబుల శాఖల నిండ । తుమ్మెద పింజు నా దోచు నీ దండ॥
సౌదామినీ పతాకాలంకృతములు । ఘోరగంభీరోద్భుతా రవౌఘములు
వెలయు వలాహకబృందముల్ చూడు । రణసముద్యమకుంజరంబులు నేడు॥ 31
గిరివనాంతరమున కరుగంగ దరలి । బాటబోవుచు వెన్క పటుమేఘరవళి
విని ప్రతికరిశంక వెన్కకు దిరిగె । రణకాంక్ష మత్తవారణ మదే యరరె॥ 32
తుమ్మెదవ్రాతల గ్రమ్మియు నొకట। నెమళులనృత్యాల నెగడియు నొకట
వారణేంద్రంబుల ధారల నొకట । వన మనేకాశ్రయం బన దోచు నికట॥ 33
సర్జార్జునకదంబ కుట్మకందళముల । నవవారి పూర్ణమై భువి వనస్థలుల
మదకేకి రుతములు మరి నృత్యగతుల । ఆపానభూమి నా నొయ్యె నెల్లెడల॥ 34

◆ 1 కౌసుమము = మకరందము.

* 2 అంగారఖండము = (నల్లని) బొగ్గు.

ముక్తా సకాశముల్ మొగిళుల నుండి। పత్రపుటంబుల బహు నిర్మముల
దాృవు తుష్టి సురేంద్రదత్తోదకములు। తృషితముల్ బహువర్ణ విహగముల్
చదల॥ 35

షట్పాదనాదంబె సత్తంత్రిగాగ। కప్పలమోత్రయే కంఠ తాళముగ
మేఘగర్జనములే పృథుమృదంగముగ। వని నిట సంగీత మన దోచె సరిగ॥ 36

గీ. ఆడెడుకొన్నిట నరచెడు కొన్నిట। వృక్షాగ్రంబుల నిలచెడు కొన్నిట
వ్యాలంబాంచిత బర్హాలంకృత। కేకుల వని సంగీతంబొప్పెన్॥ 37

ద్వి॥ చిరసన్నిరుద్ధంబు మరి నిద్రవీడి। కప్పలు మేల్కాని ఘనమేఘ రవళి
బహువిధాకృతిరూపవర్ణ నాదముల। అరచు నవాంబుధారాహతంబు లను॥ 38
శీర్ణతటంబుల జెచ్చెరదోసి। జలపూరమున దేలు చక్రవాకముల
భువి నవప్రాభృతపూర్ణ భోగముల। వడి స్వభర్తను జేరు దృప్తముల్ నదులు॥
నీలమేఘంబుల నీలమేఘములు। నవవారిపూర్ణంబు లవియె సక్తములు
దవదగ్ధ గిరులందు దవదగ్ధగిరులు। బద్ధమూలంబులై వరలెడు నటులు॥ 40
కెరలినదించెడు కేకాంతరముల। శక్రగోపాకులశాద్వలస్థలుల
సరస నీ పార్జున సంవాసితముల। తిరుగు నేస్తులు రమ్యతర కాననముల॥ 41

నవజలధారాభిహత కేసరముల। వడి వీడుచు సరోరుహాళి నెల్లెడల
ఇక, సకేసరము లా నీపపుష్పముల। పడు నవంబుల పొంగి భ్రమరముల్ వమల॥
అదె, గజేంద్రముజూడు మదమెక్కె నోయి।ఇదె, గజేంద్రముజూడు ముదమందె
నోయి
వని, మృగేంద్రము విశ్రమమునొందె నోయి। మరి, నగేంద్రము రమ్యతర
మయ్యెనోయి
ధర, నరేంద్రులుయాత్ర విరమించి రోయి। దివి, సురేంద్రుడు నంబుభృతి
నాడునోయి
భువి సముద్ధూత సముద్రనాదములు। గగనావలంబముల్ ఘనసంచయములు
నదుల తటాకాల నదె సరంబులను। మహియెల్ల ముంచెత్తు బహుజలంబులను॥
వర్ష ప్రవేగంబు పడు విపులంబు। సముదీర్ణ ఘోషంబు శ్వనంబు వీచు
ప్రవినష్టకూలముల్ ప్రవహించు వేగ। నదులు మార్గముదప్పి నవజలౌఘముల॥
రహి నగేంద్రము సురేంద్రప్రదత్తముల। అనిలోపనీత ఘనాంబుకుంభముల
నరులచేత నరేంద్రు కరణి నీ వనుల। అభిషిచ్యమానమై యలరు స్వప్రభల॥

గగనంబును సతార మగుపడకుండె । భాస్కరదర్శనం బబ్బకయుండె
వవజలౌఘంబులు భువినెల్ల పారలు । ఘన తమోలిప్తముల్ కనుమూసె దిశలు॥
అల, మహీధరకూటములు మహోచ్ఛ్రములు । ధారాభిధౌతముల్ తద్దయు వెలయు
అవె, ప్రపాతముల మహాప్రమాణముల । వ్రేలు మౌక్తికహార వితతుల నటుల॥
శైలోపలంబుల స్ఖలితవేగములు । శైలప్రపాతముల్ ఝురు లున్నతములు
కేకసన్నాదితః భీకర గుహల । అవె వెలుంగు వికీర్యహారంబు లనగ॥ 49
విపులముల్ శీఘ్రప్రవేగముల్ ఝురులు । నిర్ధౌతపర్వతశృంగముల్ దూకి
ముక్తాకలాపముల్ బోలుచు బడుచు । జారి, మహాగుహోత్సంగాళి నిలుచు॥ 50

తే. సురత సమ్మర్దమున తెగి దొరలినట్టి । దేవతాస్త్రీల హార మౌక్తికము లనగ
తోయధారలు జాడగ దొరలి పడియె । నెందు దిక్కుల చిందరవందరగను॥ 51

తే. గూళ్ళపక్షులు వసి జేరుకొనుటకతన । అంబుజంబులు ముకుళంబు లగుటవలన
జాజిపూవులు వికసించుజాడ నరసి । తరణి గ్రుంకె నటంచును నెరుగనయ్యె॥

తే. ధర నరేంద్రుల దండయాత్రలును నిలిచె । దండు లెల్లను మరలె స్వస్థానములకు
నీరముల మార్గములు సమీకృతములయ్యె । వైరములు నట్లె శాంతించె వాన కతన॥ 53

తే. భాద్రపదమాన మరుదెంచె వసుధ కిపుడు।శ్రద్ధ వేదాధ్యయన మింక సలుప గోరు
బ్రాహ్మణాళికి సమయ మియ్యదియ వత్స।సామగానంబు వినబడు చవులునూర॥

తే. అఖిల సంచిత సంచయుం డగుచు ధ్రువము । ఇంటి వ్యాపారముల నింక నంటి మాని
ఇదియె యాషాఢి నొగి దాల్చు నింక వ్రతము।నృపతి భరతుండు కోసలాధిపుండు, వత్స॥ 55

తే. క్రొత్త నీటను నిండి యా కోసలమున । రయము సరయూనదిన్ జాల ప్రబల మగును
ఎచటి కేనియు నేగి నే నిల్లు జేర।నను గను నయోధ్యజనముల స్వన రయ మన॥

తే. స్ఫీతగుణమిద్ది యీ వర్షఋతువునందు।సుఖము సుగ్రీవు డొందు నస్తోకముగను
అతడు విజితారియు సదారు డగుట మరియు । నిజ మహత్తర రాజ్యాన నిలిచి యుంట॥ 57

తే. నేనొ హృతదారుడను మహానృపపదంబు। రాజ్యముననుండి చ్యుతడనై రాపు
జెంది
అన్న ! కూలుచునుంటి సంక్లిన్నమైన। ఘననదీకూలమనుభంగి ఘనభుజుండ !॥

తే. శోక మిది నాది విస్తీర్ణమెా కృపాళు; । వర్షఋతువును దుర్గమం బనగదోచు
రావణుండును గొప్పశాత్రవుడు సుమ్ము; । మూడు నివ్వి యపారముల్ చూడ
నాకు॥ 59

తే. దండయాత్రకు నిదిగాదు తరియటంచు।మార్గములు నింక కడు దుర్గమంబులంచు
సీతకై యత్న మిప్పుడే సేతునంచు । రహిని సుగ్రీవుడనగ వల్దంటి నేనె॥ 60

తే. అతడు బహుకష్టములబడి చితికినాడు । కలిసె భార్యను నెటొ చిరకాలమునకు
నాదుకార్యంబు తేలికలోది కాదు । కాన, నడుగంగనైతి నా కార్యమిపుడె॥

తే. విశ్రమమునొంది, మరి శరదృతు వెరింగిరి । స్వయము సుగ్రీవుడే నాదు పని
నొనర్చు;
ఎరుగు సుగ్రీవు డుపకార మెడదలోన। సంశయములేదు దీన లక్ష్మణకుమార॥

తే. కాన, నిక వేచియుండు తత్కాలమునకు।లక్ష్మణా! శుభలక్ష్మణా! యద్రి నిచట
మదిని సుగ్రీవునియు శరన్నదులదైన।తత్ప్రసాదంబుకై మెాదు రరయు చెటులొ॥

తే. మీరు డెప్పుడు విను ముపకారి కిలను । మారు మేలును సేయక మానడోయి
క్షితిని నకృతజ్ఞు డప్రతికృతుడు జనుడు । ధ్రువము నొప్పించు సత్త్వవంతుల
మనంబు॥ 64

తే. అంత, లక్ష్మణు డా మాట లాలకించి । అంజలిఘటించి యా పల్కునాదరించి
రాము స్వభిరామదర్శను ప్రేమజూచి।పలికె తెలియంగ నాత్మభావమ్ము శుభము॥

తే. అన్న ! సీతోడ నన్న యా ట్లచిరమునునె।సలుపు నీయాప్నితము నెల్ల సఖుడతోండు
ధృతి శరత్తు ప్రతీక్షింపు రిపుని నొంప । ఉర్విప ! జలప్రపాతంబు నోర్చు మిద్ది॥

28 వ సర్గ సమాప్తి :— (1,183)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఇరువది తొమ్మిదవ సర్గ:— (౨౯)

వర్షాంతము— రామకార్యమునకు వెంటనే బూనుకొనుమని హనుమంతుడు సుగ్రీవుని హెచ్చరించుట.
కపుల సమావేశమునకై సుగ్రీవుడాజ్ఞనిడి, అంతఃపురము బ్రవేశించుట.

సీ. విమలంబు వ్యోమంబు విగతవిద్యుద్వలా
హకము, సారసరవసకలదిశము
శుభ్రంబు రమ్యంబు జ్యోత్స్నానులేపనం
బరసి; సమృద్ధార్థు హరిగణేశు
మందధర్మార్థసంగ్రహుజూచి సుగ్రీవు
కము నసన్మార్గు నేకాంతచిత్తు
సతతంబు ప్రమదాభిరతుని సిద్ధార్థుని
నిర్వృత్తకార్యుని నుర్వీపతిని
కోరిన వెల్లను కొల్లగాబడసిన
కడు కృతార్థుని గతకష్టదశుని

తే. ప్రియను నిజపత్ని "రుమ"ను, నభీష్టమైన । తారనున్ గూడ బడసి సంతతము దివా
నిశి, యహోరాత్రములును నప్సరల గూడి । నందనంబున క్రీడించునమరవిభుని
పోల్కి—మన్మట్టి వానిని పోల జూచి.

సీ. మంత్రులపైన సమస్తకార్యము లుంచి
వారేమి చేసిరో యరయ కెపుడు

రాజ్యవిషయముల రానీక మది కెప్డు
కామతంత్రములందె గడపుచుండ
అర్థతత్వజ్ఞుండు హనుమంతు డారసి
ప్రభుని సుగ్రీవుని పజ్జ కరిగి
కాలధర్మంబుల గల విశేషంబుల
నెరిగినవాడౌట నెనరు దోప
మధురంబును మనోరమంబును హేతు
బద్ధంబును నైన వాక్యముల దెలిపి

తే. సామధర్మార్థనీతి సంచయుడు బలికె। హితము తత్వము పథ్యము హృద్య మిటుల
ప్రణయ సంప్రీతియుక్తముల్ ప్రభునితోడ।అమల విశ్వాసకృతనిశ్చయంబుతోడ॥

తే. రాజ్యములభించె, యశమును రాను వచ్చె। మరి కులశ్రీయు నభివృద్ధి పరగె నింక
మిగిలె మిత్రుని కార్యమే జగతి నీకు। దాని నీవిప్డు సేయంగ బూనవలయు॥ 9

తే. ఎవడు మిత్రులయెడ కాల మెడద నెరిగి।సతము వర్తించుచుండునో సాధువృత్తి
అతని రాజ్యంబు కీర్తిప్రతాపములును। వృద్ధిబొందుచునుండు సమృద్ధిగాను॥

తే. మిత్రులును కోశమును దండ మింక ధృతియు। సర్వ మెవ్వని వీడక సరసనుండు
వానికి మహత్తరంబైన ప్రభుత గలుగు।వాని రాజ్యంబు గొప్పదై వరలుచుండు॥

తే. ప్రభుడ వీవును వృత్తసంపన్నమతివి। వరలుదు నిరత్యయంబైన పథమునందు
ప్రతిన జేసినచొప్పున త్వరగ నీవు। సల్పు మిక మిత్రకార్యంబు జాగి కేల॥

తే. అన్నిపనులను వదలి మిత్రార్థ మెవడు। ఆదరంబున మరియు, నుత్సాహమునను
అధిప! వర్తించు నాతనివైన పనులు। చెడ వనర్థంబులన్ జెంది పుడమి నెందు॥

తే. ఇక, సకాలాన పనిని సేయకయు, పిదప।మిత్రకార్యంబు తరుణంబుమించి సేయ
గొప్ప జేసియు నెంతయు మెప్పుగాదు। మిత్రునకుకూడ గల్గదు మే లొకింత॥

తే. మిత్రకార్యంబె మనకిప్డు శత్రుహంత! । వీరకార్యంబు నగుసుమ్ము వేయు నేల
కడగు మిప్పుడ రాఘవు కార్యమునకు। నడపు వైదేహి పరిమార్గణంబు నింక॥

తే. అరయ నిపుడె కాలాతీతమయ్యె చాల। అయిన నిను తొందరింపక నాగియుండె
రామచంద్రుండు వినుము కాలజ్ఞుడయ్యు। మరియు త్వరమాణుడయ్యు నీ వశగు
డగుట॥ 17

తే. దీర్ఘబంధుండు రాముండు దేవ! మనకు। కులసుసంవృద్ధిహేతువుగూడ గాదె
అప్రమేయప్రభావుండు నగును సుమ్ము। భూరిగుణముల నప్రతిముండు స్వయము॥

తే. అతనికార్యంబు నొనరింపు మధిప! త్వరగ। ముందు నీకార్యమునొనర్చె పూని యతడు
ఇక, హరీశ్వర! దేవి వైదేహి వెదుక। మన హరిశ్రేష్ఠులకు నెల్లబనుపు మాజ్ఞ॥

తే. మనల నాతఁడు హెచ్చరింపక యున్న।మనమె పనిబూన దోషమబ్బదుగ మనకు
ఎచ్చరించిన పిదపైన నింక మనకు। ధ్రువము కాలవ్యతిక్రమ దోషమబ్బు॥

తే. వసుధ మేలొనరింపనివానికేని। మేలుసేయుదు వీవు స్వామీ! హరీశ
ఇంక రాజ్యంబు ధనము నీకిచ్చినట్టి। రాము కార్యంబు సేయుదం కేమిలెక్క॥

తే. వానరర్క్షగణేశ్వర! వాస్తవముగ। దాశరథి కింక సంప్రీతి దగ నొనర్ప
శక్తియుతుడవు మరి, వీర్యయుక్తుడవును। ఏల యాలస్యమొనరింతు విడగ నాజ్ఞ॥

తే. వలసినట్లైన శరముల బరపి నిజము। మరి సురాసురయక్షకిన్నరుల నైన
వశము నొనరించుకొనజాలు ప్రభు డతండు। అయిన నీదగు ప్రతినకై యాగు నంతె॥ 28

తే. ప్రాణములకు తెగించియు పూని నిజము। ప్రియము నీకొనరించె సూమిత్రు డతడు
అతని ప్రియసతి వైదేహి నందర మిక। పృథివి యంబరమెల్లను వెదుకవలదె॥

తే. అమరు లసురులు యక్షులు నైనగాని। మరి, మరుద్గణములుగాని యొరులుగాని
అతని కొనరింపలేరు భయంబుసుంత। ఇంక, రాక్షసు లొనరింతురే భయంబు॥

తే. అట్టి పటుశక్తియుక్తున కవనిపతికి। ప్రియము మును నీ కొనర్చిన మిత్రమణికి
సర్వవిధముల ప్రియ మింక సలుప నీకు। తగును సుగ్రీవ! పింగేశ! దాశరథికి॥

తే. వినుము పాతాళమునగాని మింటగాని। జలధులఁగాని భూబిలంబులనుగాని
తిరుగ వెరువరు కపుల నొక్కరుడు గాని।రూఢి నీయాజ్ఞనైన మా లోన దేవ!॥

తే. అప్రధృష్యులు కోటులు హరులు గలరు। దేవ! నీవశమందు; సందియ మి కేల
ఎవ్వ డేపని నీకుగా నెచట నెపుడు। సేయవలయునొ యాజ్ఞల సేయు మధిప॥

తే. అతని వచనంబు కాలయుక్తత నెరింగి। పూని చక్కగ జెప్పిన దాని వినుచు
సత్త్వసంపన్ను డా హరిసత్తముండు। లెస్స మది సేయ నెంచె సుగ్రీవు డపుడు॥

తే. నీలు, నిత్యకృతోద్యమశీలు, సుహృదు।అభిమతుని నంత బిలిచి తా నాజ్ఞ జేసె
సకలదిక్కుల నున్నట్టి సైన్యములను। నెల్ల సమకట్టి పురికి రావింప విభుడు॥ 30

తే. నాదుసేన సమగ్రంబు నాదు బలము। యూథపాలురు నెల్లరు నోజ మెరయ
శీఘ్ర మిచ్చటి కిక వచ్చి చేరునట్లు। ఉగ్రసేనాగ్రణీ! సేయు మోయి నీవు॥

తే. కపులు, వ్యవసాయమతులు శీఘ్రగులు ఘనులు। అంతపాలురు త్వరగ నా యాజ్ఞ నెసగి
కూర్చుదురుగాక సేనల గుముల నెల్ల। చెంత సేనల నీవె వీక్షింతు గాక॥ 32

తే. వినుము, పదునైదుదినములు జనుటతోన। తిరిగియిచటికిచేరని హరుల కెల్ల
కఠినదండము ప్రాణాంతికంబు గలుగు। ఇక, విచారణలేదు పో యిందుగురిచి॥

ద్వి. హరుల వృద్ధులకెల్లత్వరగ నీవరిగి। సాంగదుండవు నౌచు సత్త్వరం బేగి
తిరు గింక లేని నా తీవ్రంపు టాజ్ఞ। ఎరుగజెప్పు మటంచు నిడియు దా నాజ్ఞ
హరిపుంగవేశ్వరుం డరిగె వేగంబు। వీర్యవంతుం డల్ల వేశ్మాంతరంబు॥ 34

29 వ సర్గ సమాప్తి :— (1,217)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పదియవ సర్గ:— (30)

శరదాగమనము - రాముని విరహము - సుగ్రీవుడు యింకా రాకేవని రాముని కోపము.

తే. గుహను సుగ్రీవు డటు జొచ్చి కులుకుచుండ। గగనమును నంత ఘనవిముక్తంబు నగుట
వర్షనిశలును గడచిపోవంగ నెటులో । కామశోకంబులన్ జిక్కె రామవిభుడు। 1

తే. పాండురం బల్ల గగనంబు పార జూచి । విమల మదె చంద్రమండలం బెలమి గాంచి
మరియు జ్యోత్స్నానులేపనంబైన యట్టి । రజని శారది నరసి యా రామవిభుడు

తే. కామవృత్తుని సుగ్రీవు నేమొ తలచి । నష్ట జనకాత్మజను నెంచి నవసి నవసి
కాలము నతీతమగుటను క్రమత దెలిసి । పుడమి పరమాతురుండు మోహమూర్ఛ వడియె। 3

తే. అంత తెలివొంది యెట్టులో కొంతవడికి । మరల మతిమంతు డా రామధరణి విభుడు
నిజమనస్థయెయైన యా నీలవేణి । సీత వైదేహికై యిట్లు చింతవడియె। 4

తే. హేమధాతువిభూషితం బా మహాద్రి । శిఖరమున గూర్చుండి యా క్షితివిభుండు
శారదం బల్ల గగనంబు పారజూచి। మనసు ప్రియురాలిపై బార మరియు నవసి। 5

తే. చూచి విమలంబు వ్యోమంబు సుందరంబు। విగతవిద్యుద్వలాహకం బెలమిగాంచి
సారసారవసంఘుష్ట మౌర యరసి । కడు విలాపించె నార్తవాక్యముల విభుడు। 6

తే. సారసారవనాదిని సారసాక్షి । సారసారవసన్నాద సరణి మున్ను
గ్రీడ లాశ్రమమందున నాడు బాల । అకట నాసీత క్రీడ లెట్లాడు నింక 7

తే. నిండు బంగారు కాంతుల నేల నిండి । పూచి యుండిన వేగిసపూల జూచి
నాల్గు వంకల జూచియు నన్ను గనమి । బాల రమియించు నెట్టుల గోల సీత॥8

తే. సీత కలభాషిణి మదీయచిత్తహారి । చారుసర్వాంగి సుకుమారి సారసాక్షి
మున్ను కలహంస నిస్స్వనంబులను జేసి । మేలుకొనుచుండు; నిపు డెట్లు మేలు
కొనునొ।9

తే. ప్రీతిఁ జెంగట సతము చరించుచుండు। చక్రవాకంబు లిచ్చు నిస్స్వనము వించు
పుండరీకవిశాలాక్షి పొలతి సీత । ఎటులజీవించు చెంత న న్నింతి కనక॥ 10

తే. నదుల, కొలకుల, ద్రోనల, కాననములందు । ఝరుల, వనముల నెంతయు
దిరుగుచున్న
సీత మృగశాబకాక్షి నా చెంత లేమి।సుఖము లభియింపకుండె హా! సుంతనాకు॥

తే. మద్వియోగార్త యని, సుకుమారి యనియు।శరది నిప్పుడు పరిపూర్ణ సాధనుండు
మన్మథుండు మహీజ నా పత్ని నకట । మిగుల పీడింపకున్న బాగగునుగాదె॥12

తే. ఏవ మాది నరశ్రేష్ఠు డా విభుండు । బహు విలాపంబుచేసె నృపాత్మజుండు
నింగిని విహంగమంబు సారంగ మల్ల।నీటికై యిందుగ్రిగురిచి గుందిన విధాన॥

తే. అంత గిరిసానువులను రమ్యముల నెల్ల । తిరిగి తిరిగి ఫలార్థియై మరలి వచ్చి
కాంచె లక్ష్మియుతుండు లక్ష్మణుడు నెదుట । రాము నగ్రజు విలపించు కామ
వివశు॥ 14

ద్వి. దుఃఖంబునను కటా దుస్సహంబునను । గురు పరీతుని విసంజ్ఞుని విజనోర్వి
నేకాకి గని పల్కె నిటుల మనస్వి । అన్న విషాదాన ననుజుడున్ గుంది॥ 15

ద్వి. కామునివశుడవౌ టేమి కార్యంబు? పౌరుషంబుడుగు టేపాటిఫలంబు?
దృఢయోగ మిటు నివర్తించు టేగుణము? గురుసమాధిని సదా గూర్చుటే
ఘనము 17

ద్వి. క్రమత క్రియాభియోగంబును బూని । తద్ద మనఃప్రసాదంబును నొంది
ఘనము సమాధియోగానుగతంబు । కాలంబును నెరింగి, కల సహాయులయు
సామర్థ్యమును నెంచి, స్వామి! స్వకర్మ । హేతువ్రున్ దలపోసి, ఇన్నియుగూర్చి
అన్న! అదీనసత్త్వా! స్వకార్యంబు । సాధించుకొన నింక సాగుమీ దేవ!

ద్వి. నీచే సనాథమై నృపవంశనాథ! సులభ కాదయ్యె యన్యుల కిలాప్రత్రి
అగ్నిచూడం బల్ల జ్వలితంబు దాకి। దహియింప బడకుండు ఘన సహం డెవడు?

ద్వి. అపృథగ్వ్యము, స్వాభావజము వాక్యంబు । హితము పథ్యము నీతియుతము
నామంబు
ధర్మార్థసుసమాహితము సలక్షణము । లక్ష్మణుం డటుబల్క రాము డిట్లనియె-

ద్వి. నిస్సంశయ మవేక్షణీయ మిప్పనియు । అనువర్తితవ్యమే సాధనోత్కరము
ఇదె ప్రవృత్తము దురాసదము కార్యంబు । ఫలము చింత్యమె సుమ్మ వత్స!
కుమార। 20

తే. అంత పద్మపలాశాక్షి నవనిజాత । మైథిలి దలంచుకొంచు దా మనమునందు
పలికె పరిశుష్యముఖమున ప్రభువరుండు। లక్ష్మణునితోడ నప్పుడా రాఘవుండు।

తే. తృప్తినొందించి జలముల పృథివి నెల్ల । కోరి పరిపక్వమొనరించి పైరు లెల్ల
అదె సహస్రాక్షుం డా యింద్రు డమరవిభుడు । అలరి కృతకృత్యుడై యొప్పె
నరయు మోయి। 22

తే. స్నిగ్ధగంభీర నిర్ఘోష నెగడి నిగిడి । అల్ల శైలద్రుమాగ్రంబులందు దిరిగి
సలిలములవీడి మేఘముల్ చదల నడుమ। మరి, పరిశ్రాంతములునాగ నురక
నిలుచు। 23

తే. సరస నీలోత్పలచ్ఛదశ్యామములయి । శ్యామిక మొనర్చి దశదిశల్ చదల బర్వి
విమదమతాంగములునాగ మింట నిపుడు। శాంత వేగంబులయ్యె వో జలదపటలి।

తే. అంబుగర్భంబు లుగ్రవేగానిత్వములు । కమ్రములు, కుటజార్జున గంధిళములు
తద్ద చరియించి వృష్టివాతంబు లవియె । సౌమ్య! విరమించె చూడు మీ
చదల నిపుడు। 25

తే. సమదవారణములయు, ప్రస్రవణములయు, । ఘనతతులయు, మయూరసంఘా
తములయు,
వాదములు విప్లు మరి ప్రశాంతంబులయ్యె । అనఘ! లక్ష్మణ చూడుమీ యట్టి
దిశల। 26

తే. ధ్రువి, మహామేఘముల నభివృష్టములయి । చాల నిర్మముల చిత్రసానువులను
భూధరంబులు చిత్రదీప్తులను మిగుల। చూడు మనులిప్తములువాగ చూడనొప్పు।

తే. పుడమిన్ని శరన్నదుల్ తమ పులినములను। మెల్ల మెల్లగ జూపుచు మెలగు నోయి
వెలదులున్న నవసంగమవ్రీడ జేసి। జఘనములవల్లె చోద్య మీ చక్క చూడు।

ద్వి. సరస సప్తచ్ఛద తరుశాఖలందు । తారార్క-కుముదబాంధవకాంతి యందు
సమదవారణవిలాసంబులయందు । విభజించి శ్రియము దా విరిసె శరత్తు॥ 29

ద్వి. క్షితి ననేకాశ్రయచిత్రశోభలను । లలి శరత్కాల సల్లక్షణంబులను
పూసాగ్రహస్తప్రబోధితంబులను । మరి లక్ష్మి వెలిగె పద్మాకరంబులను॥ 30

ద్వి. ఏడాకుటనటిపూ లీడెడు వాసనల । షట్పదఝుంకార సరసగీతముల
ననుసరించుచు వీచు ననిలుండు వనుల । మత్తగజంబుల మదము హెచ్చించు॥

ద్వి. అభిముఖంబులు విశాలాచ్ఛపక్షములు । కమల రజోవకీర్ణములు సంఘములు
ఇవె సరఃప్రియము లీ యిసుక తిన్నెలను। చక్రవాకములు హంసలుకూడి యాడు॥

ద్వి. వారణంబుల మదపూరణంబులను । గొప్పగా దర్పించు గోబృందములను
నిర్మలజలముల నిమ్నగంబులను । బహుధా విభక్తమై ప్రభలొల్కు లక్ష్మి॥ 33

ద్వి. అభ్రవిముక్తంబు నభ్రంబు నరసి । క్రమత బర్హాభరణములను దీసి
ప్రియలపై సక్తలా విధమును బాసి । వినివృత్తశోభలై వనుల కేకులును
ధ్యానపరల్ గతోత్సవలునై యుండె॥ 34

ద్వి. బంధూకములు, హృద్యగంధముల్ పొంగి । పుష్పాతిభారాన పుడమికి వంగి
స్వర్ణగౌరము నేత్రపర్వంబుగాగ । ఉద్యోతితములు నా నొప్పు నీ వనులు॥ 35

ద్వి. లలి ప్రియాన్వితముల నళినీప్రియముల । పటు మదోత్కటముల మదలాలసముల
పారి వనరతముల పుష్పోద్ధతముల । గతులు మందములయ్యె ఘనగజోత్తముల॥

ద్వి. నభము వ్యభ్రము శస్త్రనవధౌతకాంతి। అరయ కృశప్రవాహంబు స్రవంతి
కల్హారశీతముల్ కనుము వాయువులు। మరి తమోముక్తముల్ అరయుమీ దిశలు॥

ద్వి. బీరెండ నెండిన భూరిపంకంబు । పృథివి కేగిన సాంద్ర రేణూత్కరంబు
అన్యోన్య మిలను వైరామర్షయుతుల । క్ష్మాపుల కుద్యోగ కాలంబునిదియ॥ 38

ద్వి. అవె శరద్గుణమున నభివృద్ధినొందు । రూపశోభలనొప్పి రూఢి మదించి
పాంసుసముత్క్షిత పటుతరాంగములు। యుద్ధలుబ్ధంబు లా యుక్షముల్ పొంగి
ఆలమందలమధ్య ననె అంకెవేయు॥

ద్వి. తీవ్రానురాగముల్ దివ్య మన్మథుని । మరి కులాన్వితము లా మదమందగతుని
ఆవె, కరేణులు జుట్టి యా మదాన్వితుని। భర్తనంటియు బోవు పరికింపు వనిని॥

ద్వి. వరభూషణము లాత్మబర్హముల్ విడిచి। నదుల తీరము కేగ నచట హంసములు
అవమానమునుసేయగా నన్న యట్లు । దీనలై విమదలై తిరుగు నెమళ్ళు॥ 41

ద్వి. కారండచక్రవాకంబులు బెదర । భిన్నకటంబు లౌ ద్విరదంబు లరచి
కొలకుల వికసితజలజభూషముల । కలచియు కలచియు జలములందాడ్రు। 42

ద్వి. వికలపంకములందు సికతంబులందు । ఆలమండలయందు నమలాంబులందు
సారసాండజ నాద పూరంబులందు। హృష్టలై హంసముల్ డిగు నదులందు॥43

ద్వి. నదులయు ప్రస్రవణౌఘంబులయును। పెనుగాడ్పులయు కేకి బృందంబులయును
గండశంగినయట్టి మండూకములయు। ద్రుతరవం బిప్పుడు దోచ దెంచులను॥ 44

ద్వి. నైకవర్ణంబుల నష్టకాయముల । నవమేఘధారల నవసి యెల్లెడల
బొరియల నాకట చిరకాల మకట।పడియుండి విషసర్ప పంక్తులున్ వెడలు॥ 45

తే. చంచ దిందుకరస్పర్శహర్ష వశత । ప్రకటితోన్మీలితాచ్ఛ తారకయునౌచు
అదె! యహో! రాగవతిసంధ్య యంబరంబు । స్వయము విడుచును చూడు-
లక్ష్మణకుమార॥ 46

తే. చంద్రమండలసముదితసౌమ్యవక్త్ర । తారకాగణవికసిత చారునేత్ర
రమ్యజ్యోత్స్నాంశుకప్రావరణ త్రియామ । మగువ శుక్లాంశుకావృతాంగిగ
వెలింగె॥ 47

తే. ఆరబండిన శాలిధాన్యముల మెక్కి । కులికి సారసచారుపంక్తులును నెక్కి
ఆకసంబును శీఘ్రమీచక్కి చూడు । మాల వాతావధూతంబు మాడ్కి నేడు॥

ద్వి. సుప్తైకహంసంబు శుభ్రాంబుజంబు । స్వచ్ఛహ్రదస్థంబు సలిలంబు వెలుగు-
+ముదిర విముక్తంబు పూర్ణచంద్రంబు।ఉడుగణాకీర్ణంబు వ్యోమంబు తెరగు॥

ద్వి. అచ్చటచ్చటగూడు హంసమేఖలల । బాగుగవిచ్చిన పద్మమాలికల
రమ్యముల్ కోనేళ్ళు లక్ష్మి యుప్పొంగు।రమ్యభూషలనొప్పు రమణి తెరంగు॥50

ద్వి. వేణుస్వరంబులు వివిధతూర్యములు । * గర్గరీవృషభగోవర్గనాదములు
ప్రత్యూషపవనాంకురములతో గూడి । ఒండొంటి పూరించు నోజ నొప్పెడిని॥

ద్వి. నవ్యముల్ కుసుమసంకాశ కాశముల । మృదుమారుతప్రకంపిత వరాంగముల
అమల ధౌత క్షౌమ పట సమానములు। నదుల కూలము లవే విదితమై వెలయు॥

---

+ ముదిర = మేఘము.

* గర్గరీ = పెరుగుద్రిప్పుకుండ.

ద్వి. మధుపాన శౌండముల్ వని ప్రచండములు । అవె ప్రియాన్వేగములు నలరి భృంగసులు
పవనానుయాత్రి నీ వనినొనరించు । కైరవాసనరేణుగౌర లౌకొంచు॥ 53

ద్వి. జలముప్రసన్నంబు, నళిని శుభ్రంబు । ధరణి శాలివనంబు మరి విపక్వంబు
విమలంబు చంద్రంబు, మృదులంబు గాలి।గడచె వర్షంబని క్రౌంచోక్తి జెప్పు॥

ద్వి. మీనోపదర్శిత మేఖల లొప్పు । ఘన నదీ వధువుల గతి మందమొప్పు
కాంతోపభుక్త లా యలస గామినుల । కామిను లల కల్యకాలాన నటుల॥ 55

ద్వి. చక్రవాకంబుల శైవలంబులను । స్వచ్ఛకాశంబున వర దుకూలమున
మకరికారేఖల మరి, రేచనమున । వర వధూముఖమయ్యె మరి నదీముఖము॥

ద్వి. వికసితాసనబాణ వృక్షమండముల । సంప్రహృష్ట నినాద షట్పాదగతుల
చాపంబు బూని ప్రచండచారుండు । చండదండుడు మన్మధుండు చరించు॥57

ద్వి. ధరణి సువృష్టితో పరితోషపరచి । నదుల తటాకాల నల్ల పూరించి
నిష్పన్నసస్యగా నిల నొనరించి । వీడి నభం బిక వెడలె మేఘములు॥ 58

తే. కొలకులు ప్రసన్న సలిలనై కురరి తతుల।నాదములనొప్పి సౌమ్య!వనాంతరముల
చక్రవాకగణాకీర్ణలగుచు మరియు । వెలయుచున్నవి చూడుమీ వింత నిచట॥

తే. అసనములు సప్తపర్ణముల్ కుసుమితములు । కోవిదారంబులును, బంధు జీవములును
శ్యామములు నిండు గాన్పించు చక్కగాను । చూడు గిరిసానువులయందు చోద్యముగను॥ 60

తే: హంస సారస చక్రాహ్వయముల తోడ । కురరములతోడ నెల్లెడ కొమరు మిగులు
చూడు! లక్ష్మణ! పులినముల్ చోద్యమొాయి । నదుల నిచ్చట యీ కాననాంతరముల॥

తే. ఇలను నన్యోన్యబద్ధవైగులకుమరియు । ధర జిగీషులకును నృపవరుల కిది యె
వచ్చె నుద్యోగ కాలంబు సచ్చరిత్రి । లక్ష్మణా చూడు, సౌమ్య, సల్లక్షణుండ॥

తే. పార్థివులదండయాత్రకు ప్రథము మిదియె। వెడలుటకుకాల మరుదెంచె పుడమిపైక
కాని, సుగ్రీవు డెందును కానబడడు । అట్టి యత్నమె యెచట గనృట్టదాయె॥

తే. గడచె వార్షికమాసముల్ పుడమి నాల్గు। వత్సరశతంబులో యను భంగి గాగ
అకట శోకాభిభూతున కయ్యె నాకు। సీత జూడక యే యెట్లొ చింతతోడ। 64

ఆ. చక్రవాకియట్లు సాధ్వి నా వెనువెంట। వచ్చె వనమునకును సచ్చరిత్ర
ఉగ్ర విషమ మిద్ది యుద్యానముగ నెంచి। తరలి వచ్చె తన్వి వంత కోర్చి।65

తే. హా! ప్రియాహీనుడను, సుదుఃఖార్దితుడను। క్షితిని హృతరాజ్యుడను, వివాసితుడ నకట
కృప యొనర్పడు రాజు సుగ్రీవు డయ్యె। లక్ష్మణా! యేమనందు నా యందు సుంత।

తే: ఇత డనాథుడు హృతరాజ్యు డతులకామి।దూరసన్నుండు,దీనుండు దుఃఖితుండు
అల్ల రావణధర్షితుం డగుచు నన్నె। శరణమొందె నటం చెంచి దురితబుద్ధి।67

తే. ఇట్టి కారణముల మదిబెట్టి యార। ఆ దురాత్ముండు సుగ్రీవు డా శకుండు
నన్ను నవమాన పరచుచునున్నవాడు। చూడుము, పరంతపా! సౌమ్య! వీడిపొగరు।

తే. ఇదె శరత్కాలమే తేర విదితముగను। సీత వెదకెదనంచు దా జేసి బాస
ఇక. కృతార్థుడనౌచు దా సుకరముగను। ఇంట కూర్చుండె దుర్మతి; యెంచడేమి।

తే. నీవు కిష్కింధకేగి సుగ్రీవుతోడ। చెప్పు నామాటగా నిట్లు తప్పకుండ
గ్రామ్యసుఖసక్తుతోడ మర్కటునితోడ। మూర్ఖ డాతనితోడ, దుర్బుద్ధితోడ।
తే. అర్థులకు, యోగ్యులకు, పూర్వ మమితమైన।మేలు తనకొనరించిన మిత్రులకును
ఆశకల్పించి దాని చేయడ యెవండు। వాడ పురుషాధముడు లోకవారమునను।
తే. శుభమొ పాపమొ చెప్పిన చొప్పుగాగ।మాట సత్యంబు నొనరించు మనుజవరుడె
ఉర్వి వీరుండు, మరి పురుషోత్తముండు।వాడె పూరుషవాచ్యుండు;వాడెసుకృతి।
తే. తాన దెట్లొ కృతార్థుడై తప్పుకొంచు। మిత్రు డకృతార్థునకుగాక మెలగువాడు
ఛీ! కృతఘ్నుడు, వాడు(చచ్చినమగాని।వాని శవమంట వింక క్రవ్యాదములును।
తే. ధ్రువము, కాంచనపృష్టము దురమునందు। మద్వికృష్టము చాపంబు మహిమ సుంత
చూడ నిచ్ఛించు కాబోలు మూఢు డతడు।అల్ల విద్యుద్గణోపమం బాజి మరల।
తే. ఘోర మయ్యది జ్యావినిర్ఘోష మార। ఆజిభూమిని క్రుద్ధు నాయది ధ్రువంబు
మరల నిచ్ఛించు వినగ నామర్కటుండు।వజ్రనిర్ఘోష మన నొప్పు ధ్వనిని దాని।

తే. అటుల వెలసిన నా పరాక్రమము నెరిగి। నాకు నీదు సహాయముంటయును. నెరిగి
ఇన్ని యెరిగియు సుగ్రీవు డెడద లోన। చింతసేయడు కర్తవ్య మింత గురించి॥

తే. ఎందుకొర కేను సఖ్యంబు నొందినానొ। ఎందుకొర కేను వాలివధించినానొ
ఇపుడు మరచె కృతార్థుడై కపివిభుండు।పరపురంజయ! యేమందు మర్కటుండు॥

తే. ఇదిగొ వర్షర్తు వియ్యది యేగినంత। వచ్చెద నటంచు జేసి తాఁ బాస నట్లు
నాల్గుమాసాలు గడచియు నాదు వంక।తిరిగి చూడడు లోలుడై తిరుగుచుండి॥

తే. బాంధవామాత్యపరివృతుండౌచు హాయి।తరుణులనుగూడి క్రీడించు తప్పుత్రాగి
శోకదీనుల మనయందు సుంతయైన। దయనొనర్పడు సుగ్రీవు డయయొ వత్స!॥

తే. చెప్పు నీ వేగి వత్స! యాచెనటితోడ। అల్ల సుగ్రీవుతోడ మహాబలుండ!
నాదు రోషంబు రూప మెంతటిదొ మరియు। చెప్పు మీ మాట కూడ
కీశేశు తోడ॥

తే. మాటపడలేదు మార్గమే పుంతబట్టి। వాలిహతుడౌచు చనెనొ నా బాణనిహతి
నిలువు సుగ్రీవ! చేసిన నియతి యందు;। పోకు నీయన్న చనినట్టి పుంతబట్టి॥

తే. వాలి నొకనినె చంపితి నాలమందు। శరము నొకదానినేసి యో తరుచరుండ!
నిన్ను సత్యంబుదప్పితివేని వినుము। హతమొనర్తు నిజంబు సబాంధవంబు॥84

తే. కార్య విధ మిట్టిదయ్య యో యార్యవర్య!।ఇంక యేది హితంబొ నీ వే తలంచి
చెప్పు మదియెల్ల నతనికి సొంపిదముగ।పొమ్ము కాలవ్యతిక్రమమ్మగుచునుండ॥

ద్వి. సత్యంబు సుగ్రీవ! సలుపు నాయందు। పరికింపు ధర్మంబు ధర శాశ్వతంబు
పోకు నీ యన్నయ్య పోయిన త్రోవ। కాకున్న నాఘాక గనెదు పో యముని॥

ద్వి. తీవ్రకోపవివృద్ధు దీను నాతనిని। భ్రాతను జూచి లాలప్యమానసుని
ఉర్వీశనాథుండు నుగ్రతేజుండు। వహియించె తీవ్రత ప్లవగుపై భ్రాత॥ 85

30వ సర్గ సమాప్తి. (1302)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది ఒకటవ సర్గ - (31)

(రాము డనుపగ లక్ష్మణుడు మహాకోపముతో కిష్కింధకు వెడలుట - లక్ష్మణుడు వచ్చిన సంగతిని అంగదాదులు అంతఃపురములో మదమత్తుడైయున్న సుగ్రీవునకు నివేదించుట :—

ద్వి. పూజ్యు నదీనసత్త్వు, సకాము, దీను । శోకాభిపన్ను రోషోగ్రసంపన్ను
పూర్వజు, నరదేవపుత్రుతోనిట్లు । రామానుజుం డనె రాజసూనుండు॥ 1

ద్వి. నిలువడు పో సాధువృత్తి వానరుడు । మన కనుకూలించుమాడ్కి గన్పడడు
తలపడు తన కెట్లు గలిగెనో ఫలము । దక్కెనె కపిరాజ్య మిక్కపి కింక ?॥ 2

ద్వి. మతిపోయి సుఖము గ్రామ్యంబున దగిలి । ఎంచడు ప్రత్యుపకృతి నీకు సేయ
హతమార్తు, నిక వీడు నన్నను జూచు । ఈరాదు భూరాజ్య మిట్టి దుర్మతికి॥ 3

ద్వి. ఆపలే నీ మహాకోపంబు నింక । హతమార్తు సుగ్రీవు ననృతాత్ము నిపుడె
హరివీరులంగూడి యా వాలిసుతుడె । నీపత్ని సీతకై నెమకు గా కింక॥ 4

ద్వి. ఆత్తబాణాసను నటు చెప్పి యెగయు । రణచండకోపను లక్ష్మణు జూచి
పరవీరవీరుండు పలికె రాముండు । ధృతిని సానునయంబు నిక స్వవేక్షితము॥ 5

తే. త్వద్విధుం డెందు లోకాన పాప మిట్టి । దెన్నడేగాని సలుప డో సన్నుతాత్మ!
పాప మిట్టిది యార్యు డెవండు విడుచు। వినుము, పురుషోత్తముడు వాడె, వీరు డత [illegible]

తే. సాధువృత్తుండ వీ విట్టి సాహసంబు। పూనదగదయ్య లక్ష్మణా! పుణ్యపురుష
పూర్వవృత్తంబు బాంధవంబును నెడంద। అనుసరింపుము సంప్రీతి ననిచి తప్ప [illegible]

తే. చెలిమి సామోపహితవాక్యములనె పలికి । రూక్షరూపంబులైన పల్కులను వీడి
తాత! సుగ్రీవుతో పల్కదగును సుమ్ము । తప్పిది యొనర్ప, డాలస్య మాయె నింతె॥

తే. అగ్రజుం డిట్లు ధర్మంబు ననుసరించి । చెప్పియుండిన శిష్టార్థ మొప్ప గొనుచు
పురుషవృషభుండు వీరుండు పురవరంబు । జొచ్చె సౌమిత్రి పరవీరసూదనుండు॥

తే. అంత, శుభమతి, ప్రాజ్ఞుండు, నన్న కెపుడు । ప్రియహితరతుండు లక్ష్మణుం డెడదలోన
ప్రతినివృత్త సుసంరబ్ధు డగుచు నపుడె।పోయె కపిముఖ్య భవనంబుచాయ కతడు॥

తే. శక్రబాణాసనప్రఖ్య చాప మద్ది । అల్ల గిరితుంగ శృంగాభ మమర దాల్చి
ఔర, కాలాంతకోపముండైె యతండు । మందరము సానుమంతంబు మాడ్కి నొప్పె॥

తే. భక్తి రామానుజుండు యథోక్తకారి । క్రమత వచనంబు, నిక, యుత్తరంబు, మరియు
సోఽత్తరంబును నెడదలో యోచనంబు । సల్పుకొని యేగె మతి బృహస్పతి సముండు॥

తే. క్రోధ కామ సముత్థంబుకోపవహ్ని । రామచంద్రుని దపుడు తగ ప్రబలి చుట్ట
కనలి యప్రీతుడై ప్రభంజనుని మాడ్కి । చరచరగబోయె ప్రురికి లక్ష్మణుడు నడచి॥

తే. సాలతాలాశ్వకర్ణాది క్ష్మాజతతుల । పెక్కులన్ గూలద్రోయుచు నొక్కమొగిని
ద్రుమములను నెన్నొ యద్రికూటముల నెన్నొ । వడిగ నడిచెకి వేగాన పడ నడంచి॥

తే. వన్యపోలిక నడచెడి ఎగుపుతోడ । శిలలు చూర్ణంబులగుచుండ చెంగుచెంగు
నిడుద జంగలు వేయుచు నృపసుతుండు । కార్యవశతను ద్రుతగతి నార్యుడరిగె

తే. ప్రభ బలాకీర్ణ మా వారిరాజపురము । దుర్గమం బల్ల కిష్కింధ దూరమందు
గాంచె నిక్ష్వాకుశార్దూలు డంచితుండు । ఎదుట గిరిసంకటంబందు నృపసుతుండు॥

తే. అల్ల సుగ్రీవుపైన రోషాధికమున । ఔర ప్రస్ఫురమాణోష్ఠుడై యతండు
చనుచు కిష్కింధ వెలుపల సంచరించు । వానరుల భీమరూపుల వరుస గనియె॥ 17

తే. గిరుల నడుమగ నరుదెంచు పురుషవృషభు । గాంచికుంజరతుల్యు లాకపిగణంబు
శైలశృంగాల పెద్దవృక్షాలనెల్ల । జేతబట్టిరి యతనిపై చెలగి, విసర॥ 18

తే. ప్రహరణంబులనట్టుల బట్టినట్టి । హరుల నవ్వారి వీక్షించినంత నతకు
తోనె ద్విగుణీకృతంబు క్రుద్ధుండునయ్యె । వహ్ని బహ్వింధనమ్ముల వలననటుల।

తే. కాలమృత్యుయుగాంతాభుగాంచినంత । క్రుద్ధలక్ష్మణు ప్లవగులా రాక్షి తేజు
భయపరీతాంగులై దాడువారిరెల్ల । శతశతంబులు దశదిశల్ పరగనపుడె॥ 20

తే. అంత సుగ్రీవభవనంబు హరులుజొచ్చి । లక్ష్మణునిరాక యాతనిప్రబలకోప
మపుడె పతికి నివేదించి రడలుకొంచు॥ 21

తే. తారతోగూడి క్రీడలదగిలి రహసి । కామతంత్రిమ్మనందున్న కపివరుండు
అటుల కపివరులనెడి వాక్యములసుంత । చెవినిబెట్టండ సుగ్రీవు డవశుడపుడు॥ 22

తే. సచివసందిష్టులై కపిసంఘమంత । రోమహర్షణులెల్లరు రూక్షగతిని
నగరముననుండి వెలువడి రెగసికొంచు । మేఘగిరికుంజరాభు లమేయబలులు

తే. క్రూరదంష్ట్ర నఖాయుధుల్ ఘోరులెల్ల । వికృతదర్శనులెల్లరు వింతవారు
భయద శార్దూలదర్పులా ప్లవగులెల్ల।మరియు వికృతాననుల్ చూడ హరులునెల్ల॥

తే. అందుకొందరు దశనాగబలులుకలరు । దశగుణోత్తరబలులు కొందరునుగలరు
కలరు నాగసహస్రింపు బలమువారు । తుల్యవిక్రము లంద రస్తోకబలులు॥ 25

తే. కపులు ద్రుమహస్తులును మహావిపులబలులు । సర్వమునుజుట్ట కడు దురాసదము
నైన
పురముకిష్కింధ నద్దాని నరసెనపుడు । క్రుద్ధుడై లక్ష్మణుంపు బల్ క్రూరదృష్టి

తే. ప్రబలి ప్రాకార పరిఘాంతరంబునుండి । అట్టివెడలి యుదగ్రసత్త్వాఢ్యులెల్ల
కపిగణంబులు లక్ష్మణుకంటికెదుర । గానిపించిరి బహువిధాకారములను॥ 27

తే. అటుల సుగ్రీవుని యుపేక్షనరసి మరియు। అన్నదుఃఖంబుదలచియు నధికముగను
కోపవశుడయ్యె వీరుండు ఘోరముగను । మరల లక్ష్మణుడప్పుడు మనసులోన॥

తే. ప్రబల దీర్ఘోష్ణతీక్ష్ణ నిశ్వాసుడగుచు । కోపసంరక్తలోచన ఘోరుడగుచు
ఒప్పె నా నరశార్దూలు డుర్వినచట । పావకంబు సధూమంబుభంగిగాగ॥

తే. జ్యాతలమ్ములెకదలు జిహ్వలుగవెలుగ । సాయకాసనమే భోగచయముగాగ॥
మరి స్వతేజంబె గరళంబు కరణితోనక । వరలె పంచాస్య పన్నగం బన
నతండు

తే. అతని కాలాగ్నివలెమండు నట్టివాని । మించు నాగేంద్రుభాతి కోపించువాని
చేతి యంగదుడప్డు వీక్షించి బెదరి । ఎడదలోన విషాదంబు భృశమునొందె॥ 31

తే. అంత నంగదు నరసి మహాబలుండు । రోషతామ్రాక్షుడగుచు ని ట్లుగ్రగతిని
బలికె లక్ష్మణుడప్పుడా ప్లవగపతికి । అల్ల సుగ్రీవుకిట్లు నీ వనుమటంచు॥

తే. "అదె యరిందముడయిన రామానుజుండు । వచ్చెనీచెంతకిప్పుడు భ్రాతృవర్యు
వ్యసనమున జేసి సంతప్తుడౌచుమరియు । వాకిటన్ వేచు లక్ష్మణుం డని వచింపు॥

తే. "అతని వాక్యమువినగ నీమతికి దేవ । ఇష్టమేని యొనర్పు నీయిచ్ఛమెరయ"
అనుచు వచియించిరమ్మ నీ వరిగివేగ।అంగదా వత్స! శత్రుహంతా!కుమార!॥

తే. లక్ష్మణుని వాక్యముల్ విని ప్రబలమైన । శోకమునమున్గి యంగదుం డా కుమారు
డపుడె పినతండ్రి దరికి దా నరిగివేగ । చెప్పె లక్ష్మణురాక దా నొప్పిదముగ॥

ద్వి. అంగదుండంత నామాట యాలించి । పరిదీనవక్త్రుండు భ్రాంతభావుండు.
నగుచు తూర్ణంబేగి యధిపుపాదముల । పడి వందనమొనర్చె వడి కుమారుండు

ద్వి. ఆ యగ్రతేజుడా యయ్యపాదముల । మాతపాదంబుల భక్తిమై పట్టి
మరి రుమపాదముల్ కరముననంటి । లక్ష్మణుమాటలు రహి నివేదించె॥

తే. కాని నిద్రామదంబులు గ్రమ్మియుంట । మేలుకొనకయ్యె కపికులపాలకుండు
కల్లుమత్తున మరియును కామవశత । ఎరుగకుండెను సుగ్రీవు డెదియు నపుడు॥

తే. అంత కిలకిలరవము లత్యంతముగను । సలిపిరచ్చట కపులు లక్ష్మణునిచూచి
మరియు భయమోహితులునౌచు మనములందు । అరచి రాతని క్రుద్ధుని ననున
యింప॥

తే. లక్ష్మణు మహౌఘునిభు గాంచి ప్లవగులెల్ల । సింహనాదంబుచేసిరి చెలగి
యపుడు
నభసి వజ్రశని సమస్వనంబుగాగ।లక్ష్మణు సమీపమందు వారంద రరచి॥

తే. ధ్వని మహత్తరమప్డు డద్దానివలన । మేలుకొనెవానరుండు త న్మిహిరసుతుడు
అధికమదవిహ్వలతను తామ్రాక్షుడగుచు। వ్యాకుల స్రగ్విభూషణ పటలుడగుచు॥

తే. ప్లక్షుడు, ప్రభావుడను మంత్రివరులు నంత । అంతిపురిలోన జొర నర్హులైన
వారు
కపికి సమ్మతులప్పుడు కలిసివచ్చి । అంగదునిమాటలాలించి యతనితోడ॥

తే. చేరి లోనికిజని పతి చెంతకేగి । "అర్థ ధర్మంబులనుకూర్చి యార్యవరుడు
చాల నీతోడమాటాడసాగివచ్చె । లక్ష్మణుం"డని చెప్పిరి తక్షణంబు॥

తే. సామనిశ్చితవచనాల సచివు లతని । మది ప్రసన్నుని గావించి మరియు ననిరి
దివి మరుత్పతి శక్రుని తీరుగాగ । కూరుచుండిన పతిచెంత కూరుచుండి॥ 44

తే. సత్యసంధులు రామలక్ష్మణులువారు । మరి మహాభాగులిద్దరు భ్రాతృవరులు
నచ్చియున్నారు సఖ్యభావంబుతోడ । రాజ్యదాతలు మరియు రాజ్యార్హులనఘ॥

తే. వారిలోపల పటుధనుష్పాణి యొకడు । వచ్చి వాకిట నిలచె లక్ష్మణుడు చూడు
వాని భయమున కంపించి ప్లవగు లెల్ల । నాదములు సేయుచున్నారు నాథ!
వినుము॥

తే. రాఘవభ్రాత లక్ష్మణుండమోఘబలుడు । రాముపంపున వ్యవసాయరథుడు ఘనుడు
వాక్యసారథి యిచటికి వచ్చెనేడు । రామశాసనమును గొంచు లక్ష్మణుండు॥

తే. తారతనయుని నీతని దయితు ననఘ । అంగదుని గూడ నీచెంత కరుగుమంచు
పంపె లక్ష్మణు డాతండు ప్రభుసుతుండు। త్వరగ పొమ్మంచు నిప్పుడే హరివరుండ!

తే. అతడు రోషపరీతాక్షుడగుచు దేవ । పేర్చి వాకిట నిలుచుండె వీర్యయుతుడు
వానరులనెల్ల మనవారి వానరేశ! । చక్షువులతోడ దహియించు చందముగను॥

తే. అతని కీ వింక శిరమున నతియొనర్చి । పొమ్ము సేవింప సహబాంధవమ్ముగాగ
పోయి వేగ మహారాజ మొక్కియతని । కోపరోషంబులనుడింపు భూపవర్య॥

తే. ఎటుల రాముండు ధర్మాత్ము డిక వచించు । అటుల చేయుము నీవు సమాహి
తముగ
నీవొనర్చిన ప్రతినపై నిలువుమయ్య । జగతి సత్యప్రతిజ్ఞుడ వగుము దేవ! . 15

-: 31 వ సర్గ సమాప్తి - 1,353



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది రెండవ సర్గ - (22)

—: హనుమంతుని హితోపదేశము :—

తే. అంగదపురస్సరుల్ నిజామాత్యవరులు । పలికి యున్నట్టి మాటల నులికి వించు
ఆగ్రహించెను లక్ష్మణుం డనియు వించు। ఆసనమునుండి సుగ్రీవు డదరి డిగియె॥

తే. అంత మంత్రుల మంత్రజ్ఞు లైన వారి । మంత్రపరినిష్ఠులను జూచి మంత్రకుశలు
డల్ల సుగ్రీవు డనియె వాక్యంబు నపుడ। హృదిని గురులాఘువంబుల నిశ్చయించి॥

తే. నోట దుర్వ్యాహృతంబు నే నుడివి యెరుగ । చేయ దురనుష్ఠితంబు కించిత్తు గాని
రాఘవభ్రాత సౌమిత్రి ప్రబల కుపితు । డేల యయ్యె నటంచు చింతించుచుంటి॥

తే. అసుహృదులు, నా యమిత్రులు నైన వారు। నిత్య మంతరదర్శులే నెవరు జెరుప
భువి యసంభూతముల దోషములను నెన్నొ। చెప్పియుందురు నాపైన స్థిరముపతికి॥

తే. ఇందు గురిచి యథాబుద్ధి నింక మీరు। మరి యథావిధి యోచించి మంత్రులెల్ల
నెమ్మదిగ కారణములెల్ల నిపుణముగను । తెలిసికొని నిశ్చయింపు డా తెర
గ దేమో॥

తే. లేదు నాకు భయంబు నరేశుడల్ల । లక్ష్మణునిచెంత, మరియు నా రాముచెంత
మిత్రు నస్థానకుపితు భావింపమదిని । జగతి నెవనికి గల్గదు సంభ్రమంబు ?॥ 6

తే. సుకరమే సర్వథా మిత్రు నొకని బడయ । దుష్కరము నిల్పుకొనుట పో
ధ్రువ మతనిని

చిత్తవృత్తి యనిత్యమౌ హేతువునను । అల్ప మేదేని చాలు తన్మైత్రి జెరుప॥

తే. ఆ నిమిత్తంబునను భయంపడుట నేను; । ఆమహాత్ముడు సఖుడు శ్రీరామవిభుడు
నా కొనర్చిన మేలు కీ లోకమందు। తగిన మేల్సేయ హా! శక్యమగునె నాకు॥

తే. ఇటుల సుగ్రీవు డనగ హరీశ్వరుండు । హనుమ హరిపుంగవుండు స్వీయంబునైన
తర్కమున జేసి యోచించి తగ వచించె । మరగు వానరమంత్రుల మధ్యమందు॥

తే. సర్వథా యిది దేవ! యాశ్చర్యమేమి । కాదు నీయట్టి వాడు విఖ్యాతగుణుడు
స్నిగ్ధ ముపకారము శుభంబు నెడదలోన।మరువకుంకుట యెంతయుహరివిభుండ॥

తే. ప్రభుడు వీరుండు రాముండు భయమునెల్ల।దూరముగ ద్రోసి నీకు పెంపారు ప్రీతి
గూర్చ వాలిని నట్టుల గూల్చెగాదె । శక్రతుల్యపరాక్రము సంగరమున॥ 11

తే. సర్వథా ప్రణయానసే సఖు డతండు।క్రుద్ధుడయ్యెను ధ్రువము రఘూద్వహుండు
లక్ష్మివర్ధను లక్ష్మణు భ్రాత నిట్లు । పంపె నీచెంత కిందు సంశయములేదు॥ 12

తే. నీవు దేవ! ప్రమత్తత నెరుగ కుంటి । వకట కాలవిదాంవరా! కాలమింత
ఫుల్లసప్తచ్ఛదశ్యామ మల్ల వచ్చె । శివ మదె శరత్తు చూడు మీ క్షితికి రాజ॥

తే. నిర్మలగ్రహనక్షత్రనికరమిదియె । దివి ప్రనష్టవలాహక బృందమయ్యె
సర్వదిశలును చూడు ప్రసన్నమయ్యె।నదులు కొలకులు విగత పంకములునయ్యె॥

తే. ఆహవోద్యోగకాలంబు నరుగుదెంచె । ఎరుగ కుంటివి యింతయు హరివరుండ!
అధిప! నీవు ప్రమత్తుండ వనుచు దెలిసి।వచ్చెలక్ష్మణు డిటకు నిన్ హెచ్చరింప॥

తే. ఆర్త డక్కట హృతదారుడైన వాడు । రాఘవుండు మహాత్ము డీ భ్రాతచేత
పలుకబంపిన మాటలు పరుషమైన। మర్షణీయములౌ సుమ్ము మహీప! నీకు॥ 16

తే. ధ్రువము, నీకు కృతాపరాధునకు నిపుడు । అంజలి ఘటించి లక్ష్మస్వామి కెరగి
ఆతని ప్రసాదమున్ గొనునంతకంటె । అన్యమార్గము నుత్తమం బనఘ! లేదు॥

తే. ప్రభు నియుక్తులు మంత్రులు ప్రభున కెపుడు। హిత మవశ్యము వచియింప నియతిగలదు
అందుకొరకేను నేను భయంబు వీడి । చెప్పుచుంటిని హితము నిశ్చితము, రాజ!॥

తే. రాము డభిక్రుద్ధుడైన విల్లల్ల బూని । జగము సర్వము తనవశంబుగ నొనర్చు
కొన సమర్థుడు సుమ్ము రఘూద్వహుండు । అమరగంధర్వయక్షరాక్షసము నెల్ల

తే. కోరి యెవరి ప్రసాదంబు కొనగనగునొ । కోప మతనికి గలిగింప గూడ దనఘ
ఇక, విశేషించి పూర్వోపకృతి స్మరించు। వానికి కృతజ్ఞున కిది యవశ్యమనఘ॥

తే. రాజ! నీవు సమిత్రపుత్రకముగాగ । అతని కింక శిరంబున నతి యొనర్చి
ప్రతిన చెల్లించుకొని నిలు మతని వశత । భక్తిమై భర్త వశగను భార్య
యటుల॥ 21

ద్వి. రామరామానుజుల్ పల్కు శాసనము । మనసున నైనను మరి మీరి మెలగ
నీకు యుక్తముగాదు నిజము కపీంద్ర! రామచంద్రు సురేంద్రభీమవర్చసుని
మానుష బలమును మరి, మనోబలము। తెలిసినవే కాదె దేవరా! నీకు॥

32వ సర్గ సమాప్తి:— (1,375) 22

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

—: ముప్పది మూడవ సర్గ :—(63) ;—

లక్ష్మణుడు మహాకోపముతో వచ్చెనని తెలిసి, సుగ్రీవుడు హడలిపోయి అతని ఎదుట పడుటకు జంకి-ముందుగ తారను పంపించుట-తార అతనిని ప్రగల్భమును సాంత్వనమునునైన వచనములచే శాంతపరచి-లోనికి గొంపోవుట :—

తే. రామశాసనమున నట్లు లక్ష్మణుండు । వెడలి యంగదు పిలుపున వేగనపుడ
గుహను ఘోరంబు కిష్కింధ గురుభుజుండు । జొచ్చె పరవీరహంత తా
నుచ్చగతిని॥ 1

తే. హరులు ద్వారస్థులంత మహాబలాఢ్యు।లట మహాకాయు లా లక్ష్మణార్యు జూచి
ప్రాంజలులునౌచు నెల్ల రా ప్రక్క కొదిగి । నిలువబడియుండి రట్టులే నేర్పు
మెరయ॥ 2.

తే. క్రుద్ధుడై యట్లు నిట్టూర్పు లోలి బరచు।దశరథాత్మజు జూచి యా ద్వారస్థులెల్ల
భృశము సంత్రస్తులై యట్లె నిలువబడిరి; । చెంత కేగంగ మరి సాహసింపరైరి॥

ద్వి. శ్రీమంత మల్ల పుష్పితకాననంబు । రత్నమయంబు బల్ రమ్యతరంబు
మణిరత్న సమకీర్ణమును దివ్యతరము।గుహ మహత్తర మటు గురుభుజుం డరసె॥

ద్వి. ప్రాసాదహర్మ్య సంబాధ ముచ్చంబు । జగతి నానాపణ్య సంశోభితంబు
సర్వకామఫలాళి సతము పూర్ణంబు । సకలర్తు పుష్పవృక్షాళి రమ్యంబు.
కామరూపుల దేవగంధర్వ సుతుల । దివ్యమాల్యాంబర దేహుల కపుల
ప్రియదర్శనుల నచ్చ వెల్లివిరిసెటి । పురమును; చందనాగరు పద్మములయా
సురభిగంధంబుల గంధముల్ మరియు । మధువుల వాసనల్ మైరేయములవా

సమోన్మాదముల నొప్పు నమ్మహోద్ద్వముల । గిరినిర్ఝరంబుల మరి నిర్మలముల
పరికించు కొం చేగ నరవరాత్మజుడు॥ 7

ద్వి. అంగదు గృహము నత్యంత రమ్యంబు।ద్వివిదమైందులయు నా గవయ గవాక్ష
శరభ విద్యున్మాల సంపాతి కుముద । సూర్యాక్ష హనుమంత శూర సుషేణ
వీరబాహు సుబాహు వేశ్మంబు లెల్ల । నళ, సుపాటల, సునేత్రుల సద్మములను
దధివక్త్రి జాంబవ త్తార నీలులయు । ముఖ్యగా వానర ముఖ్యుల యిండ్ల
రహి మహాసారంబులను జూచుకొంచు । లక్ష్మం డేగె నా రాజమార్గముల
పాండురాభ్రప్రభా భవనరాజంబు ! దివ్యమాల్యయుతంబు దీప్యమానంబు॥
స్త్రీరత్న శోభితం బౌర వేశ్మంబు । సంపూర్ణధనధాన్య సంపత్కరంబు
పాండురప్రాకారమండనం బరయ । కడు దురాసదము తత్ కపిరాజు గృహము
సాక్షాత్ మహేంద్రుని సదనంబు సమము । రమ్యంబు పరికించె రామాను
జుండు॥ 8–13

ద్వి. కైలాసశిఖరవిఖ్యాతముల్ చదల । చుంబించు సౌధముల్ శుక్లముల్ బొదల
సర్వకామఫలాళి నుర్వీరుహాళి । సంతత కుసుమిత జగతీరుహాళి
నీలజీమూతసన్నిభముల తరుల । ధర, మహేంద్రప్రదత్తముల రమ్యముల
శీతల చ్ఛాయల క్షితిరుహంబులను । కడు మనోరమముల గ్రాలెడు దాని ;
శస్త్రపాణుల, బలశాలుల, హరుల । సంవృతద్వారమై సొరైన దాని ;
స్వచ్ఛంబు తప్తకాంచనతోరణంబు । రమ్యంబు, దివ్యమాల్యాలంకృతంబు
జొచ్చె మహాబలుం డుచ్ఛ్రతరంబు । సుగ్రీవు సదనంబు శూరసౌమిత్రి
వడిని నవార్యమాణుడు నొచు నెంచు । మరి మహాభ్రముచు భాస్కరు డట్టు
లఘుడు॥ 14–17

నానాజనాకులం బానందమయము । సప్తకక్ష్యము మహద్గుప్త మాయతము
రాజత హైమ పర్యంక కీర్ణంబు । బహువరాసనతతి పరిపూరితంబు
భువి మహార్హాస్తరణోపేత మెందు । శోభితం బెందెందు జొచ్చెవీరుండు
అంతఃపురంబు ధర్మాత్ముడాతండు॥ 18–19

తే. చొచ్చుచునె యాత డట విని నుచ్చగతిని । సతణ మచ్చట బొల్చు
సుస్వరము తతము
సరస మధుర తంత్రీ గీత సంయుతంబు । హాయియా సమగీత పదాక్షరంబు॥20

తే. మరియు పెక్కుర వివిధరూపములవారి । రూపయావనగర్వితలైనవారి
స్త్రీల జూచెను సుగ్రీవు గృహమునందు।పటు మహాబలు డప్పు డా భానుకులుడు॥

తే. అవని నభిజన సంపన్నులైన వారి । చిత్రమాల్యస్రజంబుల జెలగువారి
అరసె ఫలమాల్యకృతిసక్తులైన వారి । భూషణోత్తమ భూషితులైన వారి। 22

తే. జాగరూకుల, తృప్తుల సరసమతుల । మరి, యుదాత్తపరిచ్ఛదధరుల ఘనుల
అరుగు చరసె సుగ్రీవానుచరుల నచట । లక్ష్మణుం డప్పు డా సౌధరాజ
మందు॥ 23

తే. తరళ నూపురముల కూజితముల వినుచు।కాంచికా నినదంబుల మించ వినుచు
శ్రీయుతుం డల్ల సౌమిత్రి చిత్తమందు। లజ్జితుండయ్యె, యువి యువతులవౌట॥

తే. చెలగు నాభరణస్వనంబులను వినగ । రోషవేగప్రకుపితుడై రూక్షగతిని
జ్యాస్వనంబు నొనర్చె లక్ష్మణుడు నపుడు । దిశల వీరుండు పూరించి పృథుల
రవళి॥ 24

తే. అతడు సత్సాంప్రదాయంబు ననుసరించి।ఇంతు లున్నట్టి చోటున కెడము నిలిచి
వీరు డేకాంతమందున వేచియుండె । రామకోపసమన్వితుం డే మనందు?॥ 26

తే. తతము చాపస్వనంబు నద్దాన జేసి । కీశనాథుండు నంత సుగ్రీవు డదరి
లక్ష్మణాగమనంబు, నాగ్రహము నెరిగి । వడవడ వడంకె ఆసనంబందునుండి॥

తే. అంగదుడు మున్ను నాతోడ నన్నరీతి।వచ్చె సౌమిత్రి యిటకు సువ్యక్త మిపుడు
భ్రాతృవత్సలు డాతండు పరమకుపితు।డగుచు వచ్చెను నిజము రామానుజుండు॥

తే. అంగదుని పల్కు బట్టియు జ్యాస్వనంబు।వినుట కతమున ధ్రువముసౌమిత్రి వచ్చె
నని యెరింగి కపీశుండు నడలు గదిరె । నోటి తడియును నారె నప్పాట కపికి॥ 29

తే. అంత ప్రియదర్శనను తార నాత డరసి । త్రాససంభ్రాంతచిత్తుడై ప్లవగవరుడు
విభుడు సుగ్రీవు డిట్టు లావెకు వచించె । హితము నవ్యగ్రమునునైన రీతిగాగ॥

తే. ఏమి కారణ మిది సుభ్రు! ఈ విధంబు।ప్రకృతి మృదుమానసుండు తల్లక్ష్మణుండు
రాఘవానుజు డిపుడు రౌద్రంపురీతి । వచ్చె నిటకు సరోషుడన్ భంగిగాగ॥ 31

తే. ఏమి యనుకొందు వీవు నీ హృదయమందు।ప్రభుకుమారుని రోష కారణము దేవి!
విను మనిందిత! మరి, యకారణముగాగ । కోపము వహింప డీ నరకుంజరుండు॥

తే. అతని కేదైన సుంత నే నప్రియంబు । చేసినట్టుల జ్ఞప్తి నీ హృదిని గలదె!
దాని నిప్పుడె నీబుద్ధి తరచి చూచి । వేగ నాతోడ చెప్పుమ వెలదిమిన్న॥ 33

తే. అంత కన్నను నీవె స్వయంబు నరిగి । అతని జూచుట మేలు శుభాంగి! వేగ;
వచనముల సాంత్వయుక్తంబులైన వాని।పలికి యతని ప్రసన్నుగా సలుపుమీవె॥

తే. నిన్ను చూచిన తోనె ప్రసన్నుడగును । కోప మొందడు భామినీ! భూపసుతుడు
స్త్రీల యెడల మహాత్ములు సేయ రెపుడు । దారుణం బింత ధ్రువము పో
తార! నీవె॥ 35

తే. చెలిరో! నీచేత సాంత్వనంబులను దేరి।మరి, ప్రసన్నేంద్రియుండు సన్మానసుండు
నైనపిమ్మట జూతు నే నరగి యతని । అరివిమర్దను కమలపత్రాక్షు దక్షు॥ 36

ద్వి. మదవిహ్వలాక్షి యా సుదతి తూలుచును।వ్రేలు కాంచీగుణ హేమసూత్రముల
లలన సలక్షణ లక్ష్మణు కడకు । నడచివచ్చెను తార నమితాంగయష్టి॥ 38

ద్వి. ప్లవగేశు పత్ని నా లలన జూడగనె । అటె యుదాసీనుడై యా మహాత్ముండు
భూవరసుతు డవాఙ్ముఖుడునై యుండి । స్త్రీ సమక్షం జౌట త్రిప్పె కోపంబు।

ద్వి. పానయోగంబున పణతి యా తార । వినివృత్తలజ్జయై మనుజేంద్రసూను
దృష్టిప్రసాదాన ధృతిపూని మదిని । ప్రణయ ప్రగల్భంబు పరిసాంత్వనంబు
నిటు బల్కె వాక్యంబు పటుమహార్థంబు॥ 39

ద్వి. ఏమిది నృపపుత్ర! కోపమూలంబు ? । ఎవ్వడు నిలువండు నీమాటలోన !
ఎవ్వడు దరిజేరు నెండిన యడవి ! నేర్చుచుండు దవాగ్ని నిర్విశంకముగ॥ 40

తే. సాంత్వపూర్వ మశంకిత సరణిబల్కు । తారవచనంబు ప్రణయదృష్టార్థమద్ది
విని మహాత్ముండు లక్ష్మణుం డనఘు డపుడు । మరల బల్కెను నిట్టు లా
మగువతోడ॥ 41

తే. ఏమి నీభర్త యిటు కామవృత్తుడగుచు।లుప్త ధర్మార్థ నిచయుడై లోలుడగుట
తెలియవా భర్తృహితయుక్త ! దేవి! నీవు॥ 42

తే. తలప డింతయు రాజ్యార్థముల నెడంద । తలప డిక మమ్ము కడు దుఃఖితులనునైన
సతము సామాత్యపరిషదుండగుచు, దేవి ! । సేయుగా పానసేవనమే యతండు॥

తే. వినుము ప్లవగేశ్వరుండు నీ యనుగు భర్త । నాల్గు మాసాలె యటు ప్రమా
ణంబు జేసి
అదియు గడచుట యెరుగకున్నా డతండు।ఇటు మదవ్యగ్రుడై విహరించుచుండి॥

తే. తార! ధర్మార్థసిద్ధినికోరువాడు । పానవశమున నిటులుంట బాగుగాదు
పానమున జేసి యర్థధర్మములె కాక । కామమున్ గూడ నాశమ్ము గాంచు సుమ్ము॥

తే. మేలునకు సల్పకున్నచో మేలు మరల । ధర్మలోపంబు గల్గు మహత్తరంబు
సఖుడు సద్గుణయుతుడు నాశంబు గనిన । మరి, మహత్తర మర్థలోపంబుగలుగు॥

తే. సత్యధర్మపరాయణుండైన ప్రభుడు । అధికుడౌ జమి యుద్ధకామునకుం గాక
త ద్వయంబును పీడిన త్వద్విభుండు । ధర్మమందున సైతము దనరలేడు॥ 47

తే. ఇంతి! ప్రస్తుత మీ కార్య మిట్టులుంట కార్య ముత్తర మిచట ప్ర
కిరసి చూచి
ఏది కర్తవ్యమో నీవె యింక జెప్పుమ కార్యతత్త్వజ్ఞవీవు, నిక్కంబుగాగ॥ 48

ద్వి. ధర్మార్థ యుక్త మాతని వాక్య మద్ది । మధురస్వభావంబు మగువ తా వినుచు
మనుజేంద్రు కార్యంబు మది లెస్స నెరిగి విశ్వాస యుక్తంబు వే పల్కె మరల॥

ద్వి. కోపకాలముగాదు భూపాలపుత్ర! । వల దతి కోపంబు స్వజనంబు నందు
మరి విధేయులయందు మాయందు వీర! । త్వత్ప్రయోజనపరతంత్రుడు నీ మిత్రు
మరి ప్రమాదం బేని తగు నీవు నోర్వ॥ 57

ద్వి. చూడ, గుణప్రకృష్టుం డెట్లు వత్స । అపకృష్టసత్త్వుపై యాగ్రహంబూను?
తపసఃప్రసూతి సత్త్వావరుద్ధుండు । త్వద్విధుం డెవడు కో పావిష్టుడగును? 51.

ద్వి. ఎరుగుదు హరివీర బంధురోషంబు । ఎరుగుదు కాల మతీతంబు నగుట
ఎరుగుదు మీరొనర్చిన మేలు మాకు । ఎరుగు దందులకు మా విధియు
నెయ్యదియో॥ 55

ద్వి. మన్మథు బల మది మనుజవరేణ్య! । ఎటులోర్వరానిదో యెరుగుదు నదియు
ఎరుగుదు సుగ్రీవు డిప్డు కుమార! । మిగుల కామాసక్తు డగుటయు మరియు॥
ఎరుగు దే స్త్రీలయం దతడు బద్ధుండో॥ 53.

ద్వి. లేనట్టులున్నది నృపవరాత్మజుడ! । కామతంత్రములందు గనగ నీబుద్ధి
కాకున్న నీవిటుల్ కోపంబు వడుదె? । దేశకాలంబుల నర్థధర్మముల
చూడండు మనుజుండు కామరతుండు॥ 54

ద్వి. కామాభియోగాన కడదొ్రసిలజ్జ । కామప్రవృత్తి నాకడనున్న యట్టి
భవదీయసోదరు వానరనాథు । మరి యిదే క్షమియింప పరవీరహంత!॥ 55

ద్వి. అల, తపోధర్మకాములు, మహర్షులును । ప్రతిబద్ధమోహులే ప్రభుకుమారుండ,
కామానుకాములై రే మందు! రాజ । ప్రకృతినే కపి యితం డతిచపలుండు
తగులక యెటులుండు దా సుఖంబులను॥ 56

ద్వి. ఇటుల వానరి పల్క ధృతి మహార్థంబు । మరల సఖేలంబు మదవిహ్వలంబు
ధర్మ్యహితంబిట్లు పలికె యా తార । అల్ల సౌమిత్రి కా యప్రమేయునకు॥ 57

తే. అనఘు, కామవిధేయుడేయయ్యె కపియు। మీదు కార్యంబు సాధింప మిహిరసుతుడు
చాలకాలముక్రిందనే నీలు డాది। కపుల కాజ్ఞప్తి జేసె; ఆగ్రహము నలదు॥ 58

తే. వచ్చియేయున్నవారుగా వరుస బెట్టి। కామరూపులు హరులు సంఖ్యలకు మించి
వేలు, లక్షలు, కోటులు వితతబలులు। అవని నానానగనివాసులైన వారు॥

తే. కాన, రమ్ము, మహాభుజా, లోని కీవు। లెస్స నిలిపితి వీవు చారిత్రి మనఘ!
మిత్రదారావలోకనం బెందు గాని। తప్పుకాదయ్య యెపుడు సద్భావులకును॥

తే. ఆపెచేత ననుజ్ఞాతుడగుచు నల్లు। కార్యగతిదైన త్వరయును గల్గు కతన
జొచ్చె నభ్యంతరంబు నా సూర్యకులుడు।అరివిమర్దను డా మహా బాహుబలుడు॥

సీ. పరమాసనంబున స్వర్ణాసనంబున
మరి, మహార్హాంచితాస్తరణములను
ఆసీను సుగ్రీవు నాదిత్య సన్నిభు
దివ్యాభరణచిత్రదీప్తదేహు
దివ్యరూపుని, మహా దివ్యయశస్కుని
దివ్యమాల్యాంబరు దేవసముని
దివ్యాభరణమాల్య దేదీప్యమానుని
శక్రుండు నాగ దుర్జయుని కపిని

గీ. మరియు, ప్రమదావృతుని జూచి తరణికులుడు। లక్ష్మణుం డప్పు డయ్యె సంరబ్ధతరుడు;
జ్వలితరక్తాక్షు డంతకసన్నిభుండు। నయ్యె తద్దృశ్యమున్ జూచి యంతిపురిని॥

ద్వి. రుమను కౌగిటను గాఢముగ దా బట్టి। వర హేమవర్ణు డా పరమాసనమున
లీల గూర్చుండి విశాలనేత్రుండు। చూచె సౌమిత్రిని సువిశాలనేత్రు
దేదీప్యమాను నదీనంపు సత్త్వ॥ 65

౩౩వ సర్గ సమాప్తి – (1,440)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది నాలుగవ సర్గ – (19)

అంతఃపురంలో నున్న సుగ్రీవుని కైఖరిజూచి లక్ష్మణుడు పరల పండిసమట – సుగ్రీవుడు నోటిమాట రాక, చేతులు జోడించి. వణకుచు నిలువబడుట – లక్ష్మణుడు మహాకోపముతో సుగ్రీవుని కృతఘ్నతను నిందించి, రాముడు చెప్పుచున్న మాటలు చెప్పుట :—

తే. అతని, నప్రతిహతు, క్రుద్ధు నంతిపురిని । నటుల జొచ్చినవాని, మహాబలాఢ్యు
పురుషవృషభుని లక్ష్మణు నరసి యపుడు । కరము వ్యధితేంద్రియుం డయ్యె
తరణిసుతుడు॥ 1

తే. క్రుద్ధు, నిశ్వసమాను, బల్ రూక్షతేజు । అన్నవ్యసనాన సంతప్తుడైన వాని
దశరథాత్మజు గని కపి తక్షణంబ । ఎగిరి స్వర్ణాసనమునుండి డిగ్గి నిలిచె
అల మహేంద్రు స్వలంకృత ధ్వజము భాతి॥ 3

తే. ఎగిరి నిలిచిన సుగ్రీవు వెంట నపుడె । వేగ నిలిచిరి రుమ మున్నుగాగ స్త్రీలు
గగనమున పూర్ణచంద్రుతో నెగసి తోచు । తారకాగణములభంగి వారలెల్ల॥

తే. అటుల సంరక్తనయనుడై హరివరుండు । శ్రీయుతుండు కరంబులు చేర్చి మొగిచి
కల్పవృక్షముభాతి లక్ష్మణుని యెదుట । నిలిచియుండెను వణకుచు చెలులనడుమ॥

తే. ఉర్వి నట్లు రుమాద్వితీయుండు నగుచు, శశి సతారంబు నాగ స్త్రీశతము నడుమ
నున్న సుగ్రీవు గాంచి కోపోగ్రుడగుచు । లక్ష్మణుం డిట్లు బల్కె నా
స్లవగుతోడ। 6

తే. సత్కులీనత స_త్త్వంబు సత్యనిరతి । సతతము జితేంద్రియత, కృతజ్ఞతయు మరియు
అర్తులందు సానుక్రోశతయును గల్గు । రాజు లోకాన యున్నతి యోజ గాంచు॥

తే. రా జెన డధర్మమందు స్థిరంబు నిలిచి । ధాత్రి తన కుపకారులౌ మిత్రులకును
పలుకు మిథ్యాప్రతిజ్ఞ; నా ఖలునికన్న । హా! నృశంసతగుం డెందు గానబడును!॥

తే. అశ్వవిషయానృతుండు శతాశ్వహాంత । గోసహస్రప్రహాంత సగా గోనృతుండు
మరియు, పురుషానృతుండైన పురుషుడింక । తనను స్వజనంబులను జంపుకొనిన
వాడు॥ 9

తే. తాను మిత్రుచే మున్ను కృతార్థు డగుచు । మరల ప్రత్యుపకారంబు నెరప డెవడు
వాడు నిజము కృతఘ్నుండు ప్లవగవిభుడ! అతడు వధ్యుండ సర్వభూతాళి కింక॥

తే. మున్ను బ్రహ్మ కృతఘ్నుని పోల జూచి ! క్రుద్ధుడై పల్కె యిటులొక్క
శ్లోకమోయి
సకలలోకనమస్కృతం బికను దాని । వినుము నీవు ప్లవంగమా వినుతు నిపుడె॥

తే. భువిని, బ్రహ్మఘ్నునకు, సురాపునకు, మరియు । ధ్రువము భగ్నవ్రతునకు
చోరునకు దలప
నిష్కృతిని జెప్పియుండిరి నీతివిదులు । చెప్పరు కృతఘ్ను కింక నిష్కృతిని
సుంత॥ 12

తే. కడు కృతఘ్నుడవును ననార్యుడవు నీవు । వానరుండ! మిథ్యావాది వౌదు వౌర
ముందు నీవు కృతార్థత జెంది, మరల । రామునకు మేలు సేయ దలంప వింత॥

తే. అట్టు లుపకారమును పొంది నట్టి నీవు । మగల ప్రత్యుపకృతి సేయు వాడ వేని
సీత వెదకెడి యత్నంటు సేయుచుంట । నీకు క_ర్తవ్యమే కాదె నిజము తలప॥14

తే. కపివి, గ్రామ్యంబులైన భోగముల దగిలి । ఔర, మిథ్యాప్రతిశ్రవుం డైతి వీవు
రాము డెరుగక పోయె పూర్వంబునందె । అకట, కప్పయెలుంగు పా మనుచు
నిన్ను॥ 15

తే. కరుణవేది మహాత్ముండు, ఘనయశుండు । రాఘవుండు మహాభాగు డోఘ
బలుడు
పాపికి దురాత్మునకు నీకు వాలి గూల్చి । ఔర! కపిరాజ్యమిప్పించె యరయ కింత॥

తే. రాము డక్లిష్టకర్ముండు ప్లవగ! నీకు నెరపియుండిన మేల్ నీవు మరచియున్న
నిశితబాణాల నిప్పుడే నిన్ను జంపి । వాలి జూడంగ బంపుదు యమునిపురికి॥ 17

తే. సత్కులీనత సత్త్వంబు సత్యనిరతి । సతతము జితేంద్రియత, కృతజ్ఞతయు మరియు
ఆర్తులందు సానుక్రోశతయును గల్గు । రాజు లోకాన యున్నతి యోజ గాంచు॥

తే. రాజైన దధర్మమందు స్థిరంబు నిలిచి । ధాత్రి తన కుపకారులౌ మిత్రులకును
సలుపు మిథ్యాప్రతిజ్ఞ; నా ఖలునికన్న । హా! నృశంసతగుం డెందు గానబడును!॥

తే. అశ్వవిషయానృతుండు శతాశ్వహంత । గోసహస్రప్రహంత సగా గోనృతుండు
మరియు, పురుషానృతుండైన పురుషుడింక । తనను స్వజనంబులను జంపుకొనిన
వాడ॥ 9

తే. తాను మిత్రుచే మున్న కృతార్థు డగుచు । మరల ప్రత్యుపకారంబు నెరప డెవడు
వాడు నిజము కృతఘ్నుండు ప్లవగవిభుడ! అతడు వధ్యుండ సర్వభూతాళి కింక॥

తే. మున్న బ్రహ్మ కృతఘ్నుని. పోల జూచి ! క్రుద్ధుడై పల్కె యిటులొక్క
శ్లోకమోయి
సకలలోకనమస్కృతం బికను దాని । వినుము నీవు ప్లవంగమా వినుతు నిపుడె॥

తే. భువిని, బ్రహ్మఘ్ననకు, సురాపునకు, మరియు । ధ్రువము భగ్నవ్రతునకు
చోరునకు దలప
నిష్కృతిని జెప్పియుండిరి నీతివిదులు । చెప్పరు కృతఘ్నున కింక నిష్కృతిని
సుంత॥ 12

తే. కడు కృతఘ్నుడవును ననార్యుడవు నీవు । వానరుండ! మిథ్యావాది వౌదు వౌర
ముందు నీవు కృతార్థత జెంది, మరల । రామునకు మేలు సేయ దలంప వింత॥

తే. అట్టు లుపకారమును పొంది నట్టి నీవు । మరల ప్రత్యుపకృతిసేయు వాడ వేని
సీత వెదకెడి యత్నంబు సేయుచుంట । నీకు కర్తవ్యమే కాదె నిజము తలప॥14

తే. కపివి, గ్రామ్యంబులైన భోగముల దగిలి । ఔర, మిథ్యాప్రతిశ్రవుం డైతి వీవు
రాము డెరుగక పోయె పూర్వంబునందె । అకట, కప్పయెలుంగు పా మనుచు
నిన్ను॥ 15

తే. కరుణవేది మహాత్ముండు, ఘనయశుండు । రాఘవుండు మహాభాగు డోఘ
బలుడు
పాపికి దురాత్మునకు నీకు వాలి గూల్చి । ఔర! కపిరాజ్యమిప్పించె యరయ కింత॥

తే. రాము డక్లిష్టకర్ముండు ప్లవగ! నీకు నెరపియుండిన మేల్ నీవు మరచియున్న
నిశితబాణాల నిప్పుడే నిన్ను జంపి । వాలి జూడంగ బంపుదు యమునిపురికి॥ 17

తే. మూత పడలేదు మార్గ మే పుంత బట్టి! వాలి హతుడైన చనియెనో బాణ
నిహతి
నిలువు సుగ్రీవ! చేసిన నియతియందు! పోకు నీయన్న చనినట్టి పుంతబట్టి! 18

ద్వి. కాకుత్స్థవరు కార్ముకమునుండి వెడలు। శరముల మరి వజ్రసన్నిభంబులను
నిజము చూడగ లేదు నీవు; కాకున్న। సుఖముల మున్గెదే సుఖవి, హాయిగను
మదినైన దలపక మాదు కార్యంబు! 19

34వ సర్గ సమాప్తి - (1,459).



# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది అయిదవ సర్గ — (23)

తార పరల లక్ష్మణుని శాంతపరచుట - సీతను వెదకుటకై కపులను రమ్మని సుగ్రీవుడు లోగడనే ఆజ్ఞాపించెననియు, వారు త్వరలో రానున్నారనియు, నీవు అనాలోచితముగ త్వరపడవలదనియు తార చెప్పుట :—

తే. ఇటుల బల్కెడు లక్ష్మణు పటు బలాఢ్యు। తేజమునమండుచున్నట్టి తెరగువాని
తన్వి తారాధిపానన తార చూచి। లక్ష్మణున కిట్లు బలికె దా తక్షణంబ॥ 1

తే. వలదు నీ విట్టు లనగ భూవరకుమార!। పరుషముల కిట్టు లీతడు వరద! తగడు
ఇట్టి వింక విశేషించి నీదు నోట। వినదగండయ్య మిత్రుడీ యినసుతుండు॥ 2

తే. కాదు సుగ్రీవు డకృతజ్ఞు డేడగాని। కాదు కుటిలుడు శఠుడును కాదుసుమ్ము
దారుణుడుకాడు, మరి, దగాకోరు కాడు। విను మబద్ధికుడును కాడు, వీర! యితడు॥

తే. రణమునం దన్యులకు దుష్కరంబునైన। కృతము శ్రీరాము డెద్ది తా జేసె తనకు
దాని సైతము మరువ డీ వానరుండు। నిజము, సుగ్రీవు డెంతయు నృపకుమార॥

తే. ఇతడు రామప్రసాదాన వితత కీర్తి। జగతి కపిరాజ్య మిద్ది శాశ్వతము బడసె
రుమను, నన్నును సైతంబు ధ్రువ మితండు। బడసె సుగ్రీవు డెంతయు బడలకుండ॥

తే. మున్ను కడు దుఃఖముల నొంటి భూమిబండి। ఇపుడు సుఖమును నుత్తమం బెటులో చెంది
సమయకాలంబు మరచె నీ చపల కపియు। వినుము, వత్స! విశ్వామిత్రమునిని బోలి॥ 6

తే. మును ఘృతాచిని దగిలి లక్ష్మణుడ! వినవె। జగతి దశవర్షముల నొక్క పగలుగాగ
దలచెగాదె విశ్వామిత్రు డలఘుయశుడు। పరమధర్మాత్ముడా తపో నిరతుడనఘ॥

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది అయిదవ సర్గ — (23)

తార పలుకుల లక్ష్మణుని శాంతపరచుట - సీతను వెదకుటకై కపులను రప్పించ సుగ్రీవుడు లోగడనే ఆజ్ఞాపించెననియు, వారు త్వరలో రానున్నారనియు, నీవు అనాలోచితముగ త్వరపడవలదనియు తార సౌమిత్రి చెప్పుట :—

తే. ఇటుల బల్కెడు లక్ష్మణు పటు బలాఢ్యు। తేజమునమందుచున్నట్టి తెరగువాని
తన్వి తారాధిపానన తార చూచి। లక్ష్మణున కిట్లు బలికె దా తక్షణంబ॥ 1

తే. వలదు నీ విట్టు లనగ భూవరకుమార!। పరుషముల కిట్టు లీతడు వరద! తగడు
ఇట్టి వింక విశేషించి నీదు నోట। వినదగండయ్య మిత్రుడీ యినసుతుండు॥ 2

తే. కాడు సుగ్రీవు డకృతజ్ఞు డేడగాని। కాడు కుటిలుడు శఠుడును కాడు సుమ్ము
దారుణుడు కాడు, మరి, దగాకోరు కాడు। విను మబద్ధికుడును కాడు, వీర! యితడు॥

తే. రణమునం దన్యులకు దుష్కరంబునైన। కృతము శ్రీరాము డెద్ది తా జేసె తనకు
దాని నైతము మరువ డీ వానరుండు। నిజము, సుగ్రీవు డెంతయు నృపకుమార॥

తే. ఇతడు రామప్రసాదాన వితత కీర్తి। జగతి కపిరాజ్య మిద్ది శాశ్వతము బడసె
రుమను, నన్నును నైతంబు ధ్రువ మితండు।బడసె సుగ్రీవు డెంతయ బడలకుండ॥

తే. మున్ను కడు దుఃఖముల నొంటి భూమిబండి। ఇపుడు సుఖమును నుత్తమం
బెటులో చెంది
సమయకాలంబు మరచె నీ చపల కపియు। వినుము, వత్స! విశ్వామిత్రమునిని
బోలి॥ 6

తే. మును ఘృతాచిని దగిలి లక్ష్మణుడ! వినవె।జగతి దశవర్షముల నొక్క పగలుగాగ
దలచెగాదె విశ్వామిత్రు డలఘుయశుడు।పరమధర్మాత్ము డా తపో నిరతు డనఘ॥

తే. అతడు కాలవిదాంవరుం డయ్యె వత్స!। మరి, మహాతేజుడయ్యె దా నెరుగడయ్యె
జరుగుకాలంబు నంత యా సంయమియును। ఇంక, ఇతరుల సంగతి యేల
చెప్ప?॥ 8

తే. కడు పరిశ్రాంతుడై చిరకాలమట్లు। దేహధర్మంబు నిపు డెట్లొ దేవ! పొంది
కామసుఖముల నిక తృప్తిగనక యున్న। ఇతని లోలత నీవు క్షమింప దగును॥ 9

తే. నీవు రోషవశంగతుం డిట్టు లగుట। తగదు లక్ష్మణ! నామాట తాత! వినుము
నిశ్చయార్థంబు తెలియక నీకు తగదు। ప్రాకృతుని యట్లు త్వరపడి మాటలాడ॥

తే. సత్త్వయుక్తులు నీవంటి సత్పురుషులు। పురుషవృషభుండ! త్వరపడి ఎందుగాని
ఇట్టు లవిమృశ్యముగ నెప్డు డెడదలోన। రోషమున కింత లక్ష్మణా! లోనుగారు॥

తే. ఇదిగొ, దేవ! సుగ్రీవార్థ మేను నిన్ను। వేడుకొందును ధర్మజ్ఞ! వీడు మలుక
అధికరోషసముత్పన్నమైన యట్టి। తీవ్ర సంరంభమియ్యది డింపు మయ్య॥ 12

తే. రుమను, కపిరాజ్యమును, నన్ను, ధ్రువము దేవ!। వసుచయంబుల ధనధాన్య
వారములను
వినుము రామప్రియార్థమై విడిచివైచు। ఇతడు సుగ్రీవు డంచు నా మతము
సుమ్ము! 13

తే. చేర్చగల డయ్య రాము నా సీతతోడ। తాత! సుగ్రీవు డిదిగొ సత్వరముగాగ
అల్ల రోహిణితోడ శశాంకు నట్లు। రావణాధము రణములో రాచి వైచి॥ 14

తే. లంకలోపల రాక్షసుల్ లక్ష కోట్లు। లక్ష లక్షలు లెక్కిడ రాక యుండ
కలరటందురు; కామరూపులును మరియు। మిగుల దుర్ధర్షు లంచు రా
మేటిబలులు॥ 15

తే. అట్టు లున్నట్టి యా రాక్షసాళి నెల్ల। ముందుగా జంపకుండంగ మోహరమున
శక్యమెట్లొను రావణు సంహరింప। అకట సీతాపహర్త నా యఘము, నసురు॥

తే. బహుళ కపిసైన్యముల తోడుపాటు లేక। రక్కసులమూక గూల్ప శక్యంబు గాదు
మరి, విశేషించి రావణు క్రూరకుటసుర। గూల్పగారాదు సుమ్ము లత్ క్రూరకర్ము॥

తే. ఇటుల జెప్పెను వాలి నా కెపుడొ, దేవ! అతడు తెలిసినవాడు సు మ్మాతల
మనఘ,
న్యాయము నాకేమొ తెలియ వీ సంగతులును। వినుట జెప్పితి నీకు లక్ష్మణ
కుమార॥ 18

తే. త్వత్సహాయనిమిత్తమే వానరులను । పెక్కు మందిని గొని తేర దిక్కులకును
ప్రభుడు సుగ్రీవు డంపించె ప్రకటబలుల । కపిగణేశుల రణముల కర్కశులను॥ 19

తే. బహుళ విక్రాంతు లా మహాబలుల కొరకె । ఎదురు చూచుచు నున్న వా డీ విభుండు
కాననే, రామచంద్రుని కలిసికొనగ । బయలు దేరగ లేదు సుమ్మాత డింతె॥ 20

తే. నీదు రాకకు పూర్వంబె మాదు విభుడు । చేసె సుగ్రీవు డేర్పాట్లు స్థిరత నెల్ల
ఇపుడె వానరు లెల్ల రా విపులబలులు । రావలసియున్నవారు సూ లక్ష్మణుండ॥

తే. ఋక్షకోటిసహస్రముల్ లక్షలాది । సంఖ్యలైన గోలాంగూల సముదయములు
దీప్తతేజు లనేక కోట్లాప్తకపులు । వచ్చి నిన్ గొల్తురిపుడె; కోపంబు డింపు॥ 22

ద్వి. నీ ముఖ మిది చూచి నెత్తురొల్కెటి । నీ కండ్ల నీక్షించి ఈ కపికాంత
లెడదల శాంతిని లేకున్నవారు; । ప్రథమభయంబున బహుచుంద్రి శంక॥ 23

35వ సర్గ సమాప్తి — (1,482)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది ఆరవ సర్గ - (20)

లక్ష్మణుడు శాంతపడుట - అంత, లక్ష్మణసుగ్రీవులు అన్యోన్యము సుహృద్భావముతో భాషించుకొనుట:

ఆ. తార యిటుల బలుక ధర్మసంహితమును । ప్రశ్రితంబునైన వాక్య మద్ది
విడదగొనియె నపుడ మృదులస్వభావుండు । లక్ష్మణుండు సుగుణ లక్షణుండు॥ 1

ఆ. అటుల తార పల్కు నంగీకరించుచు । సఖుడు లక్ష్మణుడు ప్రసన్నుడగుడు
మది, మహాభయంబు మర్కటేశుడు వీడె । పోల్ప క్లిన్నవస్త్రమును నసంగ॥ 2

ఆ. అంత కంఠగతము నమిత భోగప్రదం । బమర చిత్రమాల్య మద్ది త్రెంచి
విమదుడౌచు నచట సముఖమందున నిల్చె।హరిగణేశ్వరుండు తరణిసుతుడు॥ 3

తే. సకలవానరసత్తముం డకలుషుండు । సఖుడు సుగ్రీవు డపుడు లక్ష్మణుని జూచి
హర్ష మతనికి భీమబలాధికునకు । నొసగ జేయుచు ప్రశ్రితం బిటుల బలికె॥ 4

ఆ. ధర ప్రణష్టమైన సిరియు కీర్తియు, మరి । ప్లవగరాజ్య మిద్ది యవ్యయంబు
రామదేవుదయనె ప్రాప్తించె లక్ష్మణా । మరల నాకు నిట్లు మహితగతిని॥ 5

తే. స్వీయకర్మల విఖ్యాతి జెందినట్టి । దేవదేవున కా రామదేవునకును
తాదృశ పరాక్రమునకు నిద్ధరణి నెవడు । నిజము ప్రత్యుపకారంబు నెరపగలడు॥

తే. సీత నా ధర్మవిదుడొందు సిద్ధ మింత । వధమొనర్చును రావణు యుధి నిజంబు
నే నిక సహాయమాత్రుండనే, మహాత్మ । స్వీయ తేజాన రాముడే సేయు నింతు॥

తే. ఒకరి సాహాయ్య మేమి యా యోధమణికి । సప్తసాలాల వసుధ నా శైలము నటు
బాణ మేకాన జీల్చిన భూనుతునకు। బాహు బలశాలి కా రామ పార్థివునకు॥ 8

తే. ఎవని కార్ముక టంకార రవళి జేసి । ఈ సశైలంబు భూమి కంపించిపోయె
అతని కితరుల సాహాయ్య మనగ, దేవ! ।అర్థమేమియొ చెప్పుమా యరివిమర్ద!॥9
తే. శాత్రవుని. రావణుని, నింక సైన్యయుతము।హతమొనర్చగ రణభూమికరుగునట్టి
ఆ నరేంద్రుని వెనుక నే నరుగు వాడ । సాయ మిది యంట నిజముగా
సాహసంబు॥ 10
తే. ప్రణయకారణముననో, విశ్వాసముననో । ఏదొ కొంచెము కాల మతీతమైన
ప్రేష్య నాదగు తప్పు క్షమింపదగును । తప్పు సేయని వా డెవం డప్ప! ధరణి॥
తే.ఇట్టు లనెడి మహాత్ము డా యినసుతు నెడ । అల్ల సుగ్రీవు నెడ లక్ష్మణార్యు డపుడు
ప్రీతుడయ్యెను నెంతయు హృదయమందు । మరియు నిటువల్కె ప్రేమచే
సరసు డతడు॥ 12
తే. సర్వథా యింక ప్రఖ్యాత జగతిలోన । నిజముగ సనాథుడేను సందియము లేదు
నీవు నాథుండ వగుట సుగ్రీవ! యిటుల। మరి, విశేషించి పవిత్రుండవును నాట॥
తే. నీ ప్రభావంబు సుగ్రీవ! నీదు శుచిత। మరియు నీ యార్జవంబు నేమందు సఖుడ
అర్హుడవు నీవు కపిరాజ్య లక్ష్మి జగతి । నిది, యనుత్తమ మిట్లు
భోగించుటకును॥ 14
తే. నీ సహాయాన సుగ్రీవ! నిశ్చయంబు । దాశరథి రామవిభుడు ప్రతాపశాలి.
వధ మొనర్చును రణమున వైరి నింక । అచిరకాలంబునందె సంశయము లేదు॥
తే. వినుత ధర్మజ్ఞునకు కృతజ్ఞునకు, నింక । యుధిని ననివర్తుడౌనట్టి యోధునకును
మిగుల ఉపపన్నమును, యుక్తమగు విధాన।ఒప్పుచున్నది నీమాట ఓసఖుండ॥
తే. ధ్రువ మిక సమర్థు డెవడు స్వదోషములను । గుర్తెరుంగుచు నిటు లొప్పు
కొనుచు బల్కె? ;
నీవు న్యాయన్న దక్క౦గ నిజముగాను । వానరోత్తమ! లేరయ్య పరు లెవరును॥
తే. సదృశుడవు నీవు బలమున సాహసమున । విక్రమంబున రామపృథ్వీశ్వరునకు
ఇటుల చిరకాలమునకు నిన్నిచ్చి రయ్య!। అమరులే మాకు నిజము సహాయుగాగ॥
తే. ఇంక యే మిట? శీఘ్రమే యిచటనుండి।. వెడలుదము రమ్ము నాతోడ వీరవర్య
సాంత్వనమొనర్చుమయ్య నీ సఖుని రాము । చిరము భార్యాపహారణకర్శితుని,
నతని॥ 19
తే. అచట శోకాభిభూతు నా యన్న రాము । భాషితంబుల విని నేను పరుషములను
వేని నిచ్చట వచియించినానొ, సఖుడ । వాని క్షమియింప దగు దీవు వానరేశ॥
౩౬వ సర్గ సమాప్తి — (1,502)

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది ఏడవ సర్గ - (37)

—: ఇంకొంకా సర్వవానర సమూహములు వచ్చిచేరుట :—

తే॥ ఇటు మహాత్ముండు లక్ష్మణుం డినకులుండు । చెప్పగా విని సుగ్రీవు డప్పు డపుడె
పార్శ్వమందున్న సచివు నా పావమాని । నల్ల హనుమంతు జూచి యిట్లనియె
విభుడు॥ 1

సీ. హిమవన్మహేంద్రాద్రిన వింధ్యకైలాసాన
పాండురశిఖరాన మందరాన
బాలార్కవర్ణసుల్ భ్రాజమానంబు లా
అపరాబ్ధి దిశ నొప్పు నదీతతుల
ఆదిత్యభవనంబు సంధ్యాభ్రనిభ మద్రి
పద్మతాళవనంబు భయదమునను
అంజనాద్రిని నొప్పు కుంజర ప్రతిముల
అంజనాంబుదతుల్యులైన కపుల

తే॥ వసుధను మనశ్శిలాగుహా వాసహరుల । మేరు పార్శ్వానమున్న యమేయబలుల
ధూమ్రగిరి నొప్పు వారల తోడితెమ్ము । అల, మహారుణగిరిబొల్చు వరుణ
కపులు॥

తే॥ రమ్య సౌగంధికవనాంతరంబులందు । రహిని మైరేయ మధువుల ద్రావుకపుల
ప్రబల,వేగుల తాపసాశ్రమములందు । రమ్యవనముల దిరుగు వారలను వెల్ల॥

తే॥ మరియు, పృథివిని నెం దెందు వరలు వట్టి । సర్వవానరతతులను సత్వరంబ
సామదానాదిగతుల నిచ్చటికి నిపుడె । తోడితేరంగ బంపు మస్తోకలీల॥

తే. దూతల మహాజవుల నేను ఖ్యాతిమీర। ముందె పంపించి యుంటి; వారందరి నిక
త్వరింపంగ కొందరి తూర్ణ మిపుడె । పంపు హరులను హనుమంత!
పెంపుమీర॥ 10

తే. ఎవరు కామప్రసక్తులో యెవ్వ రెవరు । సోమరులో, దీర్ఘసూత్రులో చూచి నీవు
పంపు నా చెంత కికి యట్టివారి నెల్ల । సత్వరమె పొమ్ము, యిదియె నా శాసనమ్ము॥

తే. ఇదియె నా యాజ్ఞ చొప్పున పది దినముల। కిచ్చటికి రాక దక్కిన చచ్చువారె
కపులునా చేత; దుర్మతుల్ కాపురుషులు । రాజశాసనదూషకుల్ వారు సుమ్ము॥

తే. శతసహస్రలు, కోట్లు మత్ శాసనమున । ప్లవగసింహులు నామతి వరలువారు
దిశదిశలకిప్పుడే పోయి తిరిగితిరిగి । వానరుల బంపుదురుగాక వరుస నిటకు॥ 13

తే. మేఘపర్వతతుల్యు లమేయబలులు । అంబరంబెల్ల గప్పెడి డంబుమీర
ఘోరరూపులు కపివరుల్ కూడియెల్ల । పోవుదురుగాక యిటనుండి
పొంగుకొంచు॥ 14

తే. వసుధ వానరు లుండెడి పట్టులెల్ల । తెలిసియున్నట్టి కపులెల్లదిశల కిపుడె
పోయి మత్శాసనంబునభూమిందిరిగి । తోడితేవలె కపుల నస్తోకలీల॥ 15

తే. ప్రభుని వానరరాజన్యు వచనములను । విని ప్రభంజనసుతుడు వే వేగ బనిచె
చటుల విక్రాంతులైన మర్కటుల నెల్ల । నిఖల దిక్కుల కప్పుడే నృపుని యాజ్ఞ॥

తే. పక్షినక్షత్రమార్గగుల్ ప్లవగులెల్ల । తమదు విభునాజ్ఞ తలదాల్చి తక్షణంబ
విష్ణువిక్రాంతపద మది విన్ను కెగసి । వెడలిపోయిరి దిశల కెల్లెడల వడిగ॥ 17

తే. గిరుల వనముల కొలకుల మరి సముద్ర । తీరముల ద్వీపముల గల్గు భూరికపుల
రాముకార్యార్థమై కపిరాజునాజ్ఞ । హెచ్చరించుచు పయనింప జేసిరపుడు॥ 18

తే. మృత్యుకాలోపముండు, త న్మిహిర సుతుని। రాజరాజన్యు సుగ్రీవు నాజ్ఞయగుట
దాని విని వానరౌఘముల్ తక్షణంబ । బయలు వెడలిరి సుగ్రీవు భయము జేసి॥

తే. అంత నా యంజనాద్రి నున్నట్టి హరులు। చూడ నంజనతుల్యులు మూడుకోట్లు
పటు మహాజవు లప్పుడే పయనమైరి। రాఘవుండున్న యెడకు నవోఘధాటి॥ 20

తే. అర్కు డస్తంగతుండు దా నగును నెచట । అట్టి గిరివరమందున్న యట్టి కపులు
తప్తహేమమహాభాసు లొప్పు లెల్ల । కోట్లు పదియును వెడలిరి 'కో' యటంచు॥

తే. అల్ల కైలాస శిఖరమం దుల్లసిలెడి । సింహకేసరవర్చసుల్ రంభాసులతోన
అప్పుడు కోటిసహస్రలా యద్రినుండి । వెడలివచ్చిరి కెరలుచు విభుని నాజ్ఞ॥22

తే. వితతఫలమూలములను జీవించువారు । చెలగి హిమవన్నగంబునం దలరువారు
అల్ల కోటిసహస్రసాహస్రు లపుడె । రా దొడగి రొక్కపెట్టున రాజునాజ్ఞ॥ 23

తే. మరియు, సంగారకోపముల్ మహితబలులు । భీమకర్ములు భీములు వింధ్యశిఖరి
తటము లందుండి వెడలిరి తక్షణంబ । అట్టి లెక్కిడరానట్టి కోట్లసంఖ్య॥ 24

తే. వసుధ క్షీరోదవేలా నివాసులైన । హరులును, తమాలవనవాసులైన కపులు
నారికేళాశనుల్ తమ నాథునాజ్ఞ । వెడలి రిక వారి సంఖ్య లెక్కిడగ రాదు॥

తే. వనములనునుండి, గహ్వరపటలినుండి । మరి, సరిత్తులనుండి, వానరుల సేన
పటు మహాజవ మప్పుడే వచ్చుచుండె । దివి దివాకరు మ్రింగెడి తెరగు గ్రమ్మ॥

తే. సర్వవానరవరుల హెచ్చరిక జేసి । వారి త్వరబెట్ట జనినట్టి వానరులును
గాంచిరి హిమాలయంబు ప్రఖ్యాత మద్ది । మరియును, మహాద్రుమంబు
తన్మహిత మచట॥ 27

తే. మున్ను గిరివర మద్దాన జన్నమొకటి । జరిగె మాహేశ్వరంబు ప్రశస్త మద్ది
రమ్యము, మనోరమంబు, దివ్యంబు మరియు,। సర్వదేవమనస్తోష పర్వమగుచు॥

తే. అన్ననిష్యండజాతంబు లమృతతుల్య । రుచికరంబులు ఫలమూల నిచయములును
వెలయుచుండంగ గాంచి రా వీరకపులు।ప్రథిత మా యజ్ఞవాటిక నధికముగను॥

తే. అచ్చట, తదన్నసంభవం బగుచు నహహ । దివ్యము మనోరమంబునై తేజరిల్లు
ఫలమొ మూలమొ యిక యొకమారు తినిన । చాలు; మాసంబుతృప్తుడై
చను నరుండు॥ 30

తే. వారలు, ఫలాశనుల్ కపి వీరు లెల్ల । తత్ఫలంబుల కందమూలాదికముల
దివ్యముల గొంచు మరియు నందే వెలుంగు । ఔషధంబుల గొనిరి
మహా త్తరముల॥ 31

తే. ఘనతరం బట్టి యజ్ఞాయతనము నుండి । సురభిళంబుల బహుళముల్
సుమచయముల
గొంచుబోయిరి వానరుల్ గొప్పగాను । ప్రభుని సుగ్రీవునకును హర్షంబు
గొలుప॥ 32

తే. వార లా సర్వహరివరుల్ వసుధగల్గు । సర్వవానరతతుల హెచ్చరిక జేసి
మింట నా కపియూథాల కంటెముందె । ఎగసి వచ్చిరి కిష్కింధ నగరమునకు॥

తే. లక్ష్మణుం డట్టు లంతిపురంబునందె । యుండియున్న ముహూర్తాన చండ గతిని
త్వరితగాములు కపిసైన్యపతులు వచ్చి । చేరి రచటకి సుగ్రీవు చెంత కెలమి॥ 34

తే. ఓషధుల, కందమూల ఫలౌఘములను । భక్తిగొనివచ్చి కానుకగా ప్రభుని కపుడె
పెట్టుచు, కపీశులెల్ల రా విభుని తోడ । విన్నవించిరి వినయసంపన్నులగుచు॥ 35

తే. సర్వజలధుల దిరిగియు సర్వగిరుల । సర్వవనముల నీయాజ్ఞ చాటినాము
పృథివిగల సర్వవానర బృందములును । వచ్చుచున్నారు నీయాజ్ఞ వరుస గనుమ॥

ఆ. వార లిటుల జెప్ప ప్రభుడు సుగ్రీవుండు । వించు కరము హర్షహృదయు డగుచు
కపులు దెచ్చియున్న కానుకల నెల్లను । గొనియె నతడు వారి కూర్మి మెచ్చి॥ 37

37వ సర్గ సమాప్తి — (1,539)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది ఎనిమిదవ సర్గ - (34)

సుగ్రీవ లక్ష్మణులు తరలి, రాముని కడకుపోయి, వానరసమూహములు వచ్చుచున్న సంగతి చెప్పగా, రాముడు హర్షించుట :—

తే. ఘనత వారెల్ల రిచ్చిన కానుకలెల్ల । గైకొనుచు ప్రీతి సుగ్రీవు డా కపీశు
డెల్ల వారల నిక సంతసిల్ల జేసి । ఇండ్లకున్ బోవ సెలవిచ్చె నినసుతుంపు॥ 1

తే. హరుల, కృతకర్ములను, శూరవరుల నటుల । సెలవొసంగుచుబంపి యా వలిముఖుండు
తానును మహాబలుండు త ద్దాశరధియు । తథ్యము కృతార్థులైనట్లె తలచెనెడద॥

తే. భీమబలు సర్వవానర వీరవర్యు । సఖుని సుగ్రీవు మదికి హర్షంబు బొదల
"ఇంక నీ కిష్టమైన కిష్కింధ వెడలి। సౌమ్య! పోదమొ" యం చని సరసముగను
పలికెవాక్యంబు సౌమిత్రి ప్రశ్రితంబు॥

తే. అంత నా వాక్యమును లక్ష్మణార్యునోట । వెడలిన సుభాషితంబును వినుచు నపుడె
హృదిని సంప్రీతుడౌచు సుగ్రీవు డెసగి । వాక్య మిటుబల్కె లక్ష్మణస్వామితోడ॥ 4

తే. ఆట్లెయాగాక; పోదము తక్షణంబ; । ప్రభుడ! నీయాజ్ఞనే నిల్వవలయు వాడ
నూరి, స్వతంత్రుడ గా నంచు పలికి యపుడె । అనిపివైచెను తార ముఖ్యైన స్త్రీల॥ 5

తే. పిదప ఇటురండటంచు దా పిలువ హరులు । భటులు స్త్రీదర్శనక్షముల్ చటుల బలులు
వచ్చి కేళోద్భుల ఘటించి ప్రక్క నిలువ । వారి కిటుబల్కె రవిసమప్రభుడు ప్రభుడు॥ 6-8

తే. తెంపు నాపల్లకిని వేగ పొం డనగ నె। చూడ్కులకు వేడ్క సేయు నా శుభ్ర శిబిక
దెచ్చి యా శిఘ్రవిక్రముల్ దించగానె । లక్ష్మణా! యెక్కు మనియె శీఘ్రం బతండు॥ 9-10

తే. ఇట్లు వచింపుచు నపుడె యా యినసుతుండు । ఎక్కె లక్ష్మణుతోడ నా యినసమంబు
యానరాజంబు స్వర్ణమయాంచితంబు । విపుల కపివర యుక్తంబు విస్తృతంబు॥

సీ. శ్వేతాతపత్రంబు శిరముపై చెన్నొంద
నెల్లవింజామరల్ వీచుచుండ
శంఖభేరీధ్వనుల్ సంకులంబుగ మ్రోగ
మంగళస్తోత్రముల్ పొంగిపొరల
శస్త్రపాణులు కపుల్ శతములు తీక్ష్ణులు
వరలి చుట్టును బరాబరుల నిడగ
పూజ్య మఖండంబు రాజ్యశ్రియం బది
పరిఢవిల్లుచునుండ బయలువెడలి

తే. అల్ల శ్రీరాముడున్న ప్రస్రవణ గిరిని । జేరి లక్ష్మణసహిత మా శిబికనుండి
దిగుచు సుగ్రీవు డా మహాతేజు డల్లె । నిలిచె రామునికెదుర నంజలిఘటించి॥

తే. అటుల సుగ్రీవు డంజలి పుటము బట్టి । నిలచియుండుట జూచి యా నిఖిలకపులు
ఊర్ధ్వతాంజలిపద్ములై యుర్విె నటనె । నిలిచియుండిరి తాము నృపుని యెదుట॥

తే. వర తటాకంబు కుట్మలపంకజంబు । కరణినున్నట్టి యా మహాకపిబలంబు
గాంచి సుగ్రీవు నెడల నిక్ష్వాకువిభుడు । రామచంద్రుండు పరమ సంప్రీతుడయ్యె॥

తే. పాదములపైన శిరముంచి పడినయట్టి । ఆ హరీశ్వరు చేతుల నట్టె యెత్తి
ప్రేమచేతను బహుమానదృష్టి చేత । కౌగలించెను రాము డా కపివరేణ్యు॥ 18

ఆ. కౌగలించి యటుల వేగ ధర్మాత్ముండు । కూరుచుండుమంచు కూర్మిఁబలికె
క్షితిని గూరుచున్న స్నేహితు సుగ్రీవు । నరసి పలికె రామనరవరుండు॥ 19

తే. ధర్మ మర్థము కామము తగు విధానఁ। జక్కఁ విభజించి యయ్యయి సమయములను
సతము సేవించుచుండెడి జనుఁడె జగతి । రాజనగ నొప్పు వానరరాజ! వింటె॥

తే. విడిచి ధర్మంబు, నర్థంబు విడిచినైచి । సతము కామంబె సేవించు జనుఁడు వినఁడు
చెట్టుకొనయందు నిద్రించు నట్టివాని । మాడ్కి మేల్కను పడినపిమ్మట నె రాజ॥

తే. కర మమిత్రుల వధమున నిరతుఁ డగుచు । మిత్రసంగ్రహమునను సంప్రీతుఁ డగుచు
అనయము త్రివర్గ ఫలభోక్తయైన రాజె । ధర్మమూర్ధాన దనరెడి ధన్యుఁడగును॥

తే "వచ్చె నుద్యోగకాలంబు వసుధ కిదియె । అరివినాశన! పింగేశ! హరుల గూడి
సచివులనుగూడి కర్తవ్య సరణినింక। యోచనము సేయు" మన కపియోధుఁ డనియె।

ఆ. ధర, ప్రనష్టమైన సిరియు కీర్తియు మరి । ప్లవగరాజ్య మిద్ది యవ్యయంబు
నీ ప్రసాదముననె నిజము ప్రాప్తించెను । మరల నాకు నిట్లు మహితగతిని॥ 25

తే. నీ ప్రసాదాన దేవరా! నీదుతమ్ము । దయను జయతాంవరా! నాకు దక్కె నింత;
కృతమునకు నింక ప్రత్యుపకృతిని రాజ! । సలుపకున్నట్టివాఁడె దూషకుఁడు సుమ్ము॥

తే. వీరె వానరముఖ్యులు వేలసంఖ్య । శత్రుసూదన! తిరిగి యీ జగతి నెల్ల
పిలిచివచ్చిరి రాఘవా! పృథివిగల్గు । సర్వవానరశతుల, ప్రశస్తబలుల॥ 27

తే. ఋక్షతతుల, గోలాంగూల బృందములను । ఘోరదర్శనులైనట్టి శూరకపుల
భూరికాంతారవనదుర్గములను నెల్ల । తెలిసియున్నట్టి వారల పిలిచి రధిప॥ 28

తే. దేవగంధర్వపుత్రులు దివ్యతనులు। కామరూపులు వానరుల్ రామచంద్ర!
బయలువెడలిరి తమతమ బలగములను; । త్రోవనున్నారు వారిదే తోతురిపుడె॥

కం. కొందరు వందల వేలను । కొందరు పదివేలకపుల కొందరు కోట్లన్
కొందరు శంఖముసంఖ్యల । సందడి తమవెంటగొనుచు చనుదెంత్రు, ప్రభూ॥

తే. అర్బుదంబులు ఖర్వంబులైన కపుల । *1మధ్యములు, *2నంతములునైన మర్కటులను
ఆదె సముద్రపరార్థసంఖ్యానకములఁ । హరులగొనివచ్చుచున్నారు సైన్యపతులు॥

* 1. మధ్యము=అర్బుదమునకు పదిరెట్లు.

* 2. అంతాః=మధ్యమునకు పదిరెట్లు. ఇవి రెండును సంఖ్యామానములు.

తే వచ్చుచున్నారు వా రదే ప్రభుడ కినుము । అందరు మహేంద్రసమవిక్ర మాఢ్యు లనఘ
మేరుమందరతుల్యు లో వీరవర్య । వింధ్యమేరుకృతాలయుల్ వీర్యయుతులు ॥

తే. దానవుని, రావణుని, సంబాంధవము గాగ । సంయుగంబున నధియించి స్వామి ! నీకు
ప్రీతి మైథిలి నిక సమర్పింపగలుగు । వీరు లిదె వచ్చుచున్నారు విన్నుతోవ ॥

ద్వి. తన నిదేశంబున తరుచరాధిపుడు । నెరపిన యత్నంబు పరికించి యపుడు
వసుధాధిపాత్మజుం డసమానబుద్ధి । హర్షంబున ప్రబుద్ధమై యొప్పునట్టి
నీలోత్పలంబు నా నెనరొప్ప జూడ ॥ 34

38వ సర్గ సమాప్తి —(1,573)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ముప్పది తొమ్మిదవ సర్గ – (44)

రాముడు సుగ్రీవుని అభినందించుచున్నంతలో, ఆకసమెల్ల దుమారము రేగగ సర్వవానర సేనా సమూహములు తమతమ యూథపతులతో వచ్చి, రామసుగ్రీవుల ఎదుట నిలచుట.

తే. ప్రీతి నిట్లు వచించు సుగ్రీవు జూచి । దశరథసుతుండు ధర్మభృతాంవరుండు
అట కృతాంజలియైయున్న యర్కసుతుని । బాహువుల గౌగలించు చి ట్లనియె
బదులు ॥ 1

తే. ఇంద్రు డిక వర్ష మిలకు వర్షించు టనగ । చిత్రమే మది గా దెంతమాత్ర మనఘ
అల సహస్రాంశు డాదిత్యు డాకసంబు । వితిమిర మొనరించుటయును వింతగాదు॥

తే. శశియు తన రశ్మి తతిని నీ జగతి నెల్ల । నిర్మల మొనర్చుటయును విం తేమి గాదు
త్వద్విధులు మిత్రులకు పరంతపుడ ! ధ్రువము । ప్రతికృతి నొనర్చుటయును
చిత్రంబు గాదు ॥ 3

తే. ఇటుల నీయందు ప్రత్యుపకృతి యొనర్చు । శుభగుణం బుంట కా దింక
చోద్య మేమి
ఎరుగుదును నిన్ను సుగ్రీవ! హరిగణేశ ।అనవరత మిట్టి ప్రియవాది వగుట, సఖుడ॥

తే. త్వ త్సనాథుండ నేనింక బవరమందు । సకలశత్రుల గెల్చి తసంశయంబ
సుహృదుడవు నీవె యిక రణక్షోణి నాకు । మిత్రునకు సాయ మొనరింప
పాత్రుడౌదు ॥ 5

తే. అపహరించెను నాత్మవినాశమునకె । వంచన మొనర్చి సీత నా పందయసుర
శచిని పౌలోమి నటుల మున్ శక్రునుండి । అపహరించిన యా యనుహ్లాదు బోలి ॥

తే. అచిరమందె వధింతు నా యఘము నసురు । సునిశిత శరాళి నా రావణుని, ధ్రువంబు ।
దృష్ట పౌలోమిపితను నా యిందుృడట్లు । అవహంబున నిదె నీ సహాయమునను ॥

తే. ఇంతలోన దుమార మత్యంతముగను । రేగె గగనంబునందు రేరేని కాంతి
అల్ల యుష్ణాంశుకాంతి సహస్రకిరణు । తేజమెల్లను గప్పుచు, దిమ్ము మనుచు ॥

తే. దిశలు పర్యాకులం బయ్యె; తెలివి తప్పె; । అవనియు సశైలవనకాననాంతరంబు
చలనమొందెను సర్వంబు; చదలు మాసె । తదృజం బట్లు గ్రమ్మ యుప
ద్రవముగ ॥ 9

తే. అంతట నగేంద్రసంకాశు లమితబలులు । తీక్ష్ణదంష్ట్రిలు, కృత్స్న మీ పృథివి నార
గప్పు చరుదెంచి నిలిచిరి గగనమందు । మరి, యసంఖ్యేయులైన ప్లవంగులెల్ల ॥

తే. మరి, నిమేషాంతరం బందె యరుగు దెంచి । ప్లవగ యూథపులెల్ల రపారబలులు
కామరూపులు కోట్ల లెక్కకును మీరు । కపుల పరివారములతోడ గానబడిరి ॥

తే. పార్వతీయులు, నాదేయు, లుర్విగల్గు । అమితసత్త్వులు, సాముద్రులైన హరులు
మేఘనిర్హ్రాదులైన యమోఘ బలులు । ఇంక నెందరో కపు లావరించి రిలను

ద్వి. తరుణార్క వర్ణులు తరుచరుల్ మరియు । శశిగౌరులును శ్వేత సమవర్ణులెల్ల ॥
అబ్జకేసరవర్ణు లమితసత్త్వులును । మేరు కృతాలయుల్ మేటి వానరులు
పదివేలకోట్లును బలిసి తన్ గొలువ । 'శతవలి'ర్నాముండు వితతవీరుండు
శ్రీమంతు డచ్చట శీఘ్రంబె తోచె ॥

ద్వి. కాంచనశైలాభు డంచిత గుణుడు । ♦తారకు పితరుండు వీరవర్యుండు
తా నసేకంబుల దశసహస్రముల । కోటుల కపులతో "క్రో"యంచు దోచె ॥ 15

ద్వి. వేయికోటులకపివీరుల తోడ । *పితరుండు రుమ కల్ల వితతబలుండు
సుగ్రీవునకుమామ శూరవరుండు । విభుడు చమూపతి వే వచ్చెనటకు ॥ 14

♦ 1. సుషేణుడు. * 2. తారుడు.

ద్వి. తరుణార్కనిభముఖుం డురుబలాఢ్యుండు । అబ్జకేసరవర్ణ డమితసత్త్వుండు
బుద్ధిమంతుడు కపిముఖ్యుండు, ఘనుడు । సర్వవానరగణసత్తముం డప్పుడు
బహుసహస్రంబుల బహ్వనీకముల । పరివృతుండై చను దా నరుదెంచె నటకు
హనుమకు పితరుండు వినుతయశుండు । కేసరినాముండు కీశనాథుండు ॥

ద్వి. భూరి గోలాంగూలముల మహారాజు । భీమవిక్రముడు, బల్ కామరూపుండు
వేయికోటులసంఖ్య వీరవానరులు । చుట్టుముట్టగ గవాక్షుండు దా వచ్చె ॥
ద్వి. అరినిబర్హణుడు "ధూమ్రా"భిధానుండు । ఋక్షగణంబుల భీమవేగముల
రెండువేల్ కోటుల దండిసైన్యముల । పరివృతుండై చను దా నరుదెంచె నటకు ॥

ద్వి. ధర మహాచలనిభుల్ మరి ఘోరతనులు । మూడుకోటులసంఖ్య భూరివానరులు
తను గొల్వ నట దోచె 'పనస'నాముండు । పటు మహావీర్యుండు వారి
యూథపుండు ॥ 21

ద్వి. నీలాంజనచయంబుబోలు దేహుండు । "నీలుండు" మర్కటానీకాధిపుండు ।
మరి మహాకాయుండు నరుదెంచె నటకు । వేయికోటులకపుల్ వెంట రా తనకు ॥

ద్వి. కాంచనశైలాభు డంచితబలుడు । గవయుండు నా నొప్పు కపిగణేశుండు
అయిదుకోటులతోడ నా మహావీర్యు । డట దోచె నప్పుడే చటులంపుగతిని ॥

ద్వి. ఇక, "దరీముఖుడు" నా పృథుబలాఢ్యుండు । కపియూథనాథుండు గాన్పించె
నటనె
వేయికోటుల కపివీరులతోడ । సుగ్రీవుచెంతనే శూరవర్యుండు ॥ 24

ద్వి. ద్వివిదమైందులు మహాతేజులు, కవలు । అశ్వినీ పుత్రకుల్ శాశ్వతయశులు !
వేయికోటులకోట్లు వీరవానరులు । తముగొల్వ వచ్చిరి తడయ కచ్చటికి ॥ 25

ద్వి. బలవంతుడు, గజుండు బాహువీర్యుండు । మూడుకోటులకపుల్ మూగి తగ
గొలువ
ఆ మహాతేజు డా యమితసత్త్వుండు ! వచ్చి తా సుగ్రీవు పార్శ్వాన దోచె ॥

ద్వి. ఋక్షరాజన్యుండు రూక్షతేజుండు । జాంబవన్నాముండు శశ్వద్యశుండు
పదికోట్ల సేనతో కదలి తావచ్చి । ప్రభువరు సుగ్రీవు పజ్జనే నిలిచె ॥ 27

ద్వి. ఘనుడు, 'రుమణ్వంతు'డనెడి వానరుడు । అమితవిక్రాంతు డా యరినిషూదనుడు
నూరుకోటులసంఖ్య వీరవానరులు । తనుగొల్వ శీఘ్రమే తా వచ్చె నటకు ॥ 28

ద్వి. వేయిలక్షలునక్లై వేయికోటులును । హరులు తన్ గొలువంగ హరియూథ
పుండు
"గంధమాదను"డను ఘనతరాంగుండు । గాన్పించె శీఘ్రించె కపిరాజుచెంత॥

ద్వి. శతదళపద్మాల శంఖశతాల । ఉగ్రవానరులతో యువరాజ ఠీవి
పరిఢవిల్లగ వచ్చె మరి యంగదుండు । పితృసమవీర్యుండు వితతయశుండు॥ 30

ద్వి. తారుండు వీరుండు తారాద్యుతుండు । భీమపరాక్రముం డా మేటిబలుడు
అయిదుకోటులసంఖ్య హరుల దా గొంచు । దూరంబుగాదోచె తోడ్రివవచ్చు
చును॥ 31

ద్వి. ఈశు డేకాదశ కీశ కోటులకు । ఇంద్రజానుడు ప్లవంగేశుం౽ు ఘనుడు
త త్సైన్యముల గొంచు తక్షణం బెగసి । వచ్చె నా యూథపుం డచ్చటి కపుడె॥

ద్వి. పదివేలు వేలును వందలుగాగ । పన్నిన వానర బలములు గొంచు
తరుణార్క-సన్నిభుం డరుదెంచె నటకు । "రంభుండు" సైన్యసంరంభంబు వెలయ॥

ద్వి. దుర్ముఖుండనునట్టి దొడ్డవానరుడు । హరియూథపతియప్డు పరవీరహంత
రెండుకోటులసంఖ్య దండివానరుల । పరివృతుండై వచ్చె పటుబలాఢ్యుండు॥

ద్వి. కైలాసశిఖర విఖ్యాతులు కపులు । భీమవిక్రములు తన్ వెన్నంటిరాగ
వేయికోటులతోడ వే వచ్చెనటకు । " హనుమంతు " డా మహాహనుడు
ధీరుండు॥ 35

ద్వి. "నలుడు" మహావీర్య డలఘుయశుండు । ద్రుమవాసులును మహోగ్రులు
నైన కపుల
నూర్లవేలను కోట్ల నూర్లను గొనుచు । వచ్చి తా గాన్పించె ప్లవగేశునెదుట॥

ద్వి. సుగ్రీవమాతులుం డుగ్రతేజుండు । "దధిముఖ" నాముండు దర్పాధికుండు
శ్రీమంతు డటవచ్చి చెచ్చెర దోచె । పదికోట్లసేనతో ప్రభుపార్శ్వమందు॥ 37

ద్వి. "శరభుండు""కుముదుండు" మరియు "వహ్నియు"ను । "రంహుడు"మున్నుగా
ప్లవగ పుంగవులు
వచ్చి రెందరో యన్యు లచ్చటికపుడె । కామరూపులు మహాభీమ విక్రములు

ద్వి. ఆవరించుచు పృథ్వి యాకసంబెల్ల । సర్వత్రి వనముల పర్వతంబులను
పాకృతుల్ మరియు నపాకృతుల్ కపులు । యూథపుల్ చనిదెంచి రోజ నచ్చటికి
పెక్కు లా సంఖ్యల లెక్కిడగాదు॥ 39

ద్వి. ఎగురుచు దుముకుచు ఇకిలించుకొంచు । గర్జించు చురుకుచు కపులమూకలును
వేష్టించి నిల్చిరి విభుని సుగ్రీవు । అభ్రగణంబు లా యర్కుని నట్లు॥ 40

ద్వి. బాహుశాలులు వారు ప్లవగపుంగవులు । బహుశబ్దముల చేసి బహుళవార్షముల
తమతమ తలలెత్తి తమరాక నపుడు । ఏలిక సుగ్రీవు కెరిగించుకొనిరి॥ 41

తే. ఇంక కొందరు వానరశ్రేష్ఠు లపుడు । ఉచితగతి వేషములను సంకుచిత పరచి
అధిపు సుగ్రీవు చెంతకు నరుగుదెంచి । హస్తములుమోడ్చి నిలుచుండి రధిక భక్తి॥

తే. త్వరితగతి నంత సుగ్రీవు డురుగుణుండు । సర్వవానరపతుల నా త్మ్మవిభు నకు
రాఘవునకు నివేదించి పాంజలిగను । మరియు నిటుబల్కె వానరపతులకెల్ల॥

ద్వి. ఇక యథాసుఖము మీ రెల్ల బలాళి । గిరినిర్ఝరంబుల మరి వనంబులను
విభజించి విడియించి వీక్షించుకొంచు । ఏమరకుండుడీ యెరిగి సర్వంబు॥ 44

:- 39 వ సర్గ సమాప్తి :- (1,617)

★

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబదియవ సర్గ - (71)

( సుగ్రీవుఁడు వానరులను సీతను వెదకుటకై నానాదేశలకు పంపుట. తూర్పునకు వినతుని పంపుట )

తే. హృది సమృద్ధార్థుడైన సుగ్రీవుడంత । పరబలార్దను రాము నా పురుషవృషభు
గాంచి ప్లవగేశ్వరుండు పల్కెంగ దొడగె । తుష్టి నా నరశార్దూలుతోడనిట్లు॥

తే. వచ్చియున్నారు నా రాజ్యవాసులెల్ల । వానరులు వారణేంద్రాభులైన వారు
కామరూపులు నైనట్టి భీమబలులు । విడిసియున్నారు చూడు మెల్లెడల రామ॥

తే. బహుళవిక్రాంతులైనట్టి ప్లవగతతుల । భీమవిక్రములను గొంచు రామచంద్ర
వచ్చియున్నారు ఘోరులా ప్లవగపతులు। దైత్యదానవసన్నిభుల్ ధరణిగ్రమ్మ॥

తే. ఖ్యాత కర్మాపదాను లీ కపిగణంబు । కరము. బలవంతులును జితక్లములుసుమ్మ
ఘనపరాక్రమములను విఖ్యాతులెల్ల।భూప!వ్యవసాయమున నుత్తములును సుమ్మ

తే. ఇదె పృథివ్యంబుచరులు నరేంద్రచంద్ర । అవని నానానగ నివాసులైనకపులు
కోట్లకును మించి వచ్చిరి ఘోరతనులు। వీరె నీకింకరులు సమర్పింతు గొనుము॥

తే. ఎల్లరు నిదేశవర్తులు నృపవరేణ్య । గురుహితంబున రతులు నెల్లరును దేవ
నీ యభీష్టము నెరవేర్ప నిజము వీరు । కడు సమర్థులు సూ శత్రుకర్శనుండ!॥

తే. ఇప్పు డెయ్యది పనియొ వచింపుసఖుడ । ఇదియు నీ సైన్యమ.యుట నీవే మహాత్మ
ఆజ్ఞనిడదగు, భీమవిక్రములు వీరు । పెక్కువేల యనీకముల్ పేర్తు రిచట॥ 7

తే. వాస్తవము నీవు సేయంగవలయు నట్టి । కార్యతత్త్వంబు తెలియు నా కార్య మిత్ర
అయిన నీయిచ్ఛ దలచి మహాత్మ! యింక । నీవె యిడదగు నాజ్ఞ యనేకములకు॥

తే. ఇటుల వచియించు సుగ్రీవు నిష్టమిత్రు । దశరథాత్మజు డా రామధర్మవిభుడు
ప్రీతి బాహుల జాచి పరిష్వజించి । పలికెనిట్టుల నవితథ మధుర ఫణితి॥ 8

తే. తెలిసికొనవలె నాదు వైదేహియింక । బ్రతికి యున్నదో లేదో యీ వసుధ పైన
ఇలను రావణుడుండెడు నెలవు కూడ । ఎరిగి రావలె నింక నీ వేగి త్వరగ॥ 10

తే. రావణుం డున్న నెలవు, నా దేవి జాడ । ఎరిగినంతనె పిమ్మట నెరపవలయు
క్రమమునున్ గూర్చి మనమిద్దరమును గూడి । నిర్ణయింతము సుగ్రీవ! పూర్ణ మతిని॥ 11

తే. అధిప! ఈ కార్యమున నేను ప్రభుడగాను । కాడు లక్ష్మణుడునుకూడ వానరేశ!
నీవె యీపని సాధింప హేతు వనఘ! । నీవె ప్రభుడవు ప్లవగేశ! నిఖిలమునకు॥

తే. నీవె నాదగు కార్యవినిశ్చయంబు । సఖుడ! ఆజ్ఞాపనముసేయు మయ్య విభుడ!
నీకె తెలియును నా కార్య మెట్టిదోను।సంశయము లేదు వీర ! యీ యంశమందు

తే. లక్ష్మణునివంటి సుహృదుడ వయ్య నాకు । ప్రాజ్ఞుడవునీవు; కరము విక్రాంతుడవును
దేశకాలవిశేషముల్ దెలియు నీవు । భక్తి అస్మద్ధితంబున యుక్తుడవును
అర్థవిదుడవు, మరి సుకృతార్థుడవును॥ 14

తే. ఇటుల శ్రీరాము డనగ సుగ్రీవు డపుడె । మేఘనిర్ఘోషు, నూర్జితు, మేరుతుల్యు
"వినతు" వానరయూథపు బిలిచి చెప్పె । రామలక్ష్మణులున్ విన ప్రభుత నిట్లు॥

తే. దేశకాల నయజ్ఞుల పృథులబలుల । కార్యము నకార్య మెరిగెడి కపిగణముల
చంద్రసూర్యాత్మజుల లక్ష సంఖ్యగొంచు । పొమ్మిక సశైలవనకాననమ్ము తూర్పు॥ 17

తే. అచట వైదేహి సీత యున్నట్టితావు । అటులె రావణు డుండెడు నట్టినెలవు
వెదకుడు దీవి వనంబుల, నదులయందు।మరియు గిరిశృంగములను నేమరక త్వరగ॥

ద్వి. నదిని భాగీరథిఁ రమ్య మా సరయు । కౌశికిన్ కాళింది ఘనము సింధువును
యమునను రమ్య మా యామునగిరిని । మణినిభోదక శోణము సరస్వతిని
వనశైలశోభితంబును "కాలమహిని" । "మహిని" "విదేహను" మరి "బ్రహ్మమాల"
నా మహాగ్రామ నా మాళవ నల్లి । కాశి, కోసలను, వంగను, పుండ్ర, మగధ
దేశంబులను నింక కోశకారులకు । రాజధానిని బహురజతాకరమును
పత్తనంబును దీక్ష పరికించు కొంచు । ఎల్లెడ సర్వమీ యిలను గాలించి
రాముని దయిత నా భూమిపుత్రికను । దశరథస్నుషను సీతాదేవి నింక
వెదకంగవలె మీరు విసువులేకుండ॥ 20—23

ద్వి. అబ్ధిని నవగాఢమైనట్టి గిరుల । పత్తనంబులనెల్ల పరికింపవలయు॥

♦ ♦ ♦

ఆయత మా మందరాద్రి మూర్ధమున । ఘనులు కర్ణప్రావరణులు వేగరులు
ఓష్టకర్ణులు మహాపుష్టివంతులును । బలవంతులును నేకపాదు లక్షయులు
లోహముఖుల్ ఘోరు లోహో! వినుండు । ఫునుపాదకుల్ వేలు పురుషు లుండెదరు॥
కర్ణచూడులు హేమవర్ణాంగు లెల్ల।ప్రియదర్శనులు నుండు వేల్ కిరాతులును
ఆమమీనాశను లతిఘోరులెల్ల । అంతర్జలచరులు నాయతతనులు
అవని నరవ్యాఘ్రులైన విశ్రుతులు । వేలు కిరాతులు ద్వీపవాసులును
గలరు; వారలునుండు నెలవులనెల్ల । కాంతకై మీరెల్ల కాననౌకసులు
వెదుకంగవలె సుండి విసువులేకుండ॥ 24_28

ద్వి. ప్లవనంబులను మరి ప్లవముల గిరుల । యత్నాన గమ్యంబు రత్నవంతంబు
సప్తరాజ్యంబుల జగతి శోభితము । అదె యవద్వీపంబు వెదకుడీ మీరు॥
మహి సువర్ణాకర మండితం బింక । పరికింపవలెఁ త "త్సువర్ణరూప్యకము"
అట యవద్వీపంబు నారసి మెగసి । శిశిరంబు నా నొప్పు శిఖరి నద్దాని
దేవదానవగణ సేవితం బల్ల । శృంగాల దివమును స్పృశియించు దాని
చేరి యా గిరిదుర్గవారంబు లందు । ప్రచురప్రతాపాల వనముల యందు
శ్రీరామసతి యశస్విని మీరెల్ల । వెదుకంగవలె సుండి పదపదంబునను॥

ద్వి. లవణసముద్రంబు నవ్వలఁజేరి । సిద్ధచారణగణ సేవితం బచట
బహుర క్త జలమును మరి యగాధంబు । రహి శీఘ్రగామియై ప్రవహించునట్టి

శోణనదంబును జూచి యద్దాని । చిత్రవనంబుల చిత్రతీర్థముల
రమ్యతటంబుల రావణాసురుని
వైదేహి నారాము వనితను మీరు । వెదకంగవలెనుండి క్షేమంబుగాని

తే. పర్వతప్రభవంబులౌ బహుళ నదుల । బహుళ నిష్కుటముల సురమ్యంబులందు
తత దరీమంతముల పర్వతంబులందు । వనములందును వెదకుడీ వనిత కొరకు॥

తే. ఇలనుగల సముద్రద్వీపములను నెల్ల । మరి సుభీమంబులను నెల్ల నరయవలయు;
సీత వెదకుడు మారుతోద్ధూత మల్ల । ఊర్మిమంతంబు క్రోశంతి ముఖ్యమందు॥

తే. అచ్చు టసురులు మరి మహాకాయు లుండ్రు । ఛాయను గ్రహించి భక్షింత్రు జనుల నెపుడు
దీర్ఘకాలంబు వారికి తిండిలేక । ఆకలిన్ గొన బ్రహ్మ యి ట్లనుమతించె। 36

తే. వితత మది మహోరగనిషేవితము సతము । కాలమేఘసమానంబు ఘనతరంబు
త న్మహానాద మా మహోదధిని జేరి । తీర్థములనెల్ల వెదకుడీ దేవి కొరకు।

తే. పిదప రక్తజలంబు బల్ భీమ మౌర । లోహితం బను సాగరం బోలి గాంచి
అచట నొక గొప్ప వృక్షంబు నరయ గలరు । కూటశాల్మలి నింక త త్కూల మందు॥ 38

తే. ఉండు నచ్చట వైనతేయుని గృహంబు । వివిధ రత్న విభూషిత విభవమగుచు
అల్ల కైలాససంకాశమగుచు మరియు।విశ్వకర్మస్వయంకృతిన్ వెలయు చహహా॥

తే. శైలనిభులును భీము లా జలధి దరిని।గలరు "మందేహు"లనెడి రాక్షసులు వేలు
శైలశృంగాల వారెప్డు వ్రేలుచుండ్రు।బహుళరూపాల, కడు భయావహులునౌచు

తే. దినదినంబును పడుచుండ్రు వనధిలోన।అసురు లవ్వారు సూర్యోదయములయందు
బ్రహ్మతేజోభిహతులౌచు; మరలమరల।లేచి వ్రేలుదు రక్కని గ్రీష్మఘాటి॥ 41

తే. అంత పాండురమేఘాభ మరయ గలరు।ఘనము క్షీరోదమనెడి సాగరము మీరు
చూడ ముత్యాల హారాల జాడనొప్పు।తరళ రమ్యోర్మితతుల నుద్ధర్ష మద్ది। 43

తే. దాని మధ్య మహాపర్వతం బొకండు।"ఋషభ"నామంబు శ్వేతంబు వెలయుచుండు
దివ్యగంధాల కుసుమిత దివ్యతరుల।రాణ పరివృత మొప్పు పెద్ది రాజతములు। 44

తే. సరము రాజతపద్మాల జ్వలిత హేమ। కేసరంబుల నట నొప్పు వాసి మీర
ధారుణి"సుదర్శనంబు" నా దనరుచుండు।రాజహంసౌఘసుసమాకులంబు నగుచు॥

తే. కిన్నరులు,చారణులు యక్షబృందములును।విబుధతతులును నప్సరో విసరములను
గూడివిహారింప నిత్య మా కొలను దరికి।వచ్చుచుందురు సంతోష మచ్చుపడగ॥

తే. అంత క్షీరోదమును దాటి యరుగ నరుగ।చూతురు జలోదమును మీరు శూర
వరులు
సాగర శ్రేష్ఠ మద్ది విస్తార మమరు।సర్వభూతభయావహ సరణినొప్పు॥ 47

తే. ఔర్వ కోపజమై యట హయముఖంబు।రూపమున్ దాల్చి జలధి నిరూఢమైన
తేజము మహత్తరంబు దహించి వేయు।జలము సచరాచరంబు తత్ ప్రళయవేళ॥

తే. పటు సమర్థములయ్యు తత్ "బడబ"ముఖము।సాగరౌకస భూతసంచయముచూచి
బెదరి యాక్రోశమొనరించు పెను రవంబు।వినబడును మీకు నచ్చట వింతగాగ॥

తే. తతము స్వాదూదమునకు నుత్తరమునందు। మరి, త్రయోదశ యోజనం బరుగ
నరుగ
జాతరూపశిలంబు నా ఖ్యాతి మీరు।కనకపర్వతమొండు మీ కనులబడును॥ 50

తే. అచట చంద్రప్రతీకాశ మగుచు నొప్పు। పన్నగం బద్ది తోచు మీ కన్నగవకు
పద్మపత్రవిశాలాక్షు మంచిత మది।సతము ధరణీధరంబు సాక్షాత్కరించు॥ 51

తే. అతని నాసీను తత్పర్వతాగ్రమందు।సర్వభూతనమస్కృతు సర్పరాజు
నరయుదు రనంతు, దేవు, సహస్రశిరసు।నీలవాససు మీర లా నిలయమందు॥ 52

తే. తన్మహాత్ముని కేతు వృత్తాల మద్ది। స్వర్ణతాలంబు త్రిశిరంబు స్థాపితంబు
తోచు తత్పర్వతాగ్రాన దూరమునకె।చూడగ సవేదికంబు బల్ చోద్య మరయ॥

తే. పూర్వదిశ కెల్లగాగ యీ ప్రొఢవుకొడిని। దేవతలె నిల్పిరిచట యీ తీరుగాగ
పిదప, హేమమయంబు శ్రీవిలసితంబు।ఉదయపర్వత రాజంబు నుండు నచట॥ 54

తే. జాతరూపమయంబు తత్ శైలవరము। దివ్యము సవేదికంబునై తేజరిల్లు
దాని శిఖరంబు శతయోజ నాయుతంబు। దివము చుంబించుచుండు, విస్తృతము
సతము॥ 55

తే. సాల, తాల, తమాల, ప్రఫుల్లనతంస । కర్ణికారాది సకల వృక్షాళితోడ
దివ్యముల జాతరూపంబు లవ్యయములసూర్యసన్నిభతరుల నా క్షోణి వెలుగు
తే. అచట యోజనవిస్తార మమరి మరియు । యోజనదశంబు నుచ్ఛ్రితం బొప్పి
యుండు
"సౌమనస"నామ శృంగంబు జగతి స్థిరము । జాతరూపమయంబు విఖ్యాత మద్రి॥
తే. పూర్వ మీ సౌమనసశృంగముననె సుమ్ము।మొదటి పాదంబు విష్ణుండు మోపి
నాడు
రెండవది మోపె త న్మేరుశృంగమందు।అల, త్రివిక్రమరూపుడై వెలసినపుడు॥
తే. భూతలంబు జంబూద్వీపమును నిమంచు । ఉత్తరంబు ప్రదక్షిణం బోలి సలిపి
త న్మహోచ్ఛ్రియ శిఖరంబు దరియగానె । దృశ్యుడగు లెస్స నిచట వసించు
ప్రజకు॥ 59
తే. అచట వైఖానసులు నా మహర్షి వరులు।వాలఖిల్యులు నుందుర్ తాపసులుమునులు
సూర్యవర్ణులు వారిని చూడగలరు।మీరలు ప్రకాశమాను లా నేటి ఋషుల।60
తే. ఎల్లప్రాణుల చక్షుల కింత వెలుగు। తేజము నొసంగు సూర్యు డే దేశమందు
పుట్టి వెలుగుచు నుండునో యట్టిచోటు।అవనిని "సుదర్శనద్వీప" మనగ బరగు॥
తే. శైల మద్దాని శృంగాల సానువులను । కందరంబుల వనముల కలయ దిరిగి
అసుర రావణు డుండెడు నట్టినెలవు।మరియు వైదేహి జాడ మీ రరయవలయు॥
తే. కాంచనమయంబు పూర్వాద్రి కాంతితతియు । దివి మహాత్ముని సూర్యుని తేజ
మొకట
బర్వియుండుట రక్తంపు వర్ణ మొప్పి।పూర్వసంధ్య వెలుంగు నపూర్వ సరణి॥
తే. పృథివికి సమస్తభువనరాజికిని బ్రహ్మ । దీనినే పూర్వగేహాళిగా నొనర్చె;
ఇంక, సూర్యుని యుదయంబు నిందె యగుట।పూర్వదిశయను పేరిది మోపె జగతి॥
తే. శైల మద్దాని పృష్టాన సానువులను । నిర్ఝరంబుల గుహాలను నెమకినెమకి
అసుర రావణు డుండెడు నట్టినెలవు।మరియు, వైదేహి జాడ మీ రరయవలయు॥
తే. దానికిపరంబు మన కగమ్యంబు సుండి।అదియు త్రిదశావృతంబు పూర్వాద్రికవల
వినుడు, రవిచంద్రరహిత మదృశ్యము నగు । మరియు తిమిరావృతం బౌట
జొరగరాదు॥ 65

తే. శైలముల కందరంబుల సర్వములను । వనము లన్నాని నెల్ల శోధననొనర్చి
మరియు నే జెప్పుచున్న సమస్తమైన । చోట్ల సైతము వెదకుడీ క్షోణిసుతను ॥ 67

తే. ఇంతవరకేను వానరు లేగగలరు । శక్య మిక గాదు వారికి జనగ పిదప
అది యభాస్కరమును* నమర్యాదమగుట । మనకు తెలియవు పిమ్మటి పథము
లెవియు॥ 68

తే. ఉదయపర్వతపర్యంత మోపి పోయి । దేవి వైదేహియుండెడి తెరువుగాంచి
అసురు రావణు నిలయంబు నట్టె యెరిగి । నెలయు తిరుగకమున్నె రావలయు
మీరు॥ 69

తే. ఒక్కనెలకన్నమీరి మీ రుండ జనదు । అట్టు లుండిన మరణంబె యగును మీకు
తల్లి మైథిలి గాంచి సిద్ధార్థులగుచు । తిరిగి రండింక మీరలు, త్వరగ జనుడు॥ 70

ద్వి. వనమండమండితంబును నింద్రకాంత । మా దిశన్ చరియించి మరి నేర్పుగాను
రఘువంశజప్రియన్ రమణిని గాంచి । మరలివచ్చిన మీకు వరలు సౌఖ్యంబు॥ 71

---

* మర్యాద = హద్దు

:- 40 వ సర్గ సమాప్తి :- ( 1, 688 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబదియొకటవ సర్గ —(50)

(ఇ)దక్షిణ దిశకు అంగదాదుల పంపుట:—

తే. ఆ మహద్వానరబలంబు నటుల బంపి । ప్రభుడు సుగ్రీవుడప్పుడు పారజూచి
కపుల నభిలక్షితుల మహావిపుల బలుల । బంపె దక్షిణదిశకు నపారసంఖ్య॥ 1

ద్వి. నీలు నగ్నితనూజు నిరుపమసత్త్వు । వానరు హనుమంతు వాయుతనూజు
అల పితామహసుతు నా జాంబవంతు । ఘను, మహాబలు సుహోత్రుని వీర్యవంతు
శరగుల్మ్ముని,శరారి నురుభుజు మరియు । గజుని గవాక్షుని గవయు సుషేణు
ద్వివిదుని మైందుని విజయుని ఋషభు । మరి హుతాశనసుతు లురువీర భటుల
ఉల్కాముఖు నసంగు నుభయుల కపుల । అంగదుండును గంధమాదను డాది
వీరుల నురువేగ విక్రమాఢ్యులను । చేరంగ బిలిచి విశేషవిదుండు
విభుడు సుగ్రీవుండు వీరాధికుండు । కపిగణేశ్వరు డంపె నప్పుడె పోవంగ।

తే. వారలకుతోడుగాగ మహద్బలంబు।అంగరక్షగ నిచ్చి యసంగగంబు
దిశకు దక్షిణమునకు వైదేహి వెదుక।బంపె హరివీరవరుల నవ్వారి నతడు॥ 6

తే. అటుల వారేగు తద్దక్షిణాశయందు । వారి కెరుగంగ రానట్టి పట్టు లపుడు
మరి, సుదుర్గములను నా హరివరుండు। తెలియజెప్పెను ప్రభుడు వారలకునిట్లు॥

ద్వి. ఆదె సహస్రశిరంబు లొప్పు వింధ్యంబు।నానాలతాద్రుమనగము దివ్యంబు॥
తత మహోరగ నిషేవితము దుర్గంబు।నదిని పుణ్యంబు నర్మదను శర్మదను॥
గోదావరిని, రమ్యమాధాని నింక । కృష్ణవేణిని మహా నిమ్నగన్ వదిని॥

వరద మహాభాగ సురునాగ భరిత । సుత్కల మేఖల లురు సరిత్తులను॥
నాగరక దశార్ణ నగరరాజముల । అశ్వవంతి నవంతి నరసి మీ రెల్ల॥
సీతకై వెదకుడీ శీఘ్రింబె కపులు॥

ద్వి. మాహిషకంబు రమ్యంబు నీక్షించి । ఋషికంబును విదర్భ దేశంబు నరసి
వంగ కళింగను వరుస కౌశికను । సగిరినదీగుహా సొగసు దండకను
నదిని గోదావరిని పదిలంబు జూచి । ఆంధ్ర కేరళ పుండ్ర పాండ్య చోళముల
తత మయోముఖ మల్ల ధాతుమండితము । సహ్యపర్వతమును చక్కంగ దరిసి
శ్రీమంతము విచిత్రశిఖరంబు మరియు । చిత్రపుష్పితవనధాత్రి నగ్గిరిని
చందనవనరాజి నందమౌ దాని । వెదకుండు సీతకై వీరులు మీరు॥

తే. జగతిని ప్రసన్నసలిల నాపగను శివను । అప్సరోగణవిహితంబునైన దాని
విపుల దివ్యస్రవంతి కావేరి నింక । కాంత్రు మీరలు నేగి త త్ప్రాంతమునను॥

తే. అల్ల మలయాద్రి యగ్రమం దుల్లసిల్లి । చక్కనాసీనుడౌ మహౌజసునిఘునుని
దివ్యు నాదిత్యసంకాశు ఋషివరేణ్యు । ముని యగస్త్యుని మీరలు గనెద రచట॥

తే. ఆమహాత్ము ప్రసన్నుని యనుమతి గొని । గ్రాహజుష్టము తన్మహా హ్రాదిని నట
తామ్రపర్ణిని మీరలు దాటగలరు । దేవి వైదేహి వెదుక త ద్దేశమందు॥ 17

తే. చందనవనాల దివ్యాల నందముగను । జగతిప్రచ్ఛన్న యా ద్వీపశాలినియును
కాంత యువతియు నా నిజకాంతు దయితు । నా సముద్రుని జేరంగ నరుగు
చుండు॥ 18

తే. అంత హేమమయంబు దివ్యంబు మరియు । వితతముక్తామణీవిభూషితము సతము
యుక్తము కవాట మద్ది పాండ్యులది మీరు । చూడగలరింక వానరుల్ చోద్యము
గను॥ 19

తే. పిమ్మట సముద్రమును జేరి నెమ్మది నిక । అర్థనిశ్చయమొనరింప నగును మీకు
సాగరాంతరమున నగస్త్యుర్య డచట । నిలిపెను మహేంద్రగిరిని శ్రీ నిలయముగను
చిత్రనానానగశ్రీల జెలగుదాని । కాంచనమయంబుదాని నా కడలిదరిని॥

ద్వి. నానావిధ నగాళి నానాలతాళి । సర్వత్ర శోభితం బుర్వీధరంబు
దేవర్షిగంధర్వదివ్యయక్షులను । అప్సరోగణముల నల్ల సేవితము
సతముచారణసిద్ధసంప్రకీర్ణంబు । సుమనోహరంబు నా క్షోణిధరంబు
సేవించుచుండు శచీప్రియుం డెపుడు । పర్వాన పర్వాన గీర్వాణ విభుడు

తే, ఉదధి కద్దాని కవ్వలి యొడ్డునందు । నెలయు శతయోజనాయతద్వీపమొండు
మనుజుల కగమ్యమును దీప్తముసు సతంబు । మరి విశేషించి వెదకుడీ మాత
నచట॥ 24

తే. వధ్యుడు దురాత్ముడైన రావణున కల్ల । రాక్షసేసున కా సహస్రాక్షతుల్య
తేజునకు నద్దియే సుమ్మి పృథివిలోన । వాసి నొప్పారుచుండు నివాస మగును॥

తే. దక్షిణసముద్ర మద్దాని కుక్షిలోన । కాంత "యంగారకాఖ్య"రాక్షసి యొకర్తు
జంతువుల నీడనీడ్చి యా జంతుతతిని । పట్టి భక్షించుచుండు నెప్పట్టు నందు॥ 26

తే. ఇటుల సంశయపదముల నెల్ల మీరు । వెదకి నిస్సంశయంబు గావించుకొనుచు
నష్టసంశయులై రామనరవరుసతి । నరసి రండింక యమిత తేజసులుకపులు॥ 27

తే. లంక నద్దాని దాట సంద్రంబు నడుమ । నూరుయోజనములలోనె నొప్పుచుండు
"పుష్పితక" నామమున బొల్చు భూధరంబు । సిద్ధచారణసేవితం బిద్ధరిత్రి॥ 28

తే. చంద్రసూర్యాంశుతుల్య తేజంబునొప్పి । సాగరాంబు సమావృతంబై గిరీంద్ర
మద్ది వెల్గొందు విపులశృంగాళితోడ । అంబరంబును నొరసెడి డంబుమీరి॥ 29

తే. కనగ తద్గిరిస్వర్ణశృంగముల నొకట । ప్రభలవెల్గించుచుండు దివాకరుండు
శ్వేతరాజత మింకొక్క శృంగమందు । చక్క వెల్గొందుచుండు నిశాకరుండు 30

తే. చోద్యము కృతఘ్ను లా గిరిన్ జూడలేరు । నాస్తికులును, నృశంసులు నరయలేరు
గిరికి నద్దాని కిక మీరు శిరమువంచి । వందనమొనర్చి వెదకుడీ మాతకొరకు॥ 31

తే. త్వరగ నద్దాని గడచి దుర్ధర్షులీరు । నడువ నడువగ "సూర్యవంతంబు"నాగ
పర్వతముదోచు తన్మధ్యపథముమీకు । దుర్విగాహము పదునాల్గు యోజనములు,

తే. పిదప నాశైలమునుదాటి మీరలరుగ । "వైద్యుతం"బను గిరి మీకు పథినితోచు
సర్వకామఫలంబుల తన్మిజతతుల । సర్వకాలమనోహార సర్వమగుచు॥ 33

తే: ఆచట భుజియించి మీరు వరార్హములను । మూలములను ఫలంబుల నోలలాడి
తేనియల దివ్యముల దాని తేన్చుకొంచు । చనుడు మీ రిక యావతీ స్థాన
ములకు॥ 34

తే: అచట నేత్రమనఃకాంత మాచు దోచు । "కుంజరం"బను శైలంబు గొప్పగాను
అందు సుందరయగస్త్యుని కందమునకను । వేశ్మ మొందు విశ్వకర్మ విరచితంబు

తే. అచట యోజనవిస్తార మమరియుండి । మరియు దశయోజనోచ్ఛ్రితం బౌచు నిగిడి
కాంచనమయంబు దివ్యంబు కానిపించు । భవనరాజంబు బహురత్నభాసితంబు॥

తే. అచట "భోగవతీ"నామ మమరుపురము । సర్పముల కాలయంబు విశాలకక్ష్య
రక్షితంబెల్లయెడల దుర్ధర్ష మదియు । తీక్ష్ణదంష్ట్రి మహావిషాహీంద్రములను॥

తే. సర్పరాజు, మహోవ్రిజ్ఞ డప్పురాన । వాసుకివసించుచుండు; నప్పట్టణంబు
వెదకుడీ మీరు;- మరి, సుసంవృతము లైన । చోటులను గూడ వెదకుడీ
క్షోణిసుతను॥ 39

తే. మీర లా దేశమును దాటి మీది కరుగ । ఋషభ సంస్థిత మొక మహాగిరి
వరంబు
సర్వరత్నమయంబు విశాలతటము । ఋషభ నామంబు శ్రీమంత మెసఁగుచోచు॥

తే. పద్మకంబు, హరిశ్యామ వర్ణకంబు । విమల గోశీర్షకంబు వర్ణముల దనరు
దివ్యచందన వృక్షముల్ తేజరిల్లు । వహ్నితుల్యప్రభంబు ల ప్పర్వతమున॥ 41

తే. వినుడు, తచ్చందనోర్వీజ వితతి జూచి । ముట్టగారాదు సుండి-మీపుణ్యముండు;
"రోహితుం"డనువాడు ఘోరుండు నసుర । వనము నద్దాని పతము కాపాడు
చుండు॥ 42

తే. అచట గంధర్వపతులు మహాబలాఢ్యు । లైదుగురు వాసమొనరింతు రక్కసములు
వినుడు, "గ్రామణి" "శైలూషు" డనగ, మరియు।"బభ్రు"డును, "శిగ్రు"డును,
మరి "శుభ్రు"డనగ॥ 43

తే. అర్క-సోమాగ్నివపులు మహాత్ము లింక । పుణ్యకర్ములు నుందు రా భూధరమున
అల, పృథివ్యంతమందున వెలయుచుండు।స్వర్గజితులును, దుర్ధర్షు లచటనుంద్రు॥

తే. దాని దాటిన మీ కేగ తరము కాదు । దారుణం బది పితృలోక వారమగును
యముని కది రాజధాని: అయ్యది సతమ్ము । గాఢతమసావృతంబయి కానబడదు॥

తే. అంతవరకేను మీర లో! హరులు! వినుడు । చనుటకేగాని వెదకుట కయిన
గాని
శక్యమగుసుండి;- పిమ్మట చనుటకింక । వలను గా దెంతగతిమతాం వరున కైన॥

తే. సర్వ మిది యెల్లమీరలు చక్క నరసి । ఇతరచోటులనెల్లను నింక వెదకి
దేవి వైదేహి జాడ పూర్తిగ నెరింగి । మరలిరండింక; వేగమే తరలిపొండు॥ 47

తే. ఎవడు నెలలోపలనె యిట కేగుదెంచి । "కంటిసతి" నని యందరి కంటెముందు
చెప్పునో వాడు మత్సమశ్రీదనర్చు । భోగముల దేలి సుఖముల బొందుమరియు॥

తే. అతని కన్నను ప్రియతరుం డవని లేడు । అతడ యధికుండు నాప్రాణ వితతికంటె
ఆతడు కృతాపరాధు డెం తైన గాని । నాకు బంధుండెయగుచుండి న్యాయ్యముగను॥ 49

ద్వి. అమితబలపరాక్రమాఢ్యులు మీరు । విపులగుణకులాల వెలసినవారు
మనుజపతి తనూజ మనకింక దొరకు । విధముగ జతనంబు వేసల్పుడీరు॥

:- 41 వ సర్గ సమాప్తి :- (1, 738)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబది రెండవ సర్గ – (42)

(ఆ) పశ్చిమమునకు సుషేణుని బంపుట:—

తే. ప్రభుడు సుగ్రీవు డా హరివరుల నట్లు । దిశకు దక్షిణమున కన్ప విశదయశుడు
కేశయూథపు మేఘసంకాశు నపుడు । పిలిచి యిట్లు సుషేణుతో లలి వచించె॥ 1

తే. తండ్రి యాతడు తారకు;–తనకు మామ; । ఘను సుషేణుని భీమవిక్రముని జేరి
ప్రణతియొనరించి ప్రాంజలి యగుచు రాజు । చెప్పె సుగ్రీవు డాతని కొప్ప నిట్లు ॥

ద్వి. ముని మరీచునిపుత్రు ఘను మహాకపిని । అలఘు నర్చిష్మంతు నా యింద్రసముని
హరుల శూరులచేత మరి పరివృతుని । బుద్ధివిక్రమయుక్తు భూరిప్రతాపు
వైనతేయోపము వానరాధిపుని । మారీచు; నాతని భ్రాతల నెల్ల
ప్రభల నర్చిర్మాలులను మహాబలుల । ఋషిపుత్రులను నెల్ల విభుడు దా బిలిచి
పశ్చిమదిశకు బో బంచె నిట్లనుచు॥

తే. రెండు లక్షల కపుల మీ రండగొనుచు । ఈ సుషేణుని ఘనుని ముం దిడుకొనుచును
మాత వైదేహి సీత నీ భూతలాన । వెదకుడీ యింక పశ్చిమం బేగి వడిగ॥ 5

తే. శూరదేశాన, బాహ్లికక్షోణిలోన । మరి, సురాష్ట్రాన విపులముల్ పురవరముల
స్ఫీతముల, రమ్యముల నింక సీతజాడ । గనగ యత్నింపుడీ యెల్ల జనపదముల॥

తే. దీప్త పున్నాగ గహనంబు "కుక్షి"లోన । అల్ల నా వకులోద్దాల కాననమున
మరియు కేతక షండంబు నందు తిరిగి । సీత వెదకుడి మీ రీ క్షితితలాన॥

తే. ఇలను గల్గు ప్రత్యక్స్రోతములను నదుల । శీతజలముల శివముల సీతగురిచి
తపసులుండు నరణ్యాల విపుల గిరుల । ఘోర కాంతారములలోన దూరి కనుడు॥

తే. ఇల, మరుప్రాయములునైన స్థలములందు । మరియు, నత్యుచ్ఛశిరముల వరలు శిలల
శైలజాలావృతంబులౌ స్థలములందు । దుర్గమంబుల వెదకుడీ దూరి దూరి॥ 9

తే. ఇంక పశ్చిమదిశకు మీా రేగి యేగి । కాంచగలరు సముద్రంబు ఘనతరంబు
నక్రతిమియుతజలమహార్ణవము తతము । అరయ నక్షోభ్య మా పశ్చిమాశ తుదను॥ 10

తే. అంత కేశకషండంబులందు జొచ్చి । అటులనె తమాల గహనంబులందు దూరి
కపులు విహరింపగలరు పైకైన యెడల । నారికేళవనంబుల నగములందు॥ 11

తే. అచట సీతను, మరి రావణాసురుండు । నుండు నెలవును వెదకుడీ దండికపులు
వసుధ వేలాతట నివిష్ట పర్వతముల । వనము లెల్లెడ రోయుడీ జననికొరకు॥ 12

తే. క్రమత నిక "మురచీపట్టణము"ను, మరియు । ధరణి రమ్యంబు నా "జటీ పురము" వెదకి
"అంగలోప" "మవంతి" "యలక్షితంబు"। వనమునీక్షించి, సువిశాలపట్టణముల
రాష్ట్రముల జూచు చేగుడీ రమణికొరకు॥ 13, 14

తే. సింధుసాగరసంగమం బందు గలదు । "హేమగిరి"నాగ గొప్ప పృథ్వీధరంబు
అద్ది శతశృంగములతోడ నాకసంబు । నొరసెడి మహాద్రుమంబులతోడ వెలయు॥

తే. దాని ప్రస్థంబులందు రమ్యంబులందు।కలవు సింహంబు లిక పక్షగములు గుములు
అచటి తిమి,మత్స్య,గజముల నవ్విసతము।పట్టుకొనిపోయి తమగూండ్ల బెట్టుచుండు॥

తే. సింహనీడాశ్రయంబు తత్ శృంగమందు । నీరదస్స్వాన నిస్స్వానదృప్తతృప్త
పృథుల మాతంగములు సంచరించుచుండు । నీరపూర్ణ విశాల మా నెలవునందు॥

తే ఇక,దివస్పర్శ మా గిరిశృంగమందు । చిత్రపాదప మా కాంచనాద్రియందు
సర్వ మాశుగతిన్ మీారు జనని కొరకు । వెదకుడీ కామరూపులు వెడలి కపులు॥

తే. ఆ సముద్రాన కొంతదవ్వరుగ నచట । "పారియాత్రాద్రి"కోటి కన్పట్టుమీాకు
కాంచనమయంబు శతయోజనాంచితంబు।అరయ దుర్దర్శమూను తేజోధి కమును॥

తే. అట తరస్వులు గంధర్వు లగ్నిసములు । కామరూపులు తీక్ష్ణులు కలరు సుమ్ము
ఘోరు లిరువది నాలుగు కోట్లసంఖ్య । పారియాత్రమహాగిరి ప్రస్థమందు॥ 20

తే. పావకార్చిసమానులు వార లెపుడు । వేనవేలుగ గుంపు లా కోన నుంద్రు
వారి దరియగ రా దెట్టి వీరకపులు । ముట్టగారాదు పండ్ల నా భూరుహములు॥

తే. వీరులు దురాసదుల్ మహాభీమ బలులు । సత్త్వవంతులు వార లా షొమ్మజవితతి
సతము రక్షించుచుంద్రు తత్ క్షితిధరాన । భూరివిక్రము లా ఫలమూలములను॥

తే. అచట యత్నాన కర్తవ్యమగును మీకు । జానకీదేవి వెదుకంగ జాగ్రతగను;
ఇంక తగురీతి మీరు వర్తింతురేని । భయము కించిత్తు నుండదు వారివలన॥ 24

తే. అచట వైడూర్యవర్ణాభమౌ మహాద్రి । వజ్రసంస్థానసంస్థితం బరయ గలరు
పృథుల నానాలతాద్రుమాకీర్ణ మౌచు । నా మహాగిరి వెలయు 'వజ్రా'భిధమున॥

తే. ధరణి శ్రీమంత మా గిరి దనరు చుండు । సమము యోజనశతము విస్తారమమరు
గుహల నచ్చటివెల్లను బహువిధముల । యత్నమున మీరు వెదకుడీ యవనిసుతను॥

తే. అబ్ధిని చతుర్థ భాగంబునందు మీరు । "చక్రవాన్నా"మ మద్రి గాంచంగ గలరు
అట సహస్రారమైనట్టి చక్ర మొకటి । విశ్వకర్మ వినిర్మాణ విభుత వెలయు॥ 27

తే. అట, హయగ్రీవు దానవు పటుబలాఢ్యు । పంచజనుని వధించి యవార్యలీల
చక్రమును శంఖమును మహాసంగరమున । గొనియె పురుషోత్తముడు విష్ణు డనుప
ముండు॥ 28

తే. దానిసానువులందు, చిత్రంబులందు । మరి విశాలంబు లా గుహాపటలి యందు
రావణుని గూర్చి మరి రాముదేవి సీత ।గూర్చి మీరెల్ల వెదకుడీ గొప్పకపులు॥

తే. షష్టియోజనముల కట జలధిలోన । ప్రబలు నొకపర్వతంబు "వరాహ"మనగ
క్షితిని శ్రీమంతమై స్వర్ణ శృంగతతుల , ఫలరను నగాధవరుణాలయంబు నడుమ॥

తే: అచట "ప్రాగ్జ్యోతిషం"బనునట్టిపురము । జాతరూపమయంబు విఖ్యాత మొప్పు
అచట వసియించుచుండు దుష్టాత్మకుండు । "నరకు"డనునట్టి ఘోర దానవు
డొకండు॥ 31

తే. దాని సానువులందు చిత్రంబులందు । మరి విశాలంబు లా గుహాపటలియందు
రావణుని గూర్చి మరియు నా రామచంద్రు । సతిని సీతను గూర్చియు వెతకు
డీరు॥ 32

తే. దాని దాటిన పర్వతేంద్రం బొకండు । కాంచనాంతరనిర్దరం బంచితంబు
సర్వసౌవర్ణ మగుపడు చక్షుపులకు । ; ఆయతంబును, ప్రస్రవణాయుతంబు॥ 33

తే. గజములు, వరాహములు, సింహగవయములును। వ్యాఘ్రములు వెల్లమెకములు
స్వస్వగాన
స్వీయగర్జల సతతంబు వెడలునట్టి । ప్రతిరవంబుల దర్పించి మరియు మోయు॥

తే. హరిహయుడు పాకశాసనుం డా మహేంద్రు । డల్లశ్రీమంతు డమరులవల్లమునకు
రాజుగా నెందు నభిషిక్తుడయ్యె నదియె। మేఘవాన్నామ మొప్పు నీ పృథ్వీధరము॥

తే. ధారుణి మహేంద్ర పరిపాలితంబు, ఘనము। తతముశైలేంద్ర మద్దాని దాటిపోవ
శైలరాజంబు లరువదివేలసంఖ్య । కాంచనమయంబు లిక మీకు గానిపించు॥

తే. భ్రాజమానంబులవ్వి సర్వత్ర జూడ । పూర్ణములు, తరుణాదిత్యవర్ణములును
జాతరూపమయంబులౌ తెమ్మెజతరుల । మరి సుపుష్పితములతోడ వరలుశోభ॥

తే. వాని మధ్యను రాజు "సావర్ణి"యనెడి । మేరు వుత్తరగిరియుండు మేటినగము
సవితృ డాదిత్యు డెవడు ప్రసన్ను డగుచు । వర మొసంగెను పూర్వ మీ గిరికి నిట్లు॥

తే. "విను, త్వదాశ్రయమౌ వస్తువితతియెల్ల । మత్ప్రసాదాన పగళుల మరియు నిశల
సతము కాంచనమయములై వితతకాంతి । వెలుగుచుండంగ గలవింక వింతగాగ"॥

తే. "మరియు,నీయందు నెవ్వ రెవ్వరు వసింత్రు । దేవగంధర్వదానవబృందములు
ప్రభను వారెల్ల కాంచనప్రభులు నగుచు। రక్తవర్ణులు నగుదురు రమ్యరుచుల"

తే. వసుగణంబు విశ్వేదేవమండలంబు । అల దివౌకసు లా మరుత్తులును వత్తు ।
నిత్య మా పర్వతోత్తమ నికటమునకు । సాగి సద్భక్తి పశ్చిమ సంధ్యవేళ। 41

తే. వచ్చి యాదిత్యు పూజింత్రు భక్తితోడ । వారిచే పూజితుండయి భాస్కరుండు
నిఖిల భూతాళికింక యదృశ్యు డగుచు । అస్తపర్వతమును జేరు నహరహంబు॥

తే. ధరణి సావర్ణికిని యస్తగిరికి మధ్య । యోజనంబులు పదివేలు నుండు సుమ్ము
మరి, ముహూర్తార్ధమునను దివాకరుండు । దాటివానిని, వేగ అస్తాద్రి జేరు। 43

తే. దాని శృంగాన జూడ మార్తాండభవనము । భవనము మహోత్తరంబు దివ్యంబు
వెలుగు
బహుళప్రాసాదసంఘసంబాధమద్ది । విహిత మల విశ్వకర్మచే వింతగాను॥ 44

తే. చిత్రతనులు, వివిధపక్షీంద్రములను । శోభితంబది తరువుల సుందరముల
ఆ మహాత్ముని కా పాశహస్తున కది । పరగును నికేతనంబయి వరుణునకును॥ 45

తే. అస్తగిరికి మేరున కల్లనడుమ । దశశిరంబుల తాలంబు దనరు నొకటి
జాతరూపమయంబు శ్రీసంతతంబు । చిత్రవేదిక నొప్పు తత్ క్షితిరుహంబు॥ 46

తే. అట్టి దుర్గప్రదేశంబు లందు నెల్ల । ఎల్లకొలకుల నదులను నెల్లయెడల
రావణుండుండు నెలవులు క్రమత నింక । వెదకుడీ సీతయుండెడు పదములెల్ల॥

తే. అచట నివసించు ధర్మజ్ఞు డా తపస్వి । స్వీయతపమున విఖ్యాతు డా యశస్వి
"మేరుసావర్ణి" యనునట్టిపేరబరగు। బ్రహ్మకుసముండు; వేసకుడీ ప్రాలియచట॥ 48

తే. దినమణిసముండు తన్మహా ఋషివరేణ్యు । "మేరుసావర్ణి"నిన్ జేరి మీర లింక
భూమికి శిరంబు నొకంగ మ్రొక్కి భక్తి।సీత జాడల నడుగుడీ ఋషిని నతని॥ 49

తే. అరయ సర్కుండు రజనీక్షయంబునందు । ఇంతవరకేను సుమి ప్రాణి సంతతులకు
వితిమిర మొనరించు సర్వంబు; పిదప నతడు।అస్తగిరిజేరుచుండు దా నహరహంబు॥

తే. ఇంతవరకేను వానరు లేగ గలరు ।శక్యమికగాదు వారికి జనగ పిదప
అది యభాస్కరమును, నమర్యాదమగుట । మనకు తెలియవు పిమ్మటి పథము
తెలియు॥51

తే. ఎరిగి వైదేహియుండెడు తెరువు నింక ।మరియు రావణు నిలయంబు నెరిగి యటులె
అస్తపర్వతపర్యంత మరిగి వెదకి । నెలయు నిండకమున్నె రావలయు మీరు॥ 52

తే. ఒక్కనెలకన్న మీరి మీ రుండ జనదు ।అట్టులుండున మరణంబె యగును మీకు
వినుడు నాచేత నో కపివీరులార; । పొందు వేగమె మీరు మీ దండునొంచు॥

తే. మీకు తోడుగ వచ్చు నీ మేటిబలుడు।ఈ సుషేణుండు నామామ యుద్ధగుణుడు
మీర లీతనియాజ్ఞలో మెలగవలయు ।ఇతని పనుపును సేయుడీ యింక కపులు॥

తే. గురుడును మహాబలుండును గురుభుజుండు।శ్వశురు డీతడు నాకు ప్రశస్తగుణుడు
మీరు విక్రాంతు లిక సర్వ మీరె కనగ । కడుసమర్థులు, వెదకుడీ పడమ రరిగి
కడిగి ఇతని ప్రమాణంబుగాగ గొనుచు॥

తే. అమిత తేజుని రాము నా యధిపుపత్ని । గాంచియే వచ్చితిరయేని కపులు మీరు
ఇక కృతార్థులమే యాము మెల్లరమును । కృతికి ప్రతికృతి జేసిన కీర్తి వచ్చు।

తే. ఇంత కర్తవ్యంబునా రీతి యెద్దియైన । కార్యసాధన కున్నచో కపులు మీరు
లెస్స యోచించి చేయుడీ హృదిని హితము । దేశకాలార్థయుక్తంబు తెల్ల
మెరిగి। 57

ద్వి. అంతట నా సుషేణాదివానరులు । నృపుని వాక్యం బద్ది నిపుణంబు వించు
ఎల్ల రా సుగ్రీవు నెలమి వీడ్కొంచు । వరుణాభి గుప్తంబు తరలి రా దిశకు। 58

42 వ సర్గ సమాప్తి :- ( 1, 796 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

నలుబదిమూడవ సర్గ —(64)

(4) ఉత్తరమునకు "శతబలి" ని పంపుట :—

తే. అటుల మామను మరి పశ్చిమాశ కనిపి।వీరు "శతబలి"నామము దా బిలిచి విభుడు
ఆత్మహితమును మరియు రామార్థహితము । వచన మిటు జెప్పె సుగ్రీవు డుచిత
మెరిగి॥ 1-2

తే. త్వద్విధుల వానరుల లక్ష దండిమగల । మరియు వైవస్వతాత్మజు లురుగుణాఢ్యు
లతుల తేజుల నీ మంత్రితతుల గొంచు।పయనమగుమయ్య నీవు సత్వరముగాగ॥ 3

తే. దిశకు నింక నుదీచి కా దివ్యమునకు । విపుల విక్రాంతమున కేగి వెదకు డీరు
తల్లి నా హిమశైలావతంసకమున । రామపత్ని ననిందితన్ భూమిసుతను॥ 4

తే. ఇంక యీపని నెటులో సాధించి మీరు । ప్రియము దాశరధికిని గూర్చితిర యేని
ఋణవిముక్తుల మగుదుమీ యెల్లరమును । మరి,కృతార్థులమగుదు మో యర్థ
విదుడ !॥ 5

తే. చేసెను ప్రియంబు మనకు ప్రసిద్ధ మతడు।రాఘవుండు మహాత్ముండు ప్రభువరుండు
మరల ప్రత్యుపకారంబు మన మొనర్ప । సఫలమగు జీవితం బిక జగతి మనకు ॥ 6

తే. పూర్వ ముపకృతి సేయని పురుషుడైన । అర్థియై వేడ అతని కార్యంబు దీర్ప
సఫలమగుజన్మ;–మరియింక చెప్పవలెనె।తనకు పూర్వోపకారి యాజనుని గూర్చి ॥

తే. ఈ యభిప్రాయమెల్ల మీ హృదిని నిలిపి । ఏటుల జానకి లభియించు నటుల మీరు
బుద్ధియోచించి సేయంగ బూనుడయ్య । అంద రస్మత్ప్రియహితైషులయ్య
మీరు । 8

తే. ఇతడు మాన్యుండు భూతసంతతుల కెల్ల । మరియు నరసత్తముంకును నడిపమనుకు
ప్రీతి మనయెడ గలుగు బో లెస్సయితడు । ముఖ్య మీతని పనిదీర్ప పూనిమనకు ॥

తే. ఇవియె యీ వన దుర్గాల నీ నదులను । శైల శిఖరాల శైలాంతరాల నెల్ల
వెదుకవలయును మీరలు విసువులేక । బుద్ధివిక్రమసంపదన్ బొల్చువారు । 10

ద్వి. మ్లేచ్ఛదేశంబు పుళింద దేశంబు । శూరసేనము మద్ర వీర దేశంబు
కురుభూములను నింక భరత దేశంబు । ప్రస్థలంబును మరి యారట్టకంబు
కాంభోజ యవన శకాది దేశముల । పౌరవ టంకణ బాహ్లీక ఋషిక
చీనంబుల పరమచీనంబు నింక । దరద విహారంబు లరయుచు మీరు
హిమవంతమును నెల్ల విసువు లేకుండ । మరల మరల రోసి మాత గన్గొనుడు ॥

తే. లోధ్ర పద్మక షండాలలోన దూరి । దేవదారు వనంబుల దిరిగితిరిగి
రావణుం డుండు నెలవును దేవి సీత । జాడలను మీరు వెదకుడీ వీడకుండ । 14

తే. పిదప "సోమాశ్రమం" జేగి వీరకపులు । అమరగంధర్వ సేవితం బచట నెమకి
"కాళ"మను పేర నొప్పెడి భూమిధరంబు । జూడ గలదు మహాసాను సుందరంబు ॥

తే. పృథువిశాలంబు లా శైలనిర్దరముల । గుహల నెల్లెడ జొచ్చి యా క్షోణిసుతను
నా మహాభాగ సీత నా రాముసతిని । మాత నరయంగ వెదకుడీ మరల మరల । 16

తే. ఘనము శైలేంద్ర మా హేమగర్భ మెక్కి । ఆ మహాగిరి దాటిపోవంగ నెదుట
మీకు గాన్పించు నొక్క పృథ్వీధరంబు । చూడగ "సుదర్శనా" ఖ్యంబు సుంద
రంబు ॥ 17

తే. పిదప "దేవసఖాఖ్య" భూభృత్తు దోచు । దృష్ట నానావిధాండజాకీర్ణ మద్ది
ధరణి వివిధ ద్రుమవిభూషితంబు నౌను । పర్వతాలయులార ! యప్పర్వతంబు ॥

తే. దాని కానన షండాల సానుతతుల । నిర్ఝరంబుల గుహలను నిర్దరముల
రావణుం డుండు నెలవును రాముపత్ని । సీత జాడను వెదకుడీ చెలగి కపులు ॥ 19

ఆ. దాని దాటి పోవ గానిపించును శూన్య । మొకటి మీకు నూరు యోజనములు
చెట్టు గుట్ట నీటిపట్టుమి గన్పింప దయ్య; ప్రాణి యొదియు బ్రతుక దచట ॥ 20

తే. రోమహర్షణముల యెడారులను నెల్ల । మీర లెట్టులో వానిని మీటి దాటి
పోవ బోవగ కైలాస భూధరంబు । పాండురంబును గని హర్షమంద గలరు॥ 21

తే. అచట పాండుర మేఘాభమౌచు మరియు । తరళ జాంబూనద పరిష్కృతంబు నౌచు
వెలసెడి కుబేరు భవనంబు మీకు దోచు । నిర్మితము విశ్వకర్మచే నిలయ మద్ది॥

తే. అచటనె విశాలనళినీచయంబు బొదలు।లతలును ప్రభూతకమలోత్పలంబులొలయు
హంస కారండవాకీర్ణ మగును సతము । అప్సరోగణ సేవితం బగును సుమ్ము॥ 23

తే. అచట వైశ్రవణుండు రాజాధిరాజు । సకల భూతనమస్కృతుం డకలుషుండు
యక్షరాజ్గుహ్యకేశ్వరుం డలగు చుండు।ధనదు డా శ్రీయుతుండు గుహ్యకులగూడి॥

తే. దాని చంద్రనికాశముల్ దరులయందు।పొదల, పర్యంత పర్వతంబులను గుహల
రావణుం డుండు నెలవును రాముపత్ని । సీత యుండెడి జాడల చెలగి కనుడు॥ 25

తే. క్రౌంచ పర్వతమును జేరి కపులు మీరు । బిలమును సుదుర్గంబును మెలకువగను
దూరి పోవలె నుండి; యెందుల కనంగ।దుష్ప్రవేశ మటందు రా దొడ్డ బిలము॥

తే. అచట వసియించుచుంద్రు మహాత్ము లెపుడు।వారు సూర్య సమప్రభుల్ పరమ
మునులు
దేవతలకైన యర్చితుల్ దివ్యతనులు । దేవరూపులు తన్మహర్షీంద్రులెల్ల॥ 27

తే, క్రౌంచ గుహలను,సానుప్రకాండములను । నిర్ఝరాల నితంబాల నిఖిలములను
సీతకై మీరలింక విశేషశక్తి । వెదుకవలయును శిఖరాల పద పదముల॥ 28

తే. దాని కింక ప్రధానభూతంబునైన । శిఖరమును జూచి యందందు చెలగి వెదకి
కామశైల మవృక్షమున్ గాంచి కపులు । గాంత్రు "మానస" మా విహంగాల
యంబు॥ 29

తే. పోవలే వచ్చుటికి భూతములును నెవియు । దేవదానవరాక్షసబృందములును
ఇంక మీరలు జని యా మహీధ్ర మెల్ల । సానువుల ప్రస్థరంబుల జక్క గనుడు।

తే. క్రౌంచగిరిదాట "మైనాక"మంచితంబు । పర్వతము దోచు మీకు నఖర్వలీల
మయుడు దానవు డద్దాని స్వయముగాను।తనకు నిర్మించుకొనియె తత్పర్వతమున।

తే. సానువుల ప్రస్థరంబుల సకలములను । కందరంబుల వెదకుడీ కాంతకొరకు
అశ్వముఖులైన స్త్రీలుండు రద్రి నచట । వెదకుడీ తన్నికేతన వితతి నెల్ల। 32

తే. మీర లా దేశమును దాటి మీరాడికరుగ । సిద్ధసేవిత మాశ్రమము మీకు దోచు
వాలఖిల్యులు తపసులు పరమఋషులు । గలరు వైఖానసులు సిద్ధు లిలను నచట।

తే. వంద్యులౌదురు వారు తపంబుచేసి । పీత కల్మషులును తపస్విశ్రేష్ఠ
మీరు వినయాన్వితులకాచు వారికెరగి । అడుగవచ్చును సీతనుగూర్చి వెల్ల । 34

తే. హేమ పుష్కరసంఛన్న మింపుగొల్పు । సరము "వైఖానసంబు" నా సరలు నచట
తరుణ సూర్యసమంబులౌ హంసలహహ । శుభములు చరించుచుండు తత్ శుభ్ర
సరసి॥ 35

తే. ఔపవాహ్యంబు తద్గుహ్యకాధిపునిది । "సార్వభౌమంబు" నా నొప్పు సామజంబు
నిజ కరేణులగూడి యందెల్లయెడల । సతము విహరించుచునుండు సంతోషమెసగ॥

తే. తత్సరము దాట నష్ట చంద్రార్క మహహ । కానవచ్చు ననక్షత్రమైన నభము
నిప్పయోద మనాది యా నింగి నిజము । మిగుల నిశ్శబ్దమై శూన్యమగుచు
నుండు॥ 37

తే. అర్కుని గభస్తి చేతనో యనెడి నట్లు । అచట విశ్రాంతి గొను స్వయంప్రభుల చేత
సత్తపస్సిద్ధులయు దేవసములచేత । జగతి యద్ది ప్రకాశము నగుచునుండు॥ 38

తే. పిదప నేగగ "శైలోద" నదము దోచు । కీచకము లుండు నా రెండు కెలకులందు;
వంగి యున్నట్టి యా వేణుపటలి బట్టి । సిద్ధు లీవలి కావలి కేగుచుంద్రు॥ 39

తే. అంత, ఉత్తరకురుదేశ మరయ గలరు । అద్ది కృతపుణ్యులకు నాశ్రయంబు నగును
అచట కాంచనపద్మంబులౌ కొలకులు । నీలవైడూర్యపత్రాల గ్రాలుచుండు
నదులు జలపూర్ణములు వేలు బొదలుచుండు॥ 40–41.

తే. అచట రక్తోత్పల వనంబులైనవియును । మరి హిరణ్మయములునైన వరయుగలకు
మీరలు జలాశయంబు లపారములను । మరియు, తరుణార్కసదృశ్యముల్ మహిమ
వెలుగ॥ 42

తే. కాంచనప్రభ కేసరకాండములను । మరియును మహార్హమణిపత్రపటలములను
చిత్రనీలోత్పలవనాల ధాత్రి యద్ది । ఆవృతం బెల్లయెడల ననారతంబు॥ 43

తే. నిస్తులంబులు ముక్తౌఘ నికరములును । మరి మహాధనమణిచయమండలములు
జాతరూపవ్రజంబు లా శోభితములును । దోచు నుద్యోతపులినవందోహములుగ॥ 44

తే. సర్వరత్నమయంబులు శైలవరములు । జాతరూపమయంబు లా [illegible]
వెలయు నవగాఢములు చిత్రములు ధరిత్రి । మరి, హుతాశనసమకాంతి [illegible]

తే. నిత్యపుష్పఫలంబు లా వెలుగు తరులు । ముదితపక్షిశతధ్వానులంబులును సుమ్ము
దివ్యగంధరసస్పర్శ లీజరలుచు । సత్యకామంబుల స్రవించు సతతంబు॥ 46

ద్వి. నానారకాలుగా నాణ్యమ్ముగాగ । మరికొన్ని వృక్షాలు కురియు వస్త్రాలు॥
భవ్యముక్తామణీనై మార్యకలిత । చిత్రభూషణముల స్త్రీజనంబులకు।
పురుషుల కనురూపములు నైన వాని।అఖిలర్తుసుఖసేవ్య మైనట్టివాని
మరికొన్ని చెట్లిచ్చు ధరణినచ్చటను॥
హైమంబుల మహార్హ మైనట్టి వాని । చిత్రాస్తరణముల సిసులొల్కువాని।
లలితంబుల విచిత్రములు నైనవాని । శయనంబు లొకకొన్ని శ్మ్రజంబు లిచ్చు॥
మరి, మనఃకాంతాల మాల్యాల నింక। పానాల భక్ష్యాల బహు మహార్హములు।
రూపయౌవనముల నేపు జూపేటి । గుణసంపదలనింపు గొల్పుచుండేటి।
స్త్రీలనిచ్చును కొన్ని చెట్టు లా క్షితిని॥

ద్వి. సిద్ధులు కిన్నరుల్ చెలగు నాగులును । ఘనులు విద్యాధరుల్ గంధర్వతతులు
రమియించుచుంద్రు పో రమణుల గూడి । భాస్కరప్రభులెల్ల వసుధనచ్చటను,

ద్వి. ఎల్లరు సుకృతులు నెల్లరు నింక । రతిపరాయణులును రమణుల గూడి
రమియించుచుందు రెల్లరు ధాత్రి నచట ।కామార్థసహితు లా భూమి నెల్లరును॥

తే. గీతవాదిత్ర నిర్ఘోష లే తరి నట , మొరయు నుత్కృష్ట హాసిత సుస్వరము లెల్ల
సర్వభూతమనోహరస్వరములు నిక । వినబడుచునుండు నెప్పు డా పృథ్విలోన॥ 53

తే. అచట నముదితు డెవడు లేడయ్య నిజము । లే డసత్ప్రియుడును త ద్ధరిత్రి నెచట
దినదినంబును నచట వృద్ధిని నెసంగు । గుణములు మనోహరంబులు కొల్లలుగను॥

తే. దాటిపోవంగ నింక యుత్తరమునందు । కలదు "పయసాంనిధి";-గభీర కంధి యద్ది
అచట "సోమగిరి"న్నామ మచల మొకటి। హేమమయ ముంగు గొప్ప దా నీటి
నడుమ॥ 55

ఆ. శక్రలోక గతులు నజలోకగతులును । అద్రిరాజుదాని నరయగలరు
అల దివంగతులును నైనట్టి దేవతల్। చూతు; రొరులు దాని చూడలేరు॥ 56

తే. ఆ స్థలంబు విసూర్యంబు నయ్యు నిజము ।సూర్యకాంతిని వెలిగడు క్షోణియట్లు
త న్నగోత్తముకాంతిచేతను కరంబు । వెలుగుచుండును నెప్పుడు వింతగాగ॥ 57

తే. అచట భగవాను డల్ల విశ్వాత్మకుడును । శంభు డాతండు నేకాదశాత్మకుడును
బ్రహ్మ దేవేశుడును మహాప్రాభవమున।వాస మొనరింత్రు బ్రహ్మర్షి వరులగూడి॥

తే. ఇట్టి యుత్తర కురుభూము లింక దాటి । చనగ మీకెవ్వరికిగాదు శక్యమోయి
అన్యభూతంబులకుకూడ నట్టులేను । అరుగ శక్యముగాదు సూ యొరుగు డింత॥

తే. ఔర "సోమగిరి" నామ మామహాద్రి । దేవతలకేని దుర్గమంబౌ వినుండు
దాని నీక్షించి మీ రింక దారి బట్టి । మరలిరండు సుమీ కపుల్ మనకుపురంబు। 60

తే. ఇంతవరకేను వానరు లేగ గలరు । శక్యమికగాదు వారికి జనగ పిదప
అది యభాస్కరమును నమర్యాదమగుట । మనకు తెలియవు పిమ్మట పథము
తెలియు। 61

తే. సర్వ మే జెప్పినట్టి యీ స్థలములెల్ల । మీరు వెదుకంగవలెనుం కి మెలతకొరకు;
ఇంక నే జెప్పవిడచిన యెడల నెల్ల । మతిని యోచించి మీరలు వెతుక వలయు।

ద్వి. మరి, మహత్ప్రియము దాశరథికి మీరు । నెరపినవారలౌదురు కీశవిభులు
అంతకన్నను మహత్తరమైన ప్రియము । నాకును సల్పు నన్నలును నయ్యోదరు
అనిలానలోపముల్ హరులు మీ రింక । తల్లి విదేహజా దర్శనంబనెడి
సత్కారమును దీని సాధింతురేని। 63

ఉ. అంత, కృతార్థులౌచును మహత్తరలీల సబాంధవంబు న । త్యంతమనోహరంబు
లగు నన్నిటి మత్కృతిఁబూజలందుచుఁ;
శాంతరిపుల్ సహప్రియులు సాధులు భూతధరుల్ మహాత్ములై । కాంతి వెలుంగ
నీ భువనకాండములెల్ల జరింత్రు వానరుల్ 64

:- 43 వ సర్గ సమాప్తి :- ( 1,860 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### :- నలుబది నాల్గవ సర్గ :—( 17 )

సుగ్రీవుడు అందరిలోను హనుమంతుని ముందుకు పిలిచి అతని పరాక్రమాదికములఁబొగడి, సీతను గనుగొను భారము నీదే యని హెచ్చరించుట:- దీనినిబట్టి హనుమంతునందే శ్రీరామునకు ఎక్కువగురి కుదిరి, సీత కనిపించినప్పుడు ఆమెకు గుర్తుగ ఇమ్మని శ్రీరాముడు స్వనామాంకితమగు తన ఉంగరమును హనుమంతునకిచ్చుట:-

తే. అంత సుగ్రీవు డా హనుమంతు నందు। మరి విశేషించి గౌరవ సరణి బలికె;
అర్థసాధన కా హరివరుడె ధ్రువము। తగు ననెడి నిశ్చితార్థ మాతనికి తోచె॥ 1

తే. అంత హనుమంతు విక్రాంతు నమలకాంతు। నరసి యనిలాత్మజు మహాత్ము నా కపీశు
డల్ల సుగ్రీవు డెడద నానంద పడుచు। పరమ సంప్రీతి నిటుబల్కె ప్రభువరుండు॥

తే. అంతరిక్షాన భూమిని నంబరాన। నంబువులలోన నమరాలయాన నింక
ఓయి హరిపుంగవా! నీకు నే యెడలను। గతివిలంబంబు నే నింత గాననోయి॥

తే. అసుర గంధర్వ నర నాగ విసరములయు। దేవతలయు సమస్తలోకావళులును
విదితమేగద నీ కోయి యుదితతేజ। మరి ససాగరవరధరాధరములెల్ల॥ 4

తే. గతియు వేగంబు మతియు లాఘవమునీకు। శక్తి తేజంబు పితృసదృశంబు సుమ్ము
మారుతున కో మహాకపీ! వీరవర్య। సాటివత్తువు తన్మహౌజసున కీవు॥ 5

తే. తేజమున సైత మింక యీ పృథివిలోన। నీకు సమమగు భూతంబు నిజము లేదు
కాన యెట్టుల లభియించు జానకియని। తద్విధం బెల్ల సమకూర్పు తాత! నీవె॥ 6

తే. హనుమ! నీయందెగలవు పరాక్రమంబు । బలము బుద్ధియు దేశకాలానువృత్తి
నయము నయపండితా! యింక ప్రియము మాకు। సలుపుమయ్య మహాత్మ!
యిక్ష్వాకుమణికి ‍ 7

తే. ప్రభుడు సుగ్రీవు డీ కార్యభారమెల్ల । హనుమపై నుంచు బరపి యా హనుమె
తుదకు
కార్యసాధకు డగునని కని యెడంద। చేసె యోచన రాముండు శ్రీనుడిట్లు. 8

తే. * నిశ్చితార్థంబు సర్వథానిలిపెనితడు । ప్రభుడు సుగ్రీవు డీ హనుమంతునందె
కార్యసాధనయెడల నిక్కంబు హనుమ। ప్రభున కింతటి నమ్మకం బార! కూర్చె। 9

తే. మునుపొనర్చిన పనులచే హనుమ ప్రజ్ఞ। ప్రభున కెరుకయె; కాననే ప్రభుడు నితని
నెంతొ మన్నించు;– ఇట్టి వా డేగినట్టి। కార్యము ధ్రువంబు ఫలియించు; కాంతి
మించు। 10

తే. శిష్టు నా వ్యవసాయగరిష్టు నిష్టు । రాజపూజితు నా మహాతేజు డరసి
తా నిక కృతార్థుడని యెంచి దాశరథియు । ధృతి ప్రహృష్టేంద్రి యోత్కుల్ల
చిత్తుడయ్యె। 11

తే. ఇచ్చె నతనికినంత సంప్రీతి మెరయ । శుభద మా స్వనామాంకోపశోభితంబు
అంగుళీయక మిక యభిజ్ఞాన మతడు । రాజపుత్రికి విభుడు పరంతపుండు। 12

తే. "చిహ్న మిద్దాని చేత నో సన్నుతాత్మ । నిన్ను నా చెంతనుండియే నిజముగాగ
వచ్చియున్నట్టివానిగా వనిత యెరిగి । సీత నమ్మ ననుద్విగ్నచిత్తమునను। 13

తే. "నీదు వ్యవసాయమును వీర!నీదు బలము । నీదు విక్రమమును నింక నిన్నుగురిచి
ప్రభుడు సుగ్రీవు డన్నట్టి పల్కు లరయ।నాకు ఫలసిద్ధి గలుగు నం చనఘ! తోచె"

తే. హనుమ యా యంగుళీయకం బలరి కొనుచు।శిరమునన్ దాల్చి అంజలి చేర్చి పట్టి
వందనమొనర్చి శ్రీరాము పాదములకు । పయనమయ్యెను నప్డె తత్ ప్లవగవరుడు.

ద్వి. హరిమహాద్బలము నద్దానిమధ్యమున। పవనాత్మజుడు కపి భువనవీరుండు
వ్యోమ్ని గతాంబుదంబునను విశుద్ధ । మండలు నక్షత్రమండలావృతుని
శోభితు శశిని నా శూరుండు మించె ।

ద్వి. అతిబల! నీబలం బాశ్రయించితిని । హరివరవిక్రమా ! అవనీతనూజ
లభియించు నికనెట్టు లా రీతి నీవు । సల్పు మనల్పమౌ సాహసంబాని
పవనసుతా ! నీదె భారమ్ము సుమ్ము । మతిమంత! హనుమంత!మరి పోయి రమ్ము!

పాఠాంతరం:– కార్యభారంబు తనదెల్ల కపివిభుండు। ప్రభుడు సుగ్రీవు డునిచె యా హనుమయందె

44 వ సర్గ సమాప్తి :– (1,877)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

నలుబది ఆయిదవ సర్గ:— (16)

సీతాన్వేషణకై వెడలు వానరుల సన్నాహసంరంభములు,గంతులు, కేకలు:—

తే. ఎల్లరన్ బిల్చి సుగ్రీవు డింక మరల । "నేనుజెప్పినయట్టి యా నెలవులెల్ల
రామ కార్యార్థసిద్ధికై రయము మీర।వెదకి కనుగొని రం డం"చు విభుడుజెప్పె॥

తే. స్వామి సుగ్రీవుని త దుగ్రశాసనంబు । ఎరిగిహరిపుంగవులును సత్వరముగాగ
శలభములమాడ్కి మేదినీ తలమునెల్ల । గ్రమ్మి తరలిరి వివిధ దిక్తటుల కపుడె॥2

తే. రాముడును నంత లక్ష్మణస్వామి గూడి । ఇంక, ప్రస్రవణాద్రియందే వసించె
విభుడు సీతాధిగమనమునకై పెట్టియున్న । గడువు మాసం బ దెప్పుడు గడచు
వనుచు॥ 3

సీ. రమ్యంబు పర్వతరాజసమావృతం
బ య్యుదీచికి శతవలియు తరలె
పూర్వాశ కప్పుడే పో సమకట్టెను
వినతుండు తరుచరగణవిభుండు
తారాంగదాదుల మారుతాత్మజుడును
అ య్యాగస్త్యాచరితాశ కరిగె
వరుణపాలిత మల్ల పశ్చిమం బేగంగ
తరలె సుషేణుండు తారతండ్రి

తే. సకల దిశలకు నిట్టుల సైన్యపతుల । సాగనంపించి యప్పుడే సవితృసుతుడు
విభుడు సుగ్రీవు డెడద సంప్రీతిబొదలి । సుఖితమనమున నుండె విశుద్ధమతిని॥

తే. నాథుచే నిట్లు వారు సంబోధితులయి । తమ తమ దిశాముఖంబుల తరలిరెల్ల
"చంపుదుమురావణుని" నంచు, "జననిసీత । నిదిగొ కొనివత్తు" మంచును
నెగురు కొంచు। 9

తే. అరచువారును, నది మించి యరచువారు, । మించిగర్జిలి, మరియు, గర్జించువారు
పరుగు లిడువారు, రంకెల కెరలువారు, । "నే నొకండనె రావణు నీల్గగొట్టి
హత మొనర్చెద" ననువారు నైరి కపులు॥ 10

తే. "రావణాధము మర్దించి రాముసతిని । శ్రమమున వడంకు సీత నా సాధ్వినిపుడె
నేనె తెచ్చెద మీర లీ నేల నిటనె।నిలిచియుండు డ" టంచును పలుకు నొకడు॥

తే. "ఒక్కడనెనేనుఁ దెచ్చెదమొక్కలుండు । రావణాసురువధియించి రణములోన
జానకిని, నింక వాడు నా త్మ్మాతనూజ।ననఘ పాతాళమందు దాచినను గాని॥

తే. "విరిచివై చెదవృక్షాలపెచ్చుపెరిగి, । నురలద్రోసెదగిరులను నూచితన్ని ;
పగులబాడిచెదధారుణివ్రక్కలుగను; । కలచివై చెద నిదిగొ సాగరములెల్ల;॥ 13

తే. "ఉరుకు దిదె నేను చూడుడీ యోజనంబు; । ఓస్సి! శతయోజనాల నే
నురుకుదునుర !
శతశతంబుల నింక యోజనములేను । దూకు దంచును" నెగసిరి తోకగాండ్రు॥

తే. "ధరణితలమున గాని, సంద్రమునగాని । శైలములగాని, మరి వనస్థలుల గాని
అల్ల పాతాళమధ్యమం దైన గాని । అడ్డులేక చరింపగా గలను నేను"॥ 15

తే. ఇట్లు లొక్కక్క రా వానరేశు నెదుట।ప్రబలబలదర్పితులు నొచు వానరులును
వచనముల బల్కు కొంచును షదరుకొంచు । మిగుల నుత్సాహమెసగంగ
మొలగి రపుడు॥ 16

45వ సర్గ సమాప్తి :- (1,893)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబది ఆరవ సర్గ :— (25)

వానరులు వెడలిపోగా "ఈ భూమి నంతయు నీవెప్పుడు చూచితి"వని రాముడడుగ, తద్వృత్తాంత మంతయు సుగ్రీవుడు చెప్పుట.

తే. వెడలిపోవంగ కపులు నల్లడలకట్లు । సఖుని సుగ్రీవుజూచి, "యీ సర్వభువన
మండలం బెట్లు లెరిగితి వయ్య" యంచు । రాము డడుగంగ చెప్పె ని ట్లాత
డపుడు॥ 1-2

సీ. దున్నరూపంబున "దుందుభి" పొగరెక్కి
తనపైకిరాగ నాతనిని వాలి
తరుమంగ వాడును జొరబడ మలయాద్రి
బిలమున; వాలియు వెంటనంటి
త ద్బిలంబును జొచ్చి తలవాకిటను నన్ను
కాపుంచి యుండంగ గడచె నేడు
అంత రక్తపుటేరు లా బిలంబుననుండి
వెడలంగ నాశ్చర్యపడుచు నేను
అన్నచచ్చె నటంచు వ్యక్తంబుగా దోప
పలవించి త ద్బిలద్వారమునకు

తే. అసుర రాకుండుగాకంచు నశ్మ మొకటి । పర్వతంబంతటిది యడ్డువైచి వేగ
పురికి జనుదెంచి రాజ్యంబు పుచ్చుకొంటి । సతుల తారా రుమలతోడ జనము
లొప్ప॥ 3-8

తే. ఉండ నేనిట్లు విగతజ్వరుండ నగుచు । అసుర వధియించి వాలియు నరుగుదేర
భయమునను గౌరవంబున వాలి కపుడ । ఇచ్చివైచితి రాజ్యంబు సచ్చరిత్ర॥

తే. తుష్టి దానను జెందక దుష్టబుద్ధి । వాలి ప్రవ్యధితేంద్రియుం డాలరి యయి
మంత్రిసహితంబు నను జంప మదిని దలప । పారిపోతిని నేనును భయము గదిరి॥

తే. వాలియును నన్ను తరుముచు ప్రబలిరాగ । పరచితిమి నేను మంత్రులు
పరిజనములు
నదుల వనముల వివిధముల్ నగరములను । దాటుకొంచును జూచుచు తద్ద భీతి॥

తే. అదిగొ, అప్పుడె చూచి తీ పృథివి నెల్ల । అద్దమందున జూచిన యట్టిరీతి
కొరవిచక్రంబురీతిగా తిరిగితిరిగి । గోష్పదంబుగ జేసి యీ క్షోణినెల్ల॥ 13

సీ. పూర్వాశ పరుగిడి పర్వతదుర్గాల
సుర్వీరుహంబుల నోలి గంటి
క్షీరోద సాగరం జారసి తచ్చట
నిత్యమప్సరలకు నిలయ మద్ది
ఉరుధాతుమండితం బుదయాద్రి గాంచితి
నరసితి ధునుల రమ్యముల నెన్నొ
వింతలౌ కొలకుల వివిధంబులను నెన్నొ
వీక్షించు చేగంగ విడువ కకట

తే. వాలియును వెంటనంటుట చాల బెదరి । దిక్కు తెలియక దక్షిణ దిక్కు కేను
మరలి యప్పుడు పరుగులు వారుకొంచు । చూచి తా దిశ నెల్లెడ
చోద్యములను॥ 14-17

తే. వింధ్యపాదప సంకీర్ణ మెంతొ యగుచు । చందన ద్రుమశోభల నందమగుచు
వివిధశైలద్రుమంబుల వింతగొల్పు । దిశను నద్దాన నే నట్లు తిరుగుచుండ॥ 18

తే. విడువ కట్టులె వాలియు వెంటనంట । పశ్చిమాశకు తిరిగి నే పరువువారి
అస్తపర్వతపర్యంత మరుగ నరుగ । తరిమి తరుముచు వాలియు నరుగుదెంచె॥ 19

తే. అప్పు డుత్తర దిశ కేను చప్పు నెగసి। హిమగిరిని మేరువును, నట్లె హిమ జలధిని
చూచితిని; నయ్యొ! వాలియు చూపులోన । ఏమియుందు, విభో! వచ్చె మొగసి
వెంట॥ 20

తే. తరిమి తరిమియు వాలి యీ తెరగునన్ను। తిప్పలను బెట్టుచుండంగ దిక్కుగనక
మరగు నను జూచి బుద్ధిసంపన్నుడైన। హనుమ యిట్లని నాతోడ ననియె
నపుడు॥ 21

తే. జ్ఞప్తి కిప్పుడె వచ్చె రాజా! సువార్త! మును మతంగునిచేత శప్తుండు నయ్యె
ఈ హరీశ్వరు డీ వాలి; యోహో! వినవె। గొప్ప దీ యాశ్రమపదంబు
గూర్చి మనము? 22

తే. వాలి యీ ఋష్యమూకాద్రి నచ్చునేని। తలపగిలిచచ్చు వేయి వ్రక్కలుగ
ధ్రువము
కాన, మన కిట వసతి సుఖమ్ముసుమ్ము। అదియు మనకు నిరుద్వేగ మగును
సతము॥ 23

తే. అంత చేరితి రాజ! యీ యద్రిమూర్ధ్ని। అల, మతంగుని శాపభయంబుకతన
వాలి యీ ఋష్యమూకాద్రి వంకకైన। రాకయుండునుసుమ్ము లీలగనునైన॥

తే. ఇటుల ప్రత్యక్ష మీక్షించి తీ ధరిత్రి। రమ్య మీ పృథివీమండలంబు స్వామి!
జగము కృత్స్నంబు నిటు చూచి సరగ నపుడు। చొచ్చి తీ గుహ శ్రీరామ
శుభదనామ॥ 25

46వ సర్గ సమాప్తి :- (1,918)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబది ఏడవ సర్గ :—(14)

దక్షిణ దిక్కు మినహా, తక్కిన మూడు దిక్కులకుపోయిన వారు, "సీత కనపడలేద"ని వచ్చి సుగ్రీవునకు నివేదించుట.

తే. తల్లి వైదేహి దర్శనార్థంబుగాగ । అతుల కపిరాజుచేత నాజ్ఞప్తులగుచు
నిఖల దిశలకు వానర నేతలెల్ల । శీఘ్ర మేగిరి తమకును చెప్పినట్లు॥ 1

తే. నదుల కొలకుల బయళుల నగరములను । పొదల గిరుల నదీదుర్గములను నిలను
నెల్ల యెడలను వానరు లేగి యేగి । వెదకి వెదకిరి సీతను పృథ్విసుతను॥ 2

తే. క్రిమతను సశైలవనకాననము ధరిత్రి । దేవికై వారు వెదకుచు దీక్షబూని
పగళులెల్లను నిట్టుల వసుధఁదిరిగి । నిశల చేరుదు రిల నొక్క నెలవునందు॥ 3

తే. సుంత విశ్రాంతి భోజనం బింత గానక । పగళులెల్లను తిరిగి యా ప్లవగవరులు
నిశల సర్వర్తుకామముల్ వృక్షములను । సఫలముల జేరుచుందురు విశ్రాంతి
కొరకు॥ 5

తే. బయలువెడలినదాది యీ ప్లవగవరులు। మాస మొక్కటి గడువ నిరాశులగుచు
తిరిగివచ్చిరి తమతమ తెరగులెల్ల । చెప్ప కపిరాజుతోడ నా శిఖరమునకు॥ 6

సీ. పూర్వాశ వెదకి యా భూసుతగానక
"వినతు" డూరకవచ్చె వినతుడగుచు
ఉత్తరం బారసి ఉత్తచేతులతోడ
ధీతుండు "శతబలి" తిరిగివచ్చె

మామ సుషేణుండు పశ్చిమం బెల్లను
పరికించి యూరకే మరలివచ్చె
ప్రస్రవణాద్రిపై రామలక్ష్మణులతో
వేచియున్న యా విభునికడకు

తే. వచ్చి వీరెల్ల భయభక్తి వాలిమ్రొక్కి । "దేవ, వెదకితి మీ ధరిత్రితలంబు
సర్వమెల్లెడ నీవన్న సరణిగాగ । కాని, కానము సీత నెక్కడను" ననిరి॥ 7-10

సీ. సర్వపర్వతముల సకలవనంబుల
గహనంబులను నిమ్నగముల నెల్ల
సాగరంబుల సర్వజనపదంబుల నింక
గుహలను నీవన్న కుంజములను
క్షితి లతా వితత సంతత మహాగుల్మాల
విషమ దుర్గమ మహావిషయములను
చొరశక్యమేకాని చోట్లెల్ల చొరవచే
జొచ్చియు జొచ్చియు సుదతి కొరకు

తే. వెదకితిమి దేవ! యెన్నియో విధములుగను । ధారుణి, నతిప్రమాణసత్వముల నెన్నొ
చంపినారము దేవ! యా చాననెదుక । కాని, కానము సీత నెక్కడను రాజ!॥

ద్వి. ఇక యా మహాత్ముడే పృథుగుణోన్నతుడు । ఉత్తమసత్త్వవంశోదితుం డతడు
మైథిలి నారసి మరి రా గలండు । దిశకు నెద్దాని కా దేవారి యసుర
దేవి గొం చేగె నా దిశకె యా హనుమ।పోయియుండెనుగాన వాయుసూనుండె
ఆమెను గనుగొంచు నరుదేగలండు॥ 14

47వ సర్గ సమాప్తి :-(1,932)





శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబది ఎనిమిదవ సర్గ :— (24)

దక్షిణ దిక్కుబోయిన దళమువారి సంఘటనలు - (1) ఒక గుహలో నొక రాక్షసు డెదుర్కొనగ, వాడే రావణుడని భ్రమించి వానిని అంగదుడు చంపుట. తీరా, వాడు రావణుడు కాకపోవుటతో సీత కన్పింపకపోవుటతో - కపులు నిరాశులై ఒక చెట్టు మొదట చదికిలబడుట. ‡

తే. హనుమ, కపి, యంత తారాంగదాది హరుల । గూడి, దక్షిణదిశకేగి గురుభుజుండు
ప్రభుడు సుగ్రీవు డిచ్చిన యాజ్ఞ మేర । వెదుకసాగెను నయ్యయి పదములందు॥

తే. అతడు కపిసత్తముల నెల్ల నటుల గొంచు । వెడలిబహుదూరమేగి నల్గడల దిరిగి
గహనముల వింధ్యగుహల నాకపివరుండు । వెదుకజొచ్చెను నిటునటు వివిధగతుల॥ 2

తే. పర్వతాగ్రాల, విపులదుర్గమాల, నదుల । బహునదీదుర్గముల, సరోవరము లెల్ల
వృక్షషండాల వివిధాల వెదకి రపుడు । పర్వతంబుల ఘనపాదపముల కపులు॥ 3

తే. సర్వవానరవరు లటు సర్వదిశల । వెదకి వెదకిరి వీరు లా పృథ్వి నెల్ల
కాని, మైథిలి సీత నా క్ష్మాపసుతను । కపులు జనకాత్మజను నెందు కానరైరి॥ 4

తే. వివిధఫలమూలములను న వ్వీరవరులు । భక్షణమొనర్చు చయ్యయి పట్టులందు
విశ్రమించుచు వెలదికై వెదకిరపుడు। వసుధ దుర్ధర్షములునైన పదములెల్ల॥ 5

తే. అది దురన్వేషదేశ మాహా! తలంప । మరి, గుహాగహనంబును, మహితమగును
నిర్జలంబును, నిర్జనం బెందు గనగ।గహనమును, శూన్యమును, రోమహర్షణమును॥

**తే.** వెదకి యాదేశమును నెల్ల విపినములను । భువి సురాధర్షముల నన్యములను వెదకి
కపులు భృశపీడితులు నౌచు నపుడె మరల । పోయి రకుతోభయులు వారు
పూన్కి వెదుక॥ 7

**తే.** ఎచట వంధ్యఫలంబులు వృక్షవితతి । పర్ణవర్జితములు విపుష్పంబు లగును
నదులు నిస్తోయములును శూన్యములు నౌను । మూలములు నెందు
దుర్లభముల్ కనంగ॥ 8

**తే.** లేవు మహిషంబు లెచ్చట, లేవుకరులు; । లేవుపక్షులు, మృగములు లేవు నెచట
లేవు శార్దూలములు నెందు, లేవు మఱియు । ఇతర వనగోచరములు నెంతేని
గనగ॥ 9

**తే.** ఉండవెచ్చట వృక్షాలు నోషధులును । పొదలుఁ గుండవు లతలును పొడమ
వెచట
అట్టి స్థలములకెల్ల వా రరిగి యరిగి । సీత వెదకిరి కపులు విశేషసక్తి॥ 10

**తే.** స్నిగ్ధపత్రంబులౌ పద్మినీ చయములు । ఫుల్లపంకజములును పొల్పొందు నెచట
ప్రేక్షణీయంబును సుగంధ వితతమయ్యు । భ్రమరవర్జితమెద్ది యప్పట్టు గనిరి॥

**తే.** "కండు" వనెడి మహాభాగు డుండె తపసి । సత్యవాది, తపోధనసత్తముండు
నియమముల దుష్ప్రధర్షణుం డిద్ధగుణుడు । పరమకోపిష్టియు, మహర్షివరుడు,
ఘనుడు॥ 12

**తే.** అతని పుత్రుడు షోడశాబ్దముల వాడు ।మరణమొందెను బాలుడా వనమునందు
దాన కోపించి మునియు తద్వనమునకును । శాప మిడ నద్ది నిర్మానుషంబు
నయ్యె॥ 13–16(౧)

**తే.** అటుల మృగపక్షి వర్జితంబైన దాని । నరి, దురాధర్ష మశరణ్యమైన దాని
గిరుల, దరులను, నదులను, తిరిగి తిరిగి । వెదకియును కానరైరి పృథ్వీజ నందు॥

**తే.** తత లతాగుల్మ సుసమావృతంబు నౌచు । భీమమైతోచు నొక్కచో పేర్చి
కపులు
దూరి చూడంగ నం దొక దుష్టుడసుర । చండసురనిర్భయుండు క్రూరుండు
దోచె॥ 17

**తే.** కొండవలెనున్న ఘోరు నా కోతు లరసి।దట్టి బిగియించి యనికి సిద్ధంబునగుడు
అతడు వారిని జూచి "చచ్చితిరె" యంచు । పిడికిలెత్తుచు వారిపై కడరె వడిగ॥

తే. కడగి యిటువచ్చు వాని నంగదుడు గాంచి । వీడు రావణు డని యెంచి వెన్నుపైన
బాద నరచేత, వాడును పడియె నపుడె। నెత్తురొక్కుచు కొండ నా నేలపైన॥

తే. వాడు నట్టుల యసువుల బాసి నంత । విజయమున్ గొన్న కపు లప్డు పేర్చి యార్చి
ఇతడు రావణు డిక, సీత యింటె యుండు । ననెడి యాశను వెదకి రా యడిరి గుహను॥ 22

తే. కాననం బద్ది యెల్ల న్గా కపిగణంబు । వెదకివెదకియు వేరొక్క వితతగుహను
ఘోరమును జొచ్చి యెల్లెడ వీరవరులు। వెదుక జొచ్చిరి మరల నా వెలది కొరకు॥

తే. ఎన్నొ రీతుల వెదకియు నింతి గనక । దీనమానసులును ఖిన్న హృదయులగుచు
అలసి యేకాంతమందున సొలసి కూడి । అట్టె చదికిలబడి రొక్క చెట్టు మొదట॥ 24

48 వ సర్గ సమాప్తి :- (1,956)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### నలుబది తొమ్మిదవ సర్గ :—(22)

(2) వానరులు మరల పరిదేశాంతరముల వెదకుట.

తే. అంత నంగదుఁడును పరిశ్రాంతుఁడగుచు । నిఖిల వానరవరులను నెలమి గాంచి
వచన మిటుబల్కె నా మహాప్రాజ్ఞు డపుడు । ఊరడించుచు మెల్లన వారి నెల్ల॥

తే. వనుల, గిరులను, నదుల నపారములను।గహనముల,దుర్గముల,మహాగహ్వరముల
వెదకినారము గిరిమహా వితతి నెల్ల । దరుల నెల్లెడ దేవికై తిరిగి తిరిగి॥ 2

తే. అచ్చటచ్చట చరియించి యందరమును । చూచినారము; కన మెందు క్షోణిసుతను ;
సురసుతోపమ సీత నా ధరణిసుతను।అకట,హరియించియున్న రాక్షసునిగనము

తే. కాలమెంతయొ మన కయ్యొ! చాల గడచె । స్వామి సుగ్రీవుఁడును నుగ్రశాసకుండు
కాన, మీరెల్లరునుగూడి కాంతకొరకు । వెదకు డెల్లెడ సకల పృధ్వీతలంబు॥ 4

తే. విడిచి తంద్రియు, శోకంబు, విడిచి నిద్ర। సీత జనకాత్మజ మహీజ శ్రీశపత్ని
ఎటుల గాన్పించు మన కింక నటుల మీరు । వెదకుఁడీ ధాత్రి సర్వత్ర విసువు గొనక॥ 5

తే. విను డనిర్వేదమును, దాక్ష్యమును సతంబు । హృదిని నపరాజయంబు నా నెసగు నిన్ని
కార్యసిద్ధికరంబులం చార్య లందు । కాననే యిట్లు వచియింతు కార్యసరణి॥

తే. మరల మరియొకమారు నీ గిరుల నెల్ల। దుర్గమంబుల, వనముల, వర్గములుగ
వెదకుదము ఖేదమును వీడి సుదతికొరకు । విసువులేకుండ సర్వత్రి వివిధగతుల॥

తే. పని యొనర్చిన తప్పక ఫలము గలుగు । కర్మకెప్పు డవశ్యంబు గలదుఫలము;
చాలు నిర్వేద మిక కపిచయములార! । ఇంక కనుమూయఁదగదు; లెం డింక
వెదుక॥ 8

తే. రాజు సుగ్రీవుడు వినుండు ప్రబలకోపి । తీక్ష్ణదండుండు గాన భీతిల్లవలయు
ఆ మహాత్ముని రాముని కటులె మనము । మిగుల భయపడవలె సుండి
మిత్రులార॥ 9

తే. చెప్పితి హితార్థ మిటుల నే నప్పు! మీకు।చేయు డిది మీకు నెడద రుచించునేని
చెప్పు డింతకు మించి మే లొప్పుతోవ । మీకుతోచిన యేదైన మిత్రులార॥

తే. అంగదుని మాట లవి లెస్స ఆలకించి । "గంధమాదను" డా మహాకపివరుండు
చెప్పె నవ్యక్త వచనాల నప్పు డిటుల । శ్రమను దప్పిని ఖిన్నుడై చాల సోలి॥

తే. సదృశమే సుండి వాక్యమెయ్యది కుమారు । డంగదుడు చెప్పె మనకిప్పు
డాప్తులార!
హితము ననుకూలమును సుండి యతనిపల్కు; । చేయుదము లెస్స యట్టులే;
చెలగి లెండు॥ 12

తే. మరల వెదకుద మిక లెండు ప్లవగులార! ।శైలముల, కందరంబుల, సానువులను
శూన్యకాననములను నీ క్షోణిగల్గు । బహు గిరిప్రస్రవణముల గుహుల గిహల॥

తే. ఆ మహాత్ముఁడు సుగ్రీవు డదరిమనుచు । మనల పంపెడునప్డు చెప్పిన విధాన
సర్వ గిరిదుర్గములను నీ యుర్వినెల్ల। వెదకు డిక సర్వవనముల పేర్చి మరల॥ 14

తే. అంత లేచి మహాబలుల్ హరిగణములు। మరల వెదుకంగ సాగిరి మాతకొరకు
వింధ్యకానన సంకీర్ణవిస్తృతంబు । దిశను దక్షిణమును వారు విశదభంగి॥ 15

తే. శారదాభ్ర ప్రతిమమల్ల సానుమయము । తతము శ్రీమద్రజత పర్వతంబు దరిసి
బహు దరీమంతమును శృంగవంతమైన । గిరిని నద్దాని వెదకిరి కీశతతులు॥ 16

తే. అచట "క్రోద్రవనంబు" రమ్యంబు నరసి । సప్తపర్ణ వనంబుల జాల వెదకి .
సీతదర్శించుకాంక్ష నా క్షితిని నెల్ల । వెదకి వెదకిరి హరివరుల్ విసువులేక॥ 17

తే. దాని యగ్రము లెక్కి యా వానరులును । విపుల విక్రము లెల్లరు వెదకివెదకి
తిరిగి యలసిరి; కాని వైదేహి నెందు।రామమహిషిని ప్రియను వా రరయరైరి॥

తే. జగతి బహుకందరంబు తత్ శైలవరము । దృష్టిగత మొనరించుచు దీక్ష వెదకి
ఎందు సీతను గానక చెంది విసుగు । దిగిరి వారెల్ల రా మహాద్రిని కలంగి॥ 19

తే. ధరణి కటు డిగ్గి విగతచేతనులు నోచు । అలసి యొక చెట్టుమూలంబు నాశ్ర
యించి
అలసటల్ దీర్చుకొంచు నా హరులు మరల । వెదుక సాగిరి జక్షీణం బింక
దీక్ష॥ 20–21

తే. హనుమ మున్నగు ముఖ్యు లా ప్లవగవిభులు । కదలి మరలను వింధ్య నా
ద్యమ్నధరంబు
మొదటినుండియు విడువక వెదకుటకును । పూని రెంతయు కనుగొన
భూమిసుతను॥ 22

49 వ సర్గ సమాప్తి :– (1,978)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబదియవ సర్గ :—(41)

(8) ఋక్షబిలంబను మహాగుహలో "స్వయంప్రభ" యను నామెను కపులు గాంచుట.

తే. అటుల తారాంగదులగూడి హనుమ మరల । యా మహాకపి యా మహా
యచలమెల్ల
వింధ్యనెల్లను గహనముల్ బిలము లెల్ల । వెదుకసాగెను విసువక సుదతి కొరకు॥

తే. సింహశార్దూల జుష్టముల్ శిలల నెల్ల । మరి, సరిత్తుల కడు విషమంబులెల్ల
తత నగేంద్రమునుండి య ద్దానినుండి । పారుచుండు మహా ప్రస్రవణములెల్ల॥

తే. చేరి, యా శైలమునకు నైరృతిగ కపులు । మరి, దురన్వేష మా దేశ
మరయుచుండ
స్వామి సుగ్రీవు డిడిన మాసంబు గడువు । గడచిపోయె మహాగుహాగహాన
మటనె॥ 8

తే. అచట, వాయుతనూజు నా హనుమ గూడి । ఒకరికొకరు సమీపాన నోలి జేరి
పర్వతం బద్ది సర్వంబు నుర్విసుతను । కనుగొనంగను వెదకిరి ఘనులు కపులు॥ 4

సీ॥ గజుడు, గవాక్షుండు గవయుండు, శరభుండు,
గంధమాదనుడు, నంగదుడు, నలుడు,
మైందుండు, ద్వివిదుండు, మరి, సుషేణుండును
తారుండు, జాంబవంతాది కపులు
జగతిని, తద్గిరిజాలావృతంబును
యామ్య మా దిశనెల్ల నరయుచుండ

క్షుత్పిపాసల వారు సోలి జలార్థులై
కాంచిరి బిలము దుర్గమము నొకటి

తే. లతల, వృక్షాల సమవకీర్ణమ్ము, ఘనము। సతము రక్షిత మొక్క రాక్షసుని చేత
ఉర్వి "ఋక్షబిలంబు" నా నొప్పు నదియు। బిలములందెల్ల మరి, మహాబిలము
నగును॥ 5-8

తే. అంత హంసలు క్రౌంచముల్ సారసములు। చక్రవాకంబులును పక్షిచయము
లెన్నొ
త ద్బిలమునుండి మరి, జలార్ద్రములు వెడలె। జలజరేణుల రక్తాంగములును
నొచు॥ 9

తే. ఆ బిలంబు సుగంధమయంబు నయ్యె।చొరగ దురతిక్రమంబౌట జూచి కపులు
విస్మయవ్యగ్రమానసుల్ సస్మితులును। నైరి వారెల్ల రప్పు డా యడవిలోన॥

తే. వివిధసత్త్వసమాకీర్ణ మవుచు జూడ। మరియు, దైత్యేంద్ర నిలయోపమంబు
నొచు
దుర్విగాహంబు దుర్దర్శసర్వమౌచు। నిలను నతిఘోరమౌ దాని నెదుట నరసి॥

తే. అపుడు సంజాతపరిశంకులౌచు మదుల। కాంతినంతులు కపులు నత్యంతబలులు
మరి, యసంహృష్టులౌచు నెమ్మదిగ కదలి।ఆ బిలద్వారమును జేరి రంద రోలి॥

తే. అంత పర్వతకూటాభుడైన యతడు। హనుమ పవనాత్మజుండు నా హరుల నెల్ల
గాంచి యిట్టుల బల్కె నా యంచితుండు। పుడమి కాంతారవనకోవిదుడు
ఘనుండు॥ 13

తే. దక్షిణం బద్రిజాలావృతంబు దిశను। వెదకితిమి దీని నెల్లెడ వివిధగతుల
మరి, పరిశ్రాంతులమునైతి మందరమును। కాని, కానము మైథిలీకాంత నెందు॥

తే. ఈ బిలమునుండి వెలువడు నిదిగొ కనుడు। క్రౌంచములు హంసములును
సారసము లింక
చక్రవాకంబులును పక్షిచయము లెన్నొ। కడుజలార్ద్రంబులైన పక్షములతోడ॥

తే. కాన, సలిలసమృద్ధంబునైన యట్టి। కూపమొ, హ్రదంబొ యుండు నీ గుహను
ధ్రువము
మరి, బిలద్వారముననున్న తరువు లివ్వి। స్నిగ్ధములుగను నున్నవి చేరి కనుడు॥

తే. హనుమ యిటుబల్క వానరు లంద రపుడు । బిలము మెల్లన జొచ్చి తా మేగుచుండ
అది యచంద్రార్కమును, రోమహర్షణమును । ఘోరతిమిరావృతంబౌచు నార తోచె॥ 17

తే. బిలమునుండి మహాసింహములును, మరియు । పెక్కు మృగపక్షిగణములు వెడలుచుంట
చూచు చన్నింటి వానరుల్ చోద్యముగను । పోవుచుండిరి గుహవెంట మునిగి యిరుల॥ 18

తే. చూపునకు నెందు చీకటిన్ చొరవ గనక । విక్రమంబునకు నుపక్రమింపరాక
మరియు, తేజంబునకును గమ్యంబుగాక । వాయు వట్టు లయత్నాన వారుజనిరి॥

తే. అటుల వేగాన త ద్బిలం బెటులొ దూరి। పోవపోవంగ వారి చూపులకు నెదుట
తోచెను ప్రకాశ మభిరామ మౌచు వెలయు । నుత్తమంబు ప్రదేశం బ దొకటి గుహను॥ 20

తే. త ద్బిలంబున దుర్గమధ్వాంతమందు । వివిధపాదపసంకుల వితతమందు
ఒకరి కొక్కరు పట్టుకొం చూత గాగ । పోయి రొక యోజనముదూర మోపి కపులు॥ 21

తే. నష్టసంజ్ఞులు, తృషితులు నౌచు కపులు।అమితసంభ్రాంతులగుచు జలార్థులగుచు
త ద్బిలంబున నెట్టులో తండ్రి వీడి । తిరిగి రొక కొంతకాలంబు దీక్షబూని॥ 22

ఆ. కృశులు దీనముఖులు నిక పరిశ్రాంతులు । వీరు లా కపీశు లార! యపుడు
బ్రతుకుపై నిరాశబడుచును నప్పుడే । గాంచి రొక్క వెలుగు మంచి దెదుట॥

ద్వి. అంత నచ్చట వారు నతిసుందరంబు।వితిమిరం బౌక వనం బతి సౌమ్యమహహ
చూచిరి కాంచన క్షోణీజములను॥ 24
జ్వలిత వైశ్వానర సమముల నెదుట । సాలతాలాశ్వకర్ణాఖ్యల మరియు
కకుభ వంజుళ నాగ కర్ణికారముల । పున్నాగ చంపక పుష్పితాశోక
ధవముల నెన్నియో త ద్దేశమునను॥ 24-25

ద్వి. కాంచన స్తబకాల కడు చిత్రములను । కిసలయంబుల ర క్తకేసరంబులను
సౌవర్ణభూషణ సమలంకృతముల । వర లతామండిత తరుజాలములను
వైడూర్య వేదికామండలంబులను । తరుణార్క సంకాశధరణీజములను
పాదపంబుల హిరణ్మయముల నెన్నొ । విభ్రాజముల నెన్నొ వీక్షించి రచట॥

ద్వి. నీలవైడూర్యవర్ణాళుల తోడ । నానావిహంగసంఘాళుల తోడ
బాలార్కసన్నిభప్రతిభల తోడ । వరలెడు కాంచనపద్మాళి తోడ
బెరయు పద్మినుల వా రరసి రచ్చటను॥
జాతరూపముల మత్స్యంబుల తోడ । బహు మహత్తర కచ్ఛపంబుల తోడ
స్వచ్ఛంబుల ప్రసన్న సలిలావృతముల।కొలకుల గాంచి రా గుహను వానరులు॥

ద్వి. స్వర్ణవిమానాల మరి రాజతముల । తపనీయ కమనీయ తత గవాక్షముల
ముక్తామణీజాల పూర్ణంబు లెన్నొ । హైమ, రాజత, మహాభౌమంబు లెన్నొ
వైడూర్యమణిగణ భవనంబు లెన్నొ । హరులు తద్గుహాలోన నరసి రెల్లెడల॥

ద్వి. ఫలవంతముల పుష్పవంతాల తరుల । స్నిగ్ధప్రవాళసన్నిభముల నెన్నొ
కాంచనభ్రమరాల మంచి తేనియల । మణికాంచనాంచిత మహితచిత్రాల
శయనాల మరియు నాసనముల నెన్నొ । యానాల నింక మహార్హాల నెన్నొ
కాంచి రెల్లెడల నా కపులు తద్గుహను॥ 32-33

ద్వి. హైమ రాజత కాంస్యమయ భాజనముల । దివ్యచందనముల దివ్యధూపముల
రుచికరంబుల నింక శుచికరంబులను । ఫలముల మూలాల బహుళ రాసులను
బహు మహార్హంబుల బహుళపానముల । మధువుల బహురసమయముల నెన్నొ
దివ్యాంబరంబుల నవ్యయంబులను । కంబళంబుల చిత్రకంబళంబులను
అజినంబులను మహార్హంబుల నింక । జ్వలితవైశ్వానర సమములైనట్టి
శుభ్రసౌవర్ణవస్త్రోత్కరంబులను। అచ్చటచ్చటను విన్యస్తంబు లౌచు
పడియుండ జూచి రా ప్లవగపుంగవులు॥ 34-37

తే. అచ్చ టచ్చట వెదకు చా యద్రిగుహను । శూరులు మహాబలుల్ కపుల్ వార లొకట
తమ కదూరంబునందునే తక్షణంబ।చూచి రొక స్త్రీని, నెడదల చోద్యముగను॥

తే. చీరకృష్ణాజినాంబరధారి తపసి । నియమితాహార తేజాన నిప్పువోలె
వెలుగునా పెను జూచి బల్ భీతి జెంది । విస్మయంబును జెంది రా వీరకపులు॥

ద్వి. గిరిసన్నికాశుండు కీశుండు హనుమ । అంత, కృతాంజలియై యా పె కెరగి
వృద్ధ నా పెను నిట్లు పృచ్ఛించె "దేవి! । ఎవరవమ్మా నీవు ఎవరి దీ బిలము
ఎవరి దీ భవనంబు హేమమయంబు । రత్నవంతం బిది ప్రభలొల్కు నహహ
చెప్పు మెవ్వరిదోను చెప్పుమా," యరచు॥ 40-41

50 వ సర్గ సమాప్తి :– (2,019)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబది ఒకటవ సర్గ :—(19)

ఋక్షబిల వృత్తాంతము కపులకు "స్వయంప్రభ" చెప్పి—వారికి ఫలమూలపానీయముల నొసంగి,
ఆదరించి—"మీ రేమి కార్యమున వచ్చితి"రని యడుగుట.

తే. అటుల వచ్చియుంచి హనుమ యా పటుబలుండు। తాపసిని ధర్మచారిణి నా పెజూచి
ఆ మహాభాగ కృష్ణాజినాంబరకును । మ్రొక్కి యిటుబల్కె మరల నా భూరి
భుజుడు॥ 1

తే. ఈ బిలంబును తిమిరసంవృతము నెట్లొ। సాహసంబున జొచ్చితి మోహహో! దేవి!
క్షుత్పిపాసల నెంతయు సోలి యకట! । కడు పథిశ్రమమున జలకాంక్ష జేసి॥ 2

తే. రహి మహద్ధరణీవివరంబు దీని । తృష్ణచే జొచ్చి యిచట నీ తీరునున్న
అద్భుతద్రవ్యములజూచి వ్యథితులమయి। ఏమితోచకయుంటిమి యెంతొ భ్రాంతి॥

ద్వి. కాంచనతరులు భాస్కరసన్నిభములు । అభ్యవహార్యంబు లమలముల్ పండ్లు
కందమూలంబులు కడు రుచ్యములును । స్వర్ణవిమానముల్ వర రాజతములు
తపనీయ కమనీయ తత గవాక్షములు । వైడూర్యమణిగణభవనంబు లివ్వి। 4-7
ఫలవంతములు పుష్పవంతముల్ తరులు । సురభిగంధంబులు మరియు,
పుణ్యములు
ఎవ్వరి వివి యెల్ల ఎవ్వరి వలన । ఎవ్వరి తేజాన యివి యుద్భవించె
కాంచనపద్మముల్ కలిగె నిచ్చోట । నీ స్వచ్ఛజలముల నెవరి తేజాన?॥ 4-7

ద్వి. సౌవర్ణమత్స్యముల్ చరియించు నిచట । కచ్ఛపంబులగూడి కమ్మని నీట
ఎటులుద్భవించె నీ యెల్లచిత్రములు । నీప్రభావాననా? నిజ మింక యెవరి

ఘనతపోబలమునకలిగెనో చెప్పుమ? । తెలియదుగాన యీ తెరగెల్ల మాకు
తెలియజెప్పుము దేవి! తెలియంగ మాకు॥ 8

తే. హనుమ యిటుబల్క- తాపసి యమలచరిత । సర్వభూతైకహితరత సాధ్వి యాపె
ధర్మచారిణి వాయుపుత్రుని జూచి । బదు లిటులబల్కె- నెలమి నా పావనాత్మ॥

తే. "మయుడ" నెడి పేర మాయావి మహిత తేజు । డొక్క- దానవపుంగవుం డుండెసుమ్ము
అతని మాయనె సుమ్ము నిర్మిమిత మి దెల్ల । వనము కాంచన మిదియు
నాతని కృతంబె॥ 10

తే. ఇతడు దానవముఖ్యుల కెల్లమునుపు । విశ్వకర్మగనుండె భూవిదితముగను
కాచనమయంబు దివ్యమీ ఘనగృహంబు । నిజము నిర్మించె నాతడే నిరుపమంబు॥

తే. అతడు వర్ష సహస్రంబు లజుని గురిచి । తపమును మహావనంబునఁ దగ నొనర్చి
సర్వ *మౌశనసంబు శాస్త్రంబు,ధనము । పొందె వరములుగా మహాత్ముండు పేర్మి॥

తే. వనము నిర్మించి మరి, మహాబలు డతండు । సర్వకామేశ్వరుం డప్డు సంతసమున
సుఖతమనమున వసియించె సుందరంబు । త న్మహావనమందున తత్పరతను॥ 13

తే. అప్సరస "హేమ"యనుదానియందు దగిలి । అతడు దానవపుంగవుం డనిశముండ
అల, పురందరు డెంతయు నాగ్రహించి । అతని గొని వైచె యీతు డా
యసురవరుని॥ 14

తే. బ్రహ్మయంతట యీ వనం బనుపమంబు । హేమ కిచ్చెను కాంచన గృహముదీని
కామభోగంబు లివ్వి యఖండములను । శాశ్వతంబుల నెంతయు శాశ్వతముగ॥

తే. "మేరుసావర్ణి"దుహితను వినుడు నేను । మరి, "స్వయంప్రభ" యందు్రి
న న్నురుగుణాఢ్య!

హేమ కిచ్చిన వనము నీ గృహము నెల్ల । రక్షయొనరించుచుందు నిరంతరంబు॥

తే. నాకు ప్రియసఖ హేమ సుం డన్నలార । నృత్తగీతవిశారద నెలత యాపె
ఆపె యొసగె వరంబు నా కనుపమంబు । రక్షయొనరింతు నీ గృహరాజమెపుడు॥

తే. ఏమికార్యంబు? మరి,యేమి హేతువునను । ఘోరకాంతార మిది -చొచ్చినారలీరు?
వనము దుర్గమ మిద్దాని ననఘులార! । ఎటుల కనుగొంటిరయ్య? కపీంద్రులార॥

తే. ఇవియె అభ్యవహారంబు లివియె పండ్లు । కందమూలంబు లివియు భక్షణమొనర్చి
దివ్యపానీయముల వీని తృప్తిఁదాగి । సర్వమును నాకు చెప్పుడు సాధులార॥ 19

* ఔశనసం = ఉశనసనసంబంధము = శుక్రాచార్యసంబంధము.

51వ సర్గ సమాప్తి :- (2,038)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము.

## కిష్కింధ కాండము.

### ఏబదిరెండవ సర్గ (19)

తాము వచ్చిన కార్యమును హనుమంతుడు స్వయంప్రభకు చెప్పుట.

తే. అంత, విశ్రాంతులైన యా హరిగణేశు । లెల్లరిని గాంచి యేకాగ్ర హృదయ సదన
ధర్మచారిణి తాపసి నిర్మలాత్మ। వచన మిటుబల్కె నెంతయు ప్రచురఫణితి ॥

తే. ప్లవగపతులార! యీ ఫల భక్షణమున। అలసటలు మీకు దీరిన యట్లులైన
నేను మీకథ వినదగునేని యింక । చెప్పు డిక సర్వమెలమి నిచ్ఛింతు వినగ ॥

తే. ఆపె యటుబల్కినట్టి వాక్యంబు వించు। మారుతాత్మజు డా హనుమంతు డపుడు
ఆర్జవంబున ఉన్నదున్నట్లుగాగ । చెప్పదొడగెను సర్వంబు నొప్పిదముగ ॥ 3.

తే. రాజు గల డెల్ల లోకంబులకును వినుము। ఇలను వరుణోపముండు, మహేంద్ర సముడు
దాశరథి శ్రీయుతుండు నుదారయశుడు। రామచంద్రుండు నా మహాప్రథిత గుణుడు॥ 4.

తే. భ్రాతలక్ష్మణుతోడ, భూజాతసీత। భార్య వైదేహితోడ నా ప్రభువరుండు
దండకనునుండ త జ్జనస్థానసీమ। ఔర! సీతను రావణుం డపహరించె॥ 5.

తే. రామచంద్రుని సఖుడు తత్ ప్లవగవిభుడు। కీశతతికెల్ల రాజు సుగ్రీవు డనగి
పనుప యమరక్షితంబు దక్షిణము వెదుక। వచ్చితి మగ స్త్యచరితాశ కిచ్చబాదల॥

తే. ఘోరు లీ వానరులనెల్ల గూడిమేము। భీమరాక్షసు రావణు కామరూపు
వెదకుచును సీత వెదకుచు విసిగి యలసి। చేరితిమి తల్లి! యొకచెట్టుచెంత కెటులొ॥

తే. అంగదాదులమెల్లర మాననములు। కడు వివర్ణతనొంద దుఃఖాబ్ధిమునిగి
చూచుచుండంగ బిల మొండు దోచె మాకు। తరులతావలి సంఛన్న మిరుల
మయము॥ 9-11

తే. త ద్బిలమునుండి హంసలు తడిసియున్న। మేనులను, రెక్కలను, నీరుమిక్కిలిగను
తటతట విదుర్చుకొంచును తరలిరాగ। అరసితిమి సారసంబుల కురరములను॥12

తే. "మంచి దిందు ప్రివేశింత" మంచునేను। ననగ, యీయూహయేగల్గ నంద
రకును
"సరి ప్రివేశింత మిదె పదుం"డ నిరికపులు। భ_ర్తృకార్యత్వరాన్వితుల్ ప్లవగులెల్ల

తే. ఇకను గట్టిగ యొకరి చే యొకర మపుడు। పట్టుకొంచును చీకటి కొట్టుమాడ్కి-
నున్న యీగుహ జొచ్చితి మో!పురంధ్రి!। సాహసంబునప్లవగసమూహములము॥

తే. ఇదియు నూ మాదు కార్యమో యింతిమిన్న!। ఈపనికిగాని వచ్చితి మిటకు
దేవి!
మిగుల ఆకలి దప్పుల పొగిలి తల్లి!। నిన్ను చేరితి మిట్టుల నిర్మలాత్మ!॥

తే. తల్లి! ఆతిధ్యధర్మద_త్తంబులైన। మూలముల యీ ఫలంబుల భు_క్తిజేసి
తీరె మాశ్రిమయెల్ల యీ తీరుగాగ। బ్రితికితిమి తల్లి! నీదగు పరమకరుణ॥

తే. ఆకటన్ జావనున్న మ మ్మందర నిటు। రక్షయొనరించినావె, యో లలితమాత!
చెపుమ ప్రిత్యుపకారార్థ మిపుడు నీకు। ఏమి సేయుదు మమ్మ! మే మింత కిచట

తే. హనుమముఖమున వానరులంద రిట్లు। పల్కియున్నట్టి పల్కు నా పణతి వినుచు
తత్ "స్వయంప్రిభ" వానర తతుల కెల్ల। ఇటుల ప్రిత్యు_త్తరం బిచ్చె నెలమి
కలిమి॥

తే. మిగుల పరితుష్టిపొందితి మిత్రులార!। ప్లవగపుంగవులార! మీ ప్రితిభగురిచి
ధర్మమున సంచరించెడి దాన నేను। కలుగు నాకేమిపని ప్రితిఫలముతోడ?॥

52 వ సర్గసమా_ప్తి:—(2,057)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబదిమూడవ సర్గ (౫౩)

'స్వయంప్రభ' ప్రభావముచే వానరులు బిలమునుండి ఎట్లో వెలువడుట - సుగ్రీవుడు పెట్టిన గడువు దాటుటచే "కర్తవ్యమేమిట"ని వానరులు నిర్వేదము నొందుచుండుట, సీత కనపడక ఇంటికిపోయినచో సుగ్రీవుడు చంపునుకాన, మనము క్షేమముగ ఈ బిలమందే యుండిపోవ నని అంగదుడు సూచించుట - తారుడు ఆమోదించుట:-

తే. ధర్మసంహితవాక్యమా తపసి యిట్లు। పలుక శుభతర మద్దాని నలరి వినుచు
పలికె హానుమంతు డపుడొక్క వాక్యమెలమి। ఆ యనిందితచేష్టిత కాపె కెరగి॥

తే. శరణమొందితిమమ్మ! యెల్లరము నిన్ను। ధర్మచారిణి! తల్లి! యుత్తరిని నిటుల
గడువు మాప్రభు డిడినది గడచె నయ్యె। తిరుగుచుండగ మేమిట్లు దేవి! గుహను॥

తే. వెలికిజేర్పుపు మమ్ము నీ బిలమునుండి। గడువు దాటిన మా కింక గలదె బ్రతుకు!
మమ్ము రక్షింపు మెల్లిన మాత! నీవు। ఎలమి సుగ్రీవభయకర్శితులను నెల్ల॥

తే. మే మొనర్పంగ వలసిన మేటిపనియు। కలదుతల్లిరో! ధర్మసంకలిత హృదయ!
ఇచట మేమిట్లు చిక్కినయెడల దేవి!। కార్య మయ్యది మిగిలిపోగలదు సుమ్ము॥

తే. హనుమ యిటుబల్క తాపసి యనియె "వినుడు। జీవితము దుష్కరం బిందు జేరి వెడల
అయిన వెడలింతు నా ప్రభావాన మిమ్ము। తపమునను నియమోపార్జితమున నిపుడు" 6_7

తే. "కనులనెల్లరు నిక మూసికొనుడు మీరు। కనులు తెరచిన వెడల శక్యంబుగాదు"
అనగ, సుకుమారకరముల నంగుళముల। గప్పుకొని రక్షలను కపుల్ గమన
కాంక్ష" 8-9

తే. ఆ మహాత్ములు వానరు లప్పు డటుల। హ స్తరుద్ధముఖంబుల నలరుచుండ
రెప్పపాటుననే యెట్లొ గుప్పు నెగసి। వెలికి వచ్చిరి వారెల్ల బిలమునుండి 10

తే. ధర్మచారిణి తాపసి తడయ కపుడె। విషమదుర్గమమైన యా బిలమునుండి
వారివెడలించి యట్టు లపారకరుణ। మరియు నూరార్చి నిట్లని మాతయాప్తి॥

తే. ఇదె గిరీంద్రము వింధ్య, శ్రీసదన మహహ। రమ్య నానాద్రుమలతాకులంబు
నగును
ఇదియె ప్రస్రవణంబు శైలేంద్ర మాను। సాగరంబు మహోదధి సరస నిదియె॥

తే. స్వస్తిమీకగు; పోదు నా సదనమునకు। సెలవు వానరవరులార! సెలవ టంచు
ఆ బిలంబును శ్రీమంత మపుడు జొచ్చె। త "త్స్వయంప్రభ" తాపసి ధర్మ
చరిత॥ 13

తే. అంత వారలు గాంచి రా చెంత నపుడె। అల్ల సాగర మా వరుణాలయంబు
ఘోర మభిగర్జలొప్పు నపారజలధి। భీకరోగ్రుల కరము సంవృతము జగతి॥ 14

తే. మయుని మాయను నిర్మితం బయిన యట్టి।బిలము గిరిదుర్గమంబును వెదకుచుండ
గడువు నెయ్యది సుగ్రీవు డిడియె ప్రభుత। మాస మదియును గడచె నా మర్క-
టులకు॥ 15

తే. వింధ్యపర్వతపాదాన వీర కపులు। సంప్రపుష్పితపాదప స్థలమునందు
కూరుచుండి మహాభాగు లూరుపులను। బుచ్చు చిట్టుల చింతల మునిగి రెదల॥

తే. భూరిపుష్పాతిభారాగ్రములను జూచి। తత లతాశతసుసమావృతముల నరసి
విపుల వాసంతికద్రుమ వితతిగాంచి। కపులు భయశంకితులునైరి నపుడె మదుల

తే. "అరరె! వచ్చె వసంతంబు ధరణి" కంచు। మరి, పరస్పర మరసి, వా రెరిగి
కొన్రమ॥
గడువు తీరుట, కార్యంబు చెడుట దలచి।వార్త జేరమి గాంచి, వా రార్తిబడిరి॥

తే. అంత, సింహవృషస్కంధు డనుపముండు। విపుల పీనాయతభుజుండు కపివరుండు
అఖిల కపివృద్ధులను శిష్టులైన వారి। మధుర భాష్యాల బిలిచి సన్మాన్యరీతి
ఆ నన్మానసు డా మహా ప్రాజ్ఞు డెలమి। అంగదుం డల్ల యువరాజుననియె నిట్లు॥

తే. "మనము కపిరాజుశాసనంబునను జేసి। తరలివచ్చితి మెల్లర మరయ సతిని
మాస మదియును సంపూర్ణమయ్యె మనము। గుహను నుండగనే; మీకు
గురుతు లేదా? ॥ 21

తే. ఆశ్వయుజమాసమున మన మందరమును। పిలువబడితిమి రాజుచే వెలది వెదుక
కాలముగణింప గడువెల్ల గడచిపోయె। ఇంక పిమ్మటి కార్య మే మిప్పుడు
చెపుడ॥ 22

తే. అధిపునకు మీరు నమ్మకం బైనవారు। నీతి మార్గవిశారదుల్ నేర్పుగలరు,
పతిహితమునందు రతులు సంతతము మీరు। సర్వకర్మల నిపుణులు సర్వవిదులు॥

తే. అప్రతిము లీరు సర్వకర్మావళులను। అఖిలదిశలను విశ్రుతపౌరుషులును
నన్ను మున్నిడుకొని వచ్చినార లిటకు। అధిప పింగాక్షు సుగ్రీవు నాజ్ఞ జేసి॥24

తే. మనము సీతను జూడక చనుదుమేని। చావవలసినవారమే సత్యమింత
స్థిరము హరిరాజు నాజ్ఞనుసేయకుండ। ఎవడు సుఖియగు చెప్పు డీ యిద్ధరిత్రి॥

తే. విభుడు సుగ్రీవుడే స్వయం బిడినయట్టి। గడువుదాటినయెడల హా గతి యిదేమి!
ఓహరా! ప్రాయోపవేశంబె యుక్తమగును। సర్వవానరులకు నింక నుర్విపైన॥26

తే. ప్రకృతిచేతనె తీక్ష్ణుండు, ప్రభుడు నయ్యె। అల్ల సుగ్రీవు డిప్పుడు హరుల కెల్ల;
కాన, క్షమియింప డాతండు కపుల మనల। పనియొనర్పక చెంతకు చనితిమేని॥

తే. గడుపుదప్పుటయేకాక పడతిజాడ। గనక మనమేగ, మనల జంపును, నిజంబు
కాన, నిచ్చటనే వ్రతం బూని మనము। నిరశనంబున జచ్చుట కరము మేలు॥

తే. ఆలుబిడ్డల ధనముల నయ్యె యిండ్ల। నన్నిటిని వీడి ధ్రువ మిక యందరమును
చావవలసియెవచ్చు సుగ్రీవుచేత। పనియొనర్పక పురి కిటు చనితిమేని॥ 29

తే. అచట అప్రతిరూపంబునైన యట్టి। వధము నద్దానికంటె హా వానరులకు
మృత్యు విచ్చటనే మన మెల్లరమును। పొందు టెంతయు శ్రేయంబు పోల్చి
కనుడు॥ 30

తే. యౌవరాజ్యాన నన్ను సుగ్రీవు డెపుడు।నిజము నిల్పంగ లేదు సౌహార్దముతోడ;
రాము డక్లిష్టకర్ముడే రాణ నన్ను। నిల్పజేసె నరేంద్రుడా యల్పుచేత॥

తే. బద్ధవైరుండునౌట పూర్వం బతండు। తప్పు నాయందు గనిన సుంతైన గాని
ఘాతయొనరించు నన్ను తత్ ఘాతకుండు। తీక్ష్ణదండాన సుగ్రీవు డా క్షణంబ॥

తే. అచట కిష్కింధలోన నే నటుల జచ్చి। మిత్రులెల్లరి నయ్యో! యే డ్పించుకంటె
ఇచట ప్రాయోపవేశాన మృతిని గందు। పుణ్యసాగరరోధసీభూమియందు॥ 32

తే. ఇట్టు లకట కుమారు డా నృపసుతుండు। భ్రమసియంగదు డా యువరాజు బలుక
సర్వవానరు లప్పుడు స్వాంతములను। కరము గుందుచు పల్కిరి కరుణ మిట్లు॥33

తే. ప్రకృతితీక్ష్ణుండు సుగ్రీవు డిక వినుండు।ఎద ప్రియాసక్తు డా రాము డే మనందు
సీత జూడక మన మింక చెంత కరుగ। మనల జంపించు ప్రియము రాముని
కొనర్ప॥

తే. కూడ దపరాధ మొనరించు వా డెప్పుడును।స్వామిపార్శ్వంబునకు జను శేమికాని
సీతజాడ నెరింగిననే తరించి। చనుద మింటికి; కాకున్న చ త్త మిట నె॥ 35-36

తే. బహుభయార్దితులు నా ప్లవగు లి ట్లనగ। తారు డిట్లనె, "చాలు తద్దశోకంబు
గుహజొచ్చి యుందము కూడియందరము। ఇష్టమే మీ కిది హితులు పల్కుడు!
వితత మాయావి నిర్మితము నియ్యదియు। భూరివృక్షోదక భోజ్య పేయకము
మన మిట నున్నచో మన కింక భయము। ఆ పురందరుచేత నైన లేదండి
ఆ రాఘవునిచేత నైన లేదండి। వానరరాజుచే నైన లేదండి॥" 37-38

ద్వి. విని యంగదుని మాట కనుకూలమద్ది। హరు లెల్లరును నప్పు డాత్మలో జూచి
మనమందరము నెట్లు బాధనొందకను। చరియింతు మారీతి సరగున మీరు
సేయు డటంచును చెప్పి ర క్కపులు॥ 39

-: 53 వ. సర్గ సమాప్తి :- (2,096)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబది నాలుగవ సర్గ :—(22)

పినతండ్రితో భేదపడు సూచన అంగదునియందు కనిపెట్టి, ఆ ప్రమాదము వారించుటకై హనుమ
కోపోపాయసమన్వితమైన భీషణవాక్యముల నంగదునితో బల్కుట.

తే. అంత తారాధిపతికాంతు నటుల బల్కు । తారు నుడి విని, యంగదు తీరు నరసి
"కలదు కపిరాజ్యము హరించు తలపు హృదిని । అంగదుని" కంచు ననుమాన
మందె హనుమ॥ 1

తే. బుద్ధి అష్టాంగయుక్తమై బొదలు పెరిగి । మరి, చతుర్బలయుక్తుడై వరలు టరసి
తత చతుర్దశ గుణముల దనరు పెంచి । వాలిసుతుడే యితండని హనుమ దలచె॥

సీ. శుక్లపక్షాదిని శుభ్రశ్రియంబున
చదల వర్ధిల జూచు చంద్రు డట్లు
తేజోబలంబుల నోజ పరాక్రమం
బుల వృద్ధి కెగబ్రాకు లలితు, బాలు
బుద్ధిబృహస్పతిన్ బురుడించు వానిని
విక్రమంబున తండ్రి మించువాని
శుక్రుని సేవించు శక్రునిచందాన
తారుని సేవించు దర్పఘనుని

తే. స్వామికార్యార్థమై శ్రమపడెడువాని । అఖిల శాస్త్ర విదాంవరు నట్టి చూచి
ప్రభుని సుగ్రీవుతో భేదపడకయుండ । అంగదుని దేర్చి గూర్చ నా హనుమ
పలికె॥ 3-5

తే. నా ల్గుపాయాలలోన నా నయవిదుండు । మూడవ యుపాయమే కొని ముఖ్యముగను
అంగదునితోడ భేదించు నట్లు జేసె । ప్లవగులెల్లరి వాక్యసంపదను హనుమ॥ 6

తే. వార లెల్లర నటు భేదపరచి పిదప । అలుకరూపంబు నౌ యుపాయంబు బూని
భీషణంబుల వాక్యాల పెక్కు బలికి । అంగదుని భీతు నొనరించె హనుమ యప్పుడు॥ 7

తే. నీ వోహూ! సమర్థతరుడవే? నీదుతండ్రి । వాలికంటెను యుద్ధాన బాలకుండ!
మరియు, తారేయ! కపిరాజ్య భరముదీని। దాల్పశక్తుండవే నీదు తండ్రిమించి?॥

తే. నిత్య మస్థిర చిత్తులు నిజము కపులు । వినుము హరిపుంగవా! యింక వీర లెల్ల
పుత్రదారాదులనువీడి పొగులు చిచట । నిలిచి యుందురె నీతోడ నీదు నాజ్ఞ?

తే. నీదు నెదుటనె చెప్పెదు నిజము వినుము । ఈ సుహోత్రుండు నీ నీలు డీ ముదుసలి
జాంబవంతుండు నీదు నాజ్ఞలకు లొంగి ।ఉండ రెప్పుడు నీదండ నొదిగి యిచట॥

తే. నన్ను నీ వృద్ధ జాంబవంతాది కపుల । సామదానాదులనుగాని భీమమైన
దండనంబునగాని నీ దండ కెపుడు । త్రిప్పుకొనలేవుసుమ్ము సుగ్రీవునుండి॥ 11

తే. విను బలీయుడు దుర్బలు గానక లెక్క । అతనితో విగ్రహంబు గానంగవచ్చు;
దుర్బలున కాత్మరక్ష ప్రస్తుతముగాన । విగ్రహింపంగ తగదు పో ధీరు డతడు॥

తే. బలము స్వాయమది లేకున్న బిలమ యిదియ । నన్ను కాపాడునంచు నీ వెన్నె దేని
దీని భేదించు టనగ రామానుజునకు । అతని బాణాల కల్ప కార్యంబె యగును॥

తే. స్వల్పమే సించె వజ్రి మున్ వజ్రిమేసి । కాక, యిప్పుడు వినుము లక్ష్మణుడె కనుక
పూనినట్లైన నిక పత్రపుటము నట్లు । సించు దీనిని నిశితేషు వృష్టి బరపి॥ 14

తే. వినుము నారాచములు లక్ష్మణునకు గలవు । పెక్కు లట్టివి యంగదా! నిక్కమోయి
అశని వజ్ర సమస్పర్శ మవియు వత్స! గిరులనేని విదారించు; * దరి యిదెంత?॥

తే. బిలము నిద్దాన నీవుండ దలచినంత । విను పరంతప! తక్కిన వనచరు లిక
హృదుల కృతనిశ్చయులునౌచు నిన్ను వీడి । చక్కపోగలరయ్యా యీ జనము లెల్ల॥ 16

* దరి = బిలము.

తే. ఆలుబిడ్డల దలచి నిత్యంబు పొగిలి । ఆకటన్ మాడి ఖేదాన నట్టె నవసి
కటిక నేలల బడియుండి కాగ్రి లేక । వదలి పోదురు వి న్నిట ప్లవగు లెల్ల॥ 17

తే. అపుడు నీవు సుహృత్తుల నకట వీడి । భువిని హితకాములైన బంధువుల బాసి
అయ్యో! అల్లాడి పోవుదు వయ్య వత్స! గడ్డిపరకకు హీనమై గాలి దూలి॥ 18

తే. విను దురాసదంబుల్ మహావేగములును । ఘోరములు సాయకములు నిన్ గూల్పకుండ
లక్ష్మణుని వింక నిక వదలవుగ ధ్రువము । గడువు దాటియు సతిఁగన * కడగి తేని॥ 19

తే; కాక, మాతో డవచ్చి వెన్కటి విధాన । నీవును వినీతుడవుగ నుండెదవ యేని
క్రమముగా నిన్ను సుగ్రీవు డమలమతిని । రాజ్యమున నిల్పు, చంపడు, రాజతండు॥ 20

తే. ధర్మకాముండు, విను, పినతండ్రి నీకు । కడు, దృఢవ్రతుడును ప్రీతికాము డౌను
శుచియు, సత్యప్రతిజ్ఞుండు, శూరవరుడు।చంప డెప్పుడు నిన్ను నిశ్చయము వత్స!॥

తే. కాక, నీతల్లి కెద ప్రియకాము డతడు । అతని జీవిత మా యమ్మ యందె కలదు
ఆమె సంతాన మీా వౌట యతని కింక । నిజము నీ వన్యుడవుకావు; ధృతిని జనుము॥ 22

---

* సతిఁగనక + అడగి తేని.

54వ సర్గ సమాప్తి :-(2,118)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబది అయిదవ సర్గ :—(౫౫)

అంగదుని [illegible], అతనితో హనుమ [illegible] [illegible] [illegible] [illegible] చేయుట.

తే. వినుచు ప్రశ్రితమైన యా హనుమ పలుకు । [illegible] మద్ది సంతతము హితము
స్వామి సత్కార్య సంయుక్త మా మనస్వి । అంగదుం డిట్లుపల్కె వాక్యంబు బదులు॥ 1

తే. స్థైర్య, మాత్మ మనశ్శౌచ, మార్జవంబు।ఆనృశంస్యంబు, మరి,విక్రమాదికములు
లేవు ధైర్యాదు లింక సుగ్రీవునందు । అల్ల కపిరాజు నం దిది తెల్లమేను॥ 2

తే. అన్న జీవించియుండగా నతని సతిని । పట్టమహిషిని ప్రియను, ధర్మమునతనకు
మాతయనునట్టిస్త్రీని చేపట్టెనెవడు । అట్టి సుగ్రీవు డయ్యో! పాపిష్టివాడు॥ 3

తే. ఎటుల ధర్మంబు నెరుగు పో హీనుడతడు । గురుడు నన్న మహాత్ముడా గుహాముఖాన
నిలిపి తనను, రణంబుకై బిలముజొరగ। కప్పిరాడె గుహాముఖం డప్పు డతడు!॥

తే. సత్యమున పాణిబట్టిన సఖుని ఘనుని । తనకు మేలొనరించిన దాశరథిని
ఆ మహాయశు రామునే యతడు మరచె । ఎవరి యుపకార మితడు స్మరించు నింక!॥ 5

తే. విను మధర్మభయానగాకను నిజంబు।లక్ష్మణు భయాన గాదె యా ప్లవగరాజు
సీత వెదుకంగ మనల నీ రీతిబంపె । అట్టి సుగ్రీవులో ధర్మ మెట్లులుండు!॥ 6

ఆ. అట్టి పాపి పైన అట్టి కృతఘ్నుపై । స్మృతిహీను చపల చిత్తుపైన
బ్రతుకగోరువాడు వర కులీనుండెవ్వ । డుంచు నమ్మకంబు యోగ్యు డింక॥ 7

ఆ. గుణియొ నిర్గుణుండొ తనకొడుకే నిల్పు । రాజ్యమందు గాని, రాజ తండ్రి
బ్రతుక నిచ్చునే దురాత్ముండు సుగ్రీవు। డింక నన్ను రిపుకులీను డైన॥ 8

తే. భిన్నమంత్రుండ, నపరాధి నన్న! నేను । హీనశక్తుండ, కిష్కింధ కేనుపోయి
దుర్బలుండ ననాథనై దుఃఖపడుచు। ఎటుల జీవింతు చెప్పుమ సుగ్రీవు చేత॥ 9

తే. శఠుడు, క్రూరుండు, మరియు నృశంసు డతడు । ఖలుడు సుగ్రీవు డిక రాజ్యకారణమున
నన్నుబట్టి యుపాంశుదండనల జేసి। అకట యురివేసి చంపు నన్యాయముగను॥

తే. ఉరిబడుచు నిట్లు మరణంబు నొందుకంటె । మేలు నాకగు ప్రాయోపవేశనంబె
సెలవొసంగుడు నా కింక; నిలుతు నిటనె । పొందు మీరెల్లరును గృహంబులకు కపులు॥ 11

తే. దృఢముగా జెప్పుచుంటిని వినుడు మీరు।పురికి నేరాను; - కిష్కింధ కరుగు డీరు
ఇటనె ప్రాయోపవేశాన మృతిని గందు।మరణమే నాకు శ్రేయంబు;-మాటలేల?॥

సీ. బలవంతు లా రాఘవుల జూచి నాకుగా
కుశలంబు నడుగుడీ గురుతమెుక్కి-
సుగ్రీవు వానరక్షోణీశు నాపిన
తండ్రిని గాంచి యాతనికి మ్రొక్కి-
అడుగుడీ కుశలంబు అన్నలారా యింక
ఆరోగ్యమడుగు చా యమ్మ రుమకు
కుశలంబు నడుగుడీ; - కూర్మి నా మాతను
తార నోదార్చుడీ మీరలెల్ల

తే. ప్రకృతిచేతనె ప్రియపుత్రి పరమసాధ్వి । వరతపస్విని దయనీయ పరమమాత
నే నిట వినష్టమాట దా నింక వినిన।ధ్రువము విడుచును ప్రాణముల్ దొడ్డతల్లి॥

తే. ఇంతవరకే వచించి యిం కేమి యనక।వృద్ధులకునెల్ల మ్రొక్కి రోదించుకొంచు
తల్లడిల్లుచు దర్భల ధరణి బరచి । అట్టులె పరుండె నచట నా యంగదుండు॥16

తే. ఇటుల దర్భల బండిన నృపతనూజు । జూచి వానరపుంగవుల్ శోకముబుక
నయనములనుండి విడిచి యుష్ణంబులైన । బాష్పముల నప్పు డక్కటా
బహుళముగను॥ 17

తే. అప్పుడు సుగ్రీవుఁ డిట్టు చా కపులమూక। వాలి నెంతయు బొగడుచు జాలిగుంది
ఎల్ల రంగదు చుట్టును నెలకు జేరి । తాము ప్రాయోపవేశంబు దాల్ప దలచి॥

తే. వాలిపుత్రుని మత మది ప్లవగు లెరిగి।నీరము స్పృశించి మరి యుదక్తీరమందు
దక్షిణాగ్రపుదర్భల దీక్షతోడ । భువిఁ బరుండిరి ప్రాఙ్ముఖంబుగ మునూర్ష॥

తే. రాము వనవాసమును, దశరథుని చావు । అట, జనస్థానవధము, జటాయు
మృతియు
వనిని వైదేహీ హారణంబు వాలివధయు । రాము కోపంబు గురిచి యా
ప్లవగులెల్ల॥ 21-22(ఎ)
చెప్పుకొనుచుండ నంతలో గొప్పభయము । తోచె నేదియొ కపుల కా
యుఃఖితులకు॥ (బి)

ద్వి. క్షితి బరుండి మహాద్రి శిఖరంబులట్లు । ఉల్బణజలదంబులో యనునట్లు
భృశము బొబ్బల బెట్టు కీశబృందముల । పెక్కురచే మహీభృద్వారం బద్ది
సన్నాదిత మహాగుహాంతరం బయ్యె॥

55వ సర్గ సమాప్తి :- (2,141)



ఏబది ఆరవ సర్గ :—(17)

మహాశ్వబడియున్న కపిసమూహమును జూచి, "బలే, ఎన్నాళ్ళకీ భక్ష్యములు తనకు దొరికినవని" సంపాతి యను పెద్ద గ్రద్ద తలంచి, అప్పటి పావనమారుతి- జటాయుని బలిదానమునుగూర్చి కపులు చెప్పుకొను మాటలు విని, ఈ "సంపాతి" తమాయించుకొని, నిలువబడి, కపులతో ఏమో అనుట.

తే. హరులు వారెల్ల రే గిరిస్థలమునందు । విధి బరుండిరో ప్రాయోపవేశమూని
తత్ప్రదేశంబునకు వచ్చె తత బలుండు। గృధ్రరాజొక్క డప్పుడు మెల్లగాను॥

తే. పేరు "సంపాతి" యనునట్టి విహగవరుడు । మరి, చిరంజీవి శ్రీయుతుం
దురుగుణుండు
జగతి విఖ్యాతబలపౌరుషములవాడు। అల, జటాయున కన్నయౌ నలఘుయశుడు॥

తే. త న్మహాగిరి వింధ్యకందరమునుండి। వెడలి మెల్లన, ప్రాయోపవేశ మచట
బట్టియు పరున్న హరుల దా నట్టెచూచి। పలికె హృష్టాత్ముడై యిట్లు పక్షిరాజు॥

తే. విధి ధ్రువం బెక నరుల కీ పృథివిలోన । వారి కర్మానుసారంబు ఫలముగూర్చు;
విహిత మీ భక్ష్య మిప్పు డా విధియె నాకు । పంపె చిరకాలమున కౌర!
వరుసఁ గూర్చు॥ 4

తే. వానరుల వీరి మరి పరంపరము జంపి । తిందు నొక్కొక్కరిని నాకు తృప్తిదీర
అనుచు వచియించె పక్షి రా జాకటఁబడి। ప్లవగులెల్లరి జూచి యా భువినిచట॥

తే. భక్ష్యలుబ్ధంబు, పక్షి యీ వరుస నచట। పలికియున్నట్టి దకట యాఫల్గు-వినుచు
కరము దిగులొంది యెడద నంగదుడు నడలి । హనుమతో డుత నిటుబల్కె-
నార్తిమునిగి॥ 6

తే. చూడు, సీతాపదేశాన వీడె యముడు।ధ్రువము సాక్షాత్తు వైవస్వతుండె యిట్లు
వచ్చె నిచ్చటి కిప్పుడు పెచ్చుపెరిగి । వానరుల సంహరింపంగ వరుసబెట్టి॥ 7

తే. సలుపమైతిమి రాఘవేశ్వరుని పనిని । సలుపమైతిమి మనరాజు పలుకు నిజము
హరులకు విపత్తియిద్ది యజ్ఞాత మకట । వచ్చిపడెనె తటాలున వసుధ నిచట॥8

తే. సాధ్వి వైదేహికి ప్రియంబు సలుపుకోర్కె । అట, జటాయువు గృధ్రరాజటుల నాడు
సలిపియున్న మహాత్కార్య సరణినెల్ల । చెవుల వింటిరిగాదె యశేషముగను॥ 9

తే. అటుల సర్వంబులో భూతరాసు లెల్ల । ఔర, చూడు, తిర్యగ్యోనులైనవియును
ప్రియమొనర్చుచుగా మన విధముగాను । ప్రాణముల నిచ్చి బలిగ శ్రీరామ పనికి॥ 10

తే. స్నేహకారుణ్యయంత్రితచిత్తములయి । ఎల్ల జీవంబు లన్యోన్య మిట్టులెగసి
సల్పు నుపకార. మా రఘుస్వామికౌర । ప్రాణములనిచ్చియైన హా బలిగ వడిగ॥

తే. ఉపకృతియొనర్ప రాముని కోజబూని । జీవితంబట్లు ధృతిని త్యజించి యుధిని
ప్రియమొనర్చినవాడయ్యె నృపతిమణికి । అమల ధర్మజ్ఞు డల్ల జటాయు వౌర!॥

తే. రాఘవార్థంబు కడు పరిశ్రాంతులమయి । మనము సంత్యక్తప్రాణుల మగుచు నిచట
ఘోరకాంతారమున జిక్కి కుములుచుంటి । మింతియేకాని కాంచ మా కాంతనయ్యో॥ 12

తే. సుఖయసుమ్మ నిజమ్మ తత్ శూరఖగము।రావణునిచేత హతుడయ్యెరణధరిత్రి
అతడు ముక్తుండు సుగ్రీవు భయమునుండి।అరిగె పరమంబునైనట్టి యమరగతికి॥

తే. అటు జటాయువు యుధిని కూలుటను నకట,।రాజు దశరథుడును నట్లు రాలిచనుట,
అబల వైదేహి మైథిలి హరణమగుట । ప్రాణసంశయమబ్బె హా! హరులకెల్ల॥

తే. సీతతో రామలక్ష్మణుల్ చేరు టడవి;।రాము బాణాన వాలి హా! రాలుటయును
రాముకోపాన రాక్షసుల్ చచ్చిపడుట; । కైక వరదానకృతమె యీ వికృతమెల్ల॥ 15-16

తే. అటు లసుఖమును బల్కు వాక్యంబువించు।భువి పతితులైన కపులను పోల జూచి
భృశచలితమతియై మహా ధీరమతియు।కృపణతను బల్కె నిట్టు లాగృధ్రరాజు॥

56 వ సర్గ సమాప్తి:- (2,158)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### ఏబది ఏడవ సర్గ :—(27)

“జటాయువు నాతమ్ముడు, అతని మరణమెట్లు గలిగెనో చెప్పుమన”గ అంగదుడు సర్వము చెప్పుట.

తే. అంగదముఖోద్గతంబైనయట్టి పలుకు । వినుచు నద్దాని నప్పుడా విహగరాజు
తీక్ష్ణతుండుండు పల్కె నీ తీరుగాగ । పటు మహాస్స్వన మెసగ సంపాతి భీతి। 1

తే. ఎవ డితడు మాట నిటుల ఘోషించు నిచట । ప్రాణములకంటె ప్రియతరుం డౌర నాకు
తమ్ముడు జటాయు వకట! వధమ్ము జెందె । ననుచు కంపింపజేయుచు మనము నాకు॥ 2

తే. ఎటులగల్గె జనస్థాన సీమలోన । రణము రాక్షసగృధ్రంబులకు నిజంబు
పేరు నాతమ్మునిది యిట్లు వింటి నిచట।జగతి చిరకాలమునకు నాశ్చర్యమౌర॥

తే. దింపు డీ కొండనుండి క్రిందికిని నన్ను । తమ్ముడు గుణజ్ఞు డతడు ప్రతాపశాలి
శ్లాఘనీయుండు దీర్ఘకాలమున కిట్లు । ప్రీతి గంటిని కీర్తింప మీర లతని॥ 4

తే. కాన, నిచ్చింతు వినగ నా కనుజుడైన । త జ్జటాయుని మరణవృత్తాంత మెల్ల
అల, జనస్థానవాసి నా యనుజు డెటుల। కూలె వివరంబు నే విన గోరు దిపుడె॥

తే. నాదు తమ్మున కెట్లు లా నరవరుండు । దశరథుండు సఖుండయ్యె;-దశరథునకు
జ్యేష్ఠపుత్రుండు రాముండు శ్రీయుతుండు । ప్రియుడు నంటిరి, గురుజన ప్రియుడు ననిరి॥ 6

తే. కనుడు సూర్యాంశుదగ్ధపక్షత్వమునను।కదలుటకు శక్తి లేదు నా కయ్య! యిప్పుడు
కోరుకొందును నన్ను నీ కొండనుండి। దింపుడని మిమ్ము దండిత దృప్తరిపులు॥

తే. నిండుశోకాన భ్రష్టస్వరుండెయైన । హృదిని నమ్మగరైతి యా విహగు మాట
తమను తినివేయునేమొ యాతం డటన్న।భీతి శంకింతులొచు నా కోతిగములు॥

తే. వారు ప్రాయోపవేశంబు బట్టియుండి । గృధ్రమునుజూచి వానరు లెల్ల రపుడు
"మనల నెల్లర నీతడు తినునటం"చు । తలచి రెడదల కరము రౌద్రంపు తలపు॥

తే. ప్రాణముల నిందు సర్వథా వదలుకొరకె । దీక్షబట్టితి మిట గాన పక్షి యిద్ది
మనల తినిన కృతార్థుల మగుదు మిపుడె; । సిద్ధి బొందుదు మిచటనే
శ్రీఘ్రముగను॥ 10

తే. ఇటుల బుద్ధి దలంచి యా చటుల బలులు । వానరర్షభు లెల్ల రా పక్షి నపుడు
దింపి గిరిశృంగముననుండి తెగువ నుండ । చెప్ప దొడగెను నంగదుం
డప్పు డిటుల॥ 11

తే. 'ఋక్షరజ'నామయుడైన కపీంద్రు డుండె । కడు పరాక్రమశాలి నా కగును తాత
పరమధార్మికు డాతండు పార్థివుండు; । అతని కిద్దరు కొడుకులు పతగరాజ !॥ 12

తే. వాలి, సుగ్రీవు లన నోఘబలులు వారు । సుతులు నిద్దరు లోకవిశ్రుతులు
ఘనులు
వాలి రాజయ్యె భువినెల్ల వానరులకు।అతడె నాతండ్రి తన్మ హేందాత్మజుండు॥

తే. జగముకృత్స్నంబునకును రా జైనవాడు । ప్రభుడు నిక్ష్వాకువంశదీపకు డతండు
యుధి మహారథు డా దాశరథి విభుండు । దండకారణ్యమును శ్రీయుతుండు
జొచ్చె॥ 14

తే. భ్రాత లక్ష్మణుతోడను భార్యయైన । దయిత వైదేహితోడ పితాజ్ఞ నట్లు
ధర్మపథమాశ్రయించి తద్వనిని నుండ। అపహరించెను రావణుం డతని సతిని॥

తే. రాముతండ్రికి మిత్రుండు భీమబలుడు । గృధ్రరాజు జటాయువన్ వీరవరుడు
చూచె సీతను వైదేహి నేచి యసుర । ఘన విహాయస మార్గాన గొనుచు బోవ॥

తే. విరథుగావించి రావణు కరము నొంచి। మైథిలిని కొంతయాపి యా మార్గమందు
వృద్ధు డలసినవాడునై వీరు డుండ । హతమొనర్చెను రావణుం డతని యుద్ధిని॥

తే. ఇటుల హతుడయ్యె గృధ్ర రాజే మ నందు।ఆ బలీయుని రావణు హా స్తమందు;
సంస్కృతుండయి రాముచే శాస్త్రవిధిని । ఉత్తమంబైన గతికేగ యోగ్యు
డతడు॥ 19

తే. పిదప సుగ్రీవుతోడ నా పిన్నతండ్రి । ఆ మహాత్మునితోడ నా రామ నృపతి
అగ్నిసాక్షిగ నెరపి సఖ్యంబు; పిదప । సంహరించెను వాలి నా జనకు నాజి॥ 20

తే. భ్రాత సుగ్రీవు డొక్క కారణముగాగ । అన్నతోడ విరోధించి తన్ను వేడ
వాలి వధియించి రాఘవుం డాలమందు।సఖుని సుగ్రీవు నిలిపె రాజ్యాన నెలమి॥

తే. అతనిచే నట్లు కపిరాజ్య మాత డొంది । ఇపుడు వానర ముఖ్యుల కెల్లరకును
పృధివి రాజయి యుండె సుగ్రీవు డనఘ; । ఆత డనుపంగ వచ్చితి మయ్య
యిట్లు॥ 22

తే. ఇటుల రామప్రియు క్తుల మెల్లరమును । పృధివి నిందందు వెదకుచు విసిగినాము;
కాని, వైదేహి జా డింత గానమయ్య । రాత్రి సూర్యప్రభన్ బోలె ధాత్రి
నెందు॥ 23

తే. దండకారణ్య మిద్ది యఖండ మార! । ఏమరక మేము నెమకితి మెల్ల మొదల
తెలియ కా ధర్మచరిత ధా బిలమువివృత । మనఘ! చొచ్చితి మా స్వయం
ప్రభది యెటులొ॥ 24

తే. మయుని మాయను నిర్మితంబయిన యట్టి । త ద్బిలంబును మే మట్లు
తడవుకొంచు
వెదకుచుండంగ గడచె హా విభుడు మాకు । నిడియు నున్నట్టి మాసంబు
గడు వ దెటులొ॥ 25

తే. మేము కపిరాజు నిడినట్టి మీరరాని । ఆజ్ఞ కెప్పుడు లోబడు వారమగుట
గడు వ దిప్పుడు దాటుట కడు భయాన । పుడమి ప్రాయోపవేశంబు
బూనినాము॥ 26

తే. అల్ల సుగ్రీవుడును రఘువల్లభుండు । భ్రాతలక్ష్మణు డింక మా పట్ల నకట
కుద్ధు లై రేని మే మెల్ల రిద్ధరిత్రి । ఎందుబోయిన బ్రతుకు మా కెందు లేదు॥ 27

57వ సర్గ సమాప్తి :- (2,185)

★

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

ఏబది ఎనిమిదవ సర్గ :—(58)

సీత జాడను సంపాతి వానరులకు చెప్పుట.

తే. వానరులు త్యక్తజీవితుల్ వనట గుంది। ఇటుల జెప్పంగ కరుణంబు నిట్టి పల్కు
గృధ్రిము మహాస్వనం బది యిటుల బల్కె। వానరులకెల్ల దా పబాష్పంబు నగుచు॥ 1

తే. రావణునిచేత, హా! త ద్బలాఢ్యుచేత। అవహంబున హతుడయ్యె నంచుమీరు
చెప్పియున్నట్టి వీరు డా చిన్నవాడు। ఆ జటాయువు నా కగు ననుజు డకట॥ 2

తే. వృద్ధభావాన మరి, రెక్క లిటుల లేమి। వినియు సహియింప వలసె నా యనుజు వధము;
శక్తి లేదయ్యె యిపుడు తత్ శతృజంపి।అనుజు వైరవిమోక్షణం బకట సేయ॥

తే. వృత్రివధ మున్ను జరిగెడి వేళయందు।మిగులగ పరస్పరజయైషు లగుచు మేము
స్వోజ్వలంతుని నాదిత్యు నుగ్రతేజు। రశ్మిమాలిని జేరంగ ప్రిబలధాటి॥ 4

తే. పందెములువైచి యాకాశ పథమునెల్ల। గప్పి యెగురుచుపోవ, భాస్కరుడు నపుడె
గగనమధ్యంగతుండౌట మిగుల కాగి। తమ్ముడు జటాయువచ్చట సొమ్మసిల్లె॥

తే. సూర్యరశ్మిని నట్టుల సొమ్మసిలిన। అనుజు నాతని జూచి నే నడలు గదిరి
పరమవిహ్వల మతిని నా పక్షములను। గప్పి తాతని స్నేహాన గుప్ప నెగసి॥ 6

తే. అట్టు లెగయుట నా రెక్క లట్టికాలె; । పడితి నీ వింధ్యపర్వతప్రాంతమందు
ఇట్టు లిచ్చట పడియుంట నింతదనుక। అకట యెరుకయె లేదాయె యతనివార్త

తే. ఆ జటాయున కన్ననైయె నట్టియతడు। పక్షి సంపాతి చెప్పిన పల్కు వినుచు
అంగదుండు మహాప్రాజ్ఞ డలఘు గుణుడు। పల్కె యువరాజు నిట్టుల వాక్య
మొకటి॥ 8

తే. వింటి నీ విప్పు డిచట చెప్పినది యెల్ల। అన్న యేని జటాయువు కనఘ! నీవు
చెప్ప నెరిగిన యింక యా చెనటి యసుర! రావణుం డుండు చో టేదొ
రామబంధు!॥ 9

ఆ. ఆ యదీర్ఘదర్శి యసురాధిపతి రావ। ణాధముని నివాస మద్ది యిటకు
దాపొ ? దవ్వొ ? చెపుమ తడయక మిత్రమా!। తెలియునేని నీకు పులుగు ఱేడ!॥

ఆ. అంత బలికె నా మహాతేజు డా జటా। యునకు సన్న యిల్లు వనచరులకు
హర్ష మెసగ మరియు నాత్మానురూపమా। భంగి గాగ నా పతంగరాజు। 11

తే. నేను నిర్దగ్ధపక్షుండ గృధ్రము నిక। హీనవీర్యుండ వినుడు కపీంద్రులార!
సలుపు దిచ్చట వాఙ్మాత్రసాయమేను। స్వామి శ్రీరామునకు ప్రశస్తంబుగాగ॥

తే. రూఢి నెరుగుదు వారుణలోకములను। విష్ణు దెరుగుదు నాటి త్రైవిక్రమంబు
మరియు దేవాసురులయుద్ధ మెరుగుదేను। అమృతమంథన మెరుగుదు నన్నలార॥

తే. రాము కార్యం బనగ నాకు ప్లవగులార। ప్రథమకర్తవ్యమగుసుండి పలుకులేల?
జరకతంబున నాకు తేజంబు తగ్గె। శిథిలములునయ్యె ప్రాణముల్;- సేతునేమి? 14

తే. తరుణి, సర్వాభరణభూషితాంగి, తన్వి। రూపసంపన్న నొకతె నా క్రూరు
డసుర
రావణుండు విహంగ మార్గాన చెలగి। ఎత్తుకొనిపోవుచుండ వీక్షించినాడ॥ 15

తే. అరచుచుండెను రామ, రామా యటంచు। లక్ష్మణా యంచు భామిని రాలు
కరుగ;
ఒడలినగలను దూసి వేయుచును నుండె। హా విదుర్చుచునుండె దా నవయవ
ములు॥ 16

తే. ఆమె కౌశేయ ముత్తమం బంబరమున। పర్వతాగ్రాన సూర్యుని ప్రభ యనంగ
అంబుదంబున మెఱుపునా నశితవర్ణ। రాక్షసునిపైన ప్రసరించె ప్రకటముగను॥

తే. రాముపరికీర్తనంబున రమణియామె। సీతయేయంచు నూహింతు చిత్తమందు
వినుడు చెప్పెద నింక నైరృతు డతండు। రాక్షసుండుండు నెలవును ప్లవగులార॥

తే. సుతుడు సాక్షాత్తు విశ్రవసున కతండు। భ్రాత వైశ్రవణునకు మహాత్మకునకు
లంకనగరాన భువి కాపురం బతండు;। పేరు రావణు డందుర్ పృథ్వీజనంబు॥

తే. నూరుయోజనముల పూర్తి దూర మిటకు। కలదు ద్వీపం బ దొక్కటి జలధి నడుమ
మహిని లంకాపురంబు రమ్యంబు;- దాని। విశ్వకర్మయె నిర్మించె విశ్రుతముగ॥

తే. తరళజాంబూనదద్వారతతులతోడ। చిత్రకాంచన వేదికా శ్రేణితోడ।
అర్కవర్ణంపు విమల ప్రాకారములను। ధరణి నెంతయు వెలుగు తత్ పుర వరంబు॥ 21

తే. అచట నున్నది వైదేహి యబల దీన। క్లిష్టకౌశేయవాసిని నిష్ఠతోడ
రావణాంతఃపురంబున రాపువడుచు। రాక్షసస్త్రీల పహరాను రాత్రిబవలు॥ 22

తే. అచట జనకాత్మజను సీత నరయగలరు;। జలధిగుప్తంబులంక; త జ్జలధి తటము
చేరి దక్షిణ మామడల్ నూరుజనగ। రావణునిగాంతుర్ మీరలు రజనిచరుని॥

తే. వేగ విక్రమమూని మీ రేగు డటకు। తరలు డిప్పుడె మీరెల్ల త్వరితగతిని
దివ్యదృష్టిని నిజము వీక్షింతు వినుడు। సీత నీక్షించి మరలి వచ్చెదరు మీరు॥

తే. పిచ్చుకలు, ధాన్యభుక్తి జీవించు నవియు। ప్రథమమండల సంచారు లగును వినుడు
వసుధ బలిభోజనులు వృక్షఫలముల దిను।- పక్షులు ద్వితీయమండల పథగు లగును॥ 26

తే. భాసములు మూడవదియైన పథిని జనును। క్రౌంచ కురరంబులును నల్గొసంచరించు;
శ్యేనములు నాల్గవపథాన చెలగిమెగురు;। గృధ్రములు పంచమాధ్వాన కెగిరి తిరుగు॥ 27

తే. ప్రబలవీర్యోపపన్నులు నరయ మరియు। రూపయౌవనశాలులు నేపుమీరి
ఆరవపథానచరియించు హంసతతులు;-। వినుపరం బిక వైనతేయుని పథంబు
ఘనము మాజన్మ వైనతేయుని కులంబు॥ 28

తే. ఇచటనుండియె కనుచుంటి నేచటనున్న। రావణుని జానకిని నేను ప్లవగులార
బలము దృష్టియు మాకు సౌపర్ణ ఘనము। దివ్యమును నౌను; దాన వీక్షింతు నింక॥ 29

తే. కాన, ఆహారవీర్యాన ఘనతరంబు । త న్నిసర్గంబునను జూతు మన్ని దిశల
యోజనశతంబుమేర, యీా యుర్వినెల్ల, । మరి, సమగ్రింబుగా నిత్య మెరుగు
డింత॥ 30

తే. చరణయోధులు కోళ్ళ కీ ధరణిలోన । పాదమూలంబునందె యేర్పడియె వృత్తి
ఇక, నిసర్గంబునని మాకు వృత్తియిట్లి । గల్గె దూరస్థవస్తు సంగ్రహణమునను॥

తే. గర్హితం బట్లు జేసె రాక్షసుడు కర్మ । అట్టి పిశితాశనుని రాలగొట్టుడింక
దాన నాతమ్మునకు వాడు హీను డటులు। సలిపియుండిన దానికౌ శాస్తి యిపుడె॥

తే. అరయు డింక యుపాయ మే దైనగాని । లవణవారాశి నిది దాట ప్లవగులార !
తల్లి వైదేహి నారసి తడయ కింక ! కడు సమృద్ధార్థులగుచు రాగలరు మీారు॥

తే. అల సముద్రంబు త ద్వరుణాలయంబు। చేర్పు డిక నన్ను మీారలు చిన్నగాను
శౌర్యఖని తమ్మునకు కటా ! స్వర్గతునకు । ఉదకమిడుదు మహాత్మున కొగిని
నిపుడె॥ 34

తే. నదనదీపతి పుణ్య మా యుదధితటము । తీసికొనిపోయి రా కపిబృందమపుడ
ల్లల్ల నిర్దగ్ధపక్షు, మహాబలాఢ్యు । పక్షిరాజన్యు ధీరు సంపాతి నెలమి॥ 35

తే. జల మొసంగిన పిదప యా పులుగు రేని । తిరిగి యెప్పటిచోటుకు తెచ్చియుంచి
అతనిచే సీతజాడల నన్ని యెరిగి । పరమసంతుష్టి బొంది రా ప్లవగులెల్ల॥ 36

-: 58 వ. సర్గ సమాప్తి :- (2,221)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### -: ఏబది తొమ్మిదవ సర్గ :- (29)

సీతాపహరణమునుగూర్చి తాను విన్న సంగతులు సంపాతి
కపులకు వివరించి చెప్పుట

తే. గృధ్రరాజన్య భాషితం బింతిజాడ । అమృత మాస్వాదమొనరించి నట్లుగాగ
విని, మనంబుల ముదితులై రనుపమముగ।ప్లవగపుంగవులెల్ల రా భువినినపుడు॥

తే. జాంబవంతుడు వానరర్షభుడు ఘనుడు । సర్వవానరవరులతో చటుకు నపుడు
భూతలమునుండిలేచి యా పులుగురేని। గాంచి యిటుబల్కె వాక్యంబు
ఘనతరంబు॥ 2

తే. ఎక్కడున్నదిసీత; హరించె నెవడు; । ఎవడుచూచెను ఆమె హరింపబడగ;
సర్వ మదియెల్ల చెప్పుమ సరగ మాకు । గతివి నీవెగ యీ వనౌకసుల కెల్ల॥ 3

తే. ఎవడుదశరథసుతుబాణబృందములను । వజ్రవేగ నిపాతాల పాటిగొనడు ?
స్వయము లక్ష్మణ ముక్త తీక్ష్ణాశుగముల । విక్రమంబు దలంపడు; ? వినగ
జెప్రుమ॥ 4

తే. హరుల, సీతాశ్రుతిసమాహితాత్మకులను।ప్రీతి సంయుక్తులను జూచి గృధ్రరాజు
మరల నాశ్వాసమొనరింప వారినెల్ల । ప్రీతుడై యిట్లు బల్కె సంపాతియపుడు॥

తే. వినుడు వైదేహి హరణ మే విన్నరీతి ! విన్నవించెద మీకిద్దె యన్నలార !
ఎవనిచే వింటినో; సీత యిప్పుడెచట । నున్నదియొ కూడ చెప్పెద నుత్పలాక్షి॥

తే. అటుల బహుయోజనంబు నాయతమునందు।దుర్గమాద్రిని నిచట నే తూలికూలి
చిరము పడియుండి వీర్యంబు క్షీణమగుడు। వృద్ధుడనునైతి ప్రాణావశిష్టముగను॥

తే. ఇట్టులైనట్టి నన్ను నా యిష్టసుతుడు। మహి "సుపార్శ్వనాము" నా నొప్పు పతగ
వరుడు
ఇక, యథాకాల మాహార మేరితెచ్చి।సతము పోషించుచుండు నా స్వర్ణబంధు॥

తే. తీక్ష్ణకాములు గంధర్వబృందమెపుడు; ।తీక్ష్ణకోపులు భుజగముల్ కెలిమిడింత
మృగములకు భీతి తీక్ష్ణంబు మెండుసుండు; । చూడు డిక మాకు తీక్ష్ణంబు క్షుధ
సతంబు। 9

తే. ఒక్క నా డట్లు క్షుధచేత నుక్కడంగి । విసిగి యాహారమునకు నే వేచియుండ
పొద్దు గుంకిన పిమ్మట పుత్రు డతడు । ఆమిషములేక రిక్తహస్తముల వచ్చె॥

తే. కోపమున, వృద్ధభావాన నోపలేక । క్షుత్పిపాసాపరీతుండ సొడుకు నతని
అల్ల పతతాంవరుని నేను నధికముగను । కసరితిని తిండి తేలేదు సడ సటాచు॥

తే. ప్రీతి వర్ధను డతడు నాప్రియసుతుండు । పితరు నాహారసంరోధపీడితాత్ము
నన్ను నాశ్వాసమొనరించి తిన్నగాను। చెప్పె నిట్టుల నా కష్ట చొప్పెడముగ।

తే. తాత ! నేను యథాకాల మాతతంబు। మింటి కెగురుచు వడిగ నామిషము
కొరకు
తత మహేంద్రమహీధరద్వారమందు। పొంచియుండితి నామిషంబును గొనంగ॥

తే. సాగరాంతరచారులౌ సత్వములకు। నట సహస్రంబులకు మార్గమైనయట్టి
చోట నొకటను తలవంచి మాటుగాగ। నిలిచియుండితి తత్ సత్త్వములనుబట్ట॥

తే. అంత, భిన్నాంజనసమంబు కాంతివాడు। ఎవ్వడో స్త్రీనినొకతెను నేన్చు దాని
విమల సూర్యోదయసమంబు వెలుగుదాని। మింటకొనిపోవుచుంట నా కంట
బడిరొ॥ 15

తే. నేను నభ్యవహారార్థినైన కతన। వారినే పట్టనెంచి తాహారముగను
కాని, వాడును సామవాక్యముల నన్ను। త్రోవ యిమ్మని కడు వినీతుడుగ
నడిగె॥ 16

తే. జగతి సామోపపన్నుల జంపునెవడు?। నీచులేనియు సేయ రీ నీచపు పని;
ఇంక, నావంటివాడు నిశ్శంకమిట్లు। సేయునే తాత! యకట నికృష్టకర్మ॥ 17

తే. వాడు నంతట తేజాన వాడి మిగిలి। వ్యోమమెల్లను జీల్చెడి యోజతోడ
కెరలి వే బోయె;- నంతట ఖేచరములు। భూతములు వచ్చి న న్నిటు పొగడి
రోలి॥ 18

తే "బాబు! బ్రతికితి నేళ్లా నీ భాగ్యమాయె; | వాడు సకళత్రుడై యాట నీకు వదలిపెట్టె;
స్వస్తి నీ కయ్యె; యిది యసంశయము తాత"। అనుచు ననిరి మహర్షులు నను
గురించి॥ 19

సీ. అనియిట్లు బలుక- చా యనఘులు సిద్ధులు
పరమశోభను లిట్లు మరియు ననిరి
"వాడు రావణు డోయి ప్రభుడు నైరృతులకు
హరియించుచున్నాడు ధరణిసుతను;
దశరథసుతు రామధరణీశు భార్యను
జనకాత్మజను వాడు గొనుచు నేగు
భ్రష్టాభరణ నయ్యె! భ్రష్టకౌశేయను
శోకవేగపరాజితైకమతిని
రామలక్ష్మణుల పే ర్లాక్రోశ మొనరించు
లలన నా ముక్తమూర్ధజనునయ్యె!

తే. అనుచు వా రన వింటి; - దానన మహాత్మ।ఇంత యాలస్యమాయె నేనేగు దేర
నని సుపార్శ్వుండు చెప్పగా వినిన వాడ । ఇంతి జాడను నెల్ల నే నిటనె యుండి॥

తే. అట్టి వార్తను వినియు నే నప్పు డకట । వడి పరాక్రమమున్ జూప గడగనైతి
ఇటు లపక్షుండ పక్షి నే నెట్టు లకట । పూనగలవాడ పనికి నెద్దాని కైన॥ 23

తే. నాకు వాగ్బుద్ధిగుణములు పోకయుంట । వానిచే సేతు శక్యమా దాని నిపుడు
వినుడు చెప్పెద; - నద్దాని వినినపిదప।సలుపు డిక మీరు పౌరుషాశ్రయముపనిని॥

తే. వాఙ్మతులచేత సేతు మీ వానరులకు।నెల్లవారికి ప్రియము స్నేహితులు వినుడు
ఏది రాముని కార్యంబొ యింతయేల।అదియు నాకార్యమే; - సందియం బి కేల॥

తే. బుద్ధిమంతులు, బలవంతు లిద్ధరిత్రి । గొప్పమనసులుగలవార లప్పు! మీరు
పంపబడితిరి కపిరాజనర్యుచేత । తథ్యము దురాసదుల్ దేవతలకు నైన॥ 26

తే. రామలక్ష్మణబాణజాలంబు లౌగ । నిశితములు కంకపత్రముల్ నిజము చెబుదు
సతము త్రైలోక్యములకును చాలుసుండి।త్రాణ నిగ్రహముల జేయ తాతలార!॥

తే. ఆ దశగ్రీవు డతుల తేజోధికుండు । బలసమన్వితుడైన కావచ్చు గాక
మీరు మాత్రము తక్కువ వారలేమి?!మీకు కించిత్తు దుష్కరం బేది కలదు?॥

తే కాన, జాగిక వలదు; - వేగంబ చనుడు;।బుద్ధినిశ్చయమొనరించి పొందువడిగ;
బుద్ధిమంతులు మిమ్మోల బోలువారు । అలసింపరు వినుడు కార్యముల పట్ల॥ 29

59వ సర్గ సమాప్తి :- (2,250)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### అరువదియవ సర్గ :—(21)

ఇక్కడ తన సంగతిని కపులకు సంపాతి సవిస్తరముగ చెప్పదొడంగుట.

తే. తమ్మునకు నల్లు జలతర్పణ మ్మొసంగి । స్నాతుడై వచ్చియున్న సంపాతి జూచి
గిరిని తద్దుర్గమంబున కీశు లెల్ల। అతని వేష్టించి కూర్చుండి రధికభక్తి. 1

తే. అటుల తనచుట్టు కూర్చున్న అంగదాది । వానరులనెల్ల వీక్షించి వారు భక్తి
తనదుమాటల వినగ శ్రద్ధనువహించు । టరసి సంపాతి పొంగి యిట్లనియె మరల॥

తే. వారలు! నిశ్శబ్దముగను నేకాగ్రముగను । వినుడు మీరెల్ల నే నిప్డు వినుచుకథను
దాని నెల్లను చెప్పుదు యథాక్రమంబు। మైథిలిని నెట్టు లెరిగితో మహిని నిచట॥

తే. వింధ్యశిఖరంబు నిద్దాన వినుడు మునుపు। వనమునం దిందు పడి యిట్లువనరుచుంటి
తిగ్మసూర్యాతప పరీత దేహమునను। రూక్షరవిరశ్మినిర్దగ్ధ పక్షములను॥ 4

తే. లబ్ధసంజ్ఞుండనగుచు షడ్రాత్రములకు । వివశుడను విహ్వలుండనై పృథ్వి నొరగి
దిక్కులన్నింటి జూడ నా కెక్కడ నిక । తెలియవాయెను గుర్తు లేదిక్కునందు॥

తే. కొంతవడి కీ వనంబుల కుంజములను । సరములను సాగరంబుల శైలములను
ఉదధివేలను నదముల నోలిజూడ। తెలిసె యిది యీప్రదేశమం చలఘులార!॥ 6

తే. హృష్టపక్షిగణాకీర్ణ మీ ధరిత్రి । కందరాంతరకూట మీ తన్మధరంబు
దక్షిణోదధతీరానదనరునట్టి । వింధ్యయిదియనితోచె నా హృదికి స్థిరత॥ 7

తే. ఉండెనచ్చటనాశ్రమం బొండు మునుపు। పుణ్యము, సుపూజితమునిలింపులకు నైన
మునివరుండు నిశాకరుం డనెడి పేర । ఉగ్రతాపసి యచ్చటి నుండుచుండె॥ 8

తే. పృథివి నిప్పటి కెనిమిది వేలయేండ్లు। గడచె ఋషి యును నేను సీ గ్రామమందు
కలిసియుండి; పదంపడి ఘను డతండు। స్వర్గమేగగ నుంటి యచ్చటను నొకడ॥

తే. డిగ్గి మెల్లన యెట్టులో కృచ్ఛ్రమునను।విషమ మా వింధ్యకొననుండి పృథివిపైకి
తీక్ష్ణదర్భలనొప్పు నా ఋషివరేణ్యు। నాశ్రమము జేరి తెల్లొ దుఃఖాన మునిగి॥ 10

తే. ఋషిని నాతని జూడ నే నిచ్ఛగోరి। దుఃఖమున జేరి తట కెల్లొ తోవ బట్టి
తమ్ముడు జటాయువును నేను నెమ్మి మునుపు। అచట కరిగితి నెన్ని
పర్యాయములునొ॥ 11

తే. అతని ఆశ్రమపద సమీపాన నపుడు। వీచెగాలి సుగంధమై; తోచె హాయి;
పూలులేనట్టితరువు లా పొంతలేవు; । లేవు ఫలములు లేనట్టి వృక్షములును॥ 12

తే. చేరి ఆశ్రమ మా పుణ్యసీమ నటుల। ఆ నిశాకరు భగవంతు నమలచరితు
చూడగాగోరి యప్పు డచ్చోట నున్న।వృక్ష మూలాన నొకట నే వేచియుంటి।

తే. రహిని నంతట నే నదూరమున గంటి। ఋషిని దుర్ధర్షుని కృతాభిషేకు నతని
జ్వలిత తేజుని తాపసవర్యు నార్యు। మరి, యుదఙ్ముఖుడై వచ్చు పరమమునిని॥14

తే. ఋక్షములు, వ్యాఘ్రములు, సరీసృపము లింక। సృమరములు, నాగములు,
మహాసింహములును
బలిసి యాతని వెనువెంట వచ్చుచుండె। ధాతవెంటను ప్రాణుల రీతిగాగ॥ 15

తే. ఋషివరుం డింక నెలవును జేర నెరిగి। వివిధసత్వంబు లవ్వి వే వెడలిపోయె
అంతిపురి రాజుజొచ్చుట నరసి బలము। వితతసామాత్యకంబు వే వెడలునట్లు॥

తే.ఋషియు ననుజూచి,సంప్రీతి నెంతొ చెంది।-వొచ్చి యాశ్రమమప్పుడేచూపులోన
ఒకముహూర్తాన వెలికి దా నోజవచ్చి।అడిగె వచ్చిన కార్య మా యమియు నన్ను॥

తే. నీదు రోమాల వికలత నిద్ది చూడ। తెలిసికొనలేకపోతి నిన్ ఖలుగు రేడ!
అగ్నిదగ్ధంబులయ్యె నీ పక్షయుగము। నీదు త్వక్కును వ్రణితమై నెనరు దప్పె॥

తే. గృధ్రములు, భ్రాతలిద్దరు వితతబలులు। మాతరిశ్వసముల్ జవంబందు మీరు
కామరూపులు మిమ్ము నే గందుమునుపు। గృధ్రముల కెల్ల రాజులు కీర్తిపరులు॥

తే. వారిలో జ్యేష్ఠుడవుగ సంపాతి! నీవు। మరి, జటాయువు నీకు తమ్ముడయ్యెగాదె
మానుషంబైన రూపంబు బూనిమీరు।పట్టుదురుగాదె సతము నా పాదములను॥

తే. ఏమి యిది నీకు వ్యాధియా గృధ్రరాజ!। రెక్క లిటు పడ్డ కథయేమి యక్కటకట
దండ మెవడైన జేసెనా?తాత! చెపుము।అయిన,యెవడిట్లు చేసె,నేనడుగుచుంటి॥

60వ సర్గ సమాప్తి :- (2,271)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### అరువది ఒకటవ సర్గ :—(17)

తనకు రెక్కలు కాలిపోయిన కథ సంపాతి చెప్పుట.

తే. సాహసకృతంబు కర్మ దుష్కరము నౌర। దారుణం బద్ది సర్వ మా తపసి కపుడు
క్రమత జెప్పితి సూర్యానుగమన మెల్ల। చెలగి మే మిర్వురమును చేసినది యెల్ల॥

తే. మునిప! భగవంత! మే నెల్ల పుండ్లునగుట । సిగ్గుచేతను వ్యాకుల చిత్తముునను
మరి, పరిశ్రాంతుడను నౌట మాట నీకు । బదులు చెప్పంగ లేకుంటి
సదమలాత్మ॥ 2

తే. నేనును జటాయువును వీరులైనవార । మాత్మలందున సంఘర్ష మకట పూని
దర్పమోహితులము నౌచు నుప్పరంబు। కెగసితిమి మాదుబలముల నెరుగనోరి॥

తే. అస్తగిరిచేరునందాక నర్కువెంట । ఎగసిపోవలెనంచు మునీంద్రు లెదుట
అల్ల కైలాసశిఖరాన ప్రెల్లదించి। పందెమునుకట్టితిమి మేము వందనీయ!। 4

తే. ఏకకాలంబునందె మే మిద్దర మిక । ఎగసిపోవగ మాకు మహీతలాన
నగరములు వేరువేరుగా నగుపడియెను । బండిచక్రములంతలై చండతేజ! 5

తే. మింట వాదిత్రఘోషలు వింటి మొకట। బ్రహ్మఘోషలు నిక వినబడియె నొకట
పాటలగాయు నంగనల్ బహుళసంఖ్య । లగుపడిరి మాకు రక్తవస్త్రముల వారు॥

తే. తూర్ణ మాకాశ మెగసి యా ద్యుమణిపథము । చేరితిమి మేము మునివరా!
చిటికెలోన
క్రింద జూడగ వనమిది సుందరంబు । శాద్వలసమంబుగా దోచె చక్షువులకు। 7

తే. అల శిలోచ్చయసంచ్ఛన్న మవని యెల్ల । ఉపలసంచ్ఛన్నమన దోచె నో మహాత్మ!
ఆపగల జేసి యీ వసుంధరయు దేవ! సూత్రసంవీత యననోచె చూడ్కులకును॥

తే. అల్ల హిమవంతమును మేరు వౌర మరియు । వింధ్య మున్నగు గొప్ప పృథ్వీధరములు
భూతలంబున గాన్పించె మునిశ్రేష్ఠ । అల జలాశయమందు నేస్గుల విధాన॥ 9

తే. తీవ్రఖేదంబు స్వేదంబు తీవ్రభయము । మోహము, తమంబు మూర్ఛయు మునివరేణ్య!
దారుణంబుగ మాకు నద్దారిలోన । గల్గె నేమందు మప్డు డాకాశవీధి॥ 10

తే. దిక్కు దక్షిణమెద్దియో తెలియదాయె; । మరియు, నాగ్నేయమెద్దియో యెరుకబడదు;
తూర్పుపడమరయును మాకు తోచదాయె; । అవని ప్రళయాగ్నిదగ్ధమైనటుల దోచె॥ 11

తే. మనసు మాతమాచు సంశ్రయంబును నోలంగ । గొప్పయత్నాన మరల చక్షువున గూర్చి
గొప్పయత్నాన సూర్యుని నప్డు డరయ । తోచె పత్వీప్రమాణాన ద్యుమణి మాకు॥ 12-13

తే. తమ్ముడు జటాయు వక్కటా సొమ్మసిల్లి । పడె మహీస్థలి నాకు చెప్పకయె మాట
అతని జూచి మహీస్థలి కప్పుడింక । నేను దిగితిని వేగమే నింగి వీడి॥ 14

తే. నాదురెక్కల నాతమ్మ్ము మీద బరపి । కప్పి యుండుట వాడేమి కాల డయ్యె
నేను మాత్రము దిగుచుండ నింగినుండి । కాలి తిట్లు ప్రమాదాన ఘుర్మరశ్మి॥

తే. తలతు నాతమ్ము డల జనస్థానమందు। పడియె నంచును మునివరా! పుడమిపైన
నేను పడి తిట్లు వింధ్యభూభృత్తునందు । దగ్ధపక్షుండ, సుజడీకృతాధ్యతనుడు 16

తే. రాజ్యమును బాసి; పాసి హా! భ్రాత నట్లు । కడకు రెక్కలులేక, విక్రమము లేక
చావె గోరుదు సర్వథా; జీవమేల?। పడుదు నీకొండకొననుండి;-విడుతునుసురు॥

—: 61 వ. సర్గ సమాప్తి :— 2,288



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

-: అరువది రెండవసర్గ :- (15)

తనకు రెక్కలు మొలవచ్చునని 'నిశాకరుడ'ను ఋషి తనకు భవిష్యత్తు
చెప్పిన వృత్తాంతము సంపాతి కపులకు చెప్పుట:-

తే. ఇటుల జెప్పుచునే నా మునీంద్రుతోడ। భృశము దుఃఖాన మునిగి రోదించుచుండ
ధ్యానము ముహూర్త మొనరించి తలచి యేమొ। పలికె భగవాను డా ఋషి వరుడు నిటుల॥ 1

తే. పక్షములువచ్చు నీకు ప్రపక్షములును। మరియు, నన్యములైనవి మరల వచ్చు
ప్రాణములు, చక్షువులును, విక్రమము,బలము।వచ్చు నెప్పటియట్టుల పక్షిరాజ॥

తే., అల భవిష్యత్తునందు నీవలన వినుము। కావలసియున్న దొక మహాత్కార్య మోయి!
వింటి ము న్నది స్పష్టంబు కంటి నోయి। మహిని నాదగు ఘనతపోమహిమ జేసి॥

తే. రాజు దశరథు డను పేర నోజ నొకడు। వెలయు నిక్ష్వాకునందనుం డిలను వినుము
అతని పుత్రుండు రామనామాంకితుండు। పృథివి వెలయును మరి, మహాతేజు డగుచు॥ 4

తే. జనకునాజ్ఞను దండకావనమునకును। వచ్చునాతండు సీత యా భార్యతోడ
తమ్ము డా లక్ష్మణునితోడ ధైర్యవృత్తి। రామచంద్రుండు సత్యపరాక్రముండు

తే. నైరృతుడు రావణుండను క్రూరు డొకడు। అతని భార్యనుహరియించునడవిలోన
త జ్జనస్థానమున; వాడు దానవులకు। విను మవధ్యుడు సురలకు దనుజవిభుడు॥

తే. కామవసుల నెన్నిటినో చూపి యామె నతను। భక్ష్యభోజ్యాల జూపి లోబరుచు కొనగ
జూచుగాని, మహాభాగ శోకమగ్న। ఆ యశస్విని పాటింప దనఘ! వాని॥ 7

తే. ఎరిగి యిదియెల్ల వైదేహి కిందుృ డపుడు। పంపు పరమాన్నమును మది కింపునింప
అన్న మయ్యది యమృత తుల్యమ్ముసుమ్ము। సురలకేని సుదుర్లభం బరయ నెందు॥ 8

తే. అన్న మిది యింద్రుడిచ్చినదని యెరింగి। అగ్రభాగంబు దాన నా యతివ తీసి
రామలక్ష్మణులకు నుంచు భూమిపైన। భూమిజాత వచించుచు ప్రేమ నిట్లు॥ 9

తే. "ప్రభుడు నాభర్త, మరియు లక్ష్మణుడు మరది। బ్రతికియేయున్న భుక్తియా వారి కిద్ది
కాక, దేవత్వమొందినగాని యిదియ। అన్నమాగాక వారల కచట నేని"॥ 10

తే. వత్తు రావెను వెనుక ప్లవంగు లిటకు। రామదూతలు బహుసంఖ్య భీమబలులు
చెప్పగావలె వారి కా సీత జాడ। ఓ! విహంగమ! నీ వప్పు డుండి యిచట॥ 11

తే. సర్వథా నీవు చను టిక సరియుగాదు। ఇట్టివాడవు పోవుదు వెట్టులెటకు?
రహి ప్రతీక్షింపు దేశకాలముల కొరకు। పక్షములువచ్చు నీకు పెంపలర మరల॥

తే. రెక్క లిప్పుడె నీకు రా నిక్కముగను। సేయగల, నైన, విను మది సేయనోయి;
ఏలయన నిందునుండియే యెల్లలోక। వితతికి హితంబు సేతువు;- విధియు నిదియ॥ 13

తే. రహిని నృపపుత్రులకు రామలక్ష్మణులకు। వలయుకార్యము నీకును పరమవిధియ;
బ్రాహ్మణులకును మునులకు వాసవునకు।సురలకైనను విధియ సూ చూతుమింత॥

తే. ఇచ్చ గలదోయి నాకును నిలను జూడ। అన్నదమ్ముల నా రామలక్ష్మణులను
అయిన చిర మిక నోర ప్రాణముల నిలుప। వీడుదు కళేబరం బిది పృథ్వినిపుడె॥

తే. దృష్టతత్త్వార్థదర్శనుం డిష్టఫణితి। ఇటుల వచియించె నాతోడ ఋషివరుండు॥

-: 62 వ. సర్గ సమాప్తి :- (2,303)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### -: అరువది మూడవ సర్గ :- (15)

ఈకథ చెప్పుచుండగనే సంపాతికి ఆశ్చర్యముగ పరల రెక్కలు మొలుచుకొని వచ్చుట:-
"సీతను మీరు తప్పక చూతురు" అని హెచ్చరించుచు సంపాతి
ఎగిరిపోవుట- కపుల పరమోత్సాహము:-

తే. ఇటులె వాక్యాల నన్యంబు లెన్నొ పలికి। నన్ను వాక్యవిశారదుం డతడు తేర్చి
నా కనుజ్ఞ నొసంగి నన్ బ్రస్తుతించి। చొచ్చెను నిజాశ్రమంబు తత్ శుభ
గుణుండు॥ 1

తే. పర్వతము కందరమునుండి బయటి కెటులొ। మెల్ల మెల్లన కదలి నే నల్లవచ్చి
వింధ్యగిరినెక్కి యిచటనే వేచియుంటి। మీరు రాకకు నోర్పుతో మిత్రులార॥

తే. ఆ మునీంద్రుని పలుకుల నాత్మ దలచి। దేశకాలాల కెదురు నెంతేని గనుచు
గడుపుచుండంగ కాలంబు గడచె నాకు। జగతి సంపూర్తి నూరువత్సరములంత॥

తే. మునియు నట మహాప్రస్థానమునకు బోయి। స్వర్గతుండౌట జూచి నిశాకర్ణుండు
బహువితర్కాల జుట్టంగబడుచు నేను। భూరి సంతాపమున కాలి పొగులుచుంటి॥

తే. చావదలతును నొకట హా సరగ నపుడె;। మునివరునిమాటతోచుట బుద్ధిమరలు;
ప్రాణరక్షణకై మునివరుడు నాకు। తోపజేసిన యాశ నా దుఃఖమణచు;
చీకటినడంచు దీప్తాగ్ని శిఖనుబోలి॥ 5

తే. ఆ దురాత్ముని రావణు నధికబలము। నెరిగియుండియు కసరితి నేనుపుత్రి
సీత రక్షింప కేల వచ్చితివటంచు। పరుషవాక్యాల నెంతయు ప్లవగులార॥ 6

తే. మింట సీతావిలాపంబు వినియు నకట! । ఎఱిగి సీతావినాకృతుల్ యినకులు లన్
దశరథస్నేహమున నాదుతనయుఁడైన । ప్రియము నాకొనరింపగా లేకపోయె॥

తే. అటుల సంపాతి యచట మర్కటులతోడ । చెప్పుచుండంగ రెక్కలు నప్పుడప్పుడె
వారు కనుచుండ వారి సమక్షమందె । మొలుచుకొనివచ్చె నతని కమోఘలీల॥

తే. అంత సంపాతి తన మేన నట్టు లౌర! । రెక్క లరుణచ్ఛదంబులు చక్కగాను
మొలచుకొనివచ్చు టరసి సమ్మోదమొంది । హరుల కనె నిట్టు లతులప్రహర్ష
మునను॥ 9

తే. తాపసి నిశాకరుం డమితాత్ము డౌర! । ఆతని ప్రభావముననె నా కల్ల నాడు
రూక్ష రవిరశ్మిఁ గాలిన పక్షయుగము । మొలచె నేఁ డిట్లు మరల యమోఘలీల॥

తే. యౌవనంబున నేనున్న యప్పు డెట్టి । బలపరాక్రమములు నాకు గలిగియుండె
అట్టి బలపౌరుషంబులే యన్నలార । వచ్చె నాకిప్డు మరల తత్ ప్రభునిమహిమ

తే. సర్వథా యత్నమును మీరు సలుపుడయ్య!సీత గాంచెద రిక మీరు సిద్ధమింతె
రెక్క లిటు నాకు గల్గుటే నిక్కముగను। తెలుపు మీ కార్యసిద్ధిని తెల్లముగను॥

తే. ఇటుల వచియించి యచటి మర్కటులకెల్ల । పతగపుంగవు డల్ల సంపాతి
యప్పుడు
ఎగిరె గిరిశృంగమునకు దా నెరుగ గోరి।తనదు రెక్కలబలమును తత్పరతను॥13

తే. అతని యా వాక్యముల వించు నద్రి నచట । ప్రీతి సంహృష్ట మతులునై సీత
జూడ
విక్రమాభ్యుదయోన్ముఖుల్ వీరకపులు। చెలగి రా హరిశార్దూలు లలఘుబలులు॥

చ. పవనసమానవిక్రములు బాహుబలుల్ ప్రతిలబ్ధపౌరుషుల్
ప్లవగవరుల్ మహాత్తరులు భవ్యులు నా యభిజిన్ముఖోన్ముఖుల్
జవమున దక్షిణాశ జనసాగిరి యా గిరి గంతులేయుచున్
భువనభయంకరుల్ భళిర! భూమిసుతాపరిమార్గణోన్ముఖుల్॥

63 వ. సర్గ సమాప్తి ( 2,318 )



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### అరువది నాలుగవ సర్గ (24)

అపార పారావారమును జూచి " దీనిదాటు టెట్లు " ని కపులు దిగులు పడుట- "ఎవరెవరు ఎంత దూరము దూకగలరో చెప్పుడు" ని అంగదుడు కపుల నడుగుట

తే. గృధ్రరాజన్న్యుచే నట్లు సీతవార్త । నెరుగుట ప్లవంగమౌఘంబు లెగురు కొంచు
ప్రీతి సంయుక్తులై కూడి భీమబలులు । సింహనాదాల చేసిరి రంహసమున॥

తే. వినుచు సంపాతి వచనంబు వీరకపులు । రావణ * క్షయమునకు జేరంగదలచి
హృష్టులై సాగరతటంబు జేర జనిరి । తల్లి సీతను దర్శించు తత్పరతను॥

తే. వేగమే భీమవిక్రముల్ సాగిపోయి । కాంచిరచ్చట సాగరం బంచితంబు
కృత్స్నమీలోకమునకు నుత్కృష్టమైన । అల్ల ప్రతిబింబమనునట్టు లలరు దాని॥

తే. దక్షిణసముద్రమునకు నుత్తరము తటము । చేరి హరివీరు లా మహాఘోర బలులు
విడిసి రచ్చట గప్పు చా పృథివినెల్ల । చూడనెల్లెడ తామెయై శూరకపులు॥

సీ. వ్యాత్తాస్యములు మహాకాయముల్ వికృతముల్
సత్వముల్ వివిధముల్ జలమునందు
క్రీడించువానిచే కెరలుచుండెడు దాని
ఊర్మిజాలంబుచే నొప్పుదాని

---

* క్షయము = గృహము.

ఒకచోట నిద్రించు నొకచోట క్రీడించు
చున్నరీతిని నొప్పుచున్న దాని
ఒకచోట గిరిమాత్ర మున్నతోర్ములతోడ
నీటికుప్పలతోడ మీటుదాని

తే. దానవేంద్రుల పాతాళతలనివాసు । లైననాగుల సంకులం బైనదాని
రోమహర్షకరంబు నా భీమజలధి । గనుచును విషాదమొందిరా కపిగణంబు॥

తే. ఘోర! ఆకాశమనగ దుష్పారమైన । సాగరంబును గాంచి యా సకలకపులు
"ఎటులకార్యంబునడుచు, నిం కేది దారి" । యనుచు దిగులొంది రచట
తత్క్షణమునంద॥

తే. సాగర నిరీక్షణాన విషణ్ణులైన । వాహినులజూచి కపియూథపతియు నపుడు
కడు భయార్తుల వారి నా కపిగణముల । నెలమి నాశ్వాసమొనరించె పలికి
యిటుల॥ 9

తే. అటు విషాదాన నచట మహత్తరమున । కడు విషణ్ణులునైన యా కపుల జూచి
కాలయుక్తంబునౌ మతి గల్గువాడు । వాలిసూనుండు ననియె మహాబలుండు॥

తే మది విషాదంబునొందుట మంచికాదు । తత్ విషాదము దోషవత్తమము సుండి
మరి, విషాదంబు జంపును పురుషునెపుడు । క్రుద్ధ యురగంబు బాలుని
గూల్చునట్లు॥ 11

తే. విక్రమముజూపవలసిన వేళ యందు । మది, విషాదాని కెవడు లోబడును వాడు
హీనతేజుండయగు సుమీ; యింకవాని । కెందు పురుషార్థములును సిద్ధింప వెపుడు॥

తే. అట్టు లా రాత్రి చనుటయు నంగదుండు । వృద్ధులైనట్టి వారల వీరకపుల
నెల్లరనుగూడి సాగరం బింక దాటు । టేయుపాయాన నంచు యోచించె మరల॥

తే. వానరచమూసమూహ మా వార్ధి దరిని । అంగదుని జుట్టి యుండిన
దపుడు వెలిగె॥ 14
వాసవునిజుట్టి స్వర్గాన వాసిమీరు । తన్మరుద్వాహినీ సమూహమ్ము పోల్కి॥

తే. వానరచమూసమూహ మద్దాని నిలుప । శక్యమగు నెవ్వరికి నింక జగతిలోన
వాలిసుతు డంగదుడు గాక వాస్తవముగ । వాయుసుతు డల్ల హనుమ యా
బలుడుగాక॥ 15

తే. అంత హరివృద్ధులా వారి యనుమతి గొని । మరియు, త త్సైన్యపతుల సమ్మతియు వడసి
శ్రీయుతుం డంగదుం డప్డు చెప్పదొడగె । అర్థవంతంబునైన వాక్యంబు నిట్లు॥

తే. ఏ మహావీరు డే మహాభీమబలుడు । సైన్య మిద్దాన గల డహో జలధిదాట?
నాథు సుగ్రీవు నా యరిందముని నెవడు । సత్యసంధునిగా జేయజాలు చెపుడ॥

తే. ఓజ నేవీరు డీ నూరుయోజనములు । దాటి పోగల డింక మీ కోటికపుల?
ఎవ్వ డీ యూథములను సుగ్రీవవిభుని । ఆ మహాభీతినుండి కాపాడగలడు? 18

తే. ఇంక యెవని ప్రభావాన నెల్లరమును । ఆలుబిడ్డల నిండ్ల కండ్లార జూడ
నోచుకోగలవార మిం దుండి వెడలి । జగతి సిద్ధార్థులమునై చు సౌఖ్యముగను?

తే. ఇంక, యెవని ప్రసాదాన నెల్లరమును । సంతసంబున రామలక్ష్మణుల ఘనుల
ప్రభుని సుగ్రీవు నా మహాబలుని జేరి । బ్రతుకగలవార మా సీత వార్త జెప్పి?

తే. ఇచటగూడిన మీలోన నెవ్వడైన । జలధి దాట సమర్థుండు గలడయేని। 21
అతడు మా కింక వేగ పుణ్యంబునైన। అభయదక్షిణ నిమ్మత ముం దసునువైచి॥

తే. అంగదునిమాట లాలించి హరులలోన । పలుక డొక్కండు నేమియు పలుకు సుంత
సర్వవానరసైన్య మా యుర్వినపుడు । స్తిమితముగనుండె చిత్తర్వు తెరగుగాగ॥

తే. మరల నంగదు డప్పు డా హరుల జూచి । పలికె; "మీరెల్ల శ్రేష్ఠులు బలయుతులును
దృఢపరాక్రము లింక కులీను లీరు । సతము పూజ్యులు; మీ కేరి సాటివారు?॥

తే. ఎదురు లే దెప్డు సుంత మీ కెందుగాని । మీదు గమనంబు నడ్డెడి దేది లేదు
చెప్పు డెంతెంత దూరమ మీ యుప్పరంబు। నురుకగలవారొ మీలోన నొక్కొకరె॥ 24

**64వ సర్గ సమాప్తిః-(2,342)**



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

అరువది అయిదవ సర్గ :—(65)

కపులు వారివారి ప్లవన సామర్థ్యమును జెప్పుట - నూరు యోజనములు దూకి మరలిరాగల వాడెవ్వడును కనిపింపకపోవుట - అంతట జాంబవంతుడు హనుమంతుని పేర్కొనుట.

తే. అంత నా యంగదునిమాట నాలకించి । వానరోత్తము లెల్ల రా ప్రభునితోడ
తమకు తమకున్న యట్టి యుత్సాహమునకు। తగినయట్టుల పల్కి- రత్తరిని క్రమత।

సీ. దశయోజనంబులు దాటుదునని గజుం;
డిర్వదియోజనా లెగురుదంచు
పలికె గవాక్షుండు; చెలగుదుముప్పది
యోజనాలని గవయుండుననియె ;
శరభుండు చెప్పె యోజనముల నలుబది
దూకుదునంచును దోర్బలమున
ఏబదియోజనా లిదెదూకుదంచును
గంధమాదను డనె ఘనభుజుండు;
అరువదియోజనా లట్టె దూకుదునంచు
పలికె మైందుండు తత్ ప్రభునితోడ
ఉరుకుదు డెబ్బది యోజనాలంచును
ద్వివిదుండు పల్కె- నుత్తేజ గతిని

తే. ఎగురు దెనుబది యోజనా లిట్టె యనుచు। మరి,సుషేణుండుపల్కె-నత్తరిని లేచి
వృద్ధతము డెల్లవారి కా వీర్యయుతుడు। జాంబవంతుండు నిటుబల్కె- చల్లగాను।

తే. మునుపు నాయందునుండె సు మ్మొక రవంత। గతిపరాక్రమ మో మిత్రగణములార!
చెల్లిపోయెను వయ సిప్డు; సేతునేమి? । ముసలివాడనునైతి నా పస యికేది?॥ 11

తే. అయిన నిపుడిట్టి పనివచ్చి నప్పుడెట్లు । కార్యము నుపేక్ష సేయనౌ కంటగనుచు
ఇదియు కపిరాజు చేపట్టినదియు నగుట । మరి, విశేషించి రామకార్యంబు నగుట॥

తే. వయసు చెల్లిన యట్టి యిప్పట్టునందు । దూకగల నెంతో యిదె చెప్పెదను వినుండు
యోజనంబుల తొంబది యురుకగలను । సంశయము లేదు దీన నో సాధులార॥

తే. వినుడు గమనపరాక్రమం బింతె కాదు । మును మహాబలి యజ్ఞాన మూడడుగుల
విష్ణుడు సనాతనుం డట్లు పెరిగినపుడు । అతనికి ప్రదక్షిణము జేసితయ్య నేను॥

తే. అట్టి నేనిప్డు వృద్ధుండ నౌట కతన । ప్లవనమందున మందవిక్రముడనైతి
పడుచుతనమున నున్న యప్పట్టు నందు। బలము నాయది పరుల కప్రతిమ మండ్రు॥

తే. ఈ యవసరాన శక్తి నా కింతవరకె । మిగిలె నే నేమి సేతని వగతు నయ్యో
ఇంతమాత్రాన కాదుగా యిపుడు మనము। చిత్తమున గోరు కార్యసంసిద్ధి యిచట॥

తే. ఇక సుదారార్థ ముత్తరం బిటులబల్కె। అంగదుండు మహాకపి యనుపముండు
జాంబవంతు మహాప్రాజ్ఞు స్థవిరు వీరు। ననుమతిన్ గొంచు నా మహాఘనభుజుండు॥

తే. నేను శతయోజనంబుల నింగిత్రోవ । నెగిరిపోగల గాని కపీంద్రులార!
పిదప యిచటికి మరలిరా విదితముగను । చేవ నాకున్నదో లేదో చెప్పజాల॥ 19

తే. ఆ హరిశ్రేష్ఠు నంగదు నంతజూచి। వాక్యకోవిదు డా జాంబవంతు డపుడు
పలికె హర్యృక్షసత్తమా! తెలియు నాకు । ఘనతరంబది నీదగు గమనశక్తి॥ 20

తే. వినుము శతయోజనంబులే యనగనేమి, । వలసిన సహస్రశతసంఖ్యములను నైన
దాటగలవీవు; మరియును నోటలేక । తిరిగి రాగలవీవు; సందేహ మేమి? 21

తే. ప్రేషయితవీవు; ప్రేష్యుడ వెపుడు కావు; । ప్లవగసత్తమ! తాత యో ప్రభుకుమార!
ఈ జనములెల్ల నీకు స్వామీ! జితారి! । ప్రేష్యులగుదురు; చనదు నీ వేగుటెపుడు॥ 22

తే. స్వామిభావాన మాకు నిచ్చటనునుంట । దేవ! మాకు శశత్రింబ వీవు సుమ్మ!

ప్రభుడు సైన్యంబునకు * కళత్రంబ టందురి। కాన, ♦ నీవు కళత్రంబు కరణిమాకు
సతము రక్ష్యుడ వౌదువు; శాస్త్రమిదియ॥

తే. అంతియేకాదు, కార్య మీ యంతటికిని। నీవు మూలంబ నౌదువు నిశ్చయంబు
అర్థమూలంబు సంరక్ష్యమగును సతము। కార్యవిదులకు నిదియ నిక్కంబు నీతి;
మూలముండినచే కదా పూలుపండ్లు।మున్నగున పెన్కొ సిద్ధించు భూరుహములు॥

తే. కాన, యీకార్యసాధనలోన నీవె। సత్యవిక్రమ! గతివి నిశ్చయము సుమ్మి
బుద్ధివిక్రమసంపదల్ బొదలియుంట। హేతు వీ వౌదు వీ పని నింక దీర్ప॥ 26

తే. గురువు, గురుపుత్రుడవు నీవె వరద! మాకు। ఇంక ని న్నాశ్రయించియే నృపకుమార
అర్థసాధనలోన మే మందరమును। మరి సమర్థులమౌదుము హరిగణేశ!॥ 27

తే. ఇటులబల్క మహాప్రాజ్ఞు ఋక్షవర్యు। జాంబవంతుని వీక్షించి సత్వరంబ
అంగదుడు వాలిసూను డా హరివరుండు।పలికె ప్రత్యుత్తరం బిట్లు పటుతరంబు॥

తే. నేనుపోకను, యితరులింకెవరు పోకి। ఊరకుండిన కార్య మే యోజనడచు?
మరల ప్రాయోపవేశంబె మనలకెల్ల। గతియగునుగాదె దేవ! నిక్కంబు జెపుమ।

తే. హరిపతి సుధీయుతుండు త త్ప్రభువరుండు। చెప్పిపంపిన కార్యంబు చేయకుండ
మనము కిష్కింధ కెట్టులో చనినగాని। ప్రాణ రక్షణ కేది, హా మనకుదారి?॥

తే. మెచ్చుకొన్నను మెచ్చును హెచ్చుగాను। కోపగించిన కోపించు ఘోరముగను
ఆ విభుం డట్టివాడౌట అతని పనిని। సేయ కేగిన మరణంబె స్థిరము మనకు॥ 31

తే. కాన, యీకార్యమునకు నిక్కంబుగాను। అన్యథాగతిలేదు మహానుభావ!
నీవు దృష్టార్థుడవు బుద్ధివృద్ధుడవును। కాన, యోచింపు తాత! మార్గం బి కేదొ?॥

తే. అంగదుం డిట్లు చెప్పంగ నాలకించి। ఘనుడు వీరుండు తత్ ప్లవగర్షభుండు
జాంబవంతుండు వచియించె చల్లగాను।మరల ప్రత్యుత్తరం బిట్లు మూర్గమొకటి॥

తే. వీర, యీకార్య మింకను వీసమైన। చెడదు చెప్పెద వినుమిప్డె చిన్నవాడ!
ఎవ్వడీ కార్య మింతయు నొవ్వకుండ। సేయునో వాని పేర్కొని సేయ బనుతు॥

ద్వి. అంత ప్రతీతు నా ప్లవతాంవరిష్టు। ఏకాంతముగ నొక్క యిరవున జేరి
సుఖముగా గూర్చున్న శూరాగ్రగణ్యు। హరివీరు చెంత కా హరివీరు డేగి
పరగ నా హనుమ నా జాంబవంతుండు। సంచోదనమొనర్చె సంస్తుతి నిట్లు॥ 35

* కళత్రము = రక్షింపబడదగినది.

♦ ప్రభుడు సైన్యంబునకు కళత్రంబయగుట। రక్ష్యుడవునీవుమాకు కళత్రమటులు॥

65 వ సర్గ సమాప్తి (2,477)

శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### -: అరువది ఆరవ సర్గ :- (౩౮)

హనుమంతుని జన్మమహాత్మ్యమును, ఆతని బలపరాక్రమముల

జాంబవంతుడు పొగడి "దూకు సముద్రము"ని హెచ్చరించగ,

హనుమంతుని ఒడలు పొంగిపోవుట:-

తే. అట ననేకాధిక శతసాహస్రసంఖ్య । హ్యాది విషణ్ణుల హరివాహినీ చయముల
జూచి యా జాంబవంతుండు శూరవర్యు । భవ్యు హనుమంతు జేరి తా బలికె
నిటుల॥ 1

తే. శూర! వానరలోకాధివీర, ధీర!। సర్వశాస్త్రవిదాంవరా! సాహసాంక !
హనుమ! యేల తూష్ణీభావమును వహించి । పలుకకుంటివి యేకాంత మాశ్ర
యించి॥ 2

తే. ధ్రువము, హరిరాజు సుగ్రీవుతోడ నీవు। సముడవు బలాన తేజాన విమలమతివి
రామలక్ష్మణులకును నో ప్లవగవరుడ । సాటివత్తువు నీవు పో మేటిధాటి॥ 3

తే. విను మరిష్టనేమికి పుత్రు డనుపముండు। వైనతేయుండు మరి, మహాబలయుతుండు
అల గరుత్మంతు డనగ విఖ్యాతుడౌను । ఉత్తముడు సర్వపక్షుల నూర్జితుండు॥ 4

తే. ఆ మహాబలు డా మహాయశుడు పక్షి । ఆ మహావేగు డబ్ధి సాగరమునుండి
ఉరగములనెత్తికొనిపోవుచుండ నేను। చూచియుంటిని పలుసార్లు చోద్యముగను॥

తే. పక్షముల నాతనికి నెట్టి బలముకలదో। అట్టి బలమున్నదయ్యా నీ బాహువులను
విక్రమంబున వేగాన వీరవర్య!॥ తీసిపో వాతనికి నీవు తెల్ల మింత॥ 6

తే. బలము బుద్ధియు తేజంబు బహుళసత్త్వ । మిక విశిష్టంబు భూతాళి నెల్ల నీకు
ఏల హరిసత్తమా ! యింత యెరుగవయ్య । నిన్ను నీవే మహాత్మ! యో సన్నుతాత్మ॥ 7

తే. అప్సరస, యప్సరలశ్రేష్ఠ యందకత్తె । "పుంజకస్థల" యనగ పేర్మోసి నాపె
రూపమున సాటిలేక ముల్లోకములను । కామరూపిణి యగుచు నా భామ వెలసి॥

తే. ఉగ్రశాపాన వానరయోని యందు। "కుంజరుండను" కపికి దా కూతురగుచు
"అంజన" యనంగ బుట్టి యా యందకత్తె । "కేసరి" కి పత్నియై యొప్పె కీశపతికి॥ 9

తే. వినుం, కపిత్వానబుట్టియు వనిత యాపె । కామరూపిణియౌట యా కలికిమిన్న
చారుసర్వాంగి యొక్క నా డౌరతాను । మనుజకామినిరూపంబు మరి, ధరించి॥

తే. రూపయౌవనశాలియై యేపుమీరి । చిత్రమాల్యాలదాల్చి, విచిత్రమైన
పట్టు చీరెధరించి పర్వతముకొనను। మురిసి చరియించె ప్రావృడంబుద మనంగ॥

తే. అటుల చరియించు నా విశాలాక్షి దైన। ఎదుపుటంచుల పొగసు బంగరుపసిండి
పట్టుచీరె చెరంగు తద్వాయువశత । తొలగె నెల్లన;- నట్టుల తొలగుటయును॥

తే. వృత్తములు, సంహతంబు లా యింతితొడలు । పీనములు, సంహతంబు లా చాన చనులు
ఆననంబు సుజాతంబు నందమార । కాంచె నా వాయుదేవుండు కన్నులలర॥

తే. ఆ విశాలాయతశ్రోణి నా వెలదిని । వినుత తనుమధ్య నా యశస్విని పతిని
చారుమంగళసర్వాంగి వరసినంత । కామమోహితుడయ్యె ప్రకంపనుండు॥ 14

తే. బాహువుల దీర్ఘముల జాచి పవను డపుడ । ఆ యనిందిత నట తద్గతాత్ముడెగసి
శౌర ! వాటేసుకొనియె నచూంతముగను । మన్మధావిష్టసర్వాంగు డున్మదించి॥

తే. ఆ సువృత్తయు సంభ్రాంత యాగుచు నపుడు। ఎవడురా నాదు నేకపత్నీవ్రతంబు
చెరుప నిట్టుల మదిని నెంచెను నటంచు । పలికె నా లోలలోచన బయులునరసి॥

తే. అంజన వచించినట్టి వాక్యంబు వినుచు।మారుతుం డిట్లు పలికె"నో చారువదన
హింససేయుదలంప నిన్ హంసగమన! । సుభగ ! సుశ్రోణి ! భయపడ కభయ మిదియె॥ 17

తే. కృతి యశస్విని నిన్ను పరిష్వజించి । మానసువన జొచ్చితిని నినుప వరానవతిరో
వీర్యవంతుండు పుత్రుండు వెలది యింక । బుద్ధిసంపన్ను డొకండు పుట్టునీకు॥

తే. కృతి, మహా సత్త్వుడును, మహా తేజు డగును। మఱి, మహాబల పౌరుష సరణినొప్పు
ప్లవనమున లంఘనంబున లలన వినుము । మ త్సముండగు నాతండు; మరుగ
వలదు॥" 19

తే. అత డిట్లన నింక మహాకపీంద్ర। వినుము నీజనయిత్రి తా హృదిని నలరి
ఓ మహాబాహూ! ని న్నప్పు డొక్క గుహను! కనియె ప్లవగర్ష భా। మహాఘనభు
జుండ॥ 20

తే.అట, మహావనమందున నర్కు డపుడ। పొడుచుటను గాంచి ఫలమని మోదమంది
దాని దిన నీవు దివి కమాంతముగ నొర। ఎగసిపోతివి తీవ్రింపు టేపుతోడ॥ 21

తే. యోజనశతంబు లటు మూడు నోజ నెగసి । ఓ మహాకపి పోవుచునుంటి వీవు
సూర్య తేజంబు నీకెంత సోకియున్న । అలసటను జెంద వీ విసుమంత యైన॥ 22

తే. అంతరిక్షాన నీ వట్టు లంతవరకు । వచ్చుటను జూచి మిగుల కోపంబుబూని
బుద్ధి శంకించి యింకేమి మునుగునో యని। వజ్రి వజ్రంబువైచె నీపయిన,తాత॥

తే. అప్పుడు పడుటను నీవు శైలాగ్రమందు । విరిగె నీ వామహాను వది వీరవర్య
దాన నీ నామధేయంబు ధరణిలోన। వెలసె హానుమంతు డనగ వెం పలరుకీర్తి॥

తే. నిహతు ని న్నట్లు గాంచుట నీదుతండ్రి। వాయుదేవుండు ప్రభుడు ప్రభంజనుండు
గంధవహుండు స్వయంబు నాగ్రహము జెంది। వీవకుండెను ముల్లోక వితతి నెచట॥

తే. చూడ ముల్లోకములు నట్లు క్షుభితమగుడు । అఖిలసురలును సంభ్రాంతు లగుచు
మదుల
అల్ల భువనేశ్వరులు.వార లెల్లకూడి । మారుతుని శాంతుజేసిరి మమత వేడి।

తే. పవను డట్టుల మది శాంతి బడిన పిదప । బ్రహ్మ నీ కచ్చె వర మొండు.
వత్సలతను.
సత్యవిక్రమ! నీ వింక సమరములను । అస్త్రతతి జావకుండంగ నమిత తేజ॥

తే. వజ్రిహతినైననీవు నొవ్వమిని జూచి । ఆ సహస్రాక్షు డిచ్చె ప్రీతాత్ముడగుచు
వర మనుత్తమ మొకటి యో వాయుపుత్ర। నీకు స్వచ్ఛందమరణంబు లోక
విభుడు॥ 28-29

తే. కేసరికి క్షేత్రజుండవు కీశవర్య । ఔరసుండవు నీ వల్ల మారుతునకు
తేజమున తత్సముండవు దివ్య తేజ । భీమవిక్రముడవునీవు పేరుగలవు॥ 30

తే. వత్స! వాయుసుతుండ వీ వయ్య! యనఘ। ప్లవనమున తత్సముండవు బలయుతుడవు
ఇక, గతప్రాణులము మేము; కృతివి నీవె। రక్ష కావలెమాకు విపక్షదూర!
దాక్ష్య విక్రమసంపన్న! దయనొనర్పు। పక్షిరాజసముండవు పావమాని॥

తే. విష్ణుదేవు త్రివిక్రమ వేళయందు,। ఈ సశైలమహావనం బీ ధరిత్రి
ఒక్కపెట్టున నిరువది యొక్కమార్లు। చుట్టివచ్చితినయ్య యో శూరవర్య॥ 32

తే. దేవతలకోర్కె నపు డోషధీచయంబు। గూర్చితిమి; వాని జలధి జిల్కుటనజేసి
పుట్టె నమృతంబు నాడట్లు భూరి తేజ। మరి, మహద్బలమటులుండెమాకు నపుడు॥

తే. ఇప్పుడో నేను వృద్ధుండ హీనబలుడ। నీవె యిప్పట్టునందు సందేహమేమి
సర్వశక్తియుతుండవు సాహసాంక!। కాన నీవు విజృంభింపు ఘనభుజుండ॥
ప్లవగులం దుత్తముడవు విక్రాంతుడవును॥ 34-35

తే. స్వామి! వానరవాహినీచయ మి దెల్ల। అరయ గోరును త్వద్వీర్య మంచితాత్మ
లెమ్ము వానరశార్దూలలెమ్ము వేగ!। దూకు మింక మహార్ణవం బో కృపాళు॥

తే. నీకుగలశక్తి యింక యే లోకములను। మరియు, నే భూతములకు లే దురుబలాఢ్య
ఇటు విషణ్ణుల మము నుపేక్షింతువేల?। విక్రమింపు త్రివిక్రము విధముగాగ॥ 37

ద్వి. అటుజాంబవంతుడు పటు వచస్సరణి। తన్నుప్రచోదింప సన్నుతోక్తులను
వాతాత్మజుండు, ప్రీతవేగుండు। కపి, మహావీరుండు, కదలి ధీరుండు
హరివాహినులకెల్ల హర్షంబు సెలగ। తన దేహమును బెంచె ననుపమంబుగను॥

-: 66 వ. సర్గ సమాప్తి :- (2,415)



శ్రీ

# తెలుగు వాల్మీకము

## మానికొండ రామాయణము

## కిష్కింధ కాండము

### -: అరువది ఏడవ వర్గ :- (50)

:- సముద్రమును దూకుటకై హనుమ మహోత్సాహమూనుట :-

**తే.** ఉదధి శతయోజనంబుల నురుకబూని। అటు విజృంభించుచున్న యా పటు బలాఢ్యు
వీర్యమున పొంగి పొరలుచు పెరుగువాని। వానరోత్తము హనుమంతు ప్లవగు లరసి॥ 1

**తే.** తత్క్షణంబున శోకంబు తాము వీడి। పరమహర్షాన గూడి యా ప్లవగు లెల్ల
సింహనాదాల జేయుచు చెలగి మిగుల। ప్రస్తుతించిరి హనుమ నా బాహు బలుని॥ 2

**తే.** విస్మితులును, ప్రహృష్టులై సస్మితులయి। కనుల వీక్షింపుచుండి రా కపిగణంబు
ఉరుత్రివిక్రమగతికిని నుత్సహించు। నాటి నారాయణు ప్రజాగణంబు లట్లు॥

**తే.** అటుల సంస్తూయమానుడై హరివరుండు। పెరిగెను మహాబలుండు దా పేర్చి చదల
హర్షవశతను లాంగూల మట్టియెత్తి। లీల నాడించుచు బలంబు వృద్ధి గొనుచు॥

**తే.** సర్వవానరవరులచే నుర్వి నటుల। బహుళసంస్తూనమానుడౌ ప్లవగపతికి
తేజమున నిండుచున్న యా దివ్యకపికి। రూప మొప్పె ననుత్తమం బేపుమీర॥

**తే.** ఎటు విజృంభించు సింహ మా మృగవిభుండు। శైలగహ్వరమందు నా లీలగాను
మారుతున కౌరసుడు హనుమంతు డటులె। భువి విజృంభించె, నప్పు డద్భుతముగాగ॥

**తే.** అటు విజృంభించు ధీయుతు పటుబలాఢ్యు। మారుతాత్మజు నా హనుమంతు ముఖము

*అంబరీషంబు సందీప్త మనగ వెలిగె। మరి, విభూమంబు పావకం బనగనొప్పె॥

తే. హరివరులమధ్యనుండి తా నట్టె లేచి। సంప్రహృష్టతనూరుహసకలదేహు
డగుచు హరివృద్ధులకు నెల్ల నచట మ్రొక్కి। హనుమ యిట్లని వచియించె
నద్భుతముగ॥ 8

తే. అల హుతాశనసఖుడు మహాబలుండు। అనిలు డాకాశగోచరుం డనుపముండు
అప్రమేయుండు లీల శైలాగ్రములను। విరిచి వేయుచునున్నాడు వీర్యయుతుడు॥

తే. అతని కా శీఘ్రవేగున కలఘు మతికి। శీఘ్రగునకు మహాత్మున కుగ్రగతికి
మారుతున కౌరససుతుండ, మరియు వినుడు। ప్లవనమున మత్సముండు లే డెవడు
ధ్రువము॥ 10

తే. ఉత్సహింతును నంబరం బొరయునట్లు। మిగుల విస్తీర్ణమైయొప్పు మేరుగిరిని
కాలునిలుపక యెచట సలీలముగను। వేయిసార్లు ప్రదక్షిణం బేను సలుప॥ 11

తే. సాగరంబును బాహుల వేగమునను। స్రాగద్రోసి జలంబుల జల్లివైచి
లోకము సపర్వతహ్రదద్రుమనదంబు। సకలమును ముంచివైవంగ జాలు దేను॥

తే, ఇదె మదీయోరుజంఘవేగైకధాటి। కలగుచు, సముచ్ఛ్రితాయతగ్రాహమగుచు
భూరివరుణాలయంబు సముద్రమెల్ల। నింగి కెగురంగగలదు బో పొంగి పొరలి॥

తే. పక్షిసేవిత మాకాశపథమునందు। ఘనత నెగరెడి పన్నగాశనుని చుట్టు
వేయి పర్యాయములు వైనతేయుచుట్టు। తిరిగి రా గల నేను; సందియమువలదు॥

తే. ఉదయమందునలేచి మహోగ్రగతిని। మండు చేగెడి యా రశ్మిమాలితోడ
కదలి యా రవి యింక గ్రుంకకయ మున్న। చుట్టిరాగల నాకాశ మిట్టెయెదురు॥

తే. పిదప భూమిని తాకక పేర్చిమరల। రవికి నెదురేగగలను నా దివికి నెగసి
ఘోరవేగాన నాకాశ గోచరముల। సకలముల మించిపోగల సుకరముగను॥ 16

తే. వార్ధులెల్లను సంక్షోభ బరచివైతు;। మేదిని విదారణమొనర్తు మేటిధాటి
పర్వతంబుల చూర్ణంబు మరి యొనర్తు। ఎగిరి నే నిదె కనుడు కపీంద్రులార॥

తే. ఊరువేగాన హరియింతు నుదధి నెల్ల। ఎగురు నాధాటి లతలును వృక్షములును
పుష్పములువచ్చు నావెంట మొగిలుదారి;। అంత నాపథ మంబరంబందు జూడ
స్వాతిఋక్షపథంబునా వరలగలదు॥

---

* అంబరీషము = వేపుడు మూకుడు.

తే. నింగికెగిరెడు నప్పుడును, పొంగి చదల । ఘోరగతిని చరించుచు కేగునపుడు
అద్దరిని నింక వ్రాలెడు నపుడు నన్ను। సర్వభూతంబు లరయు నాశ్చర్యముగను॥

తే. మరి, మహామేఘసమముగా పెరిగి యెగిరి। దివముగప్పుచు, నంబరం బవని యెల్ల
మ్రింగుమాడ్కిని నే బోవు రీతి నింక । మీర లరయంగగలవారు వీరకపులు॥

తే. చీల్చివైతును జీమూత బృందమెల్ల; । ఊపివైతును గిరులెల్ల నుగ్రముగను;
కలచివైతును నింక సాగరములెల్ల । ఇదె సమాహితమతిని నే నెసకమెసగి॥ 22

తే. కలదు నాశక్తి గాలికి గరుడునకును । వీర లిరువురు దక్కంగ పృథివిలోన
మరియు, నేభూతములును న న్నురుజవమున । వెంటనంటుచు రాగలవెవియు
లేవు॥ 23-24

తే. ప్రభ నిమేషాంతరమ్ముమాత్రమ్ములోన । అంబరంబు నిరాలంబనంబు నందు
మేఘమునుండి వెడలెడి మెరుపుమాడ్కి। ఎగిరిపోదు తళుక్కున మొగిలుదారి॥

తే. సాగరోపరి నే నింక సాగునపుడు । వెలయు నాదగు రూపంబు వింత గనుడు
విష్ణు డల్ల త్రివిక్రమ వేళ యందు । విక్రమించెడు రూపంబు విధము బోలి॥ 26

తే. బుద్ధితో చూచుచున్నాను సిద్ధమింత । మనసు చేష్టయు నట్టులే యనుచు నుండె
నేను జూచెద వైదేహి నింత నిజము! ఇక, ప్రమోదాన నుండుడీ యెల్లకపులు॥

తే. మారుతసముండ వేగాన మరియు వినుడు । గరుడసముడను జవమున
నురుబలమున
అయుతముల యోజనంబులనైన గాని । దాటిపోగలనని నాకు ధాటితోచు॥ 28

తే. వజ్రిని సవజ్రినైన స్వయంభువుండు । బ్రహ్మనైనను విక్రమం బల్లనెరపి
గెలిచి వారలవైన చేతులను నుండి । అమృతమైనను తేగలనండి యిటకు॥ 29

తే. "పెర్చి యిక లంకనైనను పెల్లగించి। తేగల నటంచు తోచు నా హృదికి"నంచు
ఘనత గర్జించు హనుమంతు కనుల గనుచు । విస్మితులు హృష్టులైరి యా
వీరకపులు॥ 30

తే. జ్ఞాతులకునెల్ల శోకనాశం బొనర్చు । అతని యా మాటలెల్ల దా నాలకించి
ఎడద నప్పుడు సంపరి హృష్టుడగుచు । పలికె నా జాంబవంతుండు ప్రతిభ నిట్లు॥

తే. కేసరిపుత్ర హనుమంత కీర్తివంత! । మారుతాత్మజ! వీర! కుమార! ధీర!
జ్ఞాతులకునైన విపుల శోకం బి దెల్ల । తాత! నాశనమయ్యె నీ చేత, వత్స॥ 32

తే. కోరి కల్యాణ మింక నీకును కుమార । వీరె కపిముఖ్యులెల్లరు చేరి యిచట
కార్యసిద్ధ్యర్థ మెల్ల మంగళములెలమి। సల్పుచుండంగగలరు భో; స్వస్తి నీకు॥ 33

తే. ఋషులదైనప్రసాదాన నిద్ధతేజ! । మరియు, కపివృద్ధుల మతాన నురుబలాఢ్య!
గురులదైన ప్రసాదాన హరివరుండ! । హనుమ! దాటుమ యింక మహార్ణవంబు॥

తే. ఉందుమిట నేకపాదాన నో మహాత్మ । తిరిగి నీ విట కేతెంచు వరకు, తాత
త్వద్గతంబులు మా జీవితంబులెల్ల। కనుమ, యింకను యీ వనౌకసుల వెల్ల॥ 35

తే. అంత నా హరిశార్దూలు డనియె, "తాత।ఎగురు నాయేపు నోర్వ లే దీ ధరిత్రి;
తత్పృథగంబిది ఘనశిలాసంకటంబు । స్థిరము లివ్వి మహేంద్రాద్రి శిఖరతతులు॥

తే. ఈ మహేంద్రాద్రి శిఖరాల కెగసి యింక । వితత నానాద్రుమవికీర్ణ
శృంగతతుల
ధాతు నిష్యంద సంశోభితంబులందు । సేతు వేగంబు దాట నీ యాతతాబ్ధి॥ 38

తే. నూరుయోజనముల నిట నుండి దూకు। నాదు పాదాల తొక్కు డీ నగవరంపు
శృంగతతు లోర్వగలవు ప్లవంగులార । కాన, నెక్కెద శైలశృంగముల వీని॥

తే. మారుతప్రఖ్యు డనిల కుమారుడపుడు । హనుమ యరిమర్దనుండు తత్
హరివరుండు
కృతి, మహేంద్రంబు త న్నగశ్రేష్ఠ మలరి । వేగ నారోహణమొనర్చె
భీమబలుడు॥ 40

ద్వి॰ బహుమృగసేవిత వరశాద్వలముల । నిత్యపుష్పఫలద్రు నికరసంతతుల
వృతము నానావిధవృక్షాళితోడ । సతము సంబాధంబు సత్వాళితోడ
వర లతా కుసుమసంబాధమైయుండి । శార్దూల సింహ సంచరితమైయుండి॥
విపులమత్తేభ సేవితమునైయుండి । మత్తద్విజోద్ఘుష్టమయ్యును నుండి
శైలనిర్ఝరముల జాలగ నింపి । ఉచ్ఛ్రితశృంగాల నురుతరంబులను
నొప్పు మహేంద్రాద్రి నప్పు డా బలుడు । ఎక్కి తా విహరించె నిక్కుచు
హనుమ
ఘనుడు మహేంద్రవిక్రముడు శ్రేష్ఠుండు।దూకంగ దలచి యా దొడ్డదా కడలి॥

తే. ఆ మహాత్మునిచేత నా హనుమచేత । ఆ మహాశైల మట్లు త్రొక్కంగ బడుట
వెలిగె సింహాభిహతమహామత్తగజము।భంగిగ మహేంద్ర మత్తరి వసుధనచట॥

తే. విప్రకీర్ణ శిలోచ్చయ వితతియగుచు । విడిచె నా గిరి బహు*జలోత్పీడనముల;
పారె మృగములు నేగ్గులు బహుభయాన।ఊగెను మహాద్రుమంబులు వేగగతిని॥

తే. పానసంసర్గకర్కశుల్ భయము గదిరి।నాగగంధర్వమిధునముల్ నగము విడిచి
మరి, మహాసానువులవీడి పరచి రటులె;।వెరచి విద్యాధరగణంబు లురికి రెటకొ॥

తే. ఎగిరిపోయెను విహగంబు లిట్టె బెదరి।ఉరగములు దూరె పరచుచు బొరియలందు
భూరిశృంగశిలోద్ఘాతములును చెదరె । ఆ మహీగిరి యెక్కి యా హనుమ
తొక్క॥ 47

తే. నిశ్వసించుచు నా ర్తకై సీల్గి మూల్గి । అర్ధనిస్సృతలైన మహాహితతుల
మహిని త ద్ధరణీధరం బప్పుడొప్పె । చూడ సపతాక మనునట్లు చోద్యముగను॥

తే. త్రాససంభ్రాంతులౌచు నా తాపసులును । తత్ శిలోచ్చయమును వీడి
తరలిపోవ
అడవిలో సార్థహీనుడౌ నధ్వగు డన । పొక్కుచుండెను నప్పు డా భూరి గిరియు॥

ఉ. వేగసమాహితాత్ము డటు వేగముబూని హరిప్రవీరు డా
సాగరముఙ్ దరింప మది శాత్రవహంత తలంచి యప్పుడే
సాగి మహానుభావు డిక స్వాంతముతోనె మనస్వి లంక నా
సాగరమేఖలన్ చౌరవ చయ్యన జొచ్చె సమీరజుం డోగిన్॥ 50

67వ సర్గ సమాప్తి :-(2,465)

కిష్కింధకాండ సర్వము సంపూర్ణము.

ఓం శాంతిః శ్శాంతిః శాంతిః.

RS. 7-8-0
N.B.D.
15-3-68

*

* జలోత్పీడనములు = సెలయేర్లు.